# అశ్రుతర్పణం

## మా అన్నయ్య కాదు – మా పాలిటి కన్నయ్య

## (కీ.శే. టి.వి.కె. సోమయాజులుగారు)



మాతృదేవో భవ!

కీ.శే. తంగిరాల (భళ్ళమూడి) సీతామహాలక్ష్మిగారు

**(1907–1990)**

# అశ్రుతర్పణం

## మా అన్నయ్య కాదు – మా పాలిటి కన్నయ్య!

## కీ.శే. టి.వి.కె. సోమయాజులుగారు

**(కీ.శే. తంగిరాల వేంకట కృష్ణ సోమయాజులుగారు)**

**జననం: 30-12-1930 మరణం: 28-07-2021**

రచన – సంపాదకత్వం – ప్రచురణ

**ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు**

**"శ్రీరస"**

**శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య**

**బెంగుళూరు**

**2022**

**“ASRUTARPANAM” - A Tribute to Late T.V.K. Somayajulu garu by his Younger Brother:** Prof. T.V. Subbarao; Founder President, Sri Krishnadevaraya Rasajna Samakhya, Bengaluru - 560 060.

**First Edition :** 01-03-2022, **మంగళవారం,**
**ప్లవనామ సంవత్సర మహాశివరాత్రి**

**No. of pages:** x + 462 (Including 56 Pages of Phots)

**Copies :** 1000

**Price:** Rs.400/-

ముఖచిత్రం–అట్టవెనుక: కీ.శే. టి.వి.కె. సోమయాజులుగారు (కీ.శే. తంగిరాల వెంకట కృష్ణ సోమయాజులుగారు (1930–2021)



**Published by:** **Prof. T.V. Subba Rao**
Founder President
Srikrishnadevaraya Rasajna Samakhya
No.1708, ‘*Siitaavadhaanam*’
11th Cross, 1st ‘G’ Main
Kengeri Satellite Town
BENGALURU - 560 060
Mobile: 99454 22742

**Copies Can be had:** From all leading Book Shops like Visalaandhra, Navachetana, Navodaya, Emesco Sahiti, Prajasakti, Nava Telangana, and Pallavi Publications.

**Typeset by: Nagasri Graphics**, H.No.1-18, Plot No.17, Brindavana ColonyNear Agnimaremma Temple, Gundlasagaram Village, Gudupalli Mandal, Kuppam-517426; Chittoor District, A.P. Ph.No.08570-517 825; 8500619283

**Printed at: Omkar Offset Printers**
3/3, 1st Main Road
New Tharagupet
Bengaluru - 560 002.
Phone: 080-26708186; 26709026

# అంకితం

1. మా తల్లిదండ్రులు – మా పెద్దక్కయ్య – మా చిన్నక్కయ్య ("చెల్లక్క") – మా అన్నయ్యల దివ్యస్మృతికి... అంజలి ఘటిస్తూ...

2. మా అన్నయ్య కుటుంబానికి...

3. మా బాచితమ్మునకు ... మా బుల్లితమ్మునకు... వారి కుటుంబాలకు...

4. మా చిరంజీవులకు... వారి కుటుంబాలకు...

5. తణుకులోని మా అన్నయ్య ప్రాణమిత్రులకు...వారి కుటుంబాలకు...

6. శ్రీ నన్నయ భట్టారక పీఠానికి... దాని సభ్యులకు...

7. శ్రీ రామకృష్ణ సేవాసమితికి... దాని సభ్యులకు

ఆశీస్సులతో... ఆప్యాయంగా...

**– తంగిరాల వెంకట సుబ్బారావు**

# మా అన్నయ్య కుటుంబం

| | |
|---|---|
| భార్య | : శ్రీమతి తంగిరాల (కోట) భాస్కరలక్ష్మి (వయస్సు 89 సం॥లు) |
| 1. కొడుకు | : శ్రీ తంగిరాల వెంకట సూర్య సుబ్బావధానులు |
| కోడలు | : శ్రీమతి ప్రతిభ |
| మనుమలు | : చి॥ కౌస్తుభ్ –చి॥ అనిరుద్ధ్ |
| మనుమడు | : చి॥ కౌస్తుభ్ – భార్య : చి॥సౌ॥ భవాని |
| మునిమనుమరాలు | : చి॥ అనీక |
| 2. పెద్దకూతురు | : కీ.శే. సీతామహాలక్ష్మి |
| అల్లుడు | : శ్రీ గండికోట బాలసూర్యప్రకాశరావు |
| మనుమలు | : చి॥ విద్యాధర్ – చి॥ వంశీధర్ |
| 2.1 పెద్దమనుమడు | : చి॥ విద్యాధర్ – భార్య : చి॥సౌ॥ మాధవి |
| మునిమనుమలు | : చి॥ విరించి – చి॥ వరేన్ – చి॥ వచేస్ |
| 2.2 చిన్నమనుమడు | : చి॥ వంశీధర్ – భార్య: చి॥సౌ॥ సుషమ |
| మునిమనుమలు | : చి॥ విష్ణు – చి॥ విరూపాక్ష |
| 3. రెండవకూతురు | : శ్రీమతి వాణి |
| అల్లుడు | : శ్రీ ఘండికోట బాలసూర్యప్రకాశరావు |
| మనుమడు | : కీ.శే. విజయాధర్ |
| 4. మూడవ కూతురు | : శ్రీమతి జయదుర్గాభవాని |
| అల్లుడు | : శ్రీ కాళ్ళకూరి వెంకట సత్యనారాయణ జోగిరాజు |
| మనుమరాండ్రు | : చి॥ సౌ॥ భార్గవి – చి॥సౌ॥ గాయత్రి |
| 4.1 పెద్దమనుమరాలు | : చి॥ సౌ॥ భార్గవి–భర్త: శ్రీ నల్లగొండ ఆదిత్య |
| మునిమనుమడు | : చి॥ ఆర్ణవ్ |
| మునిమనుమరాలు | : చి॥ ఇందిర |
| 4.2 చిన్నమనుమరాలు | : చి॥ సౌ॥ గాయత్రి – భర్త : శ్రీమడిపల్లి శశాంక్ |
| మునిమనుమడు | : చి॥ రోహణ్ |

# అశ్రుతర్పణం–మొదటి భాగం
# మా అన్నయ్య కాదు–మా పాలిటి కన్నయ్య
## విషయ సూచిక



**పితృదేవో భవ!**

**కీ.శే. తంగిరాల వెంకట సుబ్బావధానులుగారు**

**(1904–1968)**

# అశ్రుతర్పణం

## మొదటి భాగం

## మా అన్నయ్య కాదు – మా పాలిటి కన్నయ్య!

**1. "జాతస్య హి ధ్రువో మృత్యుః" (భగవద్గీత):–**

"పుట్టినవానికి చావు నిశ్చయం కదా!" అన్నాడు పరమాత్మ గీతలో. మా అన్నయ్యకు మిక్కిలి యిష్టమైనది భగవద్గీత. "పుట్టుట గిట్టుట కొరకే" అనే సత్యం మనకు తెలిసినా మన కుటుంబంలో ఒక వ్యక్తి పుట్టినప్పుడు ఎంతో సంతోషిస్తాము; ఒక వ్యక్తి మరణించినప్పుడు ఎంతో దుఃఖిస్తాము. అకాల మరణమైతే ఎక్కువ దుఃఖిస్తాము. వయసు బాగా మళ్ళిన తరువాత మరణించినా కొంత దుఃఖం తప్పదు. ఇది మానవ సహజం. (చలన చిత్రనటుడు 'గిరిబాబు'గారి తండ్రి నిండు నూరేళ్ళు బ్రతికి చనిపోయారు. గిరిబాబుగారు భోరున ఏడుస్తున్న దృశ్యాలు దూరదర్శినిలో చూచి ఆశ్చర్యపోయాను!) కుటుంబానికి మూలస్తంభాలైన తల్లిదండ్రులు చనిపోతే ఎక్కువ బాధగా ఉంటుంది. మా అన్నయ్య మాకు తల్లిదండ్రులతో సమానమైనవాడు. ఆయన ఆరోగ్యంగా 90 ఏళ్ళు బ్రతికి చనిపోతే మా వదినె, కొడుకు, కూతుళ్ళు ఎంత బాధపడుతున్నారో, వారితో సమానంగా ముగ్గురు తమ్ముళ్ళం మేమూ బాధపడుతున్నాము. ఇంతవరకూ మాకు ఆధారంగా ఒక పట్టుకొమ్మ ఉండేది. దానితో మేము ధైర్యంగా ముందుకు సాగుతూ ఉండేవాళ్ళం. ఇప్పుడు మృత్యువు అనే తుఫానుగాలి వీచి ఆ పట్టుకొమ్మ విరిగిపోయింది! మేము దభాలున పాతాళంలో పడిపోయినట్లుగా భావిస్తున్నాము! విదురుడు ధృతరాష్ట్రుణ్ణి వదిలిపెట్టి పాండవుల దగ్గరకు వెళ్ళిపోతే, ఆ ధృతరాష్ట్రుడు దిక్కుతోచక ఎలా సతమతమయిపోయాడో, అలా ఉంది మా పరిస్థితి ఇప్పుడు. మహాజ్ఞాని విదురుడులాగ మాకు జీవితంలో అడుగడుగునా ఎన్నో నీతులు చెప్పి, మమ్మల్ని సన్మార్గంలో నడిపించిన మహానుభావుడు మా అన్నయ్య. పాండవులకు శ్రీకృష్ణపరమాత్మ ఎలాగో, మాకు మా అన్నయ్య అలాగ!

**2. "సాహిత్యసాగరంలో ఏటిన ముత్యాలు":–**

మా అన్నయ్యగారి రచనలన్నింటిలోను 2006 అక్టోబరు 2వ తేదీ (వ్యయ విజయదశమి) నాడు మేము ముగ్గురు తమ్ముళ్ళం ప్రచురించిన "ఏటిన ముత్యాలు" చాలా గొప్పగ్రంథం. ఇది ఒక అపూర్వ కవితల సంకలనం. ఇందులో ఆణిముత్యాల

వంటి తెలుగు పద్యాలు 252 ఉన్నాయి; 310 ఉత్తమ శ్లోకాలూ ఉన్నాయి. పద్యాలను "చమత్కారం-శృంగారం-హాస్యం-ఏకాంత శృంగారం" అనే నాలుగు రకాలుగా విడదీశాడు. శ్లోకాలను కూడా "నీతి - చమత్కారం-శృంగారం-హాస్యం" - అనే నాలుగు విధాలుగా వర్గీకరించాడు. తన బాల్యంనుండి తనకు 75 సంవత్సరాల వయస్సు వచ్చే వరకూ ఎంతో కష్టపడి ఇటువంటి ప్రాస్తానిక పద్యాలను, సభారంజక శ్లోకాలను సేకరించి, అన్నింటికీ తాత్పర్యాలు వ్రాసిన మహనీయుడు మా అన్నయ్య - శ్రీ టి.వి.కె. సోమయాజులుగారు - పూర్తిపేరు: శ్రీ తంగిరాల వేంకట కృష్ణ సోమయాజులుగారు. (ఈ పేరు మా తంగిరాల వంశంలో మూలపురుషుని పేరు.) వీరు పశ్చిమగోదావరిజిల్లాలోని తణుకులో నివసిస్తూ ఉండేవారు. వయస్సు 90 సంవత్సరాలు నిండి, 91 జరుగుతూండగా 28-07-2021, బుధవారం, సాయంకాలం 5 గంటలకు హైదరాబాద్‌లో స్వర్గస్థులయ్యారు.

మా అన్నయ్య ఉత్తమ సాహిత్యవేత్త, సంఘజీవి, బుద్ధిజీవి, నియమబద్ధజీవి, గాంధీయవాది, ఖద్దరుధారి, నిరంతర వ్యాయామ కర్కశ వజ్రశరీరుడు, భోజన ప్రియుడు, చతుర సంభాషణా నిపుణుడు, ఉభయభాషా ప్రవీణుడు, ఉత్తమకవి, ఉద్దండ పండితుడు, అద్భుత వక్త, విశ్రాంత ఆంధ్రోపన్యాసకుడు, నా మొట్టమొదటి సాహిత్య గురువు, తన పెద్ద తమ్ముడనైన నేను రచించిన 'కాటమరాజుకథలు' అనే గ్రంథానికి కృతిస్వీకర్త, సాహిత్య రసజ్ఞ శేఖరుడు! సమాజాన్ని, దానిలోని వ్యక్తుల స్వభావాల్ని కాచి వడపోసిన మనోవైజ్ఞానికశాస్త్రవేత్త! ఆయనతో మాటలాడటమే ఒక ఎడ్యుకేషన్‌గా ఉంటుంది ప్రతివారికి. తణుకులో శ్రీరామకృష్ణ సేవాసమితి భవనంలో నిత్యమూ రామాయణ, భారత, భాగవతాలను, భగవద్గీతను ప్రవచనంచేస్తూ, నన్నయ భట్టారక పీఠం ఉపాధ్యక్షులుగా సాహిత్య సేవలందిస్తూ, తణుకు పురజనులందరిచేతా పూజింపబడిన పుణ్యశ్లోకుడు మా అన్నయ్య!

### 3. మా వంశవృక్షం చరిత్ర:-

మేం వెలనాటి వైదికులం. మా యింటిపేరు తంగిరాలవారు. మాది శ్రీవత్సగోత్రం. పంచార్షేయం: భార్గవ, చ్యావన, ఆప్నవాన, ఔరవ, జామదగ్న్య ఋషులు. మా స్వగ్రామం పశ్చిమగోదావరిజిల్లాలోని తణుకుతాలూకాలో ఉన్న 'కాకులు ఇల్లిందలపఱ్ఱు'. ఇప్పుడు ఆ గ్రామంలో మా తంగిరాలవారు ఎవ్వరూ లేరు. మా చదువుల నిమిత్తం 1948లోనే మా తల్లిదండ్రులు తణుకు వచ్చి స్థిరపడ్డారు. అప్పటినుండి మా స్వగ్రామం 'తణుకు' అనే చెప్పుకుంటున్నాం.

మా తండ్రిగారు, మా తాతముత్తాతలు అందరూ వేదపండితులే. పశ్చిమ గోదావరిజిల్లాలో మా మూలపురుషుడు మాకు ఏడు తరాలకు ముందున్న తంగిరాల జగన్నాథశాస్త్రిగారు. ఈయన క్రీ.శే. 1700ల ప్రాంతంలో పశ్చిమగోదావరిజిల్లా "రేలంగి" అగ్రహారం సమీపంలో ఉన్న "సోమరాజుల ఇల్లిందలపట్టు" గ్రామంలో ఉండేవారట. మా పూర్వులు గుంటూరుజిల్లాలో వినుకొండ సమీపంలో ఉన్న "తంగిరాల" అనే గ్రామంనుండి పశ్చిమగోదావరిజిల్లాకు వలస వచ్చారు. (పలనాడు – వెలనాడు అనే రెండు ప్రాంతాలు గుంటూరుజిల్లాలో ఉన్నాయి). ఇక్కడి జమిందారులెవరో మా పూర్వులకు "రేలంగి" – "ఇరగవరం" అనే అగ్రహార గ్రామాలలో ఈనాము భూములిచ్చారు. తంగిరాలవారంతా ఈ రెండు గ్రామాలలోను స్థిరపడ్డారు.

(1) మా మూలపురుషుడు **"తంగిరాల జగన్నాథశాస్త్రిగారు"**. వీరికి నలుగురు కొడుకులు: ఆనందరామావధాని – సీతారామశాస్త్రి – యాజులు – **"వేంకట కృష్ణసోమయాజి"**.

(2) పై వారిలో నాల్గవ కొడుకు **వేంకట కృష్ణ సోమయాజిగారికి** నలుగురు కొడుకులు: యజ్ఞన్న – **"పట్టాభిరామావధాని"** – వెంకట్రామసోమయాజి – వెంకట నారాయణశాస్త్రి

(3) పై వారిలో రెండవ కొడుకైన **పట్టాభి రామావధానిగారి** భార్యపేరు **"భద్రకాళి".** ఈ దంపతులకు ఇద్దరు కొడుకులు: జగ్గావధాని (నరసమ్మ)– **"వేంకట కృష్ణ సోమయాజి"** (వీరిని "పరదేశి" అనీ – "పరదేశి అవధాని" అనీ పిలిచేవారు).

(4) ఈ **వెంకట కృష్ణ సోమయాజిగారు** మా తాతగారి తాతగారు. (ఈ పేరే మా తాతగారు మా అన్నయ్యకు పెట్టారు.) ఈయన భార్య పేరు **"రాజమ్మ".** ఈ దంపతులకు ఐదుగురు కొడుకులు: వెంకన్న –హనుమాన్లు – రామస్వామి – శేషావధాని– **"అయ్యవారిశాస్త్రి"**.

(5) పై వారిలో ఐదవ కొడుకైన **అయ్యవారిశాస్త్రిగారి** భార్యపేరు: **"లక్ష్మీసోదెమ్మ"**. **("లక్ష్మీసోదెప").** ఈ దంపతులకు ఇద్దరు కొడుకులు, ఒక కూతురు: **యజ్ఞన్నశాస్త్రి (ఎగ్గెన్నశాస్త్రి) – "జగన్నాథశాస్త్రి" (జగ్గన్నశాస్త్రి); రాజమ్మ.** మొదటి కొడుకు యజ్ఞన్నశాస్త్రిగారి మొదటిభార్య: రామమ్మ, రెండవభార్య: వెంకమ్మ. ఈ వెంకమ్మగారి కుమారుడు: వేంకట రామశర్మ (భార్య: సీతారావమ్మ). వీరికి ఒక కూతురు, ఐదుగురు కొడుకులు. అయ్యవారిశాస్త్రిగారి రెండవకొడుకు **జగన్నాథశాస్త్రిగారు** యజ్ఞము, చైనము చేసి, చివరికి సన్యసించారు. అందువల్ల ఈయన పేరు **"బ్రహ్మీభూత జగన్నాథ మహాగ్నిజిత్ యజ్వేశ్వర"**గా మారింది.

ఈయన భార్యపేరు: **"సోమిదేవమ్మ" (వేంకట సోమపీథిని").** వీరికి ఒక కొడుకు, ముగ్గురు కూతుళ్ళు.

(6) పై దంపతుల ఏకపుత్రుడు. **"వేంకట సుబ్బావధానులు" (మా తండ్రిగారు: క్రీ.శ.1904-1968)**. మా తల్లిగారు **సీతామహాలక్ష్మిగారు (క్రీ.శ. 1907-1990)**. ఈ దంపతులకు మొదట ఇద్దరు కూతుళ్ళు: **కీ.శే. చల్లా పెదవెంకట రామలక్ష్మిగారు (క్రీ.శ. 1924-1998); కీ.శే. బులుసు చినవెంకట రామలక్ష్మిగారు (కీ.శ.1926-1985).** తరువాత నలుగురు కొడుకులు: **వేంకట కృష్ణ సోమయాజులు (జననం: 30-12-1930; మరణం: 28-07-2021) - శ్రీ వెంకట సుబ్బారావు (జననం: 30-03-1935) - శ్రీ భాస్కరరావు: (జననం: 30-05-1937) - శ్రీ కృష్ణమూర్తి: (జననం: 16-12-1939)**

(7) **కీ.శే. వేంకట కృష్ణ సోమయాజులు - శ్రీమతి భాస్కరలక్ష్మిగారలకు** ఒక కొడుకు, ముగ్గురు కూతుళ్ళు. కొడుకు: **శ్రీ వేంకట సూర్య సుబ్బావధానులు**. ఇతని భార్య: **శ్రీమతి ప్రతిభ.** వీరికి ఇద్దరు కొడుకులు: **శ్రీ కౌస్తుభ్ - శ్రీ అనిరుద్ధ్.** సోమయాజులుగారికి ముగ్గురు కూతుళ్ళు: **కీ.శే. సీతామహాలక్ష్మి - శ్రీమతి వాణి - శ్రీమతి జయదుర్గా భవాని.**

(8) **శ్రీ వేంకట సుబ్బారావు - కీ.శే. శకుంతలాదేవి** దంపతులకు ముగ్గురు కొడుకులు, ఇద్దరు కూతుళ్ళు. కొడుకులు: **శ్రీ వేంకట సుబ్బావధానులు ("కాళిదాసు'') - కీ.శే. శ్రీరామమూర్తి ("సీతారామరాజు'')-శ్రీ శ్రీనాథ కవిసార్వభౌమ**. కూతుళ్ళు: **శ్రీమతి సీతామహాలక్ష్మి - శ్రీమతి రేవతీశశిప్రియ. శ్రీ సుబ్బావధానులు - శ్రీమతి నాగలక్ష్మి** దంపతులకు ఒక, కొడుకు, ఒక కూతురు: **డా|| వేంకట శ్రీరామ ఫణి ప్రసన్న తేజస్వి - డా|| శ్రీప్రసన్న ప్రత్యూష.** డా|| తేజస్వి భార్య **డా|| నిరుపమ**. ఈ దంపతులకు ఒక కొడుకు: **చి|| శివాంశశౌరి**. **కీ.శే. సీతారామరాజు** భార్య: **శ్రీమతి విమలకుమారి**. వీరికి ఇద్దరు ఆడపిల్లలు: **శ్రీమతి శిల్ప, శ్రీమతి భావన. శ్రీ శ్రీనాథుడు - శ్రీమతి జయశ్రీ** దంపతులకు ఒక కూతురు, ఒక కొడుకు: **చి|| వెంకట నాగ వైజయంతి, చి|| స్కంద.**

(9) **శ్రీ భాస్కరరావు-కీ.శే. బాలాత్రిపురసుందరి** దంపతులకు ఒక కూతురు, ఒక కొడుకు-**కీ.శే.వెంకట సత్య పద్మజ-కీ.శే. వెంకట సత్య రామలింగేశ్వరరావు.** ఈ రామలింగేశ్వరరావు భార్య: **శ్రీమతి ఉమ**. ఈ దంపతుల దత్తపుత్రుడు: **చి|| భాస్కర సిద్ధిగణేష్. శ్రీ భాస్కరరావుగారి** రెండవ భార్య: **శ్రీమతి శకుంతల.**

(10) **కర్నల్ కృష్ణమూర్తి - శ్రీమతి శంకరి** దంపతులకు ఒక కూతురు, ఒక కొడుకు: **బ్రిగేడియర్ హిమశ్రీ - కర్నల్ శ్రీనివాస మల్లిక్**. ఈ **శ్రీనివాస మల్లిక్** భార్య: **శ్రీమతి రాధారమణి**. ఈ దంపతులకు ఇద్దరు ఆడపిల్లలు: **చి॥ శ్రుతి, చి॥ శ్రేయ.** ఇదీ మా పశ్చిమ గోదావరిజిల్లాశాఖ తంగిరాలవారి వంశవృక్షం చరిత్ర.

**4. జగ్గన్నతాత క్రౌర్యం - మా అమ్మ పడినపాట్లు:-**

అసలు మా పూర్వుల స్వగ్రామం "రేలంగి". మా తాతగారైన జగ్గన్నశాస్త్రిగారు స్వగ్రామమైన 'రేలంగి' నుండి అత్తవారి ఊరైన 'కాకుల ఇల్లిందలపఱ్ఱు'కు ఇల్లరికం వెళ్ళారు. అందువల్ల మా ఊరు మారింది. మా తాతగారికి 30 ఎకరాల మాగాణిపొలం ఉండేది. ఆయనకు మా నాన్నగారు ఒక్కడే కొడుకు; ముగ్గురు కూతుళ్ళు: **కీ.శే. సత్యవతి (పెద్దత్త) - కీ.శే. సుందరమ్మ (బుల్లిఅక్కయ్య) - కీ.శే. సూర్యకాంతం (సూరీదత్త)**. మా నాన్నగారికి **'అబ్బిగాడు' లేక సూర్యనారాయణ** అనే ఒక తమ్ముడు ఉండేవాడు. కాని ఆయన బాల్యంలోనే చనిపోయాడు. అలాగే మా నాన్నగారిలాగే అమాయకురాలైన నాల్గవ చెల్లెలు **"బుల్లి అమ్మాయి"** ("గుడ్డి అమ్మాయి" - నాటు వైద్యంతో ఒక కన్ను గుడ్డి అయింది.) కూడా ఒకామె ఉండేది. ఆమె కూడా బాల్యంలోనే చనిపోయింది. మా తాతగారి ఆస్తి అంతా మా నాన్నగారికి రావలసింది. కానీ మా తాతగారు అమాయకుడైన మా నాన్నగారిని మోసం చేసి, తన ఆస్తినంతా కూతుళ్ళు ముగ్గురికీ ధారాదత్తం చేసివేశాడు. ఎకరం నేలలో ఉన్న రెండు పెద్ద పెద్ద పెంకుటిళ్ళు కూడా మా మేనత్తలకే ఇచ్చివేశాడు. కొడుకునీ కోడల్నీ ఇంట్లోంచి గెంటివేశాడు. దానితో బాల్యంలో మేము ఎంతో దారిద్ర్యాన్ని అనుభవించాల్సి వచ్చింది.

మా అమ్మగారు సీతామహాలక్ష్మిగారు అమాయకుడైన భర్తతో, చంటీ వెంటా సంతానంతో, ఊరికి దూరంగా పొలాల మధ్యన ఉన్న 'గోపాలపురం' అనే కుగ్రామానికి చేరి, అక్కడ మమ్మల్ని పెంచి పెద్దచేయటానికి ఎన్ని అగచాట్లు పడిందో నేను మాటల్లో చెప్పలేను.

1939 నుండి 1948 వరకూ గోపాలపురంలో ఉన్నాం. అది తణుకు - గోటేరు- ఇరగవరం మార్గంలో ఉన్న చిన్న ఊరు. అక్కడ పాతిక కొంపలు కూడా ఉండేవికావు. రెండేరెండు పెంకుటిళ్ళు: ఒకటి మునసబుగారైన పెన్మెత్స గోపాలరాజుగారిది, రెండవది మాది. తక్కినవన్నీ తాటాకు ఇళ్ళు. రాజులు, తూర్పువాళ్ళు ('గవర్లు') ఉండేవారు- అందరూ రోజు కూలీలు, నిరుపేదలు. ఒకసారి గోటేరులో ఉండే రాజుగారు హిమాలయాల్లో ఉండే ఒక యోగిని మా వూరు తీసికొని వచ్చారు. ఆయన ఎన్నో

ఆసనాలు వేసేవాడు; మా ఊరి పంట కాలువలో నీటి మీద తేలిపోతూ వెళ్ళేవాడు. మా అన్నయ్యకు అప్పుడు 9-10 సం.లు ఉంటాయి. ఆ యోగి దగ్గర ఆసనాలు, (యోగవ్యాయామం) నేర్చుకున్నాడు. అదే మాకు నేర్పించాడు.

మా అమ్మగారికి తన తండ్రి భళ్ళమూడి కృష్ణమూర్తిగారు ఆప్యాయంగా (కట్నంగా) ఇచ్చిన మూడెకరాల పొలం అమ్మివేసి మా చదువులకోసం ఖర్చుపెట్టింది. తన బంగారు వడ్డాణాన్ని అమ్మివేసి తణుకులో 610 గజాల ఇంటి స్థలం కొంది. అందులో 1952లో ఒక తాటాకు ఇల్లు వేసికొని కాలక్షేపం చేసేవాళ్ళం. మా నాన్నగారు ఎప్పుడూ వేదం చదువుకుంటూ సంసార విషయాలేమీ పట్టించుకోకుండా, తామరాకు మీది నీటి బొట్టులా ఉండేవారు. అటువంటి సమయంలో మా అమ్మగారికి తోడుగా మా అన్నయ్య చేతికి ఎదిగివచ్చి, మా సంసారాన్ని చక్కదిద్దాడు. తమ్ముళ్ళు ముగ్గురినీ ఉత్తమపథంలో నడిపించాడు. కాఫీలు-టీలు త్రాగడం, సిగరెట్లు కాల్చడం, పేకాట ఆడటం - ఇత్యాది దుర్గుణాలకు బాల్యంలోనే మమ్మల్ని దూరంగా ఉంచాడు. యోగాసనాలు వేయించి, వ్యాయామం నేర్పించి, శరీరాన్ని ఎలా సంరక్షించుకోవాలో తెలియజేశాడు. మేం బాగా చదువుకోవడానికీ, ఉన్నత పదవులు పొందడానికీ, ఆరోగ్యంగా ఉండటానికి మా అన్నయ్యగారి నియమబద్ధ క్రమశిక్షణయే ముఖ్యకారణం.

బాల్యంలో దారిద్ర్యంవల్ల ఇంగ్లీషు చదువులు చదవలేకపోయాడు మా అన్నయ్య. స్వగ్రామంలో 5వ తరగతి ఉన్నత శ్రేణిలో ప్యాసయిన తరువాత మా తాతగారి దగ్గర కొంతకాలం పంచకావ్యాలు చదివాడు. తొమ్మిదేళ్ళ వయస్సులోనే ఉండ్రాజవరం అనే గ్రామంలో ఇంటింటా వారాలు చెప్పుకొని సంస్కృతం చదువుకున్నాడు. తరువాత కాకరపఱ్ఱులో కూడా కొన్నేళ్ళు వారాలు చేసికొని చదువుకున్నాడు. అది 1945వ సంవత్సరం. ప్రముఖ కవి, రచయిత, నాటకకర్త అయిన చిలకమర్తి లక్ష్మీ నరసింహంగారి స్వగ్రామం కాకరపఱ్ఱు. (ఆదికవి నన్నయగారి స్వగ్రామం కూడా ఆ ఊరే అని చెపుతారు.) 1945 ఏప్రిల్ 17వ తేదీన చిలకమర్తిగారు ఆ గ్రామంలో పరమపదించారు. అప్పుడు వారిని ఆ గ్రామంలోని బంధుమిత్రులు మంచి గంధం చెక్కలతో దహనం చేశారని మా అన్నయ్య నాతో చెప్పాడు. తరువాత కొవ్వూరులోని ఆంధ్రగీర్వాణ విద్యాపీఠంలో భాషాప్రవీణ చదివాడు. 1951లో 20 సంవత్సరాల వయస్సులో, భీమవరంలో తెలుగు పండిట్ ఉద్యోగంలో చేరి, మా కుటుంబాన్ని ఆదుకున్నాడు. ముగ్గురు తమ్ముళ్ళకీ ఇంగ్లీషు చదువులు చెప్పించాడు. ఇద్దర్ని ఇంజనీర్లు చేశాడు. ఒకరిని యూనివర్శిటీ ప్రొఫెసర్‌గాచేశాడు. తాను కూడా ప్రవేటుగా S.S.L.C.,

Intermediate, B.A., M.A. పరీక్షలకు కూర్చొని ఉత్తీర్ణుడయ్యాడు. జూనియర్ కళాశాలల్లో ఉపన్యాసకుడయ్యాడు. జూనియర్ కళాశాలల్లో ఉపన్యాసకుడయ్యాడు.

మాకు రావలసిన 30 ఎకరాల మాగాణి భూమిని, ఎకరం నేలలో కట్టిన రెండు పెద్దపెద్ద పెంకుటిళ్ళను స్వార్థపరులైన మా ముగ్గురు మేనత్తలు పుత్రపౌత్ర పర్యంతం హాయిగా అనుభవించారు. “అయ్యో! మన అన్నయ్య అమాయకుడు; పిల్లలు కలవాడు; వాడి ఆస్తిని మనం తినేస్తున్నాం.” అనే భావన వాళ్ళకి కాని, వాళ్ళ పిల్లలకు కాని ఏకోశానా లేదు. మా అన్నయ్య ఒకసారి నాతో ఇలా అన్నాడు: “ఒరే సుబ్బారావ్! మన మేనత్తలు ఎప్పటికైనా పశ్చాత్తాపంతో మన దగ్గరకు వచ్చి ‘ఒరే అబ్బాయ్! ఈ ఆస్తి అంతా మీది. మీ ఆస్తి మీరు తీసుకోండి!’ అని అంటారని ఇన్నేళ్ళుగా ఎదురుచూశానురా! వాళ్ళు రాలేదు. ఎవరి ఆకలి వాళ్ళది. ముష్టివాళ్ళు కన్న పిల్లల్ని కొట్టి, వాళ్ళ విస్తట్లోని అన్నం లాక్కుంటారురా!”

అమాయకుడైన భర్తతో, మామగారు పెట్టే క్రూరహింసలతో, మా అమ్మగారికి ముగ్గురు ఆడపిల్లల తరువాత వరుసగా ఆరుగురూ మగపిల్లలే పుట్టడం ఒక ప్లస్ పాయింట్ అని మా అన్నయ్య తరచుగా నాతో అంటూవుండేవాడు. అందరూ ఆడపిల్లలే అయితే, మరెన్ని యాతనలు పడేదో ఆ భగవంతుడికే ఎరుక! ముగ్గురు ఆడపిల్లల తరువాత పుట్టిన మా అన్నయ్య చేతికి ఎదిగి రాగానే మా అమ్మ ఎంతో ధైర్యంగా ముందుకు అడుగులు వేసింది. (మూడవ కాన్పులో పుట్టిన “సోదులు” అనే అమ్మాయి, ఐదవ కాన్పులో నాకన్నా ముందు పుట్టిన ఒక మగపిల్లాడు, తొమ్మిదవ కాన్పులో పుట్టిన “జగన్నాథం” అనే మగపిల్లాడు చిన్నతనంలోనే చనిపోయారు. చివరికి ఇద్దరు ఆడపిల్లలు, నలుగురు మగపిల్లలు మిగిలాం!)

**5. గురువులు - గురుభక్తి:-**

జటావల్లభుల పురుషోత్తంగారు, కేశిరాజు నృసింహ అప్పారావుగారు, వేదుల రామశాస్త్రిగారు, చిలుకూరి రామమూర్తిశాస్త్రిగారు మొదలైన గొప్పగొప్ప పండిత ప్రకాండులైన గురువుల దగ్గర మా అన్నయ్య సంస్కృతాంధ్రాలు చదువుకున్నాడు. మా అన్నయ్యకు చెప్పలేనంత గురుభక్తి. ఆ గురువులు కూడా మా అన్నయ్యను పుత్రసమానంగా ప్రేమించేవారు. పురుషోత్తంగారినుండి వేళకు భోజనంచేయడం, వేళకు నిద్రపోవడం నేర్చుకున్నాడు. భోజనం అంటే ఏదో ఆవకాయముక్కా అన్నం కాదు; ఐదంకాల నాటకంలాగ పప్పు - కూర - ఒక ఊరగాయ - పులుసు - పెరుగు ఉండాలి. నేయి ధారాశుద్ధిగా పోసుకోవాలి. 30 నిమిషాలపాటు ప్రశాంతంగా,

తృప్తిగా భోజనం చేయాలి. – ఈ విషయాలన్నీ పురుషోత్తంగారినుండి నేర్చుకొని, తన జీవితాంతం అమలుచేసిన, ఆరోగ్య రహస్యం తెలిసిన, గొప్పవ్యక్తి మా అన్నయ్య! అప్పారావుగారినుండి దేశభక్తి, గాంధీయిజం, ఖద్దరు ధారణ, భగవద్గీతా పఠనం, క్రమశిక్షణ నేర్చుకున్నాడు మా అన్నయ్య. (కొవ్వూరు సంస్కృత కళాశాలలో మా అన్నయ్యయొక్క క్రమబద్ధ జీవితాన్ని చూసి సహవిద్యార్థులు ఈయనకు "వినోబా భావే" అని పేరు పెట్టారు.) వేదుల రామశాస్త్రిగారినుండి సాహిత్యాభిరుచి, కవితాసక్తి, రసజ్ఞత, సాహిత్య విమర్శ నేర్చుకున్నాడు. చిలుకూరి రామమూర్తిశాస్త్రిగారి దగ్గర సంస్కృత వ్యాకరణం అభ్యసించాడు. వేదుల రామశాస్త్రిగారిని గురించి మా అన్నయ్య వ్రాసుకున్న ఒక మంచి పద్యం:–

**ఉ॥ కాదన కెట్టి కావ్యమునకైనను నర్థముఁ జెప్పఁ గల్గు, సం**
**వాదమునందు శ్లోకములు పద్యము లెప్పుడుఁ జెప్పు, సంస్కృతాం**
**ధ్రాదరణీయ సారకవితా కలితాద్భుత దివ్యమూర్తి, మా**
**"వేదుల రామశాస్త్రి" బుధవీరుఁడు మద్గురుఁడయ్యె, ధన్యుఁడన్!**

మా అన్నయ్య తాను చేసే సాహిత్యోపన్యాసాల ప్రారంభంలో ఈ గురుస్తుతిని చదివేవాడు. నాకు కూడా ఇలాగ నా ఉపన్యాస ప్రారంభంలో గురుస్తుతి చేయాలనిపించింది. కానీ నేను ఛందోబద్ధమైన పద్యాలు వ్రాయలేక, వచన కవిత్వాన్ని పట్టుకొని వ్రేలాడుతున్న అవిటివాణ్ణి! అందువల్ల నాకిష్టమైన ఇద్దరు గురువుల్ని గురించిన నా అభిప్రాయాలు మా అన్నయ్యకు చెప్పి, ఆయనచేత రెండు అందమైన పద్యాలు వ్రాయించుకున్నాను. అవి:–

1) గురుదేవులు దిగుమర్తి సీతారామస్వామిగారినిగురించి –

**మ॥ తన వాత్సల్య సుధాబ్ధిముంచి, నను ఏతన్మాత్రుగా తీర్చి, అం**
**తన చాలింపక, పింగళాన్వయునిచేతన్ తీర్చిదిద్దించి, దీ**
**వన లందించిన దేశికోత్తముడు, వాక్ ప్రాగల్భ్య దుగ్ధాబ్ధి, వం**
**దనముల్ మా "దిగుమర్తి" వంశ్యునకు "సీతారామశ్రీస్వామి"కిన్!**

2) గురువర్యులు తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారినిగురించి –

**శా॥ చిమ్మొచీకటి చిక్కియున్న నను, ఆశీశ్శారదజ్యోత్స్నలో**
**నిమ్మొచోటుకు జేర్చి, బాధ్యతగ నన్నీ పీఠమెక్కించి, పా**
**ల్గుమ్మల్ పొంగు నదృష్టమిచ్చిన బుధున్ "కోదండ రామా"ఖ్యు,మా**
**"తిమ్మావజ్ఝుల" సద్గురున్ దలతు భక్తిన్ భుక్తిగొన్వేళలన్!**

పై పద్యాలు నేను వ్రాసినవికావు; నా పేరుతో మా అన్నయ్య వ్రాసినవి. వీటిని నా సిద్ధాంతగ్రంథంలో నేను వ్రాసిన పద్యాలుగా "గురుస్తుతి"లో వేసుకున్నాను.

**6. మా అన్నయ్య జ్ఞాపకాలు కొన్ని:-**

**1) భాషాప్రవీణ విద్యార్థిగా ఉండగా:-** చిన్న Note Book పెట్టుకొని అందులో కవితలు వ్రాస్తూ ఉండేవాడు. ఒక కవిత ప్రారంభం నాకు జ్ఞాపకం ఉంది:-

**"నడిపిస్తా నాకలాన్ని-స్థాపిస్తా నవయుగాన్ని!**
**ఉన్నది ఉన్నట్లుగాను-కన్నది కన్నట్లుగాను**
**అతిశయోక్తి ఉత్ప్రేక్షల కసలె చోటులేకుండా**
**నడిపిస్తా నాకలాన్ని! - స్థాపిస్థా నవయుగాన్ని!"**

ఒక కవి వ్రాసిన గేయసంపుటికి పైన కవరు మూసివేసి చదువుతూ ఉండేవాడు. "ఏమిటది?" అని అడిగాను. "ఇది ఆవంత్స సోమసుందర్‌గారి 'వజ్రాయుధం'. దీనిని ప్రభుత్వం నిషేధించింది. అందువల్ల రహస్యంగా చదువుతున్నాను" అన్నాడు.

**2) రైలు టిక్కెట్టుకు ఒక్క అణా తక్కువయింది:-** విద్యార్థిగా ఉండగా ఒకసారి రాజమండ్రిలో మా చిన్నక్కయ్యను చూచి, తిరిగి తణుకు వెడుతున్నాడు. గోదావరి రైల్వేస్టేషన్‌కి వచ్చాడు. టిక్కెట్టు కొనుక్కుందామని జేబులో చేయిపెట్టుకొని చూసుకుంటే ఒక్క అణా తక్కువగా ఉంది. ఏమి చేయాలో తోచలేదు. ప్లాట్‌ఫారం మీద తిరుగాడుతూన్న ఒక పెద్దమనిషి దగ్గరకు వెళ్ళి, పరిస్థితి చెప్పి ఒక్క అణా ఇమ్మన్నాడు. ముష్టెత్తుకునే వాళ్ళు సాధారణంగా మోసంతో ఇలా చెపుతూ ఉంటారు. ఆ పెద్దమనిషి మా అన్నయ్యను ఎగాదిగా ఒకసారి చూశాడు. ఖద్దరుబట్టలతో, ప్రసన్నమూ అమాయకమూ అయిన మా అన్నయ్య ముఖం చూసి, ఏమనుకున్నాడో ఏమిటో ఒక అణా తీసి ఇచ్చాడు. వెంటనే మా అన్నయ్య తన దగ్గర ఉన్న Post card ఒకటి తీసి ఆయనకిస్తూ! "ఈ కార్డు మీరు తీసికొని ఉపయోగించుకోండి. మీ ఋణం నేను ఉంచుకోకూడదు!" అన్నాడు. ఆయన "పరవాలేదు! ఆ కార్డు నాకు ఇవ్వనవసరంలేదు" అన్నాడు. అయినా సరే మా అన్నయ్య వినకుండా పట్టుబట్టి ఆ పోస్టుకార్డు ఆయనకిచ్చాడు.

**3) మా 'అబ్బిగాడు మామయ్య' పెట్టిన పరీక్ష:-** మేమంతా "వెట్టిసుబ్బన్నగారి పిల్లలం" కాబట్టి మేము కూడా వెట్టివాళ్ళమేనేమో అనే అనుమానం (దురభిప్రాయం) మా దగ్గిరి బంధువులలోను సమాజంలోని ప్రజలలోను ఉండేది. ఒకసారి మా ఆఖరి మేనమామ (అబ్బిగాడు మామయ్య) మా అన్నయ్య చిన్నవాడుగా ఉన్నప్పుడు ఒక

నిమ్మపండు చాకు చేతికి ఇచ్చి: "ఒరేయ్! సోమిగా! దీనిని కొయ్యరా!" అన్నాడు. (ఆయన నన్ను "సుబ్బిగా!" అని పిలిచేవాడు). మా అన్నయ్య ఆ నిమ్మపండును సరిగ్గానే (అంటే అడ్డంగానే) కోసి ఇచ్చాడు. వెఱ్ఱిసుబ్బన్నగారి కొడుకుకదా! నిమ్మపండును నిలువుగా కోస్తాడని మా అబ్బిగాడు మామయ్య దురభిప్రాయం! (మా మేనమామ పెట్టిన ఈ పరీక్ష సంగతి మా అన్నయ్య పెద్దయ్యాక నాతో చెప్పాడు.)

**4) రైల్వేస్టేషన్‌లో "చీమలబారు":–** రైల్వేస్టేషన్లలో టిక్కెట్టు ఇచ్చే కౌంటర్ల దగ్గర జనం గుమిగూడి పోయి త్రొక్కిసలాట జరుగుతూ ఉంటుంది. "Q Please" అనే బోర్డు పెట్టినా ఈ త్రొక్కిసలాట జరుగుతూనే ఉంటుంది. ఒక్కొక్కసారి వీరిని అదుపు చేయడానికి పోలీసుల సహాయం తీసుకుంటూ ఉంటారు. రాజమండ్రి గోదావరి స్టేషన్‌లో ఒక స్టేషన్ మాస్టారుగారు "Q Please" అనే బోర్డు కాకుండా "చీమలబారు బొమ్మ" వేయించి కౌంటర్ ముందు పెట్టించాడట! "చీమలు నోరులేని చిన్ని చిన్ని క్రిమికీటకాలైనా ఎంతో క్రమశిక్షణతో ఒకదాని వెనుక ఒకటి వెడతాయికాని మనుషుల్లా గుమిగూడవు. ఆ కీటకాలను చూచి క్రమశిక్షణ నేర్చుకోండి" అని ప్రయాణికులకు హెచ్చరిక. ఈ విషయం మా అన్నయ్య నాతో చెప్పాడు.

**5) దుర్మార్గులైన పుత్రులకు శిక్షలు:–** ప్రపంచంలో కొందరు పరమ దుర్మార్గులైన కొడుకులు ఉంటారు. కొందరు తల్లిని కొడతారు; మరికొందరు తండ్రిని కొడతారు. ఇటువంటి నీచులకు మన పెద్దలు చెప్పిన శిక్షలు కొన్ని ఉన్నాయని మా అన్నయ్య నాతో చెపుతూ ఉండేవాడు. "తల్లిని కొట్టిన వాడిని మేనమామ చేత కొట్టించాలి; తండ్రిని కొట్టినవాడిని పినతండ్రిచేత కొట్టించాలి. ఇది మన సంప్రదాయం!" – అనేవాడు.

**6) తమ్ముళ్ళమీద తల్లివంటి ప్రేమ:–** నేను 1946–48 మధ్య రాజమండ్రిలో మా చిన్నక్కయ్య ('చెల్లక్క') దగ్గర ఉండి "First Form" (6వ తరగతి) – "Second Form" (7వ తరగతి) చదువుకున్నాను. నేను 1947లో సెకండ్ ఫారం చదువుతూ ఉంటే మా చిన్నక్కయ్య పురిటికి పుట్టింటికి వెళ్ళింది. నన్ను మా అన్నయ్య కొవ్వూరు తీసికొని వెళ్ళి, మూడు నెలలపాటు తన దగ్గర ఉంచుకొని, ప్రతిరోజు ఉదయం 5 గంటలకు లేచి, నాకు వంటవండి, క్యారియర్ సిద్ధం చేసి, 7 గంటలకల్లా నన్ను కొవ్వూరు రైల్వేస్టేషన్‌కు పంపించేవాడు. నేను రైల్లో రాజమండ్రీ వెళ్ళి, Town Middle School లో చదువుకొని, మధ్యాహ్నం మా అన్నయ్య ఇచ్చిన క్యారియర్‌లోని అన్నం తిని, సాయంకాలానికి తిరిగి కొవ్వూరు చేరుకొనేవాడిని. ఇలాగ ఒక రోజు రెండు రోజులు కాదు; మూడు నెలలపాటు వండిపెట్టాడు కన్న తల్లిలాగ మా అన్నయ్య.

ఆ రోజుల్లో మా అన్నయ్య వండిన అరటికాయ వేపుడు (జీలకర్రకారం చల్లిన) కూర రుచి ఇప్పటికీ నాకు జ్ఞాపకం వస్తూ వుంటుంది! అంత కష్టపడిన మా అన్నయ్య వయస్సు అప్పుడు కేవలం 16 సంవత్సరాలు మాత్రమే! నా వయస్సు 12 ఏండ్లు!

నేను 1951-52 సంవత్సరంలో తణుకు బోర్డు హైస్కూలులో S.S.L.C. చదువుతున్నాను. అప్పుడు మా అన్నయ్య భీమవరంలో ఉద్యోగం చేస్తున్నాడు. ఆ రోజుల్లో భీమవరంలో "బ్రహ్మం" అనే విశ్వబ్రాహ్మణుడు మంచి మంచి పెన్నులు తయారు చేసేవాడు. వాటికి బంగారు పాళీలు పెట్టేవాడు. వాటికి "బ్రహ్మం పెన్నులు" అని చాలా గొప్పపేరు ఉండేది. మా అన్నయ్య నా కోసం 11 రూపాయలు వెచ్చించి ఒక "బ్రహ్మంపెన్ను" కొని నాకిచ్చాడు. నేను ఎంతో మురిసిపోయాను. అది పగడం రంగులో, బంగారు పాళీతో, బంగారు క్లిప్‌తో ఎంతో అందంగా ఉండేది. (ఆ రోజుల్లో 11 రూపాయలంటే ఇప్పుడు 1100 రూ.లకు సమానం!). అలాగే ఆ రోజుల్లో రాజమండ్రీలో తయారయ్యే "రత్నంపెన్నులు" కూడా చాలా పేరు గడించాయి. విదేశాల పెన్నులలో Black Bird Pen (Made in Japan) బాగుండేది, బాగా వ్రాసేది. నాకు అప్పటినుండి (1951 నుండి) - ఇప్పటివరకు (2022 వరకు) ఖరీదైన పెన్నులు వాడటం అలవాటు, సరదా! ఇటీవల మా దౌహిత్రుడు చి॥ మిహిర్ కులకర్ణి చదువు నిమిత్తం లండను వెళ్ళి, వచ్చేటప్పుడు నాకోసం ఒక Waterman Ink Pen తెచ్చాడు. దాని ఖరీదు అక్షరాలా పదివేల రూపాయలు! పెన్నుల విషయంలో నా సరదాలు ఇలా వుంటాయి! ఫోటోలు తీయించుకోవడం, తీయడంలో కూడా నా వ్యసనం ఇలాగే ఉంటుంది. ఇంతవరకూ నా జీవితంలో ఫోటోల నిమిత్తం 5-6 లక్షల రూపాయలు ఖర్చుచేసి ఉంటాను! పుస్తకాలు కొనడం కోసం సుమారు 10 లక్షల రూపాయలు వెచ్చించి ఉంటాను! పుస్తకాలు ముద్రించడంకోసం సుమారు 20-30 లక్షలు ఖర్చుచేసి వుంటాను! ధర్మరాజుకు జూదం ఎలా వ్యసనమో - నాకు పుస్తక ముద్రణ అలాగ ఒక వ్యసనం!

**7. ఉద్యోగాలు:-**

మా అన్నయ్య 1951లో భాషాప్రవీణలో ఉత్తీర్ణుడు కాగానే, తణుకు బోర్డు హైస్కూలులో ఉద్యోగం వచ్చింది. కాని మా అన్నయ్య చేరలేదు. నేను అప్పుడు S.S.L.C.లో ఉన్నాను. అది కాగానే కాలేజీలో చేరాలి. అప్పుడు తణుకులో కాలేజీ లేదు. దగ్గరలో ఉన్న భీమవరం వెళ్ళాలి. అందువల్ల మా అన్నయ్య జిల్లాబోర్డు ఉద్యోగం వదిలేసి, భీమవరంలో U.L.C.M. High School లో తెలుగు పండితుడుగా

చేరాడు. నన్ను తన దగ్గర ఉంచుకొని ఇంటర్‌మీడియేట్ చదివించాలని మా అన్నయ్య ఉద్దేశం. నేను మా కుటుంబ పరిస్థితులు తెలియని మూర్ఖుణ్ణి. "ఆ డబ్బా కాలాజీలో నేను చేరను!" అని మొండిగా అన్నాను. హైస్కూలు అంతటికీ First వచ్చాను. నా మిత్రులు కొందరు మద్రాసు లయోలా కాలేజీలోను, వివేకానంద కాలేజీలోను చేరారు. నాకు కూడా అక్కడ చేరాలని కోరిక. వాళ్ళంతా ధనవంతులు. మేం పేదవాళ్ళం. మా అన్నయ్య నాకు మెల్లగా నచ్చజెప్పి భీమవరంలో చేర్పించాడు. కాలేజీ ఫీజు కట్టడం కోసం వెంపరాల సూర్యనారాయణగారు అనే మా బంధువైన వడ్డీవ్యాపారి దగ్గర వందరూపాయలు అప్పుచేశాడు. మా అమ్మకాని మా అన్నయ్య కాని జీవితంలో ఎప్పుడూ అప్పు చేయలేదు. (ఉన్న దాంట్లో సర్దుకొని గడుపుకొనే వారు). అప్పుచేయడం వారికి ఇదే మొదటిసారి, ఆఖరిసారి కూడా!

నేను ఒక్క సంవత్సరం (1952–53) భీమవరంలో మా అన్నయ్య దగ్గరుండి చదువుకున్నాను. తరువాత కొన్ని అనుకోని కారణాలవల్ల మా అన్నయ్య U.L.C.M. High School ఉద్యోగం వదిలివేసి, పశ్చిమగోదావరి జిల్లాబోర్డులో ప్రవేశించి, పాలకోడేరులో తెలుగు పండితుడుగా చేరాడు. తరువాత Grade–I పండితులకు జీతంస్కేలు ఎక్కువ ఇస్తున్నారని కృష్ణాజిల్లాబోర్డులోకి మారాడు. కోడూరు, పెదపాలపట్ఱు, కైకలూరు గ్రామాలలో పనిచేసి, జూనియర్ లెక్చరర్‌గా ప్రమోషన్ వచ్చి, కొన్నాళ్ళు కైకలూరులోనే పనిచేసి, పిమ్మట తణుకు ప్రక్కనే ఉన్న అత్తిలి జూనియర్ కళాశాలలో చేరాడు. తరువాత తూర్పుగోదావరిజిల్లాలోని ఆలమూరుకు బదిలీ అయి, అక్కడే 1988 డిసెంబరు 30వ తేదీని రిటైర్ అయ్యాడు. తణుకువచ్చి మా అమ్మగారితోపాటు అక్కడే స్థిరపడ్డాడు.

1953–54వ సంవత్సరంలో మా అన్నయ్య భీమవరం వదిలేసి, పాలకోడేరు వెళ్ళిపోవడంవల్ల నేను "శాస్త్రి హెూటల్"లో భోజనం చేస్తూ ఇంటర్ రెండవ సంవత్సరం చదివాను. ఆ హెూటల్ భోజనం సరిపడక సరిగ్గా పరీక్షలకు ముందు నాకు జ్వరం వచ్చింది. మా అన్నయ్య వచ్చి, భీమవరంలో అడవి బాపిరాజుగారి మేనల్లుడు డా॥ బుద్ధవరపు కామరాజుగారి దగ్గర వైద్యం చేయించాడు. ఆయన టైఫాయిడ్ జ్వరం అని చెప్పడంతో తణుకు తీసికొనివెళ్ళి మా అమ్మదగ్గర ఉంచి, డా॥ డి. గోపాలకృష్ణమూర్తిగారి దగ్గర వైద్యం చేయించాడు. గోపాలకృష్ణమూర్తిగారి భార్య డా॥ డి. ఇందిరాదేవిగారు. ఈ దంపతులిద్దరూ మా కుటుంబ వైద్యులు. (ఇందిరాదేవిగారి తమ్ముడు హరిహరరావు ఇంటర్‌లో నా సహాధ్యాయి, ప్రాణమిత్రుడు.) టైఫాయిడ్ జ్వరంతో నెలరోజులకు పైగా బాధపడ్డాను. 1954 మార్చి నెలలో పరీక్షలకు కూర్చోలేక

పోయాను. 1954 సెప్టెంబరు నెలలో ఇంగ్లీషు, తెలుగు పరీక్షలకు, 1955 మార్చి నెలలో గ్రూపు పరీక్షలకు (Bi.P.C. గ్రూపు) కూర్చొని ఉత్తీర్ణుడనయ్యాను. అందువల్ల M.B.B.S. చదివే అవకాశం లేకపోవడంతో భీమవరం కళాశాలలో మొదట Botany B.Sc.లో చేరాను. తరువాత తెలుగు శాఖాధ్యక్షులు శ్రీ దిగుమర్తి సీతారామస్వామిగారి ప్రోత్సాహంతో దానిని వదిలేసి, తెలుగు బి.ఏ.లో చేరాను. ముగ్గురు అన్నదమ్ములం కలిసి, భీమవరం సమీపంలో ఉన్న "రాయలం" అనే గ్రామంలో వంటవండుకొని చదువుకున్నాం.

ఆ సమయంలో మా తమ్ముళ్ళు (చి॥ భాస్కరరావు, చి॥ కృష్ణమూర్తి) M.P.C. గ్రూపుతో ఇంటర్ బాగా చదువుతూ ఉండటంవల్ల, వాళ్ళిద్దరినీ ఇంజనీరింగ్ చదివించాలని మా అన్నయ్య నిశ్చయించాడు. నాకు బి.ఏ. తర్వాత ఎం.ఏ. చదివే అవకాశాలు లేవని తేలిపోయింది. అందువల్ల ఈ రెండు సంవత్సరాలూ కాలేజీ లైఫ్ enjoy చేయాలనే పిచ్చిఆలోచనతో నేను నాటకాలు వేయడం ప్రారంభించాను. చదువు చంకనాకిపోయింది! Fine Arts Association సెక్రెటరీ అయ్యాను. గురుదేవులు శ్రీ దిగుమర్తి సీతారామస్వామిగారు బాగా చదువుకోకుండ నేను చేస్తున్న ఈ పిచ్చి పనులు చూచి, (నాతోపాటు లకంసాని శ్రీరామకృష్ణ అనే నా తణుకు మిత్రుడు కూడా - తెలుగు బి.ఏ. చదివేవాడే - నాటకాలు వేస్తూండడంతో) "తెలుగు డిపార్టుమెంటుకి శని పట్టుకుంది!" అని బాధపడేవారు. 1957 మార్చిలో పరీక్షలు సరిగ్గా వారం రోజులు ఉన్నాయనగా, అంతవరకూ సరిగా చదవని నేను పుస్తకాలు ముందువేసుకొని కూర్చుంటే, భోరున ఏడుపు వచ్చింది. ఏడుస్తున్న నన్ను చూచి, మా బుల్లితమ్ముడు చిరంజీవి కృష్ణమూర్తి నన్ను ఓదారుస్తూ "ఏడవకురా! ఈ వారం రోజులూ గట్టిగా చదివి, నీకు ఎంత వస్తే అంతవ్రాయి S.S.L.C.లో తణుకు హైస్కూల్లో First Rank వచ్చినవాడివి! నువ్వు చదవగలవు; చదువు!" అని ఓదార్చాడు. బాలవాక్కు బ్రహ్మవాక్కు అన్నారు. వారంరోజులు అహోరాత్రాలు చదివాను. ప్యాసయ్యాను; కాని First class రావలసిన వాడిని Second Class లో ప్యాసయ్యాను. "బ్రతుకు జీవుడా!" అని బయటపడ్డాను. నా S.S.L.C.First Rank మార్కులు చూసి, నాకు Central Government కి చెందిన Postal Department లో గుమాస్తాగా ఉద్యోగం వచ్చింది. నాలుగేళ్ళు (1957-61) ఆ ఉద్యోగం చేశాను. ముగ్గురు పిల్లలు పుట్టారు. అయినా తెలుగు ఎం.ఏ. చదవాలనే కోరిక చావలేదు. ఎలాగ చదవడం?

1961లో మా ఆఖరి తమ్ముడు బి.ఇ. (మెకానికల్)లో ఉత్తీర్ణుడై, మిలిటరీలో చేరి, "ఒరేయ్! సుబ్బారావ్! నువ్వు ఎం.ఏ.లో చేరు; నేను నీకు నెలకి 100 రూ.లు

పంపుతాను" అన్నాడు. (ఆ రోజులలో 100 రూ.లు అంటే ఈ రోజుల్లో 10 వేల రూపాయలతో సమానం!). కాని మా అన్నయ్య, నేను బి.ఏ.లో భీమవరం కళాశాలలో వేసిన పిచ్చి (నాటకం) వేషాలన్నీ తలుచుకొని నన్ను ఎం.ఏ. చదవడానికి వీల్లేదన్నాడు. "పోస్టల్ డిపార్ట్‌మెంట్ (సెంట్రల్ గవర్నమెంట్)లో పెర్మనెంట్ ఉద్యోగం. ముగ్గురు పిల్లల సంసారం. ఈ ఉద్యోగానికి రిజైన్ చేసి వెళ్ళడం పెద్ద రిస్క్‌తో కూడిన పని!" – అని నిక్కచ్చిగా చెప్పాడు. నేను మళ్ళీ ఏడుస్తూ కూర్చున్నాను. చెట్టంత తమ్ముడు ఏడుస్తూంటే చూడలేక, "సరే! ఒక కండీషన్ మీద నిన్ను తిరుపతిలో ఎం.ఏ.(తెలుగు) చదవడానికి పంపుతాను. అక్కడ నువ్వు నాటకాలు వేయనని మా ముందు వాగ్దానం చేయాలి!" అన్నాడు మా అన్నయ్య. నేను మా అన్నదమ్ముల ముందు అలా వాగ్దానం చేసిన తరువాత నన్ను తిరుపతికి వెళ్ళనిచ్చాడు మా అన్నయ్య. తమ్ముళ్ళ భవిష్యత్తును గురించి అంత నిశితంగా ఆలోచించి జాగ్రత్తలు తీసికొనేవాడు.

1964లో మా అన్నయ్య కృష్ణాజిల్లా పెదపాలపఱ్ఱులో ఉద్యోగం చేస్తూ ఉండగా నేను వెళ్ళాను. అప్పుడు నేను తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో తెలుగు వీరగాథలనుగురించి పరిశోధన చేస్తున్నాను. పెదపాలపఱ్ఱుకు సమీపంలో "కుచ్చికాయలపూడి"లో "కొమ్ములవారు" ఉన్నారని తెలుసుకున్న మా అన్నయ్య, నన్ను వాళ్ళ దగ్గరకు తీసికొని వెళ్ళాడు. శ్రీ కొడాలి సీతారామాంజనేయులు అనే కొమ్ములవాడి దగ్గరనుండి నాకు ఏడు తాళపత్రగ్రంథాలు ఇప్పించాడు. నా పరిశోధన వీటితోనే ప్రారంభమయింది. అందువల్ల 1976లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ వారు నా "కాటమరాజు కథలు" ముద్రించినప్పుడు, దానిని నేను ఎంతో భక్తితో మా అన్నయ్యకు అంకితమిచ్చాను. ఆయన మీద ఒక మంచి వచనకవిత కూడా వ్రాశాను ఆ పుస్తకంలో.

నేను 35 సం॥లు వచ్చేవరకూ ఉద్యోగంలో స్థిరపడలేదు. అందువల్ల మా పెద్దబ్బాయి చి॥ కాళిదాసుని, మా రెండవ అబ్బాయి చి॥ రామయ్యని మా అన్నయ్య తన దగ్గరే ఉంచుకొని చదివించాడు. అందువల్ల మా పిల్లలిద్దరికీ తల్లిదండ్రులమీద ఎంత గౌరవమో, మా వదినె–మా అన్నయ్యలమీద కూడా అంతే గౌరవం ఉంది– ఇప్పటికీ.

## 8. U.L.C.M. High School–భీమవరం:–

ఇది మా అన్నయ్య మొట్టమొదట ఉద్యోగం చేసిన హైస్కూలు. U.L.C.M. High School అంటే United Luthern Church Mission High School. 1951లో

మా అన్నయ్య ఈ హైస్కూలులో direct గా Grade–I Telugu Pandit గా చేరాడు. ఆ ఉద్యోగానికి ముగ్గురు నలుగురు పండితులు పోటీపడ్డారు. అప్పటి ప్రధానోపాధ్యాయుని పేరు “డేనియల్” . ఆయన చండశాసనుడు; గొప్ప క్రమశిక్షణతో ఉన్నత పాఠశాలను నడిపించేవాడు. ఆయన పేరు చెపితే విద్యార్థులు, ఉపాధ్యాయులు గడగడ వణికిపోయేవారు. ఆ రోజుల్లో ఆ ఉన్నతపాఠశాల చాలా పెద్ద పాఠశాల; సుమారు రెండువేలమంది విద్యార్థులు ఉండేవారు. మంచి మంచి ఉపాధ్యాయులు అక్కడ పనిచేస్తూ ఉండేవారు. ప్రముఖ చిత్రకారుడు “శ్రీ అంకాల వెంకట సుబ్బారావుగారు” ఆ హైస్కూల్లో Drawing Teacher గా పనిచేసేవారు. ఈయన తిక్కన వర్ణచిత్రాన్ని ఎంతో అద్భుతంగా చిత్రించారు. ఆది భీమవరం కళాశాలలో ఆ రోజుల్లో మా ప్రిన్స్‌పాల్‌గా ఉన్న శ్రీ ఇ. లక్ష్మీనాథరావుగారి గదిలో ఉండేది. నేను చూశాను.

U.L.C.M. హైస్కూలులో మా అన్నయ్యగారి ఎంపిక గమ్మత్తుగా జరిగింది. పోటీపడుతున్న నలుగురు పండితుల్నీ S.S.L.C., తరగతిగదిలో పిల్లలకు పాఠం చెప్పమన్నాడు డేనియల్‌గారు. ఆయన క్లాసులో ఒక కుర్చీవేయించుకొని కూర్చున్నాడు. శ్రద్ధగా వారు చెప్పే పాఠాలు విన్నాడు. నలుగురూ ఒక్కొక్కరు ఒక పద్యాన్ని తీసికొని పిల్లలకు పాఠం చెప్పారు. మనుచరిత్ర ప్రథమ ద్వితీయాశ్వాసాలనుండి “ప్రవరుడు” అనే పేరుతో ఒక పాఠం ఉంది. మా అన్నయ్య ఒక పద్యాన్ని తీసికొని 10–15 నిమిషాలు అత్యద్భుతంగా పాఠం చెప్పాడు. డేనియల్‌గారు ముగ్ధుడైపోయాడు! మా అన్నయ్యను చూచి “You are selected!” అన్నాడు. మా అన్నయ్య సంతోషించి “Order ఎప్పుడు ఇస్తారు?” అని సందేహంగా అడిగాడు. “My word is order! you can go!” అన్నాడు. అలాగ ఆయన నోటిమాట మీద మా అన్నయ్యకు అక్కడ ఉద్యోగం వచ్చింది. అప్పటికి ఆయన వయస్సు కేవలం 20 సం.లు నిండి 21వ సంవత్సరం నడుస్తోంది!

కొద్ది రోజుల్లోనే హైస్కూలులో ఎంతో పేరు ప్రఖ్యాతులు తెచ్చుకున్నాడు మా అన్నయ్య. అక్కడి B.Ed. టీచర్లతో ఎంతో స్నేహంగా ఉండేవాడు. “వివేకవర్ధని” అనే పేరుతో విద్యార్థులకోసం ఒక వ్రాతపత్రికను నడిపేవాడు. (పూర్వం రాజమహేంద్రవరంలో కందుకూరి వీరేశలింగంపంతులుగారు ఈ పేరుతో ఒక సాహిత్య పత్రికను ప్రచురిస్తూ ఉండేవారు.) విద్యార్థి నాయకులందరూ మా అన్నయ్య చెప్పుచేతల్లో ఉండేవారు. 1951 నుండి 1953 వరకూ రెండేళ్ళు గడిచాయి. ఒకసారి ఏదో సమస్య మీద విద్యార్థులు, ప్రధానోపాధ్యాయుడైన డేనియల్‌గారితో గొడవపడ్డారు.

ఆయన నిరంకుశ ధోరణికి వ్యతిరేకంగా సమ్మె చేశారు. ఆ సమ్మె రోజుల్లో కొందరు రౌడీ విద్యార్థులు డేనియల్‌గారిని కొట్టడానికి వెళ్ళారు. ఈ సంఘటనలో మా అన్నయ్యగారి హస్తమున్నదని డేనియల్‌గారు అనుమానించి ఆయన్ని ఉద్యోగంనుండి తీసివేశాడు. నిజానికి మా అన్నయ్యకు ఆ సంఘటనతో ఏమీ సంబంధం లేదు. ఆయన శుద్ధ గాంధీయవాది. అహింసావ్రతుడు; నిత్య ఖద్దరుధారి. (సెంటిమెంటు ఏమీలేని మా అన్నయ్య ఆ హైస్కూల్లో అమావాస్య మంగళవారంనాడు చేరాడు. అదే కారణమని నా సెంటిమెంటు!) వెంటనే ఆ హైస్కూల్లోనే ఉన్న మా అన్నయ్యగారి ప్రియశిష్యులైన విద్యార్థులు కొందరు (ముఖ్యంగా క్షత్రియుల పిల్లలు) వారి పెద్దలతో చెప్పి, మా అన్నయ్యను పశ్చిమగోదావరి జిల్లాబోర్డులో "Grade-I Telugu Pandit"గా ఉద్యోగం ఇప్పించారు. భీమవరం సమీపంలో ఉన్న పాలకోడేరు హైస్కూల్లో చేరాడు. విద్యార్థులకు మా అన్నయ్య అంటే అంత భక్తి ఉండేది ఆరోజుల్లో!

**9. దుస్తులు:-**

కొవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠంలో భాషాప్రవీణ విద్యార్థిగా ఉన్నప్పుడు ఖద్దరు లాల్చీ, ఖద్దరు పైజామా ధరించేవాడు. భీమవరంలో ఉద్యోగంలో చేరగానే పంచెకట్టు, లాల్చీ, పైన కండువా ధరించేవాడు. అప్పుడు మా అన్నయ్య సన్నగా ఉండేవాడు. మెడ సన్నగా పొడుగ్గా ఉండేది. అందువల్ల "కంటిమెడ లాల్చీ" కాకుండా, కాలరు ఉన్న "బెంగాలీ లాల్చీ" ధరించేవాడు. (మనిషి బాగా బలంగా ఉండి, మెడ లావుగా ఉన్నవాళ్ళకి కంటిమెడ లాల్చీ బాగుంటుందని మా అన్నయ్యకు తెలుసు.) పైమీద కండువా లేకుండా ఎక్కడికీ వెళ్ళేవాడుకాదు. సభలో ఉపన్యాసం చేస్తూ ఉంటే భుజంమీద కండువా తప్పనిసరిగా ఉండి తీరాల్సిందే! ఒకసారి నన్నయపీఠానికి వస్తూ కండువా మరిచిపోయాడు. వేదిక ఎక్కి ఉపన్యసించవలసి వచ్చింది. అప్పుడు ఎవరి దగ్గరో ఉన్న కండువా తీసికొని భుజంమీద వేసుకొని, వేదిక నెక్కాడు. భుజం మీద కండువా లేకపోతే ఆయన ప్రసంగించలేకపోయేవాడు! (ఘంటసాలగారు చేతుల్లో ఒక జేబురుమాలు తిప్పుకుంటూ పాటపాడేవారు. చేతుల్లో ఆ జేబురుమాలు లేకపోతే పాడలేకపోయేవారు.) మా అన్నయ్య నుదుటిమీద ఎప్పుడూ ఎర్రటి తిలకం దిద్దుకొనేవాడు. ముఖంలో మంచి బ్రహ్మవర్చస్సు ఉట్టిపడుతూ ఉండేది!

"మనిషి తన ఆకారానికి అనుకూలంగా దుస్తుల్ని నిర్ణయించుకోవాలి. ఆ పద్ధతిలోనే ఎప్పుడూ ఉండాలి. క్రాపు, మీసాలు ఒకే రకంగా ఉంచుకోవాలి. పదే పదే క్రాపు మార్చి వేయడం, లేదా పెద్దగా జుట్టు పెంచుకోవడం, ఒకసారి మీసాలు

తీసివేయడం, ఇంకోసారి ఉంచుకోవడం, మరోసారి గడ్డాలు మీసాలు పెంచుకోవడం – ఇలాంటి పిచ్చిపనులు చేయకూడదు!" ఇదీ మా అన్నయ్యగారి సిద్ధాంతం. దీనిని మేము ముగ్గురు తమ్ముళ్ళం కూడా ఇప్పటివరకూ కూడా పాటిస్తూ వచ్చాము.

**10. సొంతంగా కావ్యాలు వ్రాయకపోవడానికి కారణం:-**

చిన్నతనంలోనే మా అన్నయ్యకు మంచి కవితాశక్తి అబ్బింది; గొప్ప రసజ్ఞత అలవడింది. చిత్ర విచిత్రమైన పద్యాలను శ్లోకాలను కంఠస్థం చేసేవాడు. వాటిలో నీతులు, చమత్కారం, శృంగారం, హాస్యం తొణికిసలాడుతూ ఉండేవి. ఇటువంటి పద్యాలనూ, శ్లోకాలనూ ఉదాహరిస్తూ తన ఉపన్యాసాలతో సభాసదుల్ని ఆకట్టుకుంటూ ఉండేవాడు. ఎంతో సృజనాత్మకశక్తి కలిగికూడా ఆయన సొంతంగా పెద్దపెద్ద కావ్యాలు ఏవీ వ్రాయలేదు. వీరి "కీరకోకిలం" అనే చిన్న కావ్యము, "కాఫీ ఆరాధన శతకము" మాత్రం చాలా ఏండ్ల క్రిందట (31-08-1975నాడు) ముద్రింపబడ్డాయి. విడిగా ఎన్నో పద్యాలు వ్రాశాడు. అవి అముద్రితాలు. "పూర్వకవుల మహాకావ్యాలను చదువుకుంటే చాలు. మళ్ళీ మనం సృష్టించేదేమిటి? ఎంత వ్రాసినా మనం పూర్వకవుల స్థాయికి చేరుకోగలమా? అసలు పూర్వమహాకవుల కావ్యాలు చదవడానికే మన జీవితాలు సరిపోవు కదా!" అంటూ ఉండేవాడు.

మా అన్నయ్యగారు 30-12-1930 లో మా స్వగ్రామమైన కాకుల ఇల్లిందల పల్లెలో జన్మించాడు. 30-12-2005 నాటికి ఆయనకు 75 సం.లు. నిండాయి. తాను జీవితమంతా కష్టపడి సేకరించిన అద్భుతమైన పద్యాలను శ్లోకాలను తరువాతి తరాలవారికి అందించాలనే తపన 2005 నాటికి ఆయనలో అభివృద్ధి చెందసాగింది. తన ధారణలో ఉన్న ఆ పద్యాలనూ శ్లోకాలనూ కష్టపడి లిఖితరూపంగా భద్రపరిచాడు. (చాలా ఏండ్లు కావటం వల్ల ధారణాశక్తి కొంత తగ్గి, కొన్ని పద్యాలలో కొన్ని పాదాలు లోపించాయి). 252 పద్యాలకు, 310 శ్లోకాలకు సులభశైలిలో తాత్పర్యాలు వ్రాశాడు. 18-8-2005 నాడు మా నాన్నగారి ఆబ్దీకానికి మేం నలుగురు అన్నదమ్ములం తణుకులో కలిసినప్పుడు, తాను ఎంతో ఓపికతో వ్రాసిన ఆ శుద్ధప్రతిని మా చేతిలో పెట్టి, తన అభిప్రాయాన్ని చెప్పాడు. "నేను నా జీవితమంతా ఎంతో కష్టపడి ఈ అపురూపమైన పద్యాలను శ్లోకాలను సేకరించాను. వీటిని తరువాతి తరాలకు అందించవలసిన బాధ్యత మీపై పెడుతున్నాను" అన్నాడు. అది విని, ముగ్గురు తమ్ముళ్ళం కలిసి మా అన్నయ్యగారు సాహిత్య సాగరాన్ని మథించి సేకరించిన "ఏటిన ముత్యాలు" 'బాపు'గారి ముఖచిత్రంతో చాలా అందంగా ముద్రించి, రసజ్ఞశేఖరులైన

కవులకు, పండితులకు, సాహిత్యవేత్తలకు అందించాం. ఈ గ్రంథానికి కవిపండితలోకంలో ఎంతో పేరు ప్రఖ్యాతులు వచ్చాయి. దీనిని మా అన్నయ్యగారి వీరాభిమానియైన ప్రముఖకవి శ్రీ పాడేటి జాన్సన్‌గారు 2016లో పునర్ముద్రించి అందరికీ ఉచితంగా పంచిపెట్టారు. తరువాత దీనిని నేను మిత్రులు శ్రీవాడపల్లి శేషతల్పశాయిగారితో చెప్పి, వారి Internet లో పెట్టించాను. కావలసినవారు "andhrabharati.com"ను చూడవచ్చును. (శేషతల్పశాయిగారి సెల్ నెం. 9393820638). ఇప్పుడు "అజో-విభో-కందాళం ఫౌండేషన్" (అమెరికా) వారు మా అన్నయ్యగారి "ఏటిన ముత్యాలు" మూడవ ముద్రణ తీసికొనిరాబోతున్నారు.

**11. మా అన్నయ్యగారి ముద్రిత గ్రంథాలు:**

1. "కీరకోకిలం" - ఖండకావ్యం
2. "కాఫీ ఆరాధన" - హాస్యశతకం.

ఈ రెండింటిని కలిపి చిన్న పుస్తకంగా, వీటి కృతిభర్తయైన శ్రీ భమిడిపాటి గౌతమ సుబ్బావధానిగారు, 31-08-1975నాడు, సాహితీ సమితి, కైకలూరు, కృష్ణాజిల్లా పరంగా ముద్రించారు.

3. ఏటిన ముత్యాలు - 'శ్రీరస' ప్రచురణ, 2006, ద్వితీయ ముద్రణ 2016.
4. జ్ఞానరత్నాలు - 'శ్రీరస' ప్రచురణ, 2009
5. సత్యసందర్శనం - డా॥ తాతిని రామబ్రహ్మంగారి ప్రచురణ, 2010
6. శ్రీగురుభ్యోనమః - 'శ్రీరస' ప్రచురణ, 2011
7. జ్ఞానతరంగాలు - ద్రావిడ విశ్వవిద్యాలయ ప్రచురణ, 2017
8. భగవద్గీతా ప్రబోధము - ద్రావిడ విశ్వవిద్యాలయ ప్రచురణ, 2018

మా అన్నయ్య రచించిన గ్రంథాలలో "ఏటిన ముత్యాలు" - "సత్యసందర్శనం" - "జ్ఞానతరంగాలు" - "భగవద్గీతాప్రబోధము" అనే నాలుగు రచనలూ చాలా గొప్ప రచనలు. వీటి తరువాత ఎన్నదగినవి మూడు మంచి వ్యాసాలున్నాయి. మా తల్లిదండ్రులను గురించి వ్రాసిన "మాతృదేవోభవ!" - "పితృదేవోభవ" అనే రెండు వ్యాసాలు; "జ్ఞానరత్నాలు" అనే గ్రంథాన్ని మా అమ్మగారికి అంకితమిస్తూ వ్రాసిన "మా అమ్మ" అనే వ్యాసమూ; "శ్రీగురుభ్యోనమః" అనే చిన్న పుస్తకంలో తన గురువులైన "జటావల్లభుల పురుషోత్తంగారు - కేశిరాజు వేంకట నృసింహ అప్పారావుగారు - వేదుల రామశాస్త్రిగారు - చిలుకూరి రామమూర్తిశాస్త్రులుగారు" అనే నలుగుర్ని గురించిన వ్యాసాలూ మిక్కిలి శ్రేష్ఠమైన రచనలు. ఈ వ్యాసాలన్నీ చేర్చి,

"కీరకోకిలం"–"కాఫీ ఆరాధన"లతో కలిపి ఈ పుస్తకంలో రెండవ భాగంలో ఇస్తున్నాను. మా అన్నయ్య రచించిన "జ్ఞానతరంగాలు" – "భగవద్గీతా ప్రబోధము" అనే రెండు పుస్తకాలు, నేను అప్పటి ద్రావిడ విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు ప్రొ॥ ఈడిగ సత్యనారాయణగారితో మాట్లాడి, విశ్వవిద్యాలయపరంగా ముద్రించేటట్లు చేశాను. దీనికి మా అన్నయ్య ఎంతగానో సంతోషించి "ఇంక నాకు జీవితంలో కోరిక లేమీ లేవురా!" అన్నాడు సంతృప్తిగా...

## 12. ఇష్టమైన కవులు – కావ్యాలు:–

మా అన్నయ్యకు కాళిదాసు "అభిజ్ఞాన శాకుంతలం" నాటకం అంటే చాలా యిష్టం. దీనిని గురించి చక్కటి ఉపన్యాసాలు ఎన్నో ఇచ్చాడు. అంతేకాదు, కొవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యాపీఠంలో తాను విద్యార్థిగా ఉన్నప్పుడు ఈ సంస్కృత నాటకాన్ని ప్రదర్శించాడు. దానిలో తాను వృద్ధురాలు 'గౌతమి' పాత్రను ధరించాడు. (ఆ ముసలిదాని వేషం కోసం మీసాలు తీసివేశాడు.) మనుచరిత్ర–పారిజాతాపహరణం లాంటి ప్రబంధాలు ఆయనకు వాచోవిధేయం. సెలవుల్లో ఇంటికి వచ్చినప్పుడు ఆ ప్రబంధాలలోని పద్యాలు, కంకంటి పాపరాజుగారి ఉత్తర రామాయణంలోని పద్యాలు, తిరుపతి వేంకటకవుల పద్యాలు, జాషువాగారి పద్యాలు, జంధ్యాలవారి పద్యాలు బిగ్గరగా గొంతెత్తి చదివేవాడు. నా చిన్నతనంలో ఆ పద్యాలన్నీ వినడంవల్ల నాకు తెలుగుసాహిత్యంమీద అభిరుచి ఏర్పడింది. నేను 1952లో S.S.L.C. First rank లో School first గా ప్యాసయ్యాను. ఆ విషయం మా అన్నయ్యకు చెప్పడానికి హైస్కూలునుండి ఇంటిదాకా పరుగెత్తుకుంటూ వచ్చాను. ఆ శుభవార్త విని మా అన్నయ్య ఎంతో పొంగిపోయాడు. తరువాత కొద్దిరోజులకే శ్రీశ్రీ మహాప్రస్థానం నా చేతికిచ్చాడు. నేను దానిని చదివి ఉద్రూతలూగిపోయి, ఆ కవితలన్నీ కంఠస్థం చేసివేశాను. ఆ స్ఫూర్తితో కవిత్వం వ్రాయాలనే తపన నాలో బయలుదేరింది. ఇంటర్మీడియేట్‌లో శ్రీశ్రీని అనుకరిస్తూ ఎన్నో గేయాలు వ్రాశాను.

## 13. కవుల వైయక్తిక జీవితాలు మనకు అనవసరం:–

విమర్శకులు, కవులు, పండితులు – వీరిలో రెండు వర్గాలవారు ఉన్నారు. (1) ఒక కవి తన కవిత్వాన్ని ఎంత గొప్పగా వ్రాస్తాడో, ఆతని వైయక్తిక ప్రవర్తన కూడా అంతే గొప్పగా, స్వచ్ఛంగా, మరకలేనిదిగా ఉండాలి. చుట్టలు, బీడీలు, సిగరెట్లు కాల్చడం; ముక్కుపొడుం పీల్చడం; పేకాట ఆడటం, త్రాగుడు త్రాగడం, వ్యభిచరించడం, పెళ్ళాం ఉండగా ఇంకో స్త్రీని వివాహం చేసుకోవడం – ఇటువంటి

పనులు చేసే కవులను, రచయితలను ఈ మొదటి వర్గంవారు అసహ్యించుకుంటారు. నాకు తెలిసినంతలో ఇటువంటి "పవిత్రులైన" కవులు నలుగురు కనబడుతున్నారు: తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు, మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు, చిటిప్రోలు కృష్ణమూర్తిగారు, డా॥ పాపినేని శివశంకర్‌గారు.

(2) ఇక రెండవ వర్గంవారు – కవి రచయితల వైయక్తిక జీవితంతో సంబంధం లేకుండా, వారు రచించే ఉత్తమ కవిత్వాన్ని, ఉత్తమ రచనలను చదివి బ్రహ్మానందభరితులు అయ్యేవారు. మా అన్నయ్య ఈ రెండవ వర్గానికి చెందినవాడు. ఒకసారి నేను ఆయన చాలా బాగా మెచ్చుకొనే ఒక కవిని ఉద్దేశించి "ఆయన పెద్ద త్రాగుబోతు!" అన్నాను. మా అన్నయ్యకు కోపం వచ్చి: "అయితే ఏమిట్రా పిచ్చివాడా! ఆయన రసవంతమైన పద్యాలు వ్రాస్తాడు. వాటిని కళ్ళకద్దుకొని నేను చదువుకొని ఆనందిస్తాను. ఒక సద్బ్రాహ్మణుడుంటాడు; సచ్ఛీలుడు; త్రికాల సంధ్యావందనం ఆచరిస్తాడు; మహాభక్తుడు. కాని పద్యం వ్రాయలేడు. అటువంటి వాడితో నాకు పనేమిటి?" అని నన్ను ఎదురు ప్రశ్నించాడు. అటువంటి వాళ్ళను మా అన్నయ్య: "Harmless and useless!" అనే వాడు. ప్రముఖకవి గుంటూరు శేషేంద్రశర్మగారు కూడా ఈ రెండవ వర్గానికి చెందినవారే! "కవి స్వచ్ఛమైన శీలం కలవాడుగా ఉండాలా?" అని నేనొకసారి శేషేంద్రగారిని ప్రశ్నించాను. "అవసరం లేదు. కవి వైయక్తిక జీవితంతో మనకు సంబంధం లేదు; ఆయన కవిత్వంతోనే మనకు సంబంధం. మన పూర్వకవుల వ్యక్తిగత జీవితాలు ఎలాంటివో మనకు ఏమీ తెలియదు కదా!" అన్నారు. శ్రీనాథుని చాటువులనుబట్టి చూస్తే, అతడు పచ్చి వ్యభిచారిగా మనకు కనబడతాడు. అంత మాత్రాన ఆయన మహత్తర కవితా వైభవానికి, శృంగార నైషధాది ప్రబంధాల శ్రేష్ఠత్వానికి వచ్చిన నష్టమేముంది? దీనినే ప్రజాకవి కాళోజీగారు ఇంకో రకంగా చెప్పారు శ్రీశ్రీని ఉద్దేశించి: "ఒరేయ్! వాడి కవిత్వపు ఇంపుసొంపులు మనకు కావాలి కాని, వాడు తాగిపారేసిన సీసాల కంపు మనకెందుకురా?"

### 14. మా అన్నయ్యకు సెంటిమెంట్లు ఏవీ లేవు:-

మా అన్నయ్య మూఢభక్తుడు కాదు; ఆయన గుడిలోకి వెళ్ళి దేవునికి మ్రొక్కు కోవడం నేనెప్పుడూ చూడలేదు. ఇంట్లో పూజాపునస్కారాలు కూడా ఎప్పుడూ చేసేవాడు కాదు. జ్యోతిషాన్ని, జాతకాల్ని నమ్మేవాడు కాదు. "చేతకానివాడికి జాతకం!" అనేవాడు. "దేవుడి మీద భక్తి ఎక్కువైపోయి, బాగా ముదిరిపోయి, 24గంటలూ పూజలు చేస్తూ ఉంటే – పిచ్చెక్కుతుందిరా!" అని మమ్మల్ని హెచ్చరించేవాడు! కాని మా అన్నయ్య

గొప్ప ఆత్మజ్ఞాని. భగవద్గీతలో పరమాత్మ చెప్పిన "స్థితప్రజ్ఞుడు". మహాభారతంలో కర్ణుడిలాగ దైవాన్నికంటె పురుషకారాన్ని ఎక్కువ నమ్మినవాడు. ఒక సంస్కృత నాటకంలోని కర్ణుని మాటలు (బహుశః భట్టనారాయణుని "వేణీసంహారం" కాని, భానుని "కర్ణభారం" కాని అయి ఉండాలి. ఇంకా పరిశీలించాలి.) పదే పదే చెప్పేవాడు మా అన్నయ్య. అశ్వత్థామ కర్ణుణ్ణి "నీవు సూతపుత్రుడివి" అని నిందిస్తాడు. అప్పుడు కర్ణుడు: "దైవాయత్తం కులే జన్మ – మదాయత్తం తు పౌరుషమ్!" అంటాడు "ఒక కులంలో జన్మించడం దైవం అధీనంలో ఉంటుంది – (దైవనిర్ణయం) – పౌరుషం మాత్రం నా అధీనంలో ఉంటుంది!" ఈ మాటలు మా అన్నయ్యకు చాలా ఇష్టమైన మాటలు! అయినా కూడా, చాలాసార్లు నాతో "An unknown force always leads us!" అనీ; "Something is behind the curtain!" అనీ అంటూ ఉండేవాడు.

మా అన్నయ్యకు ఏ విధమైన సెంటిమెంట్సు (మూఢనమ్మకాలు) ఉండేవి కావు. మంచిరోజు చెడ్డరోజు అని చూసేవాడు కాదు. భీమవరంలోని U.L.C.M. High School ల్లో అమావాస్య మంగళవారంనాడు చేరాడు. (అందువల్లనే కాబోలు, తమ్ముళ్ళ కాలేజీ చదువులన్నీ అయ్యేదాకా భీమవరంలోనే ఉందామనుకున్న మా అన్నయ్య రెండు సంవత్సరాలు కాగానే ఆ ఉద్యోగాన్ని పోగొట్టుకున్నాడు.) సెంటిమెంట్స్ ఏమీ లేకపోయినా తల్లిదండ్రులకు తద్దినాలు చాలా శ్రద్ధగా పెట్టేవాడు. 40 ఏళ్ళపాటు తమ్ముళ్ళతో కలిసి తణుకులో పితృకార్యం నిర్వహించాడు. 1968లో మా నాన్న చనిపోయినప్పుడు మాతో "ఒరేయ్! మనం అందరం తలొక చోటా ఉన్నాం. తరచుగా కలుసుకోలేం. కాబట్టి నాన్న తద్దినానికి మీరందరూ తణుకు రండి. నలుగురం కలిసి శ్రాద్ధ విధిని నిర్వహిద్దాం! ఆ విధంగానైనా మనం సంవత్సరానికొకసారి అయినా కలుస్తాం!" అన్నాడు. మేము సరే అన్నాం. 1990లో మా అమ్మగారు స్వర్గస్థులయ్యారు. తరువాత తల్లిగారి పితృకార్యంతో కలిపి, నిన్న మొన్నటి వరకూ రెండు తద్దినాలూ నిర్వహిస్తూనే ఉన్నాం; సంవత్సరానికి రెండుసార్లు అన్నదమ్ములం నలుగురూ తణుకులో కలుస్తూనే ఉన్నాం.

ఇక్కడ మా కుటుంబంలో ఉన్న ఒక సెంటిమెంటును గురించి మా అన్నయ్య పదే పదే చెప్పేవాడు. (మా అన్నయ్యకు సెంటిమెంట్సు ఏమీ లేకపోయినా, మా కుటుంబంలో మా తాతగారి కాలంలో జరిగిన ఒక దుస్సంఘటను చెప్పి, దానిని ఒక సెంటిమెంటుగా పాటించమని మాకు చెప్పేవాడు.) "మన జగ్గన్నతాతకి 60 ఏళ్ళు నిండగానే షష్టిపూర్తి జరుపుకుందామని అన్ని ఏర్పాట్లూ చేసుకున్నాడు. 60

ధోవతులు, 60 కండువాలు, 60 చెంబులు మొదలైనవన్నీ కొని సిద్ధంగా ఉంచుకున్నాడు. వెంటనే ఆయన అన్నగారు ఎగ్గెన్నశాస్త్రిగారు జబ్బుతో ఉన్నారని కబురు వచ్చింది. రేలంగి పరుగెత్తాడు. నాలుగు రోజుల్లో ఆయన అన్నగారు చనిపోయాడు. కాబట్టి మనం ఎవ్వరమూ షష్టిపూర్తులు, పుట్టినరోజులు జరుపుకోకూడదు!" అని తమ్ముళ్ళు ముగ్గుర్నీ హెచ్చరించాడు. ఆయన మాట ప్రకారం మేము షష్టిపూర్తులు పుట్టిన రోజులు జరుపుకోలేదు. కాని నేను, మా బుల్లి తమ్ముడు 70, 80, 82 సంవత్సరాల జన్మదినాలు జరుపుకొని, వాటి దుష్ఫలితాలు అనుభవించాము! సెంటిమెంటు అనేది ఒక్కొక్కసారి చాలా బలంగా పనిచేస్తుందని గ్రహించాను.

నేను 1935లో పుట్టాను. 1995లో షష్టిపూర్తి జరుపుకోవాలి; కాని మాతాతగారి సెంటిమెంట్‌వల్ల జరుపుకోలేదు. నా కవిమిత్రులందరూ నన్ను గురించి కవితలు వ్రాశారు. వాటిని ముద్రిస్తే ఏం కొంపలంటుకుంటాయో అని ముద్రించలేదు. తరువాత 10 ఏళ్ళకు - 2005లో నా మిత్రులంతా కలిసి నాకు "సప్తతిపూర్తి" జరిపారు. అంతే! సంవత్సరం తిరగకుండా మా ఆవిడ చనిపోయింది! నేను మళ్ళీ సిగ్గులేకుండా 2015లో "అశీతిపూర్తి" - 2016లో "సహస్ర పూర్ణచంద్ర దర్శనోత్సవం" జరుపుకున్నాను; 50 మంది కవిపండితులను సత్కరించాను; వందమంది మిత్రులకు విందు ఇచ్చాను. మరుసటి సంవత్సరం (2017లో) నాకు సోడియం లెవల్ తగ్గిపోయి, స్పృహ కోల్పోయి, 10 రోజులు ఆసుపత్రి పాలయ్యాను. ఎంతో కష్టం మీద బ్రతికి బట్టకట్టాను. మా బుల్లితమ్ముడు కర్నల్ కృష్ణమూర్తి 2020 డిసెంబరు 16వ తేదీని తన 82వ జన్మదినాన్ని 82 స్వీట్స్‌తో ఘనంగా జరుపుకున్నాడు. మూడు నెలలు గడవగానే వాడికి వాళ్ళబ్బాయికి కూడా కరోనా సోకి, నెలరోజులపాటు నానా అవస్థలూ పడి, ఎంతో కష్టపడి భగవంతుడి దయవల్ల గట్టెక్కారు! మరో మూడు నెలలు దాటగానే, ఆరోగ్యంగా హాయిగా పిడిరాయిలా ఉన్న మా అన్నయ్య కామెర్లపాలై చనిపోయాడు. మా పెద్దబ్బాయి చి॥ కాళిదాసు 2017లో, నేను 'వద్దురాబాబూ!" అని మొత్తుకుంటున్నా నా మాట వినకుండా, షష్టిపూర్తి జరుపుకొన్నాడు. ఏవేవో హోమాలు చేయించాడు. మరుసటి సంవత్సరమే 2018లో మా రెండవ అబ్బాయి రామయ్య చనిపోయాడు. కాబట్టి నేను సెంటిమెంట్సును గట్టిగా నమ్ముతాను.

మా గురువుగారు ప్రొ॥ జి.యన్.రెడ్డిగారి యింట్లో ఆవులు బ్రతకవు. ఇది తరతరాలుగా వస్తున్న కుటుంబ విశ్వాసం. "ఆc! ఇది వట్టి మూఢనమ్మకం!" అని

అభ్యుదయ భావాలు కలిగిన మా గురువుగారు నాలుగు మంచి ఆవుల్ని కొని సాకడం మొదలు పెట్టారు. కొంతకాలం గడవగానే ఆ నాలుగు ఆవులూ చచ్చి ఊరుకున్నాయి! ఈ విషయం ఆయనే నాతో స్వయంగా చెప్పారు.

సంస్కృతాంధ్రాలలో ప్రసిద్ధ పండితుడు, కవి, బహుగ్రంథకర్త అయిన ఆచార్య బేతవోలు రామబ్రహ్మంబావగారు ఎవరికైనా తన గ్రంథాన్ని అంకితం చేస్తే ఇక అంతే సంగతులు! ఆ కృతిస్వీకర్త ఠఫీమని ఎగిరిపోతాడు! అందువల్ల రామబ్రహ్మంగారు తన రచనల్ని చనిపోయినవారికి మాత్రమే అంకితమిస్తూ వుంటారు. ఈ విషయం తెలియక నేను ఒకసారి "మీ రచన ఏదైనా నాకు అంకితమివ్వండి" అని అడిగితే రామబ్రహ్మంగారు ఏ ధోరణిలో ఉన్నారో "సరే!" అన్నారు. వెంటనే వారి ధర్మపత్ని శ్రీమతి సర్వలక్ష్మిగారు భయంకరమైన ఆ సెంటిమెంటును భర్తకు గుర్తు చేశారు. ఆయన "మీకు అంకితం ఇవ్వడం కుదరదు!" అని కుండబ్రద్దలు కొట్టి చెప్పారు. నేను హడలిపోయి "బ్రతుకు జీవుడా!" అని ఆ ప్రమాదంనుండి బయటపడ్డాను. ఇలాంటివి నాకు తెలిసిన సెంటిమెంట్లు ఎన్నో ఉన్నాయి.

**15. గొప్ప వేదాంతి – జ్ఞాని – యోగిపుంగవుడు:–**

నిర్మొహమాటంగా, ఉన్నదున్నట్టుగా మాట్లాడేవాడు మా అన్నయ్య. ఎప్పుడూ శ్రీకృష్ణపరమాత్మలాగ, శంకరాచార్యులవారిలాగ, సోక్రటీసులాగ, అరిస్టాటిల్‌లాగ, మాట్లాడేవాడు. దీనికి కొన్ని ఉదాహరణాలు ఇస్తాను:– (1) తణుకులో మా అన్నయ్య ప్రాణమిత్రుడు, న్యాయవాది, సాహిత్య రసికుడు అయిన నల్లమిల్లి చినవీర్రెడ్డిగారు (M.A. LL.B) మరణశయ్యమీద ఉన్నారు. వారి స్వగ్రామంనుండి వారి తమ్ముడు వచ్చి, అన్నను కౌగిలించుకొని భోరున ఏడ్చాడు. చినవీర్రెడ్డిగారు కూడా ఏడ్చారు. అప్పుడు మా అన్నయ్య అక్కడే ఉన్నాడు. వారిని చూచి: "అయ్యా! రెడ్డిగారూ! ఏడవకండి. మీరు నిశ్చింతగా, హాయిగా, ఆనందంగా చనిపోండి!" అని ధైర్యం చెప్పాడు. మరణం చాలా సహజమైనదని, అది ఎప్పటికైనా తప్పనిదని, దానికి దుఃఖించకూడదని మా అన్నయ్య అభిప్రాయం. భగవద్గీతను నరనరాన జీర్ణించుకున్నవాడు మా అన్నయ్య!

2006లో మా ఆవిడ శకుంతలాదేవి ("భళ్ళమూడివారి చిట్టి") చనిపోయి నప్పుడు నేను మిక్కిలిగా క్రుంగిపోయి దుఃఖిస్తున్నాను. అప్పుడు మా వియ్యంకుడు ప్రొ॥ సి. గంగప్పగారు వచ్చి నన్ను ఓదారుస్తూ ఒక గొప్ప మాట అన్నారు; చాలా గొప్ప మాట! మరణ రహస్యము, మరణసత్యము ఆ మాటలో ఇమిడి ఉన్నాయి:

“This will happen one day! That happened today!” (ఇది ఏదో ఒక రోజున తప్పక జరిగి తీరుతుంది! అది ఈ రోజున జరిగింది! అంతే!). ఈ మాటను నేను ఎప్పటికీ మరిచిపోలేకుండా ఉన్నాను. ఎవరు మరణించినా సరే చటుక్కున మా వియ్యంకుడి మాట జ్ఞాపకం వస్తోంది. మా అన్నయ్య చనిపోయినప్పుడు ఈ మాటతోనే మా తమ్ముళ్ళను ఓదార్చాను.

2006లో మా ఆవిడ చనిపోయినప్పుడు మా అన్నయ్య నాకు ఒక లేఖ వ్రాస్తూ “మీ ఆవిడ చనిపోయింది కాబట్టి – Now, Yor are a free bird!” అని అన్నాడు. ఆయనకు కూడా అలా “free bird” లాగ కనీసం రెండేళ్ళయినా బ్రతకాలని తీవ్రమైన కోరిక మనసులో ఉండేది. ఆ కోరికను నా దగ్గర చాలాసార్లు వెలిగ్రక్కాడు కూడా. కాని మా వదినెగారి కన్నా ఆయనే ముందుగా వెళ్ళిపోయాడు. ఆయన కోరిక తీరనేలేదు! చావు అనేది మన నిర్ణయం కాదు; భగవంతుని నిర్ణయం!

(2) 2002లో నాకు heart attack వచ్చింది. Angioplasty చేయించుకొని ఒక stent పెట్టించుకున్నాను. అయినాసరే చచ్చిపోతానని భయపడుతూ ఉండేవాడిని. ఆ సమయంలో మా అన్నదమ్ములు నన్ను చూడటానికి బెంగుళూరు వచ్చారు. అప్పుడు మా అన్నయ్య నాతో “ఒరేయ్! ఇప్పుడు నువ్వు చచ్చిపోవడానికి నీకు అభ్యంతరం ఏమిటిరా?” అని చాలా blunt గా ప్రశ్నించాడు. నేను: “అయ్య బాబోయ్! నాకు చాలా అభ్యంతరం ఉంది. నేను ఐదు సంవత్సరాలు (1963–68) కష్టపడి, తెలుగు వీరగాథలనుగురించి పరిశోధన చేసి, 1500 పుటల సిద్ధాంతగ్రంథం వ్రాశాను. దానిని ఇంతవరకూ పూర్తిగా ముద్రించలేకపోయాను. దానిని ముద్రిస్తేనే కాని నేను చనిపోకూడదు – అని అనుకుంటున్నాను!” అన్నాను. “అయితే సరే! నీకు నేను 25 వేల రూపాయలు ఇస్తాను, తీసుకో! నీకు దేశంలో తెలుగు సాహిత్యరంగంలో చాలా మంచి పేరుంది. నీ మిత్రుల్ని, శిష్యుల్ని అడుగు. నీకు 10 లక్షల రూపాయలకు తక్కువ కాకుండా విరాళాలు వస్తాయి. దానితో నీ పుస్తకం ముద్రించుకో!” అని, ఇంటికి వెళ్ళి నాకు 25 వేలరూపాయలు పంపించాడు. మా అన్నయ్య అమోఘవాక్కు ఫలించి నా బంధుమిత్రులు, శిష్యులు చాలా విరాళాలు అందజేశారు. అప్పుడు 5 లక్షల రూపాయలు ఖర్చుచేసి, మొత్తం గ్రంథం అంతా, ¼th డెమీ సైజులో, బాపుగారి ముఖచిత్రంతో, వేయి పుటలలో, అనేక ఛాయాచిత్రాలతో “తెలుగు వీరగాథాకవిత్వం” అనే నా సిద్ధాంత గ్రంథాన్ని సమగ్రంగా, సర్వాంగ సుందరంగా 2013లో ముద్రించాను. నా మనస్సు ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అయిపోయింది! ఆ తర్వాత నన్ను

చూచినప్పుడల్లా మా అన్నయ్య: "ఒరేయ్! నీ ముఖంలో ఇప్పుడు గొప్ప సంతృప్తి కనపడుతోందిరా!" అని ఆశీర్వదించేవాడు.

(3) 1968లో మా నాన్నగారు తన 60వ ఏట తణుకులో చనిపోయారు. శ్మశానానికి వెళ్ళి దహనసంస్కారం పూర్తిచేసుకొని, గోస్తనీనదిలో స్నానంచేసి, యింటికి వచ్చాం. భోజనాలు చేసి కూర్చున్నాం. అప్పుడు మా అన్నయ్య మాతో: "ఒరేయ్! Next turm నాదిరా!" అన్నాడు గొప్ప సత్యాన్ని ఆవిష్కరిస్తూ పెద్ద వేదాంతిలా!

(4) రాజమండ్రిలో ఉండే మా చిన్నక్కయ్య ("చెల్లక్క") పెద్దకొడుకు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో M.Sc. (Geology) చదువుతూ టి.బి. వచ్చి చనిపోయాడు. చెట్టంత కొడుకు, చేతికి అందివస్తాడనుకున్నవాడు హఠాత్తుగా చనిపోవడంతో మా చిన్నక్కయ్య చాలా క్రుంగిపోయింది. కొడుకు పోయాడు కాబట్టి పుట్టింటికి పిలిచి బట్టలు పెట్టాము. అప్పుడు మా చిన్నక్కయ్య మా అన్నయ్యతో "ఏమిఁట్రా అబ్బాయ్! ఇలా జరిగింది?" అని ఎంతో బాధతో అడిగింది. వెంటనే మా అన్నయ్య: "అక్కయ్యా! మనం రాజమండ్రినుంచి వస్తూవుంటే మన తణుకు రైల్వేస్టేషన్‌లో – రెండు కాళ్ళూ తెగిపోయి, చెక్కబండిమీద ధైర్యంగా తిరుగుతూ, హాయిగా నవ్వుతూ, అందరినీ పలకరిస్తూ ముష్టి ఎత్తుకుంటున్న బిచ్చగాడిని చూచావు కదా! అలాగే బ్రతకాలి నువ్వు కూడా!" అన్నాడు. తన పెద్ద కూతురు శ్రీమతి సీతామహాలక్ష్మి రెండవ కొడుకును ప్రసవించే సమయంలో అధికరక్తస్రావంతో చనిపోయినప్పుడు కూడా మా అన్నయ్య ఎంతో ధైర్యాన్ని ప్రదర్శించాడు.

### 16. మా అన్నయ్య కవితాశక్తి:-

2000 సంవత్సరంలో "తెలుగు వీరగాథా కవిత్వము" మొదటి సంపుటం మా అన్నదమ్ములకు అంకితమిచ్చినప్పుడు, ఆ గ్రంథావిష్కరణ సమయంలో నన్ను ఆశీర్వదిస్తూ మా అన్నయ్య చెప్పిన ఆణిముత్యాలవంటి మూడు పద్యాలు:-

**ఉ. కాలము కాటువేయగ, వికాసము కోల్పడి, కొన్ని నాల్కలన్**
**జాలిగ నిల్చి, ఆంధ్రుల యశస్సులు పాడఁగ శక్తిలేని "గా**
**థాళి"కి జీవమిచ్చితివి! మహాద్భుత రూపము దిద్దినావు! ఆం**
**ధ్రాళియె అప్పువడ్డది సుమా! భవదీయ విశిష్ట సేవకున్!**

**శా. ఎన్నో యేండ్లు శ్రమన్ మునింగితివి, నీవీ "వీరగాథాళి"కై**
**ఎన్నో కష్టములంది, సేకరణకై ఇంటింట మార్మూలలన్**

**ఎన్నో బాధలు కూడుగా కుడిచి, మా కీనాఁడు నీ కష్ట మ**
**న్నన్నా! పాలుగ పంచిపెట్టితివి, వహ్వా! ఎంత సౌభ్రాత్రమో!**

**ఉ. అంతములేని యీ కృషి మహత్తర దీక్షగ చేసి, క్రొత్త సి**
**ద్ధాంతము నిల్పి, ముద్రణ విధానపు బంగరు పూతవెట్టి, ర**
**వ్వంతయు నీకు తోడ్పడని అన్నకు - తమ్ముల కిచ్చినావు! నీ**
**యింతటి పిచ్చిప్రేమ కివె యిచ్చెద వేనకు వేలు దీవనల్!**

**ఇట్లు**

**నన్నయ భట్టారక పీఠము** **ఆశీస్సులతో-అన్న:టి.వి.కె. సోమయాజులు**
**తణుకు** **అభివాదములతో తమ్ముళ్లు:**
**15-08-2008** **తంగిరాల భాస్కరరావు**
**తంగిరాల కృష్ణమూర్తి**

కవిత్వం వ్రాయడంలో మా అన్నయ్యకు ధారాశుద్ధి మిక్కిలి ముఖ్యం. అందువల్లనే ఆయనకు ద్రాక్షాపాకంలో ప్రసన్నంగా సాగే నన్నయ, పోతన,పెద్దన, తిమ్మన, చేమకూర, తిరుపతి వేంకటకవులు, గుఱ్ఱం జాషువా, జంధ్యాల పాపయ్యశాస్త్రిగారల పద్యాలు ఎంతో ఇష్టం. "కవిత్వం వ్రాస్తుంటే యతిప్రాసలకోసం తడుముకోకూడదురా! కవి, యతి ఎక్కడ వేశాడో తెలియకూడదు. యతిస్థానం స్పష్టంగా తెలిసిపోకుండా పదాల్లో కలిసిపోవాలి. కుట్టుకనబడకుండా విస్తరి కుట్టాలిరా!" అనేవాడు నాతో. ఆయన పద్యం వ్రాస్తే ఇలా "యతుల కుట్లు" కనబడేవికావు! కవిత్వాంశం ఏకోశానా లేకుండా, గణాలు మాత్రం కిట్టించి పద్యాలు వ్రాస్తే, దానిని "గణాచారి కవిత్వం" అని ఆక్షేపించేవాడు. ఒకసారి నా మిత్రులు, I.A.S. Officer శ్రీ బుల్లా సుబ్బారావుగారు తాను లండన్ వెళ్ళినప్పుడు అక్కడినుండి కొని తెచ్చిన ఒక అందమైన చేతికఱ్ఱను మా అన్నయ్యకు బహూకరించారు. వెంటనే మా అన్నయ్య ఆశువుగా-

**"బుల్లా సుబ్బారాయా!**
**చల్లగ వర్ధిల్లుమయ్య సరసవిధేయా!"**

-అన్నాడు అలవోకగా! ఇది కందపద్యంలోని ఉత్తరార్ధం రెండు పాదాలు. పూర్వార్ధంలోని మరో రెండు పాదాలు తరువాత పూరించాడు:-

**క॥ అల్లా ఏహోవ రాములు**
**ఎల్ల శుభంబుల నొసంగి ఎప్పుడు బ్రోవన్**

**బుల్లా సుబ్బారాయా!**

**చల్లగ వర్ధిల్లుమయ్య సరసవిధేయా!"**

మా అమ్మను గురించి, మా నాన్నను గురించి రెండు మంచి వ్యాసాలు ("మాతృదేవోభవ" – "పితృదేవోభవ") వ్రాయడమే కాకుండా, రెండు రసవంతమైన పద్యాలు కూడా చెప్పాడు మా అన్నయ్య:–

## మా అమ్మ

సీ॥ **"నారు పోసినవాఁడె నీరు పోయు" నటంచు**

**నమ్మి గెల్చిన యామె "అమ్మ" మాకు!**

**"దిక్కెఱుంగనివేళ దేవుఁడే దిక్కు"ని**

**నమ్మి నెగ్గిన తల్లి "అమ్మ" మాకు!**

**"పేదఱికంబను బెబ్బులిపోరు"లో**

**అలుపెఱుంగని యామె "అమ్మ" మాకు!**

**అన్ని చెంబులు భిక్షకై దాఁచి, చదివించు**

**ధర్మమెఱిఁగినమ్మ "తల్లి" మాకు!**

ఆ॥ **దైవభక్తి – ఓర్పు – ధైర్యమ్ము – పొదుపును**

**నీదు రూపమమ్మ మాదు తల్లి!**

**"ఓర్చినట్టివేళ తేర్చిననీర"ని**

**నమ్మి, మంచి చూచినావు తల్లి!!**

## మా నాన్న

ఉ॥ **ఆతఁడసంగజీవి! మధురామృతమేదొ, విషమ్మదేదొ, తే**

**డా తెలియంగలేడు! కపటమ్ము నెఱుంగడు! మాయయున్ దగా**

**చేతులు కల్పనట్టి రససిద్ధిని పొందిన యోగిపుంగవుం**

**డాతఁడు! వాని కంకితము హాయిగఁ జేసెద దైవవాక్కులన్!**

(నేను రచించిన "భగవద్గీతా ప్రబోధము"ను మా నాన్నకు
అంకితం చేస్తూ వ్రాసిన పద్యం)

మా నాన్నగారిని గురించి వ్రాసిన పై పద్యంలో మా అన్నయ్య తనకు మిక్కిలి యిష్టమైన కవి "రసరాజు" గారిని అనుకరించాడు. రసరాజుగారు తమ "రసభారతి"

కవితాసంపుటిలో "భగ్నజీవి" అనే పేరుతో ఒక పిచ్చివానిని గురించి సరిగ్గా ఇలాంటి పద్యమే వ్రాశారు.

రసరాజుగారిలాగ పద్యాలు వ్రాయాలని మా అన్నయ్య పట్టుదల, ధ్యేయం. 1988లో తూర్పు గోదావరి జిల్లా - ఆలమూరు జూనియర్ కళాశాలలో ఉద్యోగవిరమణ చేసినప్పుడు తనకు వీడ్కోలు చెపుతున్న మిత్రులకు పద్యాలలో కృతజ్ఞతలు చెప్పాడు. ఆ పద్యాలు సరిగ్గా రసరాజుగారి పద్యాలలాగ వచ్చాయని ఎంతో సంతోషపడ్డాడు. ఈ విషయం రసరాజుగారు రచించిన "మేఘరంజని" కావ్యానికి తాను వ్రాసిన పీఠికలో స్పష్టంగా తెలియజేశాడు. ఆ వీడ్కోలు పద్యాలలోని ఒక పద్యం:-

**చ॥ సరస వచస్విగా నను విశాల హృదంతరమందు నిల్పి, పె**
**ద్దరికమునిచ్చి, ఆదర సుధారస మిచ్చి, హృదంతరంబులో**
**చెరుగని ముద్రవేసిన విశిష్టతగాంచిన మిత్రులార! నే**
**మరువగలేను మీ మధురమైత్రిని జన్మము లెన్ని మారినన్!**

మా అన్నయ్య పశ్చిమగోదావరిజిల్లాలోను, కృష్ణాజిల్లాలోను ఎన్నో పట్టణాలలో, గ్రామాలలో ఉద్యోగాలు చేశాడు. రిటైరయ్యేముందు తూర్పుగోదావరిజిల్లా 'ఆలమూరు' జూనియర్ కళాశాలలో పనిచేశాడు. కాని ఆయనకు తణుకులో లభించిన మనశ్శాంతి ఎక్కడా లభించలేదు. ఇక్కడున్నటువంటి గొప్ప మిత్రులు ఎక్కడా లేరు. తణుకంటే మా అన్నగారికి పంచప్రాణాలు! అటువంటి తణుకును గురించి ఒక చక్కటి సీసపద్యం వ్రాశాడు:-

**సీ॥ ఏ పట్టణము చుట్టు నేపార ప్రవహించు**
**గోక్షీరధారల "గోస్తని" నది,**
**ఏ పురంబునయందు ఎందరో పండిత-**
**వర్యులుండిరి వేదవాదరతులు,**
**ఏ మహానగరాన ఎందరో గాంధీయ-**
**వాదులుండిరి దేశభక్తిపరులు,**
**ఏ పుణ్యపురమున కీశాన్య దిశయందు**
**యజ్ఞంబు జేసె నన్నయ్యభట్టు,**

**తే॥ అట్టి తణ్కునివాస భాగ్యంబు గనుట**
**పూర్వజన్మ సమార్జిత పుణ్యఫలము-**
**గాగ తలపోసి, వినమిత గాత్రులగుచు**
**అంజలి ఘటింపుడయ్య మహాత్ములార!**

## 17. మా అన్నయ్య చెప్పిన కథలు:-

మా అన్నయ్య నాకు ఎన్నో కథలు చెప్పాడు. ఇవి కాకుండా తాను రచించిన "సత్యసందర్శనం" (2010) - "జ్ఞానతరంగాలు" (2017) - "భగవద్గీతా ప్రబోధము" (2018) అనే మూడు గ్రంథాలను కేవలం పలు వేదాంతకథల ఆధారంగానే వ్రాశాడు. ఈ కథలు సుమారు నూరుకుపైగా ఉన్నాయి. మా అన్నయ్య చెప్పిన కథలను మూడు వర్గాలుగా వీడదీయవచ్చును. (1) యథానికలు - (2) కవితాకథానికలు - (3) వేదాంతకథానికలు.

### 17.1 యథానికలు:-

ఇవి కల్పితమైన కథానికలు కావు; యథార్థంగా జరిగిన సంఘటనలు; యథానికలు. వాటిలో మనం తెలిసికోవలసిన నీతి ఎంతోఉంది. కొన్ని ఉదాహరిస్తాను.

### 17.1.1 జమీందారుగారి ఔదార్యం:-

కృష్ణాజిల్లాలో "తోట్ల వల్లూరు"లో ఒక జమీందారుగారు ఉండేవారు. ఆయనకు కొన్ని వందల ఎకరాల భూమి ఉండేది. ఆయన మిక్కిలి దయాళువు. తన పొలాల్లో పనిచేసే దళితకూలీల పేదరికాన్ని చూచి మిక్కిలి చలించిపోయాడు. వాళ్ళల్లో ఒక్కొక్క కుటుంబానికి మూడేసి ఎకరాల పొలం చొప్పున వ్రాసి ఇచ్చేశాడు. "ఒరేయ్! మీరింక నా పొలాల్లో కూలీలుగా పనిచేయవద్దు. నేనిచ్చిన మూడెకరాల పొలం దున్నుకొని హాయిగా బ్రతకండి!" అని శాసించాడు. అందరూ ఎంతో సంతోషించి వెళ్ళిపోయారు. కాని ఐదారేళ్ళు గడిచే సరికి అందరూ మళ్లీ కూలీలుగా మారి, ఆయన పొలంలో పనిచేయడానికి వచ్చారు. ఆయన ఆశ్చర్యపోయాడు! వాళ్ళందరూ జమీందారుగారు తమకిచ్చిన పొలాలను కమ్మమోతుబరి రైతులకు అమ్మివేసి, ఆ డబ్బుతో తాగి తందనాలాడి, మళ్ళీ పేదవాళ్ళుగా మారిపోయారు. నీతి: ఈ దేశంలో పేదరికాన్ని పోగొట్టడానికి కారల్ మార్క్సులే కాదు, ఆ బ్రహ్మదేవుడే దిగివచ్చినా ఏమీ చేయలేడు!

### 17.1.2 డాక్టరమ్మ ఆత్మహత్య:-

ఒకప్పుడు గుడివాడ ప్రభుత్వ ఆసుపత్రిలో ఒక డాక్టరమ్మ పనిచేస్తూ

ఉండేది. ఆమె యువతి, సౌందర్యవతి, అవివాహిత. రోజూ ఆసుపత్రికి నడిచివస్తూ ఉండేది. దారిలో ఒక మంగలిషావు ఉంది. దానిని ఒక యువకుడు నడుపుతున్నాడు. ఎలా పడిందో ఈ యువడాక్టరమ్మగారు వాడి వలలో పడింది. కాని వాడు యోగ్యుడు కాదు; త్రాగుబోతు; చదువుసంధ్యలు లేవు; అనాగరికుడు. తనకు లోబడిన డాక్టరమ్మ వాడికి బాగా లోకువ అయిపోయింది. ఆమెను హింసించేవాడు; కొట్టేవాడు; తిట్టేవాడు; డబ్బుకోసం పీడించేవాడు. తాగి ఆసుపత్రికి వచ్చి అందరిముందూ అల్లరి చేసేవాడు. ఈ అవమానాలు భరించలేక, ఆమె ఒళ్ళు అంటించుకొని ఆత్మహత్య చేసుకుంది! నీతి: విద్యావంతులైన యువతులు సకాలంలో యోగ్యుడైన, విద్యావంతుడైన వరుణ్ణి చూచుకొని పెండ్లి చేసుకోవాలి. లేకపోతే జీవితంలో తప్పటడుగులు పడతాయి!

### 17.1.3 కృతఘ్నుడైన అన్నగారి కథ:-

తణుకులో ఇద్దరు అన్నదమ్ములుండేవారు. అన్నగారు పేదవాడు; భార్య చనిపోయింది; పిల్లలు సరిగా చూడటంలేదు; బ్రతకడం కష్టంగా ఉంది. తమ్ముడు హైదరాబాదులో పెద్ద ఉద్యోగంలో ఉన్నాడు; లక్షకు పైగా జీతం వస్తుంది. అన్నగారంటే మిక్కిలి భక్తి. దిక్కులేకుండా తణుకులో పడి ఏడుస్తున్న అన్నగారిని తీసికొని వెళ్ళి హైదరాబాదులో తన దగ్గర ఉంచుకున్నాడు. అన్న అక్కడ హాయిగా కాలం గడుపుతున్నాడు. వాడు అక్కడ బుద్ధిగా ఉండవచ్చును కదా! లేదు; ఒక రోజు ఏకాంతంగా ఉన్న మరదలి చెయ్యి పట్టుకున్నాడు! ఆ ఘోరమైన తప్పును కూడా తమ్ముడు సహించాడు. “అన్నయ్యా! నువ్వు తణుకు వెళ్ళిపో! నీకు నెల నెలా కొంత డబ్బు పంపుతూ ఉంటాను” అని చెప్పి తణుకు పంపించేశాడు. నెలనెలా 10 వేల రూపాయలు పంపుతున్నాడు. తమ్ముడు చేస్తున్న సహాయానికి బంధుమిత్రులందరూ ప్రశంసించారు. ఒక రోజున ఆ కుటుంబానికి మిత్రుడైన ఒక వ్యక్తి హైదరాబాదు నుండి తణుకు వచ్చాడు. ఆ అన్నను పరామర్శిస్తూ: “మీ తమ్ముడు మీకు ఎంతో సహాయం చేస్తున్నాడు. అటువంటి మంచి తమ్ముళ్ళు ఈ కాలంలో ఉండరు!” అన్నాడు. అంతే! ఆ అన్న అగ్గిమీద గుగ్గిలమైపోయి: “ఏంవిటండీ! బోడిసహాయం! వాడికి రెండు లక్షలు జీతం వస్తోంది. నాకు 10 వేలేనా పంపేది?” అని కస్సుమన్నాడు. ఆ బంధువు షాకైపోయాడు: “వీడు విషసర్పం లాంటివాడు. దీనికి పాలుపోసి పెంచకూడదు!” అని మనసులో నిర్ణయించుకొని, హైదరాబాదు వెళ్లి తమ్మునితో: “మీ అన్న కృతఘ్నుడు. నాతో ఇలా అన్నాడు. వాడికి నువ్వు ఏమీ సహాయం చెయ్యవద్దు!” అని గట్టిగా చెప్పి, తమ్ముడు పంపే డబ్బును నిలిపి వేయించాడు. నీతి:

అయోగ్యులైనవారు, దురహంకారులు, కృతజ్ఞత ఏ కోశానా లేనివారు తమనోట్లో తామే మన్ను కొట్టుకుంటారు!

## 17.1.4 కన్నకొడుకును చంపడానికి ప్రయత్నించిన తల్లి:–

కృష్ణాజిల్లాలో ఒక ఊళ్ళో బాగా ఆస్తిపరురాలైన ఒక స్త్రీ ఉండేది. ఆమెకు చిన్నతనంలోనే భర్తపోయాడు. అప్పటికే ఆమెకు ఒక కొడుకు ఉన్నాడు. ఆ కొడుకు బాగా చదువుకుని పెరిగి పెద్దవాడై మెడిసిన్ చదివి అమెరికా వెళ్ళి అక్కడ ఉద్యోగం చేస్తున్నాడు. మంచి యౌవనంలో ఉండగా భర్త పోవడంవల్ల, ఆమె ఇంకొక వ్యక్తితో సంబంధం పెట్టుకొంది. అతనిని గాఢంగా ప్రేమించింది. తన ఆస్తినంతా ఆ రంకుమగడికి ఇచ్చివేయడం కోసం, అతడితో కలిసి, కన్నకొడుకును చంపడానికి ప్రయత్నించింది. కాబట్టి "కన్నతల్లి తన బిడ్డలకోసం ఎంతైనా త్యాగం చేస్తుంది" అనేది ఎల్లవేళలా సత్యంకాదు. మా అమ్మగారు ఒక సామెత చెపుతూ ఉండేవారు. రంకుమగడు వస్తూంటే వాడికి కాళ్ళకి బురద అంటుకుంటుందని కన్నబిడ్డని నేలమీద పడుకోబెట్టిందట ఒక కులట!

## 17.1.5 "పుత్రగాత్ర పరిష్వంగ సుఖం:–

కృష్ణాజిల్లాలో ఒక కమ్మ మోతుబరిరైతు ఉండేవాడు. బాగా ఆస్తిపరుడు. మా అన్నయ్యగారికి ప్రాణమిత్రుడు. ఆయనకు ఒకే ఒక కొడుకు. రెండు మూడు ఎకరాల పొలం అమ్మివేసి ఒక్కగానొక్క కొడుకును బాగా చదివించి, డాక్టరును చేసి, ఆపైచదువులకు అమెరికా పంపించి M.D.; D.M. కూడా చదివించి పెద్ద కార్డియాలజిస్టును చేయించాడు. అతడు తిరిగి ఇండియాకు రాగానే, తండ్రి హైదరాబాదులో బ్రహ్మాండమైన ఆసుపత్రి కట్టించి కొడుక్కి ఇచ్చాడు. అతడు అనతికాలంలోనే గొప్ప పేరు గడించాడు. తల్లిదండ్రులు మాత్రం పొలాలు చూసుకుంటూ పల్లెటూళ్ళోనే ఉండిపోయారు. కొంతకాలం గడిచింది. తమ ఏకపుత్రుణ్ణి చూసి చాలా కాలమయింది. ఇద్దరూ బెంగపెట్టుకున్నారు. ఒకరోజు కొడుక్కి తెలియజేసి హైదరాబాదు బయలుదేరారు. రైలుప్రయాణం చేస్తూంటే దారిలో తండ్రికి జ్వరం వచ్చింది. తల్లి తన దగ్గర ఉన్న ఒక మాత్ర ఇచ్చి వేసుకోమంది. తండ్రి "ఎందుకూ? అవసరం లేదు. కాస్సేపట్లో హైదరాబాదు చేరుకుంటాం కదా! మన అబ్బాయి పెద్ద డాక్టరు. వాడు నన్ను బాగా పరీక్షించి మంచి మందు ఇస్తాడు. వెంటనే తగ్గిపోతుంది" అన్నాడు. సికింద్రాబాద్ స్టేషన్‌లో ఇద్దరూ రైలు దిగారు. అబ్బాయి తన పెద్దకారు (క్యాడీల్యాక్) పంపిస్తాడని ఎంతో ఆశతో గంటసేపు ఎదురుచూశారు. (ఆరోజుల్లో

సెల్‌ఫోన్లు లేవు, గమనించాలి.) తర్వాత నిరాశచెంది, ఆటో చేయించుకొని అబ్బాయిగారింటికి వెళ్లారు. తండ్రికి జ్వరం తగ్గలేదు కొంచెం ఎక్కువయింది కూడా. కొడుకు తల్లిదండ్రుల్ని ఆప్యాయంగా పలకరించలేదు; తనపనిలో తానున్నాడు. తల్లి కొడుకుతో! "అబ్బాయ్! రైల్లో నాన్నగారికి జ్వరం వచ్చిందిరా! కొంచెం చూడు!" అంది. కొడుకు ఏమీ మాట్లాడలేదు; ఏమీ ఆదుర్దా పడలేదు. తండ్రిని ముట్టుకొని చూడలేదు. టిఫిన్ తిని ఆసుపత్రికి వెళ్ళిపోతూ తల్లితో: "కాంపౌండర్‌చేత మందు పంపిస్తాను. వేసుకోమను!" అని చెప్పి కారెక్కి వెళ్ళిపోయాడు. తండ్రి, తాను కష్టపడి చదివించిన తన ఒక్కగానొక్క "డాక్టరు కొడుకు" తనకు జ్వరం వచ్చిందని తెలిసి, ఆదుర్దాగా తన దగ్గరకు వచ్చి, తన శరీరాన్ని స్పృశించి, ఆప్యాయంగా పరీక్షించి, "ఫరవాలేదు నాన్నా! ఒక్క మాత్రతో తగ్గిపోతుంది!" అని ధైర్యం చెప్పి ఆదరిస్తాడని ఆశించాడు. అలా జరగపోవడంతో హతాశుడైపోయి, మనసులో కుమ్మర ఆవంలాగ కుమిలిపోయాడు. తన ఊరికి వచ్చాక ఈ విషయమంతా తన ఆప్తమిత్రుడైన మా అన్నయ్యతో చెప్పి ఎంతో బాధపడ్డాడు. మా అన్నయ్య: "అయ్యా! చౌదరిగారూ! ఏమీ బాధపడకండి! తండ్రిగా మీ బాధ్యత మీరు నెరవేర్చారు. అతన్ని గొప్పడాక్టరుగా చేశారు. కాని అతడు తన బాధ్యత నెరవేర్చడం లేదు. తల్లిదండ్రుల్ని ఎలా చూడాలో కూడా తెలియని, సంస్కారంలేని అనాగరకుడు! చదువుకున్న మూర్ఖుడు! ఏం చేస్తాం! 'నేను గొప్ప డాక్టర్ని కన్న తండ్రిని' అని గర్వించండి!" అని ఓదార్చాడు. (ఇది కథకాదు; నిజంగా జరిగిందని గమనింపప్రార్థన). నీతి: వేమనగారి ఆణిముత్యంలాంటి పద్యం:-

**ఆ॥ "తల్లిదండ్రి మీద దయలేని పుత్రుండు**
**పుట్టనేమి? వాడు గిట్టనేమి?**
**పుట్టలోన చెదలు పుట్టవా? గిట్టవా?**
**విశ్వదాభిరామ! వినుర వేమ!"**

### 17.1.6 "మృత్యువు" (కొల్లి రంగదాసుగారికథ):-

మా అన్నయ్య తన "సత్యసందర్శనం" అనే గ్రంథంలో వ్రాసిన వృత్తాంతాన్ని యథాతథంగా దిగువ ఇస్తున్నాను:-

"కృష్ణాజిల్లాలో కొల్లి రంగదాసుగారు అనే మహనీయుడు ఉండేవాడు. దండమూడి రాజగోపాలరావు, కామినేని ఈశ్వరరావు అనే కలియుగ భీములకు ఆయన గురువుగారు. ఆ రంగదాసుగారిని దర్శించాలనే కోరికతో, నేను వారి ఆశ్రయానికి

వెళ్లాను. ఉదయంవేళ వారు యోగాసనాలు వేస్తున్నారు. నేను యోగాసనాలలో సిద్ధహస్తుణ్ణి అనుకొనేవాడిని! వారు వేసే విధానం చూస్తే "నేను నేర్చుకోవలసింది చాలా ఉంది" అనుకొన్నాను. చక్కెరకేళీ అరటిపండ్లు - జామిపండ్లు నాకు పెట్టారు. "పద్ధతిగా జీవిస్తే మనిషి 120 ఏళ్ళు ఆరోగ్యంగా బ్రతుకవచ్చు!" అన్నారు. వారి శరీరాన్ని పట్టుకోవాలని అనిపించింది. వారి అనుమతితో వారి దండ పట్టుకొన్నాను. దండమీద కండలు తీర్చిదిద్ది ఉన్నాయి-గట్టితనంతో! గొప్పతనం, సాధన కన్పించింది. వారికి నమస్కరించి, వారిని, వారి శరీరాన్ని, వారు చెప్పిన మాటల్నీ తలచుకొనే వాడిని. 120 సం॥లు అన్నారు. కాని ఆయన చచ్చిపోవడానికి అవకాశమే లేదే! వ్యాయామనియమాలు, ఆహారనియమాలు అన్నీ కూలంకషంగా అర్థం చేసుకొంటూ, ఆచరిస్తూ, ప్రపంచప్రఖ్యాత బలాఢ్యుల్ని తయారుచేసిన మహనీయుడు! ఈయనకు ఏ రుగ్మతా రాదు! మరణం అసలే రాదు! శరీరానికి వ్యాధి రావాలి కదా! ఈయన శరీరానికి వ్యాధి రాదు! వార్ధక్య లక్షణాలు కూడా ఈయన్ను పట్టుకోవటానికి భయపడతాయి. ఈయనకు మృత్యువు రాదు - అనుకొనేవాణ్ణి.

ఒకరోజు పత్రికలో "కొల్లి రంగదాసుగారి దుర్మరణం" అని పెద్ద అక్షరాలలో, గుండె కొట్టుకుపోతూ ఉండగా చదివాను. వారు వానపాములనుండి విజయవాడ మోటారు సైకిలు మీద (రాయల్ ఎన్‌ఫీల్డ్) వెళ్ళుచుండగా, లారీ ఢీకొనడంతో అక్కడికక్కడే మరణించారు. వ్యాయామవిద్యలో ఆరితేరిన ధ్రువతార రాలిపోయింది! అప్పటికి వారి వయస్సు 68 సం॥లు అని చదివాను.

ఆరోగ్య నియమాలతో యుక్తాహార విహారాలతో, రోగాలు మన మీద పడకుండా చేసుకోవచ్చును. కాని మృత్యువును మాత్రం పుట్టినవాడెవ్వడూ తప్పించుకోలేడు! "*A day will come*!" మృత్యువు ఆయుఃప్రమాణాన్ని అనుసరిస్తుంది. కాని అది ఎప్పుడు వస్తుంది? ఎలా వస్తుంది? ఎక్కడ వస్తుంది? అనేదే అంతుపట్టదు. "తోలు క్రింద రాత దొంగరాత!" అది మనకు అర్థంకాదు!

## 17.2 కవితాకథానికలు:-

ఇవి ఒక ప్రసిద్ధ శ్లోకానికో లేక పద్యానికో నేపథ్యంగా ఉండే చిన్న చిన్న కథలు.

### 17.2.1 కవిత్వం వ్రాయడానికి ఎవడు పనికి వస్తాడు?

కవిత్వం వ్రాయడానికి సహజమైన ప్రతిభ ఉండాలి కాని, తెచ్చిపెట్టుకున్న పాండిత్యం పనికిరాదని చెపుతూ మా అన్నయ్య నాకొక చక్కని కథ చెప్పాడు.

ఒక ఆశ్రమంలో ఒక గురువుగారున్నారు. ఆయన దగ్గర ఇద్దరు శిష్యులు పంచకావ్యాలు పూర్తిచేశారు. పంచకావ్యాలంటే కాళిదాసు "రఘువంశం, కుమార సంభవం, మేఘసందేహం"; భారవి "కిరాతార్జునీయమ్"; మాఘుని "శిశుపాలవధ". ఇవి చదువుకొనేసరికి వాళ్ళిద్దరికీ కవిత్వం వ్రాయాలనే కుతూహలం పుట్టింది. ఇద్దరూ గురువుతో: "అయ్యా! గురువుగారూ! మేము కూడా కవిత్వం వ్రాయాలని అనుకుంటున్నాం. మీ ఆశీస్సులు కావాలి!" అన్నారు. అప్పుడు గురువు వాళ్ళకొక పరీక్ష పెట్టాడు. ఆశ్రమానికి ఎదురుగా ఎండిపోయిన ఒక చెట్టును చూపించి – "ఒరేయ్! మీరిద్దరూ ఆ చెట్టును వర్ణించండిరా?" అని ఆజ్ఞాపించాడు. మొదటి శిష్యుడు: "శుష్కో వృక్ష స్తిష్ఠత్యగే..." అంటూ శ్లోకం చెప్పాడు. రెండవ శిష్యుడు: "నీరస తరురిహ – నివసతి పురతః..." అంటూ శ్లోకం అల్లాడు. మొదటి శిష్యుని కవిత్వంలో అనుష్టుప్ ఛందస్సు సరిపోయినా కరుస్తున్నట్టుగా కర్ణకఠోరంగా ఉంది. రెండవ శిష్యుని కవిత్వంలో శబ్దలాలిత్యం, అక్షరరమ్యత ఉండటంచేత కర్ణపేయంగా ఉంది. రెండు శ్లోకాలూ విన్న గురువుగారు మొదటి శిష్యునితో: "నువ్వు కవిత్వం వ్రాయడానికి పనికిరావు; శాస్త్రాలు చదువుకో ఫో!" అన్నారు. రెండవ శిష్యునితో: "నాయనా! భవిష్యత్తులో నీవు మంచి కవివి అవుతావు. కావ్యాలూ, నాటకాలూ చదువుకో! బాగా రాణిస్తావు!" అన్నారు. ఈ సందర్భంగా–

**ఆ॥ "రసము సృష్టిచేయు ప్రజ్ఞా విశేషంబు**
**సాధనమున రాదు, చదువుకాదు!"**

అనే గుఱ్ఱం జాషువాగారి పద్యాన్ని గుర్తుచేశాడు మా అన్నయ్య.

### 17.2.2 "ఆశ–నాముద్దుల భార్య!":–

ఒక దేశంలో ఒక మహారాజు ఉన్నాడు. ఆయన గొప్ప సాహిత్య పోషకుడు. భోజుడు, కృష్ణదేవరాయలవంటివాడు. నిరంతరమూ కవులను పండితులను ఘనంగా సత్కరిస్తూ ఉంటాడు. తన పుట్టినరోజునాడు దేశదేశాలలోని కవులను పండితులను ఆహ్వానించి, పెద్ద సభ చేసి, ఆ సభలో ఒక్కొక్క కవికి పండితునకు పెద్ద ఎత్తున సన్మానం చేశాడు. ఒక్కొక్కరిని పిలిచి, శాలువా కప్పి, మెడలో పూలదండవేసి, దోసిలి పట్టమని, ఆ దోసిలి నిండా బంగారునాణాలు పోసి, సత్కరించాడు. మహాకవులకు, ఉద్దండపండితులకు ఈ విధమైన సత్కారం జరిగింది. చదువుసంధ్యలులేని బ్రాహ్మణులకు ("జాతిమాత్రోపజీవులకు") "దొడ్డిసంభావన" ఎలాగూ ఉంటుంది. ఏ కాలంలో అయినా చదువుకున్నవాళ్ళు తక్కువమంది ఉంటారు; చదువుసంధ్యలు

లేనివారు ఎక్కువమంది ఉంటారు. చదువుకున్నవారికి సభలో సన్మానం! చదువులేని వారికి పెరట్లో వంటింటి గుమ్మం దగ్గర ఒక పావలానో ఒక అర్ధరూపాయో ఇస్తారు. దీనిని "దొడ్డిసంభావన" అంటారు.

దూరం దేశంనుంచి ఒక మహాకవి వచ్చాడు. రాజుగారి సభలో ఘనసన్మానం పొందాడు; శాలువా+పూలదండ+దోసిలినిండా బంగారునాణాలు తీసుకున్నాడు. రాజుగారు సభ చాలించి రాజమందిరానికి వెళ్ళిపోతున్నారు. పెరట్లో "దొడ్డి సంభావన" ఇచ్చేచోట బ్రాహ్మణులు ఎంతోమంది గుమిగూడారు; త్రొక్కిసలాట జరుగుతోంది. వంటింట్లో గంజివారుస్తారు కాబట్టి, ఆ గంజి పెరట్లో నేలమీద పారి బురద బురదగా ఉంది. ఆ త్రొక్కిసలాటలో "ఒక బ్రాహ్మణుడు" క్రింద పడిపోయాడు; బట్టలనిండా గంజిబురద అంటుకుంది. రాజుగారు జాలిగా ఆ బ్రాహ్మణునివైపు చూచారు. తీరా చూస్తే అతడు దూరందేశంనుండి, ఇంతకు పూర్వమే తన సభకు వచ్చి, తన చేత ఘనసన్మానం పొందిన ఉద్దండ పండితుడు, మహాకవి! అతనిని చూచి రాజుగారు ఆశ్చర్యపోయారు: ''ఇదేమిటి! ఇలా చేశారు? నేను మీకు దోసిలినిండా బంగారునాణాలు ఇచ్చాను కదా! ఈ స్వల్పమైన దొడ్డిసంభావనకు వచ్చారేమిటి?'' అని అడిగారు. అతడు మహాకవి. చమత్కారంగా ఒక శ్లోకం చెప్పాడు:

**శ్లో॥ "క్షుత్-తృట్-ఆశా కుటుంబిన్యః - మయిజీవతి నాన్యగాః।**
**తాసామంత్యా ప్రియతమా - తస్యాః శృంగార చేష్టితమ్॥"**

తా॥ "ఓ రాజా! నాకు ముగ్గురు భార్యలు. వాళ్ళ పేర్లు: ఆకలి (క్షుత్) - దాహం (తృట్) - ఆశ (ఆశా). నేను బ్రతికి ఉండగా వీళ్ళు నన్ను విడిచిపెట్టి ఎక్కడికీ పోరు. ఈ ముగ్గురిలోనూ నాకు నా మూడవ భార్య (ఆశ) అంటే చాలా యిష్టం! ఆమె చేసిన శృంగారచేష్ట యిది! (బట్టలమీద బురద చల్లడం)". రాజుగారు ఆ శ్లోకంలోని రమణీయార్థానికి ఎంతో సంతోషించారు.

### 17.2.3 "కన్నులు మూస్తే ఇవి ఏవీ ఉండవు కదా!":-

ఒక దేశంలో ఒక మంచి పండితుడు ఉన్నాడు. అన్నిశాస్త్రాలు, పురాణాలు బాగా చదువుకున్నాడు. కాని అతడు దుర్భర దారిద్ర్యంతో బాధపడుతున్నాడు. మహారాజుగారి భవనంలో దొంగతనం చేసి తన పేదరికాన్ని పోగొట్టుకోవాలని నిశ్చయించుకున్నాడు. ఒక అమావాస్యనాటి అర్ధరాత్రి రాజభవనంలో రహస్యంగా ప్రవేశించాడు. అక్కడ కోశాగారంలో రాసులు రాసులుగా ధనము, వెండి బంగారాలు, రత్నాలు, వజ్రాలుఉన్నాయి. ధనం దొంగిలించబోయాడు. ధనం దొంగిలించిన వాడికి

నరకంలో యమధర్మరాజు ఏమి శిక్ష విధిస్తాడో ఆ పండితునకు బాగా తెలుసు. అది జ్ఞాపకంవచ్చి, దానిని వదలివేశాడు. వెండి బంగారాలు మూటకట్టుకోవాలనుకున్నాడు. వాటికి నరకలోకంలో యమధర్మరాజు ఏమి శిక్ష వేస్తాడో శాస్త్రంలో చెప్పిన విషయం స్ఫురణకు వచ్చింది. వాటిని వదలివేశాడు. అలాగే రత్నాలు దొంగిలించిన వానికి, వజ్రాలు దొంగిలించినవానికి నరకంలో విధింపబడే శిక్షలు మనసులోకి వచ్చాయి. ఇలాగ ఆ పండితుడు పాపభీతితో, తన మనసులో తాను తర్కించుకుంటూ, రాత్రి చాలాసేపు గడిపివేశాడు. తెల్లవారుజాము సమీపిస్తోంది. వందిమాగధులు వచ్చి రాజద్వారం దగ్గర కైవారాలు చేయడం మొదలుపెట్టారు. దొంగగా మారిన ఆ పండితుడు భయపడిపోయాడు. పారిపోయే వీలు లేదు. అందువల్ల రాజుగారి మంచం క్రింద దూరాడు.

వందిమాగధుల కైవారాలకు రాజుగారు లేచి మంచం మీద కూర్చున్నాడు. ఆయన భోజమహారాజులాగ, శ్రీకృష్ణదేవరాయలవారిలాగ స్వయంగా కవి. తన అదృష్టాన్ని , సిరి సంపదలను, భోగభాగ్యాలను, అష్టైశ్వర్యాలను తలచుకుంటూ ఒక శ్లోకం ఈ క్రింది విధంగా చెప్పాడు:-

**శ్లో॥ "చేతోహరా యువతయః, సుహృదోఽనుకూలాః,**
**సద్బాంధవాః, ప్రణయగర్భ గిరశ్చ భృత్యాః ।**
**వేల్లంతి దంతి నివహాః, తరళాస్తురంగాః,**
**మన్యే మమైక తదపి సర్వ మదృష్టజాతమ్"॥**

తా॥ "నా మనస్సుకు నచ్చిన మనోహరమైన యువతులున్నారు. మంచివారైన బంధువులున్నారు. ప్రీతితో మాటలాడే వినయశీలురైన సేవకులున్నారు. మదంతో కోరాడే ఏనుగుల గుంపులు ఉన్నాయి. మిక్కిలి వేగవంతములైన గుఱ్ఱాలున్నాయి. - ఇవన్నీ నా అదృష్టం వల్లనే ఏర్పడ్డాయి!"

మంచం క్రిందనుండి ఈ శ్లోకమంతా విన్న పండితుడు (దొంగ) ఉండబట్ట లేకపోయాడు. శ్లోకంలోని చివరి పాదాన్ని మార్చి బిగ్గరగా ఇలా చదివాడు:-

**"సమ్మీలనే నయనయోః నహి కించిదస్తి!"**

= "కన్నులు మూస్తే (చనిపోతే) ఇవి ఏవీ ఉండవు కదా!"

కవిత్వ రసికుడైన రాజుగారు ఈ శ్లోక పూరణకు ఆశ్చర్యపోయి, ఆ పండితుణ్ణి బయటకు రప్పించి, అతని దీనగాథను విని చలించిపోయి, ఆదరించి, ఎంతో ధనమిచ్చి, అతనిని తన ఆస్థాన విద్వాంసునిగా చేర్చుకున్నాడు.

(ఈ శ్లోకం "భోజచరిత్ర"లో ఉంది కాబట్టి ఈ కథలోని రాజును భోజ మహారాజుగా భావించవచ్చును – తంగిరాల)

మా అన్నయ్యగారి "సాహిత్యసాగరంలో ఏఱిన ముత్యాలు" గ్రంథంలో ఇటువంటి కవితాకథానికలు మరికొన్ని ఉన్నాయి.

ఉ|| (1) **"విష్ణోరాగమనం నిశమ్య..."** అనే శ్లోకం (2) **"అధః పశ్యసి కిం వృద్ధే..."** అనే శ్లోకం – (3) **"హెద్దునమూను..."** అనే పద్యం మొదలైనవి. వీటి నేపథ్యకథలు వాటి క్రింద ఇచ్చాను; చూడండి.

## 17.3. వేదాంత కథానికలు:-

### 17.3.1 వాస్తుదోషం:-

ఒక రాజుగారు ఏ విధమైన వాస్తుదోషమూ లేకుండా ఒక అందమైన మేడ కట్టించాడు. దీనిని నిర్మించేముందు ఎందరో వాస్తుశాస్త్రజ్ఞులను, జ్యోతిషులను సంప్రదించాడు. అందువల్ల తన గృహనిర్మాణంలో ఏ విధమైన దోషమూ లేదని ఆయనకు గట్టినమ్మకం. గృహప్రవేశం రోజున తన బంధుమిత్రులతోపాటు ఎందరో కవులను పండితులను, పీఠాధిపతులను, సన్యాసులను, జ్యోతిషులను, వాస్తుశాస్త్ర నిపుణులను పిలిపించి, అందరికీ అమోఘమైన విందు ఇచ్చాడు. అనంతరం పెద్ద సభ చేశాడు. ఆ సభలో ఎంతో నమ్మకంతో ఇలా అన్నాడు:– "నేను దేశదేశాలలో ఉన్న గొప్ప గొప్ప వాస్తుశాస్త్రజ్ఞులను, జ్యోతిషులను సంప్రదించి ఈ మేడ కట్టించాను. దీనిలో ఏ విధమైన దోషమూ లేదు. దోషం ఉన్నదని ఎవరైనా నిరూపిస్తే వారికి లక్షవరహాలు బహుమతి ఇస్తాను!" అని ప్రకటన చేశాడు. కవులు, పండితులు, జ్యోతిషులు, వాస్తుశాస్త్రజ్ఞులు అందరూ వేదిక నెక్కి ఆ మేడలో ఏ విధమైన దోషమూ లేదని ఎలుగెత్తి చాటిచెప్పారు. చివరికి ఒక సన్న్యాసి లేచి "అయ్యా! ఈ మేడలో రెండు దోషాలున్నాయ్!" అని గట్టిగా అరిచాడు. అందరూ ఉలిక్కిపడి నిశ్శబ్దంగా ఉండిపోయారు. రాజుగారు ఆశ్చర్యపడి "అయ్యా! దయచేయండి! వేదిక మీదికి వచ్చి ఆ దోషాలేమిటో అందరికీ చెప్పండి!" అన్నారు. సన్న్యాసి వచ్చి వేదికనెక్కి ఇలా అన్నాడు: "ఈ మేడలో రెండు ప్రధాన దోషాలున్నాయి. ఒకటి: ఈ మేడ కూలిపోతుంది! రెండు: దీనిని కట్టినవాడు చనిపోతాడు!" ఈ రెండూ నిత్యసత్యాలే కదా! ఏ యిల్లు అయినా కొన్నేళ్ళకు కూలిపోతుంది కదా! ఆ యిల్లు కట్టినవాడు ఎప్పటికైనా ఆయువుతీరి చనిపోతాడు కదా! ఈ కథానికలో "కంటికి కనిపించేదంతా నశించిపోతుంది" ("యద్దృశ్యం – తన్నశ్యం") – "జగన్మిథ్యా – బ్రహ్మసత్యమ్" అనే వేదాంత విషయాలు ఇమిడి ఉన్నాయి. (ఇది మాత్రం "యథానిక" కాదు – "కథానిక" మాత్రమే!)

## 17.3.2 "అసంతృప్తి":-

ఒక సువిశాలమైన మహారాజ్యంలో ఒక చక్రవర్తి ఉన్నాడు. ఆయన లలిత కళలను బాగా ప్రోత్సహించే మహారాజు. ఆయన దగ్గరకు ఒక మహాకవి, ఉద్ధండ పండితుడు అయిన వ్యక్తి వచ్చాడు. అతడు ఎంతో ధనాన్ని కూడబెట్టాడు. అయినా ఆయనకు సంతృప్తి అనేది ఏకోశానా లేదు. తన కవిత్వంతో, పాండిత్యంతో, శాస్త్రపరిజ్ఞానంతో మహారాజును ఎంతగానో మెప్పించాడు. ఆ రాజు పరమానంద భరితుడై "మీకేమి కావాలో చెప్పండి, ఇస్తాను!" అన్నాడు. సంతృప్తి లేని ఆ పండితుడు "నాకు ఈ భూమినంతా దానం చేయండి!" అని అడిగాడు. ఆ రాజు అంగీకరించాడు. భూమినంతా ధారపోశాడు. ఆ పండితునకు ఘనసన్మానంచేసి, ఏనుగుమీద నగరమంతా ఊరేగించాడు. ఈ విషయం ఆ పండితుని భార్యకు పిల్లలకు తెలిసి ఎంతో ఆనందించారు. పండితుడు సంతోషంగా ఇంటికి వెళ్ళాడు. పెళ్ళాంపిల్లలు ఆయన్ని ఎంతో గౌరవంగా ఆహ్వానించారు. ఇంటికి వెళ్ళిన తరువాత ఆయనకు ఏదో జ్ఞాపకం వచ్చింది. తిన్నగా పడక గదిలోకి వెళ్ళి, మంచం మీద అడ్డంగా పడి భోరున ఏడుస్తున్నాడు. పెళ్ళాం పిల్లలు కంగారు పడి, ఆయన దగ్గరకు వెళ్ళి, "ఏమిటి? ఎందుకు ఏడుస్తున్నారు? మహారాజు మీకు సమస్త భూమండలాన్ని దానం చేశాడు కదా! ఏనుగు మీద నగరమంతా ఊరేగించాడు కదా! ఇంకా ఎందుకు ఏడుస్తున్నారు?" అని అడిగారు. అప్పుడు ఆ పండితుడు వెక్కి వెక్కి ఏడుస్తూ: "మహారాజు మీకేమి కావాలో కోరుకోండి? – అని అడిగినప్పుడు భూమిని మాత్రమే అడిగాను; ఆకాశాన్ని అడగడం మరిచిపోయాను!" అని గుండెలు బాదుకుంటున్నాడట! ఇలా ఉంటుంది సంతృప్తి లేనివాళ్ళ ఏడుపు!

## 17.3.3 "మమకారం":-

ఒక సంసారి, భార్య బిడ్డలపై మమకారం పెంచుకొని, సుఖదుఃఖాలలో మునిగి తేలుతూ ఉన్నాడు. ఈ సంసారిని స్వర్గానికి తీసుకువెళ్ళాలని ఒక మహర్షి విమానం తెచ్చి రమ్మన్నాడు. "పెద్దకొడుకు పెళ్లి నా పర్యవేక్షణలో జరగాలి! లేకపోతే కట్నం రాబట్టడం వీళ్లకు చేతకాదు! పెళ్లయ్యాక వస్తాను" అన్నాడు. సంవత్సరం అయ్యాక రమ్మన్నాడు. అది అయింది. మహర్షి మళ్ళీవచ్చాడు. "అమ్మాయికి పురుడుపోసి మనవణ్ణి చూచి వస్తాను" అన్నాడు. అదీ అయింది. మహర్షి మళ్ళీ వచ్చాడు. "పెద్దయిల్లు కట్టాలి! ఈ యేడు ఇటుకతీత – మళ్లీయేడు కలప– మూడవయేడు నిర్మాణం పూర్తిచేసి వస్తాను" అన్నాడు. ఆ ఇల్లు పూర్తికాకుండానే చచ్చాడు. ఆ కుటుంబం మీద మమకారంతో "కుక్క"గా జన్మించాడు. మమకారంతో కాపలా కాస్తున్నాడు.

మహర్షి మళ్ళీ వచ్చి, ఇల్లు కాపలా కాస్తున్న యజమాని కుక్కను స్వర్గానికి రమ్మన్నాడు. "కోడళ్లు ఎక్కడివక్కడ పారవేస్తున్నారు తలుపులు కూడా సరిగా వేసుకోరు - వాళ్లకు జ్ఞానం వచ్చాక వస్తాను" అన్నాడు. కుక్క చచ్చింది. మళ్ళీ ఎద్దుగా జన్మించి, వాళ్ల పొలాలు దున్నుతున్నాడు. మళ్ళీ మహర్షి వచ్చి ఎద్దును స్వర్గానికి రమ్మన్నాడు. "ఈ పది ఎకరాలు దున్నాక వస్తాను. ఆ పది ఎకరాలు అయ్యాక వస్తాను" అంటూ వాయిదాలు వేస్తున్నాడు. ఎద్దు చచ్చింది! మహర్షి మళ్ళీ వచ్చాడు. ఎద్దు చచ్చిందని చెప్పారు. మహర్షి దివ్యదృష్టితో చూచాడు. సర్పమై నిధికి కాపలా కాస్తున్నాడు.

సంసారి, తాను సంసారజీవితంలో ఉండగా "కాసుల గంగాళం" పాతిపెట్టి ఉంచాడు. ఆ నిధిని రక్షించటంకోసం కాలసర్పజన్మ ఎత్తి కాపలా కాస్తున్నాడు. "వీడికి సంసారజన్మలో మమకారం చావక, కుక్క జన్మఎత్తాడు. కుక్కైనా బుద్ధిరాలేదు. ఎద్దు అయ్యాడు; చచ్చాడు. అయినా మమకారం తగ్గలేదు. ఇంక వీడిని స్వర్గానికి రమ్మనటం అనవసరం" అనుకొన్నాడు మహర్షి. వాడి పిల్లలకు వాడి మీద ఎంత అభిమానం ఉందో వాడికి తెలియజెయ్యాలని మహర్షి మనసులో అనుకొన్నాడు. ఆ కొడుకులను పిలిచి: "మీ తండ్రి, మీ యింటి ఈశాన్యంలో, కాసుల గంగాళం పాతిపెట్టాడు. మీకుచెపితే, ఖర్చుపెట్టేస్తారని, మీకు చెప్పలేదు. మీ తండ్రి ఇప్పుడు కాలసర్పంరూపంలో, ఆ కాసులబిందెకు కాపలా కాస్తున్నాడు" అని చెప్పాడు. వెంటనే ఆ కొడుకులు బరిశలు- బల్లేలు-ఈటెలు-కత్తులు తీసుకొని, తండ్రి మీదకు కసిగా విరుచుకుపడ్డారు! "అయ్యో! మీ తండ్రి! మీ తండ్రి!" అంటున్నాడు మహర్షి! అయినా వారు తగ్గలేదు! తండ్రి అడ్డు తొలగించుకొనే లక్ష్యంతో ఉన్నారు. ఆయుధాలతో వచ్చిన సంతానాన్ని చూచాడు. "కాసుల గంగాళం కైవసం చేసుకొని, తగలబెట్టేస్తారు" అనుకొంటూ పడగ విప్పాడు; "కస్ బుస్" మన్నాడు. "మీ తండ్రి! మీ తండ్రి!" అని సాధువు అంటున్నా, ధనవ్యామోహంతో, సర్పాన్ని ముక్కలు ముక్కలుగా నరికిపారేశారు. అప్పుడుకాని, ఆ సంసారికి, "మమకారం" తొలగలేదు! "ఆత్మనస్తు కామాయ పుత్రః ప్రియోభవతి" (తన ఆనందంకోసమే తండ్రి కొడుకును అభిమానించుచున్నాడు)- బృహదారణ్యకోపనిషత్.

## 18. నన్నయపీఠంలో సాహిత్యోపన్యాసకులు - మా అన్నయ్య:-

"ఒక సభలో ప్రసంగించడానికి వచ్చే కవికాని, పండితుడుకాని బాగా prepare అయి రావాలి. తాను ఉదాహరించదలచిన పద్యాలను కంఠస్థంచేసి రావాలి. కంఠస్థం రాకపోతే కావ్యంలో ఆయా పద్యాల దగ్గర గుర్తుగా markers పెట్టుకొని

రావాలి. సభలో ప్రసంగిస్తూ ఆ పద్యాలకోసం తడుముకుంటూ పుటలు త్రిప్పడం మొదలు పెట్టకూడదు. (ఇలా పద్యాలకోసం తడుముకుంటూన్నందుకు ఒకసారి సభలో గురుపుత్రుడని కూడా చూడకుండా వేదుల సూరిగారిని మందలించాడు మా అన్నయ్య!) పద్యాన్ని కావ్యధోరణిలో చక్కగా పాడాలి కాని వచనంలా చదవకూడదు. సాహిత్య విమర్శ చేయాలి కాని, పద్యంలో లేని మెట్టవేదాంతాన్ని కలిపి సాగదీసి చెప్పడం, శ్రీ చక్రాన్ని, శ్రీ విద్యను, యోగాన్ని అన్వయించి చెప్పడం, ఇచ్చిన విషయానికి సంబంధంలేని అంశాలు చెప్పడం – అభూత కల్పనలు చేయడం – ఇటువంటివి చేయకూడదు!" – ఇది ఉత్తమ ఉపన్యాసకుడికి మా అన్నయ్య విధించిన షరతులు. వీటిని అతిక్రమించి ఎవరైనా ప్రసంగం చేస్తే మా అన్నయ్యకు అరికాలిమంట నెత్తికెక్కుతుంది. అటువంటి ఉపన్యాసకుణ్ణి మా అన్నయ్య నిర్మొహమాటంగా చీల్చి చెండాడుతాడు. ఒక వేళ మా అన్నయ్య తానే ఉపన్యాసం చేయవలసి వస్తే, పై అంశాలన్నీ మనస్సులో పెట్టుకొని, ప్రణాళికా బద్ధంగా, అత్యద్భుతంగా ప్రసంగించేవాడు.

తణుకులో నన్నయపీఠం వేదిక మీద నుండి నేను ప్రసంగిస్తూ ఉన్నప్పుడు, మా అన్నయ్య సభలో ఉంటే, గడగడ వణికిపోయేవాడిని. మామూలు preparation కన్నా రెట్టింపు preparationతో వెళ్ళేవాడిని. అందువల్ల మా అన్నయ్య రెండు మూడుసార్లు నా ఉపన్యాసాన్ని బాగా మెచ్చుకున్నాడు. నేనే కాదు, ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారి వంటి ఉద్దండ పండితులు కూడా మా అన్నయ్య సభలో కూర్చుంటే, ఒళ్ళు దగ్గర పెట్టుకొని ప్రసంగించేవారు.

డా॥ ప్రసాద రాయకులపతిగారు (ప్రస్తుతం కుర్తాళం పీఠాధిపతి) శ్రీనాథుణ్ణి గురించి చాలా గొప్పగా ప్రసంగిస్తారనీ, పద్యాన్ని హృద్యంగా, అత్యద్భుతంగా, శ్రవణపేయంగా, ఒళ్ళు పులకరించేలా చదువుతారనీ మా అన్నయ్యతో ఎన్నోసార్లు చెప్పి, ఆయన్ని నన్నయ పీఠానికి ఆహ్వానించమన్నాను. సరే! అని ఆహ్వానించాడు. కొన్ని నెలల తరువాత మా అన్నయ్యను కలిసినప్పుడు "ఎలా ఉంది కులపతిగారి ఉపన్యాసం?" అని అడిగాను. "ఏడిసినట్టుంది! అసలు ఆయన subject గురించి ఏమీ మాట్లాడలేదు. వేదిక మీద నుండి "హాఁ!" అని దీర్ఘంతీస్తూ ఒక ఆశువు విసిరాడు. క్రింద సభలో ఉన్న చెఱువు సత్యనారాయణశాస్త్రిగారు "హీఁ!" అంటూ మరో ఆశువు విసిరాడు. ఇలాగే "హాఁ!–హీఁ!" – "హీఁ! హాఁ" అంటూ గంటసేపు జరిగింది: సభ అయిపోయింది! శ్రీనాథుడి కవిత్వాన్ని గురించి ఆయన ఒక్క ముక్క చెపితే

ఒట్టు. ఇటువంటి వాళ్ళని ఇంకెప్పుడూ మా పీఠానికి సిఫార్సు చెయ్యకు!" అని నన్ను ఛెడామడా తిట్టిపోశాడు. పావనిశాస్త్రిని recommend చేసినప్పుడు కూడా నా పరిస్థితి ఇలాగే అయింది!

వాల్మీకి శ్లోకాలను తన మధురమైన కంఠంతో శ్రావ్యంగా పాడుతూ, రామ బాణాల్లా ప్రయోగించే డా॥ మైలవరపు శ్రీనివాసరావుగారి రామాయణోపన్యాసం కూడా మా అన్నయ్యకు ఏమీ నచ్చలేదు. "ఆయన వాల్మీకంలో లేని అభూతకల్పనలు చెపుతున్నాడురా! ఉదా॥ దశరథుడు అశ్వమేధయాగం చేసినప్పుడు గుర్రాన్ని లంకకు పంపలేదట! ఎందుకంటే రాముడు పుడతాడు, రావణుని చంపుతాడు-అనే ఉద్దేశంతో. ఇది వాల్మీకి రామాయణంలో ఎక్కడ ఉంది? అసలు గుఱ్ఱం సముద్రాన్ని ఎలా దాటుతుంది! వినే శ్రోతలు వెఱ్ఱివాళ్ళు అనుకుంటున్నాడా?" - అని అడిగాడు మా అన్నయ్య నన్ను. శ్రీరామచంద్రుడివంటి అవతారపురుషుడే నానా అవస్థాపడి, సముద్రం మీద వారధి నిర్మించి లంకకు వెళ్ళాడు కదా!

ఒకసారి భీమవరం కళాశాలలో తెలుగు రీడరుగా ఉద్యోగం చేస్తూన్న డా॥ పెన్మెత్స వెంకటరాజుగారు నన్నయ భారతాన్ని గురించి ప్రసంగం చేయడానికి నన్నయ పీఠానికి వచ్చారు. నన్నయ పద్యం ఒక్కటి తీసికొని అందులో శంకారద్వైతం సమస్తమూ దాగి ఉందని, ఒక గంటసేపు ప్రసంగించి, శ్రోతలందరినీ బోరుకొట్టి వదిలిపెట్టారు. ఆయన తన ఉపన్యాసం అయిపోయాక నిశ్శబ్దంగా వెళ్లిపోతే బాగుండేది. కాని ఆయన తిన్నగా మా అన్నయ్య దగ్గరకు వచ్చి "అయ్యా! గురువుగారూ! ఎలా ఉంది నా ఉపన్యాసం?" అని అడిగారు. అసలే లోపల కుతకుత ఉడికిపోతున్నాడు మా అన్నయ్య. వెంటనే వెటకారంగా ఇలా అన్నాడు:- "మీరు ఇలాగే ఉపన్యసిస్తూ ఉంటే, కొన్నాళ్ళకి మిమ్మల్ని రోడ్ల మీద పిచ్చివాడుగా చూడవలసి వస్తుంది మాకు!"

"కవిసమ్రాట్" విశ్వనాథ సత్యనారాయణగారి "రామాయణ కల్పవృక్షం" మా అన్నయ్యకు ఏమీ నచ్చలేదు. ఆయనకు పద్యాలు తిరుపతి వేంకటకవుల పద్యాల్లాగ, జాషువాగారి పద్యాల్లాగ ద్రాక్షాపాకంలో - వైదర్భీ శైలిలో - ప్రసన్నంగా మంచి ధారాశుద్ధితో ఉంటే నచ్చుతాయి కాని, నారికేళపాకంలోనో, పాషాణపాకంలోనో ఉంటే నచ్చేవికావు. కాని నేనొకసారి విశ్వనాథవారి కల్పవృక్షం- సుందరకాండలోని సీతాదేవివర్ణన పద్యం చదివాను:-

**ఉ॥ ఆకృతి రామచంద్ర విరహాకృతి, కన్బొమ తీరు స్వామి చా**
**పాకృతి, కన్నులన్ ప్రభుకృపాకృతి, కైశికమందు రామ దే**

**హాకృతి, సర్వదేహమునయందున రాఘవవంశమౌళి ధ**

**ర్మాకృతి, కూరుచున్న విధమంతయు స్వామి ప్రతిజ్ఞమూర్తియై!**

ఈ పద్యం చాలా బాగుందని మెచ్చుకున్నాడు మా అన్నయ్య. కేవలం ఛందస్సులో బిగించినంత మాత్రాన కూడా కవిత్వం కాదు అనేవాడు. "ఆవాల్ మెంతులు జీలకఱ్ఱ ధనియాల్ అల్లంబు బెల్లంబుతో" అని శార్దూల విక్రీడితంలో అంటే అది కవిత్వం కాదనేవాడు. కవిత్వం రసవంతంగా, రమణీయార్థంతో కూడి, వినగానే "ఆహా! ఓహో!" అని అనిపించాలి. భక్తితో భగవంతుని గూర్చి పూర్వులు వ్రాసిన శ్లోకాలలో కూడా కవిత్వం లేకపోతే 'ఛస్' అని తీసిపారవేసేవాడు. ఉదాహరణానికి–

**శ్లో॥ "ఆదిత్యాయ చ సోమాయ, మంగళాయ బుధాయ చ**

**గురు శుక్ర శనిభ్యశ్చ, రాహవే కేతవే నమః"**

– అనే నవగ్రహస్తోత్రంలో కవిత్వం ఎక్కడుంది?" అని ప్రశ్నించేవాడు. కాని సూర్యస్తోత్రంవంటి శ్లోకాలను ఒప్పుకొనేవాడు. కారణం: అందులో అలంకారం ఉంది; రమణీయార్థం ఉంది; చక్కటి వర్ణన ఉంది కాబట్టి.

**శ్లో॥ జపాకుసుమ సంకాశం – కాశ్యపేయం మహాద్యుతిమ్।**

**తమో రిం, సర్వపాపఘ్నం – ప్రణతోస్మి దివాకరమ్॥**

తా॥ దాసనపువ్వువంటి (ఎర్రని) రంగు కలవాడును, కశ్యపమహాముని కుమారుడును, గొప్ప కాంతి కలవాడును, చీకటికి శత్రువైనవాడును, అన్ని పాపాలను తొలగించు వాడును – అయిన సూర్యునకు నేను నమస్కరించుచున్నాను. మిక్కిలి రసవంతమైన శ్రీకృష్ణకర్ణామృతంలోని శ్లోకాలంటే ఎంతో ఇష్టపడేవాడు మా అన్నయ్య.

ఈ సందర్భంగా ఇంకో విషయం చెప్పాలి. విశ్వనాథవారి రామాయణ కల్పవృక్షాన్ని వారి శిష్యులైన జువ్వాడి గౌతమరావుగారు ఎంతో మధురంగా గానం చేసేవారు. తెలుగు సాహిత్య లోకమంతా ఆయన రామాయణ కావ్యగానానికి ముగ్ధులై నీరాజనాలర్పించేది. నాకు కూడా ఆయన కావ్యగానం అంటే ఎంతో ఇష్టం. రెండుసార్లు వారిని బెంగుళూరు పిలిపించి కావ్యగానం ఏర్పాటుచేయించాను. కాని మా అన్నయ్యకు మాత్రం ఆయన కావ్యగానం ఏమాత్రమూ రుచించేది కాదు. "ఒరేయ్! ఆయన ఝుమ్మంటూ తుమ్మెదలాగా ఏదో నాదం చేస్తున్నాడు కాని, పద్యంలోని సాహిత్యాంశాన్ని స్పష్టంగా ఉచ్చరించడం లేదురా!" అనేవాడు నాతో. ఒక దృష్టితో చూస్తే – సూక్ష్మంగా పరిశీలిస్తే – మా అన్నయ్య చెప్పిందీ నిజమే అనిపిస్తోంది. మా అన్నయ్యది మిక్కిలి నిశితమైన పరిశీలన!

కాని డా॥ జొన్నలగడ్డ మృత్యుంజయరావుగారు నన్నయపీఠంలో చేసిన "నన్నయ అనువాద విధానం" అనే ఉపన్యాసం మా అన్నయ్యకు చెప్పలేనంతగా నచ్చింది. వెంటనే వారి Ph.D. Thesis కాపీ తెప్పించుకొని ఆమూలాగ్రం చదివి బ్రహ్మానంద భరితుడయ్యాడు. అలాగే శ్రీ వద్దిపర్తి పద్మాకర్‌గారి పోతన భాగవతోపన్యాసాలు కూడా మా అన్నయ్యకు చాలా చాలా యిష్టం! ప్రముఖ హాస్యరచయిత ప్రొ॥ కవనశర్మగారు చెప్పినట్లుగా - ఇచ్చిన సిలబస్ తప్పకుండా, ఎంతో ప్రణాళికాబద్ధంగా ప్రసంగించే "మధుర భారతి" శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తిగారి ఉపన్యాసాలు కూడా మా అన్నయ్యకు చెప్పలేనంత యిష్టం!

### 19. చమత్కార సంభాషణలు - హాస్యం-హాస్య రచనలు:-

### 19.1 "కన్నడమూ వచ్చు-కనడమూ వచ్చు":-

మా అన్నయ్య సంభాషణల్లోను, ఉపన్యాసాలలోను ఎంతో హాస్యం తొణికిసలాడుతూ ఉండేది. ఎవరో నన్ను గురించి చెపుతూ: "మీ తమ్ముడుగారికి కన్నడం బాగా వచ్చునండి!" అన్నారు. "అవును, మా తమ్ముడికి 'కన్నడమూ' వచ్చు, 'కనడమూ' వచ్చు!" అన్నాడు. (నాకు ఐదుగురు పిల్లలు. మా అన్నదమ్ములందరిలోకీ ఎక్కువ సంతానం నాకే).

### 19.2 "ఒక పిచ్చివాడు ఇంకో పిచ్చివాణ్ణి పట్టుకోవడం చాలా సులభం!":-

ఒకసారి ప్రొ॥ జి.వి. సుబ్రహ్మణ్యంగారు, హైదరాబాద్‌లో ఒక మిత్రుని యింట్లో ఒక ఆదివారం సాయంకాలం ఒక చిత్రమైన సాహిత్యసభ ఏర్పాటు చేశారు. "మా అమ్మ'' అనే అంశాన్ని గురించి, 10-15 నిమిషాలు కవిపండితులందరూ ప్రసంగించాలి. అప్పుడు నేనూ మా అన్నయ్యా హైదరాబాదులో ఉన్నాం. అయితే నేనొకచోట మా అన్నయ్య మరొక చోట ఉన్నాం. ఇద్దరమూ సభకు వెళ్ళాలని నిశ్చయించుకున్నాం. నేను ముందుగా సభాస్థలికి చేరిపోయాను. మా అన్నయ్య ఇంకా రాలేదు. "దారి తెలియక ఏమి అవస్థపడుతున్నాడో ఏవిటో!" అని నేను ఆ యింటి బయటకు వచ్చి వీథిలో మా అన్నయ్య కోసం ఎదురు చూస్తున్నాను. కొంత సేపటికి మా అన్నయ్య ప్రొ॥ కసిరెడ్డి వెంకటరెడ్డిగారితో కబుర్లు చెప్పుకుంటూ వస్తున్నాడు. అంతకుముందు మా అన్నయ్యకు రెడ్డిగారితో పరిచయంలేదు. అందువల్ల నేను "ఈయన ఎలా దొరికాడు నీకు?" అని అడిగాను. వెంటనే మా అన్నయ్య: "ఒక పిచ్చివాడు ఇంకొక పిచ్చివాణ్ణి పట్టుకోడం చాలా సులభం రా!" అన్నాడు. అందరూ పకపకా నవ్వారు. ఇక్కడ "పిచ్చివాడు'' అంటే "సాహిత్యపు పిచ్చివాడు" అని మా అన్నయ్య భావం!

**19.3 "ఒక్క ఎలుగుబంటి వేషానికి తప్ప ఇంక దేనికీ పనికిరాడు!"**

మిక్కిలి ప్రజారంజకుడైన ఒక ప్రముఖ సినిమా హీరోకి 60 ఏళ్ళు నిండాయి. సినిమాలలో వేషాలు వేయడం మానేసి, లాభసాటిగా ఉంటుందని రాజకీయ రంగంలో ప్రవేశించాడు. మా అన్నయ్య దగ్గర ఆ హీరో ప్రసక్తి తెచ్చాను. "వాడు అడ్డంగా బలిసిపోయాడు. పైగా వయస్సు కూడా దాటిపోయింది. ఇంకవాడు హీరో వేషాలకి పనికిరాడు; ఒక్క ఎలుగుబంటి వేషానికి మాత్రమే పనికివస్తాడు! అందువల్లనే రాజకీయాల్లోకి వెళ్ళాడు." అన్నాడు మా అన్నయ్య.

**19.4 "ఛీ! పనికిమాలినవాడా!":-**

మా అమ్మమ్మ-మా తాతయ్య (మాతామహుడు: భళ్ళమూడి కృష్ణమూర్తిగారు) పచ్చ దబ్బపండు చాయలో చాలా అందంగా ఉండేవారు. వారికి ముగ్గురు కూతుళ్ళు, ముగ్గురు కొడుకులు. అందరిలోకీ మా అమ్మే పెద్దది. అందరూ మా అమ్మను "పెద్దక్కయ్య" అని పిలిచేవారు; ఊళ్ళో వాళ్ళు కూడా అలాగే పిలిచేవారు. మా ముగ్గురు మేనమామలూ చాలా అందమైనవాళ్ళు: శ్రీరామమూర్తి ("కొవ్వూరు మామయ్య") - నరసింహమూర్తి ("బర్లో మామయ్య") - సూర్యనారాయణ ("అబ్బిగాడు మామయ్య"). పెద్దమామయ్యకు అంటే "కొవ్వూరు మామయ్య"కు - (కొవ్వూరులో ప్లీడరు గుమాస్తా ఉద్యోగం చేసేవాడు కాబట్టి ఆపేరు పెట్టింది మా పెద్దక్కయ్య) ఆరుగురు కొడుకులు, ఒకే ఒక్క కూతురు. చాలా అందంగా ఉండేది. (పేరు "చిట్టి" లేక "శకుంతలాదేవి") ఆమెను నాకిచ్చి పెండ్లి చేయాలని చిన్నప్పటినుండీ అనుకునేవారు. కాని మా అమ్మకి - కొవ్వూరు మామయ్యకి పడేదికాదు; చాలా కాలంపాటు వాళ్ళిద్దరూ అసలు మాట్లాడుకొనేవారే కారు. మా పెద్దమామయ్య చాలా పేదవాడు. అందువల్ల మా అన్నయ్య - మా ఆఖరి మామయ్య (అబ్బిగాడు మామయ్య) కలిసి ఎంతో నేర్పుతో మా అమ్మకీ - మా పెద్ద మామయ్యకీ సఖ్యం కలిపి, 1954 మేనెలలో నాకు మేనరికం పెళ్ళి జరిపించారు. "కొవ్వూరు మామయ్యకు ఆరుగురు కొడుకులు, ఒకే ఒక్క కూతురు. మన సుబ్బారావును బాగా ఆప్యాయంగా చూసుకుంటారు!" అనే వాడు మా అన్నయ్య అందరితోనూ ఎంతో సంతోషంగా. కాని ఆ సంతోషం ఎక్కువ కాలం నిలబడలేదు. నా పెళ్ళి అయిన తరువాత మా పెద్ద మామయ్యకు ఇంకో ఇద్దరు ఆడపిల్లలు పుట్టారు. అప్పుడు హతాశుడైన మా అన్నయ్య నన్ను చూచి: "ఛీ! పనికిమాలివాడా! ఒక్కత్తే ఆడపిల్ల; నిన్ను అపురూపంగా చూసుకుంటారు అనుకుంటే, నువ్వు వాళ్ళింట్లో నీ iron leg పెట్టగానే మామయ్యకి మరో ఇద్దరు ఆడపిల్లలు పుట్టారు!" అన్నాడు.

**19.5 హాస్యరచనలు - రావూరివారి "ఆషామాషీ":-**

మా అన్నయ్యకి హాస్యరచనలంటే చాలా ఇష్టం. భమిడిపాటి కామేశ్వర రావుగారి రచనలు, మునిమాణిక్యం నరసింహారావుగారి రచనలు ఎంతో ఆసక్తితో చదివి ఆనందించేవాడు. అలాగే ఆ రోజుల్లో రావూరి వెంకట సత్యనారాయణరావుగారు ఆంధ్రప్రభ దినపత్రికలో "ఆషామాషీ" అనే ఫీచర్ నిర్వహించేవారు. వారం వారం దానిని తప్పకుండా చదివేవాడు మా అన్నయ్య; ఎంతో ఆనందించేవాడు. రావూరి వారి మీద హీరోవర్‌షిప్ ఏర్పడింది. విజయవాడ వెళ్ళి, ఆయన్ని దర్శించి, ఎంతో ప్రశంసించి, వారి పాదాలకు నమస్కరించి వచ్చాడు. రావూరివారు మొదట కృష్ణాపత్రికలో "వడగళ్ళు" అనే ఫీచర్ నడిపేవారు. అలాగే దాసు వామనరావు "ఆంధ్రపత్రిక"లో "కాలక్షేపం" అనే శీర్షిక నిర్వహించేవారు. డి.వి. నరసరాజుగారు "ఈనాడు" దినపత్రికలో "అక్షింతలు" అనే శీర్షికతో వ్రాసేవారు. వీరు ఈ శీర్షికను 19 ఏళ్ళపాటు- అంటే 1981 నుండి 2000 వరకు నిర్వహించారు. ఇటువంటి హాస్య వ్యంగ్య రచనలు మా అన్నయ్యకు చాలా ఇష్టమైనవి. హైస్కూళ్ళల్లో పనిచేస్తూ ఉండగా చిన్న చిన్న హాస్యనాటికలు వ్రాసి, విద్యార్థులచేత ప్రదర్శింపజేసేవాడు.

**19.6 "ప్రెస్సు పెట్టావంటే నీ పీక ప్రెస్ చేస్తాను! జాగ్రత్త":-**

నాకు ఒక ప్రింటింగు ప్రెస్సు పెట్టాలని, నా రచనలు, మా అన్నయ్య రచనలు, ఇంకా మంచి మంచి పుస్తకాలు ముద్రించాలని కోరికగా ఉండేది. ఈ విషయం ఒకసారి మా అన్నయ్యతో చెప్పాను. ప్రింటింగ్ ప్రెస్సులు స్థాపించి, బాగా నష్టపోయిన వాళ్లు మా అన్నయ్యకు చాలామంది తెలుసు. అందువల్ల నన్ను గట్టిగా మందలిస్తూ "ప్రెస్సు పెట్టావంటే నీ పీక ప్రెస్ చేస్తాను! జాగ్రత్త!" అన్నాడు. నేను భయపడి ఆ ప్రయత్నం మానేశాను. కాని "చైతన్యకవిత" అనే కవిత్వ షాణ్మాసిక పత్రికను మాత్రం 1986లో స్థాపించి 2009 వరకూ నడిపించాను. బాగా పేరు వచ్చింది. ప్రసిద్ధ కవుల ముఖచిత్రాలతో 48 సంచికలు తెచ్చాను. ఈ పత్రికకు "దానచింతామణి" శ్రీ దళవాయి కృష్ణస్వామి ఆదికేశవులు నాయుడుగారు ఎన్నో సంవత్సరాలు నాకు ధన సహాయం చేశారు. వారికి నా కృతజ్ఞతలు...

**20. సమయం-సందర్భం తెలిసినవాడు:-**

2006లో మేం ముగ్గురు తమ్ముళ్ళం కలిసి, మా అన్నయ్య రచించిన "ఏటిన ముత్యాలు" అనే గ్రంథాన్ని ముద్రించాం. దాని ఆవిష్కరణసభ తణుకులో నన్నయపీఠంలో ఏర్పాటు చేశాం. ఆ గ్రంథాన్నిగురించి ప్రసంగించటంకోసం

కాకినాడనుండి "మహాసహస్రావధాని" డా॥ గరికిపాటి నరసింహారావుగారిని తీసికొని వచ్చాం. సభ ప్రారంభమయింది. గ్రంథరచయితగా మా అన్నయ్య రెండు మాటలు చెప్పాలి కదా! అందువల్ల నేను "అన్నయ్యా! నువ్వు ముందుగా మాట్లాడతావా? లేక గరికిపాటివారు ప్రసంగించాక మాట్లాడతావా?" అని అడిగాను. గరికిపాటివారు సాటిలేని మేటి ఉపన్యాసకుడని, అడుగడుగునా ఛలోక్తులు విసురుతూ పాఠకులమీద సమ్మోహనాస్త్రం వేస్తాడని మా అన్నయ్యకు బాగా తెలుసు. అందువల్ల వెంటనే నాతో: "ఒరేయ్! ఆయన ఆంజనేయుడులాగ తోకపెట్టి అందర్నీ చుట్టేస్తాడురా బాబూ! అందువల్ల నేను ముందే మాట్లాడేస్తాను!" అని ముందుగానే రెండు మాటలు అందంగా చెప్పాడు. గరికిపాటివారు ప్రసంగించిన తరువాత ఎవరైనా ప్రసంగిస్తే fade out అయిపోతారని మా అన్నయ్యకు బాగా తెలుసు!

ఒకసారి తణుకులో మా మిత్రుడు, మా అన్నయ్యగారి శిష్యుడు అయిన చిట్టూరి బాపినీడుగారి రెండవ అమ్మాయి పెండ్లి మహావైభవంగా జరుగుతోంది. దంపతులను ఆశీర్వదిస్తూ మా అన్నయ్య కొన్ని పద్యాలు వ్రాశాడు. ఇంకా ఎందరో కవులు ఆశీర్వచన పద్యాలు వ్రాశారు. ఇతరులు వ్రాసిన ఆ పద్యాలను మా తణుకులో ఉండే ప్రముఖ రంగస్థల శ్రీకృష్ణపాత్రధారి, "ఆంధ్రబాలగంధర్వ" బిరుదాంకితుడు అయిన షణ్ముఖి ఆంజనేయరాజుగారు అత్యంత మధురంగా అందమైన రాగాలతో పాడుతున్నారు. మా అన్నయ్య తాను వ్రాసిన ఆశీర్వచన పద్యాలను చదవడం విరమించుకున్నాడు. "ఏవింటి అన్నయ్యా! నీ పద్యాలు చదవడం లేదు?" అని నేను అడిగాను: వెంటనే ఆయన "ఒరేయ్! ఎప్పుడు తోక లేపాలో, ఎప్పుడు తోక ముడవాలో నాకు బాగా తెలుసురా! నోరుమూసుకో!" అన్నాడు. షణ్ముఖి ఆంజనేయరాజుగారి వంటి ప్రముఖ రంగస్థలనటుడు పద్యాలు పాడిన తరువాత తాను పద్యాలు చదివితే పేలవంగా ఉంటుందని ఆయనకు బాగా తెలుసు. (అందరు కవులు వ్రాసిన పద్యాలను షణ్ముఖిగారికి ఇచ్చారు. మా అన్నయ్య బాపినీడుకు ఆయన భార్య శ్రీమతి విజయలక్ష్మిగారికి గురువుగారు కాబట్టి ఈయన పద్యాలను ఈయన్నే చదవమన్నారు.)

## 21. ఆరోగ్యదృష్టి కలగటానికి గల మూలకారణం:-

మా అన్నయ్య "పాలకోడేరు"లో (పశ్చిమగోదావరిజిల్లా భీమవరం దగ్గరలో ఉంది) పనిచేస్తూ ఉండగా ఒకసారి జ్వరం వచ్చింది. (జ్వరం వస్తే భయపడుతూ వెంటనే మా అమ్మగారి దగ్గరకు రావడం మా అన్నయ్యకు అలవాటు.) వెంటనే తణుకు వచ్చేశాడు. నేను మా అన్నయ్యను నా డాక్టరు మిత్రులైన డా॥ డి.

గోపాలకృష్ణమూర్తిగారి దగ్గరకు తీసికొనివెళ్ళాను. ఆయన వైద్యం చేయగా నాలుగైదు రోజుల్లో జ్వరం తగ్గిపోయింది. అప్పుడు మా అన్నయ్యకు జ్ఞానోదయమయింది. "ఇదేమిటి? తండ్రిదిక్కులేని ఈ సంసారాన్ని ముందుకు నడిపించవలసిన సూత్రధారుడనైన నేనే ఇలా అనారోగ్యం పాలైపోతే, చిన్నవాళ్ళైన నా తమ్ముళ్ళగతేమిటి?" అని మనసులో బాగా ఆలోచించుకున్నాడు. "నిరంతరం వ్యాయామం చేస్తూ ఈ శరీరాన్ని రోగాలురాని వజ్రశరీరంగా చేసేసుకోవాలి!" అని మనసులో దృఢంగా నిశ్చయించుకొని, దండీలు బస్కీలు కొట్టడం, కరేళాలు త్రిప్పడం, ఆసనాలు వేయడం, వెయిట్‌లిఫ్టింగ్ చేయడం మొదలుపెట్టాడు. తమ్ముళ్ళు ముగ్గురికీ దండీలు, బస్కీలు, ఆసనాలు నేర్పించాడు. ఇదే మా అన్నదమ్ములు నలుగురి ఆరోగ్య రహస్యం!

## 22. ఆరోగ్యం-అతిశ్రద్ధ:-

శరీరాన్నిగురించి, ఆహారవిహారాలగురించి ఎంతో శ్రద్ధతీసుకునేవాడు మా అన్నయ్య. ఎప్పుడూ భగవద్గీతలోని "యుక్తాహార విహారశ్చ" అనే శ్లోక పాదాన్ని ఉదాహరించేవాడు. ఎల్లప్పుడూ వ్యాయామం చేసేవాడు. దండీలు, బస్కీలు, యోగాసనాలు, వెయిట్ లిఫ్టింగ్ మొదలైనవన్నీ తాను చేయడమే కాకుండా తమ్ముళ్ళకు, తన శిష్యులకు బోధించేవాడు. పశ్చిమగోదావరిజిల్లా "పాలకోడేరు"లో ఉద్యోగంచేస్తూ ఉండగా "తాతరాజుగారు" అనే పహిల్వాన్ దగ్గర కర్రసాము నేర్చుకున్నాడు. కృష్ణాజిల్లా "పాలపఱ్ఱు"లో ఉద్యోగం చేస్తూండగా పనికట్టుకొని విజయవాడ వెళ్ళి, సుప్రసిద్ధ Weight Lifter దండమూడి రాజగోపాలరావుగారిని కలిసి, కొన్ని వ్యాయామ రహస్యాలు తెలిసికొని వచ్చాడు. మనిషి బలానికి, బరువు పెరగడానికి అరటిపళ్ళు బాగా తినాలని ఆయన చెప్పారట. గదిలో ఒక అరటి పళ్ళగెల వ్రేలాడదీసుకొని, రోజూ కొన్ని పళ్ళు తినాలని చెప్పారట దండమూడివారు. దండమూడి రాజగోపాలరావుగారు, కామినేని ఈశ్వరరావుగారు ప్రపంచ ప్రఖ్యాతులైన Weight Lifters. అప్పట్లో Asian Games లో బంగారు పతకాలు సాధించినవారు. వీరి గురువుగారు కొల్లి రంగదాసుగారు. ఈ రంగదాసుగారిని కూడా మా అన్నయ్య కలిసి, కొన్ని యోగాసనరహస్యాలు, ఆరోగ్యసూత్రాలు తెలుసుకొని వచ్చాడు. "నూరేళ్ళు హాయిగా బ్రతుకుతాడు" అనుకున్న రంగదాసుగారు ఒక రోడ్డు ప్రమాదంలో దుర్మరణం చెందడం విధివైపరీత్యం! ప్రకృతివైద్యరహస్యాలు కూడా మా అన్నయ్యకు బాగా తెలుసు. భీమవరంలో ఉండగా ప్రకృతి ఆశ్రమానికి వెళ్ళి శ్రీ వేగిరాజు కృష్ణంరాజుగారిని కలుస్తూ ఉండేవాడు. ప్రకృతి వైద్య విషయాలు కూడా మా అన్నయ్యకు కొన్ని తెలుసు. అన్నం తింటూవుంటే అన్నంకన్నా కూర ఎక్కువ కలుపుకొని తినాలి అనేవాడు.

“పొద్దున్నే మనం walking చేసేటప్పుడు చెప్పులు వేసుకోకూడదు; బూట్లు మాత్రమే వేసుకోవాలి. ఎందుకంటే చెప్పుల్ని మనం మన పాదాలతో గట్టిగా పట్టుకోవలసివస్తుంది. బూట్లయితే, అవే మన పాదాలను పట్టుకుంటాయి!” అనేవాడు మా అన్నయ్య. తమ్ముళ్ళు ముగ్గురికీ మరో హెచ్చరిక కూడా చేశాడు: “మనం నలుగురం జీవితంలో ఎప్పుడూ బూట్లనే వాడుతూ ఉండాలి; చెప్పులు వాడకూడదు. చెప్పులు వేసుకుంటే మన మడమలు లంకదోసపండులా పగిలిపోతాయి. ఇది మనకు నాన్ననుండి సంక్రమించిన శరీరలక్షణం.”

మా అన్నయ్యగారి ప్రియశిష్యులలో శ్రీ దండమూడి అవనీంద్ర కుమార్‌గారు ఒకరు. ఈయన Air Force లో పనిచేసి వచ్చి, ఇప్పుడు హైదరాబాద్‌లో రియల్ ఎస్టేట్ వ్యాపారం చేస్తూ, ఆర్థికంగా ఎంతో ఉన్నత స్థితిలో ఉన్నారు. మా అన్నయ్య అంటే ఈనాటికీ ఆయనకు చెప్పలేనంత భక్తి! మా అన్నయ్య చనిపోయేముందు వచ్చి దర్శించుకుని ఆయన ఆశీస్సులు పొందారు. ఇటువంటి ఎందరో గొప్పశిష్యుల్ని తయారుచేశాడు మా అన్నయ్య.

మా అన్నయ్య శరీరాన్నిగురించి తీసుకునే “అతిశ్రద్ధ”కి ఒక గమ్మత్తైన ఉదాహరణం చెపుతాను. శరీరంలో చిన్న సమస్య వస్తే చాలు, వెంటనే తన వైద్యమిత్రుల దగ్గరకు పరుగెత్తేవాడు మా అన్నయ్య. ఒకసారి డా॥ తాతిని రామబ్రహ్మంగారి దగ్గరకు వెళ్ళాడు. ఆయన పరీక్ష చేసి “అయ్యా! సోమయాజులు గారూ! మీకేమీ ఆరోగ్య సమస్యలేదు. మీరు హాయిగా ఆరోగ్యంగా ఉన్నారు. 80 ఏళ్ళవయస్సులో కూడా మీ గుండె ఊపిరితిత్తులు చాలా బాగున్నాయి. మీరు గ్యారంటీగా 90 ఏళ్ళు బ్రతుకుతారు, వెళ్ళండి! పైగా మీకు ‘రోగి’–‘రోగం’ అంటే ఏమిటో సరిగా తెలిసినట్టుగా లేదు. నా దగ్గరకు వచ్చే రోగుల్ని – వాళ్ళ బాధల్ని చూపెడతాను; చూడండి’! ఇక్కడే కూర్చోండి!” అని చెప్పి, 10–15 నిమిషాలు తన దగ్గరకు ఎన్నో బాధలతో వచ్చే రోగుల్ని చూపించారు డా॥ రామబ్రహ్మంగారు. అప్పుడు మా అన్నయ్య సంతృప్తిపడి, తనకు వచ్చినది చాలా చిన్న సమస్య అని గుర్తించి సంతృప్తిగా ఇంటికి వెళ్ళిపోయాడు!

ఒకసారి మా అన్నయ్యకు కొద్దిగా జ్వరం వచ్చింది. “అదే తగ్గిపోతుందిలే!” అని ఊరుకున్నాడు. కాని మా అమ్మ “ఒరే! పెద్దాడా! డాక్టరు దగ్గరకు వెళ్ళరా! మందు తెచ్చుకోరా!” అని పోరుపెట్టింది. ఆమెపోరు భరించలేక తన వైద్యమిత్రులు డా॥ వత్సవాయి వెంకటరాజుగారి దగ్గరకు వెళ్ళాడు. ఆయన రెండు మాత్రలిచ్చి, “ఇప్పుడొకటి, రాత్రి ఒకటి వేసుకోండి. తగ్గిపోతుంది. తగ్గకపోతే రేపు వచ్చినాకు చెప్పండి!” అన్నారు. ఆయన Children Specialist (శిశువైద్యులు), అందరూ ఆయన్ని

"పిల్లల డాక్టరుగారు" అని పిలుస్తారు. మా అన్నయ్య యింటికి వెళ్ళాడు. "ఏరా! మందు తెచ్చుకున్నావా?" అని అడిగింది మా అమ్మ. "ఆఁ! తెచ్చుకున్నాను. పిల్లల డాక్టరుగారి దగ్గరకు వెళ్ళి మందు తెచ్చుకున్నాను" అన్నాడు. వెంటనే మా అమ్మ "అదేమిఁట్రా! దున్నపోతులా ఉన్నావు, పిల్లల డాక్టరు దగ్గరికి వెళ్ళడమేమిట్రా! 'సోమరాజు' గారి దగ్గరకు వెళ్ళాలికాని!" అంది. మర్నాడు మా అన్నయ్య ఆ డాక్టరుగారితో ఈ విషయం చెప్పాడు. ఆయన పొట్టచెక్కలయ్యేలా నవ్వారు! (ఈ విషయం ఇటీవల నాకు ఫోనులో చెప్పి మళ్ళీ నవ్వారు డా॥ వెంకటరాజుగారు!)

శరీరాన్నిగురించిన ఈ "అతిశ్రద్ధ" ఆయన తమ్ముళ్ళమైన మా ముగ్గురికీ వచ్చింది. నాకు ఒకసారి మీగాలిమీద (అరికాలికి పైన-The upper part of the foot, instep) లోపలి నరాలలో చురుక్ చురుక్ అని మండటం మొదలు పెట్టింది. వెంటనే మా కార్డియాలజిస్టును సంప్రదించాను. "ఇటువంటి చిన్నాచితకా విషయాలకు మేము ఏమీ చేయలేం! వెళ్ళండి!" అన్నాడు. ఇలాగ కాదని ఒక ఆయుర్వేదం డాక్టర్ని చూశాను. ఆమె: "you are too much conscious about your health!" అంది. ఇది మా అన్నయ్యనుండి నాకు సంక్రమించిన ఒక విలక్షణం!

మా అన్నయ్య శరీరాన్నిగురించి ఎంతో శ్రద్ధ తీసుకొనేవాడు కాని, బాహ్యమైన దుస్తుల్ని గురించి ఆయనకు అంతగా పట్టించుకొనేవాడు కాడు. ఒకసారి చిరుగుల చొక్కా వేసుకొని తణుకు వచ్చాడు. "ఇదేమిటి అన్నయ్యా! చిరుగుల చొక్కా వేసుకున్నావ్?" అని అడిగాను నేను. "ఈ చొక్కా చిరిగిపోయినా పరవాలేదురా! 'భగవంతుడిచ్చిన చొక్కా' చిరగకుండా జాగ్రత్తగా కాపాడుకుంటే చాలు!" అన్నాడు. "భగవంతుడిచ్చిన చొక్కా" అంటే మన "శరీరం!" "శరీరం బలంగా ఉంచుకుంటే, చదువు రాకపోయినా ఫరవాలేదురా! మూటలు మోసుకుని అయినా బ్రతకవచ్చు!" అనేవాడు తరచుగా. నిలబడి ఉండటం కూర్చొని ఉండటం; కూర్చొని ఉండటం కన్నా పడుకొని ఉండటం మన శరీరానికి విశ్రాంతి అవుతుందని చెప్పేవాడు మా అన్నయ్య.

ఎప్పుడూ బ్రాహ్మీముహూర్తంలో (తెల్లవారుజామున నాలుగు గంటలకు) లేచేవాడు. వ్యాయామం చేసేవాడు. రెండుపూటలా స్నానం చేసేవాడు. వేళకు భోజనం చేసేవాడు. ఉదయం 10 గంటలకల్లా భోజనం అయిపోవాలి. భోజనం తర్వాత ఒక గంట నిద్రపోయేవాడు. సాయంకాలం ఆరు గంటలలోగా అల్పాహారం అయిపోవాలి. "ఆకాశంలో సూర్యుడు ఉండగానే మన భోజనం అయిపోవాలి" అనేవాడు. దీనికి "సూర్యోపాసన" అని పేరుపెట్టాడు. "సూర్యుడు అస్తమించిన తరువాత తింటే జీర్ణం

కాదు" అనేవాడు. "ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్" (మన ఆరోగ్యం సూర్యుని మీద ఆధారపడి ఉంటుంది) అనే చరకసంహితలోని సూక్తిని ఎప్పుడూ జ్ఞాపకం చేసేవాడు. మా అన్నయ్యకు షుగర్‌లేదు; బి.పి.లేదు. గుండె-ఊపిరి తిత్తులు చివరి వరకూ చాలా బాగున్నాయి. ఇలాగ 90 ఏళ్ళు పూర్తి ఆరోగ్యంతో బ్రతికి, 91వ ఏట ప్రాయోపవేశం చేసి, శరీరాన్ని త్యజించాడు మా అన్నయ్య.

### 22.1 వెండి కంచం కథ

మా అన్నయ్య ఎల్లప్పుడు మాకు భగవద్గీతలోని "యుక్తాహార విహారశ్చ" అనే శ్లోక పాదాన్ని - "ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్" అనే చరక సంహితలోని వాక్యాన్ని జ్ఞాపకం చేసేవాడు. "First health and next wealth"- ఈ రెండింటిని అశ్రద్ధచేసినవాడు జీవితంలో దెబ్బతింటాడు - అని చెప్పేవాడు. ఆరోగ్యాన్ని సరిగా చూసుకోకుండా, రోగం వచ్చినప్పుడు లోభత్వంతో మంచి ఆహారం తీసుకోకుండా, యౌవనదశలోనే ప్రాణాలు కోల్పోయిన మూర్ఖుడైన తన సహాధ్యాయి దృష్టాంతం మాకు ఒక నీతి కథలాగ వివరించేవాడు. మా అన్నయ్య కొవ్వూరు సంస్కృత పాఠశాలలో భాషా ప్రవీణ చదవుకొనేటప్పుడు ఒక సహాధ్యాయనికి క్షయరోగ సూచనలు కనపడ్డాయట. డాక్టరు మందులిచ్చి రోజూ ఉదయంపూట ఒక గ్లాసుడు పాలు, రాత్రి పడుకోబోయే ముందు ఒక గ్లాసుడు పాలు త్రాగమని చెప్పాడు. తల్లిదండ్రులు "రోజూ పాలు కొనుక్కొని త్రాగరా అబ్బాయి!" అని, నెలనెలా అతని ఖర్చులకోసం పంపేడబ్బుతోపాటు పాలకోసం అదనంగా కొంత డబ్బు (ఆ రోజుల్లో 8 రూపాయలు) పంపించేవారు. ఆ మిత్రుడు పరమలోభి అట! "మనకు రోగం వచ్చింది; డాక్టరు చెప్పినట్టుగా రోజూ పాలు త్రాగాలి" అనే జ్ఞానం లేకుండా, తల్లిదండ్రులు పంపిన ఆ అదనపు డబ్బుతో పాలు కొనుక్కొని త్రాగకుండా, సంవత్సరంపాటు ఆ ధనమంతా (8×12=96 రూ.లు)కూడబెట్టి, ఒక వెండికంచం కొని, సెలవుల్లో ఇంటికి వెళ్ళినప్పుడు గొప్పగా తల్లిదండ్రులకు బహూకరించాడట! ఆ తల్లిదండ్రులు ఎంతో నొచ్చుకున్నారట. కొద్ది రోజులలోనే క్షయవ్యాధి ముదిరిపోయి చనిపోయాడట! ఈ సంఘటన జ్ఞాపకం పెట్టుకోమని మమ్మల్ని హెచ్చరించేవాడు మా అన్నయ్య. ఇది మాకే కాదు, ఆరోగ్య విషయంలో అందరికీ పెద్ద హెచ్చరిక!

### 23. ఇష్టమైన ఉపన్యాసాలు- పుస్తకాలు:-

ఉదయం 11 గంటనుండి సాయంకాలం 6 గంటలవరకూ పుస్తకపఠనం; బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావుగారి సి.డి. ఉపన్యాసాలు వినడం. శ్రీ వద్దిపర్తి

పద్మాకర్‌గారి పోతన భాగవతోపన్యాసాలు, శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తిగారి మహాభారతోపన్యాసాలు, డా॥ అప్పజోడు వెంకట సుబ్బయ్యగారి రేడియో మహాభారతోపన్యాసాలు, ఆయన వ్రాసిన మహాభారత రామాయణ విమర్శ గ్రంథాలు మా అన్నయ్యకు చాలా యిష్టం. (అప్పజోడువారి ఫోను నెంబరు నన్నడిగి తీసికొని, ఆయనతో మాట్లాడి అభినందించాడు.) భారత, భాగవత, రామాయణాలు, భగవద్గీత, తిరుపతి వేంకట కవుల కవిత్వం, జాషువాగారి కవిత్వం మాటల్లో చెప్పలేనంత యిష్టం మా అన్నయ్యకు. ఆయన చదువుకొనే గదిలో తిరుపతి వేంకటకవుల ఫోటో, జాషువగారి ఫోటో– ఈ రెండు ఫోటోలే ఉండేవి. మా తణుకులో ఉండే “రసరాజు”గారి కవిత్వాన్ని ఎంతగానో మెచ్చుకొనేవాడు. ఆయన జాషువాతో సమానంగాను, ఒక్కొక్కసారి మించిపోయి పద్యాలు వ్రాస్తాడని ప్రశంసించేవాడు. రాత్రి 8గంటలకు నిద్రపోయేవాడు. తెల్లవారు జామున 4 గంటలకు లేచిపోయేవాడు. చివరి వరకూ (91 సంవత్సరాల వరకూ) ఈ కార్యక్రమం ఇలాగే సాగింది. చివరి రోజుల్లో “వాల్మీకి రామాయణాన్ని మూడుసార్లు చదివానురా!” అని నాకు ఫోను చేసి చెప్పాడు. ఎప్పుడు ఫోను చేసినాసరే – “ఒరేయ్! ఆరోగ్యాన్ని జాగ్రత్తగా కాపాడుకో! మనం ప్రయత్న పూర్వకంగా కాపాడుకుంటేనేకాని ఆరోగ్యం నిలబడదు!” –అని హెచ్చరించేవాడు. ఆరోగ్యం తర్వాత ధనాన్ని కూడా జాగ్రత్తగా రక్షించుకోవాలని చెప్పేవాడు. “First health – next wealth!” అనేవాడు. అయినా కూడా “డబ్బు నూటికి 70 పనులు చేస్తుంది; కాని 30 పనులు అది చెయ్యలేదు!” అనేవాడు. నాలుగు రోజులకు చనిపోతాడనగా నేను ఫోను చేశాను. అప్పుడు నాతో: “ఒరేయ్! నువ్వు పెళ్ళాం లేనివాడవు. జాగ్రత్తగా ఉండు. నేను చనిపోయిన తర్వాత నాలుగేళ్ళు బ్రతికి, చనిపో!” అన్నాడు. నేను “సరే!”అన్నాను. (నా కన్నా మా అన్నయ్య నాలుగేళ్ళు పెద్దవాడు; అందుకని అలా అన్నాడు.) మా అన్నయ్య మాటలకు, మా అన్నయ్యగారి ఆఖరి అమ్మాయి చి॥సౌ॥ జయదుర్గా భవాని చాలా నొచ్చుకొని, వెంటనే నాతో: “మా నాన్న మాటల్ని ఏమీ పట్టించుకోకు బాబయ్యా! ఆయన అలాగే మాట్లాడతాడు. నువ్వు 4 ఏళ్లుకాదు, ఇంకా 14 ఏళ్ళు బ్రతుకుతావు!” అన్నది. నేను: “ఫరవాలేదమ్మా! మా అన్నయ్య ఏమన్నా మేము తమ్ముళ్ళం ఏమీ అనుకోము! ఏమీ పట్టించుకోము!” అన్నాను.

“మన తెలుగు క్యాలెండర్‌లో 60 సంవత్సరాలు మాత్రమే ఉంటాయి. 60 ఏళ్ళు నిండగానే షష్టిపూర్తి జరుపుకుంటారు. ఆ తర్వాత బ్రతికేదంతా grace period!” అనేవాడు మా అన్నయ్య. మా అందరికీ వయస్సుమీరిన తరువాత “మనకు bell కొట్టేశారు! ఇంక మనం వెళ్ళిపోవాలి! we are about to fly!” అనేవాడు.

**24. మాకు తండ్రివంటివాడు:-**

మా తండ్రిగారు శుద్ధ అమాయకుడై, సంసారాన్ని ఏమీ పట్టించుకోకపోతే ఆయన స్థానంలో పెద్ద శూన్యం ఏర్పడింది. ఆ శూన్యాన్ని పూరించినవారు మొదట మా అమ్మ, తరువాత మా అన్నయ్య. ఆయన స్వగ్రామంలో ఐదవ తరగతిలో మంచి మార్కులతో ఉత్తీర్ణుడు కాగానే తణుకు హైస్కూల్లో first form (6వ తరగతి)లో చేరదామనుకున్నాడు. అప్పుడు నెలకి రూపాయిపావలా ఫీజు. “అంత ఫీజు నేను కట్టలేనురా నాయనా!” అంది మా అమ్మ. (అప్పుడు ఒక బస్తా ధాన్యం ఖరీదు పది రూపాయలు!) కుటుంబ పరిస్థితుల్ని అర్థంచేసుకొనిన మా అన్నయ్య హైస్కూల్లో చేరే ఉద్దేశం విరమించుకొని సంస్కృతాంధ్రాలు చదువుకున్నాడు. తాను తెలుగు పండితుడుగా ఉద్యోగం చేసి, మమ్మల్ని చదివించాడు. మంచి సంబంధాలు చూచి మా ముగ్గురికీ పెండ్లిండ్లు చేశాడు. (ఆయనకు మా తాతగారే 14వ ఏట పెండ్లి చేశాడు.) మంచి అలవాట్లు, పద్ధతులు, వ్యాయామము నేర్పి, ఆరోగ్యంగా అందరూ 80 ఏళ్ళు దాటి బ్రతికేలా చేశాడు. ఆయన ఋణం మాకు తల్లిదండ్రుల ఋణం లాంటిది; ఎప్పటికీ తీరేది కాదు!

తన ముగ్గురు తమ్ముళ్ళను తాను కన్న బిడ్డల కన్నా ఎక్కువగా అభిమానించేవాడు. 1983లో మా పెద్దమ్మాయికి వర్ణాంతర వివాహం జరిగినప్పుడు, పెండ్లికొడుకు వైపువారు వచ్చి గొడవచేస్తారని చాలా భయపడ్డాను. మా అన్నయ్యకు ఉత్తరం వ్రాశాను. వెంటనే రెక్కలు కట్టుకొని బెంగుళూరులో వాలాడు. మంచి జరీఅంచు ఖద్దరు పంచె కట్టుకొని, పై మీద జరీ కండువా వేసికొని, ఇంటిముందు కుర్చీవేసుకొని దర్జాగా కూర్చొని, నాకు కొండంత అండగా నిలిచాడు. మా బాచితమ్ముడు సివిల్ ఇంజనీరింగ్ చదువుతూ ఉంటే, “ఒరేయ్! నువ్వు పెద్ద ఇంజనీరువై, జీపు వేసుకుని మన తాటాకు ఇంటికి రావాలిరా!” అనేవాడు. (మా అన్నయ్య ఆశీస్సులు ఫలించి, కొన్నేళ్ళకి మా భాస్కరరావు సివిల్ ఇంజనీరు అయ్యాడు. జీపు వేసుకొని మా యింటికి వచ్చాడు. కాని అప్పటికి తాటాకు ఇల్లు పోయి పెంకుటిల్లు వచ్చింది!) మా బాచితమ్ముడు - బుల్లి తమ్ముడు ఇంజనీరింగ్ చదువుతున్నా, మా తాటాకు ఇల్లు చూసి మంచి మంచి సంబంధాలు రావటం లేదని బాధపడేవాడు నా దగ్గర. చివరికి మా తాటాకు ఇల్లు ఉన్న స్థలంలోనే మా అన్నయ్య ఒక మేడ కట్టుకొని, చివరి వరకూ దానిలో దర్జాగా హాయిగా బ్రతికాడు.

2018లో మా బాచితమ్మునికి ఒంట్లో బాగుండక పోతే, నేను మా పెద్దబ్బాయి చి॥ కాళిదాసు సహాయంతో రాజమండ్రీకి విమానంలో వెళ్ళి, మా తమ్ముణ్ణి చూచి,

అక్కడి నుండి తణుకు వెళ్ళి మా అన్నయ్యతో మూడు రోజులు గడిపాను. ఎన్నో విషయాలు చెప్పాడు. ఒకసారి మాటల సందర్భంలో "మన అన్నదమ్ములు నలుగురిలోనూ నేనే ఆర్థికంగా వెనకబడి ఉన్నాను!" అన్నాను. వెంటనే మా అన్నయ్య: "నీకేమి లోటు వచ్చిందిరా? అలా అనుకోకూడదు! నీకు నెలకి ఎంత కావాలో చెప్పు–నేను పంపుతాను!" అన్నాడు. నేను అక్కడినుండి కాకినాడ వెళ్ళిపోయాను. అప్పుడు మా కాళిదాసుచేత నాకు రహస్యంగా ఎవ్వరికీ తెలియకుండా 50 వేల రూపాయలు పంపించాడు.! That is మా అన్నయ్య!!

2018లో కలవడమే మా చివరి కలయిక. అప్పుడు మా అన్నయ్య దగ్గర నుండి సెలవు తీసుకుంటూ, ఎంతో దుఃఖంతో నేను: "ఇంక నిన్ను చూడలేను అన్నయ్యా! ప్రయాణాలు చెయ్యలేకపోతున్నాను" అన్నాను. "నువ్వు రాలేకపోతే నేనే వస్తానురా! ఇక్కడ రైలెక్కుతాను! అక్కడ దిగుతాను!" అన్నాడు ఎంతో ధైర్యంగా! (అప్పటికే ఆయనకు మోకాళ్ళ నొప్పులు. సరిగా నడవలేడు! కాని ఆయనకు మనోధైర్యం చాలా ఎక్కువ.)

**25. మా అన్నయ్య లేఖలు:–**

మా అన్నయ్య నాకు జీవితంలో కొన్ని వందల లేఖలు వ్రాశాడు. అన్నింటిలోను "ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకో!" అనేదే ప్రధానాంశం. మా అన్నయ్యను బెంగుళూరు విశ్వవిద్యాలయానికి పిలిపించి ఆయనచేత కొన్ని ఉపన్యాసాలు ఇప్పించాను. జాషువా జయంతిలో అద్భుతంగా ప్రసంగించాడు. ఇక్కడినుండి తమిళనాడులోని హొసూరుకు తీసికొని వెళ్ళి అక్కడ కూడా ఉపన్యాసాలిప్పించాను. ఆ తరువాత కొన్ని ఏండ్లకు నాకొక లేఖ వ్రాశాడు. అది ఇటీవల దొరికింది. అయితే దానిలో తేదీ లేదు. 2006 ఆగస్టు 31వ తేదీ రాత్రి మా ఆవిడ చనిపోయింది. ఆ సమయంలో మా అన్నయ్య మా యింటికి వచ్చాడు. ఆ తర్వాత వ్రాసిన లేఖగా దీనిలో ఆయన పేర్కొన్న అంశాలనుబట్టి ఊహిస్తున్నాను. (బహుశః 2008లో వ్రాసి ఉంటాడు). మా అన్నయ్య లేఖలు ఎలా ఉంటాయో తెలుసుకుందుకు మచ్చుతునకగా దానిని దిగువ ఇస్తున్నాను:–

"క్షేమం–

చిరంజీవి తమ్మునకు ఆశీస్సులు...

**1.** నీవు 1) శారీరక పోషణలోను – 2) మానసిక శాంతిలోను వెనుకబడి యున్నావు. నీవు ఉదయము 7 గం॥కు మధ్యాహ్నము 12 గం॥కు టైము ప్రకారంగా ఆహారం తీసుకో! రాత్రి 7 గం॥కు ఆహారం తీసుకో! రాత్రి 10 గం॥కు పడకను

ఆశ్రయించు ఉ. 6 గం॥లోపల మేలుకో! 1½ లీ. నీళ్లు త్రాగు! కాలకృత్యాలు పూర్తికాగానే నీ శక్తిననుసరించి – సులువైన వ్యాయామాలు 60 ని॥లు చెయ్యి!

దుంపకూరలు – పప్పు కూరలు నిషేధించు – బీర – పొట్ల–ఆనప – ఆకుకూరలు ఎక్కువగా తిను– ఊరగాయలు: 1. ఉసిరి పచ్చడి, 2. నిమ్మకాయ 3. దబ్బకాయ, 4. కరివేపాకు పచ్చడి, 5. అల్లం పచ్చడి తిను – పామాయిలు (Palm Oil) వాడకు. No.1 వేరుసెనగనూనె లేదా పప్పునూనె (నువ్వులనూనె) (డాక్టర్ల సలహాను అనుసరించి) వాడుకో. రిటైరు అయిపోయి – ఒంటరిగా మిగిలిన, నీకు, శారీరక – మానసిక పోషణ– తోషణలకు మించిన కర్తవ్యములు లేవు! మందులు శ్రద్ధగా వాడుతూ ఉండవలయును.

**2.** నీవు ఆడుపిల్లలను గూర్చి ఆలోచింప నవసరము లేదు – పెద్ద కొడుకును గూర్చి బెంగలేదు – నీ పిల్లలందరకు నీ మీద అభిమానం ఉంది. మనశ్శాంతిగా శ్రీనాథుడి దగ్గర కాలం గడుపు! అక్కడ వాడి అత్తగారిని ఎందుకు అతికించుకొన్నారో (చిట్టెమ్మ కాలం చేసినప్పుడు – నేను వచ్చిన సమయంలో) అనుకొన్నాను. ఆమెను (నీ తెలివి ఉపయోగించి) ఇంటి నుంచి పంపించగలిగితే నీవు కుటుంబ క్షేమం కోరినవాడవే! నెలకు 1000/– పంపించే ఏర్పాటు చేసి పంపించినా మీరు అదృష్టవంతులు! నీవు – చిట్టెమ్మ 2,3 కోడళ్లను ఆత్మీయంగా కలుపుకొన్నారు. మీరు చూపించిన ఆత్మీయతను మీ అసమర్థత క్రింద – చేతకానితనం క్రిందా జమకట్టి – నిర్భయంగా జంకుగొంకులేకుండా, మీపట్ల ప్రవర్తిస్తున్నారు. ఈ పరిస్థితిలో ఇంతకాలంగా వేళ్లుపాతుకొన్న ఆమెను వెళ్లగొట్టాలనుకోవటం కందిరీగల్ని రేగగొట్టటం అవుతందేమో? ఆలోచించుకొని అడుగువెయ్యి!

**3.** నీ పుస్తకాలు మినీ వాన్ ఎక్కించి, హెూసూరు లైబ్రరీకి వెంటనే తరలించు. ఇది అర్జంటుగా చెయ్యవలసిన పని! నిన్ను హెూసూరువాళ్లు దైవంగా భావిస్తున్నారని గ్రహించాను. ఏ వస్తువును ఎక్కడకు చేర్చాలో అక్కడకు చేర్చి చేతులు కడుక్కోవటం విజ్ఞతాలక్షణం – ప్రవృత్తిలో ఎంతగా దొర్లుతామో, నివృత్తిలోనూ అంత నిర్లిప్తత – త్యాగం – నిరీహ అవసరం! దగ్గరలో ఉన్న భవిష్యత్తును వర్తమానంగా భావించాలన్నది వ్యాకరణశాస్త్రం! "వర్తమాన సామీప్యే వర్తమానవద్వా" అని సూత్రం.

**4.** కర్తవ్యం లేదు – కాలం అయిపోయింది. పూర్వుల ఆయుఃప్రమాణం అయిపోయింది. అయినా మనం ఇంకా ఎందుకో ఉన్నాం! ఉన్న నాలుగురోజులు శారీరక – మానసిక అశాంతులకు గురికాకుండా బ్రతకటానికి కొంత జ్ఞానం,

అవగాహన, మన చుట్టూ మనం చేసుకోవలసిన (తీసుకోవలసిన) జాగ్రతలు కొన్ని ఉంటాయి. మన కర్మలు మనకు తప్పవు! దారినపోయే కర్మల్ని ఇంట్లో పెట్టుకోవటం- మానసిక అశాంతికి కారణం. మనం బ్రతికే కాలం నిర్ణయమై పోయింది. నేను పోయాక నీకు నాలుగేళ్లు నిశ్చయం అవుతుంది! ఈ స్వల్పకాలం - శారీరక - మానసిక ప్రశాంతుల్ని ఇచ్చే మార్గంలో ప్రయాణిస్తే బాధలు తక్కువగా ఉంటాయి.

**5.** నాకు భగవంతుడు చాలా బాధలు పెట్టాడు. దానితోపాటు వేదాంత జ్ఞానం (మొండితనం) ఇచ్చాడు. మానసికంగా నా బాధలకు అతీతస్థితిలో ఉన్నాను. శారీరక బాధలు సిగ్గుపడుతూ దూరదూరంగానే ఉంటున్నాయి. కారణం! నా నియమాలు - ఆహారం విషయంలో రాజీపడని లక్షణం, ఆర్థికలోపం లేకపోవటం, నాకు కావలసిన ఆహారాన్ని రుచిగా చేసుకొనే శక్తియుక్తులు భగవంతుడు నాకిచ్చాడు. ఆరోగ్యపరిరక్షణకోసం శ్రద్ధతీసుకోవటంవల్ల శారీరకబాధలు (అందరను పట్టుకొన్నట్లు) నన్ను పట్టుకొనవు. "వెళ్ళిపోయే రోజులు దగ్గరలోనే ఉన్నాయి" అనే ఆలోచన కొండంత ధైర్యం ఇస్తోంది!

**6. "మన యిల్లు" - "తణుకు" నాకు ఇచ్చినంత శాంతిని నేను ఎక్కడా పొందలేదు! అభిమానించే మనుష్యుల మధ్య ఈ అంతిమ జీవితంలో పొందుతున్న ఆనందాన్ని విడిచిపెట్టలేక - రోజులు లెక్కపెట్టుకొంటూ - ఏ రోజుకారోజు "ఇది నాది!" అనుకొంటూ ఉన్నాను.**

**7.** ఇంట్లో అశాంతి మధ్య 40 సం॥లు పితృతిథులు (1968-2008) నిర్వహించాను. క్రిందటి సం॥రం 3, 4 తమ్ముళ్లకు అప్పగించాను. వాళ్లు ఏదో లాగుతున్నారు. నీవు ఎన్ని పనులున్నా అత్యవసరంగా భావించి హాజరుకావాలి! ఈ సారికి కలిసినా (ఎప్పటి కప్పుడు) మళ్లీ సారికి నమ్మకంలేని జీవయాత్రికులం! "మళ్లీ సారి కలుద్దాం! (ఫిర్ మిలేంగే!)'' అనుకుంటూ ఆశిద్దాం! మళ్లీ కలుస్తామో! పంచభూతాలలో కలిసిపోతామో, నమ్మకం లేని భవిష్యత్తు మనది! ఈ ఆలోచన 70 సం॥లు వచ్చినప్పటినుండి నన్ను వెంటాడుతోంది! ఈ సందేహం వెనుక చాలా దూరం ప్రయాణించాను. ఆరోగ్య సూత్రాలు పాటించు! శాంతి మార్గాలు అన్వేషించు! గ్రహించిన సత్యాన్ని జీవితంలో అమలు పరచు!

**నీ అన్న - తం॥ వెం॥ కృ॥ సోమయాజులు"**

ఒక సంవత్సరం క్రితంనుండి మా అన్నయ్య నాతో ఒక విషయం చెపుతూ ఉండేవాడు. ''ఒరేయ్! మనం ఇప్పుడు ఆరోగ్యంగా ఉన్నాం. కాని మంచంపట్టి

మలమూత్రాలలో పడిపోతే ఎవరు చూస్తారురా మనల్ని? ఆ పరిస్థితి రాకుండా నేను మన ప్రాచీనులు చెప్పిన పద్ధతిలో ప్రాయోపవేశం చేసి చనిపోదామనుకుంటున్నాను" అన్నాడు. నేను ఉలిక్కి పడ్డాను "అలాగ అనుకోకు. నువ్వు మంచం పట్టినప్పుడు ఎవరో ఒకరు సేవచేస్తారు. లేకపోతే ఒక నర్సును పెట్టి చేయిస్తారు. కాని బలవంతంగా చనిపోవడం సరికాదు. ఆత్మహత్య మహాపాపం – అన్నారు మన పెద్దలు" అన్నాను నేను. కాని ఆయన నాతో ఏకీభవించలేదు.

### 26. "అగస్త్యభ్రాత" కాదు – స్వయంప్రకాశకుడు:-

నాకు చిన్నతనంనుండీ మిత్రులు చాలా ఎక్కువ. బ్రాహ్మణులనుండి దళితుల వరకూ (లేదా దళితులనుండి బ్రాహ్మణుల వరకు) అన్ని కులాలలోను ఎందరో ప్రాణమిత్రులు ఇప్పటికీ ఉన్నారు. కొందరు నన్ను "మా సుబ్బన్న!" అని ప్రేమగా పిలుస్తూ ఉంటారు. దీనిని చూచి మా అన్నయ్య తరచుగా నన్ను "నీది మిత్రతారరా! నీకు స్నేహితులు ఎక్కువ!" అనేవాడు. నేను మా తణుకులో ఎందరో మిత్రుల్ని సంపాదించి పేరు ప్రఖ్యాతులు గడించాను. అందువల్ల మా అన్నయ్య తణుకువచ్చి స్థిరపడిన సందర్భంలో అందరూ ఆయన్ని "సుబ్బారావు అన్నగారు!" అని పిలుస్తూ ఉండేవారు. మా అన్నయ్యకూడా ఈ విషయం రెండుమూడు సార్లు నాతో అన్నాడు నవ్వుతూ. ఇదేమిట్రా బాబూ! ఇదేదో "అగస్త్యభ్రాత" సంగతిలా ఉందే అని ఆయన బాధపడలేదు. నేను గడించిన పేరుకు సంతోషించేవాడు. ఆయనేం తక్కువవాడా! నాకన్నా గొప్ప పండితుడు, కవి, చమత్కార సంభాషణుడు. నాలాగే గొప్ప స్నేహశీలి. తణుకు వచ్చిన కొద్దికాలానికే తన ప్రతిభ, పాండిత్యం, కవిత్వం, వాగ్వైభవం, క్రమశిక్షణ, తాత్త్వికదృష్టి – మొదలైన వాటితో తణుకు పౌరులను మిక్కిలిగా ఆకర్షించి, ఎక్కడ చూచినా "మా సోమయాజులుగారు! మా సోమయాజులుగారు!" అనే ఆత్మీయ గౌరవ ఆదరాభిమానాలు సంపాదించుకున్నాడు. దానితో "సుబ్బారావు అన్నయ్య" అనే పేరు పోయింది! ఆయన సొంతపేరు ప్రకాశించింది.

### 27. మా అన్నయ్య మిక్కిలి ప్రేమించిన తణుకు-అక్కడి ప్రాణమిత్రులు:-

మా అన్నయ్య 1988లో పదవీవిరమణ చేశాడు. అప్పటికి 10-12 ఏండ్ల పూర్వంనుంచీ తణుకులోనే ఉండేవాడు. అంటే సుమారు 40 ఏళ్ళకుపైగా తణుకులో జీవించాడు మా అన్నయ్య. తణుకు అంటే మా అన్నయ్యకు చెప్పలేనంత యిష్టం. నాకు వ్రాసిన పై లేఖలో ఈ విషయాన్ని స్పష్టంగా చెప్పాడు. మా నాన్నగారిలాగే తణుకులోనే చనిపోవాలనుకున్నాడు. (కాని దైవం ఆయన్ని హైదరాబాదు తీసికొని

వెళ్ళింది. మా అమ్మగారు కూడా మా అన్నయ్యలాగే హైదరాబాదులోనే తనువు చాలించింది.) తణుకు అన్నా, అక్కడి తన మిత్రులు అన్నా మా అన్నయ్యకు పంచప్రాణాలు. అక్కడ అందరికీ తలలోని నాల్కలా మసలుకున్నాడు. అందరిచేతా మిక్కిలిగా గౌరవింపబడ్డాడు. ఉపాధ్యక్షుడుగా శ్రీ నన్నయ భట్టారక పీఠానికి ఎంతో సేవచేశాడు. ఆ చుట్టుప్రక్కల కవి పండితులకు మా అన్నయ్య సుపరిచితుడు. తణుకులో మా అన్నయ్య అంటే ప్రాణమిచ్చే ఆప్తమిత్రులు ఎందరో ఉన్నారు. డా॥ తాతిని రామబ్రహ్మంగారు (సర్జన్) - డా॥ జి.యస్.వి. ప్రసాద్‌గారు (E.N.T)-డా॥ వత్సవాయి వెంకటరాజుగారు (శిశువైద్యులు) - శ్రీ జొన్నలగడ్డ సూర్యసుబ్రహ్మణ్యంగారు (ఆడిటర్)- శ్రీ మల్లిన రామచంద్రరావుగారు (పారిశ్రామికవేత్త) - శ్రీ చిలుకూరి కాశీ విశ్వేశ్వరరావుగారు (పారిశ్రామికవేత్త) - శ్రీ గమిని రాజాగారు (పారిశ్రామిక వేత్త) - శ్రీ యామిజాల సుబ్రహ్మణ్యశర్మ ("సుశర్మ")గారు (వీరు గత 30 సం.లుగా శ్రీ నన్నయ భట్టారక పీఠానికి ముఖ్యకార్యదర్శిగా ఉన్నారు) - శ్రీ "రసరాజు" (రంగినీని సత్యనారాయణరాజు) గారు (ప్రముఖ కవి, కథారచయిత) - కీ.శే. చిట్టూరి బాపినీడుగారు (పారిశ్రామికవేత్త, తణుకు ఎం.ఎల్.ఏ.)-కీ.శే. చెఱువు సత్యనారాయణశాస్త్రిగారు (ఉద్దండ పండితుడు, కవి, సంస్కృత అష్టావధాని)- కీ.శే. నల్లమిల్లి చినవీర్రెడ్డిగారు (M.A. LL.B) న్యాయవాది, గొప్ప సాహిత్య రసికుడు - కీ.శే. బంధకవి సీతారామాంజనేయులుగారు, ప్రముఖ న్యాయవాది, సాహిత్య ప్రియుడు, ఆధ్యాత్మికజ్ఞానసంపన్నుడు, శ్రీ నన్నయభట్టారకపీఠం అధ్యక్షులుగా కూడా పనిచేశారు. తరువాతి కాలంలో వీరు కుర్తాళం పీఠాధిపతి అయ్యారు- కీ.శే. వేదుల సూరిగారు, మా అన్నయ్యకు మిక్కిలి ఇష్టమైన గురువుగారైన వేదుల రామశాస్త్రిగారి కుమారులు, మంచి పండితుడు, కవి. - మొదలైనవారంతా ప్రత్యేకంగా పేర్కొన దగినవారు.

శ్రీ నన్నయ భట్టారక పీఠానికి ప్రధాన కార్యదర్శియైన శ్రీ "సుశర్మ" (యామిజాల సుబ్రహ్మణ్యశర్మ)గారు; పద్మశ్రీ టాకీసు యజమానియైన కీ.శే. నడింపల్లి వెంకట సూర్యనారాయణరాజుగారు, వారి ధర్మపత్ని శ్రీమతి నడింపల్లి వెంకట సూర్యకుమారి గారు; ప్రముఖ వైద్యులు డా॥ జొన్నలగడ్డ ప్రభాకరరావుగారు - మా అన్నయ్యగారి దగ్గర భగవద్గీతలో ప్రత్యేక శిక్షణ పొందారు. వీరు నలుగురు మా అన్నయ్యగారి "గీతాశిష్యులు". వీరికితోడు చిట్టూరి బాపినీడుగారి ధర్మపత్ని విజయలక్ష్మిగారు కూడా ఉన్నారు. వారు ప్రత్యేకంగా చెప్పదగినవారు. ఆమె మా అన్నయ్యగారిని కారులో ఇంటికి రప్పించుకొని, భగవద్గీతే కాకుండా, రామాయణ భారత భాగవతాలు కూడా నిత్యమూ చెప్పించుకొనేవారు. ఆమె మా అన్నయ్యకు గొప్ప భక్తురాలు!

## 27.1 డా॥ తాతిని రామబ్రహ్మంగారు, M.S. (Surgery):-

మా అన్నయ్య మిత్రులతో మొట్టమొదట పేర్కొనదగినవారు డా॥ తాతిని రామబ్రహ్మంగారు. పేరుకు వైద్యులేకాని గొప్ప ఆధ్యాత్మికవేత్త; దైవభక్తి పుష్కలంగా కలవారు; నిరంతరం పేదలకు సహాయం చేస్తూ ఉంటారు. వీరి తల్లిదండ్రులకు మొదట అందరూ పుత్రికలే; పుత్రులు లేరు. అప్పుడు రామకృష్ణమఠానికి చెందిన శ్రీస్వామి నిశ్రేయసానందజీ మహారాజ్‌గారు వీరి తల్లిదండ్రులచేత "పుత్రకామేష్టి" చేయించారు. అప్పుడు వీరు జన్మించారు. వీరు వైద్యవిద్య చదివి, పేదలకు సేవ చేయాలని నిర్ణయించినవారు కూడా ఆ స్వామిజీయే. వారి ప్రోత్సాహంతో తణుకులో "శ్రీరామకృష్ణసేవాసమితి" భవనాన్ని నిర్మించి, అక్కడ ఆధ్యాత్మిక కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. ఈ రామబ్రహ్మంగారి కోరిక మీద మా అన్నయ్య "సత్యసందర్శనం" అనే గ్రంథాన్ని రచించి, వీరి తల్లిదండ్రులకు అంకితమిచ్చాడు. దానిలో రామబ్రహ్మం గారినిగురించి వివరంగా ఈ క్రింది విధంగా వ్రాశాడు:-

"పశ్చిమగోదావరిజిల్లా తణుకుతాలూకాలో "మోర్త" గ్రామం ప్రాచీనమైనది. ఆ గ్రామంలోని కమ్మవారి ప్రసిద్ధవంశాలలో 'తాతిని' వంశమొకటి. వీరికి దైవభక్తి సంఘసేవ అనేవి 'ఉచ్ఛ్వాస నిశ్వాసాలు'. ఒక జాతిలక్షణాలు ఆ కుటుంబాల్ని పరిశీలిస్తే అర్థమవుతాయి. ఇంటిపేరు కూడా వారి లక్షణాలనుబట్టే వచ్చిందని ధ్రువపరచుకోవచ్చు. 'దాతైన' అనే పదంలో నుండి ఈ 'తాతిన' వచ్చిందని ఒక కవి ఉత్ప్రేక్షించాడు. 'దాతైన' = దాన స్వభావుడైన అని అర్థం. అది లోకుల నాలుకలపై మార్పు చెందుతూ 'తాతిన' అని అయ్యింది అన్నాడు. ఈ కవి ఉత్ప్రేక్ష (ఊహ)ను, ఈ వంశీయుల స్వరూప స్వభావాలు రుజువు చేస్తున్నాయి. (ఇక్కడ ఒక విషయం మనం గమనించాలి. కవి సరదాగా ఉత్ప్రేక్షించి ఉండవచ్చును. కాని చారిత్రకంగా చూస్తే, "తాతినేని" అనే యింటిపేరు "తాతిని" అయి ఉంటుంది - "నేని" అనే శబ్దం "నాయకుడు" (="సేనాని") అనే పదంనుండి వచ్చింది. కమ్మ, రెడ్డి, వెలమ, కాపు, కులాలవారు కాకతీయ మహాసామ్రాజ్యంలో సైన్యాధ్యక్షులుగా ఉండేవారు. ఆంధ్రదేశంలో క్షత్రియులే కాకుండా ఈ నాలుగు కులాలవారు మొదటినుండీ వీరజాతులుగా పరిగణింపబడ్డారు. కాకతీయ సామ్రాజ్య పతనానంతరం, వీరందరూ సంయుక్త ఆంధ్రదేశంలోని వివిధ ప్రాంతాలలో జమీందారులుగా ఉండి, కాలక్రమాన పెద్దపెద్ద రైతులుగా పరిణమించారు - తంగిరాల.)

'మోర్త' గ్రామంలో తాతిని పెదఅమ్మన్నగారు సంపన్నమైన రైతుకుటుంబంలో జన్మించారు. "ఆరోగ్య-ఐశ్వర్యాలు జీవితానికి రెండు కళ్ళు" అనే సత్యాన్ని వీరు

చిన్నప్పుడే గమనించారు. నియమబద్ధ జీవితంతో ఆరోగ్యాన్ని కాపాడుకుంటూ, కుటుంబాన్ని నడిపించారు. ఈయనను సర్వవిధాల, నీడగా మనస్సులో అనుసరించే వెంకాయమ్మగారు భార్యగా లభించడం వీరి అదృష్టం. "ధనమనేది, కుటుంబ సంక్షేమానికీ-సంఘశ్రేయస్సుకు వెచ్చించాలేకాని; దుర్వ్యయం చేయకూడదు" అనే సత్యాన్ని నమ్మినవారు అమ్మన్నగారు.

దైవభక్తి ఈ కుటుంబరక్తంలో అంతర్లీనంగా ప్రవహించే మహత్తర లక్షణం. అమ్మన్నగారి మామగారు శ్రీ కంటిపూడి బ్రహ్మయ్యగారు. గొప్ప రామభక్తులు. వారు మోర్తలో రామాలయం నిర్మించి, కొంత భూవసతి కల్పించినారు. ఆ రామాలయ ధర్మకర్తగా అల్లుడు అమ్మన్నగారికి ఆలయబాధ్యత అప్పగించారు. రాముణ్ణి ఇష్టదైవంగా భావించే అమ్మన్నగారు ఆలయబాధ్యతను మహాభాగ్యంగా భావించి, ధూపదీపనైవేద్యాలు నిర్వహింపచేయడం వీరి దైవభక్తికి, రామభక్తికి ప్రత్యక్షసాక్ష్యం. కంటిపూడి బ్రహ్మయ్యగారు తమ కుమార్తెకు అరణంగా ఒక పడమటి ఆవును ఇచ్చారు. ఆ సంతతిని పోషిస్తూ, గోసేవ చేసారు పెదఅమ్మన్నగారు. చంటిపిల్లలకు ఆవుపాలు పోయటం దినచర్యగా జీవితం సాగించిన మాతృమూర్తి వెంకాయమ్మగారు.

రామభక్తులైన శ్రీ అమ్మన్నగారు తులసీరామాయణం అర్థంచేసుకోవాలనే కాంక్షతో, హిందీభాషను అభ్యసించి కృతార్థులయ్యారు. వాల్మీకిరామాయణం వినటం, రామభక్తి వీరికి పిత్రార్జితాలు. సంస్కృతంలో ఉన్న రామాయణం శ్లోకాలు పండితులచే చెప్పించుకొని, వారిని సత్కరించేవారు మన అమ్మన్నగారు. రామాయణ ప్రవచనం చేసిన ఉపన్యాసకుణ్ణి వెండిపాదుకలతో సత్కరించిన సరసహృదయులు ఈ రామన్న పుత్రుడు! (అమ్మన్నగారి తండ్రి రామన్నగారు).

మాంసాహారం వీరికి జాత్యాహారం అయినా శాకాహారిగానే జీవించారు. తన భార్యాపిల్లల్ని మాంసాహారానికి దూరంగా ఉంచారు. ఆంధ్రబ్రాహ్మణభోజనం వీరికి అత్యంత ప్రీతిపాత్రం. భోజనంలో ధారాశుద్ధిగా నెయ్యి వేసుకొనేవారు. శరీరాన్ని ఆరోగ్యంగా నడిపించుకొనేవారు. **"యుక్తాహార విహారశ్చ యుక్త చేష్టశ్చ కర్మసు"** (తగిన ఆహార విహారములు, తనకు తగిన పనులు చేయుట) అను గీతావాక్యాన్ని అనుసరించేవారు. "శరీరంలో 2/3వంతు నీరున్నది; నీటివల్లనే ఆరోగ్య-అనారోగ్యాలు ఏర్పడతాయి!" అనే సత్యాన్ని వీరు ఏనాడో గమనించి, వారి పొలంలో ఉన్న, ఒక బావినీటిని సురక్షితమైన మంచినీరుగా ఎంచుకొని; ఆ నీరే త్రాగేవారు. నమ్మిన సత్యాన్ని ఆచరించటంలో అమ్మన్నగారు, ఎక్కడా రాజీపడేవారు కాదు! వీరి ధర్మపత్ని వెంకాయమ్మగారు వీరికి కుటుంబ నిర్వహణతోపాటు ఆహారవిధానం అమర్చటంలో

కూడా సర్వవిధాలుగా సహకరించేది. శరీరారోగ్యం చూచుకొంటూ, పరిపూర్ణ ఆరోగ్యంతో పుష్టిగా, తుష్టిగా తనను - తన కుటుంబాన్నీ నడిపించుకొన్న ఉత్తమ గృహస్థు పెదఅమ్మన్నగారు!

తన కుటుంబ నిర్వహణము - తన ఆర్థిక అభివృద్ధి చూచుకోవటం, తన ఆరోగ్యం పరిరక్షించుకోవటంతో, ఆయన తృప్తిపడలేదు.

**"సంఘం శరణం గచ్ఛామి".** ఈ సంఘానికి నేను ఏమిచెయ్యాలి? - అని ఆలోచించి, తనకు సంపద్భాగ్యాలు అనుగ్రహించిన భగవంతునికి అంజలి ఘటించి, సంఘానికి, తన పరిధిలో (పేదలకు) మహాభాగ్యం (అరోగ్యం) అందించాలని సంకల్పించారు. హోమియోవైద్యం నిరంతరంగా పఠించారు. మెలకువలు తత్త్వజ్ఞుల వల్లను, స్వీయానుభవం ద్వారాను తెలుసుకున్నారు. చిన్నచిన్న అనారోగ్య సమస్యలను పరిష్కరిస్తూ ఆత్మసంతృప్తిని అందుకొన్నారు. పేదలకు ఉచితంగా వ్యాధినిర్ణయం చేయటంలోనూ మందులు ఇవ్వటం లోనూ వారు తమ జన్మ చరితార్థమైనట్లు భావించి, వైద్యసేవలో స్నానపానాలు మరచిపోయేవారు. భార్య వెంకాయమ్మగారు వేడినీళ్ళు కాచి, స్నానం చేయమని పిల్లలతో కబురు పంపేది ఇంట్లోనుండి. "ఇదిగో! ఈ ఒక్కడికి మందుపొట్లాలు కట్టి వస్తాను. ఈ ఒక్కణ్ణి పంపించి - ఈ ఒక్కణ్ణి" అని అమ్మన్నగారు అంటూ, అరుగుమీద కూర్చుండి పొట్లాలు కడుతూనే ఉండేవారు. కాగిన నీళ్ళు చల్లారటం, మళ్ళీ కాచటం, మళ్ళీ చల్లారటం మూడునాలుగుసార్లు అయ్యేది. అమ్మన్నగారు అరుగుకు అతుక్కుని మందుపొట్లాలు కడుతూనే ఉండేవారు.

**శ్లో॥ నత్వం కామయే రాజ్యం న స్వర్గం నా పునర్భవం**
**కామయే దుఃఖ తప్తానాం ప్రాణినాం ఆర్తి నాశనమ్ !**

"నాకు రాజ్యమక్కరలేదు. స్వర్గము అసలే వద్దు! మోక్షము అంతకంటే వద్దు! దుఃఖముతో పరితపించు ప్రాణుల బాధను తొలగించుటయే నా కోరిక" - అన్నట్లుగా ఆ పనిలో తనను తాను మరచిపోయేవారు. ఈ సేవాభావం వీరి వరపుత్రునిలో విశ్వరూపాన్ని ధరించింది.

అమ్మన్నగారి భార్య వెంకాయమ్మగారు పరోపకారంలోనూ, దానధర్మాలలోనూ అమ్మన్నగారికి ముందుండేది. తన భర్త, తన ఐశ్వర్యం, తన సంతానం కూడా పరులకు తోడ్పడాలి అనుకొనేది. "నాకు ఆయుష్షు, నాకు ఐశ్వర్యం" అనుకొనే ఈ లోకంలో ఇలాంటివారు అక్కడక్కడా వ్రేళ్ళమీద వరకే లెక్కకు దొరుకుతారు. గ్రామంలో పేద యిల్లాళ్ళు ప్రసవించినట్లు తెలిస్తే, బాలింతరాలికి పాతబియ్యం, బిడ్డపొత్తిళ్ళకు పాతబట్టలు అభిమానంగా అందించేది ఆ మహాతల్లి వెంకాయమ్మగారు.

పుత్రుడు వైద్యవిద్యలో ఆరితేరి, వృత్తిలో అడుగుపెట్టబోతూ అమ్మకు పాదాభివందనంచేసి ఆశీస్సును అపేక్షించాడు. "నాయనా! పేదలను అభిమానంగా చూడు. అది నా కోరిక" అన్నది. "రెండు చేతులతో సంపాదించు, ఆస్తిలో ఆకాశ మంత ఎత్తు ఎదుగు" అనవలసిన అమ్మకు ఈ కోరిక ఏమిటి? అదే ఆ కుటుంబ లక్షణం. అమ్మమాట ప్రకారం పుత్రుడు రామబ్రహ్మంగారు ఉచితంగా వైద్యసేవలు అందిస్తూ, ఫీజులేని డాక్టరై నిర్విరామంగా సేవలందిస్తున్నారు. ఆ తల్లి ఆనందించి "నాయనా! మరో కోరిక. మందులు కూడా పేదలకు అందిస్తే బాగుండును" అన్నది ఆ కన్నతల్లి. అమ్మకోరికను అనుసరించి రామబ్రహ్మంగారు 10 సం॥లుగా శ్రీ రామకృష్ణ సేవాసమితిలో ప్రతీమంగళవారం ఉచితవైద్యపరీక్షలు, 15వేల రూపాయల మందులు పంపిణీచేయుట నిర్వర్తించుచున్నారు.

1939లో రెండవ ప్రపంచయుద్ధ సమయంలో విశాఖపట్నం, కాకినాడలమీద జపాన్‌వాళ్ళు బాంబులు వేసారు. ఆసందర్భంలో "స్వామి నిశ్రేయసానందజీ" శ్రీ రామకృష్ణ సేవాసమితిని తణుకుకు మార్చినారు. రామకృష్ణ -వివేకానంద భావప్రచారం పరిసర గ్రామాలలో చేస్తూ, మోర్త వాస్తవ్యులైన పెదఅమ్మన్నగారికి అత్యంత సన్నిహితు లయ్యారు. కుటుంబంలో ఒకరయ్యారు. గురువు, కులదైవం అయ్యారు. వారు నిర్వహించిన పుత్రకామేష్టిఫలితంగా అమ్మన్నగారికి సుపుత్రప్రాప్తి జరిగింది. ఆ వరపుత్రులే మన డా॥ రామబ్రహ్మంగారు. అమ్మన్నగారి తండ్రిపేరు "రామన్న" - వెంకాయమ్మగారి తండ్రిపేరు "బ్రహ్మయ్య" - రెండూ కలిసి వచ్చేలా లేక లేక కలిగిన తమ ఏక పుత్రుడికి "రామబ్రహ్మం" అని పేరు పెట్టుకున్నారు.

దైవానుగ్రహంతో జన్మించిన రామబ్రహ్మంగారు మన రామకృష్ణ సేవాసమితికి అంకితమయ్యారు. ఎక్కడా కనీవినీ ఎరుగని విధంగా లక్షలరూపాయల మందులు దానంచేస్తూ పేదల సేవలో ఆనందానుభూతిని పొందుతున్నారు. తమ జన్మ చరితార్థమయినట్లు భావిస్తున్నారు. ఇలాంటి లోకోపకారక పుత్రుణ్ణి కన్న అమ్మన్న, వెంకాయమ్మ దంపతులు ధన్యజీవులు. ఈ దంపతులు తమ తండ్రులిద్దరినీ (రామన్న, బ్రహ్మయ్యలను) తమ వరపుత్రునిలో చూచుకొంటూ, పుత్రోత్సాహాన్ని పొందారు. పరోపకారం పరమధర్మంగా తమ ఆశయాన్ని సర్వతో ముఖంగా నెరవేరుస్తున్న సత్పుత్రుణ్ణి ఈ పుణ్యదంపతులు స్వర్గంనుండి సర్వదా ఆశీర్వదిస్తున్నారు. సంఘసేవకు అంకితమైన సత్పుత్రుణ్ణి సంఘానికి అందించిన అమ్మన్న, వెంకాయమ్మ పుణ్యదంపతులకు అంకితంగా ఈ 'సత్యసందర్శనం' అందిస్తున్నాను.

**- టి.వి.కె. సోమయాజులు**

## వైద్యో నారాయణో హరిః
## డా॥ తాతిని రామబ్రహ్మంగారు

సీ॥ "స్వార్థమెఱుంగని వైద్యుండ" వనుటకు
ఉచితవైద్యవిధాన మొకటి సాక్షి!
"త్యాగభావము గల్గు ధన్యుండ" వనుటకు
దానధర్మములు ప్రత్యక్షసాక్షి!
"విద్యాభిమానివై వెలుగొందు" దనుటకు
హైస్కూలు భవనంబె అగును సాక్షి!
"పేదలపాలిటి పెన్నిధి" వనుటకు
వేలాది మందుల విలువ సాక్షి!

తే॥ "జ్ఞాని" వనుటకు చెఱుగని నవ్వు సాక్షి!
ఇన్ని సాక్ష్యాలు గల్గ నేనెన్ననేల?
తనరు నీ జీవితంబె ప్రత్యక్షసాక్షి!
"నడచు దేవుండ"వనుట కందఱును సాక్షి!!

– టి.వి.కె. సోమయాజులు (2010)

**27.2 అన్నయ్యనుగురించి డా॥ తాతిని రామబ్రహ్మంగారు:-**

శ్రీ టి.వి.కె.సోమయాజులుగారి పూర్తిపేరు తంగిరాల వెంకట కృష్ణ సోమయాజులుగారు. వీరు సంస్కృతాంధ్ర భాషలలో ఎన్నికగన్న పండితులు. ఆంగ్ల – హిందీ భాషలలో కూడా చక్కని ప్రవేశమున్నవారు. భారత–భాగవత–రామాయణాలు –భగవద్గీత వీరి అభిమాన గ్రంథాలు. ఏ విషయమైనా శ్రోతలను రంజింపచేస్తూ ప్రసంగించే ప్రజ్ఞ వీరికి వెన్నతో పెట్టిన విద్య. సమయపాలనములో వీరికి వీరే సాటి! ఉపన్యాస విషయము దాటి ప్రక్కకుపోవుట – ఇచ్చిన సమయమును మించి మాట్లాడుట, సభ్యులకు విసుగు పుట్టించుట – వీరికి చేతకాని పనులు. "దైవం నాకు కావలసినవన్నీ సమకూరుస్తున్నాడు" అనే సంతృప్తి కలవారు. అర్థం చేసుకొని ఆచరిస్తున్న అంశాలు అవటంవలన వీరుబోధించే ఆధ్యాత్మికవిషయాలు శ్రోతల హృదయాలకు హత్తు కొంటాయి. వీరిలో ఒక వైశంపాయనుడు – ఒక శుకమహర్షి – ఒక గీతాచార్యుడు గోచరిస్తారు. వీరిని మనసేవాసమితి గురుపీఠం అధిష్ఠించవలసినదిగా 21 సంవత్సరాల క్రిందట నేను, మా డా॥ ప్రసాద్‌గారు కోరియున్నాము. అప్పటినుండి ప్రతీరోజు

సాయంకాలం 4 గం॥ల నుండి 6 గం॥ల వరకు ఆధ్యాత్మిక ప్రవచనము నిర్వహిస్తున్నారు. "జగమెరిగిన బ్రాహ్మణునకు జందెమేల?" అన్నట్లుగా వీరినిగూర్చి చెప్పుట సూర్యుని - కాగడాతో చూపుట వంటిది! వీరికి ఆరోగ్య - ఉత్సాహశక్తులు సర్వదా గురుమహరాజ్ అనుగ్రహించాలని కోరుకొంటూ...

**- డా॥ తాతిని రామబ్రహ్మం ("సత్యసందర్శనం" నుండి)**

### 27.3 డా॥ జి.యస్.వి. ప్రసాద్‌గారు M.S. (ENT) :-

వీరి పూర్తిపేరు : "డాక్టర్ గొడవర్తి సత్యనారాయణ వరప్రసాద్‌గారు". ఈ డా॥ ప్రసాద్‌గారు మాకు మిక్కిలి ఆత్మీయులైన కుటుంబమిత్రులు. వీరి తల్లిగారి పుట్టిల్లు - మా స్వగ్రామం ఒక్కటే - తణుకు సమీపంలో 3 కి.మీ. దూరంలో ఉన్న "కాకుల ఇల్లిందలపఱ్ఱు". వీరి తల్లిగారు - మా పెద్దక్కయ్యగారు; వీరి పినతల్లిగారు - మా చిన్నక్కయ్య ("చెల్లక్క")గారు; వీరి మేనమామ రెడ్డి బుల్లిరాజుగారు - నేను మా స్వగ్రామంలోని ప్రాథమిక పాఠశాలలో చదువుకున్నాం. అందువల్ల వీరిని మా అన్నయ్య "మేనల్లుడు"గా సంబోధించేవారు. వీరు వృత్తిచేత వైద్యులైనా, ప్రవృత్తిచేత మంచి సాహిత్య రసికులు. ప్రతిసంవత్సరం ఉగాది పండుగనాడు ఒక కవినో లేక పండితుడినో "డా॥ జి.యస్.వి. ప్రసాద్ పురస్కారం"తో సత్కరిస్తూ ఉంటారు. వీరికి "అభినవ కృష్ణరాయ" అనే బిరుదు ఉన్నది. "భువన విజయం" సాహిత్య రూపకంలో శ్రీ కృష్ణదేవరాయల పాత్ర ధరిస్తూ ఉంటారు. డా॥ ప్రసాద్‌గారు శ్రీ నన్నయభట్టారక పీఠానికి అధ్యక్షులుగా మొదట 1994 నుండి 1996 వరకు; తిరిగి 1998 నుండి 2018 వరకు - మొత్తం 22 సం॥లు ఉండి ఎంతో సేవ చేశారు. ఇంత సుదీర్ఘకాలం నన్నయపీఠానికి అధ్యక్షులుగా ఉన్నవారు మరొకరు లేరు. వీరికాలంలో పీఠానికి లక్షరూపాయల మూలనిధిని ఏర్పాటు చేశారు. 1995లో తణుకులో పాతవూరు వంతెన దగ్గర నన్నయ కాంస్యవిగ్రహాన్ని ప్రతిష్ఠించారు. 2013లో తణుకు పురపాలకసంఘ భవనం దగ్గర "దేవరకొండ బాలగంగాధర తిలక్" (1921-1966) కాంస్య విగ్రహాన్ని స్థాపించారు. ఈ రెండు మహత్తర కార్యాలు డా॥ ప్రసాద్‌గారి హయాంలో జరిగాయని తణుకులో ఉన్న కవిపండితులు, సాహిత్యప్రియులు గుర్తుపెట్టుకోవాలి.

### 27.4 బాపినీడు దంపతులు:-

మా తణుకులో ధనికులైన మిక్కిలి ప్రసిద్ధికెక్కిన కమ్మవారి కుటుంబాలలో జమీందారులైన "ముళ్ళపూడి"వారి తరువాత "చిట్టూరివారు" చెప్పదగినవారు. ముళ్ళపూడి వెంకట్రాయుడుగారు ఉండ్రాజవరం జమీందారులు. వీరికి కొన్నివందల

ఎకరాల భూమి ఉండేది. వెంకట్రాయుడుగారి కుమారుడు ముళ్ళపూడి తిమ్మరాజుగారు – గొప్ప సాహిత్య ప్రియులు, సాహిత్య పోషకులు, "సాహితీవల్లభ" బిరుదాంకితులు. వీరి పేరుతో మా ఊళ్ళో ఒక గ్రంథాలయం కూడా నెలకొల్పబడింది. వీరు కుమారుడు హరిశ్చంద్ర ప్రసాద్‌గారు పెద్ద పారిశ్రామికవేత్త. మా తణుకులో "ఆంధ్రాషుగర్స్" ఫ్యాక్టరీని, "అక్కమాంబా టెక్స్‌టైల్స్"ను, ఇతర ప్రదేశాలలో మరికొన్ని పరిశ్రమలను స్థాపించారు. వీరికి "ఆంధ్రాబిర్లా" అని పేరు. వీరికి ఆత్మీయమిత్రులు, ప్రక్కింటివారు – చిట్టూరి ఇంద్రయ్యగారు. ఈ ఇంద్రయ్యగారి ధర్మపత్ని రాజమ్మగారు. ఈ పుణ్యదంపతులకు ఆరుగురు కొడుకులు, ఇద్దరు కూతుళ్ళు. వారు జ్యేష్ఠానుక్రమంగా "సీతారామయ్య–రంగారావు–కృష్ణమూర్తి–సత్యనారాయణ–వెంకటేశ్వరరావు–రత్తాయమ్మ–రాజశ్రీ–బాపినీడు". ఇంద్రయ్యగారి సంతానంలో చిట్టచివరివాడు మా ప్రాణమిత్రుడైన చిట్టూరి బాపినీడుగారు. మా తణుకు నియోజకవర్గానికి మొట్టమొదటి ఎం.ఎల్.ఏ. చిట్టూరి ఇంద్రయ్యగారు (1952). వీరు కుమారులు వెంకటేశ్వరరావుగారు, బాపినీడుగారు కూడా తణుకు ఎం.ఎల్.ఏ.లుగా ఘనవిజయాన్ని సాధించి ప్రజాసేవాతత్పరు లయ్యారు. బాపినీడుగారి ధర్మపత్ని విజయలక్ష్మిగారు. బాపినీడుగారు తణుకు హైస్కూలులో మా తమ్ముళ్ళు చి॥ భాస్కరరావుతోను, చి॥ కృష్ణమూర్తితోను చదువుకున్నారు. తరువాత కాకినాడ ఇంజనీరింగు కళాశాలలో డిప్లొమా చేశారు. వీరు 1936లో జన్మించి 2014లో స్వర్గస్థులయ్యారు. వీరి శ్రీమతి విజయలక్ష్మిగారు 1940లో జన్మించి, 2020లో పరమపదించారు. ఈ దంపతులకు ఒక కొడుకు, ఇద్దరు కూతుళ్ళు: శ్రీ నరేంద్ర–శ్రీమతి జయశ్రీ–శ్రీమతి రాజశ్రీ. (వీరిలో శ్రీమతి రాజశ్రీగారు ప్రముఖ పారిశ్రామికవేత్త శ్రీమల్లిన రామచంద్రరావుగారి చిన్న కోడలు.)

### 27.4.1 కీ.శే. చిట్టూరి బాపినీడుగారు:-

ఈయన మా కుటుంబానికి గొప్ప ఆపద్బాంధవుడు. మా అన్నదమ్ములు నలుగురికీ ఆప్తమిత్రుడు. మా కుటుంబానికి ఎన్నో ఉపకారాలు చేసినవాడు. మాకేకాదు, మా తణుకులో ఎందరో పేదవారికి ఎన్నో సహాయాలు చేశాడు బాపినీడుగారు. ఈయన, ఈయన భార్య కీ.శే. విజయలక్ష్మిగారు మా అన్నయ్యకు ఆధ్యాత్మిక శిష్యులు.

బాపినీడుగారి తండ్రిగారు చిట్టూరి ఇంద్రయ్యగారు ఉదారుడు, పరోపకార పరాయణుడు, సౌజన్యధన్యుడు, శాంతస్వభావుడు, గొప్పదాత. మా తణుకు నియోజకవర్గంనుండి మొట్టమొదట జరిగిన సాధారణ ఎన్నికలలో (1952లో) కాంగ్రెసుపార్టీనుండి ఎం.ఎల్.ఏ.గా ఘనవిజయం సాధించినవారు. తరువాత

ఆంధ్రరాష్ట్రం ముఖ్యమంత్రి అయిన నీలం సంజీవరెడ్డిగారికి ఆప్తమిత్రులు. బాపినీడుగారు వారి అన్నలు కలిసి తమ తండ్రిపేరుతో మా తణుకులో డిగ్రీకళాశాలను స్థాపించారు. ఇదే మా ఊరులో మొట్టమొదటి కళాశాల. దీనివల్ల మా తణుకులోను, దీని చుట్టుప్రక్కల గ్రామాలలోను ఉన్న యువతీయువకులు కళాశాలవిద్యకోసం రాజమండ్రి, ఏలూరు, భీమవరం, కాకినాడ వెళ్ళవలసిన కష్టం తప్పింది. తండ్రి వారసత్వాన్ని నిలబెడుతూ, బాపినీడుగారు, వారి అన్నగారు వెంకటేశ్వరరావుగారు మా తణుకులో ఎం.ఎల్.ఏ.లుగా గెలిచి ప్రజాసేవచేశారు.

మాకు పశ్చిమగోదావరిజిల్లా ఇరగవరం దగ్గర "ఎఱ్ఱాయి చెఱువు" అనే గ్రామంలో ఆరు ఎకరాల మాగాణి పొలం ఉండేది. దానిని "జుత్తిగ" అనే యింటిపేరుగల శెట్టి బలిజలు - ఐదుగురు అన్నదమ్ములు, వారి తండ్రి వెఱ్ఱిరామయ్య కాలంనుండీ (మా తాత జగ్గన్నగారి కాలంనుండీ) వ్యవసాయం చేస్తూ మాకు ఎకరానికి 10 బస్తాల ధాన్యం మక్తా క్రింద ఇచ్చేవారు. మా రైతుల పేర్లు వరుసగా "సత్తెయ్య - తాత - గడ్డెయ్య - మంగన్న-సాహేబు". వీరు మా తండ్రిగారి సమకాలికులు. వీరికాలంలో అంతా సక్రమంగానే జరుగుతూ వచ్చింది. వీరి కొడుకుల కాలంలో (వాళ్ళ అతి తెలివివల్ల) మాకూ వాళ్ళకీ ఒకసారి చిన్న ఘర్షణ వచ్చింది. మేము బాపినీడుతో చెప్పాం. ఆయన తన కారులో వచ్చి, ఒక రైతుకూలీచేత మా పొలంలో మూడు చోట్ల గునపంతో త్రవ్వించి, ఆ భూమి మీద మాకుగల అధికారాన్ని స్థాపించి, ఆ రైతులను హెచ్చరించి, ఆ సమస్య పరిష్కరించాడు. అంత ఆత్మీయుడు మాకు బాపినీడుగారు.

1968లో మా నాన్నగారు చనిపోయారు. మేము 12 రోజులు కర్మకాండలు చేస్తున్నాం. బాపినీడుగారు కొన్ని తియ్యగుమ్మడికాయలు తీసికొని మా యింటికి వచ్చాడు. మేము మైలపాటిస్తూ అతనిని ముట్టుకోలేదు. బాపినీడుగారు నవ్వుతూ: "మీ బ్రాహ్మణులు ఈ మైలు-గీలు అన్నీ పాటిస్తారు. ఎప్పుడూ మడీదడీతో ఉంటారు. మేము (కమ్మవారు) ఏమీ పాటించం. అయినా మా దగ్గర డబ్బులుంటాయి; మీ దగ్గర ఉండవు! ఏమిటి కారణం?" అని అడిగాడు. నేను వెంటనే ఏమీ సమాధానం చెప్పలేక పోయాను. తరువాత బాగా ఆలోచిస్తే కొన్ని కారణాలు స్ఫురించాయి:-

కమ్మవారు ఎంతో కష్టపడి వ్యవసాయం చేస్తారు. పాడిపంటలు, సిరిసంపదలు వీరి యింట సమృద్ధిగా ఉంటాయి. ధనం విషయంలో వీరు ఎంతో జాగ్రత్తగా ఉంటారు. అనవసరంగా ఒక్క పైసా కూడా ఖర్చు చేయరు. వీరిలో ఎంతటి కోటీశ్వరులైనా సరే దానధర్మాలు చేయడంలో కొంచెం వెనకాడతారు. ఈ కారణాలవల్ల కమ్మవారి యింట సిరిసంపదలు నిత్యం తాండవిస్తూ ఉంటాయి. "కష్టేఫలి" అన్నారు

మన పెద్దలు. క్రీ.శ. 1852లో సర్ ఆర్థర్ కాటన్ (1803-1896) గోదావరినదికి ధవళేశ్వరం దగ్గర పెద్ద ఆనకట్ట కట్టించాడు. దానితో గోదావరి డెల్టా భూములన్నింటికి కాలువలుద్వారా నీటిసదుపాయం వచ్చింది. అప్పటినుండి ఇప్పటివరకు (గత 170 సం.ల నుండి) చెమటోడ్చి బురదలో వ్యవసాయం చేస్తూ బంగారు పంటలు (వరి, చెరకు) పండిస్తున్నది కమ్మవారే! తరువాత కృష్ణానదిమీద శ్రీశైలం, నాగార్జున సాగర్, ప్రకాశం ప్రాజెక్టులు రావడంతో కృష్ణా, గుంటూరుజిల్లాలు కూడా మాగాణి భూములుగా మారిపోయాయి. రాయలసీమ ప్రాంతంలోను, తెలంగాణ-కర్ణాటక రాష్ట్రాలలోను, ఎక్కడ నీటి సదుపాయం వచ్చినా, అక్కడికి వలసపోయి, ఆయా ప్రాంతాలను సస్యశ్యామలం చేసింది కమ్మవారే! నేటి కర్ణాటక రాష్ట్రంలో బళ్ళారి, హొస్పేట, గంగావతి, సింధనూరు, రాయచూరు షిమోగా మొదలైన జిల్లాల్లో, సుమారు 70-80 ఏళ్ళ క్రిందటనే ఎన్నో కమ్మవారి కుటుంబాలు వలసవెళ్ళి స్థిరపడ్డాయి. పొలాల్లోనే ఇళ్ళు కట్టుకొని, క్యాంపులు వేసికొని, అష్టకష్టాలు పడి, ఆయా ప్రాంతాలను బంగారు పంటభూములుగా మార్చిన వ్యవసాయ మాంత్రికులు కమ్మవారు! అందువల్ల ఈ కష్టజీవుల్ని లక్ష్మీదేవి ఎల్లప్పుడూ కటాక్షిస్తూ వుంటుంది.

బ్రాహ్మణులు వీరికి పూర్తిగా వ్యతిరేకం. ఎన్ని ఎకరాల పొలం ఉన్నా సొంతంగా వ్యవసాయం చేసుకోలేరు. ఒకరూ ఇద్దరూ వ్యవసాయ ప్రయత్నాలు చేసినా విఫలమయ్యారు. వీరి అసమర్థ వ్యవసాయాన్ని గురించి తెలుగులో ఒక సామెత పుట్టింది. "బ్రాహ్మణవ్యవసాయం చేస్తావా? పల్లకీ ఎక్కుతావా?" - అంటే "పల్లకీ అయితే కుదుపుతుంది; కాబట్టి బ్రాహ్మణ వ్యవసాయమే చేస్తాను!" అన్నాడట. అసలు బ్రాహ్మణుడైనవాడు మేడిపట్టి పొలం దున్నడం మహాపాపంగా భావిస్తారు-శ్రోత్రియులైన బ్రాహ్మణులు. "హరికథా పితామహుడు" ఆదిభట్ల నారాయణదాసుగారు తన చిన్నతనంలో తెలియక సరదాగా మేడపట్టి నాగలితో పొలందున్ని, తండ్రిగారిచేత చీవాట్లు తిన్నారు! (చూ.వారి స్వీయచరిత్ర "నా యెఱుక"!) కాబట్టి బ్రాహ్మణులు తమ భూముల్ని కమ్మవారికి, కాపులకు కౌలుకు ఇచ్చి, వారు ఇచ్చినంత పుచ్చుకునేవారు. "ఈ ఏడాది తుఫాను వచ్చిందండి బాబూ! పంటలు పండలేదు!" అంటే, "సరేలే!" అని ఊరుకొనేవారు. అసలు చాలామంది బ్రాహ్మణ ఈనాందారులకు వాళ్ళ పొలాలు ఎక్కడెక్కడున్నాయో కూడా సరిగా తెలియదు! పూర్తిగా రైతుల మీదనే ఆధారపడి ఉంటారు. బ్రాహ్మణులలో పెద్ద పెద్ద అగ్రహారీకులందరూ యజ్ఞయాగాదులు చేసి, సంతర్పణలు చేసి, దానధర్మాలు చేసి, గుళ్ళూ గోపురాలూ కట్టించి, కుటుంబ

నియంత్రణం ఏ మాత్రమూ పాటించకుండా, కుచేల సంతానాన్ని కని, వందలాది ఎకరాలు పోగొట్టుకొని, ఈనాడు పేదవాళ్ళుగా మిగిలిపోయారు! (ఉదా॥ మా తణుకు ప్రక్కనే ఉన్న "కాకరపఱ్ఱు" అగ్రహారం.)

బ్రాహ్మణులు బాగా తిని వేదం చదువుతూ కూర్చుంటారు. ధారాశుద్ధిగా నేయి లేనిదే భోజనం చేయరు. నా మిత్రులు ప్రొ॥ మదద్దూరి సుబ్బారెడ్డిగారు-బ్రహ్మానందరెడ్డిగారి దగ్గరి బంధువు-గుంటూరుజిల్లాలో "సొలస" అనే గ్రామానికి చెందినవారు. అది రెడ్డిరాజులు శ్రీనాథునికి దానంచేసిన అగ్రహారం అని ఆయన సగర్వంగా నాతో చెపుతూ ఉండేవారు. ఆయన ఇంకో ముఖ్యవిషయం కూడా చెప్పారు: "సుబ్బారావ్! మా ఊళ్ళో ఒక బ్రాహ్మణుడు కేవలం నేతికోసం మూడు ఎకరాల పొలం అమ్మివేశాడయ్యా!" - ఇదీ మా బ్రాహ్మణుల పద్ధతి! బ్రాహ్మణులు వేదాలు అధ్యయనం చేస్తూ, అధ్యాపనం చేస్తూ, జ్ఞానాన్ని సంరక్షిస్తూ బ్రతకవలసినవారు. అందువల్ల మడీ దడీ పాటిస్తూ, ఆచారవ్యవహారాలు ఆచరిస్తూ ఉంటారు. సాధారణంగా ఎక్కువమంది పేదవారుగానే ఉంటారు. చాలామందికి ధనం సంపాదించాలనే ఆసక్తి కూడా పెద్దగా ఉండదు. ఉన్నా వేదపండితులు ధనం ఎలా సంపాదించగలరు? పెద్దలు సమకూర్చిన ఈనాము భూములున్నవారు కొద్దిమంది మాత్రం ధనవంతులుగా ఉండవచ్చు. ఇటీవలికాలంలో బ్రాహ్మణులు చాలామంది వేదాధ్యయనం వదిలిపెట్టి, పల్లెల్లోని పొలాలన్నీ అమ్మివేసి, నగరాలకు వలసపోయి, ఆంగ్లవిద్యలు బాగా చదువుకొని, పెద్దపెద్ద ఉద్యోగాలు చేస్తూ, ధనవంతులుగా బ్రతుకుతున్నారు. పల్లెల్లో ఉన్న వీరి పొలాలు, ఇళ్ళు అన్నీ కమ్మ, రెడ్డి, కాపు మొదలైన రైతుల చేతుల్లోకి వెళ్ళిపోయాయి! ఇప్పుడు ఆ పొలాలన్నీ కమ్మ-రెడ్డి-కాపులనుండి దళితుల చేతుల్లోకి వెళ్ళిపోతున్నాయి. ఎందుచేతనంటే - ధనికులైన భూస్వాములైన ఈ నాల్గవ జాతివారు కూడా వ్యవసాయం మానివేసి, బ్రాహ్మణుల అడుగుజాడల్లో నడుస్తూ, వారితో పోటీపడి బాగా చదువుకొని, పెద్ద పెద్ద ఉద్యోగాలు సంపాదించుకొని, అమెరికా వంటి ఇతర దేశాలలో స్థిరపడిపోతున్నారు. నిరుపేదలైన దళితులే వ్యవసాయాన్ని అంటిపెట్టుకొని పల్లెపట్టున ఉంటున్నారు. "దున్నేవాడిదే భూమి" అన్నట్టుగా క్రమంగా ఈ పొలాలన్నీ వారి చేతుల్లోకి వెళ్ళిపోతున్నాయి!

చిట్టూరి ఇంద్రయ్యగారికి సుమారు 60 ఎకరాలకుపైగానే మాగాణి భూములు ఉండేవి. ఆరుగురు కొడుకులకూ ఒక్కొక్కరికి 9 ఎకరాల పొలం పంచి ఇచ్చారు. బాపినీడుగారు కొన్ని సాహసాలు చేసి, తన వాటాను కొంత అభివృద్ధి చేసుకున్నాడు.

"ఇంద్రా డిస్టలరీస్" అనే ఫ్యాక్టరీ పెట్టాడు; విగ్గులు తయారుచేసే ఫ్యాక్టరీ పెట్టాడు. కొన్నాళ్ళు నడిపి, ఈ రెండింటినీ అమ్మివేశాడు. (వీటిని కొనుక్కున్నవాళ్ళు మాత్రం బాగా బాగుపడ్డారు! కోటీశ్వరులైపోయారు!). తాడేపల్లిగూడెంలో 100 ఎకరాల పొలం కొని చెరకుతోట వేశాడు. కిట్టనివాళ్ళెవరో ఆ తోటకు నిప్పు పెట్టారు. కొన్ని లక్షల రూపాయల పంట నష్టపోయాడు. కర్ణాటకలో "Electrical Power Plants" పెట్టాడు. తరువాత వాటినీ అమ్మివేశాడు. తణుకు Main Road లో, రైల్వేస్టేషన్ సమీపంలో, "ఇంద్రలోక్ ఎవెన్యూ" అనే పేరుతో అందమైన Flats కట్టించి అమ్మాడు. (దీంట్లో నేనూ, మా బుల్లితమ్ముడూ చెరొక ఫ్లాటూ తీసుకున్నాం.) ఎన్నికలలో నిలబడ్డాడు. ఎంతో డబ్బు ఖర్చుపెట్టాడు. పాతవూరు వంతెన సమీపంలో ఒక స్టార్ హోటలు కట్టించాడు. (దైవవశాత్తు దీనిని మాత్రం అమ్మలేదు. ఇప్పుడు ఆయన కొడుకు శ్రీ నరేంద్ర దీనిని నడుపుతున్నాడు.) పైన చెప్పిన సాహసకార్యాలన్నీ చూసి, బాపినీడు గురువైన మా అన్నయ్య: "నాయనా! ఇటువంటి పనులు చేసి, తండ్రి ఇచ్చిన ఆస్తిని పోగొట్టుకోవద్దు! జాగ్రత్త!!" అని ఎన్నోసార్లు హెచ్చరించాడు. దానికి బాపినీడుగారు పకపకా నవ్వుతూ- "అయ్యా! గురువుగారూ! నేను ఎన్ని సాహసాలు చేసినా మా నాన్న ఇచ్చిన తొమ్మిది ఎకరాల ఆస్తికన్నా క్రిందికి వెళ్ళను! గ్యారంటీ! మీరేమీ భయపడకండి! " అనేవాడు. అలాగే తణుకు-పాలంగి పొలిమేరలో 20 ఎకరాల పొలం కొని, దానిలో రోడ్డును ఆనుకొని ఉన్న ఎకరం నేలలో దేవేంద్రభవనంలాంటి అందమైన భవనం కట్టుకొని అందులో హాయిగా నివసించాడు.

బాపినీడుగారు గొప్ప స్వాభిమానం కలిగిన వ్యక్తి. ఆయనకు ఇద్దరు కూతుళ్ళు; ఒక కొడుకు. ఇద్దరు కూతుళ్ళకూ పెండ్లి చేసినప్పుడు పురోహితుడికి తన నియమం ఒకటి చెప్పి, ఆ ప్రకారం పెళ్ళిచేశాడు. మన హిందూవివాహపద్ధతిలో కొన్ని ఆచారాలుంటాయి. వరుడు సాక్షాత్తు విష్ణుస్వరూపుడు. అందువల్ల వధువుతండ్రి (వయస్సులో ఎంత పెద్దవాడైనా, వృద్ధుడైనా) యువకుడైన వరుని కాళ్లు కడిగి, ఆ నీళ్ళు నెత్తిమీద చల్లుకోవాలి. ఇది తరతరాలుగా వస్తున్న ఆచారం. ఇది బాపినీడుగారికి నచ్చలేదు. పురోహితుడితో గట్టిగా చెప్పి, ఆ "కాళ్ళు కడిగే" కార్యక్రమం తీసివేయించాడు. తన ఇద్దరు అమ్మాయిల పెళ్ళిళ్ళలోనూ ఈ ఆచారాన్ని అతిక్రమించాడు. "ఏమిటి ఇలా చేశారు?" అని మా అన్నదమ్ములు అడిగితే, "ఆడెవడివో కాళ్ళు నేను కడగడం ఏంటండీ? పైగా ఆ నీళ్ళు నెత్తిమీద చల్లుకోవాలా? ఛత్! నాన్‌సెన్స్! కావలిస్తే కట్నం ఇంకో లక్షరూపాయలు ఎక్కువ తీసుకోమనండి! అంతేకాని,

ఆడి కాళ్ళు మాత్రం నేను కడగను!!"అని ఖచ్చితంగా చెప్పేశాడు. ఆధునిక (అభ్యుదయ) దృష్టితో చూస్తే, మా బాపినీడుగారి వాదం సమంజసమే అనిపిస్తోంది నాకు!

ఈ సందర్భంగా ఇంకో విచిత్రమైన విషయం చెప్పాలి. బెంగుళూరులో నా మిత్రుడు ఒకాయన ఉండేవారు. ఆయన పేరు మునిరెడ్డిగారు. ఆయన ఎక్కువగా ఏమీ చదువుకోలేదు. కాని కాంట్రాక్టులు, రియల్ ఎస్టేట్ వ్యాపారం చేసి, బాగా సంపాదించాడు. ఆయనకు ఐదుగురు కూతుళ్ళు, ఇద్దరు కొడుకులు. ధనికుడు కాబట్టి కూతుళ్ళందరికీ బాగా చదువులు చెప్పించి, యోగ్యులైన వరులకిచ్చి పెండ్లిండ్లు చేశాడు. ఈ పెళ్ళిళ్ళల్లో ఆయన ఒక గమ్మత్తు చేశాడు. హిందూవివాహంలో సరిగ్గా శుభ ముహూర్తానికి వధూవరులచేత పరస్పరం ఒకేసారి ఒకరి నెత్తిమీద మరొకరిచేత జీలకర్రా – బెల్లం పెట్టిస్తారు. మన మూఢనమ్మకాలతో ఒక నమ్మకం ఏమిటంటే – వధూవరులలో ఎవరు ఎవరి నెత్తిమీద ముందుగా జీలకర్రా – బెల్లం పెడతారో, ఆ వ్యక్తి తనకు జీవితాంతం లొంగి ఉంటాడని (ఉంటుందని) నమ్మకం. ఈ నమ్మకం మునిరెడ్డిగారికి బాగా ఉంది. అందువల్ల ఆయన పురోహితుడితో ముందుగా రహస్యంగా మాట్లాడి, పెండ్లి చేయించడానికి ఆయనకిచ్చే సంభావనకు అదనంగా మరో 500 రూ.లు ముట్టజెప్పి, "మా అమ్మాయిచేత ముందుగా వరుని నెత్తిమీద జీలకర్రా బెల్లం పెట్టించండి. తరువాత అతనిచేత పెట్టించండి!" అని చెప్పేవాడు. లంచం తిన్న ఆ పురోహితుడు అలాగే చేయించేవాడు. ఐదుగురు కూతుళ్ళ పెళ్ళిళ్ళూ ఇలాగే చేయిచాడు మా మునిరెడ్డిగారు. ఆయన కాంట్రాక్టరు కదా! లంచాలకు పనులు సులభంగా అవుతాయని ఆయనకు బాగా తెలుసు! అల్లుడు తన కూతురి చెప్పుచేతుల్లో ఉండాలని ప్రతితండ్రీ కోరుకుంటాడు కదా! (కాని తన కొడుకు మాత్రం కోడలి చెప్పుచేతల్లో ఉండకూడదు. ఇదీ మానవ స్వభావం!) వధూవరులలో ఎవరు ఎవరి నెత్తిమీద ముందుగా జీలకర్రా బెల్లం పెట్టినా, జరిగే సత్యం ఏమిటంటే–నూటికి 90 మంది భర్తలు భార్యల చేతుల్లో కీలుబొమ్మలుగానే ఉంటున్నారు. భర్త యింటికి తల (Head) వంటి యజమాని అయినా, ఆ తలను త్రిప్పే మెడమాత్రం భార్యామణియే!

2014లో ఈ బాపినీడుగారు చనిపోయినప్పుడు మా అన్నయ్య ఎంతో హృదయ వేదనతో కొన్ని అందమైన పద్యాలు వ్రాశాడు. నాకూ, మా బుల్లితమ్ముడికీ ఆ పద్యాలు పంపించాడు. ఇప్పుడు ఎంత శోధించినా ఆ పద్యాలు మా ఇద్దరి దగ్గరా కూడా లభించలేదు. చాలా బాధపడ్డాను.

### 27.4.2 కీ.శే. చిట్టూరి విజయలక్ష్మిగారు

ఈమె చిట్టూరి బాపినీడుగారి ధర్మపత్ని. ఏమి చదువుకున్నారో నాకు అంతగా తెలియదుగాని, గొప్ప ఆధ్యాత్మిక దృష్టి కలవారు. మా అన్నయ్యగారికి పరమభక్తురాలైన శిష్యురాలు. ఆయన ప్రతిరోజూ వీరి యింటికి వెళ్ళి, భగవద్గీత, రామాయణ భారత భాగవతాదులు చెప్పేవాడు. ఒకసారి నేను మా బుల్లితమ్ముడు – కర్నల్ తంగిరాల కృష్ణమూర్తి బాపినీడుగారి యింట్లో ఒక రోజు ఉండిపోయాం. రాత్రి అక్కడే భోజనం చేసి పడుకుని, మర్నాడు లేచి, దేవేంద్రభవనంలాంటివారి యింటి ముందున్న విశాలమైన పార్కులో morning walking చేస్తున్నాం. విజయలక్ష్మిగారు కూడా మాతోపాటు నడుస్తున్నారు. అప్పుడు ఆమె మా బుల్లితమ్ముణ్ణి వేదాంతపరమైన, మిక్కిలి జటిలమైన, బ్రహ్మజిజ్ఞాసలాంటి ఒక కఠినమైన ప్రశ్న వేశారు:–

"జీవితం – అంటే ఏమిటి? పుట్టడం, పెరగడం, చదువుకోవడం, ఉద్యోగం చెయ్యడం, పెళ్ళిచేసుకోవడం, పిల్లల్ని కనడం, ధనం సంపాదించడం, దానిని పిల్లలకు పంచి ఇవ్వడం, ముసలితనంతో శరీర బాధలు పడటం, చనిపోవడం – ఇంతేనా? ఇంకేమైనా ఉందా?"

ఈ ప్రశ్ననుగురించి ఆలోచిస్తే, విజయలక్ష్మిగారిలో ఎంతటి గాఢమైన తాత్త్విక జిజ్ఞాస ఉన్నదో మనకు తెలుస్తుంది. మా తమ్ముడు మిలటరీవాడు. పుస్తకాలేమీ చదివేరకంకాదు. వాడు ఈ ప్రశ్నతో కంగారుపడి, నా దగ్గరకు పరుగెత్తుకొని వచ్చి, "ఒరేయ్! విజయ ఇలా ప్రశ్నిస్తోంది. 'నాకేమీ తెలియదు, మా అన్నయ్య నడుగుతాను' అని చెప్పి నీ దగ్గరకు వచ్చాను!" అన్నాడు. నేను విజయలక్ష్మిగారి దగ్గరకు వెళ్ళి "అమ్మా! ఇది చాలా కష్టమైన ప్రశ్న. దీనికి వెంటనే సమాధానం చెప్పడం కష్టం. నాకు కొంతకాలం వ్యవధి ఇవ్వండి. నేను పండితుల్ని, కవుల్ని, వేదాంతుల్ని అడిగి తెలిసికొని మీకు సమాధానం చెపుతాను" అన్నాను.

విజయలక్ష్మిగారు వేసిన ప్రశ్న పైకి సరళంగా కనబడుతోంది కాని, ఇది మిక్కిలి జటిలమైన ప్రశ్న. దీనిని సరళంగా అర్థంచేసికొని, జీవితమంటే "జనన–మరణాల మధ్యస్థితి" అని చెప్పవచ్చు. కాని ఆమె ఆశించే సమాధానం ఇదికాదు. ఈ ప్రశ్నకు అర్థం "జీవితమంటే ఏమిటి?" అని కాదు. జనన–మరణాల మధ్యస్థితి జీవితమని అందరికీ తెలుసు; ఆమెకూ తెలుసు. అదికాదు ఆమె ప్రశ్నించేది; "జీవితపరమార్థ మేమిటి?" అని ఆమె ప్రశ్నలోని ఆంతర్యం. దీనికి సమాధానం కావాలి మనకు.

ఈ సంఘటన జరిగి సుమారు 30–40 ఏళ్ళు అయిపోయింది. నేను అప్పటినుంచీ ఈ ప్రశ్నకు సమాధానంకోసం వెతుకుతూనే ఉన్నాను. కొందరు ఏవేవో

సమాధానాలు చెప్పారు; అవి నాకు అంత సంతృప్తికరంగా లేవు. కొంత విషయం సేకరించాను. దానినంతా ఒక చిన్న వ్యాసంగా వ్రాసి ఆమెకు పంపుదామనుకున్నాను. ఇంతలో ఆమె స్వర్గస్థులయ్యారు. నా కన్నా బాగా చిన్నవారు. అయినా మృత్యువు ఎవరిని ఎప్పుడు కబళిస్తుందో చెప్పలేం కదా!

**1. డా॥ ప్రసాదరాయ కులపతిగారు (ప్రస్తుతం కుర్తాళం పీఠాధిపతి "శ్రీ సిద్ధేశ్వరానంద భారతీస్వామి"వారు):-**

"జీవితం అందరికీ ఒక లాగ ఉండదు. ఒక్కొక్కరికి ఒక్కొక్క లాగ ఉంటుంది. కొందరికి వ్యభిచరించడమే జీవితం! కొందరికి జూదమాడటమే జీవితం! కొందరికి ధనం సంపాదించడమే జీవితం! కొందరికి మద్యపానం చేయడమే జీవితం! కాబట్టి జీవితం - అంటే ఇది అని ఒక్కదానిని నిర్ణయించి చెప్పలేము" - అన్నారు.

**2. డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు:-**

ఒకసారి నేను "కవిత్రయ అవార్డు" తీసికొనేందుకు" మా ఆవిడతో కలిసి నెల్లూరు వెళ్ళాను. అప్పుడు ఒక ఉదయం మాన్యులు డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు నన్ను మా ఆవిడనూ వారి యింటికి అల్పాహారానికి పిలిచారు. మాటల సందర్భంలో వారిని "జీవితం-అంటే ఏమిటి?" అని ప్రశ్నించాను. "ఇంత హఠాత్తుగా అడిగితే ఎలాగ చెప్పడం?" అని మొదట సందేహం వెలిబుచ్చినా, వెంటనే ఇలా అన్నారు: "ప్రతిజీవి, తన సుఖాన్ని అన్వేషిస్తూ, ప్రయాణం చేయడమే జీవితం!". ఈ సమాధానం నాకు చాలా బాగా నచ్చింది. ఇది జీవితానికి సమగ్రమైన ఒక గొప్ప నిర్వచనమని నేను భావిస్తున్నాను.

మన వేదాలు, ఉపనిషత్తులు, రామాయణ-భారత-భాగవతాలు, భగవద్గీత, పురాణాలు, కావ్యాలు, ప్రబంధాలు-మొదలైనవాటిలో ఈ ప్రశ్నకు సమాధానం దొరుకుతుంది. శంకర-రామానుజ-మధ్వ-రామకృష్ణ పరమహంస-వివేకానంద మొదలైన మహనీయుల రచనలలోను ఈ ప్రశ్నకు సమాధానం దొరుకుతుంది. నేను ఇటీవల కొన్ని పుస్తకాలు చదువుతుంటే కొన్ని జీవిత నిర్వచనాలు లభించాయి. అలాగే కొందరు పండితుల్ని సంప్రదిస్తే వారు కొన్ని సమాధానాలు చెప్పారు. వాటిలో కొన్నింటిని దిగువ యిస్తున్నాను:-

**1. ఒక సంస్కృత కవి:-** కోటి గ్రంథాలలో ఉండే సారాన్ని ఒక్క శ్లోకంలోని సగభాగంలో చెప్పగలను- అన్నాడు ఒక పూర్వకవి. ఇతరులకు ఉపకారం చేయడమే పుణ్యం; పరపీడనమే పాపం!

**శ్లో॥ శ్లోకార్థేన ప్రవక్ష్యామి, యదుక్తం గ్రంథ కోటిభిః!**
**పరోపకారః పుణ్యాయ, పాపాయ పరపీడనమ్॥**

ఈ శ్లోకాన్నిబట్టి బ్రతికినంతకాలం పుణ్యాలు చేస్తూ, పాపాలు చేయకుండా ఉండటమే జీవితపరమార్థమని గ్రహించవచ్చును.

**2. ఆచార్య శలాక రఘునాథశర్మగారు:-** "పుట్టుటనుండి గిట్టుటవరకూ జీవి తన కర్మఫలాన్ని అనుభవిస్తూ ఉండటమే జీవితం." కర్మలు మూడు రకాలు: (1) ప్రారబ్ధకర్మలు - పూర్వజన్మనుండి ఈ జన్మకు సంక్రమించినవి. (2) సంచిత కర్మలు-ఈ జన్మలో చేస్తున్నవి. (3) ఆగామి కర్మలు - పునర్జన్మలోకి వచ్చేవి.

**3. శ్రీకాశీభొట్ల సత్యనారాయణగారు:-** "జనన-మరణాల మధ్యస్థితి జీవితం. మానవుడు సత్త్వరజస్తమోగుణాలలో సత్త్వగుణాన్ని పెంపొందించుకోవడమే జీవిత పరమార్థం."

**4. పద్మశ్రీ యస్.వి.రామారావుగారు (ప్రముఖ ఆధునిక చిత్రకారులు):-** "జీవితం అంటే జ్ఞాపకాల దొంతర్లు. ఎవరి జ్ఞాపకాలు వారివి. అందుకే మన జీవితాలు విభిన్నంగా, మన ఆలోచనలు మరొకరితో పోల్చబడనివిగా ఉంటాయి." (జ్ఞాపకాల జడివాన, మిసిమి, నవంబరు 2021, పుట-85)

**5. కీ.శే.టి.వి.కె. సోమయాజులుగారు:-** (1)"జీవితం పెద్దకల. మృత్యువు దానికి ముగింపు. కన్ను తెరిస్తే కరిగిపోయేది స్వప్నం! కన్ను మూస్తే అంతరించేది జీవిత స్వప్నం!" (-సత్యసందర్శనం). (2) "పుట్టుకకు - చావుకు మధ్య సందేహం లాంటిది జీవితం. ఇది భగవంతుడు మనకిచ్చిన పరిమిత కాలం" (-సత్యసందర్శనం). 3. "జీవితం పెద్దకల. కొందరికి అది మధురస్వప్నం; మరికొందరికి పీడకల!" (-సత్యసందర్శనం) 4. "ధర్మార్థకామమోక్ష సాధనమే జీవితలక్ష్యం" (-జ్ఞానతరంగాలు).

**6. భువనచంద్ర-"వాళ్ళు":-** మద్రాసులో "భువనచంద్ర" అనే కవి, రచయిత, ఉన్నారు. ఆయన సినిమాలలో పాటలు వ్రాస్తూ ఉంటారు. పూర్వాశ్రమంలో ఆయన ÿ¿£$₸ ³ ¯ –<ÃÐ (Air force లో పనిచేశారు). ఆ ఉద్యోగం చేస్తూండగా ఆయనకు మన విజయలక్ష్మిగారిలాగే "జీవితమంటే ఏమిటి?" (అంటే - జీవిత "పరమార్థమేమిటి?'') అనే ప్రశ్న వచ్చి, సమాధానంకోసం నడుచుకుంటూ హిమాలయాల్లోకి వెళ్ళిపోయాడు. అక్కడ కొందరు యోగుల్ని, తపస్వుల్ని, స్వామీజీల్ని, కొందరు మహానుభావుల్ని కలుసుకున్నాడు. తన అనుభవాలన్నీ "పాదచారి" అనే మారుపేరుతో "వాళ్ళు" (అలౌకిక ప్రపంచ దర్శనం) అనే 264 పుటల గ్రంథాన్ని

రచించాడు. (ప్రథమ ముద్రణ: సెప్టెంబరు 2015; ద్వితీయ ముద్రణ: సెప్టెంబరు 2018). ఈ పుస్తకంలో విజయలక్ష్మిగారి తాత్త్వికప్రశ్నకు అక్కడక్కడ రకరకాల సమాధానాలు కనపడ్డాయి నాకు. వాటిని దిగువ ఇస్తున్నాను:-

(1) కొందరు బెంగాలీలు హిమాలయాల్లో ఉన్న ఒక స్వామీజీని చూడటానికి వచ్చారు. వారిలో ఒక యువకుడు స్వామీజీ దగ్గరకు వచ్చి "జీవితానికి అసలు అర్థం అనేది ఉందంటారా?" అని ప్రశ్నించాడు.

స్వామీజీ:- "కావాలనుకుంటే ఉంది... లేదంటే లేదు!"

యువకుడు:- "అదెలాగ?"

స్వామీజీ:- "ఇందాక నువ్వో సిగరెట్టు మీ వాళ్ళు చూడకుండా కాల్చివచ్చావు కదూ?"

యువకుడు:- "అవును! అది మాకెలా తెలుసు?"

స్వామీజీ:- "అది అలా వుంచు! కాల్చావా? లేదా?

యువకుడు:- "కాల్చాను!"

స్వామీజీ:- "నీ జీవితం ఒక సిగరెట్టనుకో! నీ పుట్టుకతో, అంటే నీ బొడ్డును కొయ్యడంతో అది వెలిగించబడింది. నువ్వు కాల్చినా కాల్చకపోయినా అది మధ్యలోనో, చివరిదాకానో కాలి ఆరిపోతుంది.... నీ జీవితాన్ని అనుభవించినా, అనుభవించక పోయినా అది సిగరెట్టులాగే ఏదో ఒక చోట అంతమవుతుంది.... (అందువల్ల) జీవితాన్ని (ఆనందంగా) అనుభవిస్తూ అంతంకావడం మంచిది!" (వాళ్ళు, పుటలు 39-40)

(2) "మానవ జీవితానికి అర్థం ఏమిటి?" - "అశాశ్వతమైన వాటిని త్యజించి, శాశ్వతమైన ఆనందం పొందటం! అదే అర్థం... అదే పరమార్థం...!" (వాళ్ళు, పుట-58)

(3) "జీవితం అంటే క్షణసముద్రం. బిందువులన్నీ కలిస్తేనే కదా సింధువయ్యేది! దేనికి దాన్ని విడగొడితే? జీవితాన్ని క్షణాలుగా స్వీకరించడం మొదలెడితే అద్భుతంగా ఉంటుంది! నిరాశలోంచి ఆశ, నిరుత్సాహంలోంచి ఉత్సాహమూ పొంగిపొరలుతాయి. ఒక నూతనోత్తేజం కలుగుతుంది." (వాళ్ళు, పుటలు 76-77) "క్షణాల సమూహమే జీవితం కాబట్టి, క్షణాల్ని ఆనందమయం చేసుకోగలగటం నేర్చుకుంటే, జీవితం మొత్తం ఆనందమయ మవుతుంది." (పుట-79)

(4) "మనిషికి దేవుడు నాలుగు వరాలు ఇచ్చాడట! ఒకటి 'మరుపు'. ఎంత దుఃఖం వచ్చినా, మనసు మెల్లమెల్లగా మరిచిపోతుంది. రెండోవరం 'నిద్ర'. మనిషికీ

మనిషికీ ఎంత గాయమైనా ఎన్ని బాధలు ఉన్నా శరీరం నిద్రించక మానదు. ఆ నిద్రలో అన్నీ మరుగున పడి మనసుకు శాంతి లభిస్తుంది.... మూడోవరం 'ఆశ'. ఈ ఆశే మనిషిని బ్రతికించే ఇంధనం. ఇది మనిషినే కాదు, మనసునీ బ్రతికిస్తుంది. సర్వం కోల్పోయినా, మళ్ళీ సాధించగలం అన్న ధైర్యాన్నిస్తుంది! నాలుగోవరం మృత్యువు. భగవంతుడు మనిషికిచ్చిన అత్యంత విలువైన వరం మృత్యువు... మనిషీ, మనసూ ముసలివైపోయినప్పుడు, నీకు నువ్వు ఏమీ చేసుకోలేక ఇతరుల మీద ఆధారపడే దుస్థితిని తప్పించేది మృత్యువే! మృత్యువంటే 'అంతం' కాదు. మరో జీవితానికి పునాది!" (వాళ్ళు, పుట-83)

(5) "జననం..., మరణం... ఈ రెండూ రెండు అట్టలు. ఈ అట్టల మధ్య కుట్టబడిన పుస్తకమే జీవితం. ఏ క్షణపు అనుభవం ఆక్షణంలోనే పుస్తకంలో నమోదవుతుంది. కాయితానికి ఒక పేజీ రాత్రి అయితే, మరో పేజీ పగలు. రోజుకో కాయితం నిండుతూ ఉంటుంది. పగటిది జాగ్రదవస్థ, రాత్రిది స్వప్నావస్థ. ఈ రెండింటినీ కలిపేది సుషుప్తి." (వాళ్ళు, పుట-124)

**ఇతర నిర్వచనాలు కొన్ని:-**

1. "జీవితమనేది ఒక సవాలు, ఎదుర్కో!
   జీవితమనేది ఒక ఆట, ఆడుకో!
   జీవితమనేది ఒక కల, తెలుసుకో!
   జీవితం ప్రేమమయం, అనుభవించి ఆనందించు!"

   (- భగవాన్ శ్రీ సత్యసాయిబాబా)

2. "మనిషి పుట్టుకనుండీ మరణం దాకా సాగే ప్రయాణమే జీవనం. చూడగలిగితే ప్రతిజీవితమూ ఓ అద్భుతమే! చదవగలిగితే ప్రతిజీవితమూ ఓ చరిత్రే!"

   (-Telugu Quotations from Internet)

3. "జీవితం అంటే మనం నడిచే దారిలాంటిది. మనకు తోడుగా నడిచే వారుంటారు. కానీ - మనకు బదులుగా నడిచేవారుండరు. మనమే నడవాలి ఎంత కష్టమైనా."

   (-Telugu Quotations from Internet)

4. "జంతు లక్షణాలున్న మనిషి అసలైన మానవుడుగా ఈ లోకంలో తన ఉనికిని, తన పుట్టుకకు గల అర్థాన్ని తెలుసుకోవడమే జీవితం!"

   (-డా॥ ఎం. సుగుణరావు, ఈనాడు, 27-5-2007)

5. "సంచిత ఆగామి కర్మలను నశింపజేసికొనుటకు మానవుడు ఈ జన్మలో చేయు ప్రయత్నమే జీవితము"

(–డా॥ కొడిమడుగు నాగేశ్వరశాస్త్రిగారు)

6. "Life is a music of tears and smiles"

(-Dr. Sarvepalli Radhakrishnan)

7. "Life is like a river in spate, lasting at the banks, threatening the limits that have been placed arount it. Your thought structure and your actual physiological framework are limited but life itself is not."

(-UG, Mind is a Myth, p.26)

8. "అనుక్షణం అనుభవం నేర్పే పాఠాలు అందుకుంటూ, లక్ష్యసాధనకోసం పురోగమించటమే జీవితం"

(–శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తిగారు)

**9. జీవితాన్ని నిర్వచించిన "జిల్లెళ్లమూడి అమ్మ":–**

9.1 "ఆశా అసంతృప్తుల కలయికే జీవితం"

9.2 "జీవితం సమస్యల తోరణం"/ "సమస్యలతో + రణం"

9.3 "జీవితంలో రాజీపడటం కాదు, జీవితమే రాజీ"

**10. శ్రీ తంగిరాల వెంకట సుబ్బావధానులు:–** న్యూజిలాండ్‌లో ఉంటున్న మా పెద్దబ్బాయి చిరంజీవి తంగిరాల వెంకట సుబ్బావధానులు ("కాళిదాసు") ఇటీవల నాకు జీవితాన్ని గురించి ఆంగ్లంలో ఒక నిర్వచనం పంపించాడు. దానిని దిగువ ఇస్తున్నాను:–

"Life is for those who are enjoing it...
Difficult for those who are comparing it...
Worst for those who are criticising it...
Your own attitude defines your life...
So enjoy life for each moment!"

**11. నేను కొనుక్కున్న డైరీలో:–** నేను 1979లో ఒక డైరీ కొనుక్కున్నాను. దానిని "అజంతా ఆటోసర్వీసెస్, 2–4–78, ఎం.జి.రోడ్డు, సికింద్రాబాదు–500 003 వారు" ముద్రించారు. దానిలో "Life" ను గురించి ఆంగ్లంలో ఈ క్రింది

విధంగా ఉంది. పైగా ఇది భగవద్గీతలో చెప్పబడిందని వ్రాశారు. (ఎంతవరకూ నిజమో నాకు తెలియదు.)

## Life - What Gita says about Life

భగవద్గీతలో 18 అధ్యాయాలున్నాయి. ఒక్కొక్క అధ్యాయం జీవితాన్ని ఒక్కొక్క రకంగా నిర్వచించింది. ఆ నిర్వచనాలకు మానవుల ప్రతిస్పందన ఎలా ఉండాలో కూడా చెప్పబడింది.

1. Life is a Challenge - Meet it!
2. Life is a Gift - Accept it!
3. Life is an Adventure - Dare it!
4. Life is a Sorrow - Overcome it!
5. Life is a Tragedy - Face it!
6. Life is a Duty - Perform it!
7. Life is a Game - Play it!
8. Life is a Mystery - Unfold it!
9. Life is a Song - Sing it!
10. Life is an Opportunity - Take it!
11. Life is a Journey - Complete it!
12. Life is a Promise - Fulfil it!
13. Life is a Love - Enjoy it!
14. Life is a Beauty - Praise it!
15. Life is a Spirit - Realise it!
16. Life is a Struggle - Fight it!
17. Life is a Puzzle - Solve it!
18. Life is a Goal - Achieve it!

జీవితానికి ఈ 18 రకాల నిర్వచనాలు సర్వసమగ్రంగా ఉన్నాయని నేను భావిస్తున్నాను. ఇంతకన్నా జీవితాన్ని నిర్వచించడం ఎవరకీ సాధ్యంకాదని నా భావన.

### 28. మా అన్నయ్య చివరిక్షణాలు – ఆయన గొప్పతనం:–

2021 జూలై మొదటివారంలో తణుకులో ఉన్న మా అన్నయ్యకు 'కామల' (కామెర) వ్యాధి వచ్చింది. కడుపును స్కాన్ చేయించుకుంటే "పాంక్రియాస్" దగ్గర

చిన్న కంతి ఉందని తెలిసింది. అది కాన్సర్‌గా పరిణమించే ప్రమాదం ఉందన్నారు తణుకులోని ఆయన వైద్యమిత్రులు. మంచి వైద్యంకోసం హైదరాబాదు తీసికొని వెళ్ళమని సలహా ఇచ్చారు. అందువల్ల మంచి వైద్యం నిమిత్తం పిల్లలు ఆయనను హైదరాబాదుకు తీసికొని వెళ్ళారు. కాని ఎందుచేతనో ఆయన వైద్యం చేయించుకుందుకు నిరాకరించారు. పిల్లలు, తమ్ముళ్ళు, తణుకులోని వైద్యమిత్రులు ఎంత బ్రతిమాలినా ఆయన వినలేదు. వారంరోజులపాటు ప్రాయోపవేశంచేసి, మహాభారతంలోని భీష్మపితామహునివలె ప్రాణాలు విడిచిపెట్టాడు. ఇది మా అందరికీ హృదయశల్యమై బాధిస్తోంది. ఆయన అన్నీ తెలిసినవాడు; భగవద్గీతను ఆపోశన పట్టినవాడు; కాని ఇలా ఎందుకు చేశాడో మాకు అర్థం కావడంలేదు!

ఈ ప్రపంచంలో మా అన్నయ్య చాలా గొప్ప అన్నయ్య! ఈయనను మించిన అన్నయ్యలు లేరు. ఒక వేళ ఉన్నారు అనుకుంటే – నా ఉద్దేశంలో, పురాణకాలంలో ఇద్దరు; ఆధునికకాలంలో ఇద్దరు ఉన్నారు. రామాయణకాలంలో "రఘురాముడు", మహాభారతకాలంలో "ధర్మరాజు". ఆధునికకాలంలో కాళోజీ నారాయణరావుగారి అన్నయ్య కాళోజీ రామేశ్వరరావుగారు; కాటూరి వెంకటేశ్వరరావుగారి అన్నయ్య కాటూరి రామకృష్ణయ్యగారు! అంతే!!

త్రేతాయుగంలో శ్రీరామచంద్రుడు ఎంత గొప్ప అన్నయ్యో, ద్వాపరయుగంలో ధర్మరాజు ఎంత గొప్ప అన్నయ్యో – మా అన్నయ్య కూడా ఇంచుమించుగా అంత గొప్ప అన్నయ్యే! తమ్ముళ్ళమైన మేము కూడా మా అన్నయ్య చెప్పిన ప్రతిమాటా శ్రద్ధగా విని ఆచరించిన వాళ్లం కాబట్టి మేము కూడా రాముని తమ్ములు, ధర్మరాజు తమ్ములు వంటివారమే! అందువల్ల విశ్వనాథవారు తన తమ్ములనుగురించి చెప్పిన మాటలు మాకు కూడా వర్తిస్తాయి:-

**ఉ॥ "తమ్ములు రామచంద్రునకుఁ దమ్ములు నూహ యెఱింగి చేయఁగాఁ,**
**దమ్ములు ధర్మరాజునకుఁ దమ్ములు చెప్పినయట్లు సేయ, నా**
**తమ్ములు నట్టిరి..."** (-కల్పవృక్షము - బాల - అవతారిక-15)

మా అన్నయ్యనుగురించి ఒక్కమాటలో చెప్పాలంటే – మహాభారతంలో పంచపాండవులకు, ద్రౌపదికి శ్రీకృష్ణుడు ఎలాగో, మాకు మా అన్నయ్య అలాగ! వాసుదేవుడు వైకుంఠానికి వెళ్ళిపోయినప్పుడు పాండవులు ఎంత బాధపడ్డారో, మేమూ అంత బాధపడుతున్నాము. శ్రీకృష్ణనిర్యాణాన్నిగురించి అర్జునుడు అన్నయైన ధర్మరాజుతో ఇలా చెపుతాడు:-

**కు॥ "మన సారథి, మన సచివుఁడు,**
**మన వియ్యము, మన సఖుండు, మన బాంధవుఁడున్**
**మన విభుఁడు, గురుఁడు, దేవర,**
**మనలను దిగనాడి చనియె మనుజాధీశా!"** (-పోతన భాగవతము, 1-358)

**29. కాళోజీగారి అన్నయ్య:-**

ఆయన పేరు కాళోజీ రామేశ్వరరావుగారు. గొప్ప సాహిత్య ప్రియుడు, దేశభక్తుడు. వరంగల్లులో న్యాయవాదిగా పనిచేశారు. ఈయన తన తమ్మునికన్నా ఆరేళ్ళు పెద్ద. అందువల్ల చిన్నప్పుడు తమ్ముణ్ణి ఎత్తుకు మోశారు. తమ్ముడు పెద్దవాడై బి.ఏ. బి.ఎల్. చదివి కూడా న్యాయవాదవృత్తి చేపట్టకుండా, జాతీయోద్యమంలో పాల్గొంటూ, జైళ్ళకు పోతూ, ప్రజాఉద్యమాలు నడిపిస్తూ, సంసారాన్ని ఏమీ పట్టించుకోకుండా తిరుగుతూ ఉంటే, అన్నగారు లాయరుగా డబ్బు సంపాదించి, తన సంసారంతోపాటు తమ్ముడి సంసారాన్ని కూడా పోషించేవారు. ఇలా కొంతకాలం కాదు; ఆయన బ్రతికి ఉన్నంత కాలమూ చేశారు. అంత గొప్ప అన్నయ్య - రామేశ్వరరావు గారు! (నిస్సందేహంగా మా అన్నయ్యకన్నా చాలా గొప్ప అన్నయ్య). అందుకే కాళోజీ నారాయణరావుగారు తన ఆత్మకథలో ఇలా వ్రాసుకున్నారు. "మా అన్నయ్య నా కన్నా ఆరేళ్ళు పెద్దవాడు. చిన్నప్పుడు నన్ను ఎత్తుకొని మోసేవాడు. అప్పుడు ఆయన చంకనెక్కిన నేను ఇంతవరకూ దిగనేలేదు!"

**30. కాటూరివారి అన్నయ్య:-**

కాటూరి వెంకటేశ్వరరావుగారు గొప్ప ఆస్తిపరులు; వారికి నూరు ఎకరాల మాగాణి భూమి ఉండేది. కాని ఆయన సంసారాన్ని ఏమీ పట్టించు కొనేవారు కాదు. ఎప్పుడూ చుట్టలు కాలుస్తూ, పేకాడుతూ, కవిత్వం వ్రాసుకుంటూ, మధ్య మధ్య మద్రాసుపోయి తన ఆప్తమిత్రులు కృష్ణశాస్త్రిగారిని కలుసుకొని వస్తూ, కాలక్షేపం చేసేవారు. వారి అన్నగారు కాటూరి రామకృష్ణయ్యగారు గొప్ప అన్నగారు. ఆయన ఆస్తిపాస్తులన్నీ అజమాయిషీ చేసుకుంటూ, తన సంసారంతోపాటు తమ్ముని సంసారాన్ని కూడా కంటికి రెప్పలా కాపాడుకుంటూ వచ్చేవారు. వెంకటేశ్వరరావు గారికి అన్నగారంటే మిక్కిలి భక్తి - మిక్కిలి భయము. తన మిత్రసమావేశాలకు మద్రాసు వెళ్ళాలన్నా, హైదరాబాదు వెళ్ళాలన్నా డబ్బు కావాలి. అన్నగారిని అడగటానికి భయం! అందువల్ల ఊళ్ళో ఉన్న బంధుమిత్రుల దగ్గర అప్పుచేసి పారిపోయేవాడు!

తమ్ముడు కనపడకపోయేసరికి, " అమ్మా! మావాడు ఎక్కడికి వెళ్ళాడు?" అని మెల్లగా మరదల్ని అడిగేవారు రామకృష్ణయ్యగారు. మద్రాసు వెళ్ళాడని తెలిసికొని, ఊళ్ళో అప్పుచేసి వెళ్ళి ఉంటాడని గ్రహించి, బంధుమిత్రుల దగ్గరకు వెళ్ళి "మావాడు మీ దగ్గర అప్పుచేశాడా?" అని వాకబు చేసి, వారి వారి అప్పులు తీర్చి వచ్చేవారు. అంతగొప్ప అన్నయ్య కాటూరివారి అన్నయ్య రామకృష్ణయ్యగారు. (ఈయన మా అన్నయ్యకన్నా గొప్ప అన్నయ్య అని ఒప్పుకుంటున్నాను.) అందుకే కాటూరి తన "గుడిగంటలు" – "పౌలస్త్య హృదయము" అనే జంటకావ్యాలను అన్నగారికి అంకితం చేస్తూ, వారి గురించి చాలా గొప్ప పద్యాలు వ్రాశారు. కాటూరివారి అంకితం పద్యాలలోని ఐదు పద్యాలలో ఆణిముత్యాలవంటి రెండు పద్యాలు:–

**"నేరఁడు మంచి చెడ్డలు, గణింపఁడు గీమునఁ గష్ట సౌఖ్యముల్,**
**వీటిడియై సదా తిరుగు వీఁ" డని రోయక, నన్ను, మత్రృజన్**
**గూరిమి నోమె; అగ్రజునకుం దుద కిచ్చితి నిష్ఠురాగ్ని సం**
**స్కారము; నింక నా యొసఁగఁ జాలిన దొక్క కృతి ప్రదానమే!**

**"ఆలుంబిడ్డలు, పైరుపచ్చలనకే 'ఆగమ్మకాకిం' బలెన్**
**గాలిచ్చుందిరుగాడు దుర్వ్యస"నని, నాకై యెంత చింతించెనో**
**లోలో; నెన్నఁడు నొవ్వనాడఁడు, దయాళుండై ననుంబ్రోచె; స**
**చ్ఛీలుం డన్నకు నీకృతి ద్వితయమున్ జేమోడ్చి యర్పించెదన్.**

**31. "ధ్రువం జన్మ మృతస్య చ" (భగవద్గీత):–**

మా అన్నయ్యకు భగవద్గీత అంటే పంచప్రాణాలు. దానిలోని అన్ని శ్లోకాలూ ఆయనకు కంఠతా వచ్చును. జీవితంలో గీతను 'తు.చ' తప్పకుండా పాటించినవాడు మా అన్నయ్య. గీతలో పరమాత్మ చెప్పినట్టు "పుట్టిన ప్రతివాడూ చనిపోతాడు; చనిపోయిన ప్రతివాడూ తిరిగి పుడతాడు – ఇది నిశ్చయం!" ఇప్పటికి మా అన్నయ్య ఎక్కడో పుట్టేవుంటాడు. మేము ముగ్గురు తమ్ముళ్ళం మళ్ళీజన్మలో కూడా మా అన్నయ్యకు తమ్ముళ్ళుగానే పుట్టాలని ఆ భగవంతుని ప్రార్థిస్తున్నాము....

ఇట్లు

**తమ్ముళ్ళు**

**సుబ్బారావు – భాస్కరరావు – కృష్ణమూర్తి**

(28-07-2021, బుధవారం సాయంకాలం 5 గంటలకు హైదరాబాదులో మా అన్నయ్య స్వర్గస్థుడయ్యాడన్న దుర్వార్త విని మిక్కిలిగా బాధపడుతూ, కలంతోకాదు, హృదయంతో వ్రాసిన వ్యాసం ఇది - తంగిరాల వెంకట సుబ్బారావు)

**ఒక ముఖ్య గమనిక:-**

మా అన్నయ్యగారు బ్రతికి ఉండగా ప్రకటితమైన ఆయన గ్రంథాలన్నింటికీ నేనే పీఠికలు వ్రాశాను. ఆయన ఇతరులెవ్వరిచేతా పీఠికలు వ్రాయించేవారు కారు; నన్నే వ్రాయమనేవారు. ఆ పీఠికలలో నేను "మా అన్నయ్యగారు...అన్నారు/ చేశారు." అనే విధంగా కర్తకు క్రియకు గౌరవసూచకంగా బహువచనమైన "రు" కార ప్రయోగం చేసేవాడిని. అది కొంచెం ఎబ్బెట్టుగా అనిపించింది. 'రు' వ్రాస్తే బాగుంటుందా? లేక 'డు' వ్రాస్తే బాగుంటుందా? - అనే విషయం తేల్చుకోలేకపోయాను. అందువల్ల ఒకసారి ఆయన్నే అడిగేశాను: ''అన్నయ్యా! 'రు' వ్రాయమంటావా? 'డు' వ్రాయమంటావా?" అని. "ఒరేయ్! 'రు' వ్రాస్తే మన మధ్య ఆత్మీయత కనపడదురా! 'డు'నే వ్రాయి, బాగుంటుంది!" అన్నాడు. అందువల్ల పై వ్యాసంలో అంతటా 'డు'కార ప్రయోగమే చేశాను. ఇది మా అన్నయ్య ఆజ్ఞప్రకారం చేసిన పని.

## 32. మా అన్నయ్య:-

(1976లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు నేను రచించిన 'కాటమరాజు కథలు'-ప్రచురించారు. నేను ఆ గ్రంథాన్ని మా అన్నయ్య శ్రీ టి.వి.కె. సోమయాజులు గారికి అంకితం చేశాను. అప్పుడు మా అన్నయ్యనుగురించి ఒక వచనకవిత వ్రాశాను. దానిని ఈ దిగువ ఇస్తున్నాను...)

**అన్నెమూ పున్నెమూ ఎరుగని అచ్చం దేవుడిలాంటి అమాయకుడు**
**సంసారం పట్టని తామరాకు మీది నీటిబొట్టు**
**సర్వసంగ పరిత్యాగి నాన్న 'సుబ్బన్న' -**
**(లోకులందరికీ మాత్రం "వెఱ్ఱిసుబ్బన్న")**
**అత్తమామల ఆరళ్ళ అడకత్తెరలో చిక్కుకున్న పలుచని పోకచెక్క**
**నరకయాతనలను తాల్మితో సహిస్తున్న సాధ్వీమతల్లి అమ్మ 'సీతమ్మ'-**
**అత్తింటికి వెళ్ళవలసిన ఇద్దరు అక్కలు**
**అంతలు ఇంతలు నలుగురు తమ్ములు-**
**ధృతరాష్ట్రుడు, 'జగ్గన్న తాత', దుర్యోధనాదులు మేనత్తలు-**

చుట్టూ కోరలు చాచిన క్రూరసమాజం
చుట్టాలూ పక్కాలూ నక్కలూ తోడేళ్ళూ-
గోతులూ గొప్పులూ గుచ్చుకునే సూదిరాళ్ళు
చిల్లుల గొడుగులా కురుస్తున్న తాటాకుల కొంప
పితామహ క్రౌర్య కీకారణ్యంలో చిమ్మచీకట్ల తుమ్మముళ్ళు-
కీచురాళ్ల ఈత రుప్పలు
బెక బెకల బోదురు కప్పలు-
పామరత్వం ప్రవహించే పంటకాలువ పొంత
బ్రహ్మజెముడు డొంకల పుంత -
అష్టదరిద్రులు పన్నిన ఆకలి మావుల్లో చిక్కి
చచ్చిన బాపన చేపల కంపు-
'గోపాలరాజు - తాతరాజు'ల గూండాయిజం
దిక్కూమొక్కూలేని దీనుల పై దౌర్జన్యం-
సుడిగుండాల నడిగోదాట్లో చిక్కిన
చుక్కాని విరిగిన కుటుంబపు తొట్టిపడవ-
ఈ దారుణ పరిస్థితులన్నింటినీ ధైర్యంగా ఎదిరించి,
చెల్లాచెదరైన సేనకు నాయకత్వం వహించి,
తన లేతనెత్తుటి కాగడా కొసను ప్రజ్ఞను రగిలించి,
ప్రతిభను వెలిగించి, పౌరుషాన్ని మండించి,
చీకట్లో తడుముకుంటున్న తమ్ముళ్ళకు వెలుగుబాటలు చూపించి,
ప్రగతిపథంలో ముందడుగు వేయించి,
తన నియమబద్ధ గాంధీయ జీవితాన్ని చుక్కానిగా చేసి,
అనునిత్యం త్యాగంతో తెడ్డువేసి
"నావ దరిచేర్చిన మొనగాడు!"
కష్టాల మత్స్యయంత్రాన్ని కూల్చిన విలుకాడు!
అనుజన్ముల అభ్యుదయాన్ని చూచి
అనుక్షణం పొంగిపోయే అభినవ ధర్మరాజు!
శ్రీతంగిరాల వేంకట కృష్ణసోమయాజి!

**మా అన్నయ్య!**
**మా పాలిటి కన్నయ్య!!**

**- తంగిరాల వెంకట సుబ్బారావు(1976)**

(సంస్కృతాంధ్రాలలో ఉద్దండ పండితులు, విశ్వనాథవారి ప్రియశిష్యులు అయిన కీ.శే. మల్లపల్లి శరభయ్యగారు ఈ కవితను ఎంతగానో మెచ్చుకొని, నా భ్రాతృప్రేమకు ముగ్ధులై నన్ను అభినందించారు.)

**రసప్రవక్త: -**

**ఉ॥ ఏ విషయంబు నిచ్చిన సరే, శిఖరాలకుఁ బ్రాకి, క్రొత్త నె**
**త్తావులు గ్రుమ్మరించి, సరదాపరదాలను దీసి, శ్రోతృ క**
**ర్ణావయవాలు రంజిలఁగ నామెత లిచ్చు రసప్రవక్త, మా**
**టీ.వి.కె. సోమయాజులు గడించిన కీర్తికి నంజలించెదన్!**

**- రసరాజు (2006)**

**33. పెదబావగారు:-**

**సీ॥ అరవింద సన్నిభంబైన మోమున శాంత**
**రసమొల్కు బ్రహ్మవర్చస్సువాఁడు,**
**సరస సాహిత్య భాసుర భావగంధమ్ము**
**పరమళించెడి వచస్సరణివాఁడు,**
**అమృతమ్ము చిందు పద్యము పఠించినయంతఁ**
**బరవశించెడి స్వభావమ్మువాఁడు,**
**ఏఁటేఁట నొక పద్యకృతికి సత్కారమ్ము**
**వేయారులిచ్చి గావించువాఁడు,**

**తే. తణుకు నందున్న "శబ్దశాసనుని పీఠ**
**ము" న కుపాధ్యక్షుఁడై పేరుగనినవాఁడు,**
**'తంగిరాల' కులాబ్ధి సారంగధరుఁడు,**
**సూరివరుఁడు వేంకట కృష్ణ సోమయాజి!**

ఆ. **ఉభయ భాషలందు నుద్దండ పాండిత్య**
**మున్నవాఁడు, యశము గొన్నవాఁడు,**
**కవనమల్లు శక్తి గలవాఁడు, గర్వమ్ము**
**లేనివాఁడు, సాటిలేనివాఁడు!**

చ. **తణుకున రామకృష్ణమఠ ధామమునందుఁ గథాప్రసంగముల్**
**పొనరుచుచుండు భాగవతమో రఘురాము చరిత్రమో, వియ**
**ద్ధునియగు వాని వాగ్లహరితో సరిపోలఁగ లేక గోస్తనీ**
**ధుని దిగులొంది తుంపురులు తుంపురులై చిఱుగాలి పాలగున్!**

చ. **నిరుపమ సాహితీ సవన నిర్వహణమ్మున సోమయాజులై**
**వరలుట సార్థకాఖ్యుఁడన వచ్చును 'టీ.వి.కె. సోమయాజు', లె**
**వ్వరు సరివత్తురయ్య! రసవత్కవితా వ్యవహార ధోరణిన్,**
**సురుచిర వాగ్విలాసియగు సూరికి, మా పెదబావగారికిన్?**

(ఉభయభాషాప్రవీణ శ్రీ తంగిరాల వేంకట కృష్ణ సోమయాజులు బావగారు లెక్కల్లోని విద్వాంసుడు; ఉత్తమ కవి; మంచివక్త. సజీవ కవిత్వానికి స్పందించి ఆయన వ్రాసేలేఖలు ముఖప్రీతికి వ్రాసే ఉత్తరాలు కావు, కవిత్వం నాడిని పట్టియిచ్చే చక్కని సమీక్షలు. ఉత్తరాలే కాదు, ముఖాముఖి ప్రసంగాలూ అంతే. ఇవి స్వానుభవం మీద చెప్పే మాటలు. ఆ అనుభవంతో వ్రాసినవే పై పద్యాలు – 1998)

**–దుగ్గిరాల రామారావు,** ('సుమనోభిరామము' అనే కవితాసంపుటినుండి)

## 34. బంధుమిత్రుల బాష్పాంజలి

### 34.1 శ్రద్ధాంజలి:–

(దివంగతులైన తంగిరాల వెంకట కృష్ణ సోమయాజులు అన్నగారికి శ్రద్ధాంజలి:–)

సీ॥ **గోదావరీ తీర గోష్పద క్షేత్రాన**
**జలకంబులాడిన ఛాత్రుడితఁడు,**
**ఆంధ్రగీర్వాణ విద్యాలయంబునయందు**
**శిక్షణ పొందిన శిష్యుడితఁడు,**
**చిలుకూరి వేదుల శ్రీ కేశిరాజుల**

శుశ్రూష చేసిన సూరి యితఁడు,
తంగిరాలాన్వయ తరతరంబుల కీర్తి
వ్యాపింపజేసిన వ్యాసుడితఁడు,

తే॥ ఆంధ్రగీర్వాణ భాషల అలఘు సరణి
కవితలల్లుచు సరస సత్కావ్యతతిని
వెలువరించిన సంభావ్య విబుధుడితఁడు
సోమయాజులు మా పెద్ద సోదరుండు!!
(అట్టివానికి నాదు శ్రద్ధాంజలిదియె!)

తణుకు – శ్రీ తంగిరాల పాలగోపాలకృష్ణగారు
07–08–2021 సంయుక్త కార్యదర్శి, శ్రీ నన్నయభట్టారక పీఠం

**34.2 ఋషికల్పుడు:–**

క॥ అటునిటుఁ జెదరదు చిత్తము
పటు విజ్ఞానార్జనమున వక్తృతలో వేం
కట కృష్ణ సోమయాజికి
నిటలాక్షుఁడు సాటి నిజము నియతేంద్రియతన్! 1

ఉ॥ ఆతఁడు తంగిరాల విపులాన్వయ వార్నిధి పూర్ణచంద్రుఁడై,
బ్రాఁతిగ సంస్కృతాంధ్రములఁబల్కుల వెన్నెల పోఁతపోసి, వి
ఖ్యాతి గడించినట్టి ఋషికల్పుఁ డనల్పుఁడు సోమయాజి, య
య్యాతనికిన్ నమస్కృతు లనంతముగాఁ బచరింతు నిచ్చలున్! 2

క॥ ఏ విషయ మెప్పుడేనియుఁ
జేవఁదలిర్పన్ వచించు జీవత్వాండి
త్యావధి ముట్టిన ఘనుఁడగు
టీవికే సోమయాజి ఠీవికి జేజేల్! 3

నరసాపురం –"యుగళ సహస్రావధాని"
09–08–2021 డా॥ కడిమిళ్ళ వరప్రసాద్‌గారు

## 34.3 సోదరప్రేమ:-

**ప్రముఖ సాహితీవేత్త, ఆధ్యాత్మికాచార్యులు శ్రీ తంగిరాల వేంకట కృష్ణ సోమయాజులు గారితో నా పరిచయం:-** అది 1983వ సంవత్సరం. శ్రీ నన్నయభట్టారక పీఠం నూతన కార్యవర్గాన్ని ఏర్పాటు చేస్తూ - శ్రీ బంధకవి సీతారామాంజనేయులుగారిని అధ్యక్షులుగాను, నన్ను కార్యదర్శిగాను ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు. ఆ సభలో శ్రీ టి.వి.కె. సోమయాజులుగారు నన్ను ఆశీర్వదిస్తూ: "పామర్తి రమణకవిగారిలాగ కష్టపడి పనిచెయ్యాలి. పీఠానికి మంచిపేరు తేవాలి!" అన్నారు. అది నా తొలిపరిచయం. ఆ తరువాత నేను కష్టపడి పనిచేస్తున్న తీరును ప్రశంసిస్తూ ఇలా అన్నారు:

**ఉ॥ పా.ర.కవీశుడే తణుకు పట్టణ వీథుల నన్నపార్యునిన్**
**తా రథమందునిల్పి, కవితా జయకేతన మెత్తి పోయె; ఇం**
**కీ రథమిప్డు నేర్పు మెయి నీవు సుశర్మరో! లాగుమన్న; శ్రీ**
**'సూరి' గురూత్తమాజ్ఞ ప్రియసోదర! నీ తలదాల్చి నావహో!**

(పా.ర.కవి = పామర్తి రమణకవి)

అనేక పర్యాయములు నాకు పీఠం నిర్వహణలో సలహాలిస్తూ ఉండేవారు. నేనంటే సోదర ప్రేమ. ఇంక మూడు రోజులకు మరణిస్తారనగా, వారి అమ్మాయి ఫోను చేసి నన్ను మాట్లాడమన్నారు. నేను పలకరించగానే "సోదరా! ఇవి నా చివరి మాటలు. ఇంక కొద్ది రోజులలో మరణిస్తా"నన్నారు. ఆ మాట వినగానే నాకు కంటనీరు ఆగలేదు. అలా నాతో మాట్లాడిన మూడు రోజులకు మరణించారు. ఆయనకు తణుకులో 100 మంది స్నేహితులు, భక్తులు ఉన్నారు. వారందరికీ ఫోన్లు చేశాను. అందరం కలిసి సంతాపం ప్రకటించాం.

నన్ను సోమయాజులుగారు సాహిత్యంలో తీర్చిదిద్దారు. ఆకాశవాణిలో సుమారు 30 సం॥లనుండి "సూక్తిసుధ" - "కవిసమ్మేళన" కార్యక్రమములలో పాల్గొంటున్నాను. నా వ్యాసాన్ని లేదా కవిత్వాన్ని ముందుగా సోమయాజులుగారికి వినిపించి, ఆయన సలహాతో కార్యక్రమానికి వెళ్తే - విజయవంతంగా తిరిగి వచ్చేవాడిని. వారు పద్మశ్రీ టాకీసు యజమాని కీ.శే. నడింపల్లి వెంకట సూర్యనారాయణరాజుగారికి, ఆయన భార్య శ్రీమతి నడింపల్లి వెంకట సూర్యకుమారిగారికి, నాకు వారి యింటి దగ్గర ప్రత్యేకంగా భగవద్గీత చెప్పేవారు. నన్ను కూడా భగవద్గీతలో తీర్చిదిద్దారు.

సోమయాజులుగారు యోగాగురువుగా విఖ్యాతులు. ఆయనే నాకు స్వయంగా లంగోటాలు కుట్టించి, వాటితో యోగాభ్యాసం చేయించేవారు. క్రమశిక్షణ, బ్రహ్మచర్యం యోగాకు ముఖ్యమని అందరికీ చెప్పేవారు. నియమాలు తప్పితే రావద్దని నిర్మొగమాటంగా చెప్పేవారు.

నేను వేదుల సూరిగారి వద్ద పద్యవిద్యతోపాటు నన్నయ భారతమంతా చదివాను. సోమయాజిగారు సూరిగారి తండ్రి రామశాస్త్రిగారికి ప్రియశిష్యులు. ఆ విధంగా నన్ను ప్రేమగా చూసేవారు.

నన్నయ భట్టారక పీఠంలో ఆయన ఇచ్చిన రూ. 20,000/-ల విరాళంతో ప్రతి సంవత్సరం ఒక పద్యగ్రంథానికి పురస్కారం ఇచ్చేవాళ్ళం. సుమారు 25 సం॥లనుండి గ్రంథాన్ని సమీక్ష చేయడం, ఎందుకు ఆ గ్రంథానికి పురస్కారం ఇస్తున్నామో తెలియజేయడం సోమయాజులుగారి పని. ఆ విధంగా నేను చాలా పద్యగ్రంథాలు చదువుట జరిగింది. నాలుగు సంవత్సరాలనుండి నేనే సమీక్ష చేసేవాడిని. ఆయన విని మెచ్చుకొనేవారు. గణాచార కవిత్వానికి ఆయన పూర్తి వ్యతిరేకి. నిబంధనలు కఠినంగా ఉండేవి. ఆయన మెచ్చుకోవడం గొప్ప విషయం. మా పీఠానికి ఎవరైనా వక్త వస్తే, ముందుకుర్చీలో కూర్చుని పరీక్షగా వినేవారు. ఏదైనా తేడాగా మాట్లాడితే ఉపన్యాసం తరువాత అక్షింతలే!

**ఉ॥ సాధిత పాండిటీ విభవ చాతురి గల్గిన పండితాఖ్య! సం**
**పాదిత శేముషిన్ ఉభయ భాషల సత్కవితాధురీణ! శ్రీ**
**వేదుల రామశాస్త్రికిని ప్రీతిని గూర్చిన "సోమయాజి"! నన్**
**సోదరుడంచు పిల్చితివి సొంపుగ, నాకిట పిల్పులేదికన్!**

తణుకు — శ్రీ **"సుశర్మ"గారు**

09-08-2021 ప్రధాన కార్యదర్శి, శ్రీ నన్నయ భట్టారక పీఠం

**34.4 మా పట్టుకొమ్మ విరిగింది!:-**

**ఉన్నట్టుండి ఒక్కసారిగా**
**వీచింది మృత్యుఝంఝు**
**పెళపెళ విరిగిపోయింది మా పట్టుకొమ్మ!**
**నేనూ, నా వెనకాల "బాచి" - "బుల్లి"**

దభాలున అగాధంలో కూలబడ్డాం!!
చుట్టూ క్రమ్మిన చిమ్మచీకటి
కన్ను పొడుచుకున్నా ఏమీ కనబడటం లేదు
ఏం చేయాలో తోచడం లేదు.

గుడ్డిరాజుకు మంచిచెడ్డల దారిచూపే
విదురుడు లేడు, సంజయుడు లేడు!
ధర్మరాజుకు నీతులు రాజనీతులు బోధించేందుకు
అంపశయ్యమీద భీష్మపితామహుడు లేడు!
శతమత్తేభ శక్తియుతుడు
వజ్రశరీరుడు భీముడు కూడా
చివరికి మహాప్రస్థానంలో
నేలకు ఒరిగిపోయాడు!

శాంతిని వశంచేసుకున్న వేదాంతి
దాంతిని సాధించిన బ్రహ్మజ్ఞాని
పతంజలికి భాష్యమైన యోగిపుంగవుడు
మా అన్నయ్య కాదు - మా పాలిటి కన్నయ్య
"మనసారథి, మనసచివుడు"
మమ్మల్ని దిగవిడిచి వెళ్ళిపోయాడు!
పంచభూతాల్లో కలిసిపోయాడు!!

పట్టాలమీద పరుగులు తీసే ఇంజనుకు-
దానిని పట్టుకున్న బోగీలకు
మధ్య లింకు తెగిపోయింది!
మా పురోగమనం ఆగిపోయింది!!
తలిదండ్రులు చనిపోయినప్పుడు కాదు
ఇప్పుడు మేం నిజంగా అనాథులం!
మా అన్నయ్య చేసిన గీతాబోధయే
మాకిక శరణ్యం!

"జాతస్య హి ధ్రువో మృత్యుః
ధ్రువం జన్మ మృతస్య చ"
("పుట్టినవాడు గిట్టక తప్పదు
గిట్టినవాడు పుట్టక తప్పదు")

**2006లో**
అగ్ని లేకుండా దహించివేస్తోంది
నన్ను భార్యావియోగ దుఃఖం
అప్పుడు మా వియ్యంకుడు వచ్చి
అన్నాడొక అపురూపమైన మాట
అది వజ్రాల మూట
జ్ఞానంతో కూడిన గొప్ప ఊరట:
**"This will happen one day!
That happened today!"**
("ఇది ఏదో ఒక దినం జరిగితీరుతుంది!
అది ఈ దినం జరిగింది, అంతే!)
ఇప్పుడు **2021**లో... అగ్రజ వియోగ దుఃఖంలోనూ
అదే మాట మాకు పెద్ద ఊరట!!
సరయూనదిలోపడి అవతారం
చాలించాడు రాముడు!
బోయవాడి బాణం దెబ్బకి
ఆయువు తీరింది కృష్ణునికి!
అలనాటి రామకృష్ణులకన్నా గొప్పవాడు కాదు కదా
ఇలనాటి మా అన్నయ్య?

బెంగుళూరు —సోమయాజులుగారి తమ్ముళ్ళు:
16–08–2021 – (సుబ్బారావు–భాస్కరరావు–కృష్ణమూర్తి)

**34.5 నివాళి:-**

**ఉ॥ శ్రీయుత తంగిరాలకుల సింధువునన్ జనియించి, వెన్నెలల్**
**వేయి విధాల చల్లి, కనువిందులు చేసి, సుధాంశుజాలముల్,**
**మాయని తీపిచూపులు, సమంచిత రీతిని పండితాళి "వ**
**హ్వా!" యను రీతి చల్లు శశి, హా! కనరా డిదియేమి దైవమా! 1**

**చ॥ మనసున మల్లెకాంతులును, మాటలలో సుధలుప్పతిల్ల, జీ**
**వనమున ధర్మసంగతియు, భాషణలో నొక ప్రౌఢియొప్ప, మా**
**కనులకు సద్గురూత్తమునిగా కనవచ్చిన సోమయాజి, మా**
**కనులకు కానరాడిక వికాసముగా, నిదియేమి దైవమా! 2**

**చ॥ అనయము భారతాటవి నహర్నిశముల్ విహరించు సింహమై,**
**వినయములేని యేన్గుల గుభీలున దాగుకొనంగఁజేసి, భూ**
**మిని ఒక సంస్కృతిన్ నిలుపు మేటి మృగేంద్ర నిభుండు, నేడు మా**
**కనులకు కానరాడట జగాన, నిదేమి తమస్సు దైవమా! 3**

**క॥ జీవన మార్గము హృద్యము,**
**నీవారాగ్రమ్ము బుద్ధి, నిష్కామతితో**
**సావాసము సూరులతో,**
**టీవీకే సోమయాజి డెందము పొన్నొ! 4**

**తే॥ భువిని సంస్కృతి వెదచల్లి పూజ్యుడాయె**
**దివిని శక్రుండు స్నేహమ్ము తెలిపి పిలువ**
**సాగె మా సోమయాజి ఆ స్వర్గమునకు,**
**వానికిచ్చెద భక్తి నివాళి నేను! 5**

బాష్పాంజలితో...

తణుకు - "యుగళ సహస్రావధాని"

10-08-2021 **శ్రీ కోట వెంకట లక్ష్మీనరసింహంగారు**

**34.6 జోతలు:-**

సీ॥ కావ్యావలోకన క్రమకళావైదగ్ధి
నవనవ శ్రీ జగన్నాథుఁడతఁడు,
సరససూక్తిప్రభా సారస్య విస్ఫూర్తి
వినుత భాండాగార విదురుఁడతఁడు,
విమల సహస్రారకమల సుధావర్షి
లలితానుభవ పతంజలి యతండు,
రంజితానిశి సోదరస్నేహ సందీప్తి
ప్రతిలేని కౌస్తుభ రత్నమతఁడు,

తే॥ మాటతీరున నొక్కింత మోటువాఁడ
నంగ విందు, మైననుగాని "తంగిరాల
సోమయాజు"లన్నంతనే నా మనంబు
జోతలిడును నాతని నవనీత హృదికి!

విశాఖపట్టణం - ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారు
12-8-2021 (Retired Professor, Hyderabad Central University)

**34.7 పద్యకవితామనస్వి:-**

శా॥ ఛందస్సున్ సరిపెట్టి - పద్యములతో శ్వాసన్ నిరోధించి - ఏ
అందంబైనను జూపనేర్వక - కవిత్వాంశంబు నేదూచలన్
బందీజేసెడి దిక్కుమాలిన కవుల్ ప్రత్యక్షమౌచో - వ్యథన్
జెందెన్ "టీ.వి.కె. సోమయాజులు"; కళాక్షేత్రజ్ఞులిట్లుందురే! 1

ఉ॥ వేదికనెక్కి గొంతుకను విప్పి - అదే పనిగా సదస్సునే
ఊదరగొట్టు వక్త నెదురొడ్డిన ధీబలశాలి - పద్యవి
ద్యాదయితుండు "టీ.వి.కె." మహాశయు డిప్పుడు లేకపోయె, ఆ
స్వాదుమనస్వి ఆశయముపైని ఉగాదులు పూలు చల్లెడిన్! 2

ఉ॥ లౌకిక మన్నదే తెలియరాదు - నిజాయతి జీవితంబులో
ప్రాకగ తీగెకైవడి, సువాసన లీనెడి పువ్వులెన్నియో

వేకువగాలి పీల్చినవి; పెన్నిధి ఆతడు నేడు లేడు – కా
నీ కమనీయ వైఖరులనేకము వానిని గుర్తుజేసెడిన్! 3

ఉ॥ "ఏరినముత్య"మై అతడహీన ప్రభన్ ప్రసరింపజేసె – సా
ధారణ శిష్యవర్గమును తావులలో విహరింపజేసె – స
త్కారమొనర్చె పద్యకవితా కళకున్; మన "తంగిరాల" బెం
గ్లూరు నివాసి, ఈతని సహోదరుడే! వెలిగించె ప్రమ్మిదల్! 4

శా॥ నా పద్యమ్ములె నాకురాని సమయానన్ – గుండెగుమ్మమ్ములో
దీపశ్రేణుల మధ్య నిల్చి, యనురక్తిన్ గొంతు పైకెత్తి, ఎ
న్నో పర్యాయము, లా రసార్ద్రహృదయుం డుప్పొంగి విన్పించె; నా
కా పల్యంకిక చాలు! అప్పువడినా డా వైదుషీవాణికిన్! 5

శా॥ నాలో ఏ విభవంబు గాంచెనొ! హృదంతస్సీమలో నిల్పె – ప
ద్యాలన్ హత్తు కొనెన్–స్వధామమున వాత్సల్యంబుతో అద్దె ఏ
లీలన్ గైకొనకుండ చోటొసగె – ఆప్రేమన్ స్మృతిన్ నిల్పెదన్,
కేలున్ మోడ్చెద "సోమయాజి" కవికిన్ – నివ్వాళు లా వాగ్మికిన్! 6

తణుకు "రససరాజు"
12-08-2021 (శ్రీ రంగినీని సత్యనారాయణరాజుగారు)

**చి॥ సౌ॥ జయమ్మకు నా ఆశీస్సులు!**

మా అన్నయ్య చివరిరోజులలో – అంటే నవంబరు 2020 నుండి జూలై 2021 వరకు – తొమ్మిది నెలలపాటు ఎంతో శ్రద్ధతో సేవచేసిన ఆయన ఆఖరి కూతురు చి॥ సౌ॥ తంగిరాల జయదుర్గాభవానికి – ఆమె భర్త శ్రీ కాళ్ళకూరి వెంకట సత్యనారాయణ జోగిరాజుగారికి నా అనంతమైన ఆశీస్సులు... ఈ దంపతులకు వృద్ధాప్యంలో వీరి పిల్లలు కూడా ఇలాగే శ్రద్ధగా సేవ చేయుదురుగాక!

– తంగిరాల వెంకట సుబ్బారావు

## 35. పశ్చిమగోదావరిజిల్లా, రేలంగి–ఇరగవరం గ్రామాలలో ఉన్న

# శ్రీ తంగిరాలవారి వంశవృక్షం



తంగిరాల వంశవృక్షం (Contd.)

**తంగిరాల జగ్గన్నశాస్త్రి > జగన్నాథశాస్త్రి > బ్రహ్మీభూత జగన్నాథచైనులు > బ్రహ్మీభూత జగన్నాథ మహాగ్నిజిత్ యజ్వేశ్వర**
**(సోదెమ్మ > సోమిదేవమ్మ > వేంకట సోమపీథిని) – కాకుల ఇల్లిందలపఱ్ఱు**

**వేంకట సుబ్బావధానులు (+ సీతామహాలక్ష్మి) – తణుకు**

- వేంకట కృష్ణ సోమయాజులు (+భాస్కరలక్ష్మి)
  - వేంకట సూర్యసుబ్బావధానులు (+ప్రతిభ)
    - కౌస్తుభ్ (+భవాని)
    - అనిరుద్ధ్
- వేంకట సుబ్బారావు (+శకుంతలాదేవి)
  - వేంకట సుబ్బావధానులు (+నాగలక్ష్మి)
    - తేజస్వి (+ నిరుపమ)
      - శివాంశ శౌరి
  - శ్రీరామమూర్తి లేదా (సీతారామరాజు) (+విమలకుమారి)
  - శ్రీనాథకవిసార్వభౌమ (+జయశ్రీ)
    - స్కంద్
- భాస్కరరావు (+బాలాత్రిపురసుందరి)
  - వేంకట సత్య రామలింగేశ్వరరావు (+ఉమ)
    - భాస్కర సిద్ధి గణేష్ (దత్తపుత్రుడు)
- కృష్ణమూర్తి (+శంకరి)
  - శ్రీనివాసమల్లిక్ (+రాధారమణి)

**36.1 మా అన్నయ్య కుటుంబం (28.07.2021)**

**తంగిరాల జగ్గన్నశాస్త్రి (మా పితామహుడు) + భార్య: వెంకట సోమిదేవమ్మ (మా పితామహి)**

**వెంకట సుబ్బావధానులు (మా తండ్రిగారు) (1904–1968) + భార్య: సీతామహాలక్ష్మి (మా తల్లిగారు) (1907–1990)**

- కీ.శే. చల్లా పెద వెంకట రామలక్ష్మి (మా పెద్దక్కయ్య) (1924–1998) భర్త: కీ.శే. చల్లా పాపయ్యశాస్త్రి
- కీ.శే. బులుసు చిన వెంకట రామలక్ష్మి (మా చిన్నక్కయ్య లేక "చెల్లక్క") (1926 –1985) భర్త: కీ.శే. బులుసు సోమన్న
- కీ.శే. వెంకట కృష్ణ సోమయాజులు (1930–2021)+ భార్య: శ్రీమతి భాస్కరలక్ష్మి (వయస్సు: 89 సం.లు)
  - శ్రీ వెంకట సూర్య సుబ్బావధానులు + శ్రీమతి ప్రతిభ
    - శ్రీ కౌస్తుభ్ +శ్రీమతి భవాని
      - చి॥ అనీక
    - శ్రీ అనిరుద్ధ్
  - కీ.శే. సీతామహాలక్ష్మి భర్త: శ్రీ ఘంటికోట బాలసూర్యప్రకాశరావు
    - శ్రీ విద్యాధర్ + శ్రీమతి మాధవి
      - చి॥ విరించి
      - చి॥ వరేన్
      - చి॥ వచేస్
    - శ్రీ వంశీధర్ + శ్రీమతి సుషుమ
      - చి॥ విష్ణు
      - చి॥ విరూపాక్ష
  - శ్రీమతి వాణి భర్త:శ్రీ జి.బి.యస్. ప్రకాశరావు
    - కీ.శే. విజయాధర్
  - శ్రీమతి జయదుర్గా భవాని భర్త: శ్రీ కాళ్ళకూరి వెంకట సత్యనారాయణ జోగిరాజు
    - శ్రీమతి భార్గవి + శ్రీ నల్లగొండ ఆదిత్య
      - చి॥ ఆర్ణవ్
      - చి॥ ఇందిర
    - శ్రీమతి గాయత్రి + శ్రీ మడిపల్లి శశాంక్
      - చి॥ రోహణ్
- శ్రీ సుబ్బారావు + కీ.శే.శకుంతలా దేవి
- శ్రీ భాస్కరరావు + కీ.శే. బాలా త్రిపుర సుందరి (1) శ్రీమతి శకుంతల (2)
- శ్రీ కృష్ణమూర్తి + శ్రీమతి శంకరి

## 36.2 నా కుటుంబం


తంగిరాల వెంకట సుబ్బారావు + శకుంతలాదేవి ("చిట్టి")
(1) చి॥ వెంకట సుబ్బావధానులు
("కాళిదాసు") + చి॥ సౌ॥ నాగలక్ష్మి
(న్యూజిలాండ్)
డా॥ తేజస్వి
+డా॥ నిరుపమ
చి॥ శివాంశ శౌరి
డా॥ ప్రత్యూష
చి॥ కాశీభట్ల విక్రాంత్
చి॥ ప్రవీర్ శౌర్య
చి॥ ప్రావ్యస్వర
(2) కీ.శే.సీతారామరాజు
(శ్రీరామమూర్తి)
+ శ్రీమతి విమల
కుమారి
చి॥సౌ॥ శిల్ప(USA)
+ చి॥ సుమన్ మోదే
(కూతురు)
చి॥ Mauna
చి॥సౌ॥ భావన (USA)
+చి॥ అద్దంకి అలెగ్జాండర్
(కూతురు)
చి॥ Myrah
(కూతురు)
చి॥ Abigail
(3) చి॥సౌ॥ సీతామహాలక్ష్మి
+ ప్రొ॥ సి.జి. పుట్టప్ప
చి॥ సంజయ్
+ చి॥సౌ॥ అక్షత
చి॥ అర్జున్
(4) చి॥ శ్రీనాథ్
+ చి॥సౌ॥ జయశ్రీ
చి॥ వైజయంతి
చి॥ స్కంద్
(5) చి॥సౌ॥శశిప్రియ
+చి॥ అశోక్ కులకర్ణి
చి॥ మిహిర్
కులకర్ణి
చి॥సౌ॥ రసజ్ఞ
+ చి॥ అమిత్

**36.3 మా బాచితమ్మునకు అచ్చిరాని 2021వ సంవత్సరం:-**

2021 జూలై 28వ తేదినాడు మా అన్నయ్య టి.వి.కె. సోమయాజులుగారు చనిపోయారు. కాబట్టి ఈ సంవత్సరం ఆయన తమ్ముళ్ళమైన మా ముగ్గురికీ చాలా చెడ్డ సంవత్సరం - అచ్చిరాని ఏడాది. మా అన్నయ్య చనిపోవడానికి ముందుగానే మా తమ్ముడు చి॥ తంగిరాల భాస్కరరావుకి ఇంకా పెద్దదెబ్బ తగిలింది. వాడి ఏకపుత్రిక శ్రీమతి భాగవతుల వెంకట సత్యపద్మజ 09-05-2021 నాడు హఠాత్తుగా చనిపోయింది. అప్పటికి ఆమె వయస్సు 59 సం.లు.మాత్రమే! 60 ఏళ్లు నిండలేదు (జననం: 25-09-1961). ఈ ఘోరం జరిగి 22 రోజులు తిరగకుండానే మా భాస్కరరావు ఏకపుత్రుడు శ్రీ తంగిరాల వెంకట సత్య రామలింగేశ్వరరావు, ఇంకా ఉద్యోగం చేస్తున్నవాడు, ఉన్నట్టుండి 31-05-2021 నాడు చనిపోయాడు. వాడు 03-06-1963లో జన్మించాడు; 58 సం.లు నిండకుండానే వెళ్ళిపోయాడు. 84 ఏళ్ళ వృద్ధుడైన మా భాస్కరరావు ఒక్క నెలరోజుల లోపల ఈ రెండు దెబ్బలూ తట్టుకొని ఉన్నాడంటే వాడు ఎంతో ధైర్యశాలి అని చెప్పుకోవాలి. వాడి మనసులో ఒక గొప్పవేదాంతి ఉండి ఉండాలి.

మా భాస్కరరావు 30-05-1937లో జన్మించాడు. బి.ఇ.సివిల్ ఇంజనీరింగ్ చదివి, పి.డబ్ల్యు.డి.లో ఉద్యోగం చేసి రిటైరయ్యాడు. తణుకులో మా అమ్మగారి పేరుతో "సీతామహాలక్ష్మీభవనం" అనే పెద్దమేడ కట్టాడు. అందులో వాళ్ళ అబ్బాయి ఉండేవాడు. దాని ప్రక్కనే ఉన్న మరొక మేడలో కూతురు అల్లుడు ఉండేవారు. మా తమ్ముడికి 1957లో పెండ్లి అయింది. వాడి భార్య పేరు "బాలాత్రిపురసుందరి" - మండపాకలో వేదుల ఆంజనేయులుగారి అమ్మాయి. ఈమెకూడా సరిగ్గా 59 ఏళ్ళే బ్రతికి 1997లో చనిపోయింది. మా తమ్ముడు ద్వితీయ వివాహం చేసుకున్నాడు. రెండవ భార్యపేరు శ్రీమతి శకుంతల. మా తమ్ముని అల్లుడు: శ్రీ భాగవతుల సుబ్బారాయుడు కూడా సివిల్ ఇంజనీర్‌గా పనిచేశాడు. రిటైరయిన తర్వాత తణుకులో స్థిరపడ్డాడు. ఈ అల్లుడు 11.11.2013నాడు చనిపోయాడు. మా తమ్ముని మొదటి భార్య, కూతురు, కొడుకు - వీళ్ళ ఫోటోలు ఈ పుస్తకంలో వేశాను; వాళ్ళ ఆత్మలకు శాంతికలగాలని భగవంతుని ప్రార్థిస్తున్నాను.

**- తంగిరాల వెంకట సుబ్బారావు**

04-12-2021

## 36.4 మా బాచితమ్ముని కుటుంబం



## 36.5 మా బుల్లితమ్ముని కుటుంబం

**కర్నల్ తంగిరాల కృష్ణమూర్తి + చి॥ సౌ॥ శంకరి**



# అశ్రుతర్పణం-రెండవ భాగం

# మా అన్నయ్య రచనలు

## విషయ సూచిక

# కీరకోకిలమ్

## (ఖండకావ్యం)

రచయిత:
**తంగిరాల వెంకట కృష్ణ సోమయాజులు**
ఆంధ్రోపాధ్యాయులు, ప్రభుత్వ జూనియర్ కళాశాల,
కైకలూరు.

ప్రచురణ
**శ్రీ భమిడిపాటి గౌతమ సుబ్బావధాని**
31.08.1975

# వందే గురుపరంపరామ్!

నా జీవనపథ విధాత

**శ్రీ కేశిరాజు వేంకట నృసింహ అప్పారావుగారు**

రిటైర్డు ప్రిన్సిపాల్, ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠము, కొవ్వూరు.

**గాంధీ సూత్ర సమగ్ర పాలన విధౌ నిశ్చంచల స్సాత్వికో**
**శాంతి ప్రేమ విధాన బోధన కళా చాతుర్య ధుర్యో మహాన్**
**గీర్వాణాంధ్ర ప్రతీచ్య హింది సుమనశ్శ్రీ 'కేశిరాజాన్వయః'**
**'అప్పారాయ' సుధీమణిర్విజయతాం! సర్వాత్మనా వర్ధతామ్!**

**దివ్యశ్రీ వేదుల రామశాస్త్రిగారు**

కాదన కెట్టి కావ్యమునకైవను నర్థము చెప్పఁగల్గు-సం
వాదమునందు శ్లోకములు, పద్యము లెప్పుడు చెప్పు-సంస్కృతాం
ధ్రాదరణీయ సారకవితా కలితాద్భుత దివ్యమూర్తి, మా
'వేదుల రామశాస్త్రి' బుధవీరుఁడు మద్గురుఁడయ్యె ధన్యుడన్.

**- తంగిరాల వేంకట కృష్ణ సోమయాజులు**

## సమర్పణ

తీవిగలట్టి చూపుల నటించును రాజస బ్రాహ్మ్య తేజముల్ !
భావమునందు గాంధిమత పద్ధతి, కావ్యరసానుభూతిలో
చేవ నెఱుంగునట్టి గుణసింధుఁడు నా కృతిభర్త గాగ, స
త్పావన వంశ్యుఁడౌ 'భమిడిపాటికి సుబ్బనధాని' కిచ్చెదన్ ! ౧

కవితా స్వాదనలోన మైమరచు సద్గణ్యుండు, మిత్రాళికిన్
వివిధోపాయములందు సాయపడు సన్మిత్రుండు, శాత్రాళికై
వివిధ వ్యూహ విధాన దక్షుఁడనగా పేరొందు మాన్యుండు, శ్రీ
అవధానిన్ కృతినాథుఁ జేసితిని! మేలౌనంచు నన్మెచ్చరే? ౨

కవితామాధురి నెంచి మెచ్చగల సంస్కారమ్ము నీసొమ్ము ! ఓ
అవధానీ ! పలుమార్లు నన్పిలిచి, విద్యాచర్చలన్ జేసి, సం
స్తవనీయాదరమిచ్చి మెచ్చితివి విస్తారంబుగా నన్ను ! నా
కవనంబందలి కందపద్య శతమున్ కానుగ నీ కిచ్చెదన్ ! ౩

నా కవితా లతావళులు నవ్యములై చిగురించె నీదు స్నే
హైక మనోజ్ఞ దోహద సమాదరణంబున, అందుకొన్ని లే
తాకులు మాలఁగట్టి యొక హారముగా కయిసేసి తెచ్చితిన్,
నీ కిది యీయ నెంచితిని, నిస్తుల ప్రేమ పరిగ్రహింపుమా! ౪

విరసునియొద్ద నాకవిత విప్పు నభాగ్యము నా ముఖంబుపై
పొరబడి వ్రాయవద్దదియె పుణ్యము! ఓ పరమేష్ఠి! యంచు తా
వరమును గోరెనంట కవి వర్యుఁడు బ్రహ్మను మిత్రులార ! స
ద్వర సరసాగ్రగణ్యుఁ దవధానికి నే వినిపింతు కైతలన్ ! ౫

ఏనుగు నెక్కజేయుమని యేనినుఁగోరను, పట్టుశాలువల్,
కానుక లగ్రహారములు, కంకణ శ్రీలను కోరనయ్య ! వి
జ్ఞానధురీణ ! నీ మధుర సఖ్యము కోరెద నెల్లవేళ, శ్రీ
జాని కృపావిశేషమున చల్లగ వర్ధిలు సాహితీప్రియా ! ౬

'కాఫీయా?' ఇది 'కీరమా' యనుచు ధిక్కారించి మూచూడ కే
కోపిపం బనిలేదు ! నాదు కవితాగోష్ఠీ విలాసాలలో
లోపంబెంచక నన్ను మెచ్చుకొను నా లోకంబు నాకుండె నే
రేపున్ మాపును గిల్కుచుండెదను, వారిన్ నేను మెప్పించెదన్. ౭

భమిడిపాటి కులంబు వన్నెకెక్కించెను
'అయ్యప్పశాస్త్రి' శతావధాని !
ఆతని తమ్ముడై వ్యవహార దక్షుడౌ
'కామయ్య' గురువర్యు ఘనతపంబు
పతి మాటయే తన భావంబుగా సతీ
నుత 'పిచ్చి రామమ్మ' నోము ఫలము
గాగ జన్మించిన "గౌతమ సుబ్బవ
ధాని; "సీతా భారతాంబ" యందు

"సచ్చిదానందమూర్తి" ని, సరసు 'విశ్వ
నాథు' పుత్రుల – పుత్రిరత్నాల, సుగుణ
శ్రీల, 'కామేశ్వరి'ని – 'గౌరి' – 'శేషమాంబ'ఁ
గాంచె – ఈ కుటుంబమును రక్షించుగాక!
సర్వ విధముల తల్లియౌ "శ్యామలాంబ" ! ౮

ఇతరుల భోగభాగ్యములనెంచి హృదంతర చింతచేయు సం
తతిగని చెప్పినట్టి కథ! నవ్యమనోహరభావయుక్తి స
మ్మతమగు కావ్యఖండమని మానసమందున నీవు మెచ్చ ని
చ్చితినిది! 'కీరకోకిలము' శ్రీ అవధాని రసజ్ఞశేఖరా! ౯

## శ్రీ శారదాంబాయైనమః

# కృతిస్వీకారము

మేము గార్గ్యస గోత్రజులము. మా తాతలు ఘనాపాఠీలు. ఆకివీఁటి భమిడిపాటివారు. మా పెదతండ్రి అయ్యప్పశాస్త్రిగారు శతావధాని. ఆయన వేదాద్రిలక్ష్మీనృసింహ గర్భవృత్త సామరస్యమను గ్రంథరాజమును 300 సీసములలో ప్రసాదగుణము కలిగిన గర్భకవితను చెప్పి యశఃకాయుడయ్యెను. ఆయన రచించిన 'శ్రీపద లాంఛన' మను కావ్యముయొక్క వ్రాతప్రతి అముద్రితమై నా యొద్ద నున్నది. మా తండ్రి కామయ్యగారు పంచకావ్యములు పఠించినవారు. ఆయనయే మాకు గురువు, బాల్యముననే కృష్ణశతకము, దాశరథీశతకము, భాస్కర శతకము మొదలగు శతకములను బోధయొనర్చి, మమ్ముల – (అనగా) నన్ను చిరంజీవులు రాధాకృష్ణమూర్తి, ఉదయభాస్కరశర్మ, పూర్ణచంద్రరావులను సమాజములో యిట్టి స్థితికిఁదెచ్చిరి. 'అన్యాయంబనినంత భగ్గుమని దేహంబంతయున్ మండి కాఠిన్యంబున్ గొను నాదు వాక్కు' అనినట్లు సన్మార్గ ప్రవర్తనలో మమ్మును తీర్చిదిద్దెను. మేము సర్వదా సర్వథా కృతజ్ఞులము, విధేయులము, భవతు!

కైకలూరు హైస్కూలునందు తెలుగు పండితులు కీర్తిశేషులు జోస్యుల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, నందుల సుబ్బరాయశర్మగారు, ముష్టి సుబ్బారావుగారు, మాధవపెద్ది సూర్యనారాయణగారు ప్రస్తుతము గుడివాడలో నివసించుచున్న శ్రీ నిడమర్తి సత్యనారాయణమూర్తిగారు మాలో చిన్నతనమున పద్యములు చదువుట యందభిలాషను కల్పించిరి.. అదియే కావ్యపఠనోత్కంఠను మాలో రేకెత్తించినది. కొంతలో కొంత ఆ దశ కార్యరూపము దాల్చినది.

ఎందుచేతనో కవిత్వము చెప్పవలెననెడి యాశ కలుగలేదు. కావ్య పఠనముతోనే సరిపోయినది. శ్రుతపాండిత్యము కలదు. హూణ విద్యాభ్యాసము వలన కవిత చెప్పెడి యవకాశము కలుగలేదేమో? అధికారాంతమునందు కవితారాధన మొదలిడవలెనని యాశ. భగవంతుడాయాశను సఫలము చేయునేమో?

ఈ కవితారాధనకు మొదటి మెట్టు – ఈ గ్రామములోని శ్రీ కొమ్మ సోమేశ్వర శర్మగారు, శ్రీ తంగిరాల వెంకట కృష్ణ సోమయాజులుగారు, శ్రీపరిమి కృష్ణమూర్తి గారు, శ్రీపొట్లూరి లక్ష్మీనరసింహస్వామి (స్వామిగారు), శ్రీ ప్రసాద శాస్త్రిగారు, శ్రీ మద్దూరి సర్వేశ్వరరావు మొదలగువారు వారి వారి పాండిత్య ప్రకర్షను ప్రకటించు సందర్భములో కావ్యరసాస్వాదన చేయు నవకాశము చిక్కినది. కైకలూరు తనఖాబ్యాంకులో కవిసమ్మేళనములు జరుగుటయు, అందు కవిపండితులు సభికుల నుఱ్ఱూత లూగించుటయును జరిగినది. ఆదియునుగాక, శ్రీశ్యామలాంబవారి ఆలయములో శ్రీ కొప్పరపువారి పుత్రుల అష్టావధాన ప్రదర్శనవలన, సహృదయులైన రసజ్ఞులలో కొంత సంచలనము కలిగినది!

అట్టి సమయములలోనే నాకీ గ్రంథకర్తతో పరిచయ భాగ్యమేర్పడినది. శ్రీసోమయాజులుగారు అక్షరశః గాంధీయవాది; కవితావ్యవసాయములో అందెవేసిన చేయి; మంచి కృషీవలుడన్నమాట. సంసార విషవృక్షమునకు సజ్జన సాంగత్యమును, కావ్యామృత రసాస్వాదనమును – రెండును అమృతఫలములుగదా! అందును శ్రీ సోమయాజులుగారు మమ్ములను నన్ను తనఖాబ్యాంకు మేనేజర్లు శ్రీ గంగాధరరావు, శ్రీమస్తానయ్యగార్లను సిబ్బందిని యెన్నియో పర్యాయములు వారి స్వీయకవితల వినిపించి ముగ్ధుల నొనరించిరి.

ఈ కృతిస్వీకారము తత్ఫలితమే! కృతిని స్వీకరించు నర్హతయు సమర్థతయు ఉన్నను, లేకున్నను, అందుకు తగిన యుత్సాహ మినుమడించినది. స్వీకరించుటకు శ్రీ డి. మస్తానయ్య, B.M., శ్రీ బత్తుల అంజయ్య, (సూపర్ వైజరు), శ్రీ కోట వెంకటేశ్వరరావు, టైపిస్టుగారల ప్రోత్సాహమే నన్ను త్వరపెట్టినది. కవితా వాసన పూర్వజన్మ కృతమే. అందుచేతనే "ప్రాక్తన జన్మ విద్యాః" అనుట.

ఒక చిన్న మాట. శ్రీసోమయాజులు గారు అన్నపూర్ణా సమేత కాశీ విశ్వేశ్వరుల నిత్యాభిషేక నిరతులమైన మాకీ యదృష్టము కల్పించుటచే మేము ధన్యులము. మా తల్లి దండ్రులును సుకృతాత్ములు. ధనమున కేమిగాని, వచ్చుచు పోవుచుండును. నీతినియమములతో సంచరించుటయే మహాధనము. మనసుకు ధైర్యమును మహదానందమును కలిగించునది కృతిస్వీకారము.

ఈ కృతిస్వీకారమే నన్ను సహకార రంగమమునందు రచయితల సహకార సంఘము నొకదానిని నెలకొల్పి, కవిపండితులను సంఘటితపరచి, వారివారి రచనలద్వారా శ్రేయోభివృద్ధికి కృషిచేయ ప్రయత్నమొనరించునట్లు ప్రోత్సహించినది.

శ్రీ సోమయాజులుగారు రసవత్తరమైన కావ్యకన్యకల సృజియించి సరస్వతీదేవి నలంకరించెదరు గాత!

కైకలూరు ప్రభుత్వ జూనియర్ కళాశాలలో చిత్రకళోపాధ్యాయులుగా పనిచేయుచున్న శ్రీ గంజి కోటేశ్వరరావు నాకు యీ పుస్తక ముఖపత్రములను కోరిన వెంటనే దయతో రూపొందించి యిచ్చినందుకు వారికి సర్వదా కృతజ్ఞత.

"సుకవితా యద్యస్తి రాజ్యేన కిం"

కైకలూరు,

31-08-1975 **భ॥ గౌ॥ సుబ్బావధాని**

రాక్షసనామ సంవత్సర శ్రావణ బహుళ దశమి భానువారము.

---

**శ్లో॥ శతం విహాయ భోక్తవ్యం - సహస్రం స్నానమాచరేత్।**
**లక్షం విహాయ దాతవ్యం - కోటిం త్యక్త్వా హరిం భజేత్॥**

తా॥ నూరు పనులు మానివేసి, (వేళకు) భోజనం చేయాలి; వేయిపనులు మానివేసి, స్నానం చేయాలి; లక్ష పనులు మానివేసి, దానం చేయాలి; కోటి పనులు మానివేసి, భగవంతుని (విష్ణువును) పూజచేయాలి!

– "ఏఱిన ముత్యాలు"

పెద్దాపురం సంస్థానాధిపతి తిమ్మజగపతి పరమలోభి; కవులెవ్వరికీ ఒక్క గుడ్డిగవ్వ ఇచ్చేవాడు కాదు. ఒక తెలివైన కవి అటువంటి పిసినారి దగ్గరకు వెళ్ళి, ఆ రాజుపై ఒక పద్యం చెప్పి, ఘనసన్మానం పొంది వచ్చాడు. అతడు చెప్పిన పద్యం:-

**ఉ॥ "ఇవ్వడు ఇవ్వ" డంచు జను లెప్పుడు తప్పక చెప్పుచుందు, రే**
**మివ్వడు? అన్యకాంత కురమివ్వడు! సంగరరంగమందు వె**
**న్నివ్వడు! శత్రులన్ ప్రబల నివ్వడు! బెబ్బులినైన పట్టి పో**
**నివ్వ డసత్యవాక్య మెపుడివ్వడు-తిమ్మజగత్పతీంద్రుడే!**



**కీ.శే. భమిడిపాటి గౌతమసుబ్బావధానిగారు (1921-1997)**

**పుణ్యపురుష సంస్మరణ:**

వృత్తిరీత్యా సహకారవేత్త - ప్రవృత్తిరీత్యా సాహితీవేత్త
పూర్ణకాముడు - యోగిపుంగవుడు అయిన

## శ్రీ భమిడిపాటి గౌతమసుబ్బావధానిగారు (1921-1997)

సదా శివధ్యానతత్పరుడు, సాహితీరచనాచణుడు, యోగిపుంగవుడు అయిన శ్రీ భమిడిపాటి గౌతమసుబ్బావధానిగారు తమ 76వ యేట ఈశ్వర నామ సంవత్సర బహుళ దశమినాడు (1997 మే 2వతేదీని) ఈశ్వర సాన్నిధ్యాన్ని పొందారు.

కృష్ణాజిల్లా 'కౌతరం' గ్రామంలో, గౌతమేశ్వరస్వామి ఆశీస్సులచే జన్మించిన గౌతమసుబ్బావధానిగారికి జన్మనిచ్చిన తల్లిదండ్రులు పిచ్చిరామమ్మ, భమిడిపాటి కామయ్యశాస్త్రిగారలు. విద్యాభ్యాసకాలంలో బందరు హిందూ కళాశాలలో విద్య

నెఱపిన గురువులు శ్రీ చోడవరపు జానకిరామయ్య, శ్రీ గోఖలే, కనిపాదుషా శ్రీ పువ్వాడ శేషగిరిరావు, కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారలు. ఉద్యోగం చేస్తున్న కాలంలో కవితాగురువులు శ్రీ కొమ్ము సోమేశ్వరశర్మ, మరియు శ్రీ తంగిరాల వెంకట కృష్ణసోమయాజులుగారలు (వీరు ప్రసిద్ధ జానపద విజ్ఞానవేత్త, కవి, విమర్శకులు అయిన ఆచార్య తంగిరాల సుబ్బారావుగారి అగ్రజులు).

అన్యాయమనినంతనే భగ్గుమనెడి స్వభావం కలవారు శ్రీ అవధాని. సుమారు 40 సంవత్సరాలు కో–ఆపరేటివ్ శాఖలో పనిచేసి, చివరకు డిప్యూటీ రిజిస్ట్రార్‌గా పదవీవిరమణ గావించారు. ఆ డిపార్టుమెంట్‌లో వీరు నిజాయితీకి మారుపేరుగా నిలిచారు. వృత్తిరీత్యా ఉద్యోగంలో మంచి కీర్తిప్రతిష్ఠలు గడించినా, వీరి పూర్తి ఆసక్తి, అభిరుచి సాహిత్యంపైననే ఉండెడిది. అవధానాలను నిర్వహించుట అనిన వీరికి వెన్నతో పెట్టిన విద్య. దేశంలో ప్రసిద్ధి వహించిన అవధానశేఖరులు శ్రీ కొప్పరపు సీతారామ వరప్రసాద్, శ్రీ పేరాల భరతశర్మ, శ్రీ డా॥ ఎస్. జనార్ధనరావు, శ్రీ కొత్తపల్లి ఘనశ్యామల ప్రసాదరావు మొదలగువారిచే స్వగ్రామం కృష్ణాజిల్లా కైకలూరులో అష్టావధానాలను చేయించేవారు. ఆ సభలకు అధ్యక్షులుగా నుండేవారు. వీటి అన్నింటియందును ప్రోత్సాహకులు, ప్రసిద్ధ పృచ్ఛకులు, వీరి గురువర్యులు శ్రీ తంగిరాల వెంకట కృష్ణ సోమయాజులుగారే.

ఆకాశవాణివారి సమస్యాపూరణంలో అవధానిగారు నిరంతరం పాల్గొనెడివారు. వీరు "కైకలూరు సాహితీ సమితి" అను సంస్థ నొకదానిని స్థాపించి, శ్రీ సోమయాజులుగారు రచించిన "కీరకోకిలము" "కాఫీశతకము" మొదలైన పద్యకావ్యాలను ప్రచురింపజేశారు. పదవీ విరమణ అనంతరం (1977) వీరి సాహిత్యాభిరుచి, రచనావ్యాసంగం ఇనుమడించాయి.

"ఆయురారోగ్య భోగభాగ్యముల నిడుత, శ్యామసుందరి జనని శ్రీ శ్యామలాంబ" అనే మకుటంతో "శ్రీ శ్యామలాంబా త్రిశతి"ని (300 పద్యాలను) రచించారు. కలిదిండి గ్రామమునకు సమీపమున పొలములలో వెలసియున్న శ్రీ పాతాళ భోగేశ్వర స్వామివారిపై "శ్రీ పాతాళ భోగేశ్వర శతకము"ను రచించిరి. (కోడికూత–రోకటి పోటు ఈ స్వామికి వినిపించకూడదట). తదనంతరము "గాయత్రీ శతకము"ను రచించిరి. శ్రీ తులసీదాసు హిందీలో రచించిన "శ్రీ తులసీదాసు రామాయణము" ను వీరు పద్యములలో తెలుగు పద్యకావ్యముగా

అనువదించిరి. తమ గురువులైన శ్రీ తంగిరాల వెంకట కృష్ణ సోమయాజులుగారితో కలిసి, భద్రాద్రికి (భద్రాచలమునకు) పోయి, గురువులకు ఆ కావ్యమును వినిపించి, సీతారామచంద్రులకు ఆ కావ్యమును అంకితమొనర్చిరి. హిందీ రాష్ట్రభాషా ప్రవీణయందు ఉత్తీర్ణులగుట వీరికీ అనువాదము చేయుటలో మిక్కిలి ఉపకరించినది.

వేదాధ్యయనమునందు వీరికి అనన్యమైన ఆసక్తి ఉండెడిది. శ్రీ అవధానిగారు శుక్లయజుర్వేదమునకు తెలుగులో వ్యాఖ్య రచించిరి. తిరుమల తిరుపతి దేవస్థానమువారు ఈ కృతి ముద్రణకు ఆర్థిక సహాయమును మంజూరు చేసిరి.

వీరి భక్తితత్పరత ఎనలేనిది. ప్రతివత్సరము శివనామ సప్తాహములను నిర్వహించి శివపార్వతీ కల్యాణమును జరిపించెడివారు. జ్యోతిశ్శాస్త్రమునందు కూడ వీరికి అపారమైన అనుభవము, ప్రవేశము, ఫలితములను చెప్పిడి ప్రజ్ఞ యుండెడివి. మరణించుటకు ముందు ఆసుపత్రికి వెళ్తూ “ఈ రోజు ఆసుపత్రికి పోక! ఇక రాకలేదు” అని స్వదస్తూరితో డైరీలో వ్రాసుకొనియుండిరి.

తెలుగు సాహిత్యము పై గౌతమ సుబ్బావధానిగారి అభిరుచి ఎల్లలు దాటినది. తనకున్న ఇరువురు కుమారులను వారణాసిలోని, కాశీ హిందూ విశ్వవిద్యాలయము తెలుగుశాఖకు పంపించి ఎం.ఎ. మరియు పిహెచ్.డి లు చెప్పించి, డాక్టరేట్‌లుగా తీర్చిదిద్దిరి. ఇందు పెద్దకుమారుడు డా॥ సచ్చిదానందమూర్తికి పిహెచ్.డి. న్యాయ నిర్ణేతలుగా సుప్రసిద్ధ సాహితీవేత్త ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారు వచ్చి పిహెచ్.డి. డిగ్రీని ప్రదానము చేసిరి. చిన్నకుమారుడు డా॥ విశ్వనాథ్ ప్రస్తుతము బి.హెచ్.యు. తెలుగుశాఖలో రీడరుగా నున్నారు. కుమార్తెలను భాషాప్రవీణులుగా అవధాని గారొనర్చిరి. ఇంతటి పుణ్యపురుషులు శ్రీ గౌతమ సుబ్బావధానిగారికి, సాహితీ నివాళులర్పించుచు, వారి ఆత్మశాంతికై ప్రార్థించు చున్నాము.

**ఆచార్య భమిడిపాటి విశ్వనాథం**
బెనారస్ హిందూ విశ్వవిద్యాలయం
వారణాసి.
(–చైతన్యకవిత–30, ప్రమాది శరత్తు, అక్టోబరు 1999)

# కీర - కోకిలమ్

శ్రీకరము నవవసంత శు
భాకరమౌ రాత్రిసమయమందున చింతా
శోకములు పెనగొనంగా
వ్యాకులయై చిలుకపిల్ల పలికెన్ తల్లిన్ ! ౧

“పలుకులు నేర్పుదు వెప్పుడు
‘కిలకిల’ మను రొదలతోడ ‘కీకీ!’ యనుచున్
సలలిత విలసత్పంచమ
కలగానము చిలుకతల్లి ! కష్టంబటవే? ౨

హాయిగ పంచమస్వర సమాలపనంబును మాకు నేర్పినన్
కోయిలలట్లు మేము అది ‘కో’ ! ఇది ‘కో ! యని యాలపించి, ఓ
హెూ ! యను గౌరవమ్ము నెపుడో కనియుందుముకాదె! యేల య
న్యాయముచేసి తమ్మ ? తగునా? [1]పలు పల్కుల తీర్చిదిద్దుటల్? ౩

వారి కోకిలమ్మ పలుమాటలను వీడి
ఒక్కమాట నేర్పె ‘కో’! యటంచు,
దానితోనె వారు [2]గానకోకిలలైరి !
కలదె గానమందు చిలుకమాట? ౪

పలుకులు వచ్చిన చక్కెఱ
చిలుకల పంచెదరు చెప్ప సిగ్గునమ్మా!
[3]తుల చేసిరి పసిపాపల
పలుకులతో నింతకన్న పాపము కలదే! ౫

పచ్చని యాకుగుంపులు విభాసిత వైఖరి పెండ్లి పందిరై
ముచ్చటఁగూర్ప-పుష్పముల పుంజములన్నియు శోభగూర్ప-పై
పెచ్చయి రేగు తుమ్మెదల విశ్రుతి ఝుంకృతి పాటకున్ శ్రుతై
మెచ్చుఘటింప - కోయిలలు మింటిమొగంబయి కూతవెట్టెడిన్! ౬

1) చాల మాటలు నేర్పుట. 2) సంగీతములో నిచ్చు బిరుదము. 3) సమానము.

చిగురుల్ మెక్కుచు, చెట్లపై తిరుగుచున్; చేవైన గొంతెత్తి–[1]ఏ
వగ తాఁగూయునొ యట్లె యీ ప్రకృతిచే పల్కించి మార్మ్రోయఁగా;
[2]"ఖగరాజాగ్రణి' యై వెలింగినది ! భాగ్యంబెద్దియో కాని, యీ
జగతిన్ గోకిల పంచమస్వరమె [3]ఆస్వాద్యమ్ము శబ్దంబులన్! ౭

అమ్మా ! కోకిల భాగ్యము !
కమ్మని కంఠమ్ముగల్గి గౌరవమందన్;
మమ్మెవ్వరాదరింతురు?
[4]ఇమ్మహిలో మేమదృష్టహీనుల మమ్మా!" ౮

అనియిటు చిల్కపిల్ల తడియారిన గొంతున దుఃఖవేదనా
[5]స్వనమునఁ బల్కుచుండఁగ "విచారము మానుము వెఱ్ఱిపిల్ల! నీ
ఘనతయదేమొ నీమది వికాసముతోడఁ దలంచి చూడుమా!
[6]తన కలరూపు తానెఱుఁగు ధన్యుడె మాన్యుడుగా వసుంధరన్! ౯

పచ్చనివాడనంగ ధనవంతునిగాగ గణింతు రట్టిదౌ
పచ్చనిరూపు నీదికద! పచ్చనిరంగుల తోరణమ్ములే
తెచ్చు శుభమ్ములన్నిటిని–దీని మదిం దలపోసి యుంచుమా !
పచ్చనిచేల వైభవమె భాగ్యము నిచ్చును మేలుఁ గూర్చుచున్ ! ౧౦

బాలసూర్యుని సంపర్క వశముచేత
[7]రామభక్తుని మొగమున [8]రక్తిమంబు
కలిగినట్లుగ, చిలుక ముఖమ్మునందు
రక్తిమము గల్గె– పేరున "రామచిలుక" ! ౧౧

[9]కలుకుల యందచందములు కాంచి ముదంబునఁ బల్కుచుందురే
"చిలుకల కొల్కి" యంచును విశేష సమాదరణంబు చేసి; ఆ
[10]పలుకు వెలంది హస్తమున భాసిలుచుండెడి [11]కీరరాజమే
చిలుక కొలమ్ము వారల ప్రసిద్ధికి మూలము, దీని నెంచుమా! ౧౨

---

1) ఏవిధముగా. 2) పక్షులలో శ్రేష్ఠమైనది. 3) రుచికరమైనది. 4) ఈ లోకములో. 5) ధ్వనిలో. 6) తన మంచి చెడ్డలు. 7) హనుమంతుడు. 8) ఎఱుపు. 9. స్త్రీలు. 10. సరస్వతి. 11. చిలుకరాజే.

ఆ [1]వాణీకర పోషితంబగుట రాజాంతఃపుర స్త్రీలతో
సావాసించు నదృష్టమబ్బినది ! వాక్చాతుర్య సామాగ్రిచే
సేవింపంబడు కీరరాజులని వాసింగన్న యీ జాతితో
భావింపంగల పక్షిజాతి కలదా? పల్మాట లింకేటికిన్ ? ౧౩

[2]మనసిజు డిక్షుధన్వుఁడు సుమంబుల కూర్చిన పంచబాణుడై
[3]వనజభవానుజుండనఁగ వర్ధిలు ధన్యుఁడు మన్మథుండు, బ్ర
హ్మనువలె విష్ణునిన్వలెను-హంసను గ్రద్దను నెక్కఁ బోక; చి
ల్కను తన తేజిఁ జేసికొనె గౌరవభావముతో ముదంబుగన్ ! ౧౪

తనకు భగవంతుఁడిచ్చిన ఘనతఁ దలఁచి,
ముదము నందుచు నుండుట ముఖ్యమగును!
పరులభాగ్యాలు తలపోసి బాధపడెడి
వారు గమనింపవలె పరబాధలన్ని- ౧౫

ఇతరుల వైభవములఁ గని
మతిమంతుఁడు దైన్యపడదు మతిహీనుక్రియన్ !
'సతతము పరవైభవ నుతి
చతురత' యన నాత్మనింద చందము గాదే? ౧౬

తనుఁదాను మెచ్చుకొనుటయు,
తనుఁదానే తిట్టుకొనుట తగదివి రెండున్!
ఘనుడని యితరుని మెచ్చుచు,
తన నెఱుఁగక యుండుటెపుడు తగదు కుమారా ! ౧౭

ఎవరి భాగ్యమ్ము వారిదౌ నెంచిచూడ
ఇతరుల యదృష్ట రేఖల నెంచునపుడు
వారి దురదృష్టములు కూడ తేరిచూచి,
మన యదృష్టములను గని తనియవలయు! ౧౮

---

1.సరస్వతిచే పోషింపఁబడుట. 2. చెఱకువిలుకాడైన మన్మథుడు. 3. బ్రహ్మతమ్ముడు.

ఇతరుల పలుకులు నేర్చుట,
మతిలోఁ దమపలుకు మరచి మాటాడుటయున్;
గతిలేని పనులు బిడ్డా!
మతమగు మనమాట మనకు [1]మాన్యస్ఫూర్తిన్; ౧౯

[2]అనుకృతి దాస్యభావమగు ! నైనను మంచిని నేర్పవచ్చు- ఒ
క్కనిదగు జాతిలక్షణము కల్గునె వేరొక జాతివానికిన్?
కని నటియించు మాత్రమున నవ్వులపాలగు; నెట్టివానికై
నను సహజస్వభావ సుగుణంబులు నేర్చుట దుర్లభంబగున్ ! ౨౦

పిచ్చుక [3]హంసయానమును వేడుకతోఁ దగ నేర్చు కోరికన్
తచ్చరణద్వయానుకృతి తక్కుచు తారుచు నభ్యసింపఁగా,
వచ్చిన [4]పూర్వపున్నడల వైఖరిపోయెను - హంసయాన మా
పిచ్చుక కబ్బదయ్యె, విలపించెను-గెంతుచునుండె నేటికిన్! ౨౧

పుట్టువు శత్రుమధ్యమున - పుణ్యవశమ్మున [5]కాకిరూపు చే
పట్టెనుగాన, కొంతయిన వర్ధిలఁగల్గెను-అంత గూతయున్
పట్టెను-దాన జాతి కనుపట్టెను ! కోకిలపుట్టినింటిలో
[6]కట్టినదాట ! ఆ వెనుక కాళుల తాపులు ! ముక్కు పోటులున్! ౨౨

నూఱుకాకులు ముక్కులు నూరి నూరి,
చివ్వకై కాళ్లు మాటికి దువ్వి దువ్వి,
పొడిచి విడచుట చేతనే పుట్టె "నూఱు
కాకులకు మధ్య నొక్కటి కోకిల" నుచు - ౨౩

[7]వనమున కొయ్యగూట విడువంబడి [8]యన్యుల జాతిఁబేరు పెం
పునుగని, జాతిభేదమున పోటులఁ జెందుచు దిక్కులేక నూ
తన సహకార పక్షసముదాయముచే తగుపీఠ మెక్కి, క
ర్ణునివలె సర్వమిచ్చుటకునోయన, కోయిల కూయ నేమగున్ ? ౨౪

1. గౌరవ వికాసముతో. 2. అనుకరించుట 3. హంసనడకను. 4. ముందున్న నడక. 5. అందములేని. 6. అట సాగలేదు. 7. కర్ణుని పక్షమున-జలములో, కోకిల పక్షమున-అడవిలో 8. సూతుడని పేరు - కాకియనిపేరు.

పరగృహమందు వారిడిన పట్టెడు కూడు గ్రహించి, నెమ్మదిన్
కరుణ దలిర్పగా మెలఁగఁగల్గిన మేలగుగాని, మేత ము
ప్పిరిగొనమేసి, 'కో'! యనుచు ప్రేలిన, 'కా'! యని త్రోయకుందురే?
చరణ విఘాతసంహతులు [1]చంచుపుటాహతులిచ్చి వెంటనే ! ౨౫

కోయిల పంచమస్వరము కూయుచు గౌరవమందుగాక! ఆ
తీయని మావిచెట్ల కతిదీప్తిని తెచ్చినఁ దెచ్చుగాక ! అ
న్యాయముచేసి కాకగృహమందు [2]భృతిన్ గనినట్టి పేరు, వా
దై యమరెన్‌గదా! [3]"పరభృత"మ్మను పేరున మారుపేరుగా- ౨౬

1. ముక్కుపోటులు. 2. పోషణము. 3. "పరభృతము"-ఇతురలచే పెంచబడినది-కోకిల.



సంస్కృతాంధ్రాలలో ప్రముఖ పండితులు, ద్విభాషా అష్టావధాని
కీ.శే. డా॥ చెఱువు సత్యనారాయణశాస్త్రిగారు, తణుకు.

# కాఫీ ఆరాధన

శ్రీతో మొదలిడు కంటెను
బ్రూతో నీ శతకమేను పొగడc దలcచితిన్
ప్రాతగు పద్ధతి విడచుట
చేతయ్యెను [1]శ్రీని విడువ చెల్లను కాఫీ ! ౧

శ్రీయును బ్రూయును రెంటను
శ్రీయే కడు గొప్ప యనుచు చెప్పన్ వలెనా?
శ్రీయుండక బ్రూ యుండదు !
శ్రీయే మూలంబు జగతి చిక్కని కాఫీ ! ౨

నీ కొలువుతీర్చు ధ్వని విని
నే కన్నులు తెఱచువాడ నిత్యము తల్లీ !
నీకంటె ముఖ్యు లెవ్వరు
నాకీ లోకమున లేరు! నా ప్రియ కాఫీ ! ౩

నాలోని మలము లన్నియు
నీ లాలనచేత సాఫి నిర్మలమూ ర్తీ!
ఆలాగౌటనె "కో... మ ల
వీలాస్ కాఫీ" యనంగ వెలసితి కాఫీ ! ౪

రమ్మని యింటికి పిలచియు,
కమ్మని కాఫీని నింపి కప్పున నీకే
పొమ్మన్న వాని కబ్బును
వమ్ముగ నరకాది [2]శారనమ్ములు కాఫీ ! ౫

1. ధనము లేక చెల్లను. 2. శారవాది యమదండనలు.

ఎన్ని చిఱుదిండ్ల కైనను,
నిన్నే మంగళముజేసి నిరతము త్రావన్
నిన్ను 'జన గణ మన' ంబున
కన్నను మిన్నగఁ దలంతు ఘనతమ కాఫీ ! ౬

బియ్యము లేవని చెప్పుట
కయ్యముగా చెప్పుచుంద్రు గయ్యాళులుగా,
తియ్యగ నీపొడి తెమ్మని
వయ్యారులు ప్రేమమీర పలుకరె కాఫీ ! ౭

పసిపాప లత్త! తాత! ని
[1]వసపోసిన పలుకనట్టి వారికి, చెమ్చా
'నెసుకాఫి' పోయ మాటలు
పుసుకున 'ఆ పీ' యటంచు మొదలగు కాఫీ ! ౮

ఏబది బజ్జెలు గల్గిన
నీ బట్టీయున్న తుఱ్ఱునీళ్లగు పెరుగుల్!
[2]దూబరయగు పొడంతయు
డాబగు నీ కొలువు చేయ డౌనే! కాఫీ ! ౯

లడ్డూ – జిలేబి – హల్వాల్
ఇడ్డెన్ – సాంబార్ – పకోడి–యెన్నో యుండన్
దొడ్డగ 'కాఫీ హొటల'ని
అడ్డంబుగ పేరుపెట్టి రాహో ! కాఫీ ! ౧౦

జలమున ముఖమును కడుగగ
తలపను నే నెన్నడైన తల్లీ ! నీతో
సలసల ముఖమును తడిపిన
'మిల మిల'మని చుఱుకు వచ్చు మేలగు కాఫీ ! ౧౧

---

1. మాటలు తొందరగా వచ్చుటకు వసనూరి పోసెడివారు. 2. వ్యర్థముగాపోవు.

రమ్మని యింటికి పిలచియు
కమ్మని కాఫీ నొసంగ గలవాడేగా
ఇమ్మహిని 'ఎటికసీ' గల
కమ్మని 'ఫ్రెండ' గును కాలక్రమమున కాఫీ ! ౧౨

పాలవి నలువది చెంచాల్
చాలన, చెంచాలు నాల్గు శర్కరవైనన్,
లీలగ నీవొక చెంచా
మేళనచే పేరుగల్గి మించవె కాఫీ! ౧౩

ఒక యింట పంచదారను,
ఒక యింటను పాలుదెచ్చి, యుత్సాహముతో
ఒక యింట భస్మమడిగియు,
[1]మొకమోటము లేక త్రావ మోక్షము కాఫీ! ౧౪

కాఫీ త్రాగుట కడిగిన
[2]తాపీగా లేదటనుట ధర్మంబగునా?
ఆ పద్ధర్మంబనుకొని
ఏ పావల యైనగాని యీవలె కాఫీ ! ౧౫

అఱకప్పు కాఫిలోపల
చెరియొక 'ఫిఫ్టీ' గ త్రాగు చెలిమితలంపన్
సరిగనది అర్ధనారీ
శ్వర ప్రేమే యనగవచ్చు వహ్వా ! కాఫీ ! ౧౬

జాతిమత భేదభావము
తో తమతమ భ్రాతృభావదూరులు కాఁగా,
జాతుల నొకటే కప్పున
మూతులు ముట్టించి తెంత పుణ్యమె! కాఫీ ! ౧౭

---

1. జంకు. 2. తొందరపడకుండ.

[1]"బేవర్సు కాఫి త్రావిన
బ్రేవనుచును త్రేన్పువచ్చు ప్రియముగ నోహో !
బేవర్సు రుచికి కాఫీ
చేవయు జతగూడ చెప్ప చిత్రము కాఫీ ! ౧౮

"ప్రేయసి యధరమొ" బ్రూకా
ఫీయో మధురంబటంచు వేయి పరీక్షల్
చేయగ రెండు సరయ్యెను
ఆయమ [2]"కాఫ్యాధర" య్యె నప్పుడు కాఫీ ! ౧౯

పెండిలి చూపులలో - చిఱు
తిండుల - తలనొప్పి వేళ,తీరిక వేళన్
[3]తండుల మబ్బని వేళను
దండిగ నీ వుండువమ్మ ! తల్లీ ! కాఫీ ! ౨౦

నీవు జతఁగూడ, నెంతటి
చావైనను తొలఁగద్రోయఁ జాలును మందుల్
నీవు దరిచేర కుండగ
[4]చావైనను రాదు ! నిత్య సరసమ ! కాఫీ ! ౨౧

నీరస మబ్బిన వేళల
నీ [5]రసమును కప్పునందు నింపుక త్రావన్
వీరరస మబ్బకుండునె?
[6]సారస ముఖ్యాధర మధుర సారా కాఫీ ! ౨౨

పాలగు సరస్వతీనది !
మేలగు శర్కరయె యమున ! మించగు కాఫీ
లీలయె గంగాజలమగు
మేలగు కప్పున త్రివేణి మేళన కాఫీ ! ౨౩

1. ఇతరుల సొమ్ముతో వచ్చునది. 2. కాఫీవంటి పెదవికలది, 3. బియ్యము. 4. వైద్యములేని చావుండదు. 5. నీయొక్క రసమును 6. పద్మముఖియొక్క పెదవివలె మధురమై సారముకల.

ఎండబడి – డప్పివడి – పెద
వెండగ – మన యిల్లుచేర నెవ్వరికైనన్
దండిగ మజ్జిగ నిచ్చుట
పండుగ పూర్వమున ! నేడు వచ్చెను కాఫీ ! ౨౪

[1]చుంబన ప్రక్రియ నీవా
రంభను మరపింతు [2]వంటరాని స్థితిలో
సంబరపడుచుందురు నిన్
చుంబింపఁగ వేడియందు శుభముఖి ! కాఫీ ! ౨౫

చుట్టంబుల మర్యాదకు
గట్టిగ మిత్రులకు మధ్య గౌరవమబ్బన్
పట్టగుదువు నీ వెప్పుడు
నెట్టన వర్ణింప నెట్లు నేర్తును కాఫీ ! ౨౬

నౌకరులు దాసివారలు
రూకలకును అన్నమునకు లొంగరు జగతిన్!
నీ కప్పు [3]రంగు నీళ్లకు
చేకొని మనసిచ్చి సేవచేతురు కాఫీ ! ౨౭

ఈ జగతిన్ హరిదాసుఁడు
మోజుగ అరకప్పు త్రావి మురియుచు పాడున్ !
ఈ జగము [4]మిథ్య యనియెడి
తేజస్వులు త్రాగి త్రాగి త్రేన్పరె కాఫీ ! ౨౮

షుగరన్నది లేకున్నను,
తగమిల్కే దొరకనట్టి తరుణమునందున్
సగమౌ కప్పు 'డికాక్షను'
మొగమోటము లేక త్రావ మోక్షము కాఫీ ! ౨౯

---

1. పెదవి ముద్దు. 2. తాకుటకు వీలులేని పరిస్థితిలో 3. కాఫీనీళ్లకు లొంగుదురనుట.
4. కల్ల యనెడి సన్న్యాసులు.

నీ వాసన పీల్చినచో
ఏ వాసన కోరఁబోప రిదియ నిజంబౌ !
ఈ [1]వాస నెన్ని జన్మల
సావాసము ప్రతిఫలంబొ! చక్కని కాఫీ ! ౩౦

పలుతోమ 'టూతు పౌడరు'
విలువగ ధరపెట్టి కొనక, పిండిన గుండన్
పలుదోమ – బలము పండ్లకు
నిలువున నీరసముపోవు నిజమిది కాఫీ ! ౩౧

నిద్దుర మంచము మీదనె
ముద్దుగ పతి సగము కనులు మూసియె యుండన్
శ్రద్ధగ కాఫీ నిచ్చుట
ముద్దియలకు ముఖ్యవ్రతము మోహన కాఫీ ! ౩౨

నిను త్రాగిన వెంటనె తీ
సిన రాగమె "కాఫి" యనఁగ చెల్లును జగతిన్
నిను మాని [2]సార బ్రాందీల్
ఘనముగ చెడద్రావ పేరుగల్గెనె? కాఫీ ! ౩౩

చావఁగ పండ్లు బిగించిన
తేవద్దిక చల్ల – జావ – తెండయ కాఫీ !
కేవలము పెదవి తడిపిన
బావురుమని నోరు తెరచు భాగ్యము కాఫీ ! ౩౪

దేవతలకు కాఫీతో
నైవేద్యముచేయ దాని నైజగుణముచే
దేవత లమృతము కోరక,
సేవింపఁగ జూతురెపుడు శ్రీముఖ కాఫీ ! ౩౫

---

1.ఎన్ని జన్మలనుండి ముడిపడిన సంబంధమో. 2. సారా, బ్రాందీలు త్రాగి సంగీతము నాలపించినను వానికి పేరు రాలేదు.

[1]పరమేష్ఠి యెన్మిదవ సా
గరమును కాఫీతో చేయగా మొదలిడి, “ఫి
ల్టరు డీకాక్షను” చేయగ
హరుఁడంతట మ్రింగె హాలహలమని కాఫీ ! ౩౬

కేకలలో నందము కా
ఫీ కే కదె ! వినుడు రైలువే స్టేషనులో
టీ కేక “చాచ” యనగా
లోకులు “చీ చీ” యటంద్రు లోలో కాఫీ ! ౩౭

అఱువది కప్పులు పూర్తిగ
సరిగా కాఫీని పోసి, సంతృప్తి గ, చే
సిరి విందు కొందరయ్యలు !
విరివిగ తమ షష్టిపూర్తి వేళల కాఫీ ! ౩౮

నాలుగు మొగముల బ్రహ్మయు
చాలన [2]కుతితీర కాఫి చక్కగ త్రావన్
లీలగ [3]‘బ్రహ్మానందం
బై’ లాలితమయ్యె యోగభావములందున్ ౩౯

పాలొక కప్పుడు కల్గిన
నాలుగు కప్పులను కాఫి నాట్యము సేయున్
నాలుగుమందికి నయ్యెడి
పాలొకడే త్రావవచ్చు పాపము కాఫీ ! ౪౦

పాలను వచ్చు నజీర్ణము
బాలురకును పొట్టయందు బరువది హెచ్చున్
పాలెప్పుడీయబోకుడు
పాలవి యలవాటుచేయ బాధగు కాఫీ ! ౪౧

---

1. బ్రహ్మ. 2. ఉత్సుకత తీర 3. మనమును పరమాత్మయందు లగ్నము చేయుటయందలి ఆనందము.

దేవతల కమృతమును, ఈ
పావన జనులకును కాఫి పద్ధతి యనుచున్
కేవలము వ్రాసియుండగ
త్రావక మానవులు విడువ ధర్మమె కాఫీ ! ౪౨

అన్నముకన్నను నీవే
మిన్నగ [1]పైనుందు ననుట మేలగును సుమా!
అన్నంబు పొట్ట పట్టును !
ధన్నని తలకెక్కు [2]గంగతల్లీ ! కాఫీ ! ౪౩

మన దేశంబుష్ణంబని
మును నెఱుగరొ 'యుష్ణముష్ణమున శీతలమౌ'
నని, చల్ల కల్లుఁ ద్రావిరి
జనులెరుగరు నిన్ను సరససారా ! కాఫీ ! ౪౪

'హొటల్' లెంత గజిబిజైనను,
అట 'సర్వరు' లెంత రోతయై యుండిన, నీ
పటుతర మాహాత్మ్యముచే
మటుమాయంబౌను రోత ! మాతా కాఫీ ! ౪౫

పరమాత్మను మతిఁగూర్పఁగ
పరితాపము నందనేల? ప్రాజ్ఞులు వినుడీ!
పరమాత్మయె కాఫీయని,
నిరతము [3]జీవుని లయించి నిలుపుము కాఫీ ! ౪౬

వచ్చిన చుట్టంబులకై
హెచ్చుగ ధనమున్ వ్యయించి యేర్పాటులు నీ
యిచ్చుమెయి' చేయఁబోవక
హెచ్చుగ చినకప్పులందు ఈయర కాఫీ ! ౪౭

---

1. కడుపులో ఆకలిబాధ–కాఫీలేనిచో శిరోవేదన. 2. గంగాదేవికూడ తలకెక్కినదే! 3. జీవాత్మను పరమాత్మయందు లగ్నము చేయుమనుట.

నిన్నొక యౌషధమునుగా
మన్నించుచు [1]పైతృకముల మానక త్రావన్;
పున్నెంబబ్బును చచ్చిన
గన్నయ్యల కందరకును క్రమముగ కాఫీ ! ౪౮

కాఫీ [2]తిలోదకంబులు
కాఫీ [3]కూర్చోదకములుగా చేయనలెన్ !
కాఫీ తర్పణమిదవలె !
కాఫీ యిడ్డెనులె శ్రాద్ధ ఘనములు–కాఫీ ! ౪౯

[4]వాసోదక పిండోదక
మాసగ గైకొనరు మేల్తిలాంజలి పితరుల్!
వాసిగ నిడ్డెను పిండము
చేసియు [5]తర్పణము నీవు చేయుము కాఫీ ! ౫౦

కాఫీ భక్తులు కావలె !
కాఫీనే మెడ ధరింపఁగావలె నెపుడున్ !
కాఫీ నిను నిలఁబెట్టును !
సాఫీయగు నొళ్లు నిల్లు సర్వము కాఫీ ! ౫౧

మూతికి గ్లాసబ్బినచో
చేతికి చెంబబ్బుననుచు చెప్పగ వలెనా ?
మూతిది [6]చేతికి తెత్తువు !
నా తరమా పొగడ నిన్ను నవనవ కాఫీ! ౫౨

తగ 'నీగె' 'ల్లైవరెస్టు' లు
సొగసుగ రక్షించు నిన్ను చోద్యముగాగన్ !

---

1. తల్లిదండ్రులకు తద్దినము పెట్టునాడు. 2. పితృదేవతలకు నువ్వులతో కలిపి యిచ్చు నీరు 3. దర్భలతో ఎనిమిది అంగుళములు తాళముచెవి యాకారములో చేసినది. 4.గుడ్డనీరు. 5. బొటనవ్రేలుమీదుగా యిచ్చు జలము. 6. మలవిసర్జన చేయించు.

తగు [1]ధర్మము రక్షితమై
జగతిని రక్షించుననుట సత్యము కాఫీ ! ౫౩

నరములు కరకర లాగగ,
కరపదములు నీ రసమున గడగడలాడన్,
అరకప్పు కాఫి నిచ్చిన
సరదాగా పరుగుపెట్టు చటుకున కాఫీ ! ౫౪

తగు సత్త్వరజస్తమములు
త్రిగుణంబులు కలసినట్టి తీరును జూడన్
త్రిగుణంబుల ప్రకృతిలో
తగియుందువు తమమనంగ తల్లీ ! కాఫీ! ౫౫

బియ్యము ప్రధానమునుగా
పెయ్యమ్మలు పేరుకొనిరి పెద్దలమనుచున్
ఇయ్యము గౌరవమెప్పుడు
బియ్యమునకు పెద్దలకును విరివిగ కాఫీ ! ౫౬

సరసములు కాని గురుతుల
విరివిగ ఎన్నికలఁ బెట్టి వేలును లక్షల్
విరజిమ్మ నేల నిన్నే
గురుతుగ పెట్టగ విజయమగున్గా కాఫీ ! ౫౭

మనకాఫీ త్రాగినవా
డనుమానములేక మనసు నర్పణచేయున్
అనుకొందురు కాదే [2]“సం
జిన వాడింజనుగ సేవచేయుట కాఫీ ! ౫౮

---

1. ధర్మమును మనము రక్షించిన అది మనలను రక్షించును. 2. తిన్నవాడు

‘అలవాటు లేదు కాఫీ
వలద’ని యెవ్వండు పలుకు, వాడేనగు మూ
ర్ఖులలోన మొదటివా డా
పలుగాకికి ప్రేమనీరు భామలు ! కాఫీ ! ౫౯

లాలా జలములు కలిసిన
మేలగు ప్రేమలును హెచ్చు ‘మిక్సు’న యనుచున్
లాలా మిశ్రమ జలమున
హేలగ కప్పులను ముంచి యీయరె కాఫీ ! ౬౦

పాంచిమొగపు బాచయ్యలు.
వాచిన పలువరుసవారు [1]“పయొరియ’ వారల్
ఏచిన మేహపు వారలు
పేచీపడి పెదవికఱచి పీల్చరె కాఫీ ! ౬౧

సినిమాహాలున రైలున
ఘనముగ బస్సునను నిన్వికాసము మీఱన్
అనుమానింపక త్రావిన
జనులకగును గౌరవంబు సౌఖ్యము కాఫీ ! ౬౨

చలివేళలందు చెలి కౌ
గిలి కన్నను వెచ్చదనము కేవలమీయన్
చెలియేల నీవు కల్గిన
చలియే నినుంజూచి వణకు జాణా ! కాఫీ ! ౬౩

ఎంత తలనొప్పి నైనను;
వింతగ ‘ఆస్ప్రో’– ‘ఎనాస్న’–‘వేదన’ తోడన్
పంతమున త్రోసివైతువు
సంతసమున పొగడ నిన్ను శక్యమె కాఫీ ! ౬౪

---

1. అదియొక దంతవ్యాధి (“పయోరియా”)

పదనుగ ఆర్వురి యన్నము
పదిమందికి వచ్చు కాఫిపానమహిమచే
ముదముగ కాటకములలో
ఉదరముల కుదించినావె! ఓహో ! కాఫీ ! ౬౫

అరకప్పు 'సిప్పు' చేయుట
సరసత నవనాగరకత ! సంతసమయ్యెన్ !
అరలీటరు కావలెనను
నరులెవ్వరు లేరు ! బ్రతికినామో కాఫీ ! ౬౬

ఏ యెత్తునుండి పడినను,
కాయంబడి చల్లఁబడిన కాలము నందున్
పోయుదు కప్పుడు కాఫీ !!
'హెూ' యని వెనువెంట లేచు 'హుప్ప'ని కాఫీ ! ౬౭

ఈ క్షితిలో నాకర్షణ
లేక్షణమున విడువఁబోవ వెఱుఁగుమురా ! 'కాం
తాక్షను' - 'కనకాక్షను' - 'డీ
కాక్షను' లీమూడు ముఖ్యక్రమముర కాఫీ ! ౬౮

'షుగరు' ను, కాఫీ పొడియును,
తగ పాలను జేర్చి నిన్ను త్రావిన ప్రాణుల్
[1]'షుగరు' మయులగుచు నుందురు
'షుగ'రెన్నడు విడువడెంత చోద్యమొ కాఫీ! ౬౯

ఎప్పటి కప్పుడు నీరస
మొప్పక, కాఫీని కప్పుచుండుటచేతన్
[2]"కప్పుడు కాఫీ" ననియెడి
మెప్పగు [3]'స్లోగను' లభించె మేలగు కాఫీ ! ౭౦

---

1. మధుమేహము. 2. కాఫీతో నీరసమును కప్పివేయుదు. 3. నినాదము.

ఇతరుల సొత్తును ముట్టని
మతిమంతుని కాఫికొఱకు మాటకు పిల్వన్,
[1]"కుతి" తో వెంబడి వచ్చును
సతతము నొక పెంపుకుక్క చాయనె కాఫీ ! ౭౧

తిక్కెత్తి [2]గుక్కపెట్టిన
చక్కని పసివాడు నిన్ను సందర్శింపన్
గుక్కను మాని హసించును
చక్కని ఆనందరూప ! సరసమ! కాఫీ ! ౭౨

లోకమున రంగులన్నిట
వాకొందురు 'కాఫికలరు' వన్నియ గొప్పన్
లోకులు మెచ్చెడి రంగువు
నీకెవ్వరు సాటిలేరు నిర్మల కాఫీ ! ౭౩

మాటవినని భర్తలకును
పూటకు ముమ్మారుగాగ పోయుఁడు కాఫీ
మాటను దాటక [3]బోటికి
నోటిపయినె నడువగలరు నూతన కాఫీ ! ౭౪

ఉదయమున కాఫి త్రావక
మదమున చరియించువారి మనసు హరింపన్
పదనుగ [4]తల పట్టెదనని,
ముదమున శపథంబుచేసె [5]ముద్దుల' కాఫీ ! ౭౫

నీలము విష్ణుని రూపము
నీలము మేఘముల రూపు – నిను కొనియాడన్
చాలను ప్రారంభించితి !
నీలగిరుల వెలసినట్టి నియమపు కాఫీ ! ౭౬

---

1. వ్యసనము. 2. నిర్విరామముగా ఏడ్పు. 3. స్త్రీ. 4. తలనొప్పి వచ్చునట్లు చేయు.
5. కాఫీని ముద్దుల పద్ధతిలోనే త్రాగుట

భావం బెఱుఁగరొ, పురుషుల
చే విడువంబడుచునుంఁడ్రు చీ చీ ! పనితల్ !
నీవు గ్రహించిన వారలు
సావాసము విడువబోరు ! జాణవె! కాఫీ ! ౭౭

నినుత్రావి చేయు పనులవి
అనుమానములేక పూర్తినందును కానన్
నిను [1]గణపతియని కొలుతును !
అనయము చుఱుకీయ వలయు నమ్మా ! కాఫీ ! ౭౮

నిను త్రావి చేయు 'డ్రైవిం
గ'నుమానము లేక సాగు నద్భుతగతిలో
కనినంతనె కాఫ్యాలయ
మనుమానము లేక బస్సు లాగును కాఫీ ! ౭౯

'బ్రూకు'ను మెచ్చును లోకము
'బ్రూకే' మరికొందరకును రూపము నిచ్చున్!
నీ కల్యాణపు పేరులు
వా కలవడ వేకరూప ! నా ప్రియ కాఫీ ! ౮౦

నీరసము హెచ్చినపుడు బ
జారున నాన్ రొట్టె తెచ్చి, చక్కని కాఫీ
సారమున ముంచి తినినన్
నీరసమది యెగిరిపోవు నిలువున కాఫీ ! ౮౧

అరకప్పు కాఫి త్రాగియు,
పరవశమున పక్కపొడిని వైచియు నోటన్,
[2]బరకలి ముట్టించిన యా
వరసౌఖ్యము [3]త్రిగుణమగుచు వచ్చును కాఫీ ! ౮౨

---

1.మొదటగా కొలుచు దేవత. 2.బర్క్లీ–అను సిగరెట్టు. 3.కాఫీ–వక్క–సిగరెట్టు అను మూడు.

పానకముకొఱకు దేవుడు
మానక తా దేవులాడు మంగళగిరిలో
మానవు లింటింటను నీ
పానమునకు దేవులాడువారలె కాఫీ ! ౮౩

నాతులు కాఫీ నిచ్చుచు
ప్రీతిగ కనులారచూచు వేళలయందున్
చేతివ్రేళ్ళు తగిలినచో
నా తరమా ప్రేమఁ దెల్ప నాప్రియ కాఫీ ! ౮౪

అలవాటు రెండుమార్లన,
అలవాటది నాకు నాలుగని వెనువెంటన్
పలుకుదురు సేవలోఁగల
అలవాటుల సంఖ్య గొప్పయౌనే కాఫీ ! ౮౫

'నెరవెస్సు' – 'వీకునెస్సు' – 'షు
గరు' – వచ్చును, విషమె యగును కాఫిని త్రావన్
కఱవగు నారోగ్యంబను
వరమతులిక కల్గబోరు! వైదిక కాఫీ ! ౮౬

మన తాత లెన్నడును త్రా
వని కాఫీ యేల మనకు? వద్దని యన్నన్;
మన తాత కట్టుబొట్టులు
మనకున్నవె? మారలేదె? మాతా! కాఫీ ! ౮౭

కూరలలో వలపంతయు
[1]కూరి వండువారు నాదు! కోమలు లిపుడో;
సారమయిన నీ లోపల
[2]నీరజలోచనలు వలపు నింపరె కాఫీ ! ౮౮

---

1. గుత్తి వంకాయకూరలో వలపుకూరిన మరదలు. 2. స్త్రీలు.

చుట్టములు వచ్చినంతనె
అట్టనె కాఫీలు తెచ్చి అందీయంగా,
పట్టదె గౌరవ భాగ్యము
కట్టా ! నిను పొగడఁగలనె గౌరవ కాఫీ ! ౮౯

నీ యాలయమును కనుఁగొని,
నీ [1]యారాధనము మాను నిర్భాగ్యునకున్
సాయంబు కాదు దేవుడు
నీయది యద్భుతపుశక్తి నిశ్చల కాఫీ ! ౯౦

మనసు పనిచేయనప్పుడు
నిను పెదవి లగించి జుఱ్ఱ నిశ్చలమతియౌ !
కనఁగల్గు ముందు మార్గము
అనవరతము శాంతినిత్తు వాహా ! కాఫీ ! ౯౧

అట్టన లేచిన వెంటనె
పొట్టకు కాఫీని పోయ పున్నెంబెన్నన్
పుట్టను పాల్పోసిన యా
పుట్టెడు పున్నెంబు పట్టు బోరున కాఫీ ! ౯౨

పొలముపని చేయువారికి
చలిదన్నము మాట పోయె – చంకను "ఫ్లాస్కో"
అలవడియె నేమి చెప్పుదు?
కలియుగమున వచ్చు మార్పు కాదా? కాఫీ ! ౯౩

చలిదేశవాసులకునై
వెలసితివట తల్లి! నీవు – ప్రియముగ నేడీ
చలిలేని మమ్ము పట్టితి
విలువేలుపువైతి ! విడువవే! మము తల్లీ ! ౯౪

1.సన్యాసిగా మరణించినవానికి పెట్టు తద్దినము.

శ్రమ మరతురు నినుఁ ద్రావుచు
క్రమమున నలవాటుపడిన కష్టము విడువన్ !
శ్రమికుల పాలిటి దేవత!
మము విడువవు పట్టుకొన్న – మాతా ! కాఫీ ! ౯౫

ఎటనుండి వచ్చె కప్పున
పటుతరమగు శక్తి స్వల్ప పరిమాణములో
నిటు త్రావిన నటు చురుకగు
పుటుకున నీరసము తెగును పొందర కాఫీ ! ౯౬

[1]తెల్లమొగము వారలతో
మెల్లగ మా దేశమెపుడొ మెట్టితివయ్యో !
తెల్లదొరలు దయచేసిరి
తల్లీ! చలిదేశమేగ ధర్మము కాఫీ ! ౯౭

'హొటలు' నీ రూపంబగు !
సాటిగ నటనుండు వస్తు సముదాయంబుల్
[2]బోటుల శుభాంగములతో
నీటుగ పోల్చుటయె నేటి నిపుణత కాఫీ ! ౯౮

ఆమెను 'ఇడ్లీముఖి' యని
నేమంబున పిలువు 'బజ్జినేత్రీ" ! యనుచున్!
నీ మమకారము పెరుగును
ఆమెను 'కాఫ్యాధర' నుచు అనగా కాఫీ ! ౯౯

మాడిన పెసరట్టులతో
మాడిన మొగములను పోల్చుమా నీవెపుడున్ !
వేడిని వీడిన కాఫీ
తో డెవ్వరు లేనివానితో సరి కాఫీ ! ౧౦౦

1. ఆంగ్లేయులు. 2. స్త్రీలు

**కాఫీ త్రాగక, ముందుగ**
**కాఫీ శతకంబు చదువ కలుగు శుభంబుల్ !**
**సాఫీయగు సర్వంబును**
**కాఫీ ఫలితంబు తెలిసి కనుడీ శుభముల్ !** ౧౦౧

**అసతో మా సద్గమయ !**



"ఈశ్వరుడు భక్తులయందు మిక్కిలి ప్రేమకలవాడు; తిన్నడు పెట్టిన ఎంగిలి మాంసం కూడా తిన్నాడు" – అంటే కవిత్వం కాదు. కవిత్వంలో రమణీయార్థం, చమత్కారం ఉండాలి. ధూర్జటి మహాకవి ఏమంటున్నాడో చూడండి:–

**శా॥ నీకున్ మాంసము వాంఛయేని కఱవా? నీచేత లేకుండగా,**
**జోకైనట్టి కుఠారముండ, అనలజ్యోతుండ, నీరుండగా,**
**పాకంబొప్ప ఘటించి, చేతి పునుకన్ భక్షింప, కా బోయచే**
**చేకొంటెంగిలి మాంస, మిట్లు తగునా? శ్రీకాళహస్తీశ్వరా!**

తా॥ ఓ ఈశ్వరా! నీకు మాంసం తినాలని అంతగా కోరిక వుంటే నీకేమి లోటు వచ్చిందయ్యా? ఒక చేతిలో జింక ఉంది; మరొక చేతిలో పదునైన గొడ్డలి ఉంది; నుదుటి మీద నిప్పు ఉంది; నెత్తిమీద నీళ్ళున్నాయి. గొడ్డలితో జింకను చంపివేసి, రుచిగా వండుకొని, చేతిలో ఉన్న కపాలంలో పెట్టుకొని హాయిగా తినవచ్చును కదా! ఆ బోయవాడు పెట్టిన ఎంగిలి మాంసం తీసుకున్నావు. ఈ పని ఏమైనా బాగుందా? చెప్పు?

# 3. కవితాఖండికలు

## (చైతన్యకవిత సంచికలనుండి)

### 3.1 కఱివేఁపాకు:–

ఏ జన్మాంతర వాసనా బలమొ, నాకేనాఁటి సంబంధమో
పూజాపత్ర పవిత్ర భాగ్యమిడి ఆమోదించె శాకాళి, నా
సౌజన్యంబును త్రుంచి, వాసనల ఆశల్ తీర్చి, స్నేహంబుతో
మోజుల్ తీర్పఁగ వేఁగి, షడ్రుచుల కైపుల్ చూపి మెప్పించనే? 1

పూవులు కాయలున్నయెడ భూజములన్నియు భూజనాళి సం
భావన పొందఁ గల్గుట స్వభావము, నాదగు జీవితంబులో
చేవను బొందె ఆకులు, వకీకృత సర్వజనాళి నాసికా
భావ విహార సంకలన భవ్యములైనవి నవ్యరీతులన్. 2

కుతకుతలాడు వేళ–తమకోసమె వాసననిచ్చు వేళ– స్నే
హితమునుగోరి మీకొఱకు నే తపియించుచునున్న వేళ – నా
జతకయి ప్రాకులాడితిరి శాకములార! మహాభిమానులౌ
మతిమతులార! మైత్రియను మాటకు నర్థము మీరలే సుమా! 3

అనసూయాసతి ఇన్పగుగ్గిళులు సౌహార్దంబుతో వండి అ
మ్మునికిం బెట్టెడి వేళ నన్ను కరివేముం జేర్ప–తాలింపు గు
ప్పని యీరేడు జగాలు వ్యాప్తిఁగనె, ఆస్వాద్యాద్భుతానంద జీ
వన వాసంత శుభోదయంబులవి నా భాగ్యోదయారంభముల్. 4

ఒక శాకంబననేల అన్నియును ఓహో యంచు మన్నించు, ఉ
త్సుకతా భావముతోడ పొంగునవి సంతోషంబుతో వారు రూ
పక నానావిధ పద్రసంబులు! మహాభాగ్యంబుగా నన్ను–ఎ
న్నికతోఁ జూచెను, పూర్వపుణ్యములు పండె న్నబ్బె సౌభాగ్యముల్. 5

మనుజుని వాడుకొంట, అనుమానము లేక త్యజించుచుండుటే
ఘనతర లౌక్యజీవితముగా తలపోసిన మానవుండు స

**జ్ఞనుల కృతజ్ఞతా సహిత సాదర సుస్థిర స్నేహపుష్ప వా**
**సనల నెఱుంగునా? జలజసౌరభ మెంచుట కప్ప నేర్చునా? 6**

**నా రసముల్ సువాసనలు నల్వురికై యిటులందఁజేసి, ని**
**స్సార విశోషితాత్మనయి శాకములో పడియున్నవేళ – నే**
**భారమునైతినా? పరుల పంటికి కంటికి చేదునైతినా?**
**ఏరుట పారవేయు టిదియే కళయౌనొ కృతఘ్నతానిధీ! 7**

**దూసిన బాధలేదు, కనుదోయి వెలుంగున దోస మెన్నఁగా**
**వీసము క్రుంగలేదు, తనువే కడు వేఁడిని వేఁగువేళ నే**
**గాసి పడంగలేదు, రుచికైనను చారున వేసి గాఁచ; ఆ**
**యాసము చెందలేదు, ఇది హత్యయె, ఏరుట పారవేయుటల్. 8**

**పాఁడి కాలము చెల్లిన పాడియావు**
**పాల కావడి మోసిన బరువుఱాయి**
**జ్వరము పోయిన వెన్క భిషగ్వరుండు**
**పరగ నిల్చిరి నాదైన వరుసయందు! 9**

(చైతన్యకవిత–1, అక్షయ వసంతం, Spring 1986.)

మా అన్నయ్య రచించిన ఈ "కఱివేఁపాకు" కవితను నేను 'చైతన్యకవిత' మొట్టమొదటి సంచికలో ప్రచురించినప్పుడు ప్రొ॥ చేకూరి రామారావుగారు ఆ సంచికను విమర్శిస్తూ "ఇందులో చైతన్యమూ లేదు; కవిత్వమూ లేదు. కఱివేఁపాకు మీద కూడా పద్యాలు వ్రాయడమేనా?" అంటూ ఒక పత్రికలో వ్రాశారు. వారు గొప్ప భాషాశాస్త్రవేత్త అయి ఉండి కూడా "కఱివేఁపాకు" అనే పదంలోని ధ్వనిని గుర్తింపక పోవడం విచారకరం. కూరలో పరిమళంకోసం కఱివేఁపాకును వేసుకుంటాం. కాని తినేటప్పుడు దానిని ఏరిపారవేస్తాం. మనుషుల్ని అవసరానికి ఉపయోగించుకొని, తరువాత వారిని లెక్కచేయక పోవడం, విడిచిపెట్టడం మన సంఘంలో ఉంది. ఆ విషయాన్ని ధ్వనిస్తోంది ఈ కవిత.

## 3.2 అన్వేషణము:–

**"శాంతి" ఎటేగెనో యెఱుక చాలదు మానవ దుష్టవృత్తి మా**
**న్వింత మటంచు నెంచి బలిపీఠము నెక్కెనొ; కాక, శుష్క వే**

దాంతుల రాజకీయములు హత్య యొనర్చెనొ, లేక, ఇంత ఏ
కాంతమునందు చూచినను, అయ్యయొ శాంతి లభింప దక్కటా! **1**

కామ విమోహితాత్ములయి గాథలు సృష్టియొనర్చువారి హిం
సామయ జీవితోద్ధత విషాద విజృంభణ చూడలేక మా
సీమలు దాటి పోయితివొ? శ్రీకరమౌ భవదీయ కాంతి బా
ధామయ జీవితంబులకు దారిని తెల్పెడి పాలపుంతయౌ. **2**

ఓంకారంబున యోగమార్గమున దాగున్నావొ? ఈ క్రోధ ని
శ్శంకోన్మత్త పిశాచ నృత్యముల మూర్ఛన్ మున్గియున్నావొ? మా
కింకన్నీ పదపద్మదర్శనము లేనే లేద మా తల్లి! నీ
అంకంబందు పరుండు భాగ్యములు లేవా? శాంతి మాతా! యికన్. **3**

లోభ దరిద్ర దేవతకు లోఁబడి జాతర చేయనెంచి; సం
క్షోభము సృష్టిచేయఁగల చోరుల, దారుల దోపిడీల కెం
తో భయమెత్తి పోయితివి దూరము, నీ పయనించు దారులన్
లోభ శిలావరోధము–ప్రబోధము–మోహము తాండవింపఁగా. **4**

మదమాత్సర్యములేలు రాజ్యమున అమ్మా శాంతి! కన్పింపవా?
కథలై పోయెనె, శాంతికేతనము లాకాశంబులో నాడ మా
యెదపై మల్లెలు విచ్చురోజులవి, మేమీ చీకటిన్ జ్యోతికై
పది దిక్కుల్ కనుచుంటిమమ్మ! ఇక లేవా? శాంతి! కన్పింపవా? **5**

(–చైతన్యకవిత – అక్షయశరత్తు, Autumn 1986)

**3.3** ఆశీస్సు:–

'సరసుడు' – 'సహృదయుడు' – 'సాహిత్య రసికుడు' – 'సౌజన్య ధన్యుడు' – 'మధుర స్నిగ్ధ హృదయుడు' – 'మహోన్నత నాగరకుడు' – శ్రీ బుల్లా రాఘవయ్యగారి కుమారుడు–శ్రీ బుల్లా సుబ్బారావుగారికి ఆశీస్సు!

కళలో – కావ్య జగత్తులో – కదలు సంస్కారంబులో – 'నీడ'గా
వెలయున్ 'రుక్మిణి' లక్ష్మి రూపమున! దివ్వెల్ బిడ్డలై వెల్గు కాం

తులలో మీరు శతాయు రభ్యుదయ సంతోషాల వర్ధిల్లుడీ!
లలితంబైనది నీ మనోంబుజము 'బుల్లా సుబ్బరాయాగ్రణీ !!
("నీడ"= బుల్లా సుబ్బారావుగారి ఇంటికి పెట్టిన పేరు; "రుక్మిణి" = వారి ధర్మపత్ని)
అల్లా, యెహెూవ, రాములు,
ఎల్ల శుభంబుల నొసంగి ఎప్పుడు బ్రోవన్,
'బుల్లా సుబ్బారాయా!'
చల్లగ వర్ధిల్లు మయ్య! సరసవిధేయా !!

(-చైతన్య కవిత-15-16, శ్రీముఖ వసంతం-శరత్తు, Spring-Autunm 1993)

## 3.4 "దానచింతామణి" శ్రీ దళవాయి కృష్ణస్వామి ఆదికేశవులుగారు

ఎవ్వాడు 'రుక్మిణీ - కృష్ణమ నాయక'
పున్నెంపు పంటయౌ ముద్దుబిడ్డ!
ఎవ్వాడు 'సత్యప్రభే' శ్వరి మానస
సరసిలో విహరించు జాతిహంస!
ఎవ్వాడు 'కల్ప' 'తేజేశ్వరి' 'శ్రీనివాస్'
ఘనులను గన్న బంగారు తండ్రి!
ఎవ్వాడు శ్రీవేంకటేశ్వరస్వామికి
అంకితమైన భక్తాగ్రగణ్యు
డతడు శృంగేరి కంచి పీఠాధిపులకు
సాయిబాబాకు భక్తుడు! సన్నిహితుడు!
కీర్తికెక్కిన 'దళవాయి కృష్ణసామి
ఆదికేశవు' లాతడు త్యాగమూర్తి !!

(-చైతన్య కవిత - 23, ధాత వసంతం, April 1986)

## 3.5 ఇంకిపోయిన 'చెఱువు':-

ప్రియమారన్ శుభధాతృవత్సరము కార్తీకంబు మూడింట అ
వ్యయలోకాన శతావధానమునకై ఆహ్వానమే వచ్చెనో?

**రయమొప్పం జన చెర్వుశాస్త్రి! ఘన గీర్వాణాంధ్ర పాండిత్య ప్ర**
**జ్ఞయె దేవేంద్రుని కన్నుకుట్టినది! అన్నా! కీర్తియుం బాపమా?**

**ఇది సత్యంబటె? లేక స్వప్నమున నాకీ వార్త విన్పించెనో?**
**పదికాలాలకు ఘోరవార్తయిది – స్వప్నంబైన బాగుండునే!**
**చెదరెన్ నామది! చెర్వు ఇంకెనటె? శాస్త్రిన్ మ్రింగితే దైవమా!**
**కథలై పోయనె సంస్కృతాంధ్ర కవితా గాంభీర్య ప్రాగల్భ్యముల్.**

**ఉభయ కవిత్వదక్షుని మరొక్కని మాకిట చూపి పోయినన్**
**అభయము మాకు కల్గెడిని! అయ్యయొ! దేశము కంచు కాగడా**
**శుభమయ కాంతులన్ వెదకిచూచిన నీ ఘనప్రజ్ఞ కల్గువా**
**డుభయ కవిత్వదక్షుడు మరొక్క వధాని లభింపదయ్యయో!**

**ఇల్లాలంచును ఊహలో నిలిపి, ఎన్నేన్పద్యముల్ చెప్పి, నీ**
**ఉల్లబంతయు ఊడ్చిపెట్టితివి! అయ్యో! ఆమె లేకున్నచో**
**ఒల్లన్ జీవితమంచు పల్కితివి ఓహో! సత్యనారాయణా!**
**చల్లా వెంకట సుబ్బలక్ష్మి జతగా స్వర్గంబులో నుంటివా?**

**పూవులను కోయువారలు పూలలోన**
**మంచి పూవులు కోయగా ఎంచుకొంద్రు**
**అట్లె దైవమా! నీవు మహావధాని**
**నెంచుకొంటివి, తప్పు నీదేమి లేదు!**

**నను సద్వక్తగ మెచ్చుకొందువు మహానందంబుతో – నేను పో**
**యిన నావెన్కగ అశ్రుతర్పణముగా నెన్నెన్నొ పద్యాలతో**
**నను భావించెదవంచు నెంచితిని! చిన్నా! తారుమారయ్యె! త**
**ర్పణగా పద్యము లల్లుచుండుటిది నా పాపంబుగా నెంచెదన్!**

(14–11–1996 నాడు తణుకులో హఠాత్తుగా గుండెజబ్బుతో
మరణించిన సంస్కృతాంధ్ర విద్వత్కవి, శతావధాని
డా॥ చెఱువు సత్యనారాయణశాస్త్రిగారిని
స్మరిస్తూ వ్రాసిన పద్యాలు)

(చైతన్యకవిత–25, ఈశ్వర వసంతం–శరత్తు April–September 1997)

## 3.6 శ్రీ కోట పున్నయ్యగారు:–

అంకితం

సరసులు

సహృదయులు

సాహిత్య ప్రియులు

ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధులు

భారత జాతీయ కాంగ్రెసు నేతలు

'కవిసమ్రాట్' విశ్వనాథ సత్యనారాయణగారి ప్రియశిష్యులు

పార్లమెంటు మాజీసభ్యులు

అయిన

శ్రీ కోట పున్నయ్యగారికి

నమస్సుమాంజలితో

**"చరఖా సన్ముని దీక్షలో వెలమ సంస్కారంబు జీర్ణింపఁగా**
**చెఱసాలంబడి దేశసేవకు మహా శ్రీకారముం జుట్టి – 'మెం**
**బరు'వై భారతభూమి నేలితివి! నీ ప్రజ్ఞావిశేషాలు సు**
**స్థిరమై దేశచరిత్ర కెక్కెను భళా! శ్రీ కోట పున్నాహ్వయా!"**

(–చైతన్య కవిత–25, ఈశ్వర వసంతం–శరత్తు, April–September 1997)

## 3.7 నన్నయ భట్టారక పీఠము:–

తణుకు – 534 211, పశ్చిమగోదావరి జిల్లా ('యుగకవి',–'నవకవితా పితామహ!' డా॥ గుంటూరు శేషేంద్రశర్మగారికి నన్నయ భట్టారక పీఠమువారు "డా॥ జియస్వీ ప్రసాద్ సాహిత్య పురస్కారము" నందించు ఉగాది శుభవేళ శ్రీ **టి.వి.కె. సోమయాజులుగారు** చేసిన కవితాభినందనమ్)

**శ్రీమదాంధ్ర కవీశ్వర శ్రేణియందు**
**నీవు ధ్రువతార వౌచు కన్పించినావు!**
**ఆదికవి పల్కె నేడు శుభాశిషములు**
**అందుకొను మివె పీఠాభినందనములు.** 1

పండెను పీఠభాగ్యములు! వాణి విపంచిని మీటి పాడె, మా
పండితవర్యులెల్ల రిదె వచ్చిరి! స్వాగత మాధురీ సుధల్
మెండుగ నీపయిన్ గురిసె! మేరు సమాన కవీంద్ర చంద్ర! ఈ
పండుగ వేళ మాకు కనుపండువు నీదగు రాక సత్కవీ! 2

పాండిత్యకవి తాను భావంబు లోపల
శ్రీనాథకవివి శేషేంద్ర నీవు!
శృంగార కవితా విశృంఖల వీథిలో
అల్లసాని కవీంద్రుడగుదు వీవు !
సరస కవిత్వ వాగ్విరచన స్ఫూర్తిలో
అల జగన్నాథరాయలవు నీవు!
జీవితసత్య సంభావనా సరళిలో
ఆ ఉమ్రఖయ్యాము వగుదు వీవు!
వాడి-వేడిమి గల కవివర్యులందు
నీవు మొనగాడవయ్య శేషేంద్రశర్మ!
ప్రాచ్య పాశ్చాత్య కవులలో ప్రతిభ లేర్చి
మూసగా కట్టి బ్రహ్మ నిన్ పోసినాడు! 3

వచన కవిత్వ పద్ధతుల బాటలు మార్చి కవిత్వ రీతులున్
రుచులును - వ్యంగ్య వైభవము - లోతులు చూచి రసాత్మవాక్యముల్
పచన మొనర్చి చెప్పితి! ప్రపంచము నిన్ గని విస్తుపోయి-చూ
చుచు నిలబడ్డదయ్య! కవిశూరుడ! నీ కవిసేన ధాటిలో! 4

జనముల్ మెచ్చిన సత్కవీశ్వర పురస్కారంబు "జీయస్వి" స
ద్గుణుడై ఏర్పరచెన్ - మరిప్పుడది "శ్రీ గుంటూరు శేషేంద్ర" చం
ద్రునకున్ దక్కెను నూలుపోగనగ - ఎంతోకాంతి నన్నయ్య మూ
ర్తిని పొంగారెను నేడు! విక్రమ ఉగాదిన్ తణ్కు భాగ్యంబుగా! 5

ఈ సహస్రాబ్ది కాంధ్ర కవీంద్రుడైన
నన్నపార్యుందు "భారత నాంది" పల్కె!

ఈ సహస్రాబ్ది తుదిని శేషేంద్రవర్య!
"ఆధునిక మహాభరత వాక్యంబు" నీది! 6

రమ్య సుకవితా రాజ్య సమ్రాట్టు వగుచు
ఆయురారోగ్యములతో సహస్ర చంద్ర
దర్శనోత్సవ మందుమా! ధన్యసుకవి!
ప్రీతి శతవసంతములు వర్ధిల్లుమయ్య! 7

ఇట్లు

విక్రమ ఉగాది మిమ్మభినందించు

5-4-2000 నన్నయ భట్టారక పీఠము, తణుకు

(-చైతన్య కవిత-31,32, విక్రమ వసంతం-శరత్తు, April-October 2000)

## 3.8 ఆశీః:-

తే॥ శ్రీల విలసిల్లు శ్రీ "రంగరెడ్డి" పుత్ర!
పూజ్య "కామేశ్వరీ" దేవి ముద్దుబిడ్డ!
"జక్క" కుల చంద్ర! "శ్రీనివాసా!" వదాన్య!
సాధ్వి "సౌదామనీ" ప్రియ! సరసహృదయ!"
అందుమివె షష్టిపూర్త్యభినందనములు! 1

కం॥ జననంబందిన మాసము
అనువుగ నేటేటవచ్చుటది యబ్బురమే?
జననంబందిన వత్సర
మును కనుభాగ్యంబు షష్టిపూర్తినె కల్గున్! 2

మ॥ కనురెప్పల్ తెరువంగలేని పసిరాకాచంద్రు-నిన్ కాన్క తె
చ్చిన ఆ "తారణ" నేదు వచ్చినది ఆశీర్వాదమందించు భా
వనతో శ్రీయుతరెడ్డివర్య! మది సంభావించి, ఆహ్వానమున్
ఘనతూర్యంబులనిమ్ము! ఆశిషము లానందంబుతో పొందుమా! 3

మ॥ కవులున్ పండితు లాప్తవర్గమును ముఖ్యంబైన బంధాళి సం
స్తవనీయంబగు నీదు గౌరవము విస్తారంబుగా మెచ్చి - ని

నవలోకించి శుభాభినందనము నీకందీయగా – షష్టి పూ
ర్తి వసంతోత్సవమబ్బె నీకు ఘనకీర్తీ ! శ్రీనివాసాభిదా! 4

సీ॥ కవితాప్రియుండైన ఘనుడెవ్వడనిన మా
శ్రీనివాసులురెడ్డిఁ జెప్పువారు
దాతృత్వమున యందు దక్షుడెవ్వండన –
శ్రీనివాసులుపేరుఁ జెప్పువారు
పద్యనాటకప్రీతివా డెవ్వడనినచో
శ్రీనివాసులురెడ్డిఁ జెప్పువారు
టెన్నీసుక్రీడ పోటీచేయు నెవరన్న–
శ్రీనివాసులురెడ్డిఁ జెప్పువారు

తే॥ కలుగు సభలందు నిను గూర్చి పలుకనేల?
సమయమిదిగాన కొంత ప్రశంస వలసె!
ఆయురారోగ్యములతో "సహస్ర చంద్ర
దర్శన మహోత్సవము" చూడదలతుమయ్యా! 5

ఇట్లు
మిమ్మభినందించు
తంగిరాల వేంకట కృష్ణ సోమయాజులు

(–చైతన్యకవిత–41,42, పార్థివ వసంతం–శరత్తు, April-October 2005)

## 3.9 అభినందన పద్యపుష్పాలు:–

'అభినవ కృష్ణరాయ" డా॥ జి.యస్.వి. ప్రసాద్‌గారికి నన్నయ భట్టారక పీఠము – తణుకువారు అందించు అభినందన పద్యపుష్పాలు

అభినవ కృష్ణరాయా! ప్రసాదవర్యా!

సీ॥ రాజరాజ నరేంద్ర రాజేంద్రు డానాడు
శ్రీ నన్నపార్యు పోషించినాడు!
మనుమసిద్ధి నృపాల జనవరేణ్యుడు నాడు
శ్రీ తిక్కయజ్వ పోషించినాడు!

ప్రోలయ వేముడన్ భూపాలు డానాడు.
ఎఱ్ఱప్రెగ్గడను పోషించినాడు!
రెడ్డిరాజులు భాగ్యశ్రీలెన్నొ అందించి,
శ్రీనాథకవిని పోషించినారు.

తే॥గీ॥ ఇవియు అన్నియు విన్నార మింతవఱకు!
"ఆదికవి సుప్రతిష్ఠ" – "ముఖ్యమగు నిధియు"
నీవు సమకూర్ప కంటిమి నేడు మేము!
సరస గుణధుర్య! యస్వీ ప్రసాదవర్య!

శా॥ పీఠం బెక్కిననాడె పల్కితివి ఆవేశంబుతో "లక్ష ఈ
పీఠద్రవ్యము కూర్చువాడ"నని – నీ ప్రేమాభిమానాలు హృ
త్ప్రీతాభ్యర్చిత పారిజాతములు! నీవే తప్ప ఇంకెవ్వ రీ
పీఠంబున్ శిరసావహించుకొని వేవేల్ రూకలందించిరే?

ఉ॥ ఎందరొ "సాహితీప్రియులు" – ఎందరొ సత్కవితాభిమాను లా
నందముతోడ పీఠమును నవ్యపథంబుల నేలినారు! కా
మందులెయైన మూలనిధి మాటయె వారికి పట్టదయ్యె! ఈ
అందము నీకు దక్కె! రసికాగ్రణి! యస్వి ప్రసాద సత్ప్రభూ!

సాహిత్యాభిమానులారా!

మ॥ జనముల్ మెచ్చిన సత్కవీశ్వర పురస్కారంబు, జీయస్వి, నూ
తన సంవత్సర వార్షికంబుగ–మహోత్సాహంబుతో ఐదువేల్
ధనమందించును! కృష్ణరాయలె ప్రసాదై పుట్టెనో, కానిచో,
తనవౌ రాయల పాత్రపోషణలు సత్కారంబు లిల్లుండునే?

డా॥ ప్రసాదవర్యా!

చం॥ "అభినవ కృష్ణరాయ" బిరుదాంకము నిన్వరియించె! ఎన్నియో
శుభములు కల్గునట్లుగ యశోధన! శారద వీణమీటె! నీ
వభయము, ఆయురభ్యుదయ మందగ సభ్యులు పల్కినారు! వా
గ్విభవము మీర నన్నయ కవీంద్రుడె నీకిడె నాశిషంబులన్,

**నిలువన్ నీడకు - పల్క శక్తికిని - వానిన్ వీని నర్థించు దు**
**ర్బలమౌ నన్నయపీఠసంస్థదగు దౌర్భాగ్యంబు పోగొట్టి, అం**
**దల మెక్కించితివో ప్రసాదు! సుకవిత్వం బెంతకాలంబు భూ**
**స్థలిపై నుండునొ - అంతకాలము యశస్థాయిన్ ప్రవర్థిల్లుమా!**

25-3-2001 నన్నయ భట్టారక పీఠము
వృష ఉగాది -తణుకు పురపాల సంఘాధ్యక్షురాలు
తణుకు శ్రీమతి ముళ్లపూడి రేణుకగారు.

(-చైతన్యకవిత-41,42, పార్థివ వసంతం-శరత్తు, April-October 2005)

## 3.10 పద్యపుష్పగుచ్ఛము:-

శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు

"గానకోకిల" - నటసమ్రాట్ -స్నేహశీలి - జీవిత సత్యజ్ఞాని - వేంకటేశ్వర, ఆంజనేయ, షిర్డీసాయి భక్తుడు-నిగర్వి - నిరంతరం కళోపాసకుడు-మంచికి ప్రాణమిచ్చే మనీషి-శ్రీ దర్శి లక్ష్మీవేంకటేశ్వర వరప్రసాదరావు పంతులుగారు షష్టి వసంతములు పూర్తి చేసికొన్న శుభవేళ అందించు

పద్యపుష్పగుచ్ఛము

- టి.వి.కె. సోమయాజులు

**తే॥ 'దరిసి' వంశ విమల పయోధి చంద్ర!**
**'పార్వతీ - సుబ్బరాయ'ల భవ్యపుత్ర!**
**'గానకోకిల' నటనావిధానధుర్య!**
**సరస 'వేంకటేశ వరప్రసాదరాయ'**
**అందు మివె షష్టిపూర్త్యభినందనములు!!** 1

**క॥ నినుఁ గన్న 'సర్వజిత్తు'ను**
**గను భాగ్యము, ఆశిషములు, కంటివి మిత్రా!**
**ఘనతర 'చంద్ర సహస్రం**
**బును గను భాగ్యంబు' కూడ పొందుము సుఖివై!!** 2

మ॥ 'శతమానం భవతం' చు ఆశిషము విస్తారంబుగా విప్రసం
తతి యందించెను షష్టిపూర్తి శుభసందర్భంబునన్ నీకు! ఇ
చ్చితి పద్యంబుల పుష్పగుచ్ఛమిది! 'లక్ష్మీ వేంకటేశా'ఖ్య! ఉ
న్నత భాగ్యంబుల శాంతి సౌఖ్య విభవానందాల వర్ధిల్లుమా! **3**

మ॥ కవులున్ పండితులున్ నటాగ్రణులు ముఖ్యంబైన మిత్రాళి సం
స్తవనీయంబగు నీ చరిత్రమును విస్తారంబుగా మెచ్చి - ని
న్నవలోకించి శుభాభినందనలు నీ కందీయగా షష్టిపూ
ర్తి వసంతోత్సవ మబ్బె! 'గాననటమూర్తీ'! శ్రీప్రసాదాభిదా! **4**

ఆ.వె. ఘనులు 'చిలకమర్తి' - 'కందుకూర్ల'కు వచ్చె
'పంతుల'న్న బిరుదు ప్రముఖులగుట!
ఎంత ఘనత చూచి ఇచ్చిరో స్నేహితుల్!
'పంతుల'న్న బిరుదు వచ్చె నీకు! **5**

సీ॥ 'నటనావిధాన ప్రజ్ఞాని' వీవనుటకు
ఆంధ్రనాటకరంగ మదియె సాక్షి!
'సంగీతకళలోన సాటిలేర'నుటకు
ధర 'గానకోకిల' బిరుదు సాక్షి!
'అల 'నటనావిద్య కాచార్యు'డనుటకు
విరివియౌ నటన తర్ఫీదు సాక్షి!
'మిత్రత్వమును కోరు మేటియౌ' ననుటకు
వరమిత్రసంఖ్యయే ప్రబలసాక్షి!

తే॥ సాధుజీవన పరమార్థ సత్యమునకు
అగును నీ జీవితంబుదాహరణ సాక్షి!
నాటక కళావిధాన విజ్ఞాన హృదయ !
సరస సంగీతధుర్య! 'ప్రసాదరాయ'! **6**

(-చైతన్యకవిత-43 to 46, వ్యయ వసంతం-సర్వజిత్తు శరత్తు,
April-October 2007)

(మిత్రులు, ప్రసిద్ధ రంగస్థల నటులు శ్రీ దర్శి లక్ష్మీ వేంకటేశ్వర వరప్రసాదరావుగారు 2017లో సతీసమేతంగా తణుకువెళ్ళి, మా అన్నయ్యగారిని దర్శించి, కొన్ని నాటకపద్యాలు పాడి వినిపించారు. అప్పుడు మా అన్నయ్య వారిని ఆశీర్వదిస్తూ చెప్పినపద్యం–)

**"పంతులుగారు"**

**చ॥ నరులు తపస్సు చేసి, నటనంబున గానము మేళవించి, ఆ**
**మురళిధరుండు వోలె అతిమోదము కూర్చి, నటాగ్ర గణ్యులై**
**ధరపయి కీర్తిగాంచిరి; యథార్థము పల్కెద నున్నమాట! మా**
**"దరిసి ప్రసాద" కృష్ణుని విధంబున గానము చేయనేర్తురే?**

– శ్రీ టి.వి.కె. సోమయాజులుగారు, (2017)

## 3.11 అక్షరాక్షతలు:–

శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు

**వధువు : చి.సౌ. భార్గవి వరుడు: చి. ఉమామహేశ్వర రెడ్డి**

**తే॥ శ్రీకరంబగు తిరుమలశిఖరి నలరి**
**భక్తకోటికి దర్శనభాగ్య మొసగు**
**ఆర్తజన రక్షకుండు 'పోచా" న్వయమును**
**'దాసి' వంశమ్ము గాచుత! దయ యెలర్ప. 1**

**శా॥ శ్రీమత్తిర్పతి శ్రీనివాసుడు, శుభశ్రీలక్ష్మి పద్మావతీ**
**భామామానసచోరు, దర్థిజనకల్పక్ష్మారుహం బోముతన్**
**ప్రేమన్ 'భార్గవి' – 'రెడ్డి' దంపతులు వర్ధిల్లంగ నశ్రాంతమున్**
**క్షేమస్థైర్య శుభాయు రభ్యుదయ సుశ్రీలెల్ల నందించుచున్. 2**

**తే॥ 'తులసి' – 'విజయభాస్కర' దంపతుల తనూజ**
**'భార్గవి' – 'ఉమామహేశ్వరు' పాణిపద్మ**
**మందుకొనినట్టి శుభసమయమ్మునందు**
**దేవతలు బ్రోచుదురు గాత! దీవనలిడి. 3**

చ॥ లలిత నవీన యౌవన విలాసములో విరబూసినట్టి కో
రైల కుసుమాల తేనియలు తృప్తిగ దంపతులార! క్రోలుడీ!
చిలుకలు – గోరువంకలయి జీవితముల్ కలబోసికొన్న గుం
డెల నొక గొంతులో పలుకుడీ! అనురాగ మనోజ్ఞగీతికల్. 4

ఉ॥ వెన్నెల వానలో తడిసి, ప్రేమకు వెచ్చని గూళ్ళు కట్టి ఆ
పున్నమి రేయి సిగ్గిల, నపూర్వముగా వినువీథిలోన సౌ
ఖ్యోన్నతు లందుచున్నవవిగో! తమిమీర చకోరముల్; హృదుల్
దొన్నెలు చేసి త్రావుడు వధూవరులార! సుధానురాగముల్. 5

సీ॥ సన్నాయి పలికెను, సౌభాగ్యశీలురై
పదమూనుడని పూలబాటలందు,
లాజలు కురిసె, చిరంజీవులై పర
స్పరము కూరిమితోడ వరలుడనుచు,
దీవించిన దరుంధతి, సుశీలురై ధాత్రి
స్థాపించుడు యశఃపతాకలనుచు,
శుభతోరణములాడె, శుద్ధాత్ములై కోర్కె
లుయ్యాలలూగుచు నుండుడనుచు,
కవులు, శిల్పులు, చిత్రలేఖకులు వచ్చి,
బంధుమిత్రులు, గాయకవరులు మెచ్చి
పసుపుపచ్చని దీవెనల్ బరపినారు
నవవసంతము లెన్నెన్నొ నడచిరాగ! 6

మ॥ రసరాజ్యాస పదంబులూనితిరి – చిల్కల్ గోరువంకల్ వలెన్
ప్రసరింపన్వలె మీదుప్రేమ – భవితవ్యంబెల్ల పూదోటయై
మిసిమిందీవలు సాగగావలెను – సంపెంగల్, గులాబీలు, జా
జి సుమంబుల్ విరియవలెన్ పరిమళ శ్రీలెల్ల వ్యాపింపగన్. 7

శా॥ పూవుందావియు రీతి నొండొరులు సంపుల్లానురాగమ్ముతో
నేవేళన్ జరియింపగావలయు, పండింపన్వలెన్ కోరికల్

పావిత్ర్యంబగు గేస్తుధర్మమున సౌభాగ్యోదయశ్రీలకుం
దావై - మీరు రహింపగావలయు సత్యాన్వేషణోద్యోగులై. **8**

సీ॥ పచ్చని తోరణపంక్తుల మీదుగా
నవవసంతుడు పెండ్లినడక వచ్చె!
వేయి కోయిలలు సన్నాయితో శ్రుతిగూర్చి
కల్యాణిరాగాలు కలయబోసె!
కోటి తీవియలు మీ కోసమే కుసుమించి
భవ్యసువాసనల్ పంచియిచ్చె!
మధుర వైవాహిక మందార మిదె మీకు
అమృతంపు మధుభాండ మందియిచ్చె!
శ్రీలు విలసిల్ల 'భార్గవీ' ప్రేమమీర
గా 'ఉమామహేశ్వరరెడ్డి!' కలసి మెలసి
హర్షముప్పొంగ ఆనందవర్షశతము
కోరి సాగింపుడింక సంసారయాత్ర!

తే॥ ఆయురారోగ్య సంవృద్ధి యగునుగాక!
భోగభాగ్యమ్ములవి మిమ్ము పొందుగాక!
అమిత ప్రేమాభివృద్ధి మీకగునుగాక!
లలిత సద్గుణసంతతి కలుగుగాక!! **9**

| కల్యాణవేదిక: | ఇట్లు |
|---|---|
| శ్రీకోందడరామాలయము | మిమ్ము శీర్వదించు - |
| సంజీవనగర్, నంద్యాల | రసరాజు-టి.వి.కె. సోమయాజులు |
| 15-11-2007 | (పరిష్కర్త: దుగ్గిరాల రామారావు) |

## 3.12 విషాద నవమి:-

ఇపుడు నీదుమాట లింటిలో వినిపించు
కలుపుఁగోలుతనము కానిపించు
మందుతీపి నాల్కయందునే యున్నది
లేవు నీవు! నమ్మలేను నేను! **1**

"అన్న పుణికికొనియె అమ్మరూపమునెల్ల
తండ్రిరూపు నాకు దక్కె"ననుచు
పొడవు-రంగు-నవ్వు-పూర్తిగా కొంటివి
ఆయువొకటి లేక మాయమైతి! 2

అంత తెలివిఁగలిగి, ఆరోగ్య విషయాన
శ్రద్ధలేదు, దేహబుద్ధిలేదు,
దైవనిర్ణయంబు తప్పింప తరమౌనె!
రమ్యతేజ! "సీతరామరాజ"! 3

నీవు మాయమైన నిమిషంబు లోపల
నిన్ను విడువనట్టి నీడయైన
జాతికుక్క నీదు "జర్మను షెపరుడు"
ఇల్లు విడిచిపోయె నెంత వింత! 4

అన్న 'కాళి' - 'సీత'-అనుఁగు చెల్లి 'శశి'యు
తమ్ముడైన 'శీను' తల్లడిలిరి
కానరాదు దారి కన్నీటిసంద్రాన
ఎచటికేఁగితయ్య ఇంతలోన? 5

చైత్రశుద్ధ నవమి జన్మించె రాముండు
దైవనామమిడితి తండ్రి! నీకు,
అన్ని తిథులలోన ఎన్నుకొని నవమిన్
కన్నుమూసినావు నన్ను విడిచి! 6

ఎపుడు చావువచ్చు, నేమేమి చేయును.
ప్రాణి పుట్టగానె బ్రహ్మ వ్రాయు,
అన్ని తెలిసి కూడ అజ్ఞానివలె నేను
కుములుచుంటినయ్య! కొడుక "రామ"! 7

**జ్ఞాపకాల నెలలు కారించు మనసును**
**శాంతిలేదు నాకు సుంతయైన,**
**సరయునదిని మునిగె సాకేత "రామయ్య"**
**పరిసమాప్తిఁజెందె బ్రదుకుబరువు! 8**

**ఇంతవాఁడవనుచు నెఱుగనురా తండ్రి!**
**ఎంతధనము వచ్చె నింతలోన,**
**"వాసికెక్కినావు వైద్యమం"దని నేను**
**తెలియునంత బ్రతుకు తెల్లవాఱె! 9**

**కలుపుఁగోలుతనము కల్గువాడవు నీవు.**
**స్వార్థమెఱుగనట్టివాఁడ వౌట**
**కలుపుకొనడు నిన్ను గడుసైన లోకమ్ము**
**ఆత్మశాంతి నీకు అగును గాక!! 10**

(విళంబినామ సంవత్సర శ్రావణశుద్ధ నవమినాడు - 19-08-2018 నాడు - హెమియోపతి వైద్యుడైన మా రెండవ అబ్బాయి డా॥ తంగిరాల సీతారామరాజు పరమపదించాడు. వాని విషాదస్మృతిలో.. నా మనసులోని భావాలను నా మాటలుగా మా అన్నయ్య వ్రాసినాడు.)

## 3.13 వివాహ ఆశీస్సులు:-

**వధువు : చి॥సౌ॥ జ్యోత్స్నారాణి వరుడు : చి॥ మధుసూదనరెడ్డి**

**ఉ॥ శ్రీకరమైన ముత్యములు సీతమదోసిట పద్మరాగముల్**
**గా కనుపట్టె! రాముని తలన్ విలసిల్లెను మల్లెమొగ్గలై!**
**శ్రీకర రాము దేహప్రభచే నపుడైనవి ఇంద్రనీలముల్ !**
**ఆ కమనీయ ముత్యముల యందము మీకు శుభంబు గూర్చుతన్! 1**

**తే॥గీ॥ గాన సాహిత్య చిత్రలేఖనములందు**
**రాణకెక్కిన మా జోత్స్నరాణి వధువు !**

శ్రీనిలయ "మధుసూదన రెడ్డి" వరుదు !
వీరి రక్షించుగాక సర్వేశ్వరుండు! **2**

శా॥ సీతారాములు ఉంగరంబునకునై చేతుల్ ప్రసారింపగన్
సీతాదేవికి చిక్కెనుంగరము ! దానిన్ భర్తకందించె ! "ఓ
సీతా! రాముడె గెల్చె!" నన్న తలవంచెన్ సీత ! ఆ
సీతామాత యొసంగనుగాత! సిరులున్ సేమంబు లెల్లప్పుడున్! **3**

నవవధూవరులారా !

సీ॥ తొలిచూపులోపల తొణికిసలాడిన నిశ్చల ప్రణయంబు నిల్చుగాక!
మూడుముళ్ళను మించి ముప్పిరిగొన్నట్టి ఈ ప్రేమ మిమ్ము బంధించుగాక!
తలంబ్రాలవేళలో కలిసిన ప్రోత్సాహ మనురాగవల్లిక లల్లుగాక !
ఏడడుగులతోడి ఈనాటి అనుబంధ ప్రణయమెల్లప్పుడు వరలుగాక!

తే॥గీ॥మమతతో సాగు నిశ్చలమార్గమందు
మల్లెలు పరిమళంబులు చల్లుగాక!
సరస జీవిత నిత్యవసంతమందు
పికము కల్యాణియే ఆలపించుగాక! **4**

తే॥గీ॥ ఆయురారోగ్య సంవృద్ధిరస్తు! సకల
కార్య దిగ్విజయోస్తు! భాగ్యాభివృద్ధి
రస్తు! అన్యోన్య హృదయానురాగమస్తు!
భవ్య సద్గుణ సంతాన ప్రాప్తిరస్తు! **5**

కల్యాణవేదిక — ఇట్లు
టి.టి.డి. కల్యాణమండపము — మిమ్మాశీర్వదించు
కడప — 'భాషాప్రవీణ' టి.వి.కె. సోమయాజులు,ఎం.ఏ
31-5-1993 (సోమవారము) — తణుకు, పశ్చిమగోదావరిజిల్లా



# II. జ్ఞానరత్నాలు - తత్త్వవివేచన

## 2.1 ఆస్తిక-నాస్తిక వాదాలు:-

### ప్రశ్నసప్తకం:

1. దైవం-దేవుడు-దేవత: ఈ మూడింటిలో ఏది అనాలి?
2. దేవుడు ఉన్నాడా?
3. ఎక్కడున్నాడు?
4. ఉంటే కన్పించడేం?
5. దేవుడు ఏమి చేస్తాడు?
6. కన్పించటం లేదు కాబట్టి "దేవుడు లేడు" అంటాను. మీరేమంటారు?
7. అంతటా భగవంతుడున్నప్పుడు దేవాలయానికి ఎందుకు వెళ్ళటం?

**1. దైవం-దేవుడు-దేవత - ఈ మూడింటిలో ఏది అనాలి?**

**సమాధానం:** మూడు లింగములు దైవస్వరూపములే! దైవము గుణాతీతుడు. "యా దృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ"-భగవద్గీత - నీవు ఎట్లూహించెదవో, అట్లే నీకు సిద్ధించును. "యే యథా మాం ప్రపద్యంతే తాన్ తథైవ భజామ్యహం" -భగవద్గీత. ఎవరు ఏ ప్రకారముగా నన్ను ఆశ్రయించుచున్నారో (సేవించుచున్నారో) వారలను ఆ ప్రకారమే నేను అనుగ్రహించుచున్నాను.

**2. దేవుడు ఉన్నాడా?**

**సమాధానం:**

(1) ఉంటేనే మన తిప్పలు ఇలా ఉన్నాయి. లేకపోతే దిక్కు లేకుండా పోయేవాళ్ళం! (దిక్కులేనివారికి దేవుడే దిక్కు!).

(2) ఎందుకూ పనికిరాని - చేతకాని వెధవవు నీవే ఉన్నావే? సృష్టి-స్థితి - లయకారుడు, 84 లక్షల జీవరాసుల్ని పోషించే మహనీయుడు ఉండలేడా?

(3) ఈ ప్రపంచంలో ఉండే అన్ని వస్తువులకు నిర్మాత ఉన్నాడు.. భూమ్యాకాశాలు - పంచభూతాలు - సూర్యచంద్రులు - ఖగోళాలు - 84 లక్షల జీవరాసులు కన్పిస్తున్నాయే! "వీటిని నిర్మించినవాడు కూడా ఒకడున్నాడు!". అనే భావం నీకు ఎందుకు కలగటం లేదు?

**3. ఎక్కడున్నాడు?**

**సమాధానం:** ఎక్కడ లేడో చెప్పు? ఉన్నచోటు నేను చెప్తాను!

**కII ఇందుగల డందు లేదని**
**సందేహము వలదు, చక్రి సర్వోపగతుం,**
**డెందెందు వెదకి చూచిన**
**అందందే కలదు దానవాగ్రణి! వింటే?**

**4. ఉంటే కన్పించదేం?**

**సమాధానం:** నీకు ఎందుకు కన్పించాలి? నీవు దేవుడికి బాస్‌వా? (యజమానివా?)

నీకు కన్పించనంత మాత్రంతో లేడు అంటావా? కన్పించనివి అన్నీ "లేవు" అంటావా?

(a) పగటివేళ నక్షత్రాలు ఉన్నాయా?

(b) నీ కన్ను నీకు కన్పిస్తోందా?

(c) నీ వీపు నీకు కన్పిస్తోందా?

(d) గాలి కన్పిస్తోందా?

(e) పాలలో వెన్న కనిపిస్తోందా?

(f) దండలో దారం కనిపిస్తోందా?

(g) నీ తాతకు తండ్రి కనబడుతున్నాడా?

(h) అమెరికా ఉందా? కనిపిస్తోందా?

వస్తువులయొక్క అన్నిటి ఉనికిని మన కళ్ళతో మనం చూడలేము. దర్శించటానికి మూడు మార్గాలున్నాయి:-

(1) ప్రత్యక్ష ప్రమాణము; (2) అనుమాన ప్రమాణము; (3) ఆప్తవాక్యము.

**(1) ప్రత్యక్ష ప్రమాణము:-**

"అన్నీ ప్రత్యక్షంగా చూస్తేకాని నమ్మను!" అనేవాడు మూర్ఖుడు. నీ కన్ను నిన్ను మోసం చేస్తుంది. ఎదురుగా ఉన్న వస్తువును చూడటానికి కూడా దాని శక్తి చాలదు. సాధనలు అవసరం.

నక్షత్రాలను చూడాలంటే - దూరదర్శిని

లోపలి వస్తువులను చూడాలంటే - ఎక్సరే.

సూక్ష్మజీవుల్ని చూడాలంటే – మైక్రోస్కోపు

దేవుణ్ణి చూడటానికి – దివ్యనేత్రాలు.

కొన్నిటికి ఉపకరణాలు కావాలి. మన నేత్రాలు, మన వీపు అద్దాలలో చూస్తున్నాము.

**(2) అనుమాన ప్రమాణము:-**

"యత్ర ధూమః తత్ర వహ్నిః"-పొగ ఉన్నచోట అగ్ని ఉండును. ఒక దానిని బట్టి మరియొకటి ఊహించుట అనుమాన ప్రమాణము.

1. మన తాతను- (మన తండ్రికి – తండ్రిని) మనం చూచినాము. దీనిని బట్టి మన తాతకు కూడా తండ్రి ఉన్నాడని నమ్ముతున్నాము.
2. గాలి కన్పించకపోయినా స్పర్శనుబట్టి గ్రహిస్తున్నాము.
3. దండలో దారం కూడా ఉంటుందని ఒప్పుకుంటున్నాము.
4. పాలలో వెన్న ఉంటుందని అంగీకరిస్తున్నాము.

**(3) ఆప్తవాక్యము:-**

గురువులు-పెద్దలు-మిత్రులు చెప్పిన విషయాలు అంగీకరిస్తాము. ఆప్తవాక్యంగా విశ్వసిస్తాము..

అమెరికానుగురించి ఒక వ్యక్తి వింటూ "ఏది? కన్పించదేం?" అన్నాడు.

**సమాధానం:** ఊరికే కన్పిస్తుందా? వీసా తీసికొని, పైసా చేత్తో పట్టుకొంటే కన్పిస్తుందన్నాడు.

భగవద్గీత 11వ అధ్యాయంలో "విశ్వరూపాన్ని చూపిస్తున్నాను" అన్నాడు. కృష్ణుడు. అర్జునుడు కళ్ళు బాగా తెరచి రెప్పవేయకుండా చూస్తున్నాడు. అప్పుడు కృష్ణుడు:

**శ్లో॥ నతు మాం శక్యసే ద్రష్టుం అనేనైవ స్వచక్షుషా ।**
**దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్ ॥**

**తా॥** ఓ అర్జునా! నీవు ఈ చర్మనేత్రములతో నన్ను చూడలేవు! దివ్యనేత్రమును నీకు అనుగ్రహిస్తున్నాను, చూడు!- అన్నాడు. భగవంతుని దర్శించటానికి జ్ఞాననేత్రం కావాలి! త్రీడి పిక్చర్స్‌కు కళ్ళజోడు కావాలి. పాలలో వెన్న ఉన్న విషయాన్ని అర్థం చేసికోవటానికి, కర్మయోగాన్ని ఆశ్రయించాలి. భక్తి – జ్ఞాన – కర్మ – యోగ మార్గాలలో ఏదో ఒక మార్గాన్ని పట్టుకొని విశ్వాసంతో ప్రయాణిస్తేనే ఆ విశ్వేశ్వరుణ్ణి సందర్శించగలం.

అంధుడు "లేదు" అంటే – సూర్యుడు లేకుండా పోడు. నాస్తికుడు "లేదు" అంటే – దేవుడు లేకుండా పోడు. అంధుణ్ణి అసహ్యించుకోము; జాలిపడతాము. అలాగే నాస్తికుణ్ణి చూచి జాలిపడాలి. "దేవుడు లేడు!" అన్న నాస్తికుణ్ణి కూడా దేవుడే పోషిస్తున్నాడు!

**5. దేవుడు ఏమి చేస్తాడు?**

**సమాధానం:** మానవుని ఊహలకు అందని – మానవుడు చెయ్యలేని పనులు చేస్తాడు. మూగవాడిచేత ఉపన్యాసాలు చెప్పిస్తాడు. కుంటివాడిచేత పర్వతాలు దాటిస్తాడు. అతని లీలలు చూచి హస్తాలు జోడించవలసిందే! అఘటన ఘటనా సమర్థుడు! ప్రపంచంలో ఏ జడ్జీలు విధించలేని భయంకర శిక్షలు–అత్యాశ్చర్యకరమైన రక్షలు – భగవంతుని దిన (క్షణ) కృత్యాలు! భగవంతుడు చేసే పనులు హేతువాదానికి అందవు!

**6. కన్పించటం లేదు కాబట్టి "దేవుడు లేడు" అంటాను. మీరేమంటారు?**

**సమాధానం:** నీ అంత మూర్ఖుడు లేడని అంటాను. ఉపకరణములతో, అనుమాన ప్రమాణముతో, ఆప్తవాక్యములతో సత్యాన్ని అంగీకరించవలసిన నీవు, గ్రుడ్డివాడు "సూర్యుడు లేడు" అన్నట్లుగా మాట్లాడితే, నీవు "కళ్ళున్న గ్రుడ్డివాడివి" అని అంటాను. కొంతమందికి వెదకుకోవటం బద్ధకం! అలాంటి బద్ధకస్థులు దేవుడు లేడన్నారు. విశ్వాసమే దైవం! "నమ్మక చెడకుర శ్రీహరిని!"

**7. అంతటా భగవంతుడున్నప్పుడు దేవాలయానికి ఎందుకు వెళ్ళటం?**

**సమాధానం:** "దేవుడు దేవాలయంలో ఉన్నాడు!" అనేది భక్తి! "అంతటా ఉన్నాడు" అనేది జ్ఞానం! భక్తుడు తప్పుచేయవచ్చును కాని, జ్ఞాని తప్పు చేయలేడు! భగవంతుడు వివిధ రూపాలలో (మనుష్య రూపేణ దైవం) సాక్షాత్కరిస్తూ సహకరిస్తాడు. దైవాన్ని గుర్తించకపోవటం మన అజ్ఞానం. **I came to you like a friend, like an old man and like a child, but you didn't receive me!** "భగవంతుడు ఎక్కడను లేడు!" అని వ్రాసిన మహాక్షరములలో కూడ భగవంతుడున్నాడే! అతడింక ఎక్కడ లేడు?

**GOD IS NOWHERE! = GOD IS NOW, HERE!**

**సాక్షాత్కరించిన దైవానికి స్వాగతం చెప్పి అభినందించుదాం! రండి!!**

సీ॥ లోకాల చీకట్లు పోకార్ప రవిచంద్ర
దీపాలు గగనాన త్రిప్పలేక,
జగతిపై పడవచ్చు జలరాశి కెరటాలు
మామూలు మేరకు మడవలేక,
పనిమాలి ప్రతిరోజు ప్రాణికోటుల గుండె
గడియారముల కీలు కదపలేక,
అందాలు చిందు నీలాకాశ వీథిలో
చుక్కల ముగ్గులు చెక్కలేక,

తే॥ ఎంత శ్రమనందుచుంటివో ఏమొ స్వామి!
అడుగిడితి వెట్లొ నేడు మా గడపలోన,
గుండె కుదిలించి నీ ముందు కుప్పవోతు!
అందుకొనుమయ్య! హృదయపుష్పాంజలులను!!

సీ॥ పుట్టబోయెడి బుల్లిబుజ్జాయి కోసమై
పొదుగు గిన్నెను పాలు పోసి పోసి,
కలికి వెన్నెలలూరు చలువ పందిళ్ళలో
లతలకు మారాకు లతికి యతికి,
పూలకంచాలలో రోలంబములకు రే
పటి భోజనము సిద్ధపరచి పరచి,
తెలవారకుండ మొగ్గలలోన చొరబడి
వింతలౌ రంగులు వేసివేసి,

తే॥ తీరికే లేని విశ్వసంసారమందు
అలసిపోయితివేమొ దేవాదిదేవ!
ఒక నిమేషము కన్ను మూయుదువు గాని
రమ్ము! తెరచితి మా కుటీరమ్ము తలుపు!

– "కరుణశ్రీ" జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు

## 2.2 అర్థమును కాదు, అంతరార్థమును గ్రహింపవలెను!:–

1. బ్రాహ్మణుడు "ముక్కు పట్టుకో!" అంటే – బ్రాహ్మడి ముక్కు కాదు! 'నీ ముక్కు' అని అర్థం.

2. ఇంట్లోకి కుక్క వస్తుంది –చూస్తూ ఉండు! అంటే – జాగ్రత్తగా ఉండు అని అర్తం. చూస్తూ ఊరుకోమని కాదు!

3. ఈ ప్రసాదం చీమలు పట్టనిచోట దాచు! అంటే, దానిని తినివేసి – "పొట్టలో పెట్టుకొన్నాను. చీమలు పట్టవండి!" అన్నాడట ఒక మూర్ఖశిష్యుడు.

4. గురువుగారు శిష్యుడికి ఆత్మీయత నేర్పటం కోసం "మన" అంటూ ఉండమన్నారు. "మన ఆవులు, మన యిల్లు, మన పుస్తకాలు, మన గాదెలు" అనమన్నాడు. అంతా విన్న మూఢశిష్యుడు, మధ్యాహ్నమయ్యేసరికి – "మన ఆవిడ భోజనానికి రమ్మంటున్నారండి!" అన్నాడట!

5. "మొక్కలకు వేళ్ళు తడిసేలా నీళ్ళు పొయ్యి" అన్నాడు యజమాని. మూర్ఖుడైన పనివాడు – మొక్కలు పీకి నీళ్ళకుండలో ముంచుతున్నాడట!

6. "ఈసారికిలా కానియ్యండి! మళ్ళీసారి తగ్గిస్తాము!" – పెళ్ళి భాజాభజంత్రీల బేరాలలో, వంటబ్రాహ్మణ బేరాలలో శుభాలలో అలా అంటారు! శవాన్ని చిన్నకారులో తీసికెళ్ళే వేళ, చిన్నకారువాడు లేదా శవాన్ని మోసేవాహకుడు – అలా మాట్లాడకూడదు కదా!

## 2.3 శిష్యప్రశ్నలు – శంకర సమాధానాలు:–

1. దుఃఖం కిం నిమిత్తం భవతి? – శరీర పరిగ్రహాత్!
   = దుఃఖ మెందుకు వచ్చును? – శరీరముతో ఉండుటవలన.
2. శరీర పరిగ్రహః కేన భవతి? – కర్మణా!
   = శరీరాన్ని ఎందుకు పట్టుకొన్నాడు?–సుకర్మ–దుష్కర్మలు చేయుటవలన.
3. కర్మ కేన భవతి? – రాగాదిభ్యః
   = కర్మలు ఎందుకు చేయును? – రాగ– ద్వేష– అహంకార– మమకారముల వలన.
4. రాగాదయః కేన భవన్తి? – అజ్ఞానాత్!
   = రాగద్వేషము లెందుకు వచ్చును? – అవబోధనము లేక – లోకమును అర్థము చేసికొనక.
5. అజ్ఞానము కిం నిమిత్తం భవతి–అజ్ఞానమెందుకు వచ్చును? అది ఏమి?
   = అజ్ఞానం–అనాద్యం–అనిర్వచనీయం!!

ఈ గుహలోకి చీకటి ఎలా వచ్చింది? అని తల బ్రద్దలు కొట్టుకోకు. జ్ఞాన జ్యోతిని వెలిగించుకో! చీకటిని తొలగించుకో!

**2.4 తృప్తి: –**

1. కోట్లు లేవని ఏడవకు! – కూటికి ఉన్నందుకు సంతోషించు!!
2. తేలు కుట్టిందని ఏడవకు! – పాము కరవనందుకు సంతోషించు!!
3. ఒక కన్ను పోయిందని ఏడవకు! – రెండు కళ్ళూ పోనందుకు సంతోషించు!!
4. జబ్బు వచ్చిందని ఏడవకు! – డబ్బుతో ఉన్నందుకు సంతోషించు!!

**2.5 ఏడుపులు: –**

"లోకం శోకహతం చ సమస్తమ్!"

(లోకులు అందరూ ఏడుస్తున్నారు. కాని స్థాయి భేదాలున్నాయి. అంతే తేడా!)

1. గంజిలోకి ఉప్పులేదని – పాలలోకి పంచదార లేదనీ;
2. నడకవాడు – చెప్పులు లేవని; చెప్పులున్నవాడు – సైకిలు లేదనీ;
3. సైకిలున్నవాడు – స్కూటరు లేదని!; స్కూటరున్నవాడు – కారులేదని! కారున్నవాడు – హెలికాప్టరు లేదనీ!
4. పెళ్ళికానివాడు చేసికోలేదని; చేసికొన్నవాడు – పిల్లలు లేరనీ;
5. పిల్లలున్నవాడు – డబ్బులేదని; డబ్బు ఉన్నవాడు – ఇంకా లేదనీ;
6. పిల్లలున్నవాళ్ళు – చెప్పిన మాట వినటం లేదనీ, ఎదురింటివాళ్ళ పిల్లల్లా లేరనీ, అదుపులో పెట్టలేక – పోషించలేక – చదువుకోవటం లేదనీ, ఉద్యోగాలు రాలేదనీ – వస్తే పెద్దఉద్యోగాలు కావనీ.
7. ఆడపిల్లలకు–పెళ్ళి చెయ్యలేకపోయామనీ, పెళ్ళిచేస్తే – కూతురు మందలో ఉందనీ, వేరే కాపురం పెట్టలేదనీ, అత్తమామలు బ్రతికి ఉన్నారనీ, అందరూ ఆడపిల్లలే అనీ;
8. స్థలం లేనివాడు – ఈ విశాలప్రపంచంలో విసనకఱ్ఱంత నేల సంపాదించ లేకపోయాననీ,
   సంపాదించినవాడు – ఇల్లు కట్టలేదనీ; ఇల్లు కట్టినవాడు – అద్దెకు పెట్టలేదనీ;
   అద్దెకు పెట్టినవాడు – సరిగా అద్దె ఇవ్వటంలేదనీ;
   ఇల్లు ఖాళీచెయ్యటం లేదనీ – పన్నులు పెంచారనీ;
9. అన్నీ ఉన్నవాడు – ఆరోగ్యం లేదనీ,

జుట్టు నెరుస్తోందనీ, పళ్లు ఊడిపోతున్నాయనీ,
దార పుత్రులు - ధనం ఎప్పుడు ఏమైపోతాయో అనీ;
ఎందుకో అందుకు, అందరూ ఏడిచేవాళ్ళే!

10. కాళ్లు తడి అవకుండా సప్తసముద్రాలూ దాటవచ్చు! కాని కళ్ళు తడి అవకుండా జీవితాన్ని దాటలేడు మానవుడు!
11. భయం! భయం! బ్రతుకు భయం!! బెంగ! బెంగ!!
12. ఈ ప్రపంచంలో ఒక్క జ్ఞాని తప్ప, అందరూ ఏడుస్తున్నారు. లేనివాడు "లేద"నీ, ఉన్నవాడు "పోతుందేమో" అనీ.



**భాషాప్రవీణ విద్యార్థిగా శ్రీ టి.వి.కె. సోమయాజులుగారు (1950)**

# III. "సత్యసందర్శనం"-పరిప్రశ్నలు

**(జ్ఞానాన్నిగురించి తెలుసుకోవాలనే ఉద్దేశంతో వేసే ప్రశ్నలు-పరిప్రశ్నలు)**

1. ఎవడు తెలివైనవాడు?

సమా: భార్యాపుత్రులు-కృషి - దైవం కలసివచ్చినవాడు "తెలివైనవాడు"గా లెక్కింపబడును.

2. ఎవడు చింతలేనివాడు?

సమా: భగవచ్చింత ఉన్నవాడు.

3. "చితి-చింత" ఏది భయంకరము?

సమా: చితి ప్రాణములేని దేహమును కాల్చును. చింత ప్రాణమున్న దేహమును కాల్చును. కాబట్టి చింతయే భయంకరమైనది.

4. జీవుడు చేయు పనులు ఏవి?

సమా: సూర్యుడు ప్రపంచమును ప్రకాశింపజేయునట్లుగా - జీవుడు దేహములో ఉండి దేహమును ప్రకాశింపజేయును. సుఖదుఃఖములను అనుభవించును.

5. దుఃఖకారణములు ఏవి?

సమా: 1.మమకారము. 2.అహంకారము. 3.నిత్యానిత్య వస్తు వివేకము లేకపోవుట (అజ్ఞానము). 4.భ్రాంతి. 5.రాగద్వేషములు.

6. "మిథ్య" అంటే ఏమిటి?

సమా: భూతకాలములో లేదు; భవిష్యత్తులో ఉండదు; మధ్యలో ఉన్నట్లుగా కనిపించునది. (ఈ లక్షణములున్నది కనుకనే జగత్తు "మిథ్య" అన్నారు. (గారడీవాని వస్తువుల వంటిది.)

7. పంచేంద్రియములు - ఇంద్రియార్థములు ఏవి?

సమా: త్వక్ - చక్షుర్ - జిహ్వా - ఘ్రాణ - శ్రోత్ర - పంచేంద్రియములు. (ఆరవ ఇంద్రియము అంతరింద్రియము మనస్సు; మనస్సుతో కలిపి షడింద్రియ ములు). శబ్ద - స్పర్శ - రూప - రస - గంధములు:- ఇంద్రియార్థములు. జీవుడు మనస్సు ద్వారా, ఇంద్రియానందము పొందును. (స్పర్శానందము గొప్పది.)

8. ముఖ్యముగా అలవరుచుకొనవలసిన జ్ఞానము ఏది?

సమా: నిత్యానిత్య వస్తు వివేకజ్ఞానము (ఉండేది ఏదో, ఊడేది ఏదో తెలుసుకో).

9. లోకాన్ని దర్శించటంలో బుద్ధునికి మనకు భేదము ఏది?

సమా: బుద్ధునికి విరక్తి పెరిగింది. మనకు రక్తి పెరుగుతోంది.

10. భ్రాంతి అంటే?

సమా: మతి చలించిన వానికి, దృష్టిదోషం ఉన్న వానికి, ఒక వస్తువు మరొక విధముగా కన్పించును. దీనికి కారణములు మూడు: 1. జ్ఞానదృష్టి అలవడక పోవుట 2. మనోభావన 3. మాయ ఆవరించుట-అనునవి. "గ్రంథిచ్ఛేదనము" కానంతవఱకు అజ్ఞానాంధకారము తొలగనంతవఱకు భ్రాంతి వదలదు! ఈ భ్రాంతి ఐదు విధములుగా "సత్యసందర్శనము" లో వివరింరింపబడినది: 1. రజ్జు - సర్ప భ్రాంతి (సర్ప - రజ్జు భ్రాంతి) 2. శుక్తి - రజత భ్రాంతి 3. దశమో నష్టః 4. ఐదు గాడిదలు. 5. కంఠాభరణం (ఈ భ్రాంతి-మాయ మనలోనే పుట్టి, మనలోనే పెరుగును.)

11. రుచి వస్తువులో ఉన్నదా?

సమా: రుచి వస్తువులో లేదు! అనుభవించే వ్యక్తినిబట్టి మారును. అట్లే అందం వస్తువులో లేదు. సందర్శించువానిని అనుసరించి మారుచుండును.

12. ఏషణత్రయం అనగా నేమి?

సమా: ఏషణము అనగా "ఇచ్ఛ" అని అర్థము. ఇవి మూడు. 1. దారైషణము -భార్య (భర్త) కావాలనే కోరిక . 2. ధనైషణము (ధనమునందు కోరిక) 3. పుత్రైషణము (బిడ్డలయందు కోరిక). ఈ మూడును మానవులను బంధించును. ఈ మూడిటినుండియే సుఖదుఃఖములు ఏర్పడుచుండును.

13. విచారములు ఎన్ని? అవి ఏమి?

సమా: విచారములు రెండు 1. అస్తీతి (అస్తి + ఇతి) విచారః 2. నాస్తీతి (నాస్తి+ఇతి) విచారః 1. ఉండుటలోనుండి వచ్చు బాధలు. 2. లేమినుండి వచ్చు దుఃఖములు. మొదటిదానిలోని బాధలు: (i) పోతుందేమో? ఎత్తుకు పోతారేమో? (ii) ఎలా రక్షించుకోవాలి? (iii) ఎలా అభివృద్ధి చేసుకోవాలి? 2. లేమి బాధ: "లేదు" అనేది ఒక్కటే బాధ! ఉన్నవాడికి ఉన్నన్ని బాధలు లేనివాడికి లేవు.

14. "సంసారం సాగరం!" అని ఎందుకన్నారు?

సమా: సముద్రంలో ఎప్పుడూ కెరటాలు వస్తూ ఉంటాయి. సంసారంలో ఎప్పుడూ సమస్యలు ఉంటాయి. అందుచేత సముద్రంతో పోల్చారు. "సంసారాంధ కారం" అనికూడా అన్నారు. సంసారయాత్ర అంధకారంలో ప్రయాణం! రానున్నది సుఖమో, దుఃఖమో తెలియదు. పూలబాటో, ముళ్లబాటో, అందులో

పడేదాకా తెలియదు.

15. సాధకుడు ముందుగా అలవరచుకొనవలసినది ఏది?

సమా: ఇంద్రియ నిగ్రహం. 1.కన్ను, 2.ముక్కు, 2.చెవి, 4.జిహ్వ, 5.చర్మము – ఈ ఐదును బాహ్యేంద్రియములు. వీనిని అదుపులో ఉంచుకోవాలి. 6.మనస్సు– అంతరింద్రియము ఈ ఆరు ఇంద్రియములను నిగ్రహించుట.

16. జ్ఞానం అంటే?

సమా: ఏది తెలిసికొన్న తరువాత ఇంక తెలిసికొనవలసినది ఏమియును మిగిలియుండదో, అదియే జ్ఞానము. (బ్రహ్మ సత్యం! జగన్మిథ్య! జ్ఞానం)

17. జన్మాంతరం ఉన్నదా?

సమా: పుట్టిన వానికి చావు ప్రత్యక్షంగా కన్పిస్తోంది. చచ్చినవాని జన్మనుగూర్చి మనకు తెలియదు! అందుచే శాస్త్రమును ఆశ్రయించాలి.

భగవద్గీత:– 15–8 జీవుడు ఈ శరీరంలో పొందిన అనుభవాలతో మరొక శరీరములో ప్రవేశించును.

గీత: 4–5 నీకును నాకును చాలా జన్మలు గడచినవి.

గీత: 2–13 దేహములో వచ్చు బాల్య–యౌవన వార్ధక్యముల వలెనే, జీవుడు మరొక దేహములో ప్రవేశించును!

**"జాతస్య హి ధ్రువో మృత్యుః–ధ్రువం జన్మ మృతస్య చ"** పుట్టినవానికి చావు తప్పదు! అట్లే చచ్చినవానికి జన్మ తప్పదు! అని పరమాత్మ చెప్పిన భగవద్గీతను అనుసరించి చచ్చినవారు పుట్టుదురు. పుట్టుకతో కొన్ని విద్యలు కన్పించును. ఐదేండ్ల పిల్లలు శాస్త్రసంగీతము ఆలపించుట–మూడేండ్ల పిల్లలు భరతనాట్యము – పది ఏండ్ల బాలురు గణితశాస్త్రపాండిత్యము – ఇవన్నీ జన్మాంతర శక్తులు ఈ జన్మకు బ్రాటోవరు (Brought forward)గా గ్రహిస్తున్నాము. మరుజన్మ ఉన్నది. జన్మాంతరవాసన తప్పదు!

18. తాపత్రయం అంటే?

సమా: "తాపత్రయం" అనే మాటను వ్యవహారంలో తరచుగా వాడుతూ ఉంటారు. జీవితంలో వచ్చే మూడురకాల బాధలు అని దాని అర్థం.

1) ఆధ్యాత్మికం. 2) ఆధిభౌతికం. 3) ఆధిదైవికం.

ఆధ్యాత్మికం:– అంటే శారీరక–మానసిక బాధలు (ఆధి– వ్యాధులు)

ఆధిభౌతికం:– ఇతర ప్రాణులవలన వచ్చునవి:– క్రూర విష జంతువుల వలన, దుర్మార్గులవలన వచ్చు బాధలు.

ఆధిదైవికం:- అతివృష్టి-అనావృష్టి-భూకంపం-అగ్ని-జల బాధలు-పిడుగులు -సునామీ - కరోనా-మొ॥ దైవనిర్ణయముగా వచ్చునవి.

19. మోక్షము అంటే?

సమా: మోక్షము అంటే "విడుదల" 1. జనన-మరణ చక్రమునుండి 2. అహంకార మమకారములనుండి 3. ఏషణత్రయమునుండి 4."జగత్తు సత్యము" అనే భ్రాంతినుండి 5. మాయనుండి 6. అరిషడ్వర్గమునుండి 7.అజ్ఞానమునుండి విడుదలయే మోక్షము! "మాయతో పోరాడినప్పుడు జీవుడు పొందునట్టి మహావిజయమే మోక్షము!" పరమాత్మనుండి విడిపోయిన జీవుడు పరమాత్మలో లీనమగుట మోక్షము.

20. "చావటానికి ఎవ్వరునూ ఇష్టపడరు!" కారణం ఏమిటి?

సమా: "జీవుడు చావులేనివాడు" అందుచేతనే జీవునకు చావు ఇష్టము కాదు!

21. వాదములు ఎన్ని రకములు?

సమా: వాదములు మూడు రకములు. 1.వాదము. 2.జల్పము. 3.వితండము.

1.వాదము: రాగద్వేషములు లేక, సత్యమును గ్రహించు సద్భావముతో జరుపు ప్రశ్నోత్తర సంవాదము.

2. జల్పము: ఇతరుల మాటలు ఖండించి, తన మాటను నిలబెట్టుకొనుటకై చేయు ప్రసంగము.

3. వితండము: ఎదుటివ్యక్తి చేయు వాదము వినిపించుకొనకుండా, ఇతరులను దూషించు దురుద్దేశముతో మాటకు పైమాటగా మాట్లాడుట. ఈ మూడింటిలోను వాదము దైవస్వరూపము!

22. కొన్ని కొన్ని ప్రశాంత కుటుంబాలలో ఎవడో ఒకడు ఏర్పడి, మొత్తం కుటుంబాన్ని బాధిస్తాడు! వాడు ఎవడు?

సమా: కురుక్షేత్రయుద్ధానంతరం భారతంలో పుణ్యాత్ములు పాండవులు స్వర్గానికి వెళ్ళారు. పాపాత్ములైన కౌరవులు ఈ లోకంలోనే మిగిలిపోయారు. వాళ్ళు ప్రశాంత కుటుంబాలలో కొడుకు, అల్లుడు, మనవడు ఎవడో ఒకడుగా పుట్టి, మొత్తం కుటుంబాన్ని బాధిస్తూ ఉంటాడు.

23. భ్రాంతిలో ఆనందంగా ఉన్నాడు కదా! అది ఆనందం కాదా?

సమా: తెలిసి నవ్వినదే నిజమైన నవ్వు! తెలిసి యేడిచినదే నిజమైన ఏడుపు!! స్వప్నంలో పొందే సుఖదుఃఖాలు, భ్రాంతిలో పొందే సుఖదుఃఖాలు, జ్ఞానంలోకి వచ్చిన

తరువాత దుఃఖాన్ని, నిరాశను కల్గిస్తాయి. జీవుడు తానెవ్వరో తెలిసిన తరువాత సుఖదుఃఖాలు పట్టించుకోడు!

24. అంతశ్శత్రువులు అంటే ఎవరు?

సమా: శరీరములోను, మనస్సులోను ఉండి బాధించు శత్రువులు – కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు. ఈ అంతశ్శత్రువులలో ఒక్కటి ఆక్రమించి, తక్కిన ఐదింటిని త్రొక్కివేయగలదు! వీటిని తొలగించుకొనకుండా పుణ్యకార్యములు చేయుటవలన ప్రయోజనము లేదు. (ఒకడు తీర్థయాత్రకు నల్లులున్న బొంతను తీసికొని వెళ్ళినాడు. ఎన్ని తీర్థాలు సేవించినా, బాధ కొంచెము కూడా తగ్గలేదు.

25. మృత్యువు అంటే? ఏమిటి?

సమా: జీవుడు దేహమును విడిచి పోవుట, దేహమునుండి చైతన్య(జీవ)శక్తి తొలగిపోవుట. దీనికే "పంచత్వము" – "దీర్ఘనిద్ర" అని నామాంతరములు. పంచభూతములతో నిర్మింపబడిన దేహభాగములు ఆయాభూతములలో కలిసి పోవుట అని అర్థము. నిద్రపొందినవాడు కొన్ని గంటల తరువాత లేచును. దీర్ఘనిద్రపొందినవాడు లేవడు. Permanent Sleepలో ఒక చీకటి ఆవరిస్తుంది. గాఢనిద్రలోవలె శరీరస్పృహ ఉండదు. "నేను" అనే భావం ఉండదు. సుఖదుఃఖాలకు అతీతంగా అయోమయ స్థితిలోనికి పోవుటయే మృత్యువు!

26. "అర్థం చేసుకోవటం కాదు; అంతరార్థం గ్రహించాలి"–అంటే ఏమిటి?

సమా: 1. పురోహితుడు "ముక్కును పట్టుకో" అంటాడు. పురోహితుని ముక్కు కాదు; మన ముక్కు మనం పట్టుకోవాలి.

2. "కాకేభ్యో దధి రక్ష్యతామ్"–కాకులు ముట్టకుండా పెరుగు రక్షించు" – అంటే – "కుక్కలు ముట్టుకోవచ్చును" అని అర్థం కాదు.

3. "సామాన్లు పడిపోతాయి చూస్తూ ఉండు!" అంటే– ఒక్కొక్కటే పడిపోతూ వుంటే చూస్తూ ఊరుకోమని అర్థం కాదు!

4. ఈ ప్రసాదం చీమలు పట్టకుండా దాచు! అంటే పొట్టను పెట్టుకోమని అర్థం కాదు!

5. "గురువుగారు కనిపించగానే రెండు చేతులతో నమస్కరించు" అంటే –

1. ప్రమాదవశాత్తు గురువుగారు నూతిలో పడ్డారు. నలుగురు శిష్యులు తట్టకు త్రాళ్ళుకట్టి గిలక మీద పైకి లాగుతున్నారు. గురువుగారు కనిపించగానే గిలక

వదిలేసి "గురువుగారూ నమస్కారం!" అన్నారు. దభీలున గురువుగారు నూతిలో పడ్డారు. (అర్థం తెలుసుకో! సమయ సంధర్భాలు గ్రహించు). 2. సైకిలు మీద గురువుగారికి ఎదురుగా వచ్చిన శిష్యుడు రెండు చేతులు జోడించి "నమస్కారం" అంటూ సైకిలుతోసహా గురువుగారి మీద పడ్డాడు! 3. ఓ రామ నీ నామ మెంత రుచిరా? అంటే నామోచ్చారణలో ఆనందమున్నదని అంతరార్థం. త్రాగుబోతు రామాలయంలో దూరి, రాముని విగ్రహం నుదుటిమీద ఉన్న వెండినామం లాగి, ఆ సొమ్ముతో త్రాగి, "ఓ రామ నీ నామ మెంత రుచిరా?" అంటూ పాడుతున్నాడు. మైకంలో నీ నామము అంటే- "వెండి నామము" అని త్రాగుబోతు అర్థం!

27. అవస్థాత్రయం అంటే ఏమిటి?

సమా: 1. జాగ్రదవస్థ:- మెలకువగా ఉండి, లోకవ్యవహారములో పాల్గొంటూ ఉండే స్థితి.

2. స్వప్నావస్థ:- నిద్రపోవుచు, కలలో సుఖ-దుఃఖాలు పొందేస్థితి (జాగ్రదవస్థ వంటిదే!)

3. సుషుప్తి అవస్థ:- కలలు ఉండవు-సుఖదుఃఖాలకు అతీతస్థితి. (బ్రహ్మానందము వంటిది).

28. ప్రవృత్తి-నివృత్తి అంటే?

సమా: "ప్రవృత్తి" అనగా ప్రాపంచిక విషయములు. ఏషణత్రయం కావాలి- అనుకొనుట.

"నివృత్తి" అనగా "వద్దు" అనుకొనుట. అజ్ఞానములో "ప్రవృత్తి"లో ఉంటాడు. జ్ఞానమువచ్చిన తరువాత ప్రపంచ విషయములలో దుఃఖ-దోషములను దర్శించి "నివృత్తి"ని పొందును. సత్కార్యములు చేయుటయందు "నివృత్తి" పనికిరాదు. చేనులో కలుపు తొలగించాలి కాని, సస్యం తొలగించకూడదు.! (ప్రవృత్తి = ముందుకు వెళ్ళుట; నివృత్తి = వెనుకకు మరలుట).

29. కర్మలు ఎన్ని? (కర్మలు అనగా సుకర్మలు-దుష్కర్మలు అని అర్థం).

సమా: 1. ప్రారబ్ధము. 2. సంచితము. 3. ఆగామి.

1. పూర్వజన్మలో పూర్తికాకుండా మిగిలి మరుజన్మకు బ్రాటోవరు అయినది- ప్రారబ్ధము. "ప్రారబ్ధం భోగతో నశ్యేత్" ప్రారబ్ధం అనుభవించవలసినదే!

2. ఈ జన్మలో సంపాదించుకొనునది–సంచితము.

3. చేయబోవు కర్మలద్వారా రాబోవునది–ఆగామి.

30. మనస్సు అంటే?

సమా: పంచ జ్ఞానేంద్రియములు పైకి కన్పించును. మనస్సు లోపల ఉండునట్టి ఇంద్రియము. దీనికి "అంతరింద్రియము" అనిపేరు. జీవుడు మనస్సుతో కలిసి బాహ్యేంద్రియ అనుభూతిని పొందును.

31. "అంతఃకరణ చతుష్టయం" అనగా నేమి?

సమా: "అంతఃకరణము" అనగా "మనస్సు". ఒకే మనస్సు నాలుగు విధములుగా ప్రవర్తించును. "మనో–బుద్ధి–చిత్త–అహంకారములు". ఇవియే అంతఃకరణ చతుష్టయము.

1. చంచలముగా ఉన్నప్పుడు – "మనస్సు" అనబడును.
2. నిశ్చయ జ్ఞానముతో ఉన్నప్పుడు – "బుద్ధి" అగును.
3. అంతర్భావమును చక్కగా గ్రహించునప్పుడు – "చిత్తము" అగును. ("చిత్తగించవలయును" అని దరఖాస్తు చివర వ్రాయుదురు కదా!)
4. "నేను" అను భావముతో ఉండుటకు – "అహంకారము" అని పేరు.

32. "సాధన చతుష్టయం" అంటే?

సమా: మోక్షమును కాంక్షించువారు సాధింపవలసినవి నాలుగు:–

1. నిత్యానిత్య వస్తువివేకము:– ఈ ప్రపంచములో ఏది నిత్యమో, ఏది అనిత్యమో, గ్రహించు శక్తిని సాధించుట.
2. శమదమాది షట్కసంపత్తి:– "శమము' అనగా మనస్సును నిగ్రహించుట, "దమము" అనగా పంచ బాహ్యేంద్రియములను అదుపులో ఉంచుకొనుట. (షట్కము=ఒక మనస్సు + ఐదు ఇంద్రియములు).
3. ఇహాముత్ర ఫలభోగ విరాగము:– ఈలోక–స్వర్గలోక – భోగాపేక్షయందు విరక్తి కలిగియుండుట.
4. ముముక్షుత్వము:– 1. ఏషణత్రయమునుండి; 2. దృశ్యప్రపంచ ఆసక్తి నుండి; 3. కామక్రోధాదులనుండి; 4. రాగద్వేషములనుండి; 5.దేహ భ్రాంతినుండి విడుదల కోరుట (ముముక్షుత్వము=విడుదల పొందాలనే గాఢ ఇచ్ఛతో నుండుట.)

33. త్యాగము అంటే?

సమా: కేవల ధనదానమే కాదు! దేహమోహము, రాగద్వేషములు, అహంకార మమకారములు, దృశ్య ప్రపంచ వ్యామోహము-మొదలగునవి - ఆధ్యాత్మిక సాధకులు విడువవలసిన, జ్ఞానమునకు ఆటంకములైన భావములను త్యజించుట.

34. జీవన్ముక్తుడు అనగా ఎవరు?

సమా: బ్రతికియుండగానే మోక్షమును పొందినవాడు. భగవానుడు రెండవ అధ్యాయములో చివర నాలుగు శ్లోకాలలో "స్థితప్రజ్ఞ లక్షణములు" పేర్కొన్నాడు. అట్టి లక్షణములకు ఉదాహరణముగా జీవించువాడు జీవన్ముక్తుడు.

గీతలో చెప్పబడిన స్థితప్రజ్ఞుని లక్షణాలు:-

(1) మానవుడు ఎప్పుడైతే తన మనస్సులోని కోరికలన్నీ తుడిచివేస్తాడో, ఆత్మలోనే (నిర్మలచిత్తంతో) ఆనందిస్తూ ఉంటాడో, అప్పుడతడు "స్థితప్రజ్ఞుడు" అనబడతాడు - (2-55)

(2) దుఃఖాలలో క్రుంగిపోనివాడు, సుఖాలలో పొంగిపోనివాడు; అనురాగం - భయం-క్రోధం-లేనివాడుగా ఉండి, నిరంతరంగా పరమాత్మను స్మరించేవాడు - అయిన మహనీయుణ్ణి- "స్థితప్రజ్ఞుడు" అంటారు (2-56)

(3) సమస్త విషయాలయందును (దేహ-బంధు-రోగాదులయందు) ఆసక్తిలేనివాడు; ఇష్టమైనది జరిగినా, కష్టమైనది జరిగినా, సుఖదుఃఖాలకు లోనుకానివాడు - "జ్ఞాని". అతడే "స్థితప్రజ్ఞుడు" (2-57)

(4) తాబేలు తన ఆరు అంగాలను లోపలకు ముడుచుకొంటుంది. అదే విధంగా ఆరు ఇంద్రియాలను (పంచేంద్రియాలు + మనస్సు) ఇంద్రియార్థాలనుండి (శబ్ద-స్పర్శ-రూప-రస-గంధాదులనుండి) వెనుకకు మరలించుకొను ప్రజ్ఞాశీలియే "జీవన్ముక్తుడు". అతడే "స్థితప్రజ్ఞుడు" (2-58).

ఈ విధమైన స్థితప్రజ్ఞుని లక్షణాలకు అనుగుణంగా జీవించేవాడే "జీవన్ముక్తుడు" అనబడును.



# IV. "భగవద్గీతా ప్రబోధం" - జ్ఞానకిరణాలు

1. స్వప్నంలో ఉన్నంతసేపు స్వప్నం నిజం! మేలుకొన్నాక స్వప్నం అసత్యం, జగత్తు సత్యం!! జ్ఞానం సిద్ధించాక జగత్తు కూడా అసత్యం! బ్రహ్మ సత్యం! (పరమాత్మయే త్రికాలసత్యం!)
2. చింతలేనివాడు ఎవ్వడు? - దైవచింత ఉన్నవాడు!
3. బ్రహ్మదేవుడు "84 లక్షల రకాలు బొమ్మలు చేసుకోవాలి. మట్టియ్యి" అని అడిగాడు భూదేవిని! "అమ్మో! ఇవ్వను! నా మట్టిని (బొమ్మల రూపంలో) నాకు మరల అప్పగిస్తే, ఇస్తాను!" అన్నది. (ఈ ఒప్పందం ఏనాటిదో!)
4. కుమ్మరి, జిగురెక్కటం కోసం, మట్టిని మర్దిస్తున్నాడు. ఆ మట్టి అంటోంది. "కుమ్మరీ! ఎప్పటికైనా నువ్వు కూడా నాలో కలిసిపోయేవాడివే" అని.
5. "భగవంతుడు దేవాలయంలో ఉన్నాడు" అనుకోవటం భక్తి! "అంతటా ఉన్నాడు" అనుకోవటం జ్ఞానం!
6. ప్రకృతికి ఆధారం పరమాత్మ! సర్పభ్రాంతికి ఆధారం త్రాడు! (రజ్జువు). "భ్రాంతి సర్పము"నందు అంతటా త్రాడే ఉంది! మాయాప్రపంచంలో అంతటా పరమాత్మయే ఉన్నాడు!
7. "అసతో మా సద్గమయ!"
   ప్రపంచ అనురక్తినుండి నన్ను పరమాత్మను చేర్చుము.
8. "తమసో మా జ్యోతిర్గమయ!"
   చీకటి (అజ్ఞానము) నుండి నన్ను వెలుగు (జ్ఞానము) వైపు నడిపించు!
9. "మృత్యోర్మా అమృతంగమయ!"
   మరణమునుండి నన్ను మోక్షమువైపు నడిపించు!
10. ఓం శాంతిః శాంతిః శాంతిః
   మూడు విధములైన శాంతి-
   (i) ఆధ్యాత్మిక శాంతి- శారీరక-మానసిక బాధలు (ఆధివ్యాధులు) - శాంతించుగాక!
   (ii) ఆధిభౌతిక శాంతి-ఇతర (మృగ-సర్ప-వృశ్చికాది) ప్రాణులనుండి వచ్చు బాధలు - శాంతించుగాక!
   (iii) ఆధిదైవిక శాంతి-అతివృష్టి-అనావృష్టి-అగ్నిబాధలు-వరదలు-భూకంపం, సునామీ - కరోనా - మొదలైన దైవిక బాధలు (దైవంవల్ల వచ్చే ఆపదలు)- శాంతించుగాక!

# V. వ్యాసమంజూష

## 5.1 మాతృదేవో భవ! (మన అమ్మ):–

అమ్మ కేకలు – ఆరాటం – ఆవేదన ఏమిటో అర్థంకాని స్థితిలో కళ్ళు తెరిచాను. పితామహుడు – ఒక భయంకర రాక్షసాకారం! మాతామహుడు' – ఆదరాభిమానాలకు అందమైన ఆకారం!

అమ్మకి ఎవరన్నా భయం లేదు – ఏ పరిస్థితికైనా బెదురు లేదు. కష్టాలతో పోరాటం సాగించటానికి సర్వదా సన్నద్ధతతో వుండేది. పిరికితనం ఆమెలోని ఏ ఒక్క అణువుకూ తెలియని విషయం. ఈ లక్షణాలు అమ్మకి స్వార్జితాలు కావు; పిత్రార్జితాలు! "దేవుడా!" అని ఏడవటం అమ్మ వ్యక్తిత్వానికి విరుద్ధం!

జీవితంలో ఆమెకు తారసిల్లే ఏ సన్నివేశాన్నీ ఎక్కువగా ఆలోచించేది కాదు. కొన్ని నిమిషాల్లో నిర్ణయానికి రావటం, నడుంకట్టి పోరాటం సాగించటం అమ్మ లక్షణం. బెంబేలు పడటం అమ్మలో నేను ఎన్నడూ చూడలేదు.

భవిష్యత్తునుగురించి భయంకరంగా ఊహించుకోవటం కాని, ఆశలు అల్లుకోవటం కాని, అమ్మకు తెలియని విషయాలు. దైవాన్ని పట్టుకొని ఏడవకపోయినా, ఒక మొండితనం అనే గోడమీద మొలిచిన వేదాంతం అనే రావిమొక్క అమ్మ మాటల్లో అడుగడుగునా రెపరెపలాడేది. పిల్లల విషయంలో "నారు పోసినవాడు నీరు పొయ్యకపోతాడా?" – "వాళ్ళని కన్నాంగాని వాళ్ళ రాతల్ని కన్నామా?" – "ఖర్మ తప్పించేవాడు ఎవ్వడూ లేడు! ఎలా రాసివుంటే అలా జరుగుతుంది!" – "రాతకి ఇన్ని రాతలు లేవు!" – "చదువుకొని బాగుపడతారా? బాగుపడతారు! లేకపోతే నలుగురికీ నాలుగు రాగి చెంబులు తోమి ఇస్తాను!" (Aim for the highest and prepare for the worst!) అనే అమ్మ నిర్ణయాలు నా శిరస్సులో చెఱగని ముద్రలు! మనమంతా బాగా చదువుకుంటూ అభివృద్ధిపథంలో ఉన్నప్పుడు అమ్మ తన కష్టాలు త్వరలో గట్టెక్కబోతున్నాయి అనే ఆశాభావంతో (తాను ప్రయాణం చేస్తున్న బాధల సంసార సాగరంలో) "తాళ్ళు కనబడుతున్నాయి, ఇక ఊళ్ళు కనపడక పోతాయా?" అనేది. చిరంజీవి భాస్కరరావు, చిరంజీవి బుల్లితమ్ముడు ఇంజనీరింగ్ చదువుతుంటే కొంత ఎక్కువ డబ్బు ఖర్చు అయ్యేది. అయినా వాళ్ళకు ఉత్తమ భవిష్యత్తు ఉంటుందనే నమ్మకంతో అమ్మ – "చదువులంటే ఒలకబోసి ఎత్తుకోవడమే!" – అనేది. (నిజానికి ఇంజనీరింగు చదువులో ఒలకబోసిన దానికన్నా ఎక్కువే ఎత్తుకుంటాం).

ఉన్నదానితో సద్దుకోవటం ఎలా? అనే ఆలోచన – దానిని అమలు పరచటంలో శ్రద్ధ– అమ్మలో అనుక్షణం కన్పించేవి. వస్తువులను జాగ్రత్తగా వాడుకోవటం, ప్రతి రాగిడబ్బు ఖర్చులోను ఆలోచన – జాగ్రత్త అనేవి అమ్మని నీడలా వెంటాడేవి. ఆలోచన లేకుండా, దుబారాగా ఖర్చుపెడితే దుస్థితికి దిగజారిపోతారనే ఆలోచనతో "ఆదివారం అందలం! సోమవారం జోగి! మంగళవారం మాధుకరం!" అనే సామెత అమ్మ అంటూ వుండేది. దమ్మిడీలలో పొదుపు చూపించే అమ్మలో, వేలు తృణప్రాయాలు కావటం అత్యాశ్చర్యం! ఇది ఒక వేదాంత రహస్యం!

ఎవరేనా ఏదేనా మాట అంటే "ఆలోచించి, పొంచి దెబ్బతీద్దాం!" అని ప్లాను వేసుకోవటం, పైకి నవ్వుతూ, క్రోధాన్ని లోపల పెట్టుకొని, దెబ్బతీయటం అమ్మకి చేతకాదు. మాటకి మాట వెంటనే అప్పగించటం అమ్మ స్వభావం. "తగలేసి వచ్చాను!" అంటే "మాటకి మాట సమాధానం చెప్పాను!" అని అమ్మ భాషకి అర్థం!

మామగారి క్రూరహింసలు, రాక్షసచర్యలు తట్టుకోలేక పుట్టింటికి వెళ్ళి, తండ్రి ఆదరాభిమానాలు ఒళ్ళంతా కప్పుకొన్నా, మరదలు – చుట్టుప్రక్కల అమ్మలక్కల సూటిపోటి మాటలు గుండెల్లో గుచ్చుకోవటం తప్పలేదు అమ్మకి. కన్నతల్లిలో కూడా నిరసన కెరటాలు చవిచూచిన అమ్మ, ఇవతల ఒడ్డుకు వచ్చి, తుపానులో లంగరు వేసి, ప్రకృతి వైపరీత్యంతో పోరాటం సాగించింది అమ్మ పడవ! ఆ పడవలో ఇద్దరు అక్కయ్యలు, మనం నల్గురం. మన అందర్నీ తన పైట కొంగుతో కప్పుకొని, మొండితనం గడ తన్నిపెట్టి, అలాగే పడవ మునిగిపోకుండా పట్టుకొంది అమ్మ! ఆ గడను పెద్దక్కయ్య, చిన్నక్కయ్య, నేను గట్టిగా అమ్మ చెయ్యిక్రింద పట్టుకొన్నాము! అలా ఉగ్గపట్టిఉన్న పడవను ముంచేద్దామని రాక్షసుడు (జగ్గన్న తాత) చేసే ప్రయత్నాలలో గొల్లుమని ఏడుస్తున్నారు పిల్లలు! ఈలోగా ఐదవ అబ్బాయి పడవలోంచి జారిపోయాడు! అమ్మ గట్టిగా ఏడ్చింది! మిగిలిన వాళ్ళను తడిమి చూచుకొని, మళ్ళీ గడ నిలదొక్కుకుంది! ఈ పోరాటంలో పిల్లలకి నీటిలోతు అర్థమైంది! పెద్దవాడు గడ పట్టుకొన్నాడు! తుఫాను జోరు తగ్గినా, చిన్న కెరటాలు నావను ఊపుతూనే వున్నాయి! అందులో క్షుద్రరాజకెరటం గట్టిగా విసిరింది! ఆ విసురుతో సరస్వతీ (గోస్తనీ) తీరం చేరింది అమ్మ పడవ!

రాజీపడని మనస్తత్త్వం అమ్మది. లోకజ్ఞానం తెలియదు. మాయ, మర్మం కనిపెట్టలేని స్వభావం. రాజకీయ పరిజ్ఞాం లేని ఆవేశాత్మక పోరాటం అమ్మది. తన 13 సంవత్సరాల వయస్సులో పెళ్ళితో ఏర్పడి, మనస్సులో పెరుగుతూ వచ్చింది ఈ ఆరాటం! ఇతరుల్ని ఎదిరించటంలో, బెదురులేని తత్త్వం అమ్మ రక్తంలో వుంది. ఇల్లు

అల్లరికీ తగదాలకూ అంకితం అవుతుందేమో అని అమ్మ ఎన్నడూ జాగ్రత్తపడలేదు. అమ్మకు బాట మారింది! పాట మారింది! కాని శ్రుతి మారలేదు! కన్నబిడ్డలతోనే ఏదో ఆరాటానికి పోరాటానికీ ఎదురు చూసేది అమ్మ! గాలితో పోరాటానికి ఆలోచించేది! పిల్లలలో వుండే లోపాలను భూతద్దంలో చూస్తూ, కోడళ్లలోని సర్వసాధారణ లోపాల్ని కొండంతలు చేసి ప్రచారం చేస్తోంటే; కోడళ్ళచేత తిట్లూ, శాపనార్థాలూ ఈసడింపులూ తినే అత్తలు, దారిద్ర్యం మధ్య నవ్వులు ముఖానికి పూసుకొని, గుట్టుకంబళీ కప్పుకొన్న లోకం, "అబ్బే! మా కోడళ్ళు అలా కాదమ్మా! బంగారు తల్లులు!" అని కల్లబొల్లి మాటల బూటకాల మూటలు, అమ్మముందు పడేసి వెళ్ళిపోయేవారు!

భగవంతుడు అమ్మపక్షాన నిల్చి, విజయం ఇచ్చి, అభయం అందించినా, ఏదో ఆరాటం, ఏదో ఆవేశం, అమ్మను 83వ మైలురాయి దాకా వెంటాడాయి! తాను, నిర్భయమైన, నిష్కంటకమైన పూలబాటలోకి వచ్చినా, ముళ్ళబాటలో క్రూరమృగ భీతిలో పొందిన అనుభూతులు అమ్మను మానసికంగా వదల్లేదు! పోరాటం మానలేదు! గాలిలోకి తుపాకులు పేలుస్తూ ఎవరిమీదో, ఎందుకో తెలియని యుద్ధం చేస్తూనేవుంది! తండ్రి అంశతో పిత్రార్జితంగా వచ్చిన పోరాటం, తండ్రి పేరు పెట్టుకొన్న కడసారి బిడ్డ (సైనికాధికారి)దగ్గర, సైనిక సపర్యల మధ్య భాగ్యనగరంలో (సికిందరాబాద్‌లో), దైవాజ్ఞానుసారంగా మూగవోయింది! ఆ మౌనంలో ఇంద్రియ నిస్సంగం – నిర్మోహం –నిశ్చలతత్త్వం, అమ్మను దగ్గరకు తీసికొన్నాయి! – అమనస్కయోగంలో లోకానుబంధం లేని స్థితిలో (తానెవ్వరో లోకమెవ్వరో తెలియని స్థితిలో) పరమాత్మలో కలిసిపోయింది అమ్మ!

జాగ్రత్త – పొదుపు నేను అమ్మదగ్గర నేర్చుకొన్నాను. వేళకు భోజనం చెయ్యటం, వేళకు నిద్రపోవటం, సమస్యల్ని ఎక్కువగా ఆలోచించకపోవటం, నాకు 9వ యేట ఉపనయనంనాడు అమ్మపెట్టిన భిక్షలు! "దేవుడా!" అని ఎన్నడూ ఏడవకపోవటం అమ్మ దగ్గరనుండే నాకు వచ్చింది!

అమ్మ జీవితం ఒక పోరాటంయొక్క స్వరూపం! అమ్మతో చాలామందికి తగాదాలు వచ్చేవి. ఆ సమయంలో అమ్మ మొహం చూసేవాణ్ణి. అమ్మలో హైరాన, ఉక్రోషం, అసహాయత కన్పించేవి! "ఈ ప్రపంచంలో బ్రతకటానికి ఇంత హైరాన అవసరమా? ఊరుకొంటే పోలే?" అనుకొనేవాణ్ణి! ఇది నా తండ్రి లక్షణం! అమ్మ తండ్రి లక్షణం అమ్మది! అది శత్రునాశన సంరంభాత్మకం!

“అప్పుతీర్చి అంగడిని ఉండమన్నారు! నాకు అప్పు అంటే అసహ్యం!” అనేది. అమ్మ! ఈ స్థితి అమ్మదగ్గర నాకు అలవడింది. ఉన్నదానితో సద్దుకోవటం, ఒక పథకం వేసికొని బ్రతకటం, ఏ వస్తువు ఎక్కడ వుంచాలో అక్కడే పెట్టటం, కష్టాల్ని ఎదిరించి మొండిగా నిలబడటం, మనల్ని తిట్టేవాళ్ళని లెక్కచెయ్యక పోవటం, పిల్లల్ని ఏదో చెయ్యాలనుకోకపోవటం – అనే లక్షణాలు అమ్మ దగ్గర అక్షరాలా నేను అలవర్చుకొన్నాను! “వాళ్ళని కన్నాం కాని, వాళ్ళ రాతల్ని కనలేదు!” అనే మాట బిడ్డల్నిగురించి ఆలోచించేవేళ నాలో ప్రతిధ్వనిస్తుంది! మనస్సులో మెదులుతుంది! “బిడ్డల భవిష్యత్తుకు మనం కర్తలం కాదు!” – అనే వేదాంతం లోతు, అమ్మ చేయి పట్టుకొని చూచాను!

అమ్మ, తన తల్లిలోను, సోదరులలోను, చెల్లెళ్ళలోను, వ్యతిరేకతను చూచి, ఒక విధమైన విరక్తితో వుండేది. వాళ్ళని పట్టుకోవటం వెనుక, మానసికమైన విడుపు, అంతర్లీనంగా వుండేది. కాని, తండ్రిమీద అమ్మకి అమితమైన అనురాగం! అభిమానం! అమ్మకు ఏర్పడ్డ వైవాహిక బంధం కాని, అత్తమామల ఆరడికాని, మరోస్త్రీకి ఏర్పడితే “నా తండ్రి నా గొంతుక్కోశాడు! వెధవ తండ్రి!” అని తిట్టుకొని ఉండేది. కాని అమ్మ అలా అనేది కాదు. రెండవ తమ్ముడు తల్లిదండ్రుల్ని అంటిపెట్టుకొని ఉన్నాడనీ, తోబుట్టువుల్ని పట్టించుకుంటున్నాడనీ, “మా చిన్నాడు! మా చిన్నాడు!” అనేది. ఆఖరి తమ్ముడని అబ్బిగాడిని కూడా అభిమానంగా చూసేది; ఆత్మీయత ఉండేది. కొన్ని కొన్ని సందర్భాలలో వాళ్ళతో కూడా వేరైపోయింది! వాళ్ళని కూడా “విశిష్టా చేసింది! (ఇతరుల లోపాల్ని క్షమించటం, “పోనిలే!” అనుకోవటం, అమ్మకు చేతకాదు).

“విశిష్టా” చెయ్యటం అమ్మ దగ్గరవుండే ఒక ప్రత్యేకమైన ఆయుధం! “కొంత వఱకు చెప్పటం, వినకపోతే, వాడి ఖర్మకు వాడిని విడిచిపెట్టటం” అనే పద్ధతి “విశిష్టా” యొక్క ఆంతర్యం! ఒక వ్యక్తిలో చెడ్డ చూచిందీ అంటే, వాడిమీద విరక్తి పెట్టుకొనేది. మనస్సు తెంపుకొనేది!

మన అందరిలోను నాన్న పోలికలు, స్వభావాలు, మేనత్తల లక్షణాలు ఎక్కువగా వున్నాయి. జ్ఞాపకశక్తి, తిండిపై వ్యామోహం, జీర్ణశక్తి, అన్నీ నాన్న లక్షణాలే వచ్చాయి! “వీళ్ళుకూడా తెలివితక్కువవాళ్ళు అవుతారేమో?” అనే ఆలోచన అమ్మకు ఆంతర్యంలో లేదనకూడదు! కాని, అమ్మ ఎన్నడూ ఆందోళన చెందలేదు. నాన్న లక్షణాలు మనలో ప్రస్ఫుటమైనప్పుడు “ఆ తండ్రే! వెట్టిచచ్చినాడు! అశనిఖాతపు చచ్చినాడు! ఎక్కణ్ణించొస్తాయి. తెలివితేటలు?” (తెలివితేటలు = సత్యాన్ని గ్రహించటం) – అనటం అమ్మకి అలవాటు. అందులో ఆవేదన లేదు! అసంతృప్తి లేదు! తండ్రి పోలికలు

బిడ్డలో చూచి, అద్దం చూచుకొన్న అనుభూతే అమ్మలో తొంగి చూచేది! "కష్టమో నష్టమో; మన ఖర్మ మనం అనుభవించాలి" అనే సూత్రం అమ్మ దగ్గర నేను నేర్చుకొన్న మొదటి పాఠం. ఈ లోకంలో బ్రతకాలంటే, కావలసినంత జ్ఞానమేనా వుండాలి! లేకపోతే మొండికెత్తటమేనా వుండాలి! అమ్మకి రెండవ లక్షణం అండగా వుండేది! "ఆత్మహత్య" అనే మాట అమ్మ నిఘంటువులో లేనిమాట! "చచ్చి ఏం సాధిస్తాం? బ్రతికి సాధించాలి!" అనేది అమ్మ ఆచరించి చూపించిన సూక్తి!

"పైసల దగ్గర జాగ్రత్త! లక్షలమీద నిర్లక్ష్యం!" – ఈ విషయంలో అంతరార్థం – "పట్టుకోగలిగిన విషయాల్ని పట్టుకొందాము! పట్టుకోలేనివి (లక్షలైనా) పట్టుకోలేం! దాన్ని గురించి ఏడవటం అనవసరం" – "తస్మాదపరిహార్యేర్థేనత్వం శోచితుమర్హసి!" (నీవు తప్పించుకోలేని అర్థాన్ని గూర్చి నీవు విచారించవద్దు!' అని గీతాచార్యుడు చెప్పిన హెచ్చరిక విన్నాక, అమ్మ మనస్తత్వం పూర్తిగా అర్థమైంది నాకు!

ఆర్థిక బాధలు – అసహాయస్థితి ఎంత దుస్థితికి దిగజార్చుతూ వున్నా, ప్రలోభాలకు లొంగకపోవటం అమ్మయొక్క ప్రత్యేకత! "లక్ష్మిందేవమ్మగారికి మీ రెండవ కుఱ్ఱవాడిని దత్తం ఇస్తే, 6 ఎకరాలు ఆస్తి ఏర్పడుతుంది! పెద్దాడబడుచు కూతుర్నిచ్చి పెళ్ళిచేస్తారు! జగ్గన్నగారు కూడా కొంత ఆస్తి ఇస్తాడు! మీ సుబ్బారావును దత్తం ఇయ్యమ్మా సీతామహాలక్ష్మీ!" అని రేలంగి బ్రాహ్మణ్యం అంతా అమ్మని నలుగురిలో ఒంటరిగా నిలబెట్టి, ఏకకంఠంగా అభ్యర్థించారు! కొన్ని సెకనులలో అమ్మ – "ఒకడు పది ఎకరాల వాడయితే నాకేం జరుగుతుందయ్యా! ఉంటే అందరూ ఆస్తులతో వుంటారు! లేకపోతే అందరూ అడుక్కుతింటారు!" అన్న సమాధానంలోని ఆంతర్యం, అంతరార్థం, ఆ దత్తం పొంది, ఆస్తిని అనుభవిస్తున్న (దత్తుడు, రాజేశ్వరి అనే) వాళ్ళ జీవితాన్ని ఏనాడో అధిగమించిన మన సోదరుల జీవితాలలో గోచరించింది! అమ్మని ఏదో శక్తి నడిపించింది! ఆ ఆత్మవిశ్వాసం వెనుక కొండంత దైవం అండగా వుంది!

సుబ్బారావుకు – భాస్కరరావుకు నాన్నలాగే జీర్ణశక్తి చూచుకొని తినటం చేతకాదు. ఆ విషయం వాళ్ళ చిన్నప్పుడే కనిపెట్టింది అమ్మ. "అశనిఖాతపు చచ్చినాడు!" – 'వెఱ్ఱి వచ్చినాడు" అనే తిట్లు వాళ్ళిద్దరికీ ఎక్కువగా వాడేది. నన్ను "దొంగ చచ్చినాడు!" అనీ, బుల్లి తమ్ముణ్ణి "పొగరుమోతు చచ్చినాడు!" అని తిడుతూ వుండేది.

తన అత్తమామలు ఆడపిల్లలకు ఆస్తి అప్పగించి ఆచరించిన అన్యాయం యొక్క ఛాయలు తన జీవితంలో పడతాయేమో అనే అనుమానంతోనే మన అక్కయ్యల విషయంలో వ్యవహరించేది. కూతుళ్ళ సంతానంమీదకంటే కొడుకుల సంతానం మీద అభిమానం ఎక్కువగా కన్పించేది అమ్మలో! అలా అని, కూతుళ్ళ సంతానాన్ని

దగ్గరకు తియ్యకపోలేదు! పెద్దక్కయ్యగారి అబ్బాయిని హైస్కూలులో చేర్పించి దగ్గర ఉంచుకోవటం; పెద్దక్కయ్యగారి శేషారత్నాన్ని ఇంట్లో ఉంచి, స్కూలుఫైనలు దాకా చదివించటం; వెంకటేశ్వర్లుకు ఉద్యోగం ఏర్పాటు చెయ్యమని బుల్లితమ్ముడితో చెప్పటం; చిన్నక్కయ్యకు అరఎకరం పొలం వ్రాయమనటం – అనే విషయాలను ఆలోచిస్తే అమ్మకు ఆడపిల్లలమీద అభిమానం తక్కువ అనటానికి వీలులేదు! సూక్ష్మాతిసూక్ష్మ పరిశీలనకు కాని అందని అంశం అది!

ఖర్చుచెయ్యటం అంటే అమ్మకు ఇష్టం వుండేది కాదు. దీపం చిన్నదిగా వుంచటం, ఒక్క అగ్గిపుల్లతో నిప్పు అంటించటం, సంవత్సరం గడిచేలా కొన్న వస్తువుల్ని వాడుకోవటం, అమ్మకి ఇష్టం! ఎప్పటికప్పుడు తట్టతగలేసే వాళ్ళంటే అమ్మకు గిట్టదు. ప్రణాళికలేని సంసారాలూ, ఆలోచన లేకుండా ఖర్చుపెట్టే వాళ్ళూ అంటే అమ్మకు వేళాకోళం! కాఫీలు, సినిమాలు, వేణీళ్ళు పోసుకోవటం అనేవి (ఖర్చని) అమ్మకు గిట్టవు! అమ్మ నన్ను కొన్ని సమయాల్లో ఇలా ప్రశ్నించేది:–

(1) తల్లికి పిల్లలమీద ఉండే ప్రేమ, పిల్లలకి తల్లిమీద వుండదు – ఇది యేమిటి?
నా సమాధానం: "నీళ్ళు పల్లానికి ప్రవహిస్తాయమ్మా! కాకి పిల్లకి, కాకి నోట్లో మేత పెడుతుంది. ఆ పిల్ల పెద్దదయ్యాక తల్లిని కొంచెం కూడా పట్టించుకోదు. ఇది ప్రకృతిలో సహజం!".
"బాగా చెప్పావురా!" అంది. అమ్మ!

(2) "ఏరా! స్థలం రిజిష్ట్రీకి రిక్షామీద తీసికెళ్ళి, రిజిస్ట్రేషను అయ్యాక "జయమ్మా, నువ్వూ నడిచి వెళ్ళండమ్మా!" అన్నావేం రా? అస లీ సంగతి చెప్పు?" అంది. నన్ను నిలబెట్టి
నా సమాధానం: "అమ్మా! ఓటు వెయ్యటానికి రిక్షాలో తీసికెడతారు! ఓటు వెయ్యటం అయిపోయాక రిక్షాలో పంపిస్తారా?" అన్నాను. "అంతేరోయ్! మొన్న వోట్లల్లో అలాగే చేశారు! లోకం అలాగే వుంది!" అంది అమ్మ.
(వివరణ: మా అమ్మ తన ఒడ్డాణం అమ్మివేసి తణుకులో 618 గజాల ఇంటిస్థలం కొన్నది. దానిలో సగం (309 గజాలు) మా అన్నయ్య తన పేర వ్రాయించుకొని, అందులో మేడ కట్టుకున్నాడు. ఇక్కడ మా అన్నయ్య చెప్పిన సమాధానం నాకు ఏమీ నచ్చలేదు; పైగా చాలా బాధ కలిగించింది. వయస్సు మళ్ళిన ముసలి తల్లిని, నీ అవసరం తీరాక, నీ కవితలోని "కఱివేఁపాకు" లాగ తీసిపారవేయడం, రిజిస్ట్రారు ఆఫీసునుండి ఇంటిదాకా నడిచి వెళ్ళమనడం ఘోరాతిఘోరం! జ్ఞానివి

పండితుడివి అయిన నీకూ, పచ్చి మోసగాళ్ళైన రాజకీయ పక్షాలవారికీ తేడాలేదా?-తంగిరాల)

(3) పెద్దక్కయ్య అమ్మను వేసిన ప్రశ్న: "అమ్మా! పిల్లలకి మేనమామల పోలికలు వస్తాయంటారు. మా పిల్లల్లో ఒక్కళ్ళకీ మేనమామల లక్షణాలు రాలేదేమిటమ్మా?" అంది.

అమ్మ సమాధానం: "నా పిల్లలకి మేనమామల పోలిక రాలేదు. నీ పిల్లలకీ రాలేదు. బ్రతికాము! అమ్మాయీ! నా మొగుడు ఇలా అయినందుకు, నా పిల్లలకి మేనమామల పోలికలు కూడా వస్తే, గోదాట్లో పడి చావాల్సిందే!" అంది అమ్మ. (తన తమ్ముళ్ళమీద అమ్మకు ప్రేమ ఉన్నా, వాళ్ళు సరియైన పద్ధతిలో లేరనీ, విద్యాబుద్ధులు లేవనీ, విచారం వుండేది). ఈ మాటల అంతర్యంలో పచ్చినిజం గోచరిస్తుంది! తప్పును తప్పుగా నిర్ణయంగా అనటమే కాని నసుగుడు అమ్మకు సరిపడదు!

పోరాటం ఆరాటాల మధ్య అమ్మ జీవన పోరాటం అద్దాల మధ్య (ప్రత్యేక వైద్య శ్రద్ధా విభాగంలో) ఆగిపోయింది! ఆలోచిస్తే అమ్మ లక్ష్యాన్ని అందుకుంది! గమ్యాన్ని చేరుకుంది! అమ్మ అందంగా తన బిడ్డల్ని తీర్చిదిద్దిందని అందరూ ఏకకంఠంగా అన్నారు. ఆడది ఇంత క్రమశిక్షణలో పిల్లల్ని పెంచిందని తెల్లపోయారు! "ఇంత తెలివైన మగవాళ్ళం మనం ఏమి సాధించాం?"అని తమ మనసుల్ని ప్రశ్నించుకొన్నారు! ఆడపిల్లల్నీ - వాళ్ళపిల్లల్నీ అందలాలు ఎక్కించాలనుకొన్న జగ్గన్నతాతకి, దైవం ఘోర పరాజయం అందించింది! ఆ పరాజయాన్ని అందుకుంటూ "నేను యజ్ఞయాగాది క్రతువులు చేశాను కాబట్టి, నా మనవళ్ళు అంత ఔన్నత్యం పొందారు" అంటూ, "క్రిందపడ్డా గెల్పు నాదే!" అన్నాడు! చేసేది లేక దైవనిర్ణయం శిరసావహించాడు!

గోదావరీ తీరంలో పుట్టిన అమ్మ హైదరాబాద్‌లో అద్దాలగదిలో సుఖదుఃఖాలకి అతీతస్థితిలో వుండి ఆజ్యహోమం పొందింది! చితాభస్మం గోదావరి నుఱుగుల్లో కలసిపోయింది! ఈసారి ఏ కాలువగుండా ప్రవహించిందో? ఎవరి కన్నతల్లి అవుతుందో?

**న మాతు: పరదైవతమ్!**

(1990లో అమ్మ స్వర్గస్థురాలైనప్పుడు తమ్ముళ్ళు చిరంజీవులు సుబ్బారావు, భాస్కరరావు, కృష్ణమూర్తులతో చెప్పిన విషయాలు).

# 5.2 మా అమ్మ

## కీ.శే. తంగిరాల (భళ్ళమూడి) సీతామహాలక్ష్మిగారు (1907-1990)

మా తల్లిగారికి భగవంతుడి మీద మొండినమ్మకం ఉండేది. జీవితం నడుపుకోవటానికి ఒక ప్రణాళిక ఉండేది. దాన్ని అసిధారావ్రతంగా ఆచరించే పట్టుదల కూడా ఉండేది. ఆరోగ్యరక్షణకు క్రమశిక్షణ పాటించేది. లోకనీతి-రీతి. ఆకళించుకొన్నది. ఆమె నమ్మిన, నీతుల్ని తరచుగా, మరచిపోకుండా, పైకి అంటూ వుండేది! నేను కళ్ళు తెరచి మా అమ్మ మాటలు వింటూ, ఆమె జీవిత పోరాటం చూస్తూ పెరిగాను. ఆమె నీతులు నా లేతబుఱ్ఱలో చెరగని ముద్రలు వేశాయి!

నేను సంస్కృత విద్యార్థిని కావటంవల్ల, అమ్మ మాటలకి సంస్కృతంలో నీతి శ్లోకాలు చదివినప్పుడు, "ఇది మా అమ్మ ఎప్పుడూ అనేదే" అని భావించేవాడిని. దైవాన్నిగురించిన ఆలోచన వచ్చేసరికి, ఎంత నమ్మకం ఉండాలో - "కలడో లేడో?". అనే ఆలోచన మనకు ఎంత దూరంగా ఉండాలో అర్థం చేసికొన్నాను. నమ్మిన వాళ్ళమీద భగవంతుడు ఎంతో దయారసం కురిపిస్తాడు అనడానికి, అమ్మకు భగవంతుడిచ్చిన విజయాలు ప్రత్యక్ష సాక్ష్యాలు!

భగవంతుణ్ణి ఏమి కోరాలో ఎంత కోరాలో అమ్మకు తెలుసు! ఏమి ఇవ్వాలో భగవంతుడికి తెలుసు! యాచకుని ఔదార్యానికి దైవం వశమౌతాడు! అమ్మ "నా బిడ్డలు, టైపు షార్ట్‌హ్యాండుతో వాళ్ళ బ్రతుకులు వాళ్ళు బ్రతికేలా చెయ్య" మని కోరింది. అత్యవసరాన్ని (dire necessity ని) కోరటం యాచకుని ఔదార్యం. దాన్ని దాత తప్పక గమనిస్తాడు. నాకు సంస్కృతంలో ఒక శ్లోకం కన్పించింది:

**శ్లో॥ చాతకః త్రిచతురః పయః కణాన్ యాచతే జలధరం పిపాసయా ।**
**సోపి పూరయతి విశ్వమంభసా, హన్త! హన్త! మహతాముదారతా ॥**

తా॥ చాతకపక్షి దాహము తీర్చుకొనుటకు, మేఘుని, మూడు నాలుగు జల బిందువులను ఇమ్మని యాచించును (ఇది యాచనలోని ఔదార్యము). అది గమనించిన మేఘుడు, ప్రపంచమును జలదానముతో ముంచెత్తును. ఆహా! మహాత్ములెంతటి ఉదారులు!

అమ్మ సంతానానికి భగవంతుడు సంఘములో గుర్తింపు పొందే జీవితాలను ఇచ్చి అనుగ్రహించాడు.

సమస్యలకు "భయపడటం" - "శత్రువుకు భయపడటం" అనే అక్షరాలు ఆమెకు తెలియవు. ఈ బలం ఆమె కెక్కడిదో నాకు ప్రహ్లాదుడు ("బలమెవ్వడు నీకు

నాకు బ్రహ్మేదులకున్") చెప్పాడు. దైవాన్ని నమ్మినవాళ్ళకు భయం ఎందుకుంటుంది? అమ్మ ఆచరణ జీవితానికి సూత్రాలు-సూక్తులు చాలా దొరికాయి. "BE FEARLESS!" అనే వివేకానంద సూక్తి, ఇంకా ఎన్నో మహనీయుల నీతులు, తరువాత నాకు కంఠస్థమయ్యాయి. అమ్మ ఆచరణలోనివే అవన్నీ!

"నేను ఈ పనిని సాధించగలనా? ఈ సంసారాన్ని లాగగలనా? ఈ సమస్యని పరిష్కరించగలనా?" అనే హృదయ దౌర్బల్యం ఆమె ఎప్పుడూ పొందలేదు! అది చిన్నప్పటి నుండీ నేను చూస్తూ, అక్షరజ్ఞానం వచ్చాక అర్థం చేసుకొన్నదే ఈ గీతాశ్లోకం: **"క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప!"** (నీచమైన మానసిక బలహీనతను విడచి, సమస్యను ఎదిరించటానికి సంసిద్ధంగా ఉండు!)

ఆటలలో చెడు పిల్లలచే దెబ్బలు తిని, అమ్మతో చెప్పుకొంటే "వాడు వెధవ" అని నీకు తెలియదా? నీ ఖర్మ! "దుష్టులకి దూరంగా ఉండాలి!" అనేది! ఆ తరువాత

**"శకటం పంచహస్తేషు, దశహస్తేషు వాజినమ్**
**గజం హస్తసహస్రేషు, దుష్టం దూరేణ వర్జయేత్॥"**

అనే శ్లోకం నాకు దొరికింది!

"సంఘబలం", "ధనబలం" ఉన్నవాళ్ళు "(దిక్కులేనిది కదా) ఈమె మీద చెయ్యిచేసుకొంటే అడిగేవాళ్ళు ఎవరు?" అని దురుసుగా ప్రవర్తించారు. ఆ సన్నివేశాలలో అమ్మమాట – "దిక్కులేనివాళ్ళని దివాణంవాడు కొడితే, దివాణంవాణ్ణి దేవుడు కొడతాడు!" అనేది. దీని వివరణం నాకు 20, 25 ఏళ్ళ వయసులో దొరికింది!

**శ్లో॥ కాంతం ప్రాహ కపోతికాఽ ఽకులతయా, కాంతాంత కాలోఽధునా,**
**వ్యాధోఽధోః ధృతచాప ప్రాణిత శరః, శ్యేనో పరిభ్రామ్యతి ।**
**ఇత్థం సత్యఽహినా స దష్ట, ఇషునా శ్యేనోఽపి తేనా హతః,**
**తూర్ణం తౌ తు యమాలయం ప్రతిగతౌ, దైవీ విచిత్రాగతిః॥**

తా॥ ఆడుపావురము భర్తతో "నాథా! మనకు ఇప్పుడు మరణము సంప్రాప్తించు చున్నది! క్రింద కిరాతుడు బాణమును సంధించి యున్నాడు! పైన డేగ తిరుగాడు చున్నది!" (బలవంతులు ఇద్దరు! బలహీనమైనవి పావురములు! కిరాతుడు గురితప్పని ధనుర్ధారి! డేగ కాలివ్రేలుతో పావురమును చంపగలదు!) ఇద్దరు బలవంతులను భగవంతుడెట్లు కొట్టెనో చూడుడు:- దైవముపై భారము వేసి పావురముల జంట కన్నులు మూసికొన్నది. దైవము ఆ భారము తనపై వేసికొన్నాడు. గురి సరిచేసు

కొనుచున్న కిరాతుని పాము కరచినది. కిరాతుని గురితప్పిన బాణము, డేగకు తగిలినది! "బలహీనుల్ని బలవంతులు కొడితే, వాళ్ళని దేవుడు కొడతాడు" అనే అమ్మ నమ్మకానికి ఆధారం దొరికింది! అమ్మ శత్రువుల్ని భగవంతుడు శిక్షించాడు.

మా తండ్రిగారు "లౌకిక జ్ఞానం లేని నిస్సంగి" అవటంవల్ల, కుటుంబ బాధ్యత అంతా అమ్మే వహించేది. నాన్న వేదం ఏకరువు పెట్టుకుంటూ కూర్చొని ఉండేవాడు.

"ముందు జాగ్రత్త" అంటే అమ్మకు ఇష్టం. తనకు సంవత్సరానికి ఏమి అవసరమో, అన్నీ ఒక్కసారే, జాగ్రత్త చేసుకొనేది! సంవత్సరానికి 12 అగ్గిపెట్టెలు, 12. శేర్ల కిర్సనాయిలు! ఇలా వుండేది ఆమె లెక్క. అవసరం వచ్చినప్పుడు, ఆ వస్తువు కోసం పరిగెత్తటం కాదు! అవసరం వస్తుందని ముందు జాగ్రత్తలో ఉండటం, ఆమె సంసిద్ధతకు నిదర్శనం.

**"సందీప్తే భవనేతు కూపఖననం ప్రత్యుద్యమః కీ దృశః?"**

(ఇల్లు అంటుకున్నాక, నుయ్యి త్రవ్వకానికి ప్రయత్నించటం ఎంత అవివేకం?)

జ్వరం-అజీర్ణం వంటి చిన్న చిన్న తాత్కాలిక వ్యాధులకు, అవసరమయ్యే "ఆనంద భైరవి" "అగ్నితుండి" - "వాతరాక్షసం" వంటి మందులు సిద్ధంగా ఉంచుకొనేది.

ఆరుగురు సంతానం! నిస్సంగి అయిన భర్త! చాలీచాలని ఆదాయం! "నిన్ను అడుక్కునేలా చేస్తాను!" - "సర్వనాశనం చేస్తాను!" అంటూ ఉన్న సమర్థుడైన దుర్మార్గుడు మామగారు పొంచివున్న బెబ్బులి!! ఈ పరిస్థితిలో దైవం మీద విశ్వాసం ఆమెకు రక్షాకవచంగా వుండేది! ఎవరేనా జాలితో "ఎల్లా పెంచుకు వస్తున్నావమ్మా ఈ పిల్లల్ని?" అని అడిగితే, అమ్మమాట:- "నారు పోసినవాడు నీరు పొయ్యడా?" అనేది. దీని వెనుక కరడుకట్టిన దైవవిశ్వాసం ఎంత ఉందో, జ్ఞానం వచ్చాక నాకు అర్థమయింది! "నారు" అంటే విత్తనాలు మొలకెత్తించి, కొంతకాలం నీళ్ళుపోసి పెంచుట-దీనినే "నారు పోయుట" అంటారు. అదే పద్ధతిలో, పుట్టిన పిల్లల్ని శైశవదశలో ఒకచోట కలిపి పెంచుతారు. ఆ పిల్లలు వేరు వేరు క్షేత్రాలలో, వేళ్ళు తన్నుకొని స్థిరపడతారు.

లోకంలో, "నారు పోసిన రైతే, నీరు పొయ్యటం"లో బాధ్యత వహిస్తాడు! ఇది లోకధర్మం! ఈ మాత్రం లోకధర్మం, ఆ లోకేశ్వరుడికి తెలియదా? ఈ నారు పోసిన (పిల్లలను ఇచ్చిన) వాడే, వీళ్ళకి జీవనోపాధి కల్పిస్తాడు! కల్పించక పోడు! "తప్పకుండా నా బిడ్డలు పైకి వస్తారు" అనుకొంటూ - ఆవిడకు రక్తంలో జీర్ణించిన సర్వసన్నద్ధత గుర్తుకు వచ్చి "కీడెంచి మేలెంచాలి!" అనుకొనేది. ఇది నాకు తరువాత అర్థమైంది.

"Aim for the highest and prepare for the worst!" అనే సూత్రానికి అంతరార్థం అని. "చదువులు వస్తాయా? చదువుకొని ఎవరి బ్రతుకు (కనీస స్థితి) వాళ్ళు బ్రతుకుతారు! లేకపోతే, అందరకూ, తలో రాగిచెంబూ తోమి ఇస్తాను. 'సీతారామాభ్యాం నమః' అని అడుక్కుంటారు" అనేది మా అమ్మ, (మా తండ్రిగారికి అప్పుడప్పుడు ఎవరెవరో ఇచ్చిన రాగిచెంబులు సుమారు ఇరవై వరకూ మా యింట్లో ఉండేవి.) జయాపజయాలు సమానంగా తీసికోగల్గిన, సమత్వయోగుల్ని, సర్వేశ్వరుడు మెచ్చుకొంటాడు. ఈ సమత్వయోగం గీతాచార్యుడు అమ్మకు ఎప్పుడు ఉపదేశించాడో?

కీడెంచటం (చేసే పనిలో రాబోయే అపజయాన్ని శంకించటం) విజ్ఞాని లక్షణం. మేలునే ఆశించేవాడు, కీడువస్తే తట్టుకోలేడు. అది, వాడు ఊహించ లేదు కదా! మా అమ్మ, కీడును ఎదిరించటానికి నడుము కట్టి, సర్వసన్నద్ధంగా నిలబడేది. మేలును గ్రహించటానికి, సన్నద్ధత, సంసిద్ధత అవసరం లేదు కదా! "ప్రిపేర్ ఫర్ ది వరస్ట్!" అనే సూక్తి లోతు అమ్మకి అర్థమైనట్లు, సూక్తి నేర్చుకొన్న నాకు అర్థం కాలేదు!

అమ్మ ఆచరణలో చూపించిన సంసిద్ధతను, భగవంతుడు మెచ్చుకొన్నాడు. అందరికీ హాయిగా బ్రతకటానికి అనుకూల వృత్తులు అందించాడు, "నారు పోసిన. వాడు నీరు పోసాడు!"

"ఇంక ఈ (భిక్షాటనానికి సిద్ధం చేసిన) రాగి చెంబులు నా పిల్లలకు అవసరం లేదు" అనుకొంది. ఒక శుభముహూర్తంలో అవి అన్నీ కంచరవాడిచేత కరిగించి, మంచినీళ్ళ బిందెగా మార్పించింది! ఇదంతా ఆమె సమ్మిన దైవనీతికి ప్రత్యక్ష ఉదాహరణం! (మా అమ్మకు మోకాళ్ళనొప్పులు వచ్చినప్పుడు, గోస్తనీనదినుండి ఈ రాగిబిందెతో నీళ్ళు తీసికొని వచ్చి త్రాగితే, ఆ నొప్పులు పోయాయి!-తంగిరాల.)

సంస్కృత గ్రంథాలకుగల వ్యాఖ్యానాలలో "గచ్ఛద్వ్యాఖ్య" (Running Commentary = క్లుప్తంగా ఇచ్చే వివరణం) అనీ, "సుదీర్ఘవ్యాఖ్య" అని ఉండేవి. ఒక్కొక్క వ్యాఖ్యాత "నా శక్తిని అనుసరించి వ్యాఖ్యానము వ్రాసినాను" అనుటకు "యావత్తైలం తానద్వ్యాఖ్యానమ్" (ప్రమిదలో చమురున్నంతలో ఈ వివరణము. చేసితిని) అనెడివాడు.

మా అమ్మ రాత్రి దీపము ఏ స్థాయిలో ఉంచితే, తెల్లవార్లూ, మనం దీపపు వెలుగును పొందగలమో, ఆ స్థాయిలోనే ఉంచేది! ఒక్కసారి పెద్దస్థాయిలో భగ్గుమనిపించి, ఆ వెలుగులో ఆహా! ఓహో! అనుకొని, తరువాత రాత్రి (జీవితం) అంతా, చీకటి (దరిద్రం)లో ఏడవటం, ఆమెకు గిట్టదు. ఇది ఆమె జీవిత సూత్రం!

"దినం వెళ్ళటం కాదు! తనువు వెళ్ళాలి!"– "ఈ రోజు తిన్నది తిండి కాదు! ఈ రోజు కట్టింది బట్ట కాదు! జీవితాంతం నడుపుకోగల్గిన విధానం, ఆలోచించుకొని, ఆ పద్ధతిలో నడవాలి!" అనేది.

జీవితంలో ప్రణాళిక లేకుండా, ఏదో అనుభవించాలని పరుగులు పెట్టి పడిపోయిన వాళ్ళని చూచి అసహ్యించుకొనేది. "ఆదివారం అందలం! సోంవారం జోగి!! మంగళారం మాధోకరం!!!" ఆదివారం పల్లకిలో తిరుగుతాడు! సోమవారం సన్యాసిగా మారాడు. (ఎవరు భిక్షకు పిలుస్తారా? అని గుడిలో కూర్చుంటాడు). ఎవరూ పిలువక – మంగళవారం "అమ్మా ముద్ద! అయ్యా ముద్ద!!" అని అడుక్కొంటాడు! ఉన్న పరిస్థితులు ఊపిరి ఉన్నంతవఱకు ఉపయోగించుకొంటూ, జీవితాన్ని లోటు లేకుండా నడుపుకొనే ఒడుపు మా అమ్మకి తెలుసు!

మా చిన్నప్పుడు అమ్మ అనారోగ్యంతో మూలగటం మాకు తెలియదు! జీవిత పోరాటం సాగించాలంటే ఆరోగ్యం, శక్తి, అవసరం. లభించిన దానితో తృప్తిగా తినటం – భారం దైవం మీద వేసి నిశ్చింతగా నిద్రపోవటం! దీని వెనుక ఒక మహత్తర ఆరోగ్య సూత్రం, అసిధారా వ్రతంగా పాటించేది. అదే "ప్రొద్దు నియమం"! సూర్య నమస్కారం చేసి భుజించుట! సూర్యుడు కన్పించని (వర్షకాలపు) రోజుల్లో ఉపవసించుట! ఇది అమ్మ జీవితాంతం పాటించింది. ఆరోగ్య సంరక్షణం ఆమె జీవన పోరాటంలో అవసరం. ఈ "ప్రొద్దు నియమ" వ్రతానికి ప్రత్యక్ష సాక్ష్యం మూడవ కొడుక్కి భాస్కరనామధేయం!

**శ్లో॥ ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్, ధనమిచ్ఛేత్ హుతాశనాత్ ।**
**జ్ఞానం మహేశ్వరాదిచ్ఛేత్, మోక్షమిచ్ఛేత్ జనార్దనాత్ ॥**

తా॥ ఆదిత్యుని ఆరాధించి ఆరోగ్యమును – అగ్నినారాధించి సంపదలను – ఈశ్వరుని పూజించి జ్ఞానమును – జనార్దనుని స్మరించి మోక్షమును పొందవలెను!

ఈ శ్లోకము, తరువాత ఎప్పుడో నాకు దొరకినది. ఎప్పటినుండో అమ్మ "భాస్కర వ్రతం" (ప్రొద్దు నియమం) ఆచరిస్తూ ఉంది!

వేదాంత గ్రంథాలు ఆమె చదువలేదు. దైవాన్ని పరిపూర్ణంగా విశ్వసించింది. దైవశక్తిని అర్థం చేసికొంది. ధైర్యంగా సమస్యల్ని ఎదిరించింది. లోకనీతిని అవగాహనం చేసికొన్నది. నీతుల అంతరార్థం అర్థం చేసికొని ఆచరించింది. ఆమెకు దైవం మీద ఉన్న నమ్మకం – చెడును ఎదిరించటానికి ఆమె సంసిద్ధత – కనీస అవసరాలు తీర్చుమని దైవాన్ని కోరటం – ఇవన్నీ ఆమెకు తెలిసిన నీతులు, ఆచరణాత్మకాలు.

ఇంతటి ఆధ్యాత్మిక జ్ఞానాన్నీ – లోకజ్ఞానాన్నీ రంగరించుకొని, దైవం మీద విశ్వాసంతో ఆత్మస్థైర్యంతో – జీవనపోరాటం సాగించి, అనుకోని విజయాలు దైవానుగ్రహంతో అందుకొని, దైవానికి కృతజ్ఞతాంజలి ఘటించి, దైవంలో అంతర్లీనమైన అమ్మకు

ఈ 'జ్ఞానరత్నాలు' అంకితం....

–తంగిరాల వేంకట కృష్ణ సోమయాజులు

## 5.3 పితృదేవో భవ! (మన నాన్న)

"పితృదేవో భవ!" అనే సూక్తి వెనుక మన నాన్న మనసులో మెదలగానే – "మధురామృతమేదొ విషమ్మదేదొ తేడా తెలియంగలేదు, కపటమ్ము నెఱుంగడు, మాయయున్ దగా చేతులు కల్పనట్టి రససిద్ధిని పొందిన యోగిపుంగవుం డాతఁడు" అనే రసరాజుగారి పద్యపాదాలు స్ఫురిస్తాయి.

ముప్ఫై ఎకరాలూ – ఎకరం నేలలో రెండు మండువా ఇళ్ళూ ఉన్నా, వసుధైక కుటుంబంగా భావించిన అసంగి నాన్న! ఆవునుండి పాలు పితికినంత కాలం కంటే ఎక్కువ కాలం ఎక్కడా నిలువని శుకయోగికి అన్న మన నాన్న! ఎక్కడ ఎంతసేపు ఉంటాడో, ఎక్కడకు ఎందుకు వెళతాడో ఆయనకే అంతు పట్టదు!

ఆయన్ని లోకం పట్టించుకొనేది కాదు! ఆయన కూడా లోకాన్ని పట్టించుకొనే వాడు కాదు! అయినా నస్యం మాత్రం ఆయన్ని గట్టిగా పట్టుకుంది! మనకు నస్యం వాసన తగిలితే నాన్న పక్కలో పడుకున్న భావన కలుగుతుంది! అందర్నీ సమానంగా చూచే నాన్న మనల్ని కూడా లోకంలో పిల్లల్ని చూచినట్లే చూచేవాడు. శాలువా కప్పి దగ్గరకు తీసుకునేవాడు. కాని "పుత్రైషణమ్" ఆయనలో ఉన్నది అని అనుకుంటే ఆయన్ని అర్థం చేసుకోనట్లే!

మాతామహుడి పేరు పెట్టారు నాన్నకి. మాతామహులు గుళ్ళపల్లివారు. అదే పేరు కొల్లివారి అబ్బాయికి కూడా పెట్టారు. ఒకే ఊళ్ళో ఇద్దరు సుబ్బన్నలు ఉండటం వల్ల వ్యవహారంలో ఎవరు ఎవరో తెలియటం కోసం నాన్న పేరుకు ముందు "వెట్టి" అనే విశేషణం తగిలించి "వెట్టిసుబ్బన్న" అని వ్యవహరించింది వెట్టిలోకం! ఎలా పిలిచినా అతీతస్థితిలో నిస్సంగుడుగా – తామరాకుమీది నీటిబొట్టులా–పట్టించు కోకుండా ద్వంద్వాతీతుడై ఉన్న నాన్నని ఎలాంటి పిలుపులూ తక్కువ చేయలేక పోయాయి!

లోకం దృష్టిలో ఆయన "వెట్టిసుబ్బన్న!". మనల్ని "వెట్టిసుబ్బన్నగారి పిల్లలు" అనేది లోకం! ఈ క్రింది శ్లోకం నాన్నలాంటి వాళ్ళనుగూర్చి చెప్పిందేమో అనిపిస్తుంది:

**జ్ఞాత తత్త్వస్య లోకోయం జడోన్మత్త పిశాచివత్ ।**
**జ్ఞాత తత్త్వోపి లోకస్య జడోన్మత్త పిశాచివత్ ॥**

(మిథ్యా ప్రపంచాన్ని అర్థంచేసికొన్న జ్ఞానికి లోకం వెట్టివాళ్ళమయంగా కనిపిస్తుంది. పూర్వంనుండీ తత్త్వజ్ఞానుల్ని అందర్నీ వెఱ్ఱివాళ్ళుగా జమకట్టింది ఈ. మాయలోకం).

ఈ లోకానికి అతీతుడు నాన్న. ఆయన ఒక గుణాతీతుడు! ఒక యోగారూఢుడు! జ్ఞాని! స్థితప్రజ్ఞుడు!

కుటుంబంలోని అస్తినాస్తి విచారాలు, ఏషణత్రయాలు, రాగద్వేషాలు - అనే వాటికి అతీతుడు నాన్న! ఒక ప్రదేశంమీద, ఇంటిమీద, శరీరంమీద, వస్త్రంమీద, చేతిలో చెంబుమీద, వ్యక్తులమీద మోహంలేని నిర్మానమోహుడు! జితసంగదోషుడు! అధ్యాత్మనిత్యుడు!

**దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగత స్పృహః ।**
**వీతరాగ భయక్రోధః స్థితధీ ర్మునిరుచ్యతే ॥** (గీత 2-56)

**యస్సర్వత్రానభిస్నేహః తత్తత్రాప్య శుభాశుభమ్ ।**
**నాభినందతి నద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥** (గీత 2-57)

సుఖదుఃఖాలు ఆయన మనఃప్రవృత్తిని కదిలించలేకపోయాయి. రాగభయ క్రోధాలు ఆయనకు తెలియని అంశాలు. ఆయన స్థితప్రజ్ఞుడు! శుభాశుభాలు అవి ఏమో! ఆయన వాటికి అతీతుడు! ఒకర్ని ద్వేషించడం, మరొకర్ని అభినందించడం, ఆయనకు తెలియదు.

"జీవితం ఇలా కావాలి" అనుకొన్నవాడికి-అలా దొరికేదాకా ఏడుపు! అనుకొన్న జీవితం దొరికిన తర్వాత-అది జారిపోతుందేమోనని ఏడుపు! జీవితాన్ని పరమేశ్వరుడికి అర్పించిన శరణాగతుడికి, అనన్యచింతనుడికి, ఆలోచనలు ఉండవు. దుఃఖాలు ఉండనే ఉండవు.

నాన్న కుటుంబ బాధ్యత పూర్తిగా సర్వేశ్వరుడు తీసికొన్నాడు. నాన్న తీసికో మన్నాడా? అయినా భగవంతుడు తన బాధ్యత అనుకొన్నాడు!

**"అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే ।**
**తేషాం నిత్యాభియుక్తాంనాం యోగక్షేమం వహామ్యహమ్ ॥"**

ఎవరు ఇతర భావాలు లేనివారై, నన్నుగురించి చింతిస్తూ ఎడతెగక ధ్యానిస్తూ ఉంటారో, ఎల్లప్పుడూ నాయందే నిష్ఠగలిగి ఉంటారో, అటువంటివారియొక్క యోగక్షేమాలను నేను వహిస్తున్నాను. – అని శపథం చేసిన గీతాచార్యుడే బాధ్యతగా యోగక్షేమాలు చూడటానికి నిలబడ్డాడు.

నాన్నలో భయంకరమైన సహనం కనిపించేది. రోడ్డువెంబడి పెడుతుంటే. గొడ్లను కాసే కుర్రాళ్ళు, ఆడాళ్ళు, పనిలేని సోమరులు, నాన్నదారికి అడ్డం వచ్చి, చేతులు చాపుతూ "ముక్కుపొడుం పెట్టండి పంతులుగారూ! పొడుం పెట్టండి!" అని ముట్టడించేవాళ్ళు. వాళ్ళమీద ఎప్పుడూ కోపం తెచ్చుకొనేవాడు కాదు నాన్న. అందరికీ కాస్త కాస్త ముక్కుపొడుం చేతుల్లో వేస్తూ వాళ్లని తప్పించుకొనేవాడు. వాళ్ళల్లో ఒక కొంటెవాడు నాన్న వెనకాలపడి గోచీ లాగేవాడు. వాడిని కూడా ఏమీ అనేవాడు కాదు. "ఉండ్రా! నీ పెళ్ళాం ముండామొయ్యా! ఓరీ నీ పెళ్ళాం మొగుడా! ఆగరా!" అనేవాడు. తక్కినవాళ్ళు ఆ కొంటెవాణ్ణి మందలించేవాళ్ళు. మళ్ళీ ఇంకో చౌరాస్తాలో అదే పద్మవ్యూహం మళ్ళీ ఏర్పడేది నాన్నకి. నాన్న వెనకాల తిరిగే 8,9 ఏళ్ళున్న నాకు పిచ్చికోపం వచ్చేది. నాన్న మొహంలో ఎన్నడూ కోపం, ఉడుకుమోతుతనం కనిపించేవి కావు.

ఒక్కొక్కసారి సోమరిమూక కాలక్షేపంకోసం దారంట వెళ్ళే నాన్నని అడ్డంకొట్టి, ప్రశ్నలు వేసేవాళ్ళు. అందులో కొన్ని అసభ్యాలు కూడా ఉండేవి. "ఏవండోయ్! సుబ్బన్నగారూ! కోడికి కాళ్ళెన్నండీ? మంచానికి కోళ్ళెన్నండీ?" అని అడిగేవారు. నాన్న "కోడికి కాళ్ళు ఐదు!" అంటూ – "మంచానికి కోళ్ళు మూడు!" అనేవాడు. ఆ సమాధానాలతో "ఈయన వెఱ్ఱిసుబ్బన్నే!" అని ధ్రువీకరించుకొని, తమ తెలివి తలచుకొని, ఆనందించేవాళ్ళు! వాళ్ళ ఆనందానికి దారినిచ్చి, తన దారిని తాను పోయేవాడు నాన్న!

ముక్కుపొడుం పెట్టండని వేధించినా, పిచ్చి ప్రశ్నలతో బాధించినా, ఆ పాలేళ్ళకి, ఆ కాలక్షేపంరాయుళ్ళకి నాన్నమీద ఏదో ఆత్మీయత అల్లుకొని ఉండేది. దాని అంతర్యం ఇంతవరకూ నాకు అంతుపట్టలేదు! రోడ్డుమీద నడుస్తూ ఎప్పుడైనా నాన్న కనిపిస్తే మన ఊరు రిక్షావాళ్ళు, రెండెడ్ల బండివాళ్ళూ. ఆపి, నాన్నని ఎక్కించుకొని వెళ్ళే వాళ్ళు. ఈ ఆత్మీయతలోని అంతర్యం ఏమో! అంతరార్థం ఏమో!

నాన్నకి అద్భుతమైన జ్ఞాపకశక్తి ఉండేది. వేదంలోని పన్నం పదిసంతలతో వచ్చేసేది! అందరికీ ఇరవై సంతలు అయితేకాని వచ్చేది కాదు. సుస్వరంగా చెప్పటం. నాన్నకు వెన్నతో పెట్టిన విద్య! పిత్రార్జితమైన ఆస్తి పూర్తిగా దక్కకపోయినా, నాన్నలోని జ్ఞాపకశక్తి పొల్లుపోకుండా మనందరికీ సంక్రమించింది. ఈ జ్ఞాపకశక్తే మనందరికీ విద్యాభ్యాసంలో విజయపతాకాలు ఎగుర వేయడానికి తోడ్పడింది.

నిస్సంగిగా ఉన్న నాన్నలో అద్భుతమైన సాంఘిక జీవన సామర్థ్యం ఉండేది. చుట్టుప్రక్కల ఊళ్ళల్లో చాలామంది ఇళ్ళకు వెళ్ళి, వాళ్ళని పేరుపేరునా పలకరించేవాడు. యోగక్షేమాలు ససందర్భంగా అడిగేవాడు. అందరి పేర్లూ, వాళ్ళవాళ్ళ స్వభావాలూ నాన్నకి కరతలామలకాలు! స్వభావాలు ఉటంకిస్తూ, పేర్లతో పిలుస్తూ, బంధుత్వంలోని వరసలు కలుపుతూ సంభాషించటంతో నాన్నమీద వాళ్ళకి అభిమానం అల్లుకొనేది. ఏ కారణంవల్లనైనా ఒక వారం నాన్న కన్పించకపోతే "ఏవిఁటీ ! సుబ్బన్నగారు ఈ మధ్య కనిపించటం లేదు?" అనే ఆలోచన వాళ్ళలో కలిగేలా మసిలేవాడు; మనసుల్లో కూర్చొనేవాడు!

చాలామంది ఆడవాళ్లకీ మగవాళ్ళకీ నాన్న ఆత్మీయుడు. ఫలాభిసంధి రహితంగా పలుకరించే పరమబాంధవుడుగా చాలామందికి ఉండేవాడు. వాళ్ళ అరుగులమీద రాత్రివేళ పడుకొనేవాడు. తెల్లవారేదాకా ఆ అరుగుమీదనే ఉంటాడనే. నమ్మకం లేదు. ఏ అంశానికీ కట్టుబడని ఆయన మనస్సు, ఆ అరుగుకు మాత్రం కట్టుబడుతుందా? పరమాత్మకు కట్టుబడ్డ పరమయోగి లోకంలో ఏ యితరానికీ కట్టుబడకపోవడం యథార్థం.

**ఆత్మా త్వం గిరిజా మతిః, పరిజనాః ప్రాణాః, శరీరం గృహం,**
**పూజాతే విషయోపభోగరచనా, నిద్రా సమాధిస్థితిః ।**
**సంచారః పదయోః ప్రదక్షిణవిధిః స్తోత్రాణి సర్వాగిరః**
**యద్యత్కర్మ కరోమి తత్తదఖిలం శంభో! తవారాధనమ్॥**

(–శివమానసపూజా)

"ఓ ఈశ్వరా! నాలోని జీవుడే నీవు. నా బుద్ధి నీ యర్ధాంగి. నా ప్రాణములే నీ పరిజనులు. నా శరీరమే నీ గృహం. నా పంచేంద్రియ అనుభూతియే నీకు పూజ, నిద్రయే నాకు సమాధ్యవస్థ. నా పాద సంచారమంతయు నీ ప్రదక్షిణ విధానం. నా మాటలన్నియును నీ స్తోత్రములే! నే నే పనిచేసినా అది నీ ఆరాధనమే పరమశివా!!"

– అన్నట్లుగా నాన్న మనస్సు లోకాతీతస్థితిలో పరమాత్మయందు సర్వదా లగ్నమై ఉండేది – అనటం నిర్వివాదం!

ఎక్కడికో పోకడ? ఎందుకో? అక్కడ ఎంతసేపు ఉంటాడో? ఎప్పుడు బయలు దేరుతాడో? ఆ పరమాత్మకే తెలియాలి! దారిలో ఒక కాలువలోనో, చెఱువులోనో సచేలస్నానం చేయటం, నెత్తిమీద తడిగుడ్డ పెట్టుకొని, వేదపఠనం చేసుకొంటూ, ఆ భగవంతుడు తీసికొనివెళ్ళిన ఇంటికి వెళ్ళి, వాళ్లు పెట్టింది తృప్తిగా తినేవాడు. రుచిపచులతో సంబంధం లేదు. గుణాతీతుడికి రుచులతో ఆలోచన ఏమిటీ? అక్కడ భోజనం చేసి, వాళ్ళ కుటుంబ క్షేమసమాచారాలు మాట్లాడి, వాళ్ల బంధువుల ఇళ్ళకు తాను వెళ్ళినప్పుడు ఆ యోగక్షేమాలు ఆప్యాయంగా అందించేవాడు. మళ్ళీ ఇక్కడి నుంచి చెడ్డలు అక్కడ అందంగా చెప్పేవాడు. అంతేకాని రాజకీయానికీ, విరోధానికీ సంబంధించిన మాటలు చెప్పే వ్యక్తిగా నాన్నకి పేరులేదు.

ఆ కాలంలో గ్రామాలలో చాలామంది సోమరులుగా ఉండేవారు. ఎంతో కొంత భూవసతి, ఇళ్ళు వాకిళ్ళు ఉండటంవల్ల, నిమ్మకు నీరెత్తినట్లుగా స్థిమితంగా వీథి అరుగుల మీద సభతీర్చి కూర్చొనేవాళ్ళు. ముక్కుపొడుం అభ్యాసం లేకపోయినా ముక్కుపొడుం పీల్చే అలవాటున్న వాళ్ళు కనిపిస్తే అరచేతులు చాచేవారు. నాన్న వాళ్ళకి ముక్కుపొడుం పెట్టడంతోను, బాంధవ్యంతోను, మాటలతోను, వేదాధ్యయనంతోను, ఆభిజాత్యంతోను, అభిమాన స్థానంలో ఆసీనుడై ఉండేవాడు. నాన్న ఎవరింటికి వెళ్ళినా, వాళ్ళు విసుక్కోకుండా భోజనం పెట్టేవాళ్ళు. "ఆయన అన్నంలేనివాడా? ముప్ఫై ఎకరాల జగ్గన్నగారి కొడుకు! మంచి బ్రాహ్మడు! వేదం చదువుకొన్నవాడు. కల్లాకపటం లేనివాడు. సద్బ్రాహ్మణుడు. ఈయన తండ్రి జగ్గన్నగారు నిరతాన్నప్రదాత. ఎవ్వరు ఏవేళవచ్చినా లేదనకుండా అన్నదానం చేసే మహనీయుడు. ఆయన కొడుకు ఈయన!" ఈ విధంగా ఉండేవి నాన్న అర్హతలు, కితాబులు!

పెద్దక్కయ్య అత్తవారి ఊరు కాకరపఱ్ఱు. 15 సంవత్సరాలకే పెద్దక్కయ్య కాపురానికి వెళ్ళింది. నాన్నతో కాకరపఱ్ఱుకు సుబ్బారావూ నేనూ వెళ్ళేవాళ్ళం. నాకు ఎనిమిదేళ్ళు. సుబ్బారావుకు నాలుగేళ్ళు. చిన్నవాడవడంవల్ల వాడిని బుజాలమీద ఎక్కించుకొని నడిచేవాడు నాన్న. నేను వెనకాల నడిచేవాడిని. "బుజాల మీద ఉన్నవాడు నా కొడుకు" అనే ఆత్మీయతకాని, "అయ్యో! వీడు వెనకాల నడవలేక పోతున్నాడేమో!" అనే దిగులుకాని నాన్నలో ఉండేవి కావు. ఏదో ఒక పన్నం ఏకరువు పెడుతూ, నిష్కామకర్మగా, "భూపయ్య కాలువ గట్టువెంటే సాగిపోయేవాడు నాన్న.

"ప్రపంచాన్ని పట్టించుకొన్నవాడు ఎవ్వడూ బాగుపడలేదు; పట్టించుకోనివాళ్ళే పరమార్థం అందుకొన్నారు; పరమాత్మకు ఆత్మీయులయ్యారు" – అనే సత్యం ఎన్ని జన్మలనుండి నాన్నను వెన్నంటి వస్తోందో! ("బహూనిమే వ్యతీతాని జన్మాని తవ చార్జున!").

మన పెద్దత్త సత్తెమ్మగారు తన భర్తను (గోపాలం మామయ్యను) నాన్నను. తులనాత్మకంగా పోల్చి చెపుతూ "మా ఆయనకంటే మా అన్నయ్యే నయం! ఏ ఊరు వెళ్ళినా ఎక్కడో ఒకచోట భోజనం చేసేస్తాడు. ఉపోషాలు ఉండడు. మా ఆయనకి మా అన్నయ్యకున్న తెలివిలేదు. ఏ ఊరేనా వెళితే ఉపోషంతో వస్తారు!" అని తన భర్తను అభిశంసిస్తూ నాన్నని అభినందించేది. నాన్నని తెలివైనవాడుగా నిరూపించేది. అధ్యాత్మజ్ఞాననిత్యుని అధిగమించేవాళ్ళు ఉండరు!

చిన్నతనంలో నాన్న తన తల్లిదండ్రుల దగ్గర కూర్చొని ఉన్నాడట. అక్కడకు వచ్చిన ఎవరో నాన్నను ఉద్దేశించి "ఇంత తెలివితక్కువవాడికి పిల్లని ఎవరిస్తారు? పెళ్ళి ఎలా అవుతుంది?" అన్నారట. అప్పుడు జగ్గన్నతాత "ఘటన ఉంటే అదే అవుతుంది!" అన్నాడట. ఆ తరువాత ఎవరు ఈ ప్రశ్నవేసినా "ఘటన ఉంటే అదే అవుతుంది!" అని ఠకీమని అనేవాడట నాన్న! ఏమాట ఏవిధంగా వాడాలో తూకం తూచినట్లు వాడటం నాన్నలోని ప్రత్యేకత.

నాన్న ఒకసారి లక్షిందేవమ్మ (లక్ష్మీదేవమ్మ) గారింటికి (రేలంగి) వెళ్ళాడు. (లక్ష్మిందేవమ్మగారు నాన్నకి మేనత్తయైన రాజమ్మగారి కూతురు). పదిగంటలవేళ అది. నాన్న లోపలికి వెళ్ళి, ప్రక్కవాటాలో ఉన్న కంభంపాటి సుబ్రహ్మణ్యంగారి భార్యను ఉద్దేశించి, "అమ్మాయీ! తొందరగా వంట చేసెయమ్మా! ఈలోగా సంధ్యావందనం పూర్తిచేసుకుంటాను" అన్నాడు. వెంటనే ఆవిడ "మీ మేనత్త కూతురుండగా, నేను మీకు వంటచేసిపెట్టటం ఏమిటండీ?" అంది. ఆ ప్రక్కనే వుంది లక్ష్మిదేవమ్మగారు. వెంటనే నాన్న అన్నాడు "ఆ లక్షిందేవి ఒకప్పుడు వండి ఏడ్సిందేమిటి? దాన్ని నమ్ముకొని రాలేదమ్మా!" అనగానే, మేనమామ కొడుకు మాటలకి నవ్వుకుంటూ లక్షిందేవమ్మగారు ఒక పీటవేసింది – సంధ్యావందనం చేసుకోటానికి. తడిబట్ట ఆరేసుకొని తడిఅంగవస్త్రంతో సంధ్యావందనం చేసుకొంటున్నాడు నాన్న. సుబ్రహ్మణ్యంగారి భార్య వంటచేసింది. పెరుగు, ఊరగాయలూ లక్షిందేవమ్మగారు అందించింది. హాయిగా భోంచేశాడు నాన్న.

మరోసారి కాకరపఱ్ఱులో చల్లా సీతారామయ్యగారు (పెద్దక్కయ్య పెదమామగారు) నాన్నతో "బావగారూ! ఈ వేళ మాయింటికి దేవతార్చనకి రండి!" అని పిల్చారు.

నాన్న వెళ్ళి వాళ్ల వసారలో కూర్చుని సంధ్యావందనం చేసుకొని వేదం ఏకరువు పెడుతున్నాడు. సీతారామయ్యగారు వియ్యంకుడుగారికోసం ఏదో కూరవండమని భార్యతో చెప్పి, కొబ్బరికాయ పచ్చడి కూడా చెయ్యమన్నాడు! (కొబ్బరి పచ్చడి ఆ రోజుల్లో చేసే పచ్చళ్ళలో గొప్ప! పెరుగుతో అయితే ఇంకా గొప్ప). కూరల్లో గుత్తివంకాయ కూర, కొబ్బరికోరు పొట్లకాయ కూర ఇలాంటివి గౌరవించదగిన వ్యక్తులకోసం చేసే ప్రత్యేక ఏర్పాట్లు! అగ్రం ఉన్న ఆకువెయ్యటం, వెండిపువ్వుల పీట, వెండిచెంబుతో మంచినీళ్ళు – కొన్ని ప్రత్యేకతలు!

వియ్యంకుళ్ళు భోజనం చేస్తున్నారు. ఆ యిల్లాలు వడ్డిస్తోంది. పప్పు అధ్యాయం అధిగమించి–కూరభాగం ముగించి, పచ్చడి అధ్యాయంలోకి వచ్చారు వియ్యంకుళ్ళు. కొబ్బరిపచ్చడి కలిపారు. ఆ యిల్లాలు సద్యోఘృతం వడ్డించింది – ధారాశుద్ధిగా! సీతారామయ్యగారు కొబ్బరిపచ్చడి అన్నం నెయ్యితో ఘుమఘుమగా రెండు ముద్దలు తిని, రుచిని అభినందిస్తూ – భార్యకేసి చూస్తూ "మా వెట్టిముండ పచ్చడి మహబాగా చేసిందండోయ్ బావగారూ! నెమ్మదిగా తినండి" అన్నారు. కొబ్బరి పచ్చడితో రెండు ముద్దలు తిన్నాడు నాన్న. ఇంకా కొంచెం కావాలని కోరిక కలిగింది నాన్నకి – "మీ వెట్టిముండ పచ్చడి చాలాబాగా చేసిందండీ! ఇంకొంచెం వెయ్యమనండి" అన్నాడు. మాయ తెలియని నాన్న మాటకు ఆయన గట్టిగా నవ్వేశాడు! ఆయన నవ్వులో భార్య నవ్వు పడుగులో పేక అయిపోయింది! ఈ సన్నివేశం నేను 1947లో కాకరపట్టు వెళ్ళినప్పుడు సీతారామయ్యగారి భార్య తన మధురస్మృతిగా చెప్పింది నాతో!!

నాన్న, తామరాకు మీద నీటిబొట్టులా సంసారంలో వున్నాడు. మట్టిలో కుమ్మరి పురుగులా సంఘంలో తిరిగాడు. కుచేలుడులా తన సంసారాన్నీ, బిడ్డల్నీ, తన సంక్షేమ సర్వస్వాన్నీ పరమాత్మ చేతిలో పెట్టాడు. "పెట్టాను!" అనే అహంకారం కూడా నాన్నకి లేదు. ఇలాంటి నిరహంకారి "నా బిడ్డల్ని ఇలా తీర్చు! నా కుటుంబాన్ని ఇలా ఉద్ధరించు!" అని దేవుణ్ణి మనసా వాచా కోరని తత్త్వజ్ఞుడు నాన్న! ఒక యోగారూఢుణ్ణి, ఒక గుణాతీతుణ్ణి ఒక స్థితప్రజ్ఞుణ్ణి పరమాత్మ ఎలా చూసుకొంటాడో అలా చూసుకొన్నాడు. పరమాత్మ నిర్ణయంముందు అహంకార విమూఢాత్ములు, అపకారపరాయణులు చేసిన ప్రతి క్రూరచర్యా నాన్న కుటుంబానికి శ్రీరామరక్ష అయింది! అభివృద్ధికి దోహదకారి అయింది! ఆత్మవిశ్వాసాన్ని పెంచింది! "శాపోపి సానుగ్రహః" – దశరథుడికి తగిలిన శాపం సత్సంతానప్రాప్తికి సోపానం అయినట్లు,

సంఘంలోని ప్రతి విద్రోహచేష్ట, నాన్న కుటుంబ ఇష్టార్థసిద్ధికి కారణం అయింది. దైవం బహువ్యక్తుల రూపంలో అభ్యుదయ పథం చూపించాడు. ఆ ఉత్తమ మార్గాలలో పయనించే శక్తినీ, కార్యదీక్షనూ ఇచ్చి, ముందుకు నడిపించాడు. మన బంధువుల్లో ఎవ్వరూ ఊహించని అభివృద్ధిని నాన్న కుటుంబానికి అందించి, ఆ పరమాత్మ "నేను ఉన్నాను" అన్నాడు నాన్నతో –

**"మూకం కరోతి వాచాలం – పంగుం లంఘయతే గిరిమ్**
**యత్కృపా తమహం వందే – పరమానంద మాధవమ్"** (–గీతామాహాత్మ్యం)

పరమాత్మ దయవుంటే మూగవాడు కూడా మాటలాడుతాడు! కుంటివాడు కూడా పర్వతాలు అధిరోహిస్తాడు! వెట్టిసుబ్బన్న సంసారం సారోదారంగా మారటంలో ఆశ్చర్యం లేదు! – అట్టి పరమాత్మ దయకు మరొక్కమారు అంజలి ఘటిస్తున్నాను!

(1999లో తమ్ముళ్ళు చిరంజీవులు సుబ్బారావు, భాస్కరరావు, కృష్ణమూర్తులకు చెప్పిన విషయాలు).

1. **పితామహుడు: కీ.శే. తంగిరాల జగ్గన్నశాస్త్రిగారు (క్రీ.శ. 1886–1958);** కాకుల ఇల్లిందలపఱ్ఱు, తణుకు తాలూకా, పశ్చిమగోదావరి జిల్లా, ఆంధ్రప్రదేశ్.

2. **మాతామహుడు: కీ.శే. భళ్ళమూడి కృష్ణమూర్తిగారు (క్రీ.శ. 1883–1944);** పెదవాడపల్లి, కొవ్వూరు తాలూకా, పశ్చిమగోదావరి జిల్లా.

3. **నిజానికి మనకు ముగ్గురు అక్కయ్యలు: పెదరామలక్ష్మి (1924–1998); చినరామలక్ష్మి (1926–1985); సోమిదేవమ్మ** (సోదులు). మన నాయనమ్మ పేరుపెట్టిన ఈ మూడవ అక్కయ్య నాలుగైదేళ్ళ వయసులోనే చనిపోయింది.

4. **ఐదవ అబ్బాయి:** చిరంజీవి జగన్నాథం. జగ్గన్నతాత పేరు పెట్టిన ఈ అబ్బాయి 1944లో మూడేళ్ళ వయసులో (అజీర్ణ విరేచనాలతో బాధపడి) ఇరగవరంలో చనిపోయాడు. ( లేకపోతే, మనం ఐదుగురు అన్నదమ్ములుగా ఉండేవాళ్ళం.)

5. **అశనిఖాతం: ఆశనిక + ఆర్తి = ఆశనికార్తి.** అశనము = అన్నము; ఆశనిక = అన్నసంబంధమైన; ఆర్తి = కాంక్ష. "ఆశనికార్తి" అనేపదం అమ్మ వ్యావహారిక భాషలో "అశనిఖాతం" అయిపోయింది!

# 5.4 శ్రీగురుభ్యో నమః (ఆచార్యదేవో భవ!)

## 5.4.1 'కులపతి' జటావల్లభుల పురుషోత్తంగారు:-

**"సద్ధర్మ సంరక్షక! శిష్యవత్సల! గురో జటావల్లభ పూరుషోత్తమ!**
**నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః! పునశ్చ భూయోపి నమో నమస్తే!!**

నొసట కుంకుమబొట్టు! బిళ్ళ మడత ఖద్దరు పంచె, లాల్చీ! మెడచుట్టూ, తీర్చిన జరీ అంచుల కండువా! అరంగుళం మాత్రం పొట్టిగా ఉంచిన శిరోజాలు! బ్రాహ్మణ చిహ్నమైన నాల్గుపరకల సిక! నగ్నపాదాలు! ("జంతు చర్మం, ధరించకూడదు!" అనే అహింసావాది). మధ్య మధ్య కళ్ళుమూస్తూ, మాట్లాడే ఆధ్యాత్మికత! కొండంతైన వారి వ్యక్తిత్వాన్ని చూపటానికి, అద్దంలాంటి ఈ కొద్ది మాటలు! వారే, జటావల్లభుల పురుషోత్తమ కులపతులు!

"హిందూమతం" అనే గ్రంథం రచించిన మతప్రవక్త! హిందూమత ధర్మాలు, జలపాతంగా ఉపన్యసించే మరో వివేకానంద! వారు విద్యాపీఠంలో, విధినిర్వహణం నూరుశాతంగా నిర్వహిస్తూ, సనాతన హిందూధర్మాలు ప్రచారం చేసేవారు. బ్రాహ్మణ సేవా సంఘాన్ని నవ్యోత్సాహంతో నడిపించేవారు. ప్రతి సంవత్సరం సనాతన ధర్మసభ ఆంధ్రదేశంలో ఒక్కొక్కచోట నిర్వహిస్తూ, కొంతమందికి శిక్షణ ఇచ్చేవారు. బ్రాహ్మణ సేవాసంఘాన్ని శాఖోపశాఖలుగా విస్తరింపజేశారు.

సనాతన ధర్మాలు - హిందూమతం - హిందూజాతి పరిరక్షణ - కులవ్యవస్థలోని ఆంతర్యం - బ్రాహ్మణజాతి కర్తవ్యం - వేద - శాస్త్ర - పండిత పరిరక్షణ- మొదలుగా హిందూజాతిని జాగృతం చేస్తూ - వివిధ ప్రదేశాలలో, ఎలుగెత్తి ఉపన్యసించేవారు. వారి ఉపన్యాసంలో, శ్రుతి - స్మృతి - పురాణ భాగాలు సాక్షీభవిస్తూ దొర్లిపోయేవి! తెలుగులోనే కాకుండా, ఇంగ్లీషులో కూడా అనర్గళంగా, ఆవేశంతో, కళ్ళు మూస్తూ తెరుస్తూ చెప్పే వారి ఉపన్యాసానికి, ఆ కాలంలోని ఆంగ్లభాషాపండితులు ఆశ్చర్యపోయి, అంజలి ఘటించేవారు.

1948 ప్రాంతంలో భారత ప్రభుత్వం "హిందూకోడ్ బిల్లు" ప్రవేశపెట్టింది. అభిప్రాయాలు తెలుసుకోవటంకోసం, దేశంలోని వివిధ ప్రాంతాలనుండి, ప్రముఖుల్ని ఢిల్లీకి ఆహ్వానించారు. ఒక్కొక్కరికి ఐదు నిమిషాల సమయం మాత్రం ఇచ్చారు. మన పురుషోత్తంగారు వేదాలతో ఎత్తుకొని, ఉపనిషద్వాక్యాలు ఉదాహరిస్తూ, ఇంగ్లీషులో వివరిస్తున్నారు. శివసముద్ర జలపాతంగా సాగిపోతోంది వారి ఉపన్యాసం! ఐదు నిమిషాల సమయం అయిపోయింది. విస్తుపోయి వింటున్నాడు నెహ్రూ పండితుడు!

సమయం మించుతున్నానని జంకుతున్న పురుషోత్తంగారిని "యస్! యస్! ప్రొసీడ్ ఆన్! ప్రొసీడాన్!!" అంటూ 30 నిమిషాలు విన్నాడు భారత ప్రథమ ప్రధానమంత్రి! అది వారి గొప్పతనానికి జయపతాక!

1947 నాటికి – ఋగ్వేద – యజుర్వేద – సామవేదాలు మూడే ప్రచారంగా ఉన్నాయి. ఎక్కడో ఉత్తర భారతంలో అధర్వణవేదపండితుని ఉనికిని పట్టుకొన్నారు మన పురుషోత్తంగారు! ఇక విద్యార్థి కావాలి! తణుకు తాలూకాలోని "ఇరగవరం" వచ్చారు. నేను "ఇల్లిందలపఱ్ఱు" వాడను అవటంవల్ల వారితో వెళ్ళాను. అక్కడ "తంగిరాల బాలగంగాధరశాస్త్రి" అనే 27 ఏళ్ళ యువకుణ్ణి ఎన్నిక చేసి, అధర్వణ వేదాధ్యయనంకోసం పంపించారు. వారి వేదశాస్త్ర పరిరక్షణ ఆసక్తి అలాంటిది! (ఈ బాలగంగాధరశాస్త్రిగారు, తూర్పుగోదావరి జిల్లాలో కపిలేశ్వరపురంలో వేదపాఠశాలను నిర్వహించి, వేదప్రచారం చేసి, ఇటీవలనే అస్తమించారు.) అధర్వణవేదాన్ని పునరుద్ధరించిన పుణ్యాత్ములు మన పురుషోత్తంగారు!

సనాతన ధర్మశాస్త్రాలు, ఉపనిషత్తులు పూర్తిగా ఆకళింపు చేసికొన్న పండితులైనా, వారు, వేదోపనిషిద్ధర్మశాస్త్రాల విషయంలో, నిరంతర విద్యార్థిగానే ఉండేవారు. 1944 ప్రాంతంలో మన గీర్వాణపీఠ వేదపండితులైన, బ్రహ్మశ్రీ "కొంపెల్ల సత్యనారాయణ శాస్త్రి" గారి దగ్గర ఉపనిషత్తులు చదవటం – నాటి విద్యార్థులమైన మేము చూచిన విషయం! వారి జిజ్ఞాస అలాంటిది!

శ్రీ పురుషోత్తంగారు విద్యార్థుల్ని "ఏరా!" అని సంబోధించేవారు. ఆ పిలుపులో, తండ్రియొక్క వాత్సల్యం, తల్లియొక్క మమతానురాగాలు తొణకిసలాడేవి! ఏ విద్యార్థికి ఆ విద్యార్థి "నేనంటే పురుషోత్తంగారికి అభిమానం" అనుకొనేవాడు. అందరు విద్యార్థుల్నీ హృదయానికి హత్తుకొనే, అవధిలేని శిష్యవాత్సల్యం వారిది!

కాకినాడలో, పురుషోత్తంగారి అత్తమామలు ఉండేవారు. వారి ఏక పుత్రిక అగుటవల్ల, మన గురుపత్నిగారు మధ్య మధ్య కాకినాడలో పిల్లలతో ఉండేవారు. ఆ సమయంలో "శ్రౌతి" అనే ఒక విద్యార్థి (యజ్ఞయాగ నిర్వహణం అభ్యసించినవాడు. శ్రౌతము = యజ్ఞమంత్ర విభాగము) ఉండేవాడు... వాడు పాకశాస్త్ర అనుభవం ఉన్నవాడు. వాడే తరచుగా గురువర్యులకు వండిపెట్టి, వారితోనే ఉండేవాడు. "వంటలో నైపుణ్యం ఉన్నవాడు సోమయాజులు" అని ఎవరో వారికి చెప్పారు. అప్పుడప్పుడు ఆ బాధ్యత నాకు అప్పగించేవారు. "బాగా చేశావురా!" అనే అభినందనాత్మక ఆశీస్సు పొందిన అదృష్టవంతుణ్ణి నేను!

రాత్రివేళ 8 గంటలలోపు వారి భోజనం అయిపోయేది. వారు మంచంమీద పరుండేవారు. విద్యార్థులు నలుగురు, ఐదుగురం చుట్టూ చాపలమీద పరుండేవాళ్ళం! గంటపైగా భూప్రదక్షిణం (లోకాభిరామాయణం) జరిగేది. టైము 9.30 కాగానే "చెప్పండ్రా!" అనేవారు. ఒకడు "హరేరామ హరేరామ, రామరామ హరేహరే! / హరేకృష్ణ హరేకృష్ణ, కృష్ణకృష్ణ హరేహరే!" అని చెప్పేవాడు. అందరం అనేవాళ్ళం - ఇక మాట్లాడకూడదు! నిద్రలోకి వెళ్ళిపోయేవాళ్ళం! "ఒక రోజును - దైవ స్మరణతో ఆరంభించు! దైవస్మరణతో ముగించు!" (Start everyday with a prayer to God and end the day with a prayer!) - అనే సూక్తిని మాకు అభ్యాసము చేయించిన ఆచార్యులు పురుషోత్తములు!

భోజనంలో వారికి, పప్పు-కూర-ఒక ఊరగాయ - పులుసు-పెరుగు ఉండాలి. (ఐదంకాల నాటకంలాగ). నెయ్యి ధారాశుద్ధిగా వేసుకొనేవారు. 30 నిమిషాలు ప్రశాంతిగా, తృప్తిగా భోజనం చేసేవారు! "మీరు భోజనంలో చాలా శ్రద్ధ తీసుకొంటున్నారు. చాలామంది ఇంత శ్రద్ధ తీసుకోరు!" అన్నాను వారితో. "శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్ = శరీరాన్ని పోషించుకొన్నవాడే పురుషార్థాలు సాధించుకోగలడు. "శరీరస్య అభావే సర్వాఽభావః" అన్నారు. 'నిద్రాహారాలు శరీరాన్ని తేజస్వంతంగా నడిపిస్తాయి' అనే సత్యం, ఆనాటినుండి నన్ను అనుక్షణం నడిపిస్తోంది.

"వాగ్వర్ధనీ సమాజం" అనే పేరుతో ప్రతివారం సమావేశం ఉండేది! మొత్తం విద్యార్థులు ఒకచోట సమావేశం అయ్యేవాళ్ళం! అధ్యక్షుని బాధ్యతలు - సభానిర్వహణ క్రమం - ఉపన్యాసం చెప్పే విధానం - చెప్పదలచిన విషయానికి అనుబంధంగా బలమైన అంశాలు ఎలా ప్రతిపాదించాలో, అన్నీ వివరించేవారు. ముగింపులో ఒకడి చేత కృతజ్ఞతలు చెప్పించేవారు. అధ్యక్షుని తొలిపలుకులుండేవి. అధ్యక్షులు చివరలో అందరి ఉపన్యాసాలమీద అభిప్రాయాలు చెప్పేవారు. (అధ్యక్షులు, ప్రిన్సిపాలుగారే!). ఉపన్యాసం బాగుంటే - ఎందుకు బాగుందో; చెడిపోతే దానికి కారణాలు ఏమిటో వివరించేవారు. ఈ విధంగా ఉపన్యాస విన్యాసంలో మాకు తరిఫీదు ఇచ్చేవారు. "బాల్యవివాహాలు: మంచివా? కావా?" - "స్త్రీ పునర్వివాహం" - "స్త్రీ విద్య" - "ఏకస్వామ్యమా? ప్రజాస్వామ్యమా?" - ఇలాంటి విషయాలు ఆ రోజుల్లో చర్చనీయాలుగా ఇచ్చేవారు. మాలో, చాలామంది ఈనాడు ఉత్తమ ఉపన్యాసకులుగా సభాగౌరవాన్ని పొందటానికి, ఆనాటి మా గురువర్యుల శిక్షణయే కారణం!

"సనాతనధర్మప్రచారం" - "సంరక్షణ" వారి జీవితలక్ష్యాలు! హిందూమతానికి, ఏ కోణంలో అవమానం జరిగినా వారు సహించేవారు కారు! వారు, రాజీపడని

అహింసావాది! "జంతుచర్మాలలో, చచ్చిపోయిన జంతుచర్మాలు గట్టిగా ఉండవు! బ్రతికి ఉన్న జంతువుల్ని (ఆవుల్ని-గేదెల్ని- జింకల్నీ) చంపి, తీసిన చర్మాలకు మన్నిక ఎక్కువ! మనం వాడే చర్మాలన్నీ చంపిన జంతువులవే!" అని అంటూ, వారు పాదరక్షలు లేకుండా నగ్నపాదాలతో సంచరించేవారు. అప్పుడప్పుడు టైరుచెప్పులు తొడిగేవారు (60 ఏళ్ళ క్రిందట ప్లాస్టిక్ చెప్పులు ప్రచారంలోకి రాలేదు). నమ్మిన సత్యాన్ని ఆచరిస్తూ జీవించిన ఒక పురాణ పురుషోత్తముడు మా పురుషోత్తంగారు.

గురువర్యుల ఉపన్యాసం, మన ఊళ్ళోకాని, రాజమండ్రిలో కాని "సభ ఉన్నది!" అని తెలిస్తే మా పీఠం విద్యార్థులం వెళ్ళేవాళ్ళం. అక్కడ వారు చెప్పే తీరు సందర్భానుసారంగా, మంద్ర-మధ్యమ తారస్థాయిలలో, ఆవేశంతో, వారు చెప్పే విధానం "సెలైను ఎక్కినట్లు" శ్రోతలకు ఎక్కిపోయేది! హిందూమతానికీ - సనాతన ధర్మానికి ఆఘాతం వచ్చిన సన్నివేశాలలో, గురుపర్యులది సింహగర్జనమే! వివేకానంద పూనకమే! సభ ఆవేశంతో ఊగిపోయేది! కరతాళధ్వనులు మారుమ్రోగేవి. ప్రశంసల మెరపులు మా ముఖాలమీద పడేవి! "అంతటి సభాభినందనాలు పొందుతున్న దేశికోత్తముని శిష్యులం మేము!" అని మేము ఉప్పొంగిపోయేవాళ్ళం!

పురుషోత్తంగారు "అటుగద్వా లిటు చెన్నపట్టణము మధ్యంగల్గు" ఆంధ్రావనిలో, సనాతనధర్మ ప్రచారకులు - హిందూమత ప్రబోధకులు - సమర్థులైన బహుముఖ ప్రజ్ఞావంతులు కావటంవల్ల, మన పురుషోత్తంగారిని ఎఱుగనివారు లేరు! వారు జగమెఱిగిన బ్రాహ్మణులు! అట్టి పురుషోత్తముడు "గురువంచు చెప్పికొనగా నది గొప్ప తెనుంగునాడునన్ !"

## 5.4.2. 'కులపతి' కేశిరాజు వేంకట నృసింహ అప్పారావుగారు:-

**"గాంధీసూత్ర సమగ్రపాలన విధౌ, నిశ్చంచల స్సాత్వికః**
**స్నేహ ప్రేమ విధాన బోధన కళాచాతుర్య ధుర్యో మహాన్!**
**గీర్వాణాంగ్ల త్రిలింగ హింది సుమనః శ్రీ 'కేశిరాజా'న్వయః**
**'అప్పారాయ' సుధీమణి ర్విజయతాం సర్వాత్మనా వర్ధతామ్"**

(1948లో వారిపై భక్తితో ఆనాడు వ్రాసికొన్నది)

ఖద్దరు లాల్చీ - పంచె -భుజంపై కండువా. పంచెకు కండువాకు అంచులు కన్పించేవి కావు! కాళ్ళకు చెప్పులు - చేతిలో గొడుగు! ఇది అప్పారావుగారి బాహ్యాకృతి. గాంధీ సూత్రాలు అమలుపరచటంలో ఎక్కడా రాజీపడని సర్వోదయ సిద్ధాంతం వారిది! గాంధిజీ అడుగుజాడల్లో జీవితం నడిపించుకొన్న ఆదర్శమూర్తి! సత్యం - అహింస,

త్యాగం-పవిత్రత-శాంతం-సహనం మొదలైన గాంధీజీ లక్షణాల సమ్మేళన స్వరూపమే మా అప్పారావుగారు. విద్యార్థుల్ని "ఏమి అయ్యా!" అని పిలిచేవారు. ఒక తండ్రి తన పుత్రునిలో తన అయ్యను సంభావించుకొని పిలిచినట్లుగా ఉండేది వారి సంబోధనం. వారి మందలింపు, పైకి మెత్తగా కన్పించినా, వాడిగా విద్యార్థుల గుండెలు కదలించేది.

విద్యకు ఎంత ప్రాధాన్యం ఇచ్చేవారో, ప్రవర్తనకు కూడా అంతటి ప్రాధాన్యం ఇచ్చేవారు. "విద్యలో అభివృద్ధిని సాధిస్తూ, ప్రవర్తనను ఎప్పటికప్పుడు సరిదిద్దుకొంటూ ఉండాలి!" అనేవారు. "విద్యార్థులు వస్త్రధారణలో కూడా, ఔచిత్యాన్ని అనుసరించాలి!" అని బోధించేవారు. గాంధీజయంతి రేపనగా సూత్రయజ్ఞం నిర్వహించే విధానం చెప్పేవారు. అందరి రాట్నాలు సరిచేసుకోమనేవారు. గాంధీ జయంతినాడు ఉదయం 6 గంటల నుండి సాయంత్రం 6 గంటల వరకు నిర్విరామంగా నూలువడికేవాళ్ళం. సాయంకాలం 6.00 గంటలకు గాంధీజీ వ్యక్తిత్వంగురించి గురువర్యులు వివరించేవారు!

వినోబాభావే "భూదానోద్యమం" నిర్వహిస్తూ కొవ్వూరు వచ్చారు. "భూస్వాము లందరూ, తమ భూమిలో 1/3 వంతు స్వచ్ఛందంగా దానం చెయ్యవలసిందిగా" వారు భూస్వాముల్ని అభ్యర్థిస్తున్నారు. మన గురువర్యులు తమకున్న 21యకరాల భూమిలో మూడవవంతుగా ఏడు యకరాల భూమిని వినోబాభావేకు సమర్పించారు. వారి ఆచరణాత్మక త్యాగజీవితం నిరుపమానం.

1942 ఆగస్టు విప్లవంలో పాల్గొని లాటీశిక్షను అనుభవించారు. పోలీసులు అప్పారావుగారిని లాటీలతో కొట్టినప్పుడు, వారి కళ్ళజోడు దూరంగా పడింది. ఆ సమయంలో 14 ఏండ్లవాడైన మా సహాధ్యాయి "నెమ్మలూరి వెంకట్రామయ్య" ఆ కళ్ళజోడు తీసి వారికిచ్చాడు. ఈ సన్నివేశం వెంకట్రామయ్య నాతో చెప్పాడు. రెండు సంవత్సరాలకు పైగా వారు కారాగారశిక్షను అనుభవించిన దేశభక్తులు!

1944లో "నేతాజీదళం" అనే పేరుతో, మమ్మల్ని తెల్లవారు జామున రమ్మని, అప్పటి బస్‌స్టాండు ఖాళీప్రదేశంలో మాకు "యోగాసనాలు" నేర్పేవారు. స్వాతంత్ర్య సమర సైనికులు ప్రతిగ్రామంలోను దళాలుగా ఏర్పడి గాంధిజీ పిలుపును అమలు పరచటానికి సంసిద్ధులుగా ఉండాలని వారి ఉద్దేశం. వారి ప్రబోధం కూడా అదే!

విద్యావిషయంలో లోటు రానీయకుండా, బాధ్యతవహిస్తూ, దేశభక్తిని విద్యార్థులలో పెంపొందింపజెయ్యాలని వారి సంకల్పం. మాలో చాలామందికి, ఖద్దరు ధరించటం - నూలువడకటం - గాంధి సిద్ధాంతాలకు లోబడి బ్రతకటం - అనే ఉత్తమ లక్షణాలు

అలవడటానికి కారణం అప్పారాయ గురుపర్యులే! దానము–త్యాగము ఆచరణాత్మక ప్రబోధము – సత్ప్రవర్తన – అనే పదాల వర్ణక్రమం చేయిపట్టుకొని దిద్దించిన సద్గురువులు అప్పారావుగారు!

"కోరిన విద్యలకెల్ల నొజ్జయై యుండెడి" గణపతిదేవుని నవరాత్రులు ప్రత్యేక శ్రద్ధతో నిర్వహించటం మన పీఠంలో అనాదిగా వస్తున్న ఆచారం! ఆ తొమ్మిది రోజులు, సంగీత సాహిత్యాలకు సంబంధించిన సభలు జరిగేవి! దేశంలో పేరు ప్రఖ్యాతులు – గడించిన ప్రముఖుల ఉపన్యాసములు – సంగీతసభలు – పీఠంలో మారుమ్రోగేవి! నిర్వహణ బాధ్యత విద్యార్థులకు అప్పగించి, కులపతులు సారథ్యం వహించేవారు. ఒకరోజు అష్టావధానం కూడా జరిగేది! మరొకరోజు "విద్యార్థి స్వశక్తి ప్రదర్శనము" అని కేటాయించేవారు. ఒక సంవత్సరం "ఆకెళ్ళ సుబ్బారావు" (కళాశాల విద్యార్థి) హరికథ చెప్పాడు. మరో సంవత్సరం అప్పారావుగారు అనువదించిన అభిజ్ఞాన శాకుంతలం చతుర్థాంకం ప్రదర్శించటం జరిగింది! "పప్పు కన్నారావు" రచించిన "భరతమాత" అనే నాటక ప్రదర్శనం అప్పారావుగారి పర్యవేక్షణలోనే జరిగింది.

అప్పారావుగారి మందలింపులోని అందానికి ఒక సన్నివేశం:– "చరిత్ర పునరావృతం కాక తప్పదు!" అన్నాడొక తత్త్వవేత్త! విరాటపర్వగాథలా జరిగిన ఒక సంఘటన. ఒక విద్యార్థి గోదావరికి మంచినీళ్ళకు వెళ్ళే యువతిని అనుసరించాడు. ఆమె సమ్మతిస్తూ సంకేతస్థానంగా గోదావరి ఒడ్డున ఉన్న "కబేళా" (పశు వధశాల)కు రాత్రికాగానే రమ్మన్నది. మసక మసక చీకటిలో వెళ్ళి, చెయ్యి విరగ్గొట్టుకొని వచ్చాడు. కట్టుకట్టిన చేతితో, తలవంచుకొని తరగతిలో ప్రవేశిస్తున్న ఆ యువకుణ్ణి చూస్తూ అప్పారావుగారు ''ఉమ్మస్సు'' అన్నారు. తరగతిని నిశ్శబ్దం ఆక్రమించింది. తలవంచుకొన్నాడు ఆనాటి అమాయక అభినవ కీచకుడు!

"ఉమ్మస్సు" అంటే "పొగరు" అనే అర్థంలో ఉభయ గోదావరిజిల్లాల్లో వాడుక ఉంది. "ఉమ్ర" అంటే ఉర్దూలో "వయస్సు" అని అర్థం. "ఉమ్ర" అనే ఉర్దూ పదానికి, "వయస్సు"లోని చివరి అక్షరం చేర్చి, ఈ అన్యదేశ్య పదానికి మన భాషలో స్థానం కల్పించారు గ్రామ్యభాషాస్రష్టలు.

**"యౌవనం–ధనసంపత్తిః ప్రభుత్వ మవివేకితా**
**ఏకైకమప్యనర్థాయ, కిముయత్ర చతుష్టయమ్"**

అన్నాడు హితోపదేశకర్త, అనర్థం కల్గించేవి నాలుగు – అని చెప్పుచు అందులో "యౌవనం" ముందుగా పేర్కొన్నాడు. అదే మన గురువర్యులన్నారు. "ఉమ్మస్సు"

చాలా ప్రమాదం! మృత్యువును కల్పిస్తుంది! బ్రతికిపోయావు! జాగ్రత్తగా బ్రతుకు! అనే హెచ్చరిక గురుపర్యుల మందలింపు మూడక్షరాలలో ఇమిడి ఉంది.

ఎలాంటి తెలివితక్కువనైనా మన అప్పారావుగారు సహిస్తారు. కాని ప్రవర్తనలో లోపం కన్పిస్తే, వారు రాజీపడలేరు! నైతిక విలువలు లేనివాడు ఎంత ఎత్తుకు ఎదిగినా, వాడు పాతాళంలో ఉన్నట్లే!

రామాయణ-భారత-భాగవతగాథల అంతరార్థాలు వేలాది శ్రోతలు నిండిన మహాసభలలో – నిశ్శబ్దాన్ని చీలుస్తూ, విలక్షణమైన గొంతుతో – –సభ్యుల గుండెలకు హత్తుకొనేలా చెప్పేవాడు ఆ రోజుల్లో ఒక ప్రతిభావంతుడైన వక్త; పండితవంశంలో పుట్టిన ఒక ప్రసిద్ధ రచయిత. అతని పురాణప్రవచనం శ్రోతల్ని మంత్రముగ్ధుల్ని చేసేది! రేడియోలో "ధర్మసందేహాల"కు సమాధానాలు ఇవ్వటంలో – సమయస్ఫూర్తి, బహుముఖ ధర్మశాస్త్ర పరిజ్ఞానం ప్రస్ఫుటమయ్యేవి!

మన అప్పారావుగారు ఒకప్పుడు కొవ్వూరులో ఆ వ్యక్తి ఉపన్యాసం విన్నారు. రేడియోలో ధర్మసందేహాలు కార్యక్రమం వింటూ విస్తుపోతున్నారు. ఆ వ్యక్తిని కలిసి మాట్లాడాలనే కోరిక ఏర్పడింది – వారికి!

ఒకసారి మన అప్పారావుగారు, ఏదో పనిమీద విజయవాడ వెళ్ళారు. రేడియో స్టేషనుకు వెళ్ళి ఆ వ్యక్తిని చూచి పోవాలనే కోరిక కల్గింది. ఒక శిష్యుణ్ణి వెంట పెట్టుకొని రేడియో స్టేషనుకు వెళ్ళారు. అక్కడ ఉన్న ఒకర్ని "ఫలానావారు ఎక్కడ ఉంటారు?" అని ప్రశ్నించారు. ఇరవైగజాల దూరంలో, ఒక లాల్చీ, పంచె ధరించిన వ్యక్తి, వ్రేళ్ళమధ్యన సిగరెట్టు పెట్టి, వదులుగా బిగించిన గుప్పిటిలోంచి గట్టిగా దమ్ము పీల్చి ఊదుతూ ఉన్నాడు. అడగబడిన వ్యక్తి ధూమపానం చేస్తున్న ఆ వ్యక్తినే నిర్దేశిస్తూ "ఆయనే మీరడిగిన మనిషి!" అన్నాడు. ఆ వ్యక్తిని చూచిన కళ్ళతో, వెంట వచ్చిన విద్యార్థి కళ్ళలోకి చూచారు. గిరుక్కున వెనక్కి తిరుగుతూ "గంధపు చెక్కలు మోస్తున్న గాడిదరా వీడు! రా! పోదాం!" అంటూ బయటకు వచ్చివేశారు. వారు ఆ వ్యక్తిని చూచి పల్కిన 12 అక్షరాల ఆంతర్యం గమనిద్దాం!

**"యథా ఖర శ్చందనభారవాహీ, భారస్య వేత్తా న తు చందనస్య,**

**ఏవం హి శాస్త్రాణి బహూ న్యధీత్య, చార్థేషు మూఢాః ఖరవ ద్వహంతి.**

(–సుశ్రుతం, 4–3)

"మంచి గంధపు చెక్కలు మోస్తూ ఉన్న గాడిదకు, ఆ చెక్కల బరువే తెలియును కాని, చందన సుగంధము దానికి తెలియదు! అట్లే ఎన్నో ధర్మశాస్త్రములు పఠించియు,

వాటిలోని అర్థవిశేషములను ఎరుగనివారు కేవలం గాడిదలవంటివారే అగుచున్నారు!" ఇంతటి భావభారంతో ఉన్న శ్లోక ఆంతర్యాన్ని పండ్రెండు అక్షరాలలో ప్రకటించారు. "అల్పాక్షరములలో అనల్పభావ కల్పనం" అనటానికి ఇంతకంటె గొప్ప ఉదాహరణం ఉండదు! ఈ విషయం అప్పారావుగారిని అనుసరించిన సతీర్థ్యుడు చెప్పగా విన్నాను. సత్ప్రవర్తనకు ఇచ్చే విలువ, ప్రతిభాపాటవాలకు మన అప్పారావుగారు ఇవ్వరు! సత్ప్రవర్తన లేనివాడు ఎంతటి తిభావ్యుత్పత్తులున్న పండితుడైనా, వాడు పాకీదొడ్డిలో పడ్డ పండే – వారి దృష్టిలో.

ఒక సాయంవేళ – మరకలు, చిరుగులు ఉన్న బట్టలతో, తలమాసి, ఒళ్ళు మాసిన పిచ్చివాడు, మన గీర్వాణపీఠం ఎదురుగా నిలబడి ఆశువుగా పద్యాలు ఎలుగెత్తి చెప్తున్నాడు. విద్యార్థులంతా ఆ పిచ్చివాడిని చేరి – "రావూరి" మన "రావూరి" అంటున్నారు. ఈలోగా వెనుకగదిలో ఉన్న నా దగ్గరకు ఒకడు వచ్చి "రావూరి వెంకటేశ్వర్లు ఆశువుగా పద్యాలు చెప్తున్నాడు. ఒక్క పద్యానికి అర్థం చెప్పు చూద్దాం!" అన్నాడు – (ఏ పద్యానికైనా అర్థం చెపుతాను! అనే అజ్ఞాన అహంకారం ఉన్నవాణ్ణి నేను!). "రావూరి" నన్ను చూచి "సోమయాజులూ!" అన్నాడు. మళ్ళీ గురువుల మీద మన విద్యాపీఠం మీదా – అప్పారావుగారి మీదా – పద్యాలు కురిపిస్తున్నాడు. నేను తెల్లమొహం వేశాను.

పిచ్చివాడుగా వచ్చిన "రావూరి"లో తాండవిస్తున్న సరస్వతిని గమనించారు మన అప్పారావుగారు. పిచ్చివాడుగా ఉన్న రావూరిని ఒడిలోకి తీసుకొన్నారు. "శిష్యులన్న ఎడదంగల ప్రేముడి చెప్పలేని మెత్తన" మన అప్పారాయగురువర్యులది! "వాచ్మెన్"గా పెట్టి, వృత్తి కల్పించి, అన్నం పెట్టారు. ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠానికి వెలుగునిచ్చే పండితుడుగా రావూరి వెంకటేశ్వర్లును తీర్చిదిద్ది ఆశీర్వదించారు!

ఈ, మన, రావూరి వెంకటేశ్వర్లు ప్రభావంతో అష్టావధానులు శతావధానులు అనేకులు ఆవిర్భవించారు. (ఈనాటి ఉద్దండపండితుడు ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారు ఈ రావూరి వెంకటేశ్వర్లుగారి ప్రియశిష్యుడే!) అవధాన విద్యాగురువును ప్రతిష్ఠించి శాఖోపశాఖలుగా అవధానవిద్యను విస్తరింపచేసిన మహనీయులు మన అప్పారావుగారు!

అప్పారావుగారి అభిమాన విద్యార్థుల్లో ఒకడైన ముక్తేవి లక్ష్మణదాసు "లక్ష్మణ యతీంద్రుడు"గా – కొవ్వూరు మన "ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠం" వీథిలో – కాషాయాంబర – జటాధారిగా నడుస్తున్నాడు. గురువర్యులు అప్పారావుగారు ఎదురుగా

వస్తున్నారు. యతీంద్రుని చూపులు అప్పారావుగారి పాదాలమీద పడ్డాయి. చేతులు "ఐదు పది" కాబోతున్నాయి. నిగ్రహించుకొంటున్నాడు శిష్యయతీంద్రుడు – (యతి ఎవ్వరికీ నమస్కరింపకూడదు!). కింకర్తవ్యతావిమూఢుడైన లక్షణదాసు కొయ్యబొమ్మలా నిలబడ్డాడు. గురువర్యులు శిష్యయతికి పాదాభివందనం చేశారు. యతీంద్రుని కంటి నుండి గురుభక్తి బిందువులుగా జారింది. ఆ బిందువుల్ని ఏమనాలో, ఎవ్వరికీ అర్థం కాలేదు. అప్పారావుగారి సంస్కారం అలాంటిది. దరిలేని ఆదరం వారిది! వారి శిష్యవాత్సల్యం కొండంత! లక్ష్మణదాసును శిష్యుడుగా తీర్చిదిద్ది, ఆశీర్వదించారు పూర్వాశ్రమంలో. 'ఆశీర్వాదము కోరి వంగితి యతీంద్రా నన్ను దీవింపరా!' అంటున్నారు ఈ ఆశ్రమంలో. ఔచిత్యానికి ఆకారం మన అప్పారావు గారు! ఈ సన్నివేశం మన లక్ష్మణయతీంద్రులు స్వయంగా నాతో చెప్పాడు ఏలూరులో.

అప్పారావుగారు 34 ఏండ్ల వయస్సులో ఉండగా, వారిని నేను ఆశ్రయించాను. నన్నొక మనిషిగా తీర్చిదిద్దారు. నా పరిమిత శక్తితో ఈనాడు హిమాలయాన్ని అడుగుబద్ధతో కొలిచాను! వారి ఉత్తమ గుణతారకలు లెక్కించాను. సముద్రానికి ఏతం వేశాను!

**"అతడొక పవిత్ర ధర్మ దేవాలయమ్ము**
**అతడొక విచిత్ర విశ్వవిద్యాలయమ్ము**
**ఆ మహాశక్తి అంత, ఇంతంచు, తూచ**
**జాల, మతడొక పెద్ద హిమాలయమ్ము!!"**

(నేను 1957లో తణుకు పోస్టాఫీసులో గుమాస్తాగా చేరాను. అప్పుడు ఒకరోజు శ్రీ కేశిరాజు వేంకట నృసింహ అప్పారావుగారు కార్డులు కొనుక్కోవాలని మా పోస్టాఫీసుకు వచ్చారు. కౌంటర్‌లో నేను ఉన్నాను. వారిని చూచి భక్తితో లేచి నిలబడి, వారికి నమస్కరించి "నేను మీ శిష్యుడు టి.వి.కె. సోమయాజులు తమ్ముణ్ణండి!" అన్నాను. వారు ఎంతో సంతోషంగా నన్నుచూచి "ఓహో! అలాగా! పోలికే కాదు, గొంతుకూడా అచ్చం అలాగే ఉందే!" అని ఆశ్చర్యపోయారు. ఈ మధుర సంఘటన మా అన్నయ్యతో చెపితే ఎంతో సంతోషించాడు – తంగిరాల.)

## 5.4.3 వేదుల రామశాస్త్రిగారు:–

**"అనయ మధీతి లాలసుడు, ఆతడహోబల పండితీయ పా**
**ఠనమున మేటియౌ ఠవర! డాంబిక మాతని గర్భశత్రువై**

**జననుతుజేసి నిర్మల యశంబు గడించె – 'పదారువన్నె కుం**
**దనమున కెత్తు కెత్త'నుట తక్కువ చేయుట వాని ప్రజ్ఞకున్!".**

– అంటూ తండ్రిగారినిగూర్చి సూరిగారు చెప్పారు. శ్రీరామశాస్త్రిగారు సంస్కృతాంధ్ర సాహిత్యాలు పోతపోసిన నిండైన విగ్రహం! వ్యాకరణ విభాగంలో – ఎంతటి క్లిష్టప్రశ్న అయినా ఆలోచించవలసిన అవసరం వారికి ఉండేది కాదు! "రాఘవ పాండవీయం" – "హరిశ్చంద్ర నలోపాఖ్యానం" పాఠ ప్రవచనంలో శబ్దశ్లేష–అర్థశ్లేష–అభంగ, సభంగ శ్లేషలు – నిర్దిష్ట భావంవైపు నడపటంలో వారి ఉభయభాషా పాండిత్యప్రకర్ష విద్యార్థులకు అత్యాశ్చర్యం కల్గించేది. అచ్చుతెనుగు పదాలు పదచ్ఛేదం చేస్తూ. కవి హృదయాన్ని వివరించటంలో వీరికి వీరే సాటి. సంస్కృత – ఆంధ్ర వ్యాకరణాలు వారి జిహ్వాగ్రంమీద ఉండేవి. "మీ యిష్టం వచ్చిన వాక్యం ఇవ్వండి! మీకు కావలసిన భావం వచ్చే విధంగా అర్థం చెప్తాను!" అని శపథం చేసిన బుధవీరుడు ఆయన! "మేకాధీశ" అనే నాలుగక్షరాలలోనుండి 18 అధ్యాయాల భగవద్గీతను వివరించిన చర్ల భాష్యకారశాస్త్రిగారి మేనల్లుడు మన రామశాస్త్రిగారు! ("మేకాధీశ సుధీవరేణ్య భగినీ పుత్రో మహాశక్తిమాన్!"). ఎంతటి నారికేళపాక కవిత్వమైనా వీరికి, అది, కదళీపాకమే! అరటిపండు ఒలిచి చేతిలో పెట్టేవారు! ఆ రోజుల్లో భాషాప్రవీణలో "కవ్వడి కైవారం" అనే అచ్చుతెనుగు కావ్యం పాఠ్యభాగంగా ఉండేది. ఆ కావ్యపాఠనంలో ఇతర సంస్కృత కళాశాలల్లోని పండితులు చేతులెత్తి, "మావల్ల కాద"న్నారు. మన శాస్త్రిగారు కవి హృదయాన్ని ఆకళించుకొని బోధిస్తూ ఉంటే – "ప్రవల్హిక"ల్ని విప్పి చెప్పుతున్నంత హాయిని మన ఆంధ్రగీర్వాణ విద్యాపీఠ విద్యార్థులు పొందారు.

భారతంలో నన్నయ పద్యాలన్నీ కంఠస్థం చెయ్యాలనేవారు. వారి విద్యార్థులమైన మేము భారత పద్యాలు చాలావరకు కంఠస్థం చెయ్యటానికి వారి ప్రోత్సాహమే కారణం!

1911లో తిరుపతి వేంకటకవులు గీరతం వ్రాశారు. అందులో ఉన్న పర్వాలలో "కాకరపర్తి పర్వం"–"చప్పట్ల పర్వం"అనే రెండు పర్వాలున్నాయి. ఆ పర్వాలలో ఒంటరిగా వెళ్ళిన వెంకటశాస్త్రిగారిని, కాకరపఱ్ఱులో విద్యార్థులు అల్లరి చేశారు. అల్లరిచేసిన ఆనాటి నారాయణశాస్త్రిగారిశిష్యుల్లో మన రామశాస్త్రిగారు ఒకరు! అయినా, మన రామశాస్త్రిగారికి వెంకటశాస్త్రిగారి మీద సద్గురుభావం ఉండేది. తిరుపతివేంకటకవుల పద్యాలన్నీ వారు పిలిస్తే పలికేవి! గీరతం పద్యాలు–నానారాజ సందర్శన పద్యాలు ముందుగా వారి దగ్గర విన్నాకే మేము ఆయా గ్రంథాలలో చదివాము. తిరుపతి వేంకట కవుల పద్యాలు మేము వారి ప్రోత్సాహంతో కంఠస్థం చేశాము.

చెళ్ళపిళ్లవారు "ఆరామద్రావిడ" బ్రాహ్మణులు. "దివాకర్ల" వారు వెలనాటి వైదిక బ్రాహ్మణులు. చప్పట్ల పర్వంలో కాకరపఱ్ఱు విద్యార్థులు చేసిన అల్లరిని తిరుపతిశాస్త్రి గారికి చెపుతూ వెంకటశాస్త్రిగారు

**కం॥ "నిన్నైన కొట్టుదురు! న**
**న్నన్నన్ శాఖాభిమాన మడ్డుపడెన్, నా**
**అన్నా! తిరుపతిశాస్త్రీ!**
**చిన్నెలు వన్నెలును నాటి శిష్యుల చేష్టల్!"** - అని లేఖలో వ్రాశారు.

తిరుపతి వేంకట కవులు శపథంగా చెప్పిన పద్యం జగత్ ప్రసిద్ధమైనది.

**"దోసమటం చెఱింగియును, దుందుడు కొప్పగ పెంచినార మీ**
**మీసలు రెండు బాసలకు మేమె కవీంద్రుల మంచు తెల్పగా;**
**రోసము గల్గినన్ కవివరుల్ మము గెల్వుడు! గెల్చిరేని, యీ**
**మీసలు దీసి, మీపద సమీపములం దలవంచి మ్రొక్కమే!"**

- అని శపథంగా అన్నారు. ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రిగారు కాకరపఱ్ఱువారు. అనర్ఘ రాఘవ నాటకాన్ని నారికేళపాకంలో అనువదించారు. వారిని తిరుపతి వేంకట కవులు "స్వయంపాకంలా శుచిగా ఉంది కాని రుచిగా లేదు" అన్నారని ఉటంకిస్తూ కాకరపర్తి విద్యార్థులు:-

**"వ్యాసకవీంద్రుడెంత అనువాడవె! నీవును భట్టుపద్దెముల్**
**చేసినయంత మాత్రమున చెల్లునె? ఆయన తేరిచూడ నీ**
**కూసు కవిత్వమెంత? ఇదిగో అన లోగితి! కారవల్లికిన్**
**మీసములప్పగించి చనుమీ! ఇక మాటలు వేయు నేటికిన్?"**

(కత్తెర మీసాలు వెంకటశాస్త్రిగారికే ఉండేవి! తిరుపతిశాస్త్రిగారికి మీసాలు ఉండేవి కావు. వెంకటశాస్త్రిగారిని అల్లరి చేశారు.) ప్రసంగవశంగా వారు చెప్పిన వందల పద్యాలలో కొన్ని ఉదాహరించాను. ప్రకృత మనుసరామః!

మా రామశాస్త్రిగారు, పదిమంది మోసుకువెళ్ళిన ఎంతటి క్లిష్టమైన వ్యాకరణ సందేహమైనా, కావ్యసందేహమైనా, మోసుకువెళ్ళినంతసేపు పట్టేది కాదు. "టుప్" మనిపించేవారు. ఎంతటి వాఙ్మయ సందేహ శృంఖలాన్నైనా "టుప్"మని తెంపగల సాహితీమల్లులు మా గురువర్యులు! వారు కల్పనాధినాథుడైన రఘునాథుని వంటివారు!

**శ్లో॥ విదుషాం నివహై రిహైకమత్యా యదదుష్టం నిరటంకి యచ్చ దుష్టం**
**మయిజీవతి కల్పనాధినాథే రఘునాథే మనుతాం తదన్య దైవ!**

తా॥ పండితులు ఏకగ్రీవముగా చేసిన (నిర్ణయించిన) సాధురూపమైనను, అసాధురూపమైనను నేను బ్రతికియుండగా, అది నిశ్చయము కాదు! నా కల్పనతో తలక్రిందులు చేయుదును.

పాండురంగ మాహాత్మ్యకర్త, ప్రసిద్ధకవి అయిన తెనాలి రామలింగడు (కృష్ణుడు) శపథంగా చెప్పిన పద్యం – ఆంధ్ర సాహిత్యంలో ప్రసిద్ధమైనది ఉన్నది. ఇది అందరకును పరిచితమే!

**చం॥ ఒకని కవిత్వమందెనయ నొప్పులు తప్పులు! నా కవిత్వ మం**
**దొకనికి తప్పుపట్ట పనియుండదు! కాదని తప్పు పట్టినన్,**
**మొకమటు క్రిందుగా తిగిచి ముక్కలు వోవ ఇనుంపకత్తితో**
**సిక మొదలంట కోతు! మఱి చెప్పున కొట్టుదు! మోము తన్నుదున్!**

"నా కవిత్వంలో తప్పు ఉండదు!" అని శపథంగా చెప్పిన పై పద్యంలో "ఇనుంప కత్తి" అన్నాడు. ఇది ఈనాటి బాలవ్యాకరణంలో సమర్థనీయమా? అని మాకు సందేహం. బాలవ్యాకరణం నోట పట్టిన మాకు ఇది పచ్చి కపిత్థం అయింది.

సూ॥ "నామ్వాది కనుమ్వాదుల ముపర్ణంబులు, పజ్ ప వర్ణంబులగు" – నామ్వాదుల ముపర్ణానికి (నాము–పాము–పేము–వేము) "పజ్" రావాలి. కనుమ్వాదుల (కనుము–ఇనుము–మినుము–జనుము) ముపర్ణానికి "ప" రావాలి! "ఇనుపకత్తి" అనుట సాధువు. "ఇనుంపకత్తి" అన్నాడంటే– "ఇనుము"లోని ము వర్ణమునకు పజ్ వచ్చినది. ఇది తప్పు కాదా? మేము నల్గురం కలసి, ఈ సందేహాన్ని వారి దగ్గరకు మోసుకువెళ్ళాం! చెప్పగానే బోసినవ్వు నవ్వారు. "నామ్వాదీనాం పజ్", "జిత్తు బిందుపూర్వంబగు" అను సూత్రముచే అరసున్న మాత్రమే వచ్చినది. "నాఁప చేను" అని అయినది. బిందువు అంటే, అరసున్న, నెఱసున్న, రెండూ రావాలి! "దీర్ఘము మీద సాధ్యపూర్ణము లేదు!" అను నిషేధ సూత్రము నెఱసున్నను రానీయలేదు. అందుచేత "జిత్వము" "నామ్వాది కనుమ్వాది" సూత్రములో సగమే చరితార్థమైనది! తక్కిన సగము వ్యర్థమైనది. "వ్యర్థస్సన్ – క్వచిత్ కనుమ్వాదీనా మపి పజ్ స్యాత్! ఇతి జ్ఞాపయతి" (పాణినీయ సాంప్రదాయాన్ని అనుసరించి వ్యర్థమైనది–క్రొత్త విషయాన్ని ప్రతిపాదిస్తుంది) – అని నవ్వారు. ఆ నవ్వు మా ముఖాలలో ప్రతిబింబించింది. "అమ్మయ్య! దారి దొరికింది ఇనుంపకత్తికి"–అనుకొంటూ, మా బసలోకి వెళ్ళిపోయాము! దారిలేనిచోట దారి చూపించటం – సమర్థనీయం కాని దానిని సమర్థించటం, అది కూడా శాస్త్రాన్ని అనుసరిస్తూ చెప్పటం, దిగ్గంతి పండితులైన

శాస్త్రిగారికే చెల్లును. పాఠ్యభాగాలుగా నిర్దేశింపబడిన ప్రతిప్రబంధంలోను ఆశ్వాసాంత పద్యాలకు కూడా వారు నవ్వుతూ అర్థం చెప్పేవారు. చెఱకుగడను కణుపుదగ్గరకే విరిచే ఒడుపు వారికి తెలుసు!

ప్రత్యక్షంగా "తప్పు" అనిపించే, ఎన్నో, ఎన్నెన్నో, చెళ్ళపిళ్ళవారికి తారసిల్లిన శాత్రవసభాసమస్యలు – వాటి పరిష్కారాలు, వారు పారవశ్యంతో చెపుతూంటే విస్తుపోయి వినేవాళ్ళం!

నరసభూపాలీయంలో నాయికా విరహాన్ని సౌకుమార్యంగా ఉత్పలమాలలో వర్ణించాడు. ప్రతి గురువు దగ్గర బిందుపూర్వక దకారం రావాలి! ఈ పద్ధతిగా సాగింది ఉత్పలమాల సరసభూపాలీయం లోనిది!

**ఉ॥ చెందొవవిందు మందువలె చిందు, రుచించగ చందనంబు వె**
**చ్చందనమందు, ఇందుముఖి చందము డెందమునం దలంప – నీ**
**అందమునందె, నందనమునందు, మిలిందము పొందు పొందికం**
**జెందె నృసింహ! కౌగిటను జేర్పుము ముందుగ మందగామినిన్**

ఈ పద్యం పద్ధతిలో బిందుపూర్వక "క" కారం వచ్చేలా ఱంకుటాలిని వర్ణిస్తూ ఉత్పలమాల చెప్పమన్నాం మేము. "వ్రాసుకోండి" అంటూ వారు చెప్పిన పద్యం –

**ఉ॥ "జంకొకొఱంకు శంకినికి? సంకర శంక దలంకు!– శంకితాం**
**కాంక గరాంక వాంక సుముదంక కణాంకక కంకణాంకకా!"** ఇది నా స్మృతిపథంనుండి జారిపోయింది. మన సోదరులు చెప్పగలరేమో! (ఉన్నవాళ్ళు). (మా అన్నయ్య "శ్రీగురుభ్యో నమః" అనే పేరుతో వ్రాసిన ఈ నాలుగు వ్యాసాలూ కొవ్వూరులోని ఆంధ్రగీర్వాణ విద్యాపీఠం శతజయంతి సభను ఉద్దేశించి చేసిన ఉపన్యాసాలుగా వ్రాసిన వ్యాసాలు. ఈ శతజయంతి సభలు 2011లో అక్టోబరు 6–10 తేదీలమధ్య కొవ్వూరులో జరిగాయి. వాటికి మా అన్నయ్యతోపాటు మేం ముగ్గురు తమ్ముళ్ళమూ కూడా వెళ్ళాము.)

ముప్పది ఏండ్ల క్రిందట రావూరి వెంకటేశ్వర్లు ఒక అవధానసభలో గురు ప్రార్థన చేస్తూ చెప్పిన మత్తేభపద్యం అంబారీ వేసిన ఏనుగులా కన్పిస్తుంది! ఆపై గురువర్యులను రావూరి ప్రతిష్ఠించిన తీరు తైలవర్ణచిత్రంలాగ గోచరిస్తుంది.

**మ॥ కవితామార్గమునందు నెల్లరకు వేడ్కంగూర్పగా నెంతు, స**
**త్కవిరా"ద్వేదుల రామశాస్త్రి" ఘన విద్వద్రాజరాజేంద్ర గౌ**

**రవ సాహిత్యసతీ పయోధర వినిర్యత్ క్షీరపానాద్భుత**
**ప్రవిరాజత్ ప్రతిభన్, భవన్నుతుల అంబా! రాజరాజేశ్వరీ!**

ఈ పద్యంలో 2–3 పాదాలు ఏకసమానంగా ఉండి వారి పాండిత్య ప్రతిభాద్యోతకంగా కనిపిస్తాయి.

విద్వద్రాజ రాజేంద్రుని – గౌరవసాహితీ సతి వరించింది. ఆ తల్లి క్షీరపానంతో నాకు ప్రతిభ ప్రవిరాజితమైంది! అంటూ గురువర్యుల్ని మత్తేభారోహణం చేయించి, తాను వినయ వినమితగాత్రుడై నిలిచినట్లు గోచరిస్తాడు మన రావూరి వెంకటేశ్వర్లు!

## 5.4.4. చిలుకూరి రామమూర్తిశాస్త్రిగారు:–

ఐదడుగుల ఎనిమిది అంగుళముల ఎత్తు – చీకు చింతలకు అతీతమైన ఆకారం – బిళ్ళమడత పంచెకట్టు – నొసట కుంకుమబొట్టు – ఆచ్ఛాదన లేని వక్షస్థలం. పైపంచ ప్రక్కనే పడవేసి, కళాశాల భవనం దక్షిణంవైపు వరండాలో గోడకు చేరబడి కూర్చున్న బ్రాహ్మణోత్తముడు! కుటుంబ బాధ్యతలవఱకు, భార్యాపుత్రుల మధ్య ఉంటూ, తక్కిన కాలమంతా విద్యాపీఠభవనానికి నిండుదనమిచ్చే స్థితప్రజ్ఞుడు! ఆయన "అ–ఇ–ఉణ్" మొదలుగా ఆభాష్య పర్యంతం బోధింపగల వ్యాకరణ పండితోత్తముడు! ఆయనే మన "చిలుకూరి రామమూర్తిశాస్త్రిగారు!"

వచ్చేపోయే విద్యార్థుల్ని పలుకరిస్తూ యోగక్షేమాలు ప్రశ్నించే విద్యార్థి సన్నిహిత బాంధవుడాయన! "నీ పిండాకూడు! ఎక్కడ అఘోరిస్తున్నావు ఇన్నాళ్ళు? ధూళిపాళ వాడు వీరయ్య – ఎక్కడ ఏడుస్తున్నాడు? వాడిమొహం మండా! ఇదిగో! అన్నాడు మళ్ళీ ఐపూమచ్చా లేడు! వాణ్ణి ఒకసారి నా దగ్గరకు తగులడమను!" ఇలా ఉండేది వారి సంభాషణం ఆశీర్వచనాలతో అంతరాంతరాలు కదలిస్తూ.

క్రొత్త విద్యార్థి వస్తే, వాడి గోత్రం ప్రవర తెలుసుకొని, "ఎంత వరకు మిడికావు?" అనేవారు. (ఆ రోజుల్లో నాటకాంతంగా సంస్కృతం చదివినవాళ్ళు – కావ్య పంచకం పూర్తిచేసినవాళ్ళు – కాళిదాసత్రయం పూర్తిచేసినవాళ్ళు మన కళాశాలలో చేరటానికి వచ్చేవారు.) రామమూర్తిశాస్త్రిగారి భాషలో "ఎంతవఱకు మిడికావు!" అంటే ఎంతవఱకు సంస్కృతకావ్య (పరిచయం) అభ్యాసం పొంది వచ్చావు? అని అర్థం. "వాడి మొహం అలా ఉందేంరా? ఎవర్నైనా అనుష్ఠిస్తున్నాడా?" – ఇలా ఉండేది వారి సంభాషణం. విద్యార్థులలో ఇద్దరు అన్నదమ్ములుండేవారు. తమ్ముడు మాధుకరం చేసేవాడు. అన్నకు అన్నం పెట్టేవాడు! తమ్ముడికి "ధావతిగాడు" అనీ, అన్నకు "తిష్ఠతిగాడు" అనీ శాస్త్రిగారు పేర్లు పెట్టారు! రామ్మూర్తిశాస్త్రిగారిని ఉన్మీలనం చేసి తిట్లుతినటం, సాటి విద్యార్థుల్ని

తిట్టించటం, ఉత్తేజకరమైన తాత్కాలిక కాలక్షేపంగా ఉండేది. మాసహాధ్యాయి "గోదావరి బ్రహ్మాజీ", శాస్త్రిగారితో "సోమయాజులు రాత్రి మాలపల్లికి ప్రచారానికి వెళ్ళాడండి! ఈ వేళ ఉల్లిపాయలతో పులుసు కాచుకున్నాడండి!" అనేసరికి "వాడు ఎలాంటి వేదకుటుంబంలో పుట్టాడురా? భ్రష్టుడైపోయాడు. వాడి మాట నాకు చెప్పకు!" అని ఆవేదన పడుతూ తిట్టేవారు. ఆ తిట్లు తిడుతూ ఉండగా నేను వస్తే ఇంకా తిట్టేవారు. అది ఏమో తెలియదు, వారి నోటంట వచ్చే మాటలన్నీ విద్యార్థులకు ఆశీస్సులే! "శాస్త్రిగారిది మాయ కపటం తెలియని గుణాతీత మనస్తత్త్వం! ఆ మాటలు ఇతరులు నోటివెంట వస్తే బాగుండవు! వారి నోటంట వెలువడే అసంస్కృత వాణికి కూడా అందం ఉండేది సోమయాజులూ!" అన్నాడు మన జటావల్లభుల జగన్నాథం!

ఒకసారి దక్షిణం పెద్ద నుయ్యి ఇవతల శ్రీ గురువుగారు చేదతో నీళ్ళుతోడుకొంటూ స్నానం చేస్తున్నారు. అవతల ప్రక్క "శిష్ట్లా వెంకటేశ్వర్లు" స్నానం చేస్తున్నాడు. స్నానం చేస్తున్న శాస్త్రిగారు కళ్ళనీళ్ళు మిటకరించి వెంకటేశ్వర్లుకేసి చూచారు. వాడి భుజంమీద జందెం లేదు. వెంటనే "జందెం ఏదిరా?" అన్నారు శాస్త్రిగారు. వాడు వెంటనే "మొలలో పెట్టానండి!" అన్నాడు. "మొలలో పెట్టావా? మొ-లో పెట్టావా?" అన్నారు. వెంకటేశ్వర్లు తలవంచుకొని నిష్క్రమించాడు. వారి మందలింపులు "వజ్రాదపి కఠోరాణి, మృదూని కుసుమాదపి" అన్నట్లుగా ఉండి హాస్యస్ఫోరకంగా ఉండేవి. ఎవ్వర్నీ గాయపరచేవి కావు వారి మాటలు. ఆనాటి ధూళిపాళ వీరభద్రశాస్త్రి (వీరయ్య) అనే విద్యార్థి శాస్త్రిగారిని చక్కగా అనుకరించేవాడు. (మిమిక్రీ చేసేవాడు!). ప్రాతవిద్యార్థులం కలిసినప్పుడు వాడు ఊహలలో మమ్మల్నందరిని రామ్మూర్తిశాస్త్రిగారి ముందు కూర్చోపెట్టేవాడు. (వాడు ఈనాడు లేడు.)

కౌముది పాఠప్రవచనంలో, సూత్రాలు వార్తికాలతో సహా వారికి నాలుకమీద నటించేవి! వివరణం వారికి దైవదత్తశక్తి! వ్యాకరణపాఠం సరదాగా చెప్పటం శ్రీ శాస్త్రిగారికే చెల్లును. పాఠప్రపచనంలో వారు పుస్తకం చూడటం మేము ఎన్నడూ చూడలేదు! కళ్ళు మూసుకొని చెప్పటమే! కళ్ళు మూసుకోగానే కౌముది వారి హృదయంలో తెరుచుకొనేదేమో! సూత్రంలో, ప్రత్యక్షరం చాలాస్పష్టంగా ఉచ్చరించే వారు. ఆ ఉచ్చారణ నేటికీ మా చెవులలో మ్రోగుతూనే ఉంది. సూత్రాలు అల్పాక్షరాలతో చెప్పటం పాణిని లక్ష్యం. అయినా "టిడ్ఢాణఞ్ ద్వయసచ్" - "జానపద" మొదలైనవి అక్కడక్కడ పెద్దసూత్రాలు క్వాచిత్కంగా తగిలేవి! ఆ సూత్రాలలోని ప్రత్యక్షరాన్నీ స్పష్టంగా ఉచ్చరిస్తూ ఒక్క గుక్కలో చెప్పేవారు. పాఠప్రవచన వేళ, వారిముఖంలో పాతంజల తేజస్సు గోచరించేది!

"కేచిద్భుగ్నాః సుధ్యుపాస్యేతి సంధౌ... సర్వేభగ్నాః కారక ప్రక్రియాయామ్" – వ్యాకరణబోధలో గురువుకూ, గ్రహించటంలో శిష్యుడికీ క్లిష్టమైన భాగాలుంటాయి. గురువులు ఖంగారుపడుతూ, శిష్యుల్ని మరింత అయోమయంలో పెట్టేస్తారు కొందరు గురువులు! వీరు బోధగురువులు కారు! బాధగురువులు! మన శాస్త్రిగారు క్లిష్టభాగాల్ని, ఎక్కడనుండి – ఎలా ఆరంభిస్తే విద్యార్థికి సులభగ్రాహ్యమౌతుందో గ్రహించి, ఒదుపుగా బోధించేవారు. సంస్కృత కావ్యపరిచయం లేకుండా విద్యాపీఠంలో చేరిన విద్యార్థులకు కూడా అర్థమయ్యేలా సిద్ధాంత కౌముది బోధించేవారు. క్లాసులో విద్యార్థులతో ఇష్టాగోష్ఠిగా మాట్లాడుతూ అమాంతంగా సూత్రం బిగ్గరగా ఎత్తుకొనేవారు. విద్యార్థులందరూ సావధానులై వారి బోధలో నిమగ్నులయ్యేవారు!

గురువర్యుల పాఠప్రవచనం అయిపోయాక, ఎక్కడైనా ఏ విద్యార్థి అయినా అజ్ఞానవశంగా సందేహం ప్రకటిస్తే, చిఱునవ్వు నవ్వుతూ "ఆఁ! ఆఁ!" అంటూ వెక్కిరిస్తూ "ఏమిటి ఇది! నీ బుఱ్ఱ ఇలా తగులడింది!" అనేవారు. ఓపికతో తిరిగి వివరించేవారు. "శిష్యాస్తు ఛిన్న సంశయాః". వారు కూడా ఆనందంతో నవ్వుకొనేవారు. శిష్యుల సందేహాలు తొలగిపోయేవి.

రాంమూర్తిశాస్త్రిగారంటే విద్యార్థులందరికీ – గౌరవం – భయం – ఆత్మీయతా – ముప్పేటగా ఉండేవి. వారి నైష్ఠికజీవనంవల్ల వారు అప్పారావుగారికి శిరోధార్యులయ్యారు. ఒక సంవత్సరంలో పూర్వ విద్యార్థులందరూ వారిని సన్మానించి పురవీథుల్లో ఊరేగించారు. మన విద్యాపీఠ విద్యార్థులకు వారియందలి గురుభక్తికి అదియొక ప్రత్యక్షసాక్ష్యం! (ఆ సన్మానాన్ని, ఆ ఊరేగింపును బాలుడనైన నేను ప్రత్యక్షంగా చూచాను – తంగిరాల).

శాస్త్రిగారి చూపులో – పిలుపులో – వెక్కిరింతలో తిట్లలో – గుండె నిండిన ఆత్మీయత – వాత్సల్యం తొణికిసలాడేవి! చదువు పూర్తిచేసికొని వెళ్ళిన విద్యార్థుల యోగక్షేమాలు కన్నతండ్రిలా తెలుసుకొనేవారు. మా తరగతిలో ఉత్తీర్ణులైన వాళ్ళందరికీ ఉద్యోగాలు వచ్చాయి. "సోమయాజులుకు రాలే"దని విన్నారు.* వెంటనే బయలుదేరి వస్తూ ఉండగా నిడదవోలు స్టేషనులో నేను వారికి కన్పించాను. "చాదస్తుడవురా

---

* ఏలూరులో జిల్లాబోర్డు ఆఫీసులో ఉన్న హెడ్ క్లర్క్‌కి ఐదు రూపాయలు లంచం ఇస్తే, భాషాప్రవీణలో ఉత్తీర్ణులైన వారికి వెంటనే బోర్డు హైస్కూళ్ళలో తెలుగు పండితుడుగా ఉద్యోగం వేసి, ఆర్డరు చేతికిచ్చేవాడు. మా అన్నయ్య కేశిరాజువారి శిష్యుడు, శుద్ధ గాంధీయవాది. లంచం ఇవ్వడానికి నిరాకరించాడు. అందువల్ల మా అన్నయ్యకు వెంటనే ఉద్యోగం రాలేదు–తంగిరాల.

సోమయాజులూ! అందరికీ ఉద్యోగాలు వచ్చాయి, నీకు రాకపోవటం ఏమిటి?" అని, ఏలూరులో ఉన్న "మండలీక వెంకటశాస్త్రి"గారికి లేఖ వ్రాసి ఇచ్చి, ఉద్యోగం వేయించారు. శిష్యుల్ని సుతనిర్విశేషంగా ప్రేమించే హృదయం వారిది! మాయతెలియని మహామనీషి, నైష్ఠికులు మన రాంమూర్తిశాస్త్రిగారు. వారు శుభకృత్–చైత్రమాసంలో ఏకాదశినాడు పరమపదించినారు. "స్వర్గంలో - దేవేంద్రుడు శబ్దశాస్త్ర వాదోపవాదములలో - తీర్పు చెప్పుటకై మన గురువర్యులను ఆహ్వానించెనేమో! కాదనలేక, వెంటనే స్వర్గమునకు వెళ్ళినారు" అంటూ మన రావూరి–

**"శుభకృన్మాధవ శుక్లపక్షమున, తచ్చుంభన్ మహైకాదశిన్**
**సభచేయించి, త్రిలోకనాథుడటకున్ శాబ్దమ్మునన్ తీర్పు చె**
**ప్పు భరంబీయగ పంచెనేమొ! చనియెన్ పూజ్యుండు చిల్కూరి వం**
**శభ భాస్వంతుడు, రామమూర్తి బుధు దస్మద్దేశికస్వామి తాన్!"**

## 5.5 రసభారతీయం

"కవిత్వం" అంటే ఏమిటి? అనే ప్రశ్నకు ప్రాచీన ఆలంకారికులు వివిధ నిర్వచనాలు ఇచ్చారు. "ధ్వనిరాత్మా కావ్యస్య" అని ఆనందవర్ధనుడు అంటే "రీతి "రాత్మా కావ్యస్య" అని వామనుడు పేర్కొన్నాడు. భోజుడు సరస్వతీ కంఠాభరణంలో

**"నిర్దోషం గుణవత్ కావ్యం, అలంకారైరలంకృతం,**
**రసాన్వితం, కవిః కుర్వన్ కీర్తిం ప్రీతించ విందతి"**

అని నిర్ణయించాడు. కవిత్వానికి నిర్దోషత్వం – సగుణత్వం – అలంకారాలు అవసరం అని చెప్పి, అది రసాన్వితం అయిన నాడే కనికి కీర్తిప్రతిష్ఠలు తెస్తుందని నిర్ణయించాడు. సాహిత్యదర్పణకర్త "వాక్యం రసాత్మకం కావ్యం" అన్నాడు. ఇంకా ఎందరు ఎన్ని విధాల పేర్కొన్నా, కవిత్వం రసపుష్టితో ఉండాలనే ముఖ్యవిషయాన్ని కవితా పతాకగా ఉద్ఘోషిస్తూ ఉన్నారు.

"రసహీన కవిత్వం నిర్జీవం" అంటూ ఒక ప్రాచీన కవి–

**"రసరీతి వీతవసనా ప్రియేవశుద్ధాపివాక్ ముదే భవతి**
**అరసా, సాలంకృతిరపి, నరోచతే సాలభంజీవ"** అని అంటాడు.

రతివేళ రమణి అలంకారాలు లేకపోయినా, చివరకు చీరకూడా తీసివేసినా, ఆనందాన్ని అందిస్తుంది. సరసత నెఱుగని తరుణి ఎన్ని అలంకారాలతో ఉన్నా,

నిర్జీవప్రతిమలా (సాలభంజికలా) లోతైన ఆనందాన్ని ఇవ్వలేదు – అంటూ రసరహిత కవితను నిరసించాడు.

**"కదలేదీ కదలించేదీ ... మునుముందుకు సాగించేదీ, పరిపూర్ణపు బ్రతుకిచ్చేదీ"** కవిత్వం అన్నాడు మహాప్రస్థాన కర్త శ్రీశ్రీ.

**"చదువ వచ్చు గ్రంథ సముదాయమంతయు**
**కృతులలోని నెఱసు లేరవచ్చు!**
**రసము సృష్టిచేయు ప్రజ్ఞావిశేషంబు**
**సాధనమున రాదు! చదువుకాదు"** అన్నాడు రసవత్కవితా స్రష్ట, నవయుగ చక్రవర్తి జాషువా! కవిత, రస పుష్టితో సృష్టించాలంటే ఆ ప్రజ్ఞావిశేషం పుట్టుకతో పట్టుబడాలే కాని, సాధన చేస్తే వచ్చేది కాదన్నాడు.

**"కవిత్వం ఒక ఆల్కెమీ**
**దాని రహస్యం కవికే తెలుసు!**
**కాళిదాసుకు తెలుసు, పెద్దన్నకు తెలుసు**
**కృష్ణశాస్త్రికి తెలుసు, శ్రీశ్రీకి తెలుసు!"**

– అంటాడు "అమృతం కురిసిన రాత్రి"లో కవిచంద్రుడు తిలక్.

రసవత్తరంగా, సామాజిక స్పృహతో, రసస్ఫోరక అక్షర నిక్షేపంతో – సూటిగా గుండెలకు తాకే కవితను ప్రాచీనకవితారీతిలో అందించటంలో అందెవేసినచేయి, రసభారతీ ఖండకావ్యకర్త రసరాజు. కవితా రహస్యాల లోతులు తెలిసిన ఈ రసరాజు–

**"వస్తువేదైన కానిమ్ము బాధ లేదు**
**ఆశ్రయించిన ప్రక్రియ అనవసరము!"**

– అంటూ రసస్ఫూర్తి లేని కవిత్వాన్ని నిరసించారు. వీరు ఛందోబద్ధ కవిత్వానికి అంకితమైనా, గేయాలు–కథలూ వ్రాసి ఔననిపించుకొన్నారు. వీరి గేయకవిత వెండితెర కెక్కి "అందమైన వెన్నెలలో..." విహరించి గౌరవస్థానం పొందింది.

సహజంగా సరసకవిత చెప్పే ఈ కవికి బాల్యంలో తండ్రిగారు ముందుగా కందపద్యాన్నీ, దాని లక్షణాన్ని చెప్పారట. "కందాన్ని వ్రాసినవాడే కవి! పందిని కొట్టిన వాడే బంటు!" అన్నట్లుగా కందాలతో ఆరంభించిన చాలును మహాకవి అవడంలో ఆశ్చర్యంలేదు. వీరు తమకు కవితానిర్మాణస్వభావం ఎప్పుడేర్పడిందో వివరిస్తూ –

**"గోలీలాడు వయస్సులోన నను అక్కుంజేర్చి లాలించి, కం**
**దాలన్ వ్రాయుట నేర్పె మజ్జనకు డానాడే కవిత్వంబుపై**
**హేలింగొన్నది నా మనస్సు"** - అని వ్రాసుకొన్నారు.

చిన్నతనంలో అంటే 9 ఏండ్ల లోపుగా వీరు వ్రాసిన కందాలు పరిశీలిస్తే, పద్యం ఎత్తుకొనే ఒడుపు, రసస్ఫూర్తిగా హృద్యంగా పద్యం వ్రాసే శక్తి జన్మాంతర సంస్కారంగా వచ్చినట్లు విస్పష్టమౌతుంది. ద్రాక్షాపాకంగా సాగే వీరి ప్రతిపద్యంలోను ఉక్తివైచిత్రి -ధ్వని - రీతి - వక్రోక్తి - అన్యాపదేశం ఏదో ఒకటి ప్రతిపదంలోను నిక్షిప్తమై వుంటుంది. సామాజికస్పృహ వీరి కవితారసధునిలో అంతర్లీనంగా పొంచి వుంటుంది. పద్యాన్ని ఎత్తుకోవటంలోనే ఒక విశిష్టమైన హుందాతనం కనిపించి శ్రోతృహృదయాల్ని తనలో లీనంచేసుకొంటుంది. యతిప్రాసలు పదమధ్యంలో కలిసిపోతూ, ప్రతిపద సార్థకతను సంతరించుకొంటూ, సాగే వీరి కవిత ఒక రసప్రవాహం! వీరితో పుట్టిన కవితాభారతి; ''రసభారతి''గా రూపుదిద్దుకొని అరువదియేడు రసరాగాలు ఆలపించింది!

ఈ ఖండకావ్య సంపుటిలో మాతాపితృభక్తి - దైవభక్తి - దేశభక్తి - మానవతా వాదం - సామాజికస్పృహ - అభ్యుదయవాదం - అన్యాపదేశం - సందేశాత్మకత - ప్రస్ఫుటంగా గోచరిస్తాయి. భావాన్ని ప్రకటించటంకోసం పదాలు పేర్చడం కూడా కన్పించదు. భావంలో రంగరించిన పదాలు, సహజంగా దొర్లిపోతూ, ఆయా రసస్ఫూర్తిని మూర్తీభవింపజేస్తాయి. జాషువా కవితాముద్ర వీరి పద్యా లలో గోచరిస్తుంది. ఆలోచిస్తే కొన్నిచోట్ల ''జాషువాను దాటి పోతున్నాడే''అని ఆశ్చర్యంకూడా కలుగుతుంది.

వీరి కవిత్వంలో మలిన శృంగార వర్ణనం కన్పించదు. జాషువా వీరికి ఆదర్శం కావటమే దీనికి కారణం.

కనిపించిన ప్రతిరాతికి మ్రొక్కి, కని, పెంచిన తల్లినిగూర్చి అంకిత పద్యాలలో
**"తల్లీ! నిద్దుర లేని కన్నుల నిశీథంబెల్ల నా కోసమే**
**అల్లల్లాడుచు ద్వారతోరణము నీవై దారులం జూచు నీ**
**యెల్లల్ గీయని పిచ్చి ప్రేమయది దీపించున్ సుధా**
**జ్యోత్స్నయై...!"**

"తల్లి తన రాకకోసం ద్వారంలో కాచుకొని ఉండేది'' అనే విషయాన్ని చెప్పటంలో "ఆమెయే పచ్చని ద్వారతోరణంగా మారింది! తోరణంలా బిడ్డకోసం అల్లాడటం" కళ్లకు కట్టేలా వ్రాశారు.

ఆ తల్లి వీరి బాల్యంలోనే కన్ను మూసింది. ఆమె మరణించువేళ ఏకపుత్రుడైన బిడ్డడు (రసరాజు) దగ్గర లేడు. తల్లి మరణాన్ని ఎంత కరుణరసస్ఫోరకంగా వ్రాశారో చూడండి:

**"కొడుకా! యంచు ప్రపంచమున్ విడిచి, నాకున్ మాతృశబ్దాని కా**
**మడ దూరంబును చేసి పోయితివి! అమ్మా! లేదు సభ్యత్వ మీ**
**పుడమిన్ తల్లులు గల్గు పిల్లలను! దేవుండైన నెట్లోర్చెనో?**
**కడ చూపైనను దక్కలేదు కద! దుఃఖంబెట్లు చల్లారెడిన్!"**

"కొడుకా!" అని విలపిస్తూ ఆమె ప్రపంచాన్ని విడిచింది! "అమ్మ" అనే మాటకు ఆమడ దూరంగా నేను విసరివేయబడ్డాను! తల్లులున్న పిల్లలసంఘంలో నాకు సభ్యత్వం లేదు! కడ చూపైనా దక్కలేదు. ఇలాంటి నా బాధనుచూచి దేవుడు మాత్రం ఎలా సహించి ఉండగల్గినాడో?" – ఈ పద్యంలోని ప్రతిపదంలోనూ, మాతృవియోగ వేదన కనిపిస్తోంది. ఇంకా చూడండి!

**"ఎపుడైన మారాము నే చేయ నందులో**
**గెలుపెఱుంగని పిచ్చివలపు నీది!"**

– కొడుకు ఎంత మారాము చేసినా, అమెయే ఓడిపోవటం ఆమె పుత్రప్రేమకు ప్రతీక!

తండ్రికి తనపై గల వాత్సల్యాన్ని వివరిస్తూ –

**"అమ్మ గతింపగా, సవతియమ్మకు స్వాగతమీయకుండ-ప్రే**
**మమ్మున వండి వార్చి రసమాధురి తన్పుచు, తల్లిలేని నా**
**ఉమ్మలికమ్ము తీర్చితివహో! జనకుండన నీవెకావె!"**

"మా తండ్రి మళ్లీ పెళ్లి చేసుకోలేదు!" అనటంలో అందం లేదు. (కవిత్వమూ లేదు). "సవతి అమ్మకు స్వాగతం ఇవ్వలేదు" అని అరచాటుగా ఉక్తి వైచిత్రిగా చెప్పారు. ఇలాంటి ఉక్తి వైచిత్రి వీరికి వెన్నతోపెట్టిన విద్య!

గుడివాడలో ఒక సాహిత్యసంస్థవారు వీరికి "మధుర కవి" అని బిరుదం ఇచ్చారు. ఆ సందర్భంలో తన కవితామార్గ దిక్సూచియైన పితృపాదులను తలచుకుంటూ–

**"నా సారస్వత జీవితమ్మునకు విన్నాణంబు కల్పించి, వి**
**ద్యా సౌగంధ్యము నేర్పినట్టి జనకుం డానందముం బొందుచున్**
**భాసింపన్ దొడగెన్ మనోయవనికన్ పల్మారు నేడిట్లు నే**
**నీ సన్మానముఁ బొందువేళ హృది వర్షించెన్ ప్రమోదాశ్రువుల్"**

సన్మానవేళ, కవితాగురుదేవుడు, ఈ కవియొక్క మనోయవనికపై సాక్షాత్క రించాడట! హృదయం ఆనందబాష్పాలు వర్షించిందట! ఇట్టి కవితాశిల్పం వీరి కవితలో ప్రతిపదంలోను భాసిస్తుంది. "రసోపహారం"లో వీరు మాతాపితలకు కవితా నీరాజనం పట్టారు. 'అంజలి'–'అద్వైతం'–'నివేదన' అనే ఖండికల్లో వీరి దైవభక్తి కవితారసవాహినిలో అంతర్వాహిని అయింది. "బాటసారి" శీర్షిక క్రింద రసరేఖల్లో వ్రాసిన పద్యం వీరి ఆస్తిక్యభావానికి ప్రతిబింబం.

**"నీవు కనలేదు నడచిన త్రోవ నెన్ని**

**పాదముద్రలు పడినవో బాటసారి!**

**కాని కలడొక చిత్రలేఖకుడు వాని**

**కుంచెకందని దృశ్యపంక్తులు హుళక్కి!"**

ఇతరులెఱుగకున్న యీశ్వరుండెఱుగడా? అనే భావాన్ని ఎంత అందంగా మలచారో యీ కవి చూడండి! ఎవరి తప్పులు వారికి తెలియవు! కాని మనల్ని అందరినీ వీడియో తీసే పరమాత్మ వున్నాడు; ఆ ఫొటోగ్రాఫరునుండి తప్పించుకోలేవు– అనే హెచ్చరిక మానవుల్ని తీర్చిదిద్దే మహావాక్యంలా వుంది!

ఒక కవియొక్క పద్యాలు మనం వింటూంటే ఆ పద్యాలలోని ఒకటి రెండు పాదాలేనా, లేదా, అందులో భావమేనా, కవితా వైచిత్రేనా, మన మనస్సుకు పట్టాలి. అలాంటి కవిత్వం పట్టయిన కవిత్వం అవుతుంది. అలాంటి పట్టు వీరి కవిత్వంలో ప్రతిపద్యంలోనూ గోచరిస్తుంది.

వీరి దేశభక్తిలో సామాజికస్పృహ పెనవేసికొని కనిపిస్తుంది. "స్వేచ్ఛాప్రభాతం, స్వతంత్రకేతనం, తేజోభారతం, ఆవేదన, స్వరాజ్యం, నవభారతం, భారతీయుడు, గాంధీభారతం" – అనే శీర్షికల్లో భారతదేశ పరిస్థితికి ఆవేదన చెందుతూ, సామాజిక స్పృహతో వ్రాసిన ఖండికలు. ఒకే విషయంమీద వ్రాయబడినవైనా, సమకాలీన సామాజిక పరిస్థితికి అద్దంపడుతూ వైవిధ్యంతో మనోహరంగా వున్నాయి. దేశభక్తితో పాటుగా వీరికి ప్రదేశభక్తి కూడా అధికం. "గోస్తనీప్రళయం", "ప్రళయచిత్రం" అనే ఖండికల్లో గోస్తనీవరద నిమిత్తంగా చేసికొని, తణుకును, వేయేండ్ల తణుకు చరిత్రను, తమ కవితాస్ఫూర్తితో మూర్తీభవింప చేశారు. 1986లో గోదావరివరద, గోస్తని మీదుగా ప్రవహించి, తణుకును ముంచివేసింది. "ఏమమ్మా! తగదిట్టి దారుణము తల్లీ! గోస్తనీ? శ్రీధునీ!!" అని సంబోధించి –

**"తెనుగున భారతాకృతిని తీర్చిన నన్నయభట్టు నీ జలం**

**బును దగ నాచమించి క్రతువుం బొనరించెను గాదె తణ్కుతూ**

**ర్పునగల జమ్మి చెట్టుకడ పూర్వము! జ్ఞప్తికిఁ దెచ్చుకొమ్ము! గో**

**స్తని! అటువంటి పావన యశస్వినికిం దగ వీ యకార్యముల్"**

అంటూ వేయేండ్ల క్రిందటి ఆదికవిని ప్రస్తావించారు. స్థానికకవుల్నీ, దేశభక్తుల్నీ, కళాకారుల్నీ అభివర్ణించటంలో వీరి జన్మభూమివాత్సల్యం ప్రస్ఫుటమౌతుంది.

దేశసేవాపరాయణులై కీర్తిపతాకలెత్తిన "అల్లూరి సీతారామరాజు – గాంధీ – అమరజీవి – నెహ్రూ – శాస్త్రి – ఇందిరా గాంధీ" మొదలైన మహనీయుల్ని మనోహర కవితా కుసుమాలతో రసరాజు అర్చించారు. సీతారామరాజును గూర్చి–

**"భారత వీరనారి ముఖపద్మముపై ఎవరామనీషి సిం**

**దూరము దిద్దుచున్నది?"** (అని ప్రశ్నించి) **"తెనుంగు ధరిత్రి కనుంగుబిడ్డ అల్లూరి నృసింహమా!"** అని పోల్చుకొనటంలోను, "తెనుంగు ధరిత్రి కనుంగు" అని మూడు జగణాలు దూకుతూ జై! జై! ధ్వానాలు చేశాయి! సీతారామరాజు ప్రతాపాన్ని వర్ణిస్తూ–

**"రవి యస్తమింపని బ్రిటీషు ప్రభుత్వము దద్దరిల్లె నీ పేరు తలంపగా"**

**"విశ్వలేఖిని లిఖించెను లెమ్ము భవత్ప్రతాపముల్"**

**"నీరము ముట్టలేదు మరి నిద్రకు నోచుకొనంగ లేదు"** బ్రిటీషు ప్రభుత్వము అంటారు. **"నీ రక్తమం దే లావా ప్రవహించెనో?"**–అంటూ అల్లూరి వీరరక్త ప్రభావాన్ని పేర్కొన్నారు. భావానుగుణంగా పదజాలం వచ్చిపడటం వీరి ప్రత్యేకత.

ఈ "అల్లూరి" కవితలోచివర **"భాగము లేదు. నీ యశము ప్రక్కన వేరొక వ్యక్తి కెన్నడున్!"** అని అంజలి ఘటించారు.

గాంధీ మహాత్మునిగూర్చి యీ మధుర కవి:

**"సమత ప్రధాన సూత్రమని చాటి, ప్రజాళిని శాంతి నింపి, ఖ**

**డ్గములకు నగ్గిగుండ్లకు విడాకులొసంగి, పరాయివారి స్వా**

**ర్థము పెకలించి, దేశము మరమ్మతు చేసి, స్వయంప్రకాశ దీ**

**పము వెలిగించినావు కద బాపు! ఋణంబెటు తీర్చుకొందుమో!"**

సమతాసూత్రము చాటి–శాంతి నింపి, విధ్వంసకాండకు విడాకులిచ్చి, స్వార్థము పెకలించి, దేశము మరమ్మతుచేసి, స్వతంత్ర ప్రతిపత్తి అనే జ్యోతి వెలిగించిన గాంధీకి

ఋణం తీర్చుకోలేమని, ఆవేదనతో ఆక్రోశించినాడు కవి! గాంధీ **"పరదేశంబుల కేగియున్నను దురభ్యాసంబు లేనాడు నీ దరికిన్ వచ్చిన జాడ లేదు!"** అంటూ గాంధీ నైతిక జీవన విధానానికి నీరాజనం పట్టారు. కవిత్వాన్ని వైచిత్రితో హృదయానికి తాకేలా వ్రాయటం వీరికే చెల్లును.

**"సంతసమున జీవితమ్ము భరత క్షితి కంకితముం బొనర్చి"**న నెహ్రూ ఎదపై ధరించిన ముద్దుగులాబి వీరిచేతిలో "ముసిముసి నవ్వులు" కురిసింది. లాల్‌బహదూర్ శాస్త్రిగారు– **"స్వదేశసేవలో చెఱుగని ముద్రవేసిన విజేత"** అయినాడు. **"వీరపతాకమెత్తి భారత హృదయాల దాగిన పరాక్రమలక్ష్మికి నాందిపల్కినాడు"** అంటారు రసరాజు.

"ఇందిరా నిర్యాణం"లో నాయనివారి "మాతృగీతా"లను స్ఫురింపజేశారు. వీరి కవితారసానుభూతివేళ యే ఇతర కవితలు స్ఫురించినా, రసరాజ కవితాముద్ర "రాజముద్ర"గా తెలుస్తూనే వుంటుంది! ఇందిరాగాంధీని సిద్ధార్థుని చేతిలోని రాజహంసగా భావించి యీ కవి:–

**"ఆ కరాంగుళులెవరివి? ఆ కఠోర**
**కాల రాక్షసులెవ్వరు? కంటిపాప**
**చిదిమి జగమెల్ల చీకటి చేసినారు!**
**సహింపలేదు భారతీయ మానససరోవరము నేడు!"**

ఇందిరాగాంధీని జగత్తుకే కంటిపాపగా భావించటం, ఆ కంటిపాపను చిదిమి జగమెల్ల చీకటి చేసినారనటం అవధులు చూచిన కవితా సమాధికి నిదర్శనం! ఇంతటి భావాన్ని తేటగీతిలో గుండెలకు హత్తుకొనేలా చెప్పటం మహాకవిగా పుట్టిన "మధురకవి" కే చెల్లును.

కవితలో సామాజికస్పృహ ప్రవహింపజేస్తూ, ఆరు సంక్రాంతులు–ఆరు ఉగాదులు – తొమ్మిది దీపావళులు చిత్రించారు. ఒకదానికీ మరోదానికీ పోలిక లేకుండా నవ నవ భావస్ఫోరకంగా వ్రాయటం వీరి ప్రతిభకు నిదర్శనం. ఒకే కూర ఆరు విధాలుగా, తొమ్మిది రీతులుగా వండి రసజ్ఞుల్ని మెప్పించటం అసాధ్యం. **"వండే నేర్పుల పెక్కురీతుల రుచుల్ వర్తింపవే శాకముల్"** అన్నాడొక శతకకర్త. ఒకే వస్తువును వివిధ కోణాలలో సరసంగా సంభావించటం, సహృదయ హృదయాహ్లాదకంగా పద్యాన్ని మలచటం, వీరికే తగును. **"ఎంత చెక్కితే శిల్పం? ఎంత దిద్దితే కవిత్వం?"** అంటారు వీరు!

దీపావళిని సమాజంలోంచి సందర్శిస్తూ – "ఎక్కడున్నవి వెలుగులు? చిక్కనైన చీకటులు తప్ప?" అని ఆక్రోశిస్తారు. సమస్యలతో సతమతమయ్యే సగటు మనిషిని సంతప్తనరునిగా సంభావిస్తూ "తారాజువ్వ" – "టపాకాయ – "భూచక్రం"– "సిసింద్రీ" అన్నీ అంటించారు. వీరి సరసదృష్టికి అవి అందించిన అర్థాలు చూడండి:–

**"నేటి తారాజువ్వ, నింగి కెగయునట్టి ధరలకు నూతనార్థముగ తోచె!**
**నేటి టపాకాయ, కాటకమ్మున ప్రేలు బడుగు గుండెకు ప్రతిధ్వనిగ దోచె!**
**నేటి భూచక్రమ్ము నెత్తి చుట్టు తిరుగు బలుసమస్యలకు వ్యాఖ్యలుగ దోచె!**
**నేటి సిసింద్రీ అనేక వక్రములున్న బ్రతుకుబాటకు నుదాహృతిగ దోచె!**
**పర్వదినమన్న మోద మెవ్వానిలోన**
**నేడు కన్పింపకున్నది; కూడు – నీళ్లు**
**దొరికినన్ చాలు కొండంత సిరియటన్న**
**తృప్తితో నుండె నేటి సంతప్తనరుడు!"**

దీపావళిని ఎలా జరుపుకోవాలో ఈ కవి చెప్పాడు. పేదలలోని నిరాశ తొలగించి వారిలో ఆశాజ్యోతిని వెల్గించటంకంటె దేవతార్చనం లేదు! అంటూ –

**"మట్టి ప్రమిదల కళ్లలో మసలుచున్న**
**ఒక నిరాశాంధకారమ్ము నుత్తరించి**
**దివ్వె వెలిగించు ప్రేమైక దృష్టికంటె**
**దేవతార్చనమేది పృథ్వీతలాన?"**

మట్టిప్రమిదల కళ్లు పేదల నిరాశాపూరిత నేత్రాలను స్ఫురింపజేస్తాయి! ఈ కవి, కన్ను తెరచిందిగా, ఎన్నో సంక్రాంతులు చూస్తారు. ఈ సంక్రాంతులు కాంతివంతంగా కన్పించ లేదు! సమాజకాంతే సంక్రాంతిగా, నవ్యజీవన సంక్రాంతి నవ్వుకోవటం చూడాలని వీరి ఆకాంక్ష! "బంతిపూలు" – "రంగవల్లులు"– "పొంగలి" – "బొమ్మల కొలువులు" – అనువానిలోని అందాలు, బ్రతుకుబాటకు దూరంగా ఉండటంవల్ల సంక్రాంతి, "జీవనసంక్రాంతి"గా కన్పించటంలేదు వీరికి!

**బంతి పూవులకున్న పసుపు పచ్చని వన్నె జీవితాలందు రాజిల్లునాడు,**
**రంగవల్లులలోని రమణీయమగు శోభ జీవితాలందు భాసించునాడు,**
**పొంగలిలో గల్గు పొంగారు మధురిమల్ జీవితాలందు వర్షించునాడు,**
**బొమ్మల కొలువులో పొంగారు వేడుక జీవితాలందు వాసించునాడు,**

**ప్రత్యణువు పర్వరాజమై పరిఢవిల్లు**

**ప్రతిదినము పౌష్యమాసమై పరవశించు**

**హృదయవీథిలో దివ్వియలెత్తి నాడు**

**నవ్యజీవన సంక్రాంతి నవ్వుకొనును!"** అన్నారీ కవి!

ఉగాదిని వర్ణిస్తూ – సమాజాన్ని సందర్శిస్తూ –

**"అడుగు పడుట లేదు! అన్ని మార్గాలలో**

**కంటకాలు బుట్టకాయ లైతె**

**ఎచట గ్రుచ్చుకొనునొ, ఎక్కడ రక్తమ్ము**

**చిమ్మునో విధాత చెప్పలేదు!"**

ప్రాచీన ఛందోమార్గంలో ఇంతటి సామాజికస్పృహతో పురాణ పర్వదినాల్ని వర్ణించిన కవిని ఇతఃపూర్వం చదవలేదు! మరొకర్ని చూస్తాననే నమ్మకం లేదు!... శుక్ల వత్సరాదికి శుభాకాంక్ష లందిస్తూ –

**"చమురు లేనట్టి దివ్వెతో జాతి నేడు**

**కృష్ణపక్షమ్ములో పయనించుచుండె**

**శుక్లవత్సరాది! శుభమస్తు! విజయోస్తు!**

**శుక్లపక్షము వెలయించి శోభనిమ్ము!"**

జీవితాలకు వెలుగిచ్చే నిధుల కొఱతలో, కష్టాలమధ్య నికృష్ట ప్రయాణం సాగిస్తున్న సామాజికస్థితిని తెలియజేస్తూ, శుక్లపక్షమే వెలయించమని ఉగాదిని కోరారు వీరు.

మతమే ఒక మత్తైతే, మతమే మారణహోమం అయితే, మతం గితం. వద్దంటారీ కవి. మతం సమతాగవాక్షాలు తెరవాలని వీరి ఆకాంక్ష –

**"మతములేవైన గాని సమాన దృష్టి**

**నిలిపినప్పుడె మనిషి "మనీషి" యగును!**

**మతము ముసుగున రక్తపు మరకలున్న**

**మానవుడు కాడతడు పచ్చి దానవుండు!!** – అని ఆవేశంతో నివేదించారు. పెక్కు సందర్భాల్లో సర్వమత సమానభావంలేని మతమౌఢ్యాన్ని వీరు దుయ్యబట్టారు.

"మతము మతము కాదు మర్కటమ్ము!" మతాలు శాంతికేతనాలు ఎత్తగల్గాలి. మతాలు సమైక్యతా పచ్చతోరణాలు కట్టాలి. ఆనాడే నవ్యఉగాదికి ఆరంభం

అవుతుందంటూ ఈ కవి ప్రమోద ఉగాదివేళ–

**"మనిషి మనిషియైనపు, డమావసిలో గల జీవితాలు కాం**

**తిని దరిపించి అభ్యుదయ దీపికలెత్తి మనోజ్ఞ శాంతి కే**

**తనములు నిల్పినప్పుడు, మతాలు సమైక్యత నేర్పి పచ్చతో**

**రణములు కట్టినప్పుడు, ధరాస్థలి కా దినమే ఉగాదియౌ!"** – అన్నారు. మరో సందర్భంలో మానవత్వానికి మసిపూసే మతాలు వద్దంటూ–

**"సహనముద్ర చెరిపి, స్వార్ధదృష్టి నిలిపి,**

**మానవత్వమునకు మసిని పూసి,**

**నరుని కాటు వేసి నరకమ్ము సృష్టించు**

**మతములేల? పెక్కు మాటలేల?"**

అని మతోన్మాదుల్ని నిలదీసి ప్రశ్నిస్తారీ కవి!

కవితలో ఉండవలసిన తురీయలక్షణం "ఉపదేశం". ఉపదేశయుక్కుగా ఉండాలి కావ్యం. ఉపదేశాన్ని అన్యాపదేశంగా అందించటంలో వీరికి వీరే సాటి. "వెలుగుపూలు" ఖండికలో చీకటి (అజ్ఞానం)లో ఉండ వద్దంటూ, పొద్దుతిరుగుడుపూవు కాంతికోసం ఎలా ఎదురు చూస్తోందో గమనించమంటారు. కోడిని చూచి వెలుగును (జ్ఞానాన్ని) ఆహ్వానించటం నేర్చుకోమంటాడు.

**"కొదమ చీకట్లలోనుండి గొంతు నెత్తి**

**కొక్కొరొకో యటంచు వెల్గును దలంచి**

**స్వాగతము పల్కు కుక్కుటస్వామి నరసి**

**మనికి నికవైన సరిదిద్దు కొనుము లెమ్ము"**

–అని ప్రబోధిస్తాడు. ఇకనైనా బ్రతుకును మార్చుకోమంటాడు. **"విలువగల కాలమాగదు! వెలుగుపూలు నింపుకొనుమోయి నీ సెజ్జనిండ నేడె!"** అని హెచ్చరిస్తాడు. ఉన్నతస్థాయిని అందుకొన్న వారికి అనుకూల పరిస్థితులున్నాయనుకోవటం అపోహ! పరిస్థితులు అనుకూలింపకపోయినా ఉన్నత లక్ష్యాన్ని సాధించినవాడే "ఋషి", "మహాపురుషుడు" అని వీరి నిర్ణయం. కృషి చేస్తే మనుషులు ఋషులౌతారని, మహాపురుషులు కూడా కాగలరని వీరి నమ్మకం. కోకిల – మిణుగురు పురుగు – అబ్జసుందరి – గొంగళి పురుగు – క్రొవ్వొత్తి అనే అయిదూ వీరికి ఆదర్శమూర్తులు – ప్రేమైకమూర్తులు! ఈ విషయాన్ని వీరు "ఆత్మీయులు" అనే శీర్షికలో చిత్రీకరించారు–

**"ఒగరు చిగురులు తినుచు మహోన్నతముగ**
**పంచమమ్మున రాగసంపద వెలార్చి**
**రసజగానికి శ్రవణపర్వము నొసంగు**
**కోకిలస్వామి నాకు ప్రేమైకమూర్తి"**

- అంటూ "పంచమస్వరంతో శ్రవణ పర్వం చేసే కోకిల తినేవి ఒగరు చిగురులు" అనే సత్యాన్ని వివరించారు. ఒగరు తింటూ, జగానికి రాగసంపదను అందిండటం అనే విశేషం వెల్లడించారు. ప్రసూన రాజమైన పద్మం, సౌందర్య సౌరభాలతో ప్రపంచ ప్రసిద్ధం! కాని దాని పుట్టుక బురదలో! ఈ సత్యాన్ని-

**"బురదలో పుట్టినను ప్రభాకరుని వెలుగు**
**సోకినంతనె విప్పారి సురభిళించి.**
**ప్రభుని పాదాలు ముద్దిడి పరవశించు**
**అబ్జసుందరి నాకు ప్రేమైకమూర్తి"**

- అంటూ కోకిలను, పద్మాన్నీ తమ ఆత్మీయులుగా పేర్కొన్నారు. తాను చీకటిలో ఉండి ఎత్తుకు ఎగురుతూ వెలుగురేఖలు చిమ్మే మిణుగురు - అందరి నిరాదరణకు గురై, యోగసమాధిలో ఉండి, సీతాకోక చిలుకగా మారిన గొంగళి పురుగు- లోకానికి వెలుగు అందించాలనే ఆకాంక్షతో నిలువునా కరిగిపోతూ, వెలుగు అందించే క్రొవ్వొత్తి-తమకు ఆత్మీయులన్నారు. ఇందులో కవిజీవితం ప్రతిఫలించింది.

"బాధలు లేకుండా జీవితాలుండవు. బాధలతో క్రుంగిపోకుండా, నవ్వుతూ బ్రతుకుతూ, ఆశావాదిగా జీవించినవాళ్లు ఔన్నత్యాన్ని అందుకొంటారు. "జీవన్ భద్రాణి పశ్యతి" అనే సందేశాన్ని "జీవనగీత"లో ప్రబోధించారు. జీవనగీత ఒక భగవద్గీత... ఒక భవిష్యద్గీత!

**"బ్రతుకుబాటలో కంటకాలను దలంచి**
**మడమ త్రిప్పుట ధీరుని మతము కాదు!**
**పొంచి నిలిచిన కంటకమ్ములకు నడుమ**
**శీర్షమెత్తు గులాబిదే జీవితమ్ము!"**

- అంటారు. చుట్టూ బాధలున్నా, తల పైకెత్తి నవ్వగల్గినవాడికంటె మహాజ్ఞాని వుండడు! బాధలకు క్రుంగిపోతూ, నిరాశలో పడి నాశనం కావద్దు! ఆశావాదిగా జీవించమంటూ, మరో పద్యంలో ఆశాజ్యోతిని వెలిగించారు!

**"బ్రతుకు చీకటిరాత్రిలో వాడెననుచు**
**దిగులు చెంది నిరాశతో తిరుగ వలదు!**
**నల్లని అమాస విడిన అనంతరమున**
**ఆకసమునందు నెలవంక అవతరించు!"**

బ్రతుకు ఎంతటి భారమైనా నిరాశ పడవద్దు! కష్టాలు (అమావాస్య) శాశ్వతం కాదు! శశిరేఖ అవతరించి వెలుగు నిస్తుంది – అని బాధాసర్పదష్టులకు ప్రబోధం అందించారు.

కట్టుబాటు తప్పి, శ్రుతితప్పిన పాటగా సాగే కాలాన్ని చూడలేక కవి పొందిన ఆవేదన "వక్రించిన వర్తమానం"లో గోచరిస్తుంది–

**"తరతమ భేదముల్ విడిచి, ధర్మువు పోవిడి, తల్లిదండ్రులున్**
**గురువులు పెద్దలన్న సరకుంగొనకుండగ దుష్పథమ్మునన్**
**పరుగిడుచున్న కాలమిది! పచ్చని తోటల కొండముచ్చు నా**
**గరికత కుప్పిగంతులిడి గౌరవమందుచునుండె నేడహో!"**

– అని వాపో యారు. "ప్రాణము నిల్పు ఔషధములన్ కలితీ యొనరించునట్టి విజ్ఞానము బారచాచిన విషణ్ణదినా"లను చూచి, విషాదాన్ని పొందారు. అన్యాపదేశంగా నీచస్వభావుల్ని "దీపోత్సవం"లో "ఉష్ట్రపక్షి– గ్రుడ్లగూబ – శలభం– గబ్బిలాలు" అనే పేర్లతో నిరసించారు.

**"ఎదియొ అపూర్వ మధురరక్తి స్ఫురియించుగాని**
**అర్థమ్ముకాని భావగీతమ్ములవి!"** – అన్నట్లుగా ప్రచారంలో ఉన్న భావకవిత్వ పద్ధతిలో "ప్రతీక్షణం" అనే ఖండిక వ్రాశారు. ఊహాప్రేయసి అందెలరవళిలో కలిసిపోతానంటాడీ అద్వైతవాది!

**"రమ్ము సఖియ నీ అందెల రవళిలోన**
**కలసి పోయెద! రసిక లోకాల నరసి**
**చిమ్మచీకట్లు నీళ్లాడు క్షితికి నీవు**
**ఒక నిమేషము రమ్ము విద్యుల్లతాంగి!"** అంటూ ఆహ్వానించాడు. అందరాని పొందుగా, అందంగా, ప్రతీక్షణంగానే మిగిలి పోయిందంటాడు.

**"పవలు రేలును ఎవరినో పలుకరించు**
**బుడుత సెలయేళ్ల నుడి నాకు బోధ పడక**

**పాదపద్మాలు తడుపుచు వచ్చితివని**

**సకియ! మోసపోతిని ప్రతీక్షణము మిగిలె”**

- అన్నారు. ఈ ప్రతీక్షణం-ఎదియొ అపూర్వరక్తి స్ఫురింపజేస్తూ మనోజ్ఞంగా వుంది.

కవితా సమాధిలో సత్కవికి అందని అంశాలుండవు-

**“అతి చతుర కవేః సృష్టి రప్యుజ్ఝితోర్వీ**

**ప్రాప్యవ్యోమ్నాంతరాళం పునరపి సహసా**

**విందతే పూర్వమూర్వీం!”** - చతురకవి సృష్టి, భూపరిధి దాటి, నభోవీథిలో విహరిస్తుంది. అంతలోనే తన అనుభూతిని అందించటానికి ధరిత్రిని చేరుకొంటుంది. కవి, తాను అనుభూతిని సాధించకుండా లోకానికి అందించగల్గింది ఏమీ వుండదు.

**“జీవితంలో లేనిది కాగితంలోకి వస్తుందా?**

**తునుక మబ్బు లేకుండా చినుకు నేల పడుతుందా?”**

- అంటాడు శేషేంద్ర కవిచంద్రుడు! “రసానుభూతి”లో రసరాజు-

**“ప్రణయసఖితోడ వెన్నెలరాత్రులందు**

**ఇసుకతిన్నెల పైన ప్రేమైకగీతు**

**లాలపించుచు జంటగా అడుగులిడుట**

**ఎంతటి రసానుభూతి? వర్ణింపతరమె?”**

ప్రణయసఖి - వెన్నెల రాత్రి - ఇసుక తిన్నెలు - ప్రేమగీతాలాపనతో జంటగా నడచుటలోని రసానుభూతి మన ఊహకు అందించారు.

**“కోమలంబగు పచ్చిక కూరుచుండి**

**గలగలా పారు సెలయేటి జలములోన**

**అడుగులట్టిటు కదలించి తడుపు నపుడు**

**కలుగు అనుభూతి కెచట వ్యాఖ్యలు లభించు?”**

రాత్రింబవళ్లు ఎవరినో పలుకరిస్తూ గలగలా పారే సెలయేరు! ఆ యేటి యొడ్డున కోమలమైన పచ్చిక (లాన్)! ఆ పచ్చిక మీద కూర్చుండి సెలయేటిలో అడుగులు కదలించటంలోని అనుభూతికి వ్యాఖ్యలు లభించవట! అది కవితల కందని భావంగా పేర్కొన్నారు.

శీతోష్ణ - సుఖదుఃఖ - జయాపజయ - లాభాలాభ - ద్వంద్వాలకి అతీతస్థితిలో సమత్వస్థితిలో బ్రతకటం అనేది దీపావళీదీపాన్నీ, వత్తినీచూచి నేర్చుకోమంటాడీకవి!

**"ఆముదము గ్రోలుచున్నను; ఆవునేయి**
**త్రావుచున్నను – ప్రమిదలో ప్రత్తివత్తి**
**వెలుగు జెండాల నెత్తి జీవించగలదు!**
**ఆ మహాధర్మమునకు నే నంజలింతు!"** – కష్టాలలో ఉన్నా, సుఖాలలో వున్నా, ఒకే విధమైన స్థితిలో ఆనంద బ్రహ్మోపాసనతో జీవించు! నీ అనుభూతి ఒకే విధంగా వ్యక్తం కావాలి! ఈ మహాధర్మాన్ని మట్టిప్రమిదలో ఉన్న వత్తిని చూచి అలవరచుకో మంటాడు. వత్తికి ఆవునెయ్యి లభించినా, ఆముదం లభించినా, వెలుతురు ఒకే విధంగా అందిస్తోంది. వ్యక్తి కూడా వత్తిఎత్తుకు ఎదగాలంటారు రసరాజు!

కవితావైవిధ్యంలో తన కవితాశిల్పాన్ని అనల్పంగా చూపించే శ్రీ రసరాజుగారిని అన్ని పత్రికలూ అభిమానిస్తున్నాయి! ఆకాశవాణి కవిసమ్మేళనాలకు, ఇతర కవితా ప్రసారాలకు ఆహ్వానిస్తోంది! సినిమారంగంలో వీరి గేయకవితాకన్య, అందంగా "అందమైన వెన్నెలలో" విహరిస్తూ ఉత్తమ సినీగేయ రచయితగా "కళాసాగర్' అవార్డు అందించింది వీరికి. ఆంధ్రదేశంలో అనేక సన్మానాలు పొందారు. మధురకవి అనిపించుకొన్నారు. దీనంతకీ కారణం "స్వామి అనుగ్రహం!" అంటారు. "నేను, నా ప్రతిభ" అని ఎన్నడూ అనుకోరు! అనరు! తన యీనాటి స్థితికి "నీ దయా భిక్షే కారణం" అంటూ నివేదనలో–

**"ఏను ఫలమైన – మధురిమ నీవ యగుదు!**
**సౌరభము నీవయేని – ప్రసవము నగుదు**
**నేను! నీ దయాభిక్ష లేదేని నాకు**
**కలదె యీ విశిష్టత? ప్రభూ! కలదె బ్రతుకు?"**

"నేను ఫలాన్ని అయితే, నాలోని 'మాధుర్యం' నీవే! నేను ప్రసూనాన్నయితే, నాలోని 'సౌరభం' నువ్వే తండ్రీ! నీ దయలేకపోతే నాకీ విశిష్టత ఈ గుర్తింపు ఎలా వస్తాయి ప్రభూ!" – అంటూ అహంకార రాహిత్యంగా పరమాత్మకు వివేదించుకొన్న సన్నివేశం వీరిని కవితాశిఖరమే కాదు, జ్ఞానశిఖరం కూడా ఎక్కించింది!

ఈ కవి "జిల్లెడుపువ్వు"తో ఆత్మీయతానుభూతిని పొందారు. తనకు ప్రతినిధిగా జిల్లేడుపువ్వును సంభావించారు. "లేదు మోద మనుకొన్న" తన గతజీవితాన్ని గుర్తుకు తెచ్చుకొంటూ; కవీశ్వరులు, కవితాప్రియులు నెత్తిని పెట్టుకొంటున్న యీనాటి స్థితిని చూచుకొంటూ "ఏ యదృష్టమో? ఏ పూర్వపుణ్యమో!" అని మోదబాష్పాలతో ఆ పరమాత్మకు అంజలి ఘటించారు:–

**"ధూళిని కప్పుకొంచు, ఒక దోషిగ ప్రక్కల నిల్చి, దీన గా**
**థాలయ కావ్యవస్తు పరమాశ్రయనై పడియున్నదాన! ని**
**ద్రాళువునై ప్రగాఢ తిమిరంబున కంకితమైనదాన! ఈ**
**వేళ సుషోదయ ప్రథిత వీథుల నిల్చితి నే యదృష్టమో!"**

ఈ జిల్లేడుపువ్వు పద్యాలు చదువుతోంటే "దీని వెనుక ఏదో ధ్వనిస్తోంది!" అని అనిపిస్తుంది. "ప్రతీయమానం పునరన్య దేవ వస్త్వస్తి వాణీషు మహాకవీనాం" (మహాకవుల వాక్కుల వెనుక మరొక వస్తువు ధ్వనించును). ఆ వెనుక నీడగా నిలిచి కవి జీవితానుభవం, ప్రతీయమానం అవుతుంది. "పూవుల జాబితాలో కెక్కని జిల్లేడు పువ్వుకు, శివార్చనాభాగ్యం లభించినట్లుగా, అల్పజ్ఞుడనైన నాకు గుర్తింపు పొందిన కవిగా, గౌరవభాగ్యం లభించింది" అనే విషయాన్ని ధ్వనింపజేస్తూ వినయాన్ని ప్రకటించాడు ఈ కవి! సినిమాలు – రేడియోలు–సన్మానసభలు – కవిసమ్మేళనాలు తనను బహుముఖంగా ఆహ్వానిస్తోంటే జిల్లేడుపువ్వులో నిలిచి–

**"శివుని శిరాన నన్ను అభిషేక మొనర్పగ వచ్చినావె క్రొం**
**బువులను త్రోసి; యెంతటి యపూర్వ చరిత్రము! దీనగాథలో**
**చివికినయట్టి నన్ను నొక జిల్లెడుపువ్వును స్వీకరించు నీ**
**ప్రవిమల చిత్తవృత్తికి సలామొనరించెద నర్చకప్రభూ!"**

– అని అంటారు. ఈ ఖండికలో "బ్రతికియుండిన శుభములు బడయవచ్చు" అనే ఆశావాదంతోపాటు స్వీయజీవితం ధ్వనించింది! "జిల్లేడుపువ్వు" ఒక ధ్వనికావ్యం!

"ప్రళయచిత్రం" అనే ఖండికలో ప్రకృతి వైపరీత్యాలను పేర్కొంటూ ఈకవి–

**"ప్రకృతి రచియించు ప్రళయచిత్రంబులోన**
**ఎన్ని రంగులు కలవొ ఊహింప లేము!"** అంటారు.

"ఆలోచనామృత"మైన రసభారతి ఖండకావ్యంలో నా ఆలోచనకు అందిన వానిలో కొన్నింటిని మాత్రం చూపగల్గాను. అన్నీ వివరిస్తే ఒక మహావ్యాఖ్యానం అవుతుంది! రసభారతీ కావ్యాన్ని ఆమూలాగ్రంగా చదివిన సహృదయులు ఈ నా సమీక్షను "కొండను అద్దంలో చూపించాడు!" అనుకొంటారు. నా నేర్చిన భంగి చెప్పాను. రసభారతీ కావ్యాన్ని ఆమూలాగ్రంగా చదివి రసరాజు పద్యవిద్యకు ఎంతగా ప్రాణంపోశారో అర్థంచేసికోగలరనీ, ఈ నా సమీక్షలోని వాస్తవాన్ని గుర్తిస్తారని ఆశిస్తూ మధురకవిని ఆశీర్వదిస్తున్నాను...

**చ॥ "ఒక పద్యమ్మున నందచందముల నెన్నో చూపి, సాహిత్య భా**
**వుకతా మాధురి కేతమెత్తి, కవితా(ప్రోత్సాహివై - సత్కథా**
**నికలున్, గేయములల్లి ఆంధ్ర శుభవాణీ కంఠహారాలుగా**
**సకలాంధ్రావని మెచ్చ నిచ్చు రససరాజా! నీకు దీర్ఘాయువౌ!"**

చైతన్యకవిత-22, - టి.వి.కె.సోమయాజులు
భావవసంతం-ఏప్రిల్ 1996. రిటైర్డ్ లెక్చరర్
నన్నయభట్టారకపీఠం, తణుకు.

## 5.6 త్రివేణీ సంగమం 'త్రివేణి' ఖండకావ్యం

కవితాకన్యకు దుగ్గిరాల సోదరకవులు (అన్నగారు దుగ్గిరాల వెంకట కృష్ణమూర్తి, తమ్ముడు రామారావు) అల్లిన ముచ్చటైన మూడు జడలు "త్రివేణి" కావ్యం! యతి ప్రాసల దైన్యం లేకుండా, ధారాశుద్ధితో, అక్షరరమ్యతతో, పద్యాలు హృద్యాలుగా ఉన్నాయి. తిరుపతి వేంకటకవుల పద్యముల ఒడుపు కొంత ప్రస్ఫుటంగా ఉన్నా, కొన్నిచోట్ల తిరుపతికవుల పద్యాలకు అన్నలై ఉన్నాయి! కృతజ్ఞత పద్యాలకంటే అంకిత పద్యాలు అందంగా వున్నాయి. సౌందరనంద అంకిత పద్యాల ఛాయలు కన్పిస్తున్నాయి! అయినా ప్రత్యేకత లేకపోలేదు.

ప్రాచీన సంప్రదాయ సంస్కారాల పట్ల వీరికున్న అభిమానాన్ని వీరి 'నివాళి' ఖండికలోని పద్యాన్నిబట్టి గ్రహించవచ్చు. ఆత్మపరిచయాత్మకంగా-

**వాసము 'నందమూరు' - సహవాసులు వెల్మదొరల్ - కవిత్వమ**
**భ్యాసము, పొట్టకూటికయి ఆంగ్లము నేర్చి, స్వజాతియోగ్యమౌ**
**వేసము మార్చికొంటి, మవివేకము సైచుము దండమో ప్రభూ!**
**దాసులొనర్చు నేరములు దండముతో సరి! వేంకటేశ్వరా!**

పై పద్యంలో మొదటి మూడు పాదాలూ సహజసుందరంగా సాగిపోయాయి! చివరి పాదంలో కవిత్వం మెరుపులా మెరిసింది! "అంకితం", "విశ్వాసం" అను పద్యాలు ఒక విధంగాను, తక్కిన పద్యాలు మరొక విధంగాను కన్పిస్తున్నాయి. 12వ పుటలో "ఏ పని చేసికొన్న" అను పద్యంలో పితృఋణం పూర్తిగా తీర్చుకొన్నారు. స్వర్గస్థుడైన తండ్రిని మబ్బుల చాటునుండి మెరపుగా కన్పించి కవితను అందుకోమని అడగటం జాలిని కలిగిస్తుంది!

'విశ్వాసం'లో – మొదటి పుటలో – కవితాసతి పాదముద్రలు కవియొక్క హృదయగేహానికి ఎత్తిన దీపికలైనవట! "హృదయంలో శతనందనాలు కుసుమించాయి" అనటం, "భావనాలోక తరంగడోలికలో ఊగుతూ, నిద్రలో నవ్వుకొనుట"లో కవిత్వం చిమ్ముతోంది! పద్యరచనలో ఆసక్తి కల్గటం పురాకృత సుకృతఫలంగా వీరు భావించారు.

రెండవ పుటలో – "నిగమమ్ముల్" అను పద్యంలో వేదజడులకు కవిత్వం చాలా దూరం. "కావ్యాలంకరణజ్ఞమేవ కవితాకన్యా వృణీతే స్వయమ్" అను భావానికి అనుగుణంగా లేదు! కవితాసతి చూపులు కోరుతూ ఆమెను "పురాకృత తపఃఫలమా!!" అని సంబోధించుటలో వీరికి కవిత్వంపట్ల ఉన్న ఆదరణ అభివ్యక్తమౌతుంది!

మూడవ పుటలో – "నన్ను వరించి" అనే పద్యంతోపాటుగా చాలా పద్యాలు "కవితా!" అని సంబోధించకపోతే ఒక యువకుని విరాళి వ్యాహారంగా ధ్వనిస్తుంది! కవితాసతి జాణతనాన్ని మెచ్చుకోవటం, ఆమె నాట్యవేదిక తమ రసనాంచలంగా సంభావించటం జరిగినప్పుడు, భువి – దివికాక మరేమౌతుంది?

నాల్గవ పుటలో "నీ ఋణము" అనే పద్యంలో "కంజభవుడేని తప్పు పట్టలేడు" అన్నారు. వీరి కవిత వ్యాకరణ సమ్మతం, ప్రామాణికం! చిననాడె వలచివచ్చిన కవితావాల్లభ్యం ఉండగా "ఏమియు తెలియదు" అనుట వీరి వినయ సంసూచకమే కాని యథార్థం కాదు! కవితాసతి ఎన్ని అందాలతో సాక్షాత్కరిస్తూ వీరిని వ్రాయిస్తోందో ఒక పద్యంలో పేర్కొన్నారు.

ఐదవ పుటలో – నా దగ్గర ఏ శక్తులూ లేవు! నన్ను ఎందుకు ప్రేమిస్తున్నావు? అంటారు. అదేకదా నిర్వ్యాజప్రేమ! "ఏల నా హృదయంబు ప్రేమించు నిన్ను?" అన్న ప్రశ్నకు సమాధానం దొరికితే సముచితప్రేమ కానేకాదు! కవితాసతి వీరి పురాకృత తపఃఫలంగా లభించిందని ముందుగా అన్నమాట యథార్థం! "నేనొక" – "కాంచనగర్భు" అనే పద్యాలు ఈ కవుల వినయ సంసూచకాలు.

ఆరవ పుటలో – "జిలుగు" అనే పద్యంలో కవులు తమ శృంగారవర్ణనా సామర్థ్యాన్ని సాత్విక అహంకారంతో పేర్కొన్నారు. కవితాసామర్థ్యం విద్యలు నేర్వటం వల్ల రాదనీ, పద్యచరణాలే సరస్వతీ చరణాలుగా భావించే సంస్కారమే శారదాశరణాగతి కల్పిస్తుందనీ వీరు అంటారు. ఇదే భావాన్ని జాషువా కవి:

**"చదువ వచ్చు గ్రంథ సముదాయమంతయు**
**కృతులలోని నెరసు లేరవచ్చు!**
**రసము సృష్టిచేయు ప్రజ్ఞావిశేషమ్ము**
**సాధనమున రాదు! చదువు కాదు!!"** – అని ఎలుగెత్తి చెప్పాడు.

ఏడవ పుటలో – "గాలికి" అనే పద్యంలో తమ కవితాగుణాలు పేర్కొన్నారు. "కోరిక తీరు" అనే పద్యంలో అహంకారాన్ని పూర్తిగా తుడిచి వేసుకొన్నారు. "అల్లన" అనే పద్యంలో కవితాసతి తమ ఉల్లము దోచుకొన్న తీరు వివరించారు. కవితా నిర్మాణచాతుర్య మబ్బినవాడు రాజ్యవైభవాన్ని కన్నెత్తి చూడడు! అదే పుటలో గోదోహనానికివలెనే కవిత్వానికి కూడా వేళలుంటాయనీ, కొన్నివేళలలో కవిత్వం రాదనీ, కొన్నివేళలలో కవిత్వం ఆగదనీ స్పష్టీకరించారు!

తొమ్మిదవ పుటలో – కవితాసతి ఎన్నో అగ్నిపరీక్షలు చేసి తమ దరిచేరిందని ఈ కవులు పేర్కొన్నారు. ఆ క్షణంలో గుండెలు రెండూ ఏకమై గుసగుసలాడు కొన్నాయట! తదారభ్య "కూకుండ నీదురా కూసింత సేపు". క్రమంగా కవితాసతితో తాదాత్మ్యం చెంది "తత్త్వమసి"యై తమ అస్తిత్వాన్ని కోల్పోయారట! వీరు తెలిమబ్బుల రాతితిన్నెలపై కూర్చుండి, నక్షత్రపుష్పోద్యానంలో కవితాసమాధిలో ఉన్నవేళ, ఎలాంటి కవితాసుధ వర్షిస్తుందో అది ఊహలకందరానిది! **"అతి చతుర కవేః సృష్టిరప్యుజ్ఝితోర్వీ ప్రాప్య వ్యోమ్నాంతరాళం పునరపి సహసా విందతే పూర్వ ముర్వీం"** (ఎంతటి నిపుణుడైన కవియొక్క సృష్టి అయినప్పటికిని, అది భూమండలాన్ని వదలిపెట్టి, రోదసీమండలాన్ని చేరి, మరల వెనువెంటనే తాను బయలుదేరిన భూమండలానికే వస్తుంది.) అన్న ఆలంకారిక నిర్వచనానికి వీరి భావుకత ఉదాహరణం! "కవి– కవిత"– "సోహంగా" మారిన వేళలో బ్రహ్మానంద సబ్రహ్మచారియైన కవిత తప్పక ఉత్పన్నమౌతుంది!

పదవ పుటలో – శారదాభ్ర అశ్వాల స్వారియే కవితా నిర్మాణం. అది హిమాలయోన్నతశిఖరవిహారం, గాంగఝరీసదృశం అవుతుంది –అంటూ ఆత్మవిశ్వాసాన్ని "విశ్వాసం"లో వెలువరించి "శతజన్మమ్ములకైన" కవిగా పుట్టాలని, అదే రాజ్యభోగాధికం అవుతుందని పేర్కొన్నారు. అవును మరి! "సుకవితా యద్యస్తి రాజ్యేనకిమ్?" – అన్నాడు కదా భర్తృహరి!

"నిశ్వాసం"లో (11వ పుట) కవితా లతాంగికీ – అర్ధాంగికీ పోటీ వచ్చింది. "ఇతికర్తవ్య విమూఢు" డయ్యాడు కవి. శరీరాన్ని ఒకామె, మనస్సును మరో ఆమె ఆక్రమించారు. జీవితాంధస్సులో కవిత ప్రభాతసంధ్యే అయినా, వివాహమయ్యాక కవికి వీలు చిక్కటం లేదన్నమాట. వీరికి విద్యాభ్యాసకాలంలో పద్యం మద్యంలా అలవాటైంది. సంసారభారం మీదపడింది. అయినా మ(ప)ద్యాసక్తుడికి సంసారం పట్టనట్లే కవికి సంసారం పట్టలేదు. సంసార బాధ్యత తప్పదు. "గీతమల్లక బ్రతుకు సాగింపలేను" అన్నట్లుగా కవితా వ్యాసంగాన్ని సాగించకుండా ఉండలేదు కవి! ఈ

ద్వైతంలో కవి కొట్టుమిట్టాడాడు. అన్నదమ్ములు, బంధువులు, భార్య, ఇతని ప్రవృత్తికి స్వగతంగాను, ప్రకాశంగాను, బాధపడ్డారు. కవి, కవితాపతి యెదుట నిశ్వాసము చేశాడు! తన కవితా వాల్లభ్యానికి మాత్రం దూరం కాలేదు! కవితావల్లరి వీరి మనస్సుల్ని ఎంత ప్రగాఢంగా అల్లుకుందో మనం అర్థం చేసికోవచ్చు. కవిత్వం అల్లుకొనేవేళ లోకమే కన్పించదట. కవితాసతీ సాక్షాత్కారవేళ–

**నీ యానంద ముఖావలోకనమునన్ నిర్మగ్నమై యున్నచో**
**నా యిల్లాలును, నాదు సంతతి, మరిన్ నాతల్లి, నా తమ్ములున్**
**నా యన్నల్ కనుపింప రాక్షణమునన్ నా దృక్పథమ్మందు, ఏ**
**మో! యే మందిడి బుద్ధి మార్తువొ, కవిత్వోన్మాదినై పోవుదున్!**

కవిత తాదాత్మ్యము సిద్ధించినవేళ లోకాలోచనము తొలగిపోవుట సహజమే కదా! తనను పిచ్చివాడని లోకం అంటున్నందుకు కవి ఆవేదన పడటంలేదట! ఆలు తెగనాడిందని ఆవేదనయట!

**"అందరు అందురంచు హృదయమ్మున నే పరితాపమంద; నా**
**కందరి గోల యేల?............. ఇంకనే**
**మందును? కట్టుకొన్న ప్రియురాలు ననున్ తెగనాడిపోసెడిన్!"**

ఈ విశ్వాసంలో, ధనహీనస్థితిలో ఉన్న కవి కవిత్వం వ్రాయటంలో నిమగ్నుడై వుంటే అన్ని ప్రక్కలనుండీ అతనికి ఏర్పడే బాధలు 14వ పుటలోని సీసపద్యంలో వివరించారు.

**"పోరులకు జీవితమ్ము కాపురమొనర్చి**
**ఏమి సుఖమందెదను చెప్పవే లతాంగి!"**

అంటూ కవి దీనంగా కవితాసతిని ప్రశ్నిస్తాడు! "మనసొకచోట మనువొకచోట" అన్నట్లుగా మనస్సు కవిత్వం మీద, కాపురం భార్యతోను–ఈ మధ్యలో, కవి పొందిన గింజులాట, ఈ భాగంలో చక్కగా చిత్రించారు ఈ కవులు!

కవితాసతీ నిరంతరచింతనం లభిస్తేనే కవి కృతార్థుడు కాగలుగుతాడు. కవి కవితాసమాధిపయోధిలో మునిగినప్పుడే, పద్యముక్తాఫలాలు లోకానికి అందిస్తాడు. వీరి తాదాత్మ్యం, నిరంతర చింతన తీరు, వివరిస్తూ 18వ పుటలో–

**నిలిచిన, కూరుచున్న, శయనించిన, నిద్దుర పోయినన్, భవత్**
**సలలిత రూపరేఖ లెదదన్ నటనమ్మొరించు, తన్మహో**

**జ్జ్వల నటనాప్రదర్శన మపార ముదాంబుధి ముంచివేసినన్,**
**తలపగనీయదింక నిజదార సుతాదులగూర్చి సుంతయున్.**

ఈ పద్యం చదవగానే **"సంతత శ్రీ నారాయణ పాదపద్మయుగళీ చింతామృతాస్వాద సంధానుండై మరచెన్ సురారిసుతు డేతద్విశ్వమున్ భూవరా!"** అను ప్రహ్లాదస్థితి స్ఫురణకి వస్తుంది! జ్ఞాతతత్త్వుణ్ణి లోకం ఎలా తూలనాడుతుందో **"పాతికయేండ్లు రానపుడె పట్టుకొనెన్ కవితాస్వరూపిణీభూతము! వీనినిన్ విడిచి పోవదురా!"** అని లోకులాడు మాటలు చక్కగా చిత్రించారు.

"నీవు నన్ను పట్టుకొన్నావు కాబట్టి లోకులిలా అంటున్నారు. నీవు నన్నావహించకుండా వుంటే వాళ్ళు అనగలరా?" అంటూ కవితాసతిని వ్యాజస్తుతిగా అంటారు ఈ కవులు.

కవితాసరస్వతి కవులకిచ్చిన సత్కారాల్నీ, తెచ్చిన కీర్తిప్రతిష్ఠల్నీ, ఉటంకిస్తూ–

**"మణులిప్పించితి వీయజేసితివి! బల్ మాన్యమ్ములన్ మత్త వా**
**రణ యూథమ్ముల నెక్కజేసితివి! స్వర్ణస్నానమాడించి తీ**
**క్షణ మాత్రమ్మున నీ సమాశ్రితుల తత్కాల ప్రభావమ్ము ధా**
**రుణిపై నీ మహిమ ప్రసాదమని వాక్రుచ్చున్ చరిత్రాంశముల్!"**

అనే పద్యంలో పేర్కొన్నారు. ఈనాటి స్థితిని ఒక్కసారి కలయచూసి ఆవేదనకు లోనయ్యారు. కవిత వినువారు కరవయ్యారు. **"కవనమ్మున్ వినుటే కవీంద్రునకు సత్కారమ్మటంచున్ ప్రజానివహమ్ముల్ తలపోయు కాలమిది!"** – **"కవియన్నన్ కవికే అనిష్టమట దుర్గర్వం బహంభావమున్ కవి కర్తవ్యంబగు లక్షణంబులట!"** అంటూ ఆవేదనతో నిశ్వసించారు. ప్రాచీనకాలంలోని **"ఏనుగు నెక్కజేయుమని యే నినుగోరను, పట్టుశాలువల్ కానుక లగ్రహారములు కంకణ శ్రీలను కోరను"** అన్నట్లుగా, నిరుపహతి స్థలం అక్కర్లేదు. రమణీ ప్రియదూతిక తెచ్చియిచ్చే కప్పుర విడెం అసలే అక్కర్లేదు. భోజనము, ఒప్పు తప్పరయు రసజ్ఞులు, ఉంటేచాలు! కాలం దొర్లించేస్తాము– అంటారీ కవులు! వీరి గురువులు తిరుపతి కవులు **"కవితా మాధురి తాగ్రహించి, యిది శ్లాఘ్యం బిద్ది శ్లాఘ్యంబుగాదు! విశేషంబిట నిర్విశేషమిట, మాధుర్యంబిటన్ వహ్వారే! కవిరాజా! అని మెచ్చి యిచ్చు నృపుడు"** ఒక్కడుంటే బ్రతికేస్తాము అన్నారు. కనీసపు కోరిక కూడా కవితామతల్లి తీరేలా చెయ్యదా?

ఈ దుగ్గిరాల కవుల కవిత్వాన్ని చూచి, మెచ్చదగినచోట మెచ్చిన చాలునట! అదే గజారోహణ, కనకాభిషేక, ఆందోళికారోహణాలుగా సంతుష్టి పొందగలం! అంటూ–

**"వ్రాసినదాని జూచి సెహబాసనినన్ కనకాభిషేకమున్**

**చేసినయట్లు – కంకణము చేతికి వేసినయట్లు – పల్లకీ**

**మోసినయట్లు–డెందము ప్రమోదము చెందును"** అంటారు.

**"ఎంత చక్కగా వ్రాసిన ఈసడింతు రవురా! సమకాలికు లేమి కర్మమో!"**

అని వాపోయారు! అది సమకాలిక ధర్మం అంటూ ఏనాడో చేమకూర కవి **"ఏ గతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే కదా!"** అంటూ సమకాల ధర్మాన్ని చెప్పాడు. ఎన్ని బాధలు విరుచుకుపడినా, ఎన్ని రాళ్ళు మీద పడినా, ఎన్ని కష్టాలు ముట్టడించినా, కవిత్వాన్ని అల్లకుండా వుండలేను! హిమాలయ ఉత్తుంగ శిఖరాగ్రాల నుండి పడే ప్రవాహాన్ని ఆపలేను! "ఆపగలను" అనటానికి నేను సర్వజ్ఞుణ్ణి (శివుణ్ణి) కాను! అంటూ –

**గగనోత్తుంగ హిమాలయాద్రి శిఖరాగ్ర ప్రాంత నిర్యత్సురా**

**పగ భంగిన్ తెగపొంగి వచ్చు కవితా స్వర్వాహినీ వేగ మా**

**పగ నా శక్యమె? శక్యమంచనగ సర్వజ్ఞుండనే? నాడు నీ**

**మొగమున్ జూచితి మోసపోయితిని! వ్యామోహమ్ము ద్రోహమ్మగున్!**

అంటూ వ్యాజస్తుతిగా విశ్వసించటంతో ఈ భాగం ముగుస్తుంది.

**ఆశ్వాసము:**

కవిత్వతత్త్వము అర్థమైన తరువాత కవికి మనస్సులో ఒక కొలబద్ద (మీటరు) ఏర్పడుతుంది. వచ్చిన కవిత్వంతో సరిపుచ్చుకోలేడు. ఈ స్థితిలో "స్మరిస్తే పద్యం అరిస్తే వాద్యం" అన్నట్లుగా గర్వించలేడు. నేను వ్రాస్తున్నది కవిత్వమా? అనే ఆత్మ విచార మేర్పడినవేళ తనను శంకిస్తున్నాడనుకొంటుంది కవిత. పూర్వం మాదిరిగా దరిచేరదు. ఈ స్థితి నవకవితా మహోదయానికి నాంది; మొదటి మెట్టు; నవకవితా వసంతానికి ముందున్న శిశిరం. ఈ ఆశ్వాసంలో అలాంటి శిశిరం కవిని ముసిరింది. కవితాసతి దుఃఖిస్తూ ఈ ఆశ్వాసంలో సాక్షాత్కరిస్తుంది. ఆమెను ఓదార్చి, ఆమెతో అద్వైతాన్ని పొంది, కవితానవవసంతంలో నవ్యకవితా స్వరూపుడుగా సాక్షాత్కరిస్తాడు ఈ కవి.

**"ఎవరేమనినారని వెక్కివెక్కి యేడ్చెదవు లతాంగి!"**

**"రోసంబూనితివా? అదేయయిన గూలున్ నిల్వనీ వీని యాశా సౌధమ్ములు!"**

**"తప్పు దిద్దుకొనగా శాసింపు మీ దాసునిన్!"**

కవిత్వతత్త్వవిచారము మొదలుకాగానే కవితాఝురి ఆగిపోవును. **"పిచ్చుక, హంస యానమును వేడుకతోఁ దగ నభ్యసింపగా, వచ్చిన పూర్వపున్నడల వైఖరి పోయెను, హంసయాన మా పిచ్చుక కబ్బదయ్యెను ... గెంతుచునుండె నేటికిన్".** కవిత్వమునకు తానేర్పరచుకొన్న నియమాలకు జంకి, కవిత్వం దగ్గరకు రావటం లేదు. ఆమెను ఓదార్చుతూ బ్రతిమాలుతున్నాడు కవి. **"కలమునుబట్టి పట్టుమని కందము కూడ రచింపనైతి. నీ వలపుల తోడు! ఇంత బలవంతపు శిక్షలకేమి చేసితిన్?"** అని తన అశక్తతను వ్యక్తం చేస్తాడు. తెలియటం కూడా భయమే! అజ్ఞానంగా ఉన్న రోజుల్లో ఉండే చొరవ, జ్ఞానంలోకి వచ్చాక ఉండదు కదా! శ్రావణనదీవేగం శరదృతువులో మందగిస్తుంది. అయినా కవిత్వాన్ని "పుట్టుకవి" విడచిపెట్టుకోలేదు. అందుకనే కవి ఎలా ఆవేదన పడుతున్నాడో చూడండి:-

**"విడివడనట్టి నీదు మురిపెంపు సుతారపు కౌగిలింతలన్**
**విడుచుట యెట్లు? నీదు శ్రుతిపేయ సుధామధురానులాపముల్**
**విడుచుటయెట్లు? గాఢమగు ప్రేముడితో మన రెందు గుండెలున్**
**ముడివడిపోయె! త్రెంచుకొని పోవుటయెట్లు? కళావిలాసినీ!"** – అంటాడు.

కవితాసామ్రాజ్యం ఏలేవాడికి నిత్యావసరాలు కూడా కన్పించవు. ఆ కవిత్వంలో మున్కలు వేస్తూ ఆ సామ్రాజ్యాన్ని ఏలుతూ కవి, తాను "రాజు"ననుకొంటాడు. కవులను దరిద్రం పట్టుకోవటం పరిపాటి. లెక్కచెయ్యకపోవటం కవుల అలవాటు. కవి తన ఊహప్రపంచంలో సుఖించగలడే కాని వాస్తవజగత్తులో సుఖించలేడు. ఈ విషయాన్ని జాషువా కవి–

**"ఎవడు సుఖించెనో తెలుపు మీ కవితాకళ నభ్యసించి? భా**
**రవి భవభూతి మాఘకవిరాజులుగోలె మదాంధ్ర సత్కవి**
**ప్రవరుల దాక, పొట్టకును బట్టకు చాలని ఆర్జనంబుతో**
**నవసినవారి సంఖ్య అదనంబయి దోచు తలంచి చూచినన్"** – అంటాడు.

ఈకవి కవితాసతితో 'తిండి ఉండటానికి ఇల్లు లేకపోయినా సరే! నువ్వు నా దగ్గర ఉంటే చాలు. అదే నాకు స్వర్గము. నీవు దూరమైననాడు నాకు స్వర్భువనం అబ్బినా, నేను లేనివాడనే' అంటాడు.

ఈ కవి లలితకవితా కళాజలధిలో నావికుడట! కవితాపతి చుక్కాని పట్టని వేళ అతడు గట్టెక్కలేనంటాడు. తన కవితలో అంతటా తీపి ఉండటానికి సరస్వతీ

అనుగ్రహమే కాని, తన తెలివి కాదనే వినయం ప్రకటిస్తాడు. "శారదా! నా కవితపై నీవు ఎప్పటికప్పుడు నీ చెవియందలి అరవిందంలోని మధూళీ మాధుర్య క్షేపణంచేస్తూ వుండటంవల్లనే ఇంత తీపి వచ్చిం"దంటాడీ కవి.

**గిరాందేవీ సద్యః శ్రుతి కలిత కల్హార కళికా**
**మధూళీ మాధుర్యం క్షిపతి పరిపూర్త్యై భగవతీ!**

అనే శ్లోక పాదాలు ఈ సన్నివేశంలో గుర్తుకొస్తాయి. కవి, కవితాసతిని ఎన్నో రీతులుగా బ్రతిమాలుతూ వుంటాడు. తన కృషికి కాలం కలిసిరావాలి కదా! మనోమథనం నుండి పుట్టిందే కవితామృతం. కవియొక్క అంతర్మథనంలోనుండి, కవికి నవకవితా వసంతోదయమైంది. కవితాసతీ ముఖచంద్రునిలోనుండి దరహాసచంద్రిక లుదయించాయి. కవిహృదయం చల్లబడింది. అంతవరకు చీకటిగా ఉన్న (కవియొక్క) హృదయవీథులు తెల్లవారాయి. నూతనభావభాస్కరోదయం అయింది. ఆ సందర్భంలో ఆనందంగా చెప్పిన పద్యం-

**"అదిగో! తూరుపు తెల్లవారినది, సంధ్యారాజ్ఞి పారాణి కాం**
**తి దిశామండల మాక్రమించినది, ఇంతీ! నవ్వుచుండెన్ నవా**
**భ్యుదయమ్ముల్, తరుణార్కు లేతకిరణమ్ముల పద్మినీకాంత క**
**న్నుదలన్ రేపెడి మన్మథాగమన సంతోషం బశేషంబుగన్"**

అందరూ కవిత్వం చెప్పలేరు. అన్ని పక్షులూ పంచమస్వరం ఆలపించలేవు. కవితావసంత శుభవేళలో కవిత పంచమస్వరంతో శ్రుతి కూర్చుకొంటోందట. కవితా స్వరూపంగా మారిన కవి, తమితీవల పందిరి నీడలలో రాజై కొలువు తీర్చుకొన్నాడు:

**కూ!యని కూయు కోయిలల కూతలలో మొలకెత్తి సాగి, సం**
**దీయక- యల్లుకొన్న తమితీవల పందిరి నీడలందు ఆ**
**ప్యాయముతోడ నేను దొరనై కొలువుందును! భారతీయ జా**
**తీయము మారుమ్రోగ శ్రుతి దిద్దుము నీ కవితా విపంచికిన్!**

"సరైన శ్రుతి, కవితా లక్ష్యాలు ఏర్పరచుకొన్నాడు కవి. మతోన్మాదాలు చల్లార్చు కవిత - జాత్యహంకారాలు మూలమట్టం చేసే కవిత - దురాచారాలు దూరం చేసే కవిత నియంతృత్వాన్ని నిర్మూలింపచేసే కవిత- సరస్వతీకటాక్షంతో తనకు సంప్రాప్తించాలని కోరుకొంటాడీ కవి.

చిన్నారి పాపాయి చిరుత నవ్వులు–పున్నమ వెన్నెల అమృత స్నానాలు–కలికి వాల్చూపుల ఒయ్యారాలు – మల్లెపూల గుబాళింపులు – తమ కవితలో ప్రతిపదంలో సాక్షాత్కరించాలని ఆకాంక్షిస్తాడీ కవి. తన కవితను ఆదరించుటకు ఈనాడు మహారాజులు లేరు కదా! ఎవరు పోషకులు? అని ఆలోచించి తన కవిత జన బాహుళ్యములో విస్తరిస్తుందని ఆశిస్తూ ఆత్మవిశ్వాసంతో ఓ కవితా వధూమణీ!

**"జననాథావళి కొల్వుకూటముల సంచారించు నీ పాదముల్**
**జనబాహుళ్యములో చరించుచు, నమస్కార ప్రసూనార్చనా**
**ఘనసత్కారములందుకొంచు కవితాకల్యాణి! ఈ రోజులం**
**దున త్రైలింగ గృహాంగణావళులయందున్ సంచరించున్ జుమీ!"**

అని కవితాసతిని ఆశీర్వదించి ఆశ్వాసించటంతో ఈ ఆశ్వాసం పూర్తి అవుతుంది.

కఠినపదభరిత దీర్ఘసమాస విన్యాసమే ఆంధ్రకవిత్వానికి ప్రధానలక్ష్యం అనే భావాన్ని పోగొట్టి, పద్యభీతిని సామాన్య ప్రజలలో తొలగించి, ఛందోబద్ధ కవితను జనముద్దు చేసిన తిరుపతి వేంకటకవుల ఛాయలో సాగు కవిత పట్టుబడిన ఈ కవులు ధన్యులు! కాపీలు కరవైన ఈ త్రివేణిని జిరాక్సుకాపీలో చదువు భాగ్యము కల్పించిన చిరంజీవి రామారావు బావగారికి నా కృతజ్ఞతాపూర్వక ఆశీస్సులు!

**– తంగిరాల వెంకట కృష్ణ సోమయాజులు**

(–చైతన్యకవిత–30, ప్రమాథి శరత్తు, అక్టోబర్1999)

## 5.7 వార్ధక్యంలో ఎలా బ్రతకాలి?

"కష్టాత్ కష్టతరం జరా" ప్రపంచంలో అన్ని బాధల్నీ మించినది వార్ధక్యం. మృత్యువు భయంకరం అనుకొంటాం. మృత్యువు ప్రాణం పోయే వరకే బాధించగలదు! ప్రాణం పోయాక, అది మనల్ని ఏమీ చెయ్యలేదు. వార్ధక్యంలో ప్రాణం పోదు! శారీరక మానసిక ఆర్థిక బాధలు తప్పవు! "దీపమారదు! పురుగు చావదు" అంటే ఇదే!

దేహం, బాల్యం దాటి, యౌవనంలో ప్రవేశించి, పరిపూర్ణ వికాసం పొందుతుంది. శరీర శక్తులతో ఉన్న శరీరానికి వార్ధక్యం కొన్ని వికారాలు కల్పిస్తుంది. ఆకారం మార్చివేస్తుంది. కోతిరూపం ఇస్తుంది! వార్ధక్యంలో మానవుడు పొందే బాధలు మహాకవి భర్తృహరి తన 'సుభాషిత త్రిశతి'లో, 'వైరాగ్యశతకం'లో ఇలా వర్ణించాడు:–

**శ్లో॥ "గాత్రం సంకుచితం, గతిర్విగళితా, భ్రష్టాచ దంతావళిః,**
**దృష్టిర్నశ్యతి, వర్ధతే బధిరతా, వక్త్రం చ లాలాయతే,**

**వాక్యం నాద్రియతే చ బాంధవజనో, భార్యా న శుశ్రూషతే,**
**హా! కష్టం! పురుషస్య జీర్ణవయసః, పుత్రోఽ ప్యమిత్రాయతే"**

"శరీరం ముడుచుకుపోయింది. నడక తడబడుతోంది. దంతాలు ఊడి పోయాయి. చూపు మందగించింది. చెవుడు పెరిగిపోయింది. నోరు చొంగకారుతోంది. బంధువులు నామాట లెక్కచేయడంలేదు. కట్టుకొన్న భార్యకూడా నాకు సపర్యలు చేయడం లేదు. అయ్యయ్యో! వార్ధక్యం అన్ని కష్టాలకూ నిలయం! కన్నకొడుకు కూడా పరమశత్రువుగా మారి బాధిస్తున్నాడు" అంటూ ఒక వృద్ధుడు అరణ్యరోదనం చేశాడు.

నిరంతరం మార్పు చెందటం ప్రపంచవస్తు స్వభావం. మానవుడు బాల్యంనుండి యౌవనంలోకి వస్తాడు. యౌవనంలోనుండి వచ్చిన మార్పే ఈ వార్ధక్యం. శరీరబలం క్షీణిస్తుంది. నడక తడబడుతుంది. కళ్ళు, చెవులు, పనిచెయ్యవు. నా భార్య - నా పిల్లలు - నా బంధువులు-అనుకొంటూ బ్రతికాడు. వార్ధక్యంలోకి రాగానే అందరూ తనను నిర్లక్ష్యం చేస్తున్నారని గ్రహిస్తాడు. కోపము + అసమర్థత కలగాపులగమై ఉడుకుబోతుతనం వస్తుంది. First ignored by wife, next ignored by sons and finally ignored by everybody.

బిడ్డల్ని కౌగిలించుకొని, మలమూత్రాలు శరీరంలో ఇంకిపోయే అంతగా చేరదీసి పెంచానే! నేను వీళ్లకోసమే పాటు పడ్డానే! నేను వీళ్లమీద చూపించిన అభిమానంలో శతాంశం కూడా వీళ్లకు నా మీద లేదే! పైగా శత్రుత్వం! ఇదేమిటి?

భగవంతుడు పశుపక్ష్యాది సకల ప్రాణులకు "సంతాన ప్రేమ" పెట్టాడు. ఆహార - నిద్రా - భయ - మైథునాలలో మానవుడికి తక్కిన ప్రాణులకీ భేదంలేదు. వివేకం - (జ్ఞానం) మానవుడి ప్రత్యేకత. పశుపక్ష్యాదులు బిడ్డలను చాలా ప్రేమిస్తాయి. బిడ్డలకోసం తమ ప్రాణాలు కూడా అడ్డం వేస్తాయి. ఇంత ప్రేమగా పెంచిన తల్లిదండ్రుల్ని పశుపక్ష్యాదులు వయస్సు రాగానే మరచిపోతాయి. వాటికి మాతృప్రేమ పితృప్రేమ తెలియదు!

మానవుడు వివేకం తెలిసినవాడు. తల్లి తన ప్రాణాలు పణంగా పెట్టి కన్నదనీ, నవమాసాలు మోసిందనీ, మలమూత్రాలనుండి రక్షించిందనీ గ్రహించాడు. తల్లిదండ్రుల్లో తల్లిగొప్పతనాన్ని తెలుసుకొన్నాడు. ముందుగా "మాతృదేవో భవ!" అన్నాడు. తన కోసమే జీవించినవాడుగా తండ్రిని అర్థంచేసుకొన్నాడు. "తల్లి సేవించిన దైవతార్చనమేల? తండ్రి గల్గిన పెన్నిధానమేల?" అనుకొన్నాడు.

విద్యాబోధనలో గురువులు, మానవధర్మాలు చెప్పి శాసించారు. "మాతృదేవో భవ!" (తల్లిని దైవంగా భావించు); "పితృదేవో భవ!" (తండ్రిని దైవంగా భావించు)

అని బోధించారు. విద్యతో, వివేకజ్ఞానంలో కృతజ్ఞతాభావంతో, తల్లిదండ్రులయందు ప్రేమాభిమానాలు పెంచుకొన్నాడు మానవుడు.

నీరు పల్లానికి వెడుతుంది! దానికి మన ప్రయత్నం అక్కర్లేదు! మెరకకు (పైకి) ఎక్కించాలంటే మన ప్రయత్నం కావాలి! చాలామంది కొడుకులు తల్లిదండ్రుల్ని ఆదరాభిమానాలతో చూస్తున్నారంటే, వాళ్లు మనుష్యులుగా ప్రవర్తిస్తున్నారని అర్థం! “తల్లిదండ్రుల్ని కొంతమంది పట్టించుకోవటం లేదు” అంటే, వాళ్లు పశువులుగా ప్రవర్తిస్తున్నారని అర్థం. మనుష్యులు కారని తాత్పర్యం!

ఒక మూర్ఖుడు తండ్రిని “నన్ను ఎవడు కనమన్నాడు?” అని సూటిగా ప్రశ్నించాడు. “ఓరి వెధవా! నేను కనకపోతే, ఏ పందో కుక్కో కనేది. నేను కన్నాను కాబట్టే మనిషివై పుట్టావు! మనిషిలా బ్రతుకు!” అన్నాడు. తల్లిదండ్రుల్ని ఆదరాభిమానాలతో చూడటం అలవరచుకో. నీవు నీ తల్లి దండ్రుల్ని గౌరవంగా చూడటం నీ బిడ్డలు చూస్తూ ఉంటారు. వాళ్లు నిన్ను వార్ధక్యంలో ఆదరిస్తారు. ఈ సంస్కారం ఒక తరంకోసం ఏర్పరచింది కాదు! తరతరాలుగా ఉండవలసిన ఉత్తమ సంస్కారం!

వార్ధక్యంలో శరీరం కష్టపడటానికి పనికిరాదు! కన్నపిల్లలపై ఆధారపడి జీవించవలసిందే! మానవజాతి ఏర్పడినప్పటినుండీ వృద్ధులైన తల్లిదండ్రులున్నారు. మాతాపితృసేవ చేస్తున్న పుత్రులున్నారు. రామాయణంలో మునికుమారునికథ – భారతంలో ధర్మవ్యాధోపాఖ్యానం ప్రత్యేకంగా ఉన్నాయి. ప్రతికుటుంబంలోను పెద్దలున్నారు. వారిని ఆదరాభిమానాలతో చూచే పుత్రులున్నారు. ఇది ఒక సుచరిత్ర క్రమం. నిర్లక్ష్యంగానో, లక్ష్యంగానో, మాతాపితృసేవ బాధ్యతగా కొడుకులు చేయటం ఆచారంగా వస్తోంది. తల్లిదండ్రుల్ని గౌరవించినవాళ్లు – అభిమానించినవాళ్లు ఎక్కువగా ఉండేవారు. తల్లిదండ్రుల్ని అనాదరణ చేసినవాళ్లూ, నిర్లక్ష్యంచేసిన వాళ్ళూ కథలకు ఎక్కారు. అలాంటి వాళ్లు తక్కువ ఆనాడు! రాజమండ్రిలో ఒక బ్రాహ్మణుడు, గోదావరిలో స్నానంచేసి, పవిత్రంగా గృహస్థులకు మంచినీళ్లు అందిస్తూ జీవితం గడిపాడు. కొడుకును కష్టపడి చదివించాడు. వాడు ప్లీడరు అయ్యాడు. ఈ తండ్రి మంచినీళ్ల కావడిలో అలవాటైన అంగవస్త్రమే (మోకాలు దిగని వస్త్రం) ధరించేవాడు. ప్లీడరు గారూ చాలా అభివృద్ధిలోకి వచ్చారు. కోర్టు వ్యవహారాలకోసం వచ్చినవాళ్లతో, వారియిల్లు నిండుగా ఉంది. సదరు తండ్రి ప్రక్కగదిలోకి వెడుతున్నాడు. ఒకాయన “ఎవరండీ ఆయన?” అని అడిగాడు ప్లీడరుగారిని. “మాయింట్లో వంటవాడు!” అన్నాడు. అంత ఎదిగినా అదీ ఆ అన్యాయవాది సంస్కారం!

ఒక వృద్ధుడు, కొడుకు కోడలు దగ్గర జీవితం గడుపుతూ ఉన్నాడు. వృద్ధుడికి ఒక గది ఇచ్చారు. అందులో నులకమంచంమీద పరుండి ఉంటాడు. "ముసలాణ్ణి అన్నానికి రమ్మనరా!" అంటే, ఏడేళ్ళ మనవడు "తాతా! అన్నానికి రమ్మంటోంది మా అమ్మ" అనే వాడు. ముసలాడు మట్టి మూకుడు తెచ్చుకొనేవాడు. ఆ మూకుడులో కోడలు అన్నం వేసేది. అది తిని, మూకుడు కడిగి, గదిలో బోర్లించుకొనేవాడు వృద్ధుడు.

ఇది ఆయింట్లో ప్రతిరోజూ జరిగే విధానం. ఏడేళ్ల మనవడిలో ''తాతకు మట్టిమూకుడులో ఎందుకు పెడుతున్నారు?" అనే ప్రశ్న వయస్సుతో పెరుగుతోంది. మనవడికి పదేళ్ళు వచ్చాయి. తాతని అన్నానికి రమ్మన్నాడు మనవడు! రెండు ముక్కలుగా అయిన మూకుడు, రెండు చేతులతో పట్టుకొని వణికిపోతూ వస్తున్నాడు తాత. "ఏరా ముసిలోడా! మూకుడు పగలగొట్టావా? ఆ మూకుడులోనే, మా అమ్మకీ నాన్నకీ పెడదామనుకొన్నా. ఇప్పుడు వాళ్లకి ఎక్కడ పెట్టాలి?" అంటూ గద్దించాడు మనవడు. వృద్ధుడు "బాబూ!" అంటూ బావురుమని, మనవణ్ణి కౌగిలించుకొన్నాడు. వాళ్లూ, తాతా మనవలు అంటే!

తల్లిదండ్రులు కొడుకుల దగ్గర ఉండే సదాచారం అరవైయేళ్లుగా తగ్గిపోతూ వచ్చింది. కొడుకులు ఉద్యోగాలకోసం ఎక్కడెక్కడికో వెళ్లిపోవటం, తల్లిదండ్రులు ఇల్లు-ఉన్నఊరు విడిచిపెట్టలేక ఉండిపోవటం, కొంతమందికి కారణాలు కావచ్చు! "పిల్లలు తల్లిదండ్రుల్ని ఆదరాభిమానాలతో చూచే సంస్కారం కూడా తగ్గిపోయింది!" అనే సత్యాన్ని వృద్ధాశ్రమాలు ఎలుగెత్తి ఘోషిస్తున్నాయి. మనం ఏమనగలం? కాదు అనగలమా?

70 ఏళ్లు దాటిన దంపతుల ఇంటికి వెళ్లాను. "పెద్దవాళ్లైపోయారు, పిల్లల దగ్గరకు వెళ్లకపోయారా?" అన్నాను. "అబ్బాయి ఇంటిదగ్గర ఉందామనుకున్నామండి! అది కోడలు ఇల్లైపోయింది! కూతురింటికెడదామంటే అది ఎల్లాగూ అల్లుడిల్లే కదా!" అంది ఆ యిల్లాలు. కొడుకు దగ్గరకు వెడదామనే ఆలోచన ఉంది. "కోడలికి ఇష్టం లేదు'' అని వెళ్లటానికి జంకుతున్నారు అనుకొన్నాను. అల్లుడు దగ్గర ఉండటానికి మొహమాటపడుతున్నారు.

"మీ అమ్మనీ నాన్ననీ నీ దగ్గరకు తీసుకుపోతే నీకూ బెంగ ఉండదు! వాళ్లకీ బాగుంటుంది. వాళ్లు ఇక్కడ - నువ్వు అక్కడ ఎందుకు?" అని నా విద్యార్థి ఐన వాణ్ణి అడిగాను. "మా అమ్మ నాన్న మా యింట్లో సద్దుకోరండి! ఏవో గొడవలు పడతారు. అందుకని నెలకి ఐదువేలు పంపిస్తూ ఇక్కడే ఉండమన్నానండి!" అన్నాడు. లోపాలు

అనేవి కొడుకు – కోడళ్లలోనే కాకుండా, వృద్ధులైన తల్లిదండ్రుల్లో కూడా ఉంటాయి – అనుకొన్నాను.

**కొడుకు ఇంట్లో ఉండటం:–**

కొడుకు ఇంట్లో ఉంటున్న వృద్ధదంపతులు తప్పక పాటించవలసిన కొన్ని నియమాలు తెలియజేస్తున్నాను:–

1) నీకు ఒక గది ఏర్పాటు చేస్తారు. నీవు ఎప్పుడూ ఆ గదిలోనే ఉండాలి! మంచినీళ్లు అక్కడ పెడతారు. ఆ గదికి ఎటాచ్డ్ లేవెట్రీ – బాత్‌రూం ఉంటాయి. కాఫీ – టిఫెన్లు పనిమనిషి తెచ్చి పెడుతుంది. భోజనం టైం ప్రకారం ముగించుకొని, వెళ్లిపోవాలి నీ సెల్‌లోకి!

2) ఇంటికి వచ్చిన అతిథులతో నీవు హాల్లోకి వచ్చి మాట్లాడకూడదు! నీ గదిలోకి వచ్చి పల్కరించిన వాళ్లతో కూడా ఒకటి రెండు మాటలకంటె ఎక్కువగా మాట్లాడ కూడదు.

3) యజమాని (నీ కొడుకు) భార్యతోగాని, పిల్లలతోగాని – ప్రక్కయింటి వాడితోగాని, గొడవ పడుతోంటే, నీవు కలగజేసుకోకూడదు. నీ కోడలు కొడుకుతోగాని, కూతురుతోగాని, ఘర్షణ పడుతోంటే, అందులో మీ దంపతులు లేదా నీవు తలదూర్చకూడదు!

4) వాళ్ల కుటుంబ వ్యవహారాలైనా, నీకు తెలిసినవైనా, నీవు ఎన్నడూ సలహాలు ఇవ్వకు! వాళ్లు అడిగినా "మీరు ఆలోచించి చేసుకోండి!" అనాలి!

5) నీ మందులు అయిపోతే, "భార్యాభర్తలు ప్రశాంతిగా ఉన్నారు" అని తోచినప్పుడు మందులచీటీ ఇయ్యి! అయినా తేకపోతే మన ఖర్మం! అనుకో! ఛస్తే ఏం? అనుకో!

6) ఆ కుటుంబంలో ఉన్న ఆడపిల్లల వేషాల్ని – మగపిల్లల ప్రవర్తనల్నీ సంస్కరించాలని ఎన్నడూ ప్రయత్నించకు! అది మహాదోషం అయిపోతుంది. నిన్ను కట్టి కుదుపుతుంది! బహిష్కరిస్తుంది ఆ పాపం!

7) ఆదివారం వస్తుంది. 16–18 మధ్య వయస్సు ఉన్న ఆడపిల్లలు–మగపిల్లలు హాలులో కారమ్స్ కోలాహలంగా ఆడుతూ ఉంటారు. ఆనందంలో కరచాలనాలు, కోపాలలో ఒకరినొకరు త్రోసివెయ్యటాలు, వీళ్లందరికీ నీ కోడలు పనిమనిషితో టీ కప్పులు పంపించటం – ఇవన్నీ ప్రతివారం జరిగేవే! ఇది కంట్రోలు చేద్దామని కాని, "వయస్సొచ్చిన పిల్లలు ఇదేమిటి?" అని ప్రశ్నించటం కాని చేస్తే – నీవు ఆకుటుంబంలో సభ్యత్వం కోల్పోతున్నావన్నమాట!

8) 18 ఏళ్ల మనవరాల్ని, స్కూటరు ఆపి, ఎవడో గేటుదగ్గర దింపుతాడు. కరచాలనం అయ్యాక, ఆనందంతో నవ్వుతూ, మనవరాలు గుమ్మందగ్గరకు వస్తుంది. "ఎవడేవాడు?" – "మా ఫ్రెండులే బామ్మా! లిఫ్టిచ్చాడు" – "వయస్సొచ్చిన పిల్లవు! ప్రతీ వెధవతోటి ఆ వికవికలు పకపకలూ ఏవిఁటి?" – "ఏమండీ! మీ అమ్మ పసిపిల్లలికి అంకులు కడుతోంది!" అంటుంది కోడలు. మీ యిద్దరికీ వార్నింగులు అవుతాయి! అందరూ మిమ్మల్ని శత్రువుల్లా చూస్తారు. ఆ తరువాత బిట్ కొశ్చన్స్! బిట్ ఆన్సర్సు!! మీతో–

9) స్నానాల గదుల్లోను – లేవట్రీ విషయంలోను – డైనింగ్ హాల్లోనూ మీరు క్లాష్ కాకూడదు. వాళ్లు లేవటానికి ముందే, నీ పనులు ముగించుకో! లేదా "అందరి అవసరాలు తీరాయి" అనుకొన్నాకే నీ పని చూసుకో! నీవు ఉండే సెల్‌కు ఎటాచ్డ్ బాత్‌రూం వేరుగా ఉంటే ఈ సమస్య రాకపోవచ్చు!

10) హాలులో "ల్యాండ్‌ఫోను" మ్రోగుతుంది. మీ యిద్దరిలో ఎవ్వరూ ఫోను ఎత్తకూడదు! మాట్లాడకూడదు! అది "పెర్సనల్ పోస్టుకవరు చించి చదివినంత మహాపాపం!" నీవు ఎవరితో అయినా ఫోనులో మాట్లాడాలంటే, వాళ్లను అడిగి ఫోను చేసుకో! నీ సెల్ఫ్ పోను నీకుండటం మంచిది! గుర్తుంచుకో!

11) వృద్ధులు చాలామంది 'నరసింహ శతకం' – 'దాశరథీ శతకం'–'భక్త చింతామణీ శతకం' – 'సుమతీ శతకం' లాంటి శతకాలు గొంతెత్తి చదువుతూ ఉంటారు. వాళ్ల ఇంట్లో వాళ్ల ఇష్టం. నీకు కూడా ఆ అలవాటు ఉంటే మార్చుకో! వాళ్లకు విసుగు కల్గించి, వాళ్లు హెచ్చరిక (వార్నింగ్) ఇచ్చాక, నీవు మార్చుకోవటం కాదు! వాళ్ల ఆలోచనలు అర్థం చేసుకొని, నువ్వు ముందు జాగ్రత్తలు తీసుకో! "పెట్టింది తిని" – "చెప్పినట్లు విని" – "చచ్చినట్టు పడి ఉంటే" వార్ధక్యం గడుస్తుంది. నీకు రోజులు నడుస్తాయి! లేకపోతే నీ ఖర్మం!

**భోజనకాండ: –**

(1) "మహాఋషీణాం మతయశ్చ భిన్నాః" (ఋషుల బోధనలు వేర్వేరుగా ఉంటాయి) అన్నట్లుగా, ఒక్కొక్క కొడుకు ఇంట్లో, ఒక్కో పద్ధతిగా ఉంటుంది. ఇది నువ్వు కడుపులో ఉంచుకోవాలి. కడుపు చించుకొంటే కాళ్లమీద పడుతుంది! నోరెత్తకుండా – "ఎప్పుడు చచ్చావ్?" అంటే–"ఆర్నెల్ల క్రితం" అన్నట్టుగా ఉండాలి! గుర్తుంచుకో! వండిన అన్నం – కూరలు – వగైరా అందరూ తినేస్తారు. తినగా మిగిలిన పదార్థాలతో ఉన్న గిన్నెలు టేబుల్ మీద పడేసి వెళ్లిపోతారు. అప్పుడు నువ్వు పిల్లిలా (పిల్లి అడుగులకు చప్పుడుండదు) ఆ టేబులు దగ్గరకు చేరి, నీకు మొదటి

రోజు పెట్టిన కంచంలోనే తినాలి! సాధారణంగా నీవు తినవలసిన ప్లేటు, గ్లాసు ప్రత్యేకంగా ఉంచుతారు. ఉన్న పదార్థాల్లో, నీయిష్టానిష్టాలతో నిమిత్తం లేకుండా; రుచులు ఎంచకుండా, కడుపునింపుకొంటే ఆ రోజుకు బ్రతుకుతావు!

(2) మరో సుపుత్రుడి యింట్లో మరో పద్ధతి. నీవు వెళ్లిన రోజు భోజనానికి ఆహ్వానిస్తారు వడ్డించి. నీకు ప్రత్యేక స్థానం, ప్రత్యేకమైన ప్లేటు, గ్లాసు ఉంటాయి. అందరితో పాటు, సహపంక్తి భోజనం ఉండదు! అది వాళ్లు నీకు ఇచ్చే ప్రత్యేక గౌరవం అనుకోవాలి! మర్నాడు నిన్న నిన్ను పిల్చిన వేళకు, టేబిలు మీద "ఢాం!" మని కంచం మ్రోగుతుంది. ఉలిక్కిపడకు – "అది నీ భోజనాహ్వాన సంకేతం"గా గ్రహించు! అక్కడ అన్నీ "వడ్డించిన విస్తరి"లా ఉంటాయి. మజ్జిగ మంచినీళ్లతో సహా అక్కడక్కడే ఉంటాయి. నోరు మూసుకొని తినడం కుదరదు కాబట్టి, నోరెత్తకుండా తిని, నీ "సెల్"లోకి నువ్వు వెళ్లిపో! ఉప్పు – కారం ఎక్కువ తక్కువలు, అన్నం కూరల ఉడుకుదలలు, నీ అభిప్రాయాలు ఎవరికీ అక్కరలేదు! ఎలా ఉంటే అలా తినటం అలవాటు చేసుకొంటే బ్రతకగలవ్! లేదా; అంతకంటే వేరే దారిలేదు!

(3) ఇంకో కొడుకు ఇంట్లో కోడలు స్వహస్తాలతో వడ్డిస్తుంది. విసురుగా వడ్డిస్తుంది. కొన్ని పదార్థాలు "టప్–టప్" అంటూ చప్పుడు చేస్తాయి. నువ్వు మాత్రం నిశ్శబ్దంగా ఉండాలి! వడ్డన అయిపోయాక, ఆ అన్నపూర్ణాదేవి అంతర్ధానం అవుతుంది. "అమ్మా! ఈ కూర బాగా చేశావ్! అమ్మా అన్నం కొంచెం ఉడకాల్సింది! పప్పులో ఉప్పు మరచిపోయావ్!" – ఇలాంటి నిందాస్తుతులు రెండూ నీకు నిషేధమే! మొన్న ఈ మధ్య, మా తమ్ముడు వరసవాడు, హైదరాబాదు కొడుకింటికి వెళ్లాడు సతీసమేతంగా. కోడలు మితభాషిణి. భర్తకు మామగారికీ ఒకేసారి వడ్డిస్తోంది. ఆ తరువాత అత్తగారూ ఆమె తింటున్నారు. రెండు రోజులు గడిచాయి. మూడవ రోజు వృద్ధుడూ – కొడుకూ భోజనం చేస్తున్నారు. "అమ్మాయ్! అన్నం కొంచెం మెత్తగా వండమ్మా! తినలేకపోతున్నా" అన్నాడు. (ఆమె మాట్లాడలేదు.) వెంటనే కొడుకు "ఏమయ్యోయ్! నీకు మెత్తగాను, ఇంట్లో వాళ్లకి బిరుసుగాను, ఇన్నివంటలు మా ఆవిడ చెయ్యలేదు! ఉంటే ఉండు! లేకపోతే నీయింటికి నువ్వు ఫో" అన్నాడు కోపంగా. "అక్కడ ఉండాలా? ఇంటికి రావాలా?" అనే ఆలోచనలో ఉన్నాడు కొన్నాళ్లు.

(4) భోజనానికి పిలిచినప్పుడు వెంటనే వెళ్లి ఎంగిలిపడాలి! అంతేకాని, "ఇప్పుడాకలిలేదు" – "తరువాత తింటాను" – "అబ్బాయితో తింటాను" – "పిల్లలు వచ్చాక తింటాను" అని వాయిదాలు వెయ్యకూడదు. నువ్వు ఎప్పుడు తింటే అప్పుడు పెట్టటం కోసం వాళ్లు లేరు. వాళ్ల బాధ్యతలు వాళ్లకుంటాయి. నువ్వు వాళ్లయింటికి

వెళ్లావు! లోకధర్మాన్ని అనుసరించి "భోజనం పెడతాం" అంటున్నారు. అలాంటి కొడుకూ కోడలూ ఉండటం నీ అదృష్టం! చెప్పినట్లు విని, పెట్టింది తిను! మరో లోకానికి తలుపులు తెరిచినా, మారాములు మానవు! ఎలా బ్రతుకుతూవురా పిచ్చినాన్నా! ఇంతవరకూ నాణానికి ఒక ప్రక్కే చూశాం! మరోప్రక్క ఇప్పుడు చూద్దాం!

**వృద్ధులైన తల్లిదండ్రులు కొడుకులను పెట్టే బాధలు:–**

మా తరంలో నలుగురైదుగురకు పైగా కొడుకులు ఉండేవారు. అందులో కొందరికి తల్లిదండ్రులంటే ప్రేమ. వాళ్లకి తక్కిన వాళ్లు సరిగ్గా చూడరేమో– అని అనుమానం. వృద్ధులైన తల్లిదండ్రులయందు జాలి ఎక్కువగా ఉంటుంది. తల్లిదండ్రులకు ఏమైనా లోటు జరిగితే భార్యను సహించరు. తల్లిదండ్రుల్ని చూడాలని వచ్చిన సోదరుల్నీ వారి కుటుంబాల్నీ రోజుల తరబడి భరిస్తారు ఈ మాతాపితృభక్తులు!

వచ్చేవాళ్లు మిఠాయి కొమ్ములో, కోవాబిళ్లలో, పటిక బెల్లమో, కానుకలు తెస్తారు. అవి తింటూ, ఇక్కడ అభిమానంగా చూస్తున్న కొడుకు కోడళ్లమీద చాడీలు చూచిపోయేవాళ్లతో చెప్పటం ప్రారంభిస్తారు. ఉదాహరణకు 1) "స్నానానికి వేణ్ణీళ్లు పెట్టమంటే వేడి నీళ్లు బాత్‌రూంలో పెట్టేస్తుంది. అవి చల్లారిపోతాయి. అవి ఎల్లాగరా పోసుకోవటం? నువ్వే చెప్పు!", 2) "వాడు చూస్తే, వేళకు తినమంటాడు. ఆకలవందే ఎలా తింటాం?", 3) "చిరుతిళ్లు తినవద్దు! అంటాడు అందరూ తింటోంటే తినకుండా ఎలాఉంటాం? నువ్వేచెప్పు!" 4) "పొరుగిళ్లకు వెళ్లి మనయింట్లో గొడవలు వాళ్లకు చెప్పకూడదు – అంటాడు. వాళ్లయింట్లో కష్టసుఖాలు మనకి చెప్పినప్పుడు మనం చెప్పటం తప్పా!", 5) "అది చూస్తే, బీరకాయి వండమంటే, పొట్లకాయి వండుతుంది! కావలసింది చేసిపెట్టదు!" ఇలా ఉంటుంది వాళ్లధోరణి. "ఇక్కడ ఉండలేంరా! నీదగ్గరకు వచ్చేస్తాం తీసుకుపో" అంటారు. "నేను మిమ్మల్ని తీసుకుపోతాను. కాని అద్దెకున్న ఇల్లు చిన్నది. క్వార్టర్సు ఇచ్చాక తీసుకోపోతా" అంటాడు. దగ్గర తీసి ఆదరించే కొడుకు కోడలు లోకువ. వాళ్ల పిల్లల్ని విసరికొట్టటం, 'మిఠాయి కొమ్ములుగాడి' పిల్లల్ని గొప్పచెయ్యటం – ఈ పిచ్చి ప్రవర్తనతో ఆదరించే కొడుకులకు దూరం అవుతున్నారు కొందరు పిచ్చి తల్లిదండ్రులు! నాటకంగాళ్లమీద అభిమానాలు అల్లుకొంటున్నారు.

**తప్పులు:–**

(1) వయస్సు వచ్చిన ఆడపిల్లల్ని "చున్నీ లేకుండా బయటకు వెళ్లకు! మగపిల్లలకు దూరంగా ఉండాలమ్మా! వంచినతల ఎత్తకూడదు! చక్కగా జడవేసుకో!

పూనకం వచ్చినట్టుగా తలవిరబోసుకోవటం బాగుండదమ్మా!" అంటూ ఆడపిల్లలకు నాయనమ్మలు బోధించటం; మగపిల్లల్ని కంట్రోలు పెట్టాలని తాతయ్యలు తాపత్రయపడటం, వాళ్ళమీద కోపించటం, కొడుకును శాసించినట్లు మనవలతో మాట్లాడటం!

(2) భర్తకు అఫీసుకు వేళ అయింది. ఆయనకు భోజనం పెట్టే హడావుడిలో కోడలుంది. అదే సమయానికి ముసలాడు "నాక్కూడా వడ్డించమ్మా! మా వాడితోనే నాలుగు మెతుకులు తింటా!" అంటూ సిద్ధమవటం; పిల్లలకు టిఫెను పెట్టే హడావుడిలో కోడలుంటే, "మేం కూడా టిఫెను చేసేస్తాం" అంటూ దిష్టిబొమ్మలు రెండూ సిద్ధం అవటం!

(3) "మావయ్యగారూ! అందరి భోజనాలూ అయ్యాయి. మీరుకూడా తినేస్తే, వంటయిల్లు కడిగేస్తా!" అంటుంది కోడలు. అప్పుడు మామగారు "నాకు ఇప్పుడు ఆకలిగా లేదమ్మా! కాసేపు ఆగి తింటా!" అనటం!

(4) ఉన్నది ఒక్క లేవెట్రీ! ముసలాడు ఉదయం 6 గంటలకు దూరి, తలుపేసుకుంటాడు. 7.30 దాకా తలుపుతియ్యడు! "ఏమిటయ్యా ఇది? అందర్నీ చంపుతున్నావ్!" అంటే "ఏం చెయ్యన్రా! కాన్‌స్టిపేషను" అంటాడు. – పొట్టపట్టుకొని ఉన్న నల్గురితో. పిల్లలు కాలేజికి రెడీ అయ్యేవేళలో ముసలాడు జలక్రీడలు!

(5) కొడుకు, కోడలూ, ఆర్థిక సమస్యలో తలమునకలుగా ఉన్నారు. అదే సమయంలో తన అవసరాల వాజ్మూలం అందివ్వటం! ఆ కుటుంబంలో భార్య – భర్తతోగాని, భర్త – భార్యతోగాని చర్చిస్తోంటే, అడ్డంగా వచ్చి తీర్పుచెప్పటం!

(6) తండ్రి – కొడుకునుగాని, తల్లి – కూతుర్నిగాని మందలిస్తోంటే, ముద్దాయిపక్షం చేరటం.

(7) "వీడి అభివృద్ధికోసం, ఎన్నిపాట్లు పడ్డాను! తినీతినక చదువు చెప్పించాను! ఇంతవాణ్ణి చేశాను. వీడికేమైనా విశ్వాసం ఉందా? నన్ను తండ్రిలా చూడటం లేదు. ముష్టివాడికి పడేసినట్లు ఇంతముద్ద పడేస్తున్నాడు. మొన్న అర్ధరాత్రి గుండెల్లో నొప్పి వచ్చింది. హాస్పిటలుకు తీసుకుపోరా–అని బ్రతిమాలాను. జీలకఱ్ఱ పంచదార కలిపి నానోట్లో పోశాడు. నొప్పి తగ్గిందనుకో! తగ్గకపోతే అంతే కదా!" అంటూ పరాయివాళ్ల దగ్గర డైరీ తిరిగెయ్యటం. "అసలు నేను వృద్ధాశ్రమంలో చేరుదామన్నాను. మా ఆవిడ వింటేగా? 'కొడుకింటికి! కొడుకింటికి!' అంది. ఇలా ఉంది నిర్వాకం!" అనటం.

(8) "వంకాయ బండపచ్చడి బాగుంటుంది. మిక్సీలో పేస్ట్ అయిపోతుంది! బాగుండదు. 'బండపచ్చడే చెయ్యి' అన్నాను. మిక్సీలోనే తగలేసింది. 'కూర, పులుసు

పెట్టి వండమ్మా నాలుక చచ్చిపోయింది!' అంటే – 'పిల్లలు తినరు!' అని వేపుడు చేసింది!" అనటం

(9) పనిలో ఉన్న కోడలుతో – ఏదో గొడవలో ఉన్న కొడుకుతో – పనిగట్టుకు మాట్లాడటం.

(10) ఇంటికి వచ్చిన వాళ్లను నిలబెట్టి చిత్రీపట్టటం! (ప్రశ్నలు వెయ్యటం) – "ఎందుకు? ఎవరికోసం? ఏం పని? నీకు ఏంపని? పిల్లలెందరు? ఏం చేస్తున్నారు? పెళ్లి అయిందా? ఏ ఊరు? వాళ్లకి పిల్లలా? మీ యిల్లు ఎక్కడ? పెంకుటిల్లా? డాబానా? అద్దెకిచ్చారా?" ఇలా ప్రశ్నలు కుప్పించటం. "ఆయన అలా అడుగుతూనే ఉంటాడు. (లేదా), ఆవిడ అలా అడుగుతూనే ఉంటుంది. లోపలికి రా అమ్మా!" అని కోడలు కేక!

వార్ధక్యంలో బ్రతకటానికి చాలా తెలివి కావాలి! కాని వార్ధక్యంలో శరీరబలంతో పాటు చాలామందికి బుద్ధిబలం కూడా తగ్గిపోతుంది. అందరూ తనని నిర్లక్ష్యంగా చూస్తున్నారనే ఉడుకుమోతుతనం పెరుగుతుంది. "నడవలేని తన దుస్థితి" చూచుకొంటూ, "పరిగెత్తుతున్న ప్రపంచాన్ని" చూస్తోంటే, ప్రపంచం తనని మూలకు త్రోసివేసిందనే భావన పెరిగిపోతుంది.

ఈ వార్ధక్యంలో నీ పద్ధతులు, అలవాట్లూ, మాటతీరూ, ఎంతో మార్చుకొంటే బిడ్డలదగ్గర (అందులోను ఉత్తమ పుత్రుల దగ్గర) బ్రతకవచ్చు! "నీవంటే నీ కొడుక్కే ఇష్టం లేదు!" అనే చోట ఉండాలని ఊహించకు! కూతురు దగ్గర ఉండవచ్చునేమో? ఆలోచించుకో! నీ దగ్గర ఉన్న ఆస్తుల కోసం నిన్ను రమ్మనే వాళ్లుంటారు. నీ ఆస్తులు కాజేసి నిన్ను నిరాధారంగా నిలబెడతారు! కన్న పిల్లలలో కన్పించని అభిమానం, పైవాళ్లలో ఉంటుందనుకోవటం నీ అజ్ఞానం! పైవాళ్లను ఆశ్రయించటం కంటె, వృద్ధాశ్రమాలలో చేరటం వివేకం!

**పిల్లలుచూడరు–వృద్ధాశ్రమంలో చేరటానికి ధనంలేదు! మరి ఎలా?**

తన కన్నపిల్లల్ని నమ్మటం – కట్టుకొన్న భర్తను నమ్మటం – భార్యను నమ్మటం – ఇవి అపరాధాలా? అంటే నీ తప్పుకాదు. నీవు నమ్మినవాళ్లు చేసిన తప్పులు! నమ్మటం అనే తప్పు నీవూ చేశావు; మోసపోయావు! భాగవతంలో "చుట్టాలు దొంగలు! సుతులు ఋణస్థులు! కాంతలు సంసారకారణములు" అన్నాడు. బృహదారణ్యకోపనిషత్‌లో "ఆత్మవస్తు కామాయ పత్నీ ప్రియా భవతి" (తన ఆనందంకోసమే భార్యను ప్రేమిస్తున్నాడు)."ఆత్మనస్తు కామాయ పుత్రః ప్రియో భవతి" (తన ఆనందం

కోసమే, పుత్రుని తండ్రి ప్రేమిస్తున్నాడు). బిడ్డలకు వాళ్ల భార్యాపిల్లలు వాళ్లకు ముఖ్యం! తల్లిదండ్రుల్ని వార్ధక్యంలో దగ్గరుంచుకొని ఆదరాభిమానాలతో చూడటం ఉత్తమపుత్ర లక్షణం! అలాంటి పుత్రులు పుణ్యాత్ములకే లభిస్తారు. అలాంటి బిడ్డలలో దైవం కన్పిస్తాడు. ఒక లోకజ్ఞాని "మూడు నాలుగేళ్ల వయస్సులో నీ కొడుకును నీ దగ్గర ఉంచుకోకుండా హాస్టలుకు అప్పగించావు! ఇప్పుడు నీ కొడుకు నిన్ను వృద్ధాశ్రమానికి అప్పగించటంలో తప్పేముంది?" అని ప్రశ్నించాడు. డబ్బు పడవేసి కొందరు విముక్తులవుతున్నారు. అదీ చెయ్యని వాళ్లున్నారు.

సంఘంలో భార్యాభర్తలు – తండ్రీకొడుకులు – అన్నదమ్ములు అనే అనుబంధాలు, అభిమానాలు అంతరించాయి. కాని "ధనం జీవితానికి ఇంధనం" అనే సత్యాన్ని 90 శాతం గమనించారు. ఈనాడు వృద్ధులు చాలామంది ధనంతో ఉంటున్నారు. 1) సంతాన నిరోధం, 2) ధనం విలువ తెలియటం, 3) పెన్షన్లు ఉండటం. పిల్లలకు ఇష్టం లేనప్పుడు, వాళ్ల దగ్గర ఉండటం నరకంలో ఉండటం. వాళ్లకు నిరంతర క్షోభ కల్గించటం. నీవు ఒంటరిగా వచ్చావు; ఒంటరిగా చస్తావు! సంఘంలో హాయిగా వృద్ధాశ్రమంలో బ్రతకలేవా? నీ సొమ్ముతో, నీయిష్టం వచ్చినచోట, భగవంతుణ్ణి తలుచుకొంటూ తనువు చాలించు! అంత్యకాలంలో భగవన్నామస్మరణవల్ల మోక్షం తప్పకుండా వస్తుంది – అంది భగవద్గీత.

## 5.8 భగవద్గీతాప్రబోధం–ప్రస్తావన

### 1. పాఠకులకు నా విజ్ఞప్తి:–

చదువుతోపాటు మాకు ఉత్తమ సంస్కారాలు నేర్పిన మహోన్నత గురువర్యులు శ్రీ కేశిరాజు వెంకట నృసింహ అప్పారావుగారు. వారు భగవద్గీతను కొన్ని ప్రత్యేక సందర్భాలలో పారాయణం చేయించేవారు. భగవద్గీతాశ్లోకాలు కొన్ని సందర్భాలలో వివరిస్తూ సత్ప్రవర్తన అలవరచుకొమ్మని ప్రబోధించేవారు. వారి బోధనలతో భగవద్గీత మా గుండెల్లో చెరగని ముద్రగా నిలిచిపోయింది. వారు చెప్పిన శ్లోకాలు కొన్ని మా జీవయాత్రలో కరదీపికలుగా దారిచూపుతున్నాయి. నేను సంస్కృత విద్యార్థిని అవటంవల్ల శ్లోకాలు ప్రత్యక్షరం అర్థం అయ్యేవి. చాలా శ్లోకాలు ఆ చిన్నతనంలోనే ధారణ చేశాను.

1988లో ఉద్యోగవిరమణ చేసి, జన్మభూమి (తణుకు) చేరుకొన్నాను. శ్రీరామకృష్ణసేవాసమితివారు ప్రతిరోజు సాయంత్రం రెండుగంటలు భగద్గీత బోధించుమని నన్ను గీతాచార్యునిగా ప్రతిష్ఠించారు.

1) భగవద్గీతను తప్పులు లేకుండా చదివించుట, 2) అర్థతాత్పర్యాలు వివరించుట, 3) విశేషాలు బోధించుట, నా బాధ్యతగా నిర్వహించేవాడను. "సుఖావబోధార్థం ఆఖ్యాయికాఖ్యానం" (విషయం సూటిగా బోధపడటంకోసం సందర్భానుసారంగా కథలు చెప్పాలి) అన్నారు జగద్గురు శంకరాచార్యులవారు. మధ్యమధ్య వేదాంతకథలు కూడా నా ప్రబోధంలో దొర్లిపోయేవి! నెలకొక అధ్యాయంగా 18 నెలలు పట్టేది. "రెండు గంటల కాలం ఆధ్యాత్మిక విషయాలు వీళ్లు ఎలా (బరువు కాకుండా) వింటున్నారు?" అని నాలో నాకే ఆలోచన వచ్చేది. 1) శ్రోతలకు భగవద్గీతపై భక్తి ప్రపత్తులు, 2) నా గురువర్యుల ఆశీస్సుల బలం, 3) "120వ నిమిషంతో ముగిస్తారు" అని నాపై శ్రోతల నమ్మకం! ఈ మూడూ కారణాలు అని అనుకొనేవాణ్ణి!

"వ్యవహారం"గురించి ప్లీడరుగారు "పంటకు ఇంజెక్షను ఇవ్వాలి! రిసీవర్‌ను వేయించాలి!" – అంటూ చెప్తూ ఉంటారు. ఆ విషయాలు వారికి కరతలామలకం! "వ్యవహారం" చెప్పేవాడికి అర్థం అవుతుంది! వినేవాడికి ఒక్కముక్క కూడా అర్థం కాదు! "చెప్పేవాడికీ, వినేవాడికీ, అర్థం కానిది వేదాంతం!" అన్నాడొక ఆంధ్రనాటక కర్త! అదీ నేను బోధించేది!

భగవద్గీత అధ్యాయాలవారీగా బోధించిన నేను, ఒక్కొక్క అధ్యాయం రెండు గంటలుగా ఉపన్యాసాలు, 18 రోజులు 18 అధ్యాయాలుగా, ప్రయోగాత్మకంగా చేశాను.

"ఆపరితోషాత్ విదుషాం న సాధు మన్యే ప్రయోగ విజ్ఞానం" (జ్ఞానులకు ఆనందము కల్గించువరకు నా ప్రయోగము బాగైనదని నేను భావించను) అన్నాడొక సంస్కృతనాటక సూత్రధారుడు! అధ్యాయాలవారీగా నేను చేసిన ఉపన్యాసాలను శ్రోతలు శ్రద్ధగా ఏకాగ్రతతో విన్నారు. ఉత్తమ – మధ్యమ శ్రేణులకు చెందిన శ్రోతల ప్రోత్సాహంతో, ''గీతాప్రవచనములు''గా ముద్రించి, భగవద్గీతాభిమానులకు అందించాలని ఆశించాను.

"కృష్ణుని బొమ్మలు" ఎన్నో; ఎన్నెన్నో? భగవద్గీత గ్రంథాలు కూడా ఎన్నో? కృష్ణవిగ్రహాలు దేనిఅందం దానిదిగా ఉంటాయి. అలాగే గీతాగ్రంథాలు! నాయీ గ్రంథంలో పఠనానందం ఆసక్తి పాఠకులకు ఏ కొంచెం అందించగల్గినా, నా యీ కృషి సార్థకం అయినట్లే! ఈ గ్రంథ ప్రయోజనం నెరవేరినట్లే!

నాది పరిమిత జ్ఞానం! భగవానుని ఆధ్యాత్మికసంపద అందుకొనటానికి మానవమేధ చాలదు! శంకరాచార్యులవారివంటి దైవస్వరూపులు వివరించవలసిన దైవగ్రంథం ఇది! వారు వివరించారు! ఈ గ్రంథంలో నేను వివరించినది ఏమియును

లేదు! నేను అర్థంచేసికొని, అనుభూతిని పొందిన విషయములు వ్రాసి, గీతాభిమానులకు అందిస్తున్నాను.

**శ్లో॥ "మధులుబ్ధో యథా భృంగః । పుష్పాత్ పుష్పాంతరం వ్రజేత్;**
**జ్ఞానలుబ్ధః తథా శిష్యః । గురోః గుర్వంతరం వ్రజేత్!"**

మకరంద ఆసక్తియున్న తుమ్మెద, ఒక్క పుష్పముతోనే ఆగిపోదు! మరో పుష్పాన్నీ ఇంకో కుసుమాన్నీ, ఆశ్రయిస్తూనే ఉంటుంది! అలాగే గీతాభిమానులు నాయీ సంకలనాన్ని పఠింతురుగాక!

మరొక్క మాట! భగవద్గీతలో ఒక చోట వివరించిన విషయాన్నే పరమాత్మ మరో చోట ప్రస్తావిస్తాడు. "నేను మళ్లీ మళ్లీ చెప్తున్నాను. నా మంచి మాటలు విను!" అంటూ –

**"భూయ ఏవ మహాబాహో! శృణుమే పరమం వచః"** (10–1)

"మళ్లీ చెప్తున్నాను విను!" అంటాడు.

**"యత్తే஽హం ప్రీయమాణాయ వక్ష్యామి హిత కామ్యయా"** (10–1)

నీవు ప్రీతితో ఆలకిస్తున్నావు కాబట్టి నేను మళ్లీ మళ్లీ చెప్తున్నాను.

9 అధ్యాయంలో 34వ శ్లోకం, **"మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు!"** అనే శ్లోకం 18వ అధ్యాయంలో 65వ శ్లోకంగా యథాతథంగా శ్లోకమే పునరుక్తమయింది. విషయాలు ఆయా సందర్భాలలో మళ్లీ మళ్లీ చెప్పవలసి వచ్చినవి; గ్రహింపగలరు.

విశ్వరూప సందర్శన యోగంలో 11వ అధ్యాయంలో 48వ శ్లోకం: **"న వేద యజ్ఞాధ్యయనైః న దానైః"** అనే శ్లోకం – అదే భావం, ఛందస్సు మార్చి, 53వ శ్లోకంగా వ్యాసుడు పునరుక్తంగా వ్రాశాడు. **"నాహం వేదైః న తపసా న దానేన"** అంటూ రచించాడు; గ్రహించగలరు!

ఆధ్యాత్మిక విషయాలు మళ్లీ మళ్లీ చెప్పటంలో పునరుక్తిదోషం అని భావించకండి! శ్రద్ధగా వినే శ్రోతయందు అభిమానంతో గురువు మళ్లీ మళ్లీ చెప్తాడు. ఆధ్యాత్మిక విషయాలు మళ్లీ మళ్లీ చెప్పటం సంప్రదాయం.

రామాయణం సుందరకాండలో హనుమ రామకథను మూడు నాల్గు చోట్ల చెప్పాడు. చెప్పినపుడు అన్ని చోట్ల శుభాభివృద్ధి జరిగింది! ఒక అధ్యాయంలో వచ్చిన ఆధ్యాత్మిక సందర్భం, మరో అధ్యాయంలోను, ఇంకో అధ్యాయంలోను వచ్చాయి! ఒకే సందర్భ శ్లోకం – ఒకే ఉదాహరణం, మళ్లీ మళ్లీ చెప్పటం తప్పలేదు! ఒక్కొక్క

శ్లోకం తాలింపు దినుసులా, చాలా చోట్ల "నేనున్నాను" అంది! "వేదాంతంలో పునరుక్తి దోషం లేదు!" అని ఒక్క మాట అనుకొందాం! వేదాంత విషయాలు సువర్ణ పుష్పాలు! వాటికి నిర్మాల్యదోషం అంటదు! బలపడవలసిన ఆధ్యాత్మికవిషయాలు ఎంత పునరావృత్తం అయితే, అంత ముద్రితం అవుతాయి శ్రోతల మనస్సులలో.

అర్జున "విషాదయోగం"లో చివరి శ్లోకం (47వది)

**శ్లో॥ ఏవముక్త్వార్జునస్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్**
**విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః** (1-47)

1) అర్జునుడు ఇట్లు పలికి, యుద్ధభూమిలో "రథోపస్థః ఉపావిశత్" - రథోపస్థేః = రథము మీద; ఉపావిశత్ = చతికిలబడెను - అని గీతామకరందకర్త వ్రాసియున్నాడు.

2) చాలామంది, రథ + ఉపస్థః = రథము సమీపములో; ఉపావిశత్ = కూర్చుండెను - అని వ్రాశారు. రథము దగ్గరలో చతికిల పడెను - అనియే వ్రాసియున్నారు. ఇది అసంగతము. కృష్ణార్జునులు రథంమీద ఉన్నారు (రథము దిగి అర్జునుడు క్రిందికి వచ్చుట జరుగదు). రథంమీదే కూలబడినట్లు వ్రాయుట సముచితము.

3) ఈ విషయాన్ని ధ్రువీకరిస్తూ "శ్రీమద్భవద్గీత" (శంకరభాష్యము) అనువాద కర్త రాధాకృష్ణమూర్తిగారు అర్జునుడు రథంమీద కూలబడినట్లుగా ముఖచిత్రం వేశారు. వారిని అభినందించుకొన్నాను.

**2. గీతా కల్పతరుం భజే:-**

1) భగవానుడు చేసిన గానములు రెండు: 1. మురళీగానము, 2. గీతాగానము "మురళీగానంతో ద్వాపరాంతంలో వ్రేపల్లెవాసులు మాత్రం తరించారు. గీతాగానంతో లోకత్రయం తరించింది - తరిస్తోంది!

2) "ఉపనిషత్తులు అనెడి గోవులనుండి (పార్థుని దూడగా చేసి) కృష్ణుడు స్వయంగా పిదికి అందించిన పీయూషమే "భగవద్గీత!"

3) "701 శ్లోకాలలో ఎలా బ్రతకాలో బోధించిన ఉద్గ్రంథం-భగవద్గీత! మోక్షమార్గం స్పష్టంగా బోధించిన జగద్గురుబోధ - భగవద్గీత!

4) "దేహము" - "జీవుడు" - "పరమాత్మ" అను మూడింటిని విశ్లేషించిన మహాగ్రంథం!

5) జ్ఞాన - అజ్ఞానాలు బోధించి, సత్ప్రవర్తన అలవరచే అత్యుత్తమ గ్రంథం!

6) గీత, పారాయణగ్రంథం కాదు! అర్థం చేసికొని, ఆచరింపవలసిన గ్రంథం!
7) సర్వమత సామరస్యంతో, సమన్వయభావంతో, తత్త్వజ్ఞానాన్ని అందించిన వేదాంతగ్రంథం!
8) "కర్మ"–"భక్తి"–"జ్ఞాన" అనే మూడు మార్గాలు బోధించి, **"యథేచ్ఛసి తథా కురు!"** (నీ యిష్టమైన మార్గములో ప్రవర్తింపుము) అని సాధకునకు సంపూర్ణస్వేచ్ఛను ఇచ్చిన ఉత్తమగ్రంథం!
9) భగవద్గీత "ధ" – "మ" అనే రెండక్షరాల మధ్య దీపస్తంభంలా ఉండి, ధర్మప్రబోధం చేస్తున్న పుస్తకరాజం!
10) కన్నీరుపెట్టువారికి వెన్నుతట్టి, ధైర్యమిచ్చి, ఆనందమార్గం చూపే మహోన్నతగ్రంథం!
11) రెండవ అధ్యాయమైన సాంఖ్యయోగంలో "స్థితప్రజ్ఞుని లక్షణాలు" (54–72); 12వ అధ్యాయమైన భక్తియోగంలో "అద్వేష్టాది గుణాలు"; 13వ అధ్యాయమైన క్షేత్ర–క్షేత్రజ్ఞ విభాగయోగంలో "అమానిత్వాది గుణాలు"; 14వ అధ్యాయమైన గుణత్రయ విభాగ యోగంలో "గుణాతీత" లక్షణాలు; 16 వ అధ్యాయమైన దైవాసుర సంపద్విభాగ యోగంలో "దైవలక్షణాలు" మొదలుగా "ఉత్తమ లక్షణాలు" వివరిస్తూ, సత్ప్రవర్తనం అలవరచే సద్గ్రంథం భగవద్గీత!
12) "దుఃఖనివృత్తి" – "ఆనంద అనుసంధానం" ఈ గ్రంథ లక్ష్యాలు!
13) "అసతోమా సద్గమయ!" – "తమసోమా జ్యోతిర్గమయ!" – "మృత్యోర్మా అమృతంగమయ!". "నన్ను అసత్‌నుండి సత్‌వైపు నడిపించుము! చీకటి (అజ్ఞానము) నుండి వెల్గువైపు నడిపించుము! మృత్యువునుండి మోక్షమువైపు నడిపించుము!" అనే జీవుని దివ్యప్రార్థన మన్నించి, పరమాత్మ జీవుని దివ్యమార్గములో తన దగ్గరకు చేర్చుకొని, "తత్త్వమసి" (ఆ పరమాత్మయే నీవు!) అని ప్రబోధించిన దివ్యగ్రంథం – భగవద్గీత!
14) ఆనాటికీ – ఈనాటికీ – ఏనాటికీ –
మానవ మానసిక సమస్యలకు పరిష్కారం భగవద్గీత!
15) అహంకార–మమకార రాహిత్యం; (దైవానికి) శరణాగతి అలవరచే ఉత్తమగ్రంథం.
16) "అహింస – సత్యం – అక్రోధః" వంటి ఉత్తమ లక్షణాలు అడుగడుగునా అలవరిచే మహాగ్రంథం.

17) "సర్వప్రాణులలోను ఈశ్వరుడు (జీవుడు) ఉన్నాడు" అనే పరమార్థాన్ని అందించిన సద్గ్రంథం భగవద్గీత

18) భగవద్గీతనుగూర్చి "వివేకానంద" అన్న వాక్కులు:-

(i) భగవద్గీతలో పరమాత్మ పార్థునకు చెప్పినవి "మాటలు" కావు! "జ్ఞాన గుళికలు!"

(ii) భగవానుడు జీవిత ఆదర్శం అంతా ఒక్క క్షణంలో చెప్పాడు.

(iii) "ఉపనిషత్తులు" అనే పూలతోటనుండి, "ఆధ్యాత్మిక సత్యాలు" అనే 701 పుష్పాలు ఏర్చి కూర్చిన "పూలమాల" భగవద్గీత!

### 3. కౌరవ-పాండవ యుద్ధకారణం

పాండవులు వనవాస అజ్ఞాత వాసములు పూర్తిచేసికొన్నారు. తమ రాజ్యము తమకిమ్మని శ్రీకృష్ణుని రాయబారిగా కౌరవసభకు పంపించినారు. దుర్యోధనుడు అధర్మముగా, నిర్లక్ష్యముగా, సూదిమొన మోపిన నేలకూడ ఇవ్వనని సభాముఖంగా చెప్పాడు. యుద్ధమునకు సిద్ధమైనాడు. 11 అక్షౌహిణుల సైన్యం సమకూర్చుకొన్నాడు.

పాండవులు కృష్ణుని ఆశ్రయించినారు. ఏడు అక్షౌహిణులు సైన్యంమాత్రం సమకూర్చుకొన్నారు. 21,890 ఏనుగులు; 21,890 రథములు; 65,610 గుఱ్ఱాలు; 1,09,350 కాల్బలముతో కూడిన సైన్యవిభాగమునకు ఒక "అక్షౌహిణి" అని పేరు.

ఇరు పక్షముల సైన్యమూ కలిసి, మొత్తం 18 అక్షౌహిణులు "కురుక్షేత్రం"లో యుద్ధసన్నద్ధులై ఉన్నారు. యుద్ధవార్తలు ధృతరాష్ట్రునకు అందించుటకై "సంజయుడు" నియమితుడైనాడు.

### 4. భగవానుడు గీతాప్రబోధం ఎందుకు చేశాడు?

**"అగ్నిదో, గరదశ్చైవ, శస్త్రపాణిః, ధనాపహో,**
**క్షేత్ర దారాపహర్తా చ, షడేతే ఆతతాయినః"**

1) కొంపకు నిప్పుపెట్టినవాడు 2) విషముపెట్టినవాడు 3) ఆయుధము పట్టి చెలరేగిన దయారహితుడు 4) ధనాపహర్త 5) భుక్తికి ఆధారమైన పంటపొలమును ఆక్రమించినవాడు, 6) భార్యను అపహరించినవాడు: ఈ ఆర్గురు ఆతతాయులు. కౌరవులు, పాండవులపట్ల ఆతతాయులుగానే ప్రవర్తించినారు. చెయ్యని అపకారం లేదు. "క్షత్రియో రిపు ఘాతుకః" – శత్రుసంహారం క్షత్రియధర్మం! స్వధర్మ నిర్వహణం కోసం, ఆతతాయుల్ని హతమార్చటంకోసం, గాండీవధారియై, యుద్ధసన్నద్ధుడై కృష్ణసారథ్యంతో యుద్ధభూమిలో నిలబడ్డాడు అర్జునుడు!

ప్రతిపక్షాన్ని మమకారంతో చూచాడు. "అస్థాన కరుణ"కు లోనయ్యాడు. "స్వజనం" "స్వజనం" అంటూ జాలిపడుతున్నాడు. కళ్లనీళ్లు పెట్టుకొంటున్నాడు! "నాకు విజయం అక్కర లేదు! రాజ్యం అక్కర లేదు" అంటూ క్షత్రియధర్మవిరుద్ధమైన భైక్ష్యానికి సిద్ధపడ్డాడు **"శ్రేయోభోక్తుం భైక్ష్యమపీహలోకే"** (2-5)

(1) "ఆతతాయుల్ని ఉపేక్షించటం, సాధుహింసను ప్రేరేపించటమే!" – అనే పరమసత్యాన్ని విస్మరించాడు. (2) "దుష్టశిక్షణం, సంఘరక్షణం" అనే సాంఘిక జ్ఞానం కోల్పోయాడు. (3) కురుపును కొయ్యటం – పాపిని శిక్షించటం, "హింస" అనుకొనే అజ్ఞానానికి దిగజారిపోయాడు. (4) "దుర్మార్గులపట్ల 'అహింస' లోకాన్ని హింసించటమే!'' అనే పరమార్థానికి దూరమయ్యాడు. (5) ధనుర్బాణాలు, క్షత్రియధర్మం, విడిచిపెట్టాడు. (6) రథంమీద కూలబడ్డాడు! (7) విషాదంలో మునిగి, కళ్లనీళ్లతో దుఃఖిస్తున్నాడు. ఇలాంటి అర్జునుడి విషాదాన్ని 17 అధ్యాయాలలో మెట్టు మెట్టుగా తొలగించాడు పరమాత్మ!

**శ్లో॥ "నష్టో మోహః స్మృతిర్లబ్ధా త్వత్ ప్రసాదాత్ మయాఽచ్యుత!**
**స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ!** (18-73)

"నా అజ్ఞానం తొలగింది. జ్ఞానం పొందాను. నా సందేహములు తొలగినవి. నీవు చెప్పినట్లు చేస్తాను" – అన్నాడు పార్థుడు! కృష్ణుడు చేసిన గీతాప్రబోధం సార్థకం అయింది! అర్జునుడు విజయుడయ్యాడు. రాజ్యం ఏలాడు. (భగవద్గీతాపఠనం, మోక్షసామ్రాజ్యాన్ని ఏలిస్తుంది!)

**5. కొన్ని ధర్మసందేహాలు:-**

- **యుద్ధానికి సిద్ధంగా ఉన్న సైన్యాల మధ్య భగవద్గీత 18 అధ్యాయాల ప్రబోధం సాధ్యమా?**

**సమాధానం:**

1) అఘటన ఘటనా సమర్థుడైన అచ్యుతునకు అసాధ్యముండదు.
2) కృష్ణుడు సూత్రప్రాయంగా చెప్పినదానిని వ్యాసుడు వివరించాడు.
3) కృష్ణుడు చెప్పిన శ్లోకాలు 574. తక్కినవి అర్జున సంజయులవి; ధృతరాష్ట్రునిది ఒకే ఒకటి.
4) యుద్ధానికిముందు ధర్మరాజు పాదచారియై, పెద్దల ఆశీస్సులకోసం శత్రుసైన్యంవైపు వెళ్లాడు.

5) ఉభయ సైన్యాలలోని యోధులకు, శరణాగతులకు, రక్షణకు, సమయం ఇచ్చారు. వర్గమార్పుకు అవకాశం ఇచ్చారు.
6) ప్రారంభంలో, కొన్ని సర్దుబాట్లుంటాయి. ఆ వ్యవధిలో గీతాప్రబోధం జరిగింది అని అనుకోవచ్చు!
7) ఆయుధము ధరింపనివారి మీద-దుఃఖితుల మీద బాణప్రయోగం చెయ్యరు. ఇది యుద్ధధర్మం!

- **కృష్ణార్జునులు చిన్నప్పటినుండి కలిసిమెలిసి ఉన్నారు కదా! యుద్ధంమధ్యలోనే ఎందుకు చెప్పాల్సివచ్చింది?**

**సమాధానం:**

1) ఇనుము కాలినప్పుడే దానిని వంచాలి.
2) వ్యాధి వచ్చినప్పుడే మందు వెయ్యాలి.
3) అదనులోనే విత్తనాలు చల్లాలి.
4) అర్జునుని మనస్సు వైరాగ్యంతో నిండి ఉంది.
5) ఇలాంటి పరిపూర్ణ వైరాగ్యం, అంతకుముందు అర్జునునకు రాలేదు. "తీవ్ర పరితాపం-వైరాగ్యం-ధర్మజిజ్ఞాస-జ్ఞానకాంక్ష" పార్థునకు కల్గిన సమయం అది. "నీ శిష్యుణ్ణి! నన్ను శాసించు!" అంటూ శరణాగతుడయ్యాడు పార్థుడు! ఆ సమయమే జ్ఞానబోధకు అనువైనకాలం!
6) దాహం ఉన్నప్పుడే పవిత్రజలం అవసరం! అందుకే అప్పుడు చెప్పాడు! జీవితమే యుద్ధరంగం!
   ధర్మాధర్మాలకు - సత్యాసత్యాలకు - మంచిచెడ్డలకు - త్రిగుణాలకు -నిరంతరంగా సాగే సంఘర్షణ స్వరూపమే "ప్రపంచం!". వీనితోపాటుగా, అరిషడ్వర్గ పోరాటం నిరంతరంగా మనలో మన మనస్సులలో జరుగుతూ ఉంటుంది. ఇద్దరు మనుష్యులు-మూడు అభిప్రాయాలు. మంచిచెడ్డలకు, మానసిక సంఘర్షణలకు ప్రతిరూపం కురుక్షేత్రం. కృష్ణుడు సద్గుణములవైపు చేరాడు. దుర్గుణాలపై, రాక్షసతత్త్వంపై విజయం సాధింపచేశాడు!

- **భీష్మద్రోణాదులుండగా, అర్జునునకే భగవద్గీత ఎందుకు బోధించాడు?**

**సమాధానం:**

1) "పాండవానాం ధనంజయః" (10 అధ్యా.). అర్జునుడు శ్రీకృష్ణుని ప్రతిబింబమే!

2) అర్జునుడు శివుని మెప్పించి పాశుపతం పొందినవాడు.
3) ఉత్తర గోగ్రహణంలో ఒక్కడే కౌరవవీరులందరను జయించినవాడు!
4) స్వర్గంలో వలచివచ్చిన ఊర్వశికి లోబడని ఇంద్రియనిగ్రహమున్నవాడు.
5) "శిష్యస్తేహం శాధి మామ్!" (నీ శిష్యుణ్ణి! నన్ను శాసించు) అని శరణాగతిని పొందినవాడు.
6) "భక్తోఽసి, మే సఖా చేతి, రహస్యం హ్యేతదుత్తమమ్!"
"నీవు నా భక్తుడవు! ప్రియసఖుడవు! అందుకే ఈ జ్ఞానరహస్యము నీకు చెప్తున్నాను!" అని కృష్ణపరమాత్మ తానే అన్నాడు.
7) అర్జునుడు గృహస్థాశ్రమంలో ఉన్నాడు. ప్రపంచంలో గృహస్థాశ్రమంలో ఉన్నవాళ్లెక్కువ! ఇన్ని కారణాలుగా అర్జునునకే గీత బోధించాడు పరమాత్మ!

- **భగవద్గీత "హింసా" ప్రబోధకమా?**

**సమాధానం:**

భగవానుడు చాలా సందర్భాలలో భగవద్గీతలో అహింసను ఎలుగెత్తి చెప్పాడు. అవన్నీ పాఠకులు గ్రహిస్తారు; గ్రహించాలి!

1) భగవద్గీత హింసను ప్రేరేపింపలేదు. భగవానుడు చాలా చోట్ల అహింసను ప్రబోధించి యున్నాడు. "యుద్ధము చెయ్యి! అని అర్జునుని ప్రేరేపించినాడు కదా! అది హింసకాదా?" అని అజ్ఞానులు ప్రశ్నిస్తారు. "ఏ పరిస్థితిలో అలా చెప్పాడు? ఎవర్ని చంపుమన్నాడు?" అని ఆలోచించాలి.
2) దుర్మార్గుల్ని చంపుమన్నాడు. ఆతతాయులను హతమార్చుమంటున్నాడు. దుష్టశిక్షణము, శిష్టరక్షణమే కదా! "అంగవ్రాతములో చికిత్సకుడు, దుష్టాంగమ్ము ఖండించి, శేషాంగశ్రేణికి రక్షసేయు" (భాగవతము). కురుపును శస్త్రచికిత్సతో తొలగింపకపోతే అది మొత్తం శరీరాన్ని నాశనం చేస్తుంది. అది వైద్యధర్మం! చాలామందికి ఉరిశిక్షలువేస్తారు. దారి దోపిడిగాండ్రను మహారాజులు వరుసగా నిలబెట్టి నరికించేవారు! ఇది హింస అనుకొనేవాళ్లు అజ్ఞానులు!
3) భగవద్గీతలో చాలా చోట్ల అహింసను ప్రబోధించాడు అనుకొన్నాము. అందులో స్థాలీపులాకన్యాయం (రెండు మూడు మెతుకులు చూచినట్లు)గా, కొన్ని శ్లోకపంక్తులు అనుకొందాం!
"అహింసా సమతా తుష్టిః" (10-5)

"అద్వేష్టా సర్వ భూతానాం మైత్రః కరుణ ఏవచ (12-13)
"అహింసా క్షాన్తి రార్జవమ్" (13-8)
"అహింసా సత్య మక్రోధః" (16-2)
"బ్రహ్మచర్య మహింసా చ" (17-14)
పైగా భగవానుని అవతార ప్రయోజనము-ఏమిటి?

**శ్లో॥ "పరిత్రాణాయ సాధూనాం। వినాశాయ చ దుష్కృతామ్**
**ధర్మసంస్థాపనార్థాయ। సంభవామి యుగేయుగే"** (4-8)

1) "దుర్మార్గులను నశింపచెయ్యటం", 2) "సజ్జనుల్ని రక్షించటం", 3) "ధర్మాన్ని పటిష్ఠం చెయ్యటం"-అనే మూడు పనులకోసమే భగవానుడు అవతారాలు ఎత్తుతూ ఉంటాడు. ఆతతాయులైన కౌరవుల్ని నశింపజేశాడు. సజ్జనులైన పాండవుల్ని పరిరక్షించాడు. "ఇతరుల్ని నాశనంచేసే ఆలోచనలు-అసూయ-అపకార స్వభావం, మానవులను సర్వనాశనం చేస్తాయి!" అనే హెచ్చరికను కౌరవుల ద్వారా లోకానికి ఇచ్చాడు!

**6. విషాదము యోగమా?:-**

భగవద్గీతలో మొదటి ఆరు అధ్యాయములు "కర్మషట్కము." ఇవి కర్మయోగమును బోధించును. "వేదనలోనే పుట్టెను వేదంబులు నాదంబులు"

విద్య-జ్ఞానము-భక్తి-ఐశ్వర్యము-బలము మొదలుగా చాల వస్తువులు పొందుటకు విషాదమే బీజం! "అది లేదే!" అనే విషాదం విషాదంగా మిగిలిపోతే, చింతగా మారి, సజీవుల్ని దహించివేస్తుంది. విషాదంనుండి, గురూపదేశంతో, క్రమబద్ధమైన సాధన ఆరంభించాలి! అభ్యాసయోగాన్ని ఆశ్రయించాలి! విషాదంలో నుండి అర్జునుడు గురూపదేశంతో మహాసామ్రాజ్య విజయుడయ్యాడు!

అర్జున విషాదం, భార్యపుత్రులకోసం కాదు! విషయసుఖాలకోసం కాదు! పై అధికారి దగ్గర కాదు! తనలాంటి వ్యక్తి దగ్గర కూడా కాదు. జ్ఞానంకోసం - ధర్మంకోసం - కర్తవ్యంకోసం - విషాదం పొందాడు. అందులోను దైవందగ్గర ఏడ్చాడు. "తీర్చగల్గినవాని దగ్గర" - "గురువునెదుట" - "తన క్షేమం కోరువాడి దగ్గర" - "దైవం దగ్గర" దుఃఖించటం విషాదం కాదు, యోగం! అందుకే ఈ విషాదం యోగంగా మారింది. ఈ విషాదం 17 అధ్యాయాల భగవద్గీత (పరమాత్మయొక్క ముఖపద్మం నుండి) ఆవిర్భవించటానికి కారణం అయింది!

**7. కురుక్షేత్రం:-**

ఢిల్లీకి ఉత్తరంగాను, పంజాబులోని అంబాలాకు దక్షిణంగాను ఉన్న పుణ్యక్షేత్రం, పరశురాముడు పితృతర్పణములు చేసినచోటు.

**శ్లో॥ రేవాతీరే తపః కుర్యాత్, మరణం జాహ్నవీ తటే।**
**దానం దద్యాత్ కురుక్షేత్రే, గౌతమ్యాం త్రితయం వరమ్!**

రేవానదీ తీరంలో తపస్సు చేస్తే, తొందరగా తపస్సిద్ధి లభిస్తుంది! గంగ యొడ్డున మరణిస్తే, మోక్షం వస్తుంది. కురుక్షేత్రంలో దానం చేస్తే, వేలరెట్లుగా ఫలిస్తుంది. తపస్సు-మరణము-దానము-మూడింటికీ, గౌతమీతీరం పుణ్య ప్రదమైన మహాతీర్థం.

రేవా-గంగా నదులకంటెను, కురుక్షేత్రము కంటెను, గౌతమి (గోదావరి) గొప్ప పుణ్యతీర్థమన్నారు పెద్దలు!

## 5.9 గీతామకరంద బిందువులు కొన్ని

**1. పెద్దలు ఆదర్శంగా ఉండాలి!**

**శ్లో॥ "యద్యత్ ఆచరతి శ్రేష్ఠః, తత్తదేవేతరో జనః ।**
**స యత్ప్రమాణం కురుతే, లోకః తదనువర్తతే" ॥** (3-21)

గొప్పవాడు ఏ కర్మను చేయునో, దానినే తక్కిన వారున్ను చేయుదురు. అతడు దేనిని ప్రమాణముగ గైకొనునో, దానినే తక్కినవారును అనుసరించెదరు.

**2. ఆత్మవిశ్వాసం అవసరం!**

**శ్లో॥ "క్లైబ్యం మాస్మగమః పార్థ, నైతత్ త్వయ్యుపపద్యతే ।**
**క్షుద్రం హృదయదౌర్బల్యం, త్యక్త్వోత్తిష్ఠ పరంతప!" ॥** (2-3)

పౌరుషము లేనివానిగా అధైర్యము పొందకుము! ఇది నీకు తగదు! మానసిక బలహీనతలను విడిచి, ఆత్మవిశ్వాసముతో కర్తవ్యనిర్వహణ(యుద్ధ)మునకు లెమ్ము! (ఈ శ్లోకము వివేకానందకు చాల ఇష్టమైనది.)

**3. పునర్జన్మ - కూడా వచ్చేవి ఉన్నాయి**

**శ్లో॥ "శరీరం యదవాప్నోతి, యచ్చాపి ఉత్క్రామతీశ్వరః ।**
**గృహీత్వైతాని సంయాతి, వాయుః గంధానివ ఆశయాత్" ॥** (15-8)

శరీరముద్వారా జీవుడు పొందిన అనుభవములను, మరియొక దేహములోనికి మారునప్పుడు, వాయువు పుష్పవాసనలనువలె, మోసికొని పోవును. అలవరచుకొన్న

దైవభక్తి - పరోపకారము - దానస్వభావము - వంటి ఉత్తమలక్షణములు మరుజన్మకు 'బ్రాటోవరు'గా వచ్చును.

**4. నరుడు నారాయణుడుగా మారుట**

జీవుడు అనేకజన్మలలో ఉత్తమగుణాలను అలవరచుకొంటూ చేసిన సాధనా ఫలితమే "సాయుజ్యము" (మోక్షము).

**"బహూనాం జన్మనామ్ అంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే"** (7-19)

**5. "నాశనం అయ్యేవాళ్లు ముగ్గురు!"**

**శ్లో॥ "అజ్ఞశ్చ అశ్రద్ధధానశ్చ, సంశయాత్మా వినశ్యతి ।**
**నాయం లోకోఽస్తి న పరో, న సుఖం సంశయాత్మనః" ॥** (4-40)

తెలివితక్కువవాడు, శాస్త్రమునందు గురువాక్యమునందు శ్రద్ధలేనివాడు, దైవమునందు నమ్మకములేనివాడు - ఈ ముగ్గురు నశిస్తారు. వీరి ముగ్గురిలో సంశయాత్మునకు ఇహలోక పరలోకము లుండవు!

(కొన్ని సంశయాత్ముని ఊహలు:- 1) పై శ్లాబు కూలిపోతుందేమో? 2) తిరిగే ఫ్యాను మీద పడుతుందేమో? 3) నే ఎక్కిన ఈ విమానం కూలుతుందేమో? 4) 80 మైళ్ళ వేగంతో పోయే ఈ ఎక్స్‌ప్రెస్ పట్టాలు తప్పుతుందేమో? 5) నేను గోదావరిలో ప్రయాణించే ఈ లాంచి మునిగిపోతుందేమో? 6) ఈ నా గుండె ఆగిపోతుందేమో? మొదలైనవి ఎన్నో! బాధితులెందరో!)

దైవనిర్ణయానికి బద్ధులమై, దైవాన్ని శరణుపొంది బ్రతకాలి! "దైవాధీనం జగత్సర్వం" అని తెలుసుకోవాలి! ఇది జ్ఞానం!

**శ్లో॥ "తస్మాదజ్ఞానసంభూతం, హృత్స్థం జ్ఞానాసినాత్మనః ।**
**ఛిత్త్వైనం సంశయం యోగమ్, ఆతిష్ఠ ఉత్తిష్ఠ భారత!" ॥** (4-42)

అందుచే, నీ హృదయము నందున్న అజ్ఞానమునుండి పుట్టిన - ఈ సంశయ ప్రవృత్తిని, జ్ఞానమనెడి ఖడ్గముచే ఛేదించి, నిష్కామకర్మయోగమును ఆచరింపుము! లెమ్ము!!

**6. ఉత్తమకర్మలకోసం కృషి, సాధన, అవసరం!**

ఈ విషయం పరమాత్మ, పలుచోట్ల పేర్కొన్నాడు. అదే అభ్యాసయోగము.

**7. ఏకాగ్రమైన మనస్సుతో, నిరంతర అభ్యాసముతో, దైవచింతన చేయువాడు పరమపురుషుని పొందును.**

**శ్లో॥ "అభ్యాస యోగయుక్తేన, చేతసా నాన్యగామినా ।**
**పరమం పురుషం దివ్యం, యాతి పార్థానుచింతయన్!" ॥** (8-8)

**శ్లో॥ "అథ చిత్తం సమాధాతుం, న శక్నోషి మయి స్థిరమ్ ।**
**అభ్యాసయోగేన తతో, మామిచ్ఛాప్తుం ధనంజయ!"॥** (12-9)

నాయందు ఏకాగ్రత నిలుచుట లేదని పరితపించకు! నిరంతర సాధన (అభ్యాస యోగము) ద్వారా నన్ను పొందుటకు ప్రయత్నింపుము! భగవానుడు చెప్పిన 17 అధ్యాయాలలో సాధకుని మోక్షమువైపు నడిపించెడి ముఖ్యమైన అధ్యాయము ఈ "అభ్యాసయోగము". దీనిని భగవానుడు ప్రత్యేకంగా పేర్కొన్నాడు.

**శ్లో॥ "అజ్ఞోఽపి తజ్ఞతాం ఏతి, శనైః శైలోఽపి చూర్ణ్యతే ।**
**బాణోప్యేతి మహాలక్ష్యం, పశ్యాభ్యాస విజృంభణమ్" ॥**

అభ్యాసముచే అజ్ఞాని విజ్ఞానిగా మారును. మహాపర్వతమును నిరంతర సాధనచే పిండిగా కొట్టవచ్చును. నిరంతర సాధనచే (అభ్యాసముచే) బాణముతో లక్ష్యమును (గురి తప్పకుండ) కొట్టవచ్చును. అభ్యాసయోగానికి అసాధ్యం ఉండదు. సర్కసు ప్రదర్శనలో సింహము -పులి-సర్పం-కోతి-ఇవి చెప్పినట్లు చేయుట అభ్యాసయోగ ప్రభావమే కదా!

**8. జ్ఞానాగ్ని - జ్ఞాననౌక - జ్ఞానఖడ్గము**

1) సర్వకర్మలను దగ్ధముచేయుటకు 2) పాపమును దాటుటకు 3) సంశయమును ఛేదించుటకు పై మూడింటిని భగవానుడు మనకు అనుగ్రహించినాడు.

**9 జ్ఞానము అంటే?**

**శ్లో॥ "జ్ఞానం తేఽహం సవిజ్ఞానమ్, ఇదం వక్ష్యామి అశేషతః ।**
**యత్ జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్, జ్ఞాతవ్య మవశిష్యతే" ॥** (7-2)

ఏది తెలిసికొన్న తరువాత, తెలిసికొనవలసినది ఇంకేమియును ఉండదో, అదియే జ్ఞానము. అట్టి తత్త్వజ్ఞానమును అనుభవము పొందునట్లు నీకు చెప్పుచున్నాను. ఈ జ్ఞాననిర్వచనము చాల ఆశ్చర్యకరమైనది

**శ్లో॥ "శ్లోకార్థేన ప్రవక్ష్యామి, యదుక్తం గ్రంథకోటిభిః ।**
**బ్రహ్మసత్యం! జగన్మిథ్యా!, జీవో బ్రహ్మైవ నాపరః"॥**

కోట్ల ఆధ్యాత్మిక గ్రంథాలలోని సారమును సగంశ్లోకంలో చెప్పుచున్నాను.

పరమాత్మ త్రికాలసత్యం! జగత్తు మిథ్య (భూత-భవిష్యత్కాలాలలో స్థిరంగా ఉండనిది). జీవుడు పరమాత్మయే కాని వేరుకాదు! (ప్రపంచము భూతకాలములో లేదు! భవిష్యత్తులో ఉండదు! వర్తమానంలో ఉన్నట్లు అనిపిస్తుంది. అది మిథ్య!)

**10. శ్రద్ధ సర్వకార్య సాధనము**

శ్రద్ధ-భక్తి-విశ్వాసములు సాధకునకు చాల అవసరము. భగవానుడు శ్రద్ధను భగవద్గీతలో పలుచోట్ల పేర్కొని యున్నాడు. అందులో కొన్ని.....

**10.1 "శ్రద్ధావంతోఽనసూయంతో, ముచ్యంతే తేఽపి కర్మభిః"** (3-31)

శ్రద్ధ ఉన్నవారు, అసూయ లేనివారు, కర్మఫలితమునుండి విముక్తులగుదురు. (అసూయ = వీడా నాకు చెప్పేవాడు-అని నిర్లక్ష్యము చేయుట అసూయావంతుని లక్షణం! 'అసూయ' అంటే గుణాలయందు కూడా దోషారోపణం చేయటం.)

**10.2 "శ్రద్ధావాన్ భజతే యోమాం, స మే యుక్తతమో మతః"** (6-47)

నాయందు శ్రద్ధ నిలిపి, శ్రద్ధతో ఎవడు నన్ను ధ్యానించుచున్నాడో, అట్టివాడు సర్వశ్రేష్ఠుడని నా అభిప్రాయము.

**10.3 "శ్రద్దధానా మత్పరమా భక్తాః, తే అతీవ మే ప్రియాః"** (12-20)

శ్రద్ధాసక్తులతో నన్ను ఆరాధించు భక్తులు నాకు మిక్కిలి ఇష్టులు!

**10.4 "శ్రద్ధయా పరయోపేతాః, తే మే యుక్తతమా మతాః"** (12-2)

మిక్కిలి శ్రద్ధతో ఎవరు నన్ను ఉపాసించుచున్నారో, వారే ఉత్తమయోగులని నా అభిప్రాయము.

**10.5 "శ్రద్ధయా అర్చితు మిచ్ఛతి"** (7-21)

ఏ భక్తుడు ఏ యే దేవతలను శ్రద్ధతో పూజింపదలచుచున్నాడో, ఆయా పూజలకు తగిన శ్రద్ధను, వానికి నేనే కల్గించుచున్నాను.

**10.6 "శ్రద్ధయా పరయా తప్తం, తపః తత్ త్రివిధం నరైః"** (17-17)

శ్రద్ధతో ఆచరింపబడిన శారీరక - వాచిక - మానసిక తపస్సులు, సాత్త్విక తపస్సులని పెద్దలందురు.

**10.7 "శ్రద్ధావాన్ అనసూయశ్చ, శృణుయాదపి యో నరః"** (18-71)

శ్రద్ధతో, 'వీడా నాకు చెప్పువాడు' అను అసూయ లేకుండా, ఏ మానవుడు వినునో, అట్టివాడు పాపవిముక్తుడగును.

**10.8 "శ్రద్ధావిరహితం యజ్ఞం, తామసం పరిచక్షతే"** (17-13)

శ్రద్ధలేని యజ్ఞము (దేవపూజనము) "తామస యజ్ఞము" అనబడును.

**10.9** "మిథ్యాచారుడు"-ఇంద్రియాలు నిగ్రహిస్తాడు. ఇంద్రియాలలో ముఖ్యమైన మనస్సును నిగ్రహించలేడు! అట్టివానిని "మిథ్యాచారుడు" అన్నాడు భగవానుడు!

**శ్లో. "కర్మేంద్రియాణి సంయమ్య, య ఆస్తే మనసా స్మరన్ ।**
**ఇంద్రియార్థాన్ విమూఢాత్మా! మిథ్యాచారః సఉచ్యతే" ॥** (3-6)

ఎవడు ఇంద్రియములు నిగ్రహించి, మనస్సుతో మాత్రం, శబ్ద-స్పర్శ - రూప - రస -గంధములు స్మరించుచుండునో, అట్టి మూర్ఖుడు "మిథ్యాచారుడు!"



**తణుకు అంటే మా అన్నయ్యకు పంచప్రాణాలు!**

**"మన యిల్లు"-"మన తణుకు" నాకు ఇచ్చినంత శాంతిని నేను ఎక్కడా పొందలేదు! అభిమానించే మనుష్యుల మధ్య ఈ అంతిమ జీవితంలో పొందుతున్న ఆనందాన్ని విడిచిపెట్టలేక - రోజులు లెక్కపెట్టుకొంటూ - ఏ రోజు కారోజు "ఇది నాది!" అనుకొంటూ ఉన్నాను.**

**(-2008లో నాకు వ్రాసిన లేఖనుండి...)**

**ఒక అధోజ్ఞాపిక:- ("జ్ఞానరత్నాలు" అనే గ్రంథంనుండి)**

ప్రస్తుతం 78 సంవత్సరాల వయస్సులో ఉన్న మా అన్నయ్యగారు, ఈ మధ్య మా తణుకులో పెద్దలంతా చేరిన ఒక సభలో, దైవాన్నిగురించి 30 నిమిషాలు మాటలాడారు. వేదిగ దిగి వస్తూండగా, "రసరాజు" (రంగినీని సత్యనారాయణరాజు)గారు మా అన్నగారి చేతికి ఈ క్రింది పద్యాన్నిచ్చి నమస్కరించారు:-

**"ఊపు తగ్గలేదు, ఉయ్యాలలూగించు**
**శ్రోతృమండలిని, యశోధనుండు,**
**వివిధ విషయములకు వేదిక టీ.వి.కె.,**
**వాని మాట సభకు వైభవమ్ము!"**

- తంగిరాల వెంకట సుబ్బారావు, 28-09-2009

# అశ్రుతర్పణం–మూడవ భాగం

# సంకలిత సాహిత్యం

## విషయ సూచిక

# I. సాహిత్యసాగరంలో ఏటిన ముత్యాలు

## (మచ్చుకు కొన్ని మాత్రమే)

**1. శ్లో॥ సంగీత సాహిత్య రసానుభూత్యై**
**కర్ణద్వయం కల్పితవాన్ విధాతా।**
**ఏకేన హీనః పునరేక కర్ణో**
**ద్వాభ్యాం విహీనో బధిరస్సయేవ॥**

**తా॥** బ్రహ్మదేవుడు మనకు రెండు చెవులు కల్పించాడు - ఒకటి సంగీతం విని ఆనందించడానికి; రెండవది సాహిత్యం విని ఆనందించడానికి. ఎవడైనా ఒకడు "నాకు సంగీతం ఇష్టంలేదు" అంటే, వాడికి ఒక చెవి పనిచేయడంలేదు - అని అర్థం. ఎవడైనా ఒకడు "నాకు సాహిత్యం ఇష్టంలేదు" - అంటే, వాడికి కూడా ఒక చెవి పనిచేయడం లేదు అని అర్థం. ఎవడైనా ఒకడు (ఔరంగజేబులాంటివాడు) "నాకు సంగీత సాహిత్యాలు రెండూ ఇష్టంలేదు" - అంటే, వాడే నిజమైన చెవిటివాడు!

**2. శ్లో॥ సంగీత సాహిత్య కళా విహీనః**
**సాక్షాత్ పశుః పుచ్ఛ విషాణ హీనః।**
**తృణం నఖాదన్నపి జీవమానః**
**తద్భాగధేయం పరమం పశూనాం॥**

**తా॥** సంగీత సాహిత్యాలు విని ఆస్వాదించని వాడు - సాక్షాత్తు తోక కొమ్ములు లేని పశువు! ఈ వింత పశువు గడ్డిమేయకుండానే బ్రతికేస్తుంది! ఎందువల్లనంటే లోకంలో ఉన్న పశువులు చేసుకున్న గొప్ప అదృష్టం వల్ల! (ఈ వింత పశువు కూడా గడ్డి మేయడం మొదలుపెడితే లోకంలోని అసలు పశువులకు గడ్డి దొరకదు!)

**3. శ్లో॥ వ్యాఘ్రీవ తిష్ఠతి జరా పరితర్జయన్తీ**
**రోగాశ్చ శత్రవ ఇవ ప్రహరన్తి దేహమ్।**
**ఆయుః పరిస్రవతి భిన్న ఘటాదివాంభః**
**లోక స్తథాపి అహితమాచరతీతి చిత్రమ్॥** (-భర్తృహరి)

**తా॥** ముసలితనం ఆడపెద్దపులిలాగ బెదిరిస్తూ ఎదురుగా నిలబడి మీద పడటానికి సిద్ధంగా ఉంది. రోగాలు శత్రువులవలె శరీరాన్ని చితగ్గొడుతున్నాయి. ఆయుర్దాయం

బీటలు తీసిన కుండలోని నీళ్ళులాగ బొట్లు బొట్లుగా కారిపోతోంది. తన పరిస్థితి ఇలా ఉన్నా కూడా మానవుడు ఇతరులకు అపకారం చేస్తూనేఉన్నాడు. ఇది చాలా చిత్రంగా ఉంది సుమా!

**4. శ్లో॥ యస్సుందరః - తద్వనితా కురూపా**
**యా సుందరీ - సా పతి రూపహీనా।**
**యత్రోభయం - తత్ర దరిద్రతా చ**
**విధేర్విచిత్రాణి విచేష్టితాని ॥**

**తా॥** భర్త అందంగా ఉంటే - భార్య కురూపిణిగా ఉంటుంది. భార్య అందంగా ఉంటే - భర్త కురూపిగా ఉంటాడు. భార్యాభర్తలు ఇద్దరూ అందంగా ఉంటే ఆ సంసారంలో దారిద్ర్యం తాండవిస్తూ ఉంటుంది. బ్రహ్మదేవుని చేష్టలన్నీ విచిత్రంగా ఉంటాయి!

**5. కవితా కథానిక:-** ఒక పండు ముసలి అవ్వకు నడుం బాగా వంగిపోయింది. ఒక ఊతకర్ర చేత పట్టుకొని, నేలచూపులు చూస్తూ, వీథిలో మెల్లగా నడచి వెడుతోంది. ఆమెకు ఎదురుగా మంచి యౌవనంలో పైలాపచ్చీసుగా ఉన్న ఒక యువకుడు వస్తున్నాడు. అతడు ఆ ముసలిదాన్ని ఆటపట్టించాలని అనుకున్నాడు. "ఏమిటి ముసలిదానా! నేలమీద వెతుకుతున్నావు?" అని అడిగాడు. బాగా వంగిపోయి నేలమీదికి చూస్తూ నడుస్తోంది కదా! అందుకని అలా అపహాస్యం చేస్తున్నాడు. ఆ ముసలిది శాంతంగా "ఒక వస్తువు పోయింది నాయినా! దానికోసం వెతుక్కుంటున్నాను!" అన్నది. "అంతగా వంగిపోయి వెతుక్కుంటున్నావు, ఏమిటావస్తువు?" అని అడుగుతూ ఆమెను "వినమ్రాంగీ!" అని సంబోధించాడు. మంచి యౌవనంలో ఉండి, స్తనభారంతో కొంచెం ముందుకు వంగిన యువతిని ఈ పదంతో వర్ణిస్తారు కవులు. ఇక్కడ యువకుడు ఆ పదంతో బాగా నడుం వంగిపోయిన వృద్ధురాలిని గేలిచేస్తున్నాడు. అప్పుడా ముసలిది "నా యౌవనపు ముత్యం పడిపోయింది నాయనా! దానికోసం వెతుక్కుంటున్నాను!" అంది. (కొన్నాళ్ళకు నవ్వు కూడా నాలాగే వెతుక్కుంటావురా ఈనాటి నీ నవయౌవనాన్ని!" అని ధ్వని - వాడికి చురక.) ఈ యిరువురి సంభాషణ శ్లోకరూపంలో ఉంది.

**శ్లో॥** (యువకుడు:) **"అధః మశ్యసి కిం వృద్ధే?"**
(వృద్ధురాలు:) **"మృగ్యతే వస్తు కంచన!"**

(యువకుడు:) **"కిం తద్వస్తు వినమ్రాంగీ?"**

(వృద్ధురాలు:) **"నష్టం తారుణ్య మౌక్తికం!"**

**6. శ్లో॥ తృణాదపి లఘుస్తూలః– తూలాదపి చ యాచకః ।**

**వాయునా కిం ననీతో సౌ?– మామయం ప్రార్థయే దితి॥**

**తా॥** గడ్డిపరకకన్నా దూది తేలిక! దూదికన్నా యాచకుడు తేలిక! అయితే, గడ్డిపకనూ దూదినీ పైకి ఎగరగొట్టే గాలి (వాయుదేవుడు) ఆ రెండింటికన్నా మిక్కిలి తేలికయైన యాచకుణ్ణి ఎందుకు ఎగరగొట్టడం లేదు? అనే ప్రశ్న వస్తుంది. యాచకుడి దగ్గరకు వెడితే వాడు తనను కూడా యాచిస్తాడేమో అని వాయుదేవునికి భయం! అందువల్ల వాడి దగ్గరకు వెళ్ళడంలేదు! – అని చమత్కారం.

**7. శ్లో॥ గుణదోషౌ బుధోగృహ్ణన్ – ఇందుక్ష్వేడా వివేశ్వరః ।**

**శిరసా శ్లాఘతే పూర్వం –పరం కంఠే నియచ్ఛతి॥**

**తా॥** శివుడు చంద్రకళను శిరస్సు మీద ధరించాడు; విషాన్ని కంఠంలో దాచుకున్నాడు. అలాగే పండితుడైనవాడు ఇతరుల గుణాలను నెత్తిమీద పెట్టుకొని గౌరవిస్తాడు (శిరసావహిస్తాడు); దోషాలను తనలోపలనే దాచుకుంటాడు.

**8. శ్లో॥ సుజనో నయాతి వైరం**

**పరహిత బుద్ధిః వినాశ కాలేపి ।**

**ఛేదేపి చందన తరుః**

**సురభయతి ముఖం కుఠారస్య ॥**

**తా॥** సజ్జనుడు ఎల్లప్పుడూ పరులకు మేలునే కోరుతాడు. తనను నాశనం చేస్తున్న వారికి కూడా మేలు చేస్తాడు. మంచిగంధపు చెట్టు తనను నరుకుచున్నప్పుడు కూడా ఆ గొడ్డలికి తన సువాసనను ఇస్తుంది కదా!

**9. శ్లో॥ వస్త్రేణ, వపుషా, వాచా – విద్యయా, వినయేన చ ।**

**వకారైః పంచభిర్యుక్తః – నరోభవతి పూజితః ॥**

**తా॥** లోకంలో ఐదు 'వ'కారాలు కలిగిన నరుడు పూజింపబడతాడు:– (1) వస్త్రేణ= తగిన వస్త్రంధారణంచేత; (2) వపుషా = శరీరసౌష్ఠవంచేత; (3) వాచా = మంచి మాటకారితనంచేత; (4) విద్యయా = చక్కని విద్యచేత; (5) వినయేన= మిక్కిలి వినయంచేత. ఈ అయిదు కలిగిన వ్యక్తి గౌరవింపబడతాడు.

**10. కవితా కథానిక:-** సంస్కృతంలో ఒక చక్కని చమత్కార భరితమైన శ్లోకం ఉంది. అది శివుని గురించిన ప్రార్థన. శ్లోకరచయితయైన ఆ కవి మనల్ని ఆశీర్వదిస్తున్నాడు. "హరః పాతువః" = శివుడు మిమ్మల్ని కాపాడుగాక!; "నగ్నోహరః పాతువః" = దిగంబరుడైన శివుడు మిమ్మల్ని కాపాడుగాక!; "హ్రియా, నతముఖో, నగ్నోహరః పాతువః" = సిగ్గుతో తలవంచుకున్న, దిగంబరుడైన శివుడు, మిమ్మల్ని కాపాడుగాక! ఇప్పుడు శివుడు దిగంబరుడు ఎలా అయ్యాడో హాస్యరసగర్భితంగా చెపుతున్నాడు కవి.

ఒకనాడు విష్ణుమూర్తి, శ్మశానంలో ఉండే దిగంబరుడైన శివునికి ఒక వార్త పంపించాడు: "అయ్యా! మీతో నాకు కొంచెం పని పడింది; మీ దగ్గరకు వస్తున్నాను" అని. ఎల్లప్పుడూ పట్టుపీతాంబరాలు ధరించే గొప్పవాడైన విష్ణుమూర్తి తన దగ్గరకు వస్తూ ఉంటే, తాను దిగంబరంగా ఉంటే బాగుండదని, శివుడు హడావిడిగా ఒక పామును మొలత్రాడుగా చుట్టుకొని, గజచర్మాన్ని గోచీగా పెట్టుకుని, విష్ణుమూర్తిని ఆహ్వానించడానికి బయలుదేరాడు. ఇంతలో విష్ణుమూర్తి తన వాహనమైన (హెలికాప్టర్) గరుత్మంతుని మీద దిగాడు. శివుడు గౌరవసూచకంగా ఆయనను సమీపిస్తున్నాడు. వెంటనే శివుడు తన మొలత్రాడుగా చుట్టుకున్న పాము, గరుత్మంతుని చూచి గడగడ వణికిపోయి, ఒక్కసారిగా భూమి మీదికి దూకి పారిపోయింది! మళ్ళీ శివుడు యథాప్రకారంగా దిగంబరుడయిపోయాడు! విష్ణుమూర్తి ముందు సిగ్గుతో తలవంచుకున్నాడు. అటువంటి శివుడు మిమ్మల్ని రక్షించుగాక! (గరుత్మంతునికి పాములు ఆహారం. అవి కనపడితే గుటుక్కున నోట్లో వేసుకుంటాడు)

**శ్లో॥ విష్ణోరాగమనం నిశమ్య, సహసాకృత్వా ఫణీంద్రం గుణం,**
**కౌపీనం పరిధాయ చర్మకరిణః, శంభుః పురోధావతి।**
**దృష్ట్వా విష్ణురథం సకంపహృదయః సర్పో పతత్ భూతలే,**
**కృత్తిర్విస్ఖలితా, హ్రియా, నతముఖో, నగ్నో, హరః పాతువః ॥**

**11. కవితా కథానిక:-** "హరికథా పితామహుడు" ఆదిభట్ల నారాయణదాసుగారు హరికథ చెప్పబోతూ, "హరికథ చెప్పమంటారా? గిరికథ చెప్పమంటారా?" అని అడిగారు సరదాగా శ్రోతల్ని. సభలో ఉన్న ఒక కొంటెవాడు "మాకు హరికథ వద్దు, గిరికథ చెప్పండి!" అన్నాడు ("మాయాబజార్" సినిమాలో మాకు "కంబళి" వద్దు, "కింబళి" కావాలి అని-"తల్పం" వద్దు "గిల్పం" కావాలి-అని అడిగినట్టుగా). దాసుగారు "సరే! 'గిరికథ' చెపుతున్నాను, వినండి!" అని పార్వతీ కల్యాణం హరికథ

చెప్పబోతున్నారు. ఇంతలో ఆయన శిష్యుడు, "అయ్యా గురువుగారూ! ఈ రోజు మీ హరికథ వినడానికి కలెక్టరుదొరగారు వచ్చారు. కాబట్టి మీరు ఆంగ్లంలో ప్రార్థన చేయండి. దొరవారికి బాగా అర్థమవుతుంది" అన్నాడు. దాసుగారు "ఓ! దానికేముంది! అలాగే చేస్తాను!" అని ఆశువుగా, ఒక ఉత్పలమాల పద్యంలో ఆంగ్లపద మిశ్రితంగా, శివుణ్ణిగురించి ఈ క్రింది విధంగా ప్రార్థన చేశారు:–

**ఉ॥ హెడ్డున మూను, స్కిన్నుపయి నెంతయు డస్టును, ఫైరు నేత్రమున్,**
**సైడున గ్రేటు బుల్లు, బహుచక్కని గాంజెసు హైరు లోపలన్,**
**బాడికి హాఫెయౌచు నలపార్వతి మౌంటెను డాటరుండ, ఐ**
**షుడ్డు డివోటు దండములు సోకగ ప్రేయరు సేతు నెప్పుడున్!**

**12. కవితా కథానిక:–** ఒక పెండ్లిలో ఆంగ్లవిద్యాపారంగతులైన వధూవరులను ఆశీర్వదిస్తూ, ఒక హాస్యకవి, వధువును తన చెల్లిగా సంబోధిస్తూ, సంసారపు మెలకువలు చెపుతూ ఈ క్రింది సీసపద్యం చదివాడు:–

**సీ॥ "హస్బెండు" తెచ్చిన "అన్‌వాల్యుథింగైన"**
**"మోస్టు బ్యూటీ" యంచు మురిసికొనుము;**
**"రిక్వెస్టు" చేయగా "రెఫ్యూజు" చేయక**
**"థాంక్స"ని అద్దాని తీసికొనుము;**
**"సిల్లి"గా ఎపుడైన చిలిపి చేష్టలు చేయ**
**"సీరియస్" కాబోకు చెల్లి! నీవు;**
**"ఆఫీసు" వేళైన, "కాఫీ"కి "లేటైన"**
**"సారీ"ని చెప్పుమా సారసాక్షి!;**
**తే॥ ఆంగ్లభాషకు అలవడ్డ అయ్యవార్ల–**
**తోడి కాపురమును చేయు జాడ లెఱిగి**
**స్త్రీలు వర్తించునట్టివౌ "సీకిరేట్లు"**
**ఎఱిగి మసలిన వారికి "హెవెను" మెట్లు!!**

**13. కవితా కథానిక:–** ఒక కవిశేఖరుడు శతావధానం చేస్తున్నాడు. ఆ అవధానిని పరాభవం చేయాలని కొందరు సభ్యులు మాటిమాటికి అల్లరిచేస్తున్నారు. అవధానికి చాలా కోపం వచ్చి, ఆ అల్లరి చేసేవాళ్ళందరినీ గట్టిగా తిట్టాలని నిశ్చయించుకున్నాడు. ప్రత్యక్షంగా తిట్టడం కుదరదు కదా! అవకాశంకోసం ఎదురుచూస్తున్నాడు. ఇంతలో

ఒక పృచ్ఛకుడు "అందఱి కందఱే మఱియు నందఱి కందఱె అందఱందఱే!" అనే సమస్య ఇచ్చాడు. అవధానికి అల్లరిచేసేవాళ్ళని ఛెడామడా తిట్టడానికి మంచి అవకాశం దొరికింది. ఆ సమస్యను ఆధారంగా చేసికొని, ఆ అల్లరిగాళ్ళను ధ్వనిగర్భితంగా గట్టిగా చీవాట్లు పెట్టాడు ఈ క్రింది పద్యంలో:–

**ఉ॥ కొందఱు పార్థు టెక్కెములు! కొందఱు కాలుని వాహనంబులున్!**
**కొందఱు భైరవాశ్వములు! కొందఱు నీశ్వరు వాహనంబులున్!**
**కొందఱు కృష్ణజన్మమున కూసిన ధన్యులు! ఎంచి చూడగా**
**అందఱి కందఱే మఱియు నందఱి కందఱె! అందఱందఱే!!**

**తా॥** "ఈ సభలో కొందరు అర్జునుని జెండాలు (కోతులు) – కొందరు యమధర్మరాజు గారి వాహనాలు (దున్నపోతులు) – కొందరు భైరవుని గుఱ్ఱాలు (కుక్కలు) – కొందరు ఈశ్వరుని వాహనాలు (ఎద్దులు)! – కొందరు కృష్ణుడు జన్మించినప్పుడు కూసిన ధన్యజీవులు (గాడిదలు)! – పరిశీలిస్తే అందరికందరే సరైనవాళ్ళు!" సభలో అల్లరి చేస్తున్నవాళ్ళని "కోతులు – దున్నపోతులు – కుక్కలు– ఎద్దులు – గాడిదలు" అని వారందరూ సిగ్గుపడేలాగా తిట్టి కసితీర్చుకున్నాడు ఆ అవధానిగారు.

**14. శ్లో॥ అహన్యహని భూతాని – గచ్ఛన్తీహ యమాలయమ్।**
**శేషాః స్థిరత్వ మిచ్ఛన్తి – కిమాశ్చర్య మతః పరమ్?"**

**తా॥** ప్రతిదినము అనేక జీవులు మరణిస్తూనే ఉన్నాయి. కాని మిగిలి ఉన్నవి మాత్రం తాము స్థిరంగానే ఉంటామన్నట్లుగా జీవయాత్ర సాగిస్తూనే ఉన్నాయి. బాగా ఆలోచిస్తే, ఇంతకన్నా ఆశ్చర్యమేముంటుంది?

**15. శ్లో॥ ద్రవ్యాణి భూమౌ, పశవశ్చ గోష్ఠే,**
**భార్యా గృహద్వారి, జన శ్మశానే,**
**దేహశ్చితాయాం, పరలోకమార్గే**
**కర్మానుగో గచ్ఛతి జీవ ఏకః...."**

**తా॥** సంపాదించిన ధనం భూమిమీద ఉండిపోతుంది; పశువులు శాలలో (కొట్టంలో) ఉండిపోతాయి; భార్య గృహద్వారం లోపల ఉండిపోతుంది; బంధుమిత్రులు శ్మశానం దగ్గరనే నిలిచిపోతారు; దేహం చితిపై మిగిలిపోతుంది. జీవుడు మాత్రం తాను చేసిన కర్మను అనుసరించి ఒంటరిగా ప్రయాణం చేస్తాడు!

# II. సూక్తిముక్తావళి

## 2.1. “సత్యసందర్శనం” - నిత్యసత్యాలు

1. ఎన్ని డన్‌లప్ పరుపుల మీద పొర్లినా, చివరకు కట్టెల పాన్పో, కరెంటు పాన్పో, తప్పదు.
2. కుమ్మరి జిగురుకోసం మట్టిని మర్దిస్తున్నాడు. ఆ మట్టి అంటోంది “కుమ్మరీ! నీవు కూడా నాలో కలిసే వాడివే”! అని.
3. తన ఆనందం కోసమే జీవుడు ఏషణత్రయాన్ని పట్టుకొన్నాడు.
4. ఆనందం ఇచ్చే వస్తువులు తనకే ఉండాలనీ, అవి సొంతం కావాలనీ, అవి తనను విడిచి పెట్టకూడదు అనీ– అనుకొంటూ ఉంటాడు మానవుడు!
5. పంచేంద్రియ ఆనందాలలో “స్పర్శ” ఆనందము గొప్పది.
6. కాళ్ళు తడవకుండా సప్తసాగరాలు దాటవచ్చునేమో కాని, కళ్ళు తడవకుండా జీవితాన్ని దాటలేడు మానవుడు.
7. జీవితం పెద్దకల. మృత్యువు దానికి ముగింపు. కన్ను తెరిస్తే కరిగి పోయేది స్వప్నం! కన్ను మూస్తే అంతరించేది జీవిత స్వప్నం!
8. లోభివాడే మహాదాత! తాను ఒక్క దమ్మిడీ కూడా ముట్టకుండా సర్వస్వం లోకానికి ఇచ్చి వెళ్ళిపోతాడు!
9. జాలరి పాదాల దగ్గర ఉన్న చేపలు వలలో పడవు! దైవపాదాలు ఆశ్రయించినవారు మాయలో పడరు!
10. ఈ లోకంలో అన్నీ మనల్ని విడచిపెట్టి పోతాయి! లేదా మనమే అన్నింటినీ విడచిపెట్టి పోవాలి! (ఈ రెండింటికంటె ముందు, మనం వాటిని విడచిపెట్టడం జ్ఞానం).
11. పుట్టుకకు చావుకు మధ్య సందేహంలాంటిది జీవితం! ఇది భగవంతుడు మనకు ఇచ్చిన పరిమిత కాలం!! అయినా జీవితాన్ని ఆనందమయం చేసుకో!
12. మనం చెయ్యలేని, మన ఊహకు అందని పనులు చేసేవాడే దేవుడు!
13. అరిగిన చెప్పుల్ని చూచి అసహ్యించుకోకు! అవి నీ కోసమే కదా అరిగి పోయాయి!
14. శిష్యుడు తన జ్ఞాననేత్రంలో తానే దైవాన్ని సందర్శించాలి! గురువులు దారి చూపే Sign Boards (రెక్కమానులు) మాత్రమే!

15. మిథ్యా ప్రపంచంమీద ఆసక్తి తగ్గిన కొలది, పరమాత్మయందు ఆసక్తి పెరుగును. ఈవలి ఒడ్డుకు దూరమైన కొలదీ, ఆవలి ఒడ్డుకు దగ్గర ఔతాడు కదా!
16. "ఊరంతా వ్యతిరేక మైనా బాధ లేదు! ఆ ఒక్కడూ నీ పక్షాన ఉంటే చాలు." (God).
17. రజ్జువునందు సర్పము - బుస - కదలిక - కల్పితము. పరమాత్మయందు చరాచరప్రపంచము కల్పితము!
18. ధనవంతులకు దరిద్రులకు సుఖాలలో మాత్రమే తేడా! దుఃఖాలు అందరకును సమానమే!!
19. తోడేలు కూడా అధర్మానికి భయపడుతుంది. అందుకే మేకపిల్లమీద ఆరోపణలకు ప్రయత్నించింది. (నీ ఎంగిలి నీళ్ళు నా దగ్గరకు వస్తున్నాయి. నన్ను ఆరు నెలల క్రిందట తిట్టావు).
20. స్వప్నంలో ఉన్నంత వఅకు స్వప్నం నిజం! మేల్కొన్నాక స్వప్నం అసత్యం; జాగ్రదవస్థ నిజం! జ్ఞానం పొందాక జాగ్రదవస్థ కూడా స్వప్నమే!!
21. జీవుడు తనకు సంబంధం లేని ఉపాధిని (దేహాన్ని) ఆశ్రయించి, సుఖదుఃఖాలు అనుభవిస్తున్నాడు.
22. వానరుడు నరుడుగా మారడానికి వేల సంవత్సరాలు పట్టింది! నరుడు నారాయణుడుగా (జీవుడు పరమాత్మగా) మారటానికి ఎన్ని లక్షల సంవత్సరాలు పట్టుతుందో!
23. "క్షణమే కదా!" అనకు! క్షణం కూడా కాలంలో భాగమే!
24. బిల్డింగ్ శ్లాబ్ క్రింద చేతులతో పట్టి తిరుగాడే బల్లి "ఈ బిల్డింగు నేను మోస్తున్నాను" అనుకోటం వంటిది - మానవుని అహంకారం!!
25. తప్పును ఒప్పుకో! సమర్థించకు! (వేసవిలో గురువుగారు విసనకఱ్ఱతో విసురు కొంటున్నారు. ఒక శిష్యుడు వారి దగ్గరకు జరిగి ఆ గాలి హాయిని పొందుతున్నాడు. ఒక పెద్దమనిషి: "గురువుగారికి నీవు విసరాలి! వారు విసరుకొనే గాలిని నీవు అనుభవిస్తున్నావు, తప్పు" అన్నాడు. ఆ మాయశిష్యుడు "గురుప్రసాదం! గురుప్రసాదం!" అంటూ - దొంగ నమస్కారాలు చేసాడు.)
26. "ఆరోగ్యము-ధనము" అనేవి జీవితానికి రెండు కళ్ళు. (Health and wealth are two eyes for life)
27. మానవ జీవితం అవ్యక్తపరమాత్మ అధీనంలోనిది! ఒక పథకం వేసికొని, బాధ్యతగా నడిపించుకోవటం మనకర్తవ్యం!

28. చూచినది చూచినట్లు గ్రహించేవాడు మూర్ఖుడు! విన్నది విన్నట్లు గ్రహించే వాడు పరమ మూర్ఖుడు! ఈ రెంటికీ వెనుక ఉన్న సత్యాన్ని గ్రహించిన వాడు – వివేకి!
29. మానవుడు హాయిగా బ్రతకాలంటే, జ్ఞానమైనా ఉండాలి! లేదా, బండకెత్తిన వాడైనా అయిఉండాలి!
30. డబ్బులేనివాళ్ళు ఉంటారు! కాని డబ్బు అవసరంలేనివాళ్లు ఉండరు!!
31. భవిష్యత్తునుగూర్చి అవగాహనతో, భూతకాలీన అనుభవాలతో, బాధ్యతగా, అందంగా వర్తమానాన్ని జాగ్రతగా నడుపుకోవాలి!
32. ప్రతిఫలాపేక్షతో దానధర్మాలు నిర్వర్తించినవాడు నిరాశను ప్రతిఫలంగా పొందుతాడు.
33. "వీడు నా స్నేహాన్ని ఎందుకు కోరుతున్నాడు?" అనే ప్రశ్నకు సమాధానం దొరకగానే ఆ స్నేహానికి స్వస్తిచెప్పు! నిర్వ్యాజప్రేమ – అకారణమైత్రి – అమృత మార్గానికి సోపానాలు!
34. ధర్మంకోసం– సత్యంకోసం – సంఘంకోసం – దైవంకోసం – బ్రతుకవలసిన లోకంలో, స్వార్థంకోసం బ్రతుకుతూ, మంచికి సమాధులు కట్టుకొంటూ పోతున్న లోకం ఇది. "Let me have noble thoughts from every where"
35. సర్దుబాటు – సహనం– క్షమించటం – మరచిపోవటం – అనేవి జీవయాత్రకు అవసరమైన సామగ్రి! "Forget and forgive!"
36. తెలివి తక్కువవాడు ఎక్కువగా మాట్లాడుతాడు! తెలివైనవాడు మాట్లాడిస్తాడు!
37. మనుష్యరూపేణ దైవం! I came to you like a child, like a friend, like an old man, but you din't receive me. (బైబిలు)
38. మాట్లాడటం అంటే; మాటలతో ఆడుకొనేలా ఉండాలి! చిత్రీపట్టినట్లు – గ్యాస్ లీక్ అయినట్లు–మురుగు కెలికినట్లు–బుఱ్ఱ తినేసినట్లు–బాధపడేలా ఉండ కూడదు! వినేవ్యక్తిని పట్టించుకొనకపోవటంలోనే వక్త పూర్తిగా దెబ్బతింటాడు.
39. భగవంతుడు విధించే శిక్షలు – లోకంలో ఏ జడ్జీ విధించలేడు.
40. అపకార–ఉపకారాలు మానవులు చెయ్యలేరు. దైవనిర్ణయం వేరుగా ఉన్నప్పుడు, అపకారం ఉపకారం అవుతుంది! ఉపకారం అపకారంగా మారుతుంది.
41. దైవికంగా వచ్చే భయంకర దుఃఖాలు ఒక్కొక్కప్పుడు నీ అభివృద్ధికి పరమపద సోపానాలు అవుతాయి. చివరకు వెళ్ళి సింహావలోకనం చేసికో! "అంతా మన మేలుకే!" అని అర్థం అవుతుంది!

42. ఎవరైనా, ఏమైనా, అనుకొంటారేమో? అనే నిత్యశంకితుడు జీవితంలో సుఖ పడలేడు.
43. పిరికివాడిని తరిమికొట్టే లోకం ఇది. నిలబడినవాడిని చూచి నిలబడుతుంది. ఎదిరించినవాడికి బెదురుతుంది.
44. చచ్చిపోయిన వాళ్ళకోసం బ్రతికి ఉన్నవాళ్ళు చచ్చిపోతే, ప్రపంచం ఒక మహాశ్మశానంగా మారిఉండేది
45. జాలిపడేవాడిని తెలివితక్కువవానిగా జమకట్టే లోకంలో, నీ జాలికి హద్దులు వేసుకోవాలి!
46. నీవు ఒక వ్యక్తిని అభిమానిస్తూ, వాడు నీకు (మానసికంగా) ఎంతదూరంలో ఉన్నాడో తెలుసుకొంటూ, దానినిబట్టి దగ్గర-దూరాలు సరిచేసుకొంటూ ఉండు! "ఆ వూరికి ఈ ఊరు ఎంత దూరమో, ఈ ఊరికి ఆ ఊరు కూడ అంతే దూరం కదా!
47. ప్రతివ్యక్తినీ నమ్మటం ఎంత తప్పో, అనుమానించటం కూడా అంతే తప్పు!
48. అర్హత-అనర్హతలు చూడకుండా ప్రతివానికీ జ్ఞానబోధ చెయ్యకు! అడుగని చోట బోధ, వక్తను తేలికపరుస్తుంది!
49. ఇతరుల్ని గ్రుడ్డిగా (అంధానుగతిగా) అనుసరించే లోకం ఇది! మంచిపనిని అందరకూ తెలిసేలా చెయ్యి! చెడ్డపనిని రహస్యంగా చెయ్యి! (తల్లి దండ్రుల సేవలు అందరకూ తెలిసేలా చెయ్యి; చుట్ట కాల్చుట రహస్యంగా చెయ్యి).
50. "మంచిది" అనుకొన్న పని వెంటనే అమలు పరచు! చెడ్డదేమో అనుకొన్న పనికి వాయిదాలు వేస్తూ ఆలోచించు!
51. మనం నవ్వితే ఏడిచేవాళ్ళు; ఏడిస్తే నవ్వుకొనే వాళ్ళు ఉన్న లోకం ఇది! నీ సుఖదుఃఖాలలో పాలుపంచుకొనేవాళ్ళకు దగ్గరగా జీవించు!
52. లోకంలో మంచివాళ్ళు లేరని నిస్పృహ చెందకు! చాలా మంది మంచివాళ్ళు లోకంచేత మోసగింపబడ్డారు.
53. "కాలం దైవస్వరూపం!" "ధనం లక్ష్మీస్వరూపం!" - ఈ రెండింటినీ వ్యర్థం చేసినవాళ్ళకు శిక్ష తప్పదు.
54. నోటితో మాట్లాడుతూ, నొసలితో వెక్కిరించే క్రూరలోకం ఇది! ఈ మహారణ్యంలోనే మహర్షులున్నారు! అన్వేషించు!

55. దూరపు కొండలు నున్నగా కన్పిస్తాయి. దగ్గరగా వెళ్ళి పరిశీలించు, సత్యాన్ని గ్రహించు!
56. "నిస్సారస్య పదార్థస్య ప్రాయేణ ఆడంబరో మహాన్!" సారము తక్కువగా ఉన్న వస్తువునకు ఆడంబరము ఎక్కువ!
57. ఇతరుల అదృష్టాలు ఆలోచిస్తూ విస్తుపోయే ముందు, వాళ్ళ దురదృష్టాల లోనికి కూడా ఒక్కసారి తొంగిచూడు!
58. మంచిగంధపు చెట్టును దూరాన్నుండి చూచి సువాసనకు విస్తుపోకు! దాన్ని చుట్టుకొని ఉన్న సమస్యాసర్పాల బాధల్ని కూడా అర్థం చేసుకో!
59. భార్యాపుత్రుల్ని తిట్టుకోవటం, పొగడుకోవటం, రెండూ యజమానియొక్క బలహీనతలే!
60. అవకాశాలు ఉన్నవాళ్ళకంటె, అవకాశాలు లేనివాళ్ళు అనుకొన్న లక్ష్యాలు సాధించారు.
61. అజ్ఞానాంధకారం తొలగటమే కష్టం! అది తొలగిన మరుక్షణం సత్యం సాక్షాత్కరిస్తుంది! నిజం నగ్నంగా నిలబడుతుంది!
62. "పరిస్థితులు అనుకూలింపక జీవితంలో వెనుకబడ్డాను!" అంటాడు అసమర్థుడు. రాతి మీద ఉన్న రావిగింజ ఏ ఆనుకూల్యంతో అభివృద్ధిని సాధింపగల్గింది?
63. అందరితోను మాట్లడకు! కొందరితో మాట్లాడటం మానకు!
64. శరీరంలో శక్తులు సన్నగిల్లిపోతున్నాయనీ, వ్యాధులు చోటు చేసుకొంటున్నాయనీ విచారించకు. నీవు ఈ లోకంనుండి వెళ్ళిపోవటానికి దారి సిద్ధపరుప బడుతోందని తెలుసుకో! నీవు వచ్చినది వెళ్ళిపోవటానికే కదా!
65. జీవితం ఒక పెద్ద కల! కొందరికి అది మధురస్వప్నం! మరికొందరికి అది పీడకల!!
66. భార్యా పుత్రులతోను, తక్కిన ఆప్తులతోను నీ జీవితాన్ని "లింక్" చేసుకో; "వెల్డింగ్" చేసుకోవద్దు!
67. ధనం-ఆరోగ్యం రక్షించు కొనకపోవటం మహాపాపం! ఆ పాపం అనుభవింపక తప్పదు.
68. పిచ్చి పోవటానికి చాలా కాలం పట్టవచ్చు! కాని, పిచ్చి ఎక్కటానికి క్షణకాలం చాలు.

69. రెండు ఇళ్ళలో గృహిణులు – బిచ్చగాణ్ణి "పైకెళ్ళు! పైకెళ్ళు" అన్నారు. "అందరూ పైకి వెళ్ళేవాళ్ళే!" అని గొణుక్కొంటూ వెళ్ళిపోయాడు.
70. పిల్లలు బడికి బయలు దేరుతూ తల్లి–దండ్రుల్ని "అమ్మా నీ టైమెంత?" – "నాన్నా! నీ టైమెంత?" అన్నారు. "ఎవరి టైము ఎంతో ఆ దేవుడికే తెలియాలి" అన్నాడు తండ్రి!
71. బాధలు పడుతోంటే సంతోషించు–పాపం తరిగిపోతోందని! ఆనందకాలంలో విచారించు – బ్యాంకు బాలెన్సు కరిగిపోతోందని.
72. చత్వారం–తెల్లవెంట్రుకలు–దంతక్షయం – అనేవి మృత్యువు మనకు ఇచ్చే నోటీసులు!!
73. మతిమరుపువాళ్లు ఎక్కడో పెట్టి, ఎక్కడో వెదకుచు, ఏడుస్తారని భగవంతుడు తల– కాళ్లు– చేతులు తీసి దాచుకొనే ఏర్పాటు లేకుండా చేశాడు!
74. మృత్యువుకంటె భయంకరమైనది దారిద్ర్యం!
75. ఆచరణలేని దురభ్యాసపరులు చేస్తున్నంత దైవప్రచారం, భక్తి కలిగిన సద్భక్తులు చేయలేకపోతున్నారు.
76. వస్తువు సొంతంఅయిపోయిన మరుక్షణంలో ఆ వస్తువు అజ్ఞానిదృష్టిలో విలువ కోల్పోతుంది! విజ్ఞానిదృష్టిలో ఆత్మీయతతో విలువను సంతరించుకొంటుంది!
77. జీవితం ఏకపాత్రాభినయం కాదు! బహుపాత్రల నాటకం! ప్రతిపాత్ర ప్రభావం, మొత్తం నాటకం మీద పడుతుంది!
78. కలలో పొందే సుఖదుఃఖాలు కూడా పుణ్యపాపక్షయకరాలు!
79. ఉద్దేశ పూర్వకంగా చేసిన పాపానికి ప్రాయశ్చిత్తం లేదు! అనుభవింపక తప్పదు!
80. 'న్యాయం గెలుస్తుంది' అనే మాట నిజమేకాని, గెలిచేదంతా న్యాయంకాదు!
81. "సంఘం నాకు ఏమి చేసింది?" అనే ఆలోచనకు ముందు – "సంఘానికి నేను ఏమి చేశాను?" అని ప్రశ్నించుకో!
82. గుణానికి మనకంటె ఎక్కువవారితోను, ధనానికి మనకంటె తక్కువవారితోను పోల్చుకోవాలి!
83. స్నేహితులను రహస్యంగా మందలించు! బహిరంగంగా అభినందించు!!
84. నిన్ను నీవు పొగడుకోవద్దు! ఎవ్వరూ నమ్మరు! నిన్ను నీవు కించపరచు కోవద్దు! అదే నిజమనుకొంటారు!
85. స్నేహం – కీర్తి – ధనం సంపాదించటం తేలిక! నిలుపుకోవటం కష్టం!

86. తల్లి దండ్రుల్ని పట్టించుకొనకపోవటం పశుపక్ష్యాదుల ధర్మం! మాతృదేవో భవ! పితృదేవో భవ! ధర్మాలు మానవ సంస్కారాలు!
87. Hate the sin! But not the sinner!! పాపాలు చెయ్యటం సాధారణ విషయం! క్షమించటం, పశ్చాత్తాపపడటం మానవత్వం!
88. ఒకతరం అంతరిస్తుంది! మరొకతరం అవతరిస్తుంది! కాని ప్రపంచం నిరంతరం కొనసాగుతుంది!
89. అహంకారంవల్ల ఏర్పడే అంధకారం, అసలు చీకటికంటే ప్రమాదకరం!
90. నీ శత్రువులోని సల్లక్షణాలు ఆనందంగా అలవరచుకో! అమేధ్యంలో ఉన్న బంగారాన్ని అసహ్యించుకోవుగదా!

## 2.2 "జ్ఞానతరంగాలు" - సూక్తులు

1. "దేహో దేవాలయః ప్రోక్తః, జీవో దేవః సనాతనః"
(దేహమే దేవాలయమని చెప్పబడింది. దానిలోని జీవుడే సనాతన దేవుడు)
2. మానవుని శక్తికి ఊహలకు అందనిదే దైవం.
3. "మృత్యుః సర్వహరశ్చాహం" (నీకు సర్వబాధలనుండి విముక్తిని ఇచ్చు మృత్యువును నేను!) - భగవద్గీత
4. కుండ వచ్చేటప్పుడు ఖాళీగా వస్తుంది. వెళ్లేటప్పుడు నింపుకొని వెడుతుంది - (కర్మ)
5. తన మీద తనకు అహంకారం, ప్రపంచం మీద మమకారం-ఈ రెండూ అజ్ఞానం ఉన్నంతకాలం ఉంటాయి.
6. "ప్రపంచాన్ని ఏదో అనుభవించెయ్యాలి" అని పరుగెత్తినవాళ్ళంతా తెల్లబోయారు!
7. జంతువులు తమ ప్రవృత్తిని మార్చుకోలేవు; మానవుడు మార్చుకోగలడు. అది మానవుని విశిష్టత. అయినా మార్చుకొనకపోతే, వాడు జంతువుకంటె హీనుడు!
8. భగవంతుడు మానవులకు విభిన్న పరిమిత కాలాలు ఇస్తాడు. జీవిత లక్ష్యం ఉత్తమప్రయోజనసాధన కావాలి!
9. అమూల్యమైన, ఆశ్చర్యకరమైన, సర్వార్థసాధకమైన దేహం ఉండగా, 'దేహి' అన్నవాడు మూర్ఖుడు.
10. నీ పెళ్ళాంపిల్లలకు చేసిన ఉపకారాలు చెప్పకు; లోకోపకారాలు ఏమైనా ఉంటే చెప్పు.

11. "అందరమూ పోయేవాళ్ళమే! కొంచెం ముందూ వెనకా–అంతే తేడా!" (–మా అమ్మ సూక్తి)
12. జీవితం ఒక స్వప్నం. దానిని మధురస్వప్నంగా మార్చుకోవటానికి ప్రయత్నం చేయటం నీ కర్తవ్యం!
13. "మనమే" అనుకోకు! "పైన ఒకడున్నాడు!" అన్న సంగతి మరచిపోకు!
14. ప్రపంచం ఒక Five Star Hotel! అనుభవించి వెళ్ళిపోవాలి! ఏదీ కూడా పట్టుకు వెళ్ళటానికి వీలులేదు!
15. దేవుడు – గురువు: ఇద్దరూ ఒక్కసారిగా నాకు ప్రత్యక్షమయితే, నేను ముందుగా గురువుకే నమస్కరిస్తాను. ఎందుకంటే, ఆ దేవుణ్ణి చూపించిన వాడు గురువే కదా!
16. ప్రపంచంలోనుండి వెళ్ళిపోయేవాళ్ళు తమకూడా పట్టుకుపోయే ఏర్పాటు ఉంటే, ఈ ప్రపంచంలో మట్టికూడా మిగిలేదికాదు!
17. "Birth Day" and "Death Day" అందరికీ ఉంటాయి. ఈ రెండింటి మధ్య ఉత్తమచరిత్ర లేనివాడు చరిత్రహీనుడవుతాడు.
18. "దినం వెళ్ళటం కాదు; తనువు వెళ్ళాలి!" (– మా అమ్మ సూక్తి)
19. "దిక్కులేనివాడి కొడుకును దివాణంవాడు కొడితే, దివాణంవాడి కొడుకును దేవుడు కొడతాడు!" (– మా అమ్మ సామెత)
20. అహంకార మమకారాలు, అజ్ఞానం – అనేవి దుఃఖకారణాలు.
21. జీవితంలో సుఖాన్ని ఆశించి మానవుడు ఏషణత్రయాన్ని పట్టుకొన్నాడు. సుఖమో దుఃఖమో – అది వాడి కర్మాధీనం! (ఏషణ త్రయం: ధనైషణ, దారైషణ, పుత్రైషణ)
22. మబ్బులేని ఆకాశం, ముల్లులేని గులాబి, సమస్యలు లేని మనస్సు ఉండవు.
23. కొన్నింటిని చూడటానికి పరికరాలు కావాలి. దైవాన్ని చూడటానికి జ్ఞాననేత్రం కావాలి.
24. "దైవం ఆలయంలో ఉన్నాడు" అనుకోవడం భక్తి. "దైవం అంతటా ఉన్నాడు" అనుకోవడం జ్ఞానం.
25. దైవబలం లేనప్పుడు జగదేకవీరుడు కూడా చేతకానివాడవుతాడు.
26. అంధుడు "సూర్యుడు లేడు!" అంటాడు. మూర్ఖుడు "దేవుడు లేడు!" అంటాడు. గ్రుడ్డివాడిని చూచి జాలిపడతాము కాని, వాడితో ఏకీభవించలేము కదా!

27. ప్రపంచాన్ని అర్థంచేసికొని ఆశించేవాడిని సుఖదుఃఖాలు అంటవు. చేతులకు నూనె రాసుకొని పనసతొనలు ఒలిచేవాడికి జిగురు అంటదు.
28. ఒకే మనస్సు బంధమోక్షాలు రెండింటికీ కారణం. ఒకే తాళంచెవి, తాళం వేయటానికీ, తీయటానికీ కూడా ఉపయోగపడుతుంది కదా!
29. మనం స్థిరమని భావించే ప్రతివస్తువునూ కాలం హరిస్తుంది.
30. మహాత్ముల జీవితాలు గుమ్మడిపాదులాంటివి. అవి పుట్టినస్థలంనుండి చాలా దూరం ప్రాకి అక్కడ కాయల నిస్తాయి.
31. ప్రతి అల వెనుకా సముద్రమంతా ఆధారంగా నిలిచి ఉంటుంది.
32. తెలిసి చేసిన పాపానికి ప్రాయశ్చిత్తం లేదు. దానిని అనుభవించక తప్పదు.
33. మనస్సు అనే రాక్షసుణ్ణి అదుపులోకి తెచ్చుకోగలిగినవారే అందరిలోకి శ్రేష్ఠులు.
34. ధర్మార్థకామమోక్ష సాధనమే జీవితలక్ష్యం.
35. తోలుబొమ్మలవాడు, ఆట అయిపోయిన బొమ్మను పెట్టెలో పెట్టేస్తాడు.
36. మనకు కనపడనివాడు, తెరవెనుకనుండి ఆడిస్తున్నాడు.
37. సాంసారిక జీవితంలో "మరుక్షణం" అనేది మహాంధకారంలో ఉంటుంది. అందుకే "సంసారాంధకారం" అన్నారు.
38. ఎవడు చింతలేనివాడు? భగవచ్చింత ఉన్నవాడు!
39. కృషికంటె అదృష్టం గొప్పది. ("అదృష్టం" = దైవానుగ్రహం)
40. ఆత్మవిశ్వాసం ముదిరితే అహంకారం అవుతుంది.
41. "కావాలి" అనుకోవటం ప్రవృత్తి; "వద్దు" అనుకోవటం నివృత్తి.
42. "కృషి–సాధన" అనే వాటిని భగవానుడు "అభ్యాసయోగం" అన్నాడు.
43. జగన్నాటకంలో నీవెవరో మరిచిపోకుండా నీ పాత్రను (కర్మయోగంగా) పోషించు.
44. భగవంతుణ్ణి వెదకటం బద్ధకమైనవాళ్ళు "లేదు" అన్నారు. "భగవంతుడు లేడు" అనే వాళ్ళను కూడా భగవంతుడే పోషిస్తున్నాడు.
45. కృషి ఒక్కటే అయినా ఫలితాలు వేరు; అదే దైవనిర్ణయం!
46. "భ్రాంతి" అంటే మనస్సుకు చాలా ఇష్టం. అటే పోతుంది; అక్కడే మురిసిపోతుంది.
47. దైవికంగా వచ్చే మంచిని ఆనందంగా స్వీకరిస్తాం. చెడ్డను కూడా ఆనందంగా దైవప్రసాదంగా స్వీకరించే సంస్కారం సాధించాలి.

48. 'కషాయం' దిగకుండా 'కాషాయం' (కాషాయ వస్త్రధారణం) ఎందుకు? 'తమస్సు' పోవందే 'తపస్సు'లోకి రాడు!
49. విషయాలు మనల్ని దుఃఖంలో ముంచలేవు. వాటిపై మనకున్న మమకారంతో మనం దుఃఖం తెచ్చుకొంటున్నాము.
50. మిథ్యాప్రపంచంలో సుఖాన్ని వెదకటం అజ్ఞానం!
51. అనుభవించే వ్యక్తిలోనే అందం ఆనందం ఉన్నాయి; వస్తువులో లేవు!
52. సుఖాన్నిచ్చే వస్తువులు సొంతాలు కావాలని కోరిక! సొంతాలు పోకూడదని ఆకాంక్ష! ఇతరులు ఆక్రమిస్తారని భయం!
53. 'సముద్రంలో కెరటాలు తగ్గాక స్నానం చేస్తాను' అనేవాడు మూర్ఖుడు! 'సంసారంతో స్తిమితపడ్డాక భగవంతుణ్ణి తలచుకొంటాను' అనేవాడూ అంతే!
54. సంసార భ్రాంతులను చూచి జ్ఞానులు నవ్వుకొంటారు.
55. ప్రపంచ దుఃఖాలే ప్రపంచాభిమానాన్ని తగ్గిస్తున్నాయి.
56. అజ్ఞాని దృశ్యంతో ముడి (గ్రంథి) వేసుకొంటాడు. జ్ఞాని ఆ ముడిని విప్పుకొంటాడు. అదే "గ్రంథిచ్ఛేదం!"
57. రజ్జువు (త్రాడు)లో సర్పంలేదు! మేలుకొన్నవానిలో స్వప్నం లేదు!
58. లోకం భగవంతునిలోను, భగవంతుడు లోకంలోను ఉండును.
59. 'జ్ఞానం' అంటే 'తెలిసికొనటం'; 'విజ్ఞానం' అంటే 'ఆచరణలోకి తెచ్చుకొనటం'.
60. **I, II** తరగతుల రైలు శ్మశానంవైపు వెడుతోంది. అందులో కొందరు బంగారు సంకెళ్ళతోను, మరికొందరు ఇనుప సంకెళ్ళతోను ఉన్నారు.
61. లేనివి లభించటం యోగం; లభించిన వాటిని కాపాడుకోవటం క్షేమం!
62. స్వప్నజగత్తు ఎంత గొప్పదైనా, జాగృతుని (మేలుకొన్నవాని) ముందు తీసికట్టే కదా! ధన-అధికార-బల శక్తులు పరమాత్మశక్తి ముందు ఎంత?
63. నాణానికి బొమ్మ - బొరుసులవలె, పరమాత్మ సగుణ - నిర్గుణ స్వరూపుడు!
64. మిథ్యాప్రపంచ వస్తువులకు జ్ఞాని ఆసక్తుడు కాడు.
65. "శరీర భోగమే జీవిత పరమావధి" అనుకొంటే మానవుడై జన్మించనక్కరలేదు. (1. ఆలమందలో ఆఁబోతుగాను, 2. మేకలమందలో చింబోతుగాను, 3.గొఱ్ఱెలమందలో పొట్టేలుగాను పుడితేచాలు!)
66. లోకాన్ని దర్శించటంవల్ల బుద్ధునికి వైరాగ్యం కలిగింది; మనకు వ్యామోహం పెరుగుతోంది.

67. రైలులో ప్రయాణం చెయ్యాలి. కాని "రైలునాది!" అనుకోవడం, "రైలుదిగను!" అనుకోవడం తప్పు.

68. జ్ఞానోదయం అయిన క్షణమే మాయ తొలగిపోతుంది. మెలకువతోనే అనాది స్వప్నం అంతరిస్తుంది.

69. పెద్ద తప్పు చేసి - చిన్న దానం చేయటం, గోవును చంపి - చెప్పులు దానం చేయటం వంటిది!

70. మాయ (భ్రాంతి - అజ్ఞానం) మనలోనే పుట్టి, మనలోనే పెరుగుతుంది. నాచు నీళ్ళలోనే పుట్టి, నీళ్ళలోనే పెరుగుతుంది.

71. మోక్షానికి ఎవరు వెడతారు? నేను పోతే పోతాను. (నేను = అహంకారం).

72. ధన దార పుత్రులకోసం పొందేది 'విషాదం!' దైవంకోసం, జ్ఞానంకోసం పొందేది 'విషాదయోగం!'

73. జీవునికి చావాలని ఉండదు. ఎందుచేతనంటే - జీవుడు చావులేనివాడు.

74. చెట్టును-పుట్టను, ఊతిని-అప్పను పూజించటంలో అంతరార్థం - 'అంతటా పరమాత్మ ఉన్నాడు' - అనే మహాజ్ఞానం. (హిందూమతం).

75. సంసారచక్రంలో పడకుండా చేసే జ్ఞానమే నిజమైన పాండిత్యం

76. వేదాంతోపన్యాసంలో వక్త భాషణం కట్టిపెట్టడంతోపాటు, శ్రోత వైరాగ్యాన్ని కూడా కట్టిపెడతాడు!

77. పాండిత్యం పెరిగినంత మాత్రాన ఉన్నత దృష్టి అలవడదు. గ్రద్ద ఎంత ఎత్తుకు ఎగిరినా దాని దృష్టి కుళ్ళిన మాంసం (నశ్వర పదార్థాల) మీదనే ఉంటుంది.

78. అజ్ఞానదశలో అల్పములైన కామక్రోధాదులు మనపైన నాట్యంచేస్తాయి. సింహం నిద్రిస్తున్నప్పుడు చిట్టెలుకలు దాని మీదకెక్కి నాట్యంచేస్తాయి.

79. తప్పు చేయటం మానవ సహజం. గమనించి సరిదిద్దుకోడం దైవత్వం.

80. అజ్ఞానాంధకారం తొలగటమే కష్టం. అది తొలగిన మరుక్షణం సత్యం సాక్షాత్కరిస్తుంది.

81. "ఫలితాన్ని దృష్టిలో పెట్టుకొని కర్మలు ఆచరించేవాడు అజ్ఞాని. కామము, మోహము -జ్ఞానాన్ని నశింపజేస్తాయి. కావున ఈ రెండూ జ్ఞానియైనవాడికి బద్ధశత్రువులు" -భగవద్గీత

82. "పరమాత్మను కళ్ళు చూడలేవు; మనస్సు అందుకోలేదు; వాక్కు వర్ణించలేదు." - ఉపనిషత్తులు.

83. "ప్రతిజీవి కర్మబద్ధుడు. పూర్వజన్మ సంస్కారాలవల్ల కలిగిన వారి కర్మలను మార్చగల శక్తి దేవతలకు కూడా లేదు" – భాగవతము.
84. "పవిత్రమైన హృదయం, పవిత్రమైన యాత్రాస్థలం వంటిది." – వ్యాసుడు.
85. "పవిత్రభావనలు, ప్రశాంతత, నెమ్మదితనం, మౌనం, నిగ్రహం – ఇవన్నీ మానసిక తపస్సులోకి వస్తాయి." – భగవద్గీత.
86. "ప్రయత్నించనిదే ఫలం దక్కదు. సింహమైనాసరే నిద్రిస్తుంటే, ఆహారం వచ్చి దాని నోట్లో పడదు." – సంస్కృత సుభాషితం.
87. "అన్ని విద్యలలోకి ఆధ్యాత్మికవిద్య అగ్రగణ్యమైనది." – భగవద్గీత.
88. "ప్రతిజీవి మృత్యువు గొడుగు క్రిందనే జీవిస్తున్నాడు" – హెర్మన్ హూంకర్
89. "అన్ని ధర్మాలను త్యజించి, నన్ను శరణువేడు! అన్ని పాపాలనుంచి, శోకం నుంచి నిన్ను విముక్తుణ్ణి చేస్తాను" – భగవద్గీత.
90. "ఆత్మను తెలుసుకోవడాన్ని మించిన ప్రయోజనం మరొకటి లేదు" – జగద్గురు శంకరాచార్య.
91. "మనస్సును అభ్యాసంవలన, వైరాగ్యంవలన నిగ్రహించవచ్చును." – భగవద్గీత.
92. "మన హృదయంలో నివసిస్తున్న పరమాత్మను చూడగలిగినప్పుడు కలిగే ఆనందమే ఆనందము!" – త్యాగరాజు
93. మానవుడు అవిద్యతో కూడినవాడు. గురువు సహాయం లేకుండా ఆత్మజ్ఞానం పొందలేడు.
94. "మృత్యువును చూచి భయపడితే మాత్రం అది నిన్ను వదిలిపెడుతుందా? కనుక జన్మరాహిత్యమే నీ లక్ష్యంగా పెట్టుకో!" – జగద్గురు శంకరాచార్య.
95. "మరణించిన ప్రతిజీవి తిరిగి పుడుతుంది. దీనిని ఎవ్వరూ మార్చలేరు." – భగవద్గీత
96. "హితబోధ చేసేవారు లేక లోకం పతనం కావడంలేదు; వినేవారు ఆచరించేవారు లేక చెడిపోతోంది" – ఋషిప్రోక్తం
97. "మంచిపని చేసేవాడు ఎప్పుడూ నష్టపోడు. అతనికి ఎల్లప్పుడూ మంచే జరుగుతుంది." – భగవద్గీత
98. "మాట వినపడనివాడు చెవిటివాడు కాదు; మంచిమాట వినిపించుకోనివాడు నిజమైన చెవిటివాడు" – జగద్గురు శంకరాచార్య.
99. మంచివైనా, చెడ్డవైనా మన కర్మలు మనల్ని నీడలా వెన్నంటి వస్తాయి.

100. "మరుక్షణంలో ఏం జరుగుతుందో మనకు తెలియదు. అలాంటప్పుడు 'మనం' అని, 'మనది' అని అనుకోవడంలో అర్థమేముంది?" – జగద్గురు శంకరాచార్య
101. అందరినీ సమానంగా చూచేది లోకంలో ఒకే ఒకటి ఉన్నది – అదే మృత్యువు.
102. "పశుత్వం–మానవత్వం – దైవత్వం-వీటి మేళవింపే మానవుడు" – స్వామి వివేకానంద
103. పాలలో వెన్న అదృశ్యంగా ఉన్నట్లుగా, ఈ చరాచర ప్రపంచమంతటా అగోచరంగా భగవంతుడున్నాడు.
104. "నలువైపులనుండి ఉదాత్త భావాలకు చోటివ్వండి" – ఋగ్వేదం.
105. "ఆత్మతత్త్వ మెరిగినవారికి లౌకికమైన సుఖదుఃఖాలు గడ్డిపరకలతో సమానం!" – రామాయణం.
106. "అభ్యాసముకన్న జ్ఞానము, జ్ఞానముకన్న ధ్యానము, ధ్యానముకన్న కర్మఫలత్యాగము శ్రేష్ఠము" – భగవద్గీత.
107. "కర్మలు ఫలవంతమగుటకు మూడు అంగములు అవసరము: ఈశ్వరానుగ్రహము, పురుషప్రయత్నము, అదృష్టము" – చంద్రశేఖరేంద్రస్వామి.

## 2.3 "భగవద్గీతాప్రబోధం" – సూక్తులు

1. "నేనొక్కడినే సుఖంగా ఉన్నాను!" – "నేనొక్కడినే దుఃఖంతో ఉన్నాను" అనుకొనే ఇద్దరూ మూర్ఖులే! (చాలామందిలో నీవొకడవు – జ్ఞానం!)
2. పసివాని ఏడుపు "క్వ–క్వ–క్వ!": (ఆనందం) "ఎక్కడ? ఎక్కడ? ఎక్కడ?". తల్లి ఊయల ఊపుతూ... "హుళక్కి – హుళక్కి – హాయీ!" (ఎక్కడా ఆనందం లేదు లేదు లేదు!)
3. "లేదు" అనే దుఃఖం కంటె, "ఉన్నది" అనే దుఃఖం గొప్పది. నాస్తి (లేదు) అనేది ఒకటే ఏడుపు! ఉన్నది దుఃఖం బహుముఖం!
4. సంసారంలో ఉండి, దైవాన్ని మరచినవాడు – అంటుకొన్న యింట్లో, ఎండుగడ్డిపై పరున్నవాడు!
5. "తరతి శోకం ఆత్మవిత్" – ఆత్మజ్ఞానము తెలిసికొన్నవాడు దుఃఖమును దాటివేయును.
6. మామిడి టెంకను నిష్కామంగా పాతినా, అది తోరణం – నీడ – పండ్లు ఇచ్చును.

7. "దృష్టాః సుతాః! తత్తనయ ప్రసూతిం ద్రష్టుం, పునః వాంఛతిమే అంతరాత్మా!" = పుత్రుల కనినాను! వారిబిడ్డల చూడ వేడుకగా నున్నది! "మనోరథానాం అతటాః ప్రవాహాః!" = కోరికలకు ఒడ్డులు లేవు!
8. ఉన్నప్పుడు ఆ వస్తువుయొక్క విలువ తెలియదు. తల్లిదండ్రులు - ఐశ్వర్యం - కాళ్లు -కళ్లు-ఆరోగ్యం-కరెంటు-మొదలైనవి పోయినప్పుడు వాని విలువ తెలుస్తుంది.
9. "ఇది నాది" అనుకొనేవాడు, "ఇది నేను చేశాను!" అనుకొనేవాడు-ఇద్దరూ అజ్ఞానులే!
10. చూడనివి ఎన్నో నమ్మవలసిన నీవు, 'చూస్తేకాని నమ్మను!' అనటం మూర్ఖత్వం! తల్లిగర్భంలో నవమాసాలూ ఉన్నట్లు నూరుపాళ్లు నమ్ముతున్నావు! జ్ఞాపకం ఉందా?
11. ప్రపంచాన్ని మించిన ఆధ్యాత్మిక గ్రంథం లేదు.
12. "యద్దృశ్యం తన్నశ్యం"-ఇది అర్థం అయితే, ప్రపంచవ్యామోహం ఉండదు.
13. అత్యంతంగా మనల్ని ఆకర్షించే ప్రతివస్తువులోను, సత్యమో, అసత్యమో దట్టంగా ఉందని గ్రహించు!
14. లోకాన్ని చర్మచక్షువుతో చూస్తే - రక్తి! జ్ఞానచక్షువుతో చూస్తే - విరక్తి!
15. కుడిచేత్తో చేసిన కర్మ, ఎడమచేత్తో అనుభవించి తీరాలి! కర్మ, కర్తను వెంటాడుతుంది.
16. దైవాన్ని ఆశ్రయించిన వాణ్ణి 'మాయ' బాధించదు!
17. "చచ్చాక ఏదీ మనతోరాదు" అనకు! పాపపుణ్యాలు మనల్ని విడచిపెట్టవు; కూడా వస్తాయి.
18. ఉన్నదాన్ని లేదని, లేనిదాన్ని ఉన్నదనీ, నీవే కలియద్రొక్కుకుంటున్నావు! ఉన్నది - ఉన్నదే! లేనిది - లేనిదే! "బ్రహ్మ సత్యం!- జగన్మిథ్యా!"
19. గంగలో మునిగినవాడు - సముద్రంలో తేలును. గీతలో మునిగినవాడు - 'బ్రహ్మానందం'లో తేలును.
20. దృశ్యవస్తువులపై ఆసక్తి ఉన్నంతవఱకు భయంతప్పదు! దృశ్యం నశ్యంకదా!
21. దృశ్యవస్తువులను నమ్మి ఆనందము పొందగోరువారు, మొసలిని కొయ్యగానెంచి నదిని దాటగోరువారు!

22. మాయ అంటే మనస్సుకు చాలా ఇష్టం! అది మాయను నమ్మినట్లు సత్యాన్ని నమ్మదు!
23. జగన్నాటకంలో నీవెవరో నీవు తెలుసుకో! నీ పాత్రను 'కర్మయోగం'గా పోషించు.
24. జీవితంలో సుఖదుఃఖాల రూపాలు మారుతాయి! కాని వెంటాడటం మానవు!
25. 'సర్పభ్రాంతి' – దీపం వస్తేనేకాని పోదు! 'లోకభ్రాంతి' – జ్ఞానం వస్తేనేకాని పోదు!
26. మానవుడు మాయాధీనుడు! మాధవుడు మాయాధీశుడు!
27. ఏ వీధులలో బంగారు రథంపై హారతులందుకొంటూ తిరిగినాడో, అవే వీధుల్లో భిక్షాపాత్రతో 'భిక్షాందేహి!' అంటూ తిరుగాడటానికి ఎంతటి 'సమత్వశక్తి' కావాలో యోచించండి! (అదీ సిద్ధార్థుని ఆత్మశక్తి!)
28. విత్తనం తడిసినప్పుడే మొలకెత్తుతుంది. మనస్సు భక్తితో తడిసినప్పుడే చైతన్యవంతం (దైవానికి దగ్గర) అవుతుంది.
29. మృత్యువు అన్నింటిని మ్రింగును! మోక్షము సాధించిన మానవుడు మృత్యువునే మ్రింగును!
30. జ్ఞానం వచ్చాక, ప్రపంచాన్ని అంటించుకోడు. చింతకాయ పక్వమయ్యాక, దాని గుజ్జు, గుల్లను పట్టించుకోదు.
31. "ప్రపంచ సాహిత్యమంతా కనుమరుగైపోయినా పర్వాలేదు. భగవద్గీతలోని రెండు శ్లోకాలతో మళ్లీ అద్భుతాన్ని సృష్టించవచ్చు. ఈ జాతి వారసత్వసంపద భగవద్గీత" – స్వామి వివేకానంద
32. "భగవద్గీత ప్రపంచ మానవాళిపై అమితమైన ప్రభావాన్ని చూపుతూనే ఉంటుంది. ఏ తరానికైనా గీత స్ఫూర్తిదాయక గ్రంథం. దీని ద్వారా మానవాళి ఎంతో అభ్యున్నతి సాధించవచ్చు. మానవీయతకు పట్టంగట్టే గ్రంథరాజం." – ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ (ప్రపంచ ప్రసిద్ధికెక్కిన భౌతికశాస్త్రవేత్త)
33. "గీత మనకు లభించిన వెలకట్టలేని కానుక! ప్రతిమనిషి ఎలా ప్రవర్తించాలో, ఎలా ప్రవర్తించకూడదో.. భగవద్గీత వివరించినట్టుగా మరే గ్రంథం వివరించలేదు." – సీ.జీ. యూంగ్, మనస్తత్వశాస్త్రవేత్త
34. "అంతర్గతశక్తే గురువు. ధ్యాన, జ్ఞాన, యోగాల ద్వారా శక్తిని వృద్ధిచేసుకోవాలి. ఆ శక్తిని సమాజహితంకోసం వెచ్చించాలి." – వీఎస్ఆర్ మూర్తి, ఆధ్యాత్మికవేత్త

35. "నూనె, పత్తి, ప్రమిద లేకుండా దీపం ఉండదు. దేహం, మనసు, హృదయం లేకుండా మనిషి లేడు. పరస్పరం ఒకదానిపై ఒకటి ఆధారపడినట్లు, వ్యక్తిలేకుండా సమాజం లేదు. సమాజబలం లేకుండా వ్యక్తి రాణించడు." - వీఎస్ఆర్ మూర్తి, ఆధ్యాత్మికవేత్త
36. జ్ఞాని విముక్తినే కోరుతాడు; ప్రపంచసుఖాలను ఆశించడు.
37. చేతికి అందిన వస్తువుయొక్క విలువ తెలిసినవాడు నిత్యతృప్తుడు! కాని, అందని వస్తువులోని అందము, అందిన దానికి లేదు!
38. "ఆదిలో లేదు. అంతంలో లేదు. మధ్యలో ఉన్నట్లుగా కనిపిస్తుంది. అందుకే ప్రపంచం మిథ్య - లేదు!" - జగద్గురు శంకరాచార్య
39. ప్రపంచం-పరమాత్మయందు కల్పితము"; "సర్పం-రజ్జువు(త్రాడు)నందు కల్పితము.
40. చిత్తశుద్ధిలేనివాడు ఆత్మసాక్షాత్కారం పొందలేడు. మలినమైన అద్దంలో ప్రతిబింబం కన్పించదు కదా!
41. చత్వారం, తెల్లవెంట్రుకలు, దంతక్షయం-అనేవి, మృత్యువు మనకిచ్చే వార్నింగులు, నోటీసులు
42. "ఏదో శక్తి మనలను నడుపుతోంది" అని గ్రహిస్తే అహంకారం నశిస్తుంది. "దృశ్యం నశ్యం" అని గ్రహిస్తే మమకారం నశిస్తుంది.
43. "అసతో మా సద్గమయ!" - అసతః = చెడ్డనుండి లేదా అసత్యమునుండి, మా = నన్ను, సత్ = మంచికి లేదా సత్యమునకు, గమయ=నడిపింపుము.
44. "తమసో మా జ్యోతిర్గమయ" - తమసః = చీకటినుండి, మా = నన్ను, జ్యోతిః = వెలుగునకు, గమయ= నడిపింపుము. (చీకటి = అజ్ఞానము; జ్యోతి = జ్ఞానము).
45. "మృత్యోర్మా అమృతం గమయ!" (మృత్యోః = మృత్యువునుండి, మా = నన్ను, అమృతం= అమరత్వమునకు, గమయ= నడిపింపుము).

## 2.4 ఆంగ్లసూక్తులు

1. Money makes many things. In the same way, money makes many wrongs also.
2. What can make me afraid! Death is a joke to me.

3. Awake! Arise! Stop not till the goal is reached!
4. If money is lost, nothing is lost.
   If health is lost, something is lost
   If character is lost, everything is lost!
5. To forget God is sin!
6. Death is a most important event in life! Man has sufficient time to know how to die!
7. God helps those who help themselves
8. Help ever! Hurt never!!
9. An unknown power always leads us!
10. Something is behind this curtain.
11. Body is a link between earth and heaven.
12. If health is ignored, nothing is left in this world!
13. A foolish man learns from his own experiences and a wise man from others!
14. Aim for the highest; and prepare for the worst!
15. Turn the page and learn the work.
16. Less luggage – more comfort –make travel a pleasure. జీవయాత్రలో కోరికల బరువు లేనివాడు సంతోషముగా పయనించును.
17. Man proposes but God disposes.
18. To Day! Not tomorrow! (మంచి పనికి వాయిదా వెయ్యకు!)
19. Money comes and goes! Morality comes and grows!
20. Many a slip between the cup and the lip.
21. Body is an instrument given by God.
22. Spiders weave their webs where Caesars ruled.
23. Man must realise God, see God and talk to God.
24. "All the world is a lumatic asylum where all people are mad; some after money and some after women. But, I am glad, I am mad after God!" - Sri Ramakrishna Paramahamsa.

## 25. Thus Spake Gandhiji

1. Life is an inspiration. Its mission is to strive after perfection which is self-realisation.
2. Man becomes great exactly in the degree in which he works for the welfare of his fellowmen.
3. The body can be of real service only when we realise it to be a temple of God and make use of it for God's worship.
4. Each one has to find his peace from within.
5. Patience and perseverance overcome mountains.
6. There is a divine purpose behind every physical calamity.
7. The highest wisdom is never to worry about the future but to resign ourselves entirely to His will.
8. Happiness depends on what you can give, not what you can get.
9. Life has a purpose. To seek to defeat that purpose is a sin. (So suicide is a sin)
10. A semi - starved nation can have neither religion nor art nor organisation.
11. Life and death are like the two sides of a coin.
12. To be afraid of death is like being afraid of discarding an old and worn out garment.
13. You have no need to go to books to find God; you can find Him within yourself.
14. Real beauty is the beauty of the soul.
15. All true art is an expression of the soul.
16. Religions are not meant for separating men from one another; they are meant to bind them.
17. Religions are meant to tame our savage nature; not to let it loose.
18. There is only one God, but there are many paths to Him.
19. A community or country in which women are not honoured could not be considered civilised.

# III. వేదాంతకథలు

## 3.1 "సత్యసందర్శనం" -వేదాంతకథలు

### (1) దైవచింతన

**"సుభావబోధార్థం అఖ్యాయికాఖ్యానమ్"** అన్నారు ఆదిశంకరులు. వేదాంత విషయాలు బోధించడంలో తేలికగా అర్థంకావడానికి కథలు అవసరం అని ఆయన ఉద్దేశం.

అనగా అనగా ఒక మహారాజావారు ఉన్నారు. వారికి దైవచింతన ఎక్కువ. అందుచేతనే తన దేశంలో ఉన్న ప్రజలకు దైవంపట్ల ఎటువంటి అవగాహన ఉందో తెలుసుకోవడానికి మూడు ప్రశ్నలిచ్చి దండోరా వేయించాడు. అవి 1. దేవుడు ఉన్నాడా? 2. ఎటువైపు చూస్తుంటాడు? 3. ఏమిచేస్తూ ఉంటాడు?

"ఈ మూడు ప్రశ్నలకు సమాధానం చెప్పగలిగినవాళ్ళే రాజు వద్దకు రండి, చెప్పలేకపోతే శిరశ్ఛేదం" అని ప్రకటించాడు. పండితులు, జ్ఞానులు, భక్తులు, సన్న్యాసులు, యోగులు, ఎందరో ఈ ప్రకటన విన్నారు. కాని "చెప్పలేకపోతే శిరశ్ఛేదం" అనే మాటకు భయపడి ఎవరూ సాహసించలేదు.

ఒక సన్న్యాసిమాత్రం నిర్భయంగా రాజువద్దకు వచ్చి "రాజా! మీ ప్రశ్నలకు నేను సమాధానం చెప్తాను. ఇది భగవద్విషయం కాబట్టి నేను కోరినవి తెప్పించండి" అని అడిగాడు. "1. దీపారాధనం చేయించండి. 2. నైవేద్యానికి ఒక గ్లాసుపాలు ఇక్కడ పెట్టించండి" అన్నాడు. వెంటనే అవి ఏర్పాటు చేయించబడ్డాయి. రాజు సన్న్యాసిని సమాధానం చెప్పమన్నాడు. అప్పుడు సన్న్యాసి "రాజా! నేను ఇప్పుడు గురువును. నేను ఉన్నతాసనం మీద ఉండాలి. నీవు శిష్యుడవు, క్రిందకూర్చుండాలి. ఇది ఉపదేశకాల నియమం". అన్నాడు.

రాజు అందుకు అంగీకరించి ఆ సన్న్యాసికి సింహాసనం సమర్పించి, తాను క్రిందకూర్చున్నాడు.

సింహాసనం మీద కూర్చున్న సన్న్యాసి "రాజా! ఇప్పుడు ప్రశ్నించు" అన్నాడు. అందుకు రాజు "దేవుడున్నాడా?" అని అడిగాడు.

సన్న్యాసి క్షీరపాత్రను చూపిస్తూ, "రాజా! ఈ పాలలో వెన్న ఉందా?" అని ఎదురుప్రశ్న వేసాడు.

రాజు : "ఉన్నది" అన్నాడు.

సన్న్యాసి : కనిపించదేం?

రాజు : కాచి, తోడుపెట్టి, చిలికితే కనిపిస్తుంది.

సన్న్యాసి : భగవంతునిగూర్చి నిరంతరం చింతన ఉన్నవాళ్ళకు భగవంతుడు కనిపిస్తాడు.

ఇక రెండవ ప్రశ్న

రాజు : దేవుడు ఎటు చూస్తాడు?

సన్న్యాసి : రాజా! ఈ దీపం ఎటు చూస్తున్నది?

రాజు : అన్ని దిక్కులకు.

సన్న్యాసి : దీపంలాగే దైవంకూడా అన్ని దిక్కులకు చూస్తాడు.

రాజు : ఈ దృష్టాంతపూర్వక సమాధానాలకు తృప్తిచెందాడు. మూడవ ప్రశ్నకు సన్న్యాసి ఏమి చెప్తాడో చూద్దామనుకున్నాడు.

రాజు : భగవంతుడు ఏమి చేస్తాడు?

సన్న్యాసి : రాజా! సకల సామ్రాజ్య అధినేతవు. నీవు క్రిందకూర్చున్నావు. భిక్షుడినైన నేను నీ సింహాసనం మీద కూర్చున్నాను. ఇట్లే భగవంతుడు పైనున్న వానిని క్రిందకు, క్రిందవానిని పైకి మారుస్తూ ఉంటాడు.

ఈ సమాధానాలతో రాజు తృప్తిపడ్డాడు. దైవంపట్ల ఉన్న భక్తి అనన్యమై, తన జీవితాన్ని కొనసాగించుకొని ధన్యుడయ్యాడు.

## (2) దైవభక్తి

**దైవం, దిష్టం, భాగధేయం, భాగ్యం, నియతి, విధి** – అనే ఆరు పదాలు దైవనిర్దిష్టాలుగా అమరుడు పేర్కొన్నాడు. భగవంతుడు ఏమిచేస్తాడు? అనే ప్రశ్న ఉద్భవించినపుడు, ప్రపంచ సృష్టిస్థితిలయాలు నిర్వహించే పరమాత్మయే సర్వం నిర్వహిస్తున్నాడని గ్రహించాలి. 84 లక్షల జీవరాశుల్ని పధ్నాలుగు లోకాలలో సృష్టించి, గ్రహాలను పరస్పరాకర్షణతో రోదసిలో నిల్పి, సర్వం నిర్వహించే, పరమాత్మకు సంబంధం లేనిది ఈ ప్రపంచంలో ఉండదు. దైవముయొక్క శక్తి తలచినకొలది ఆశ్చర్యము, భక్తి మనసులో పెనవేసుకొంటాయి. అట్టి భగవంతుణ్ణి మరచుట నేరము. ఆంగ్లంలో "To forget God is sin".

ఒక పిచ్చుక తనగూడు నిర్మించుకొనే కళాత్మక, ఆలోచనాత్మక నైపుణ్యాన్ని చూస్తే – దైవశక్తి గోచరిస్తుంది. పురివిప్పిన నెమలికన్నుల సౌందర్యాన్ని చూడటానికి మన రెండు కనులూ చాలవు. నలుసంత చీమలో మలచిన దేహభాగాలను చూస్తే – పరమాత్మ స్ఫురణకు వస్తాడు. ఆకాశం అంటిన ఇంద్రధనుస్సును చూస్తే–దైవం

ప్రసాదించే అందాలకు ఆకాశమెత్తు నిదర్శనం గోచరిస్తుంది. బొమ్మలు, లక్కపిడతలు చూస్తే పిల్లవాడు జ్ఞాపకం వచ్చినట్లుగా, ప్రకృతిని పరిశీలిస్తే - భగవానునిపై భక్తి ప్రవర్ధమానమౌతుంది.

**ఆ॥వె॥ కన్ను, నోరు, ముక్కు, కడుపును, కాయంబు,**
**చెక్కినాడు చిన్న చీమలోన**
**తలచి చూడ వాని ఉలియెంత చిన్నదో?**
**ఎంత సున్నితములో మృదుకరములు!**

అనే ఆశ్చర్యం కలుగుతుంది. జీవరాసుల దేహనిర్మాణం మనకు అంతుపట్టదు. ప్రదేశాన్నిబట్టి, ఆయాప్రాణుల అవసరాన్ని అనుసరించి భగవానుడు చేసిన సృష్టి యొక్క ఆంతర్యాన్ని గమనిస్తే, దైవశక్తికి మానవుడు మోకరిల్లవలసిందే! పగటికి ఒక దీపం - రాత్రికి ఒక దీపం - పెట్టి ఈ జగన్నాటకాన్ని ఆడించే జగన్నాటక సూత్రధారి యొక్క మహత్తరశక్తిని వర్ణించటానికి వాక్కులు ఉన్నాయా? అందుకే అన్నారు మహర్షులు **"యతోవాచో నివర్తంతే, అప్రాప్యమనసాసహ"** - భగవంతుని మాహాత్మ్యాన్ని వర్ణించటానికి మాటలు చేతకానివై మరలిపోతున్నాయట. మనస్సుకూడా తన అసమర్థతనే వెలిబుచ్చిందట. కృషిచేయువారికి దైవసహాయ ముండును. దైవమే సర్వం నిర్వహిస్తాడు. God helps those, who help themselves. మానవుడు, మానవుని కృషి, నిమిత్త మాత్రాలు. "నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్!"- "నీవు కారణమాత్రుడుగా నిలబడు! నేను తక్కినది అంతా చక్కబెడతాను" అంటాడు భగవంతుడు. దైవశక్తినిగూర్చి మనపూర్వులు మరో మహత్తర శ్లోకాన్ని మనకు అందించారు.

**మూకం కరోతి వాచాలం, పంగుం లంఘయతే గిరిమ్**
**యత్ కృపా తమహం వందే, పరమానంద మాధవమ్.**

దైవముయొక్క దయవుంటే, మూగవాడు మహోపన్యాసాలు ఇస్తాడు. కుంటివాడు పర్వతశిఖరాలు దాటగలుగుతాడు. అట్టి పరమాత్మయొక్క కరుణాంతరంగానికి కరకమలాలు జోడించి నమస్కరించి తరించాలి. ఒక మహాకవి దైవమాహాత్మ్యాన్ని ఒక్క శ్లోకంలో పేర్కొన్నాడు.

**శ్లో॥ అసితగిరి సమంస్యాత్ కజ్జలం సింధుపాత్రే**
**సురతరువరశాఖా లేఖినీ పత్రముర్వీ ।**
**లిఖతియది గృహీత్వా, శారదా సర్వకాలం**
**తదపి తవగుణానా మీశపారం నయాతి ॥**

కాటుకపర్వతాన్ని తెచ్చి సముద్రంలో వేసి, సిరాతొట్టెగా మార్చింది శారద. కల్పవృక్షశాఖను కలంగా చేసికొన్నది. భూమినంతను లేఖనానికి ఆకుగా చేసికొన్నది ఆ సరస్వతి. సర్వకాలములయందును వ్రాస్తూ ఉన్నా భగవంతుని గుణాలు తరగటంలేదు. ఆమె వ్రాయటం పూర్తికాలేదు- అంటూ ఒక మహాకవి దైవమాహాత్మ్యాన్ని పేర్కొన్నాడు.

భగవంతుని ఘటనాఘటన సామర్థ్యాన్నిగురించి గురుదేవులు రామకృష్ణ పరమహంస ఒక కథ చెప్పారు:

ఇద్దరు భక్తులు అడవిలో తపస్సుచేసుకుంటూ ఉన్నారు. వాళ్ళ దగ్గరకు నారదుడు వచ్చాడు. ఆయనను చూసి, వాళ్ళిద్దరికీ ఎంతో ఆనందం కల్గింది. “స్వామీ! మీరు ఎక్కడ నుండి వస్తున్నారు?” అని ప్రశ్నించారు. “వైకుంఠంనుండి” అని నారదుడు సమాధానం చెప్పాడు. వారి మధ్య సంభాషణ ఇలా సాగింది.

భక్తులు : అయితే ఇప్పుడు వైకుంఠంలో మహావిష్ణువు ఏంచేస్తున్నాడు?

నారదుడు : మహావిష్ణువు వైకుంఠంలో కూర్చుని ఉన్నాడు. ఆయనకు ఏమీ తోచక ఒక సూదిని ఒక చేత్తో పట్టుకొని, మరోచేత్తో ఏనుగుల్ని, ఒంటెల్ని ఆ సూదిబెజ్జంలోంచి దూరుస్తూ ఆడుకొంటున్నాడు.

భక్తుడు-1 : అదేం విచిత్రం! సూది బెజ్జంలోంచి ఏనుగుల్ని, ఒంటెల్ని ఎలా దూరుస్తాడు? నీవు వైకుంఠానికి వెళ్ళలేదు.

భక్తుడు-2 : ఆహా! భగవంతుడు ఎంత గొప్పవాడు! ఆయన అద్భుతాలు చేయ గలడు - అని భక్తితో దైవానికి నమస్కరించాడు.

కాబట్టి భగవంతుని లీలలు అత్యాశ్చర్యకరాలు! ఈ సృష్టి, భూమి, సముద్రము, ఆకాశము, భూమి - నిరంతరంగా ఆత్మప్రదక్షిణం చేసుకుంటూ ఉండటం, సూర్య చంద్రులు, నవగ్రహాలు ఇవన్నీ చాలా ఆశ్చర్యకరంగా ఉంటాయి. జీవుడు x అనంతము = దేవుడు. (Jiva x Infinity = God).

## (3) శిష్టరక్షణ-దుష్టశిక్షణ

భక్తులు బాధలలో రక్షించమని పద్మాక్షుణ్ణి ప్రార్థిస్తూ ఉంటే “వీడు చేసిన పుణ్యం ఏమైనా ఉన్నదా? అని కూడా దైవం ఆలోచిస్తాడు” అన్నారు ఒక స్వామీజీ - ద్రౌపదీ మానసంరక్షణంలో దైవంచేసిన రక్షణగురించి బోధిస్తూ!

కౌరవులు ద్రౌపదిని నిండుసభలో నిలిపి వస్త్రాపహరణ ప్రయత్నానికి దిగారు. ద్రౌపది శ్రీపతిని ప్రార్థిస్తోంది. ఆమె చేసిన పుణ్యం ఏమైనా ఉందేమో చూడమన్నాడట ఆ దేవుడు! ఆమె జమలో వస్త్రదానం కనిపించింది.

ఒకప్పుడు పాండవులు ద్రౌపదీ సమేతంగా సముద్రస్నానానికి వెళ్ళారు. సముద్రంలో ఒక సన్న్యాసి స్నానంచేస్తూ ఉండగా ద్రౌపది చూసింది. సముద్రస్నానం, అనుష్ఠానం, పూర్తిచేసుకొని జాము గడిచాక సముద్రంలోనుండి గట్టుకు వచ్చారు ద్రౌపదీ పాండవులు. జాము క్రిందట ఆ నీళ్ళలో ఉన్న సన్న్యాసి అక్కడే ఉన్నాడు. ఇంతసేపటినుండి ఎందుకు నీళ్ళలోనే ఉన్నాడో తెలుసుకోమని కోరింది. సహదేవుడు సమాచారం సేకరించాడు. సముద్రకెరటాల తాకిడికిలోనై అతని కౌపీనం కొట్టుకు పోయింది. నగ్నస్థితిలో బయటకు రాలేక, చలిలో సముద్ర జలంలో ఉండలేక సన్న్యాసి సతమతమౌతున్నట్లు సమాచారమందింది. వెంటనే ద్రౌపది తాను ధరించివున్న చీరకొంగునుంచి ఒక ముక్క చింపి సన్న్యాసికి వస్త్రఖండదానం చేసింది. ఆ పుణ్యం జమలో చూడగానే ఆపద్రక్షకుడు సన్నద్ధుడయ్యాడు. అక్షయవలువలు అనుగ్రహించి రక్షించాడు.

దైవం, భక్తుల (సాధుల) రక్షణతో తన పనితీరినట్లు అనుకోడు. దుష్టశిక్షణకూడా ఆయనకు ఇష్టం. దుశ్శాసనుడు చీరలు లాగి ప్రోగు వేస్తున్నాడు. కనీ వినీ ఎరుగని రంగులలో కృష్ణాప్యాలెస్‌లో నుండి చీరలు పుంఖానుపుంఖాలుగా వస్తున్నాయి. పర్వతం అంత ఎత్తున పడ్డాయి – ఆ పాపాత్ముడు లాగిన చీరలు! అలసి పడిపోయాడు ఆ దుర్మార్గుడు.

ద్రౌపదిని అవమానించాలనుకొన్న అపచారప్రయత్నం ఆగిపోయింది. సభ ముగిసింది. దైవలీలతో చీరలు కొండంత ఎత్తున పడివున్నాయి! చక్రం తిప్పాడు ఆ దేవదేవుడు!

ప్రపంచంలో ఎన్నడూ కనిపించని అద్భుతమైన చీరల అందాల మీద అందరి కౌరవుల చూపులు పడ్డాయి. అంత అందమైన చీరలు తమ కాంతలకు కట్టబెట్టి, కళ్ళారా చూచుకోకపోతే తమ కళ్ళెందుకు? అని వ్యామోహపడ్డారు. తలకోచీరా తీసుకొని, తమ (100 మంది) భార్యలకు కానుకలుగా ఇచ్చారు. కౌరవనారీమణులు ఆ చీరల్నిచూచి ఆగలేకపోయారు. వెంటనే ధరించి తమ అందాలు అద్దాలలో చూచుకొన్నారు. తమ అందం అంతఃపురానికే పరిమితం కాకూడదు అనుకొన్నారు. కోట పైభాగంలో పురజనులందరకూ కన్పించేలా పచార్లు చేస్తున్నారు. వారి అందాన్ని విస్తుపోయి చూస్తున్నారు పురప్రజలు!

అంతలో వేణునాదం శ్రావ్యంగా వినిపించింది! హఠాత్తుగా కౌరవ కాంతలు ధరించిన చీరలు చిలుకలుగామారి ద్వారకవైపు ఎగిరిపోయాయి! నగ్నస్థితిలో

కౌరవస్త్రీలు క్రిందకు దిగలేక, పైన నిలువలేక అవమానాన్ని వందరెట్లు అనుభవించారు. 1. కౌరవులకు ఆ చీరలపై మోహం కలిగించినవాడు ఎవరు? 2. భార్యలకు కానుకగా చెయ్యాలనే ఆలోచన కల్గించినవాడు ఎవరు? 3. ఆ చీరలను వెంటనే ధరించాలనే ఆశ, తమ సౌందర్యం అందరూ దర్శించాలనే కోరిక కల్గించినవాడు ఎవరు? 4.చీరల్ని చిలుకలుగా చేసి తుర్రుమనిపించినవాడు ఎవరు? - ఇవన్నీ కల్పించినవాడు ఆ పరంధాముడే! ఒక ఇల్లాలుకు చేసిన వస్త్రాపహరణ ప్రయత్నం ఆపి, వందరెట్లుచేసి వందమంది కౌరవభార్యలకు "వస్త్రాపహరణం"గా చేసిన శ్రీహరికి (దైవానికి) చేతులెత్తి నమస్కరిద్దాం. సాధురక్షణతోపాటుగా, దుష్టశిక్షణ కూడా ఏకకాలంలో చెయ్యటం ఆ లోకేశ్వరుని లక్షణం. పాపభాండం నిండటంకోసం కొన్నిచోట్ల నిదానించటాన్ని ఉ దాసీనత అనుకోవటం మన అజ్ఞానం.

## (4) దైవయోగం

దైవశక్తిని, దైవయోగాన్ని వివరించేగాథలు మనపురాణాలలో కోకొల్లలుగా కనిపిస్తాయి. కొన్ని కథలు ప్రవక్తలు, మహాత్ములు తమ ప్రవచనాలలో ఉదాహరిస్తారు. ఈ కథ ఎక్కడిది? అని బిక్కమొగం పెట్టడంకంటే, ఆ కథలోని అంతరార్థాన్ని, దైవశక్తిని అర్థంచేసుకోవటంవల్ల ఆత్మశక్తి, దైవభక్తి ప్రవృద్ధమౌతాయి. దైవశక్తియొక్క లోతు తెలిసిన మహనీయులు దైవఘటనలకు ఆశ్చర్యపడరు. సూదిబెజ్జంలోంచి ఏనుగుల్ని, లొట్టిపిట్టల్ని ఇటునుంచి అటూ, అటునుంచి ఇటూ తీస్తూ దైవం ఆడుతున్నాడు అన్నప్పుడు భక్తితో అతని శక్తికి అంజలి ఘటించాడుకానీ ఆశ్చర్యపోలేదు! సామాన్యవిషయంగా అంగీకరించాడు-దైవాన్ని అర్థంచేసికొన్న ఆ భక్తుడు!

**యయాతి కథ:-** భాగవతం నవమస్కంధంలో యయాతి చరిత్రవుంది. అందు శుక్రుని పుత్రిక దేవయాని - రాక్షసరాజపుత్రిక శర్మిష్ఠ కలసి చెలికత్తెలతో ఆటలాడుచూ, చీరలు కొలనుగట్టున పెట్టి జలక్రీడకు దిగినారు. అంతలో పార్వతీపరమేశ్వరులు నందినెక్కి వచ్చుచుండుట చూచినారు. ఆ ముగ్ధలు సిగ్గుపడి, సంభ్రమంతో గట్టెక్కి, చీరలు కట్టుకొంటున్నారు. రాక్షసరాజపుత్రికయైన శర్మిష్ఠ, తొందరలో దేవయాని (శుక్ర పుత్రిక) యొక్క చీర ధరించింది. అదిచూచి దేవయాని "నేను గురుపుత్రికను. నా చీర ఎందుకు కట్టినావు? ఇట్టి అర్హత నీకులేదు!" అని ధిక్కరించినది. అప్పుడు రాజకుమారి శర్మిష్ఠ, దేవయానితో "నా తండ్రిదగ్గర నీ తండ్రి భిక్షుకుడు. రాజకుమారిని నన్నే ధిక్కరిస్తావా?" అని ఆ రాజపుత్రి చెలికత్తెలను పిలిచి, నగ్నంగా ఉన్న ఆమెను

ఒక నూతిలోనికి త్రోయించింది. తరువాత చెలికత్తెలను తీసికొని శర్మిష్ఠ రాజగృహానికి వెళ్ళిపోయింది. దేవయానిని నూతిలోనికి త్రోయించిన విషయం శర్మిష్ఠకు, చెలికత్తెలకు తప్ప ఇతరులకు తెలియదు. "ఇతరులెఱుగకున్న ఈశ్వరుడెఱుగడా!" ఆ జగన్నాటక సూత్రధారి అయిపోయిందనుకున్న అంకంలో క్రొత్తమలుపులు త్రిప్పుతున్నాడు. అనుకోని పాత్రలు ప్రవేశపెడుతున్నాడు. చూడండి! ఈ పురాణగాథ ఎంత అద్భుతంగా సాగిపోయిందో!

దేవయానిని కూపంలోకి త్రోయించిన రాజకుమారికాని, చెలికత్తెలుకాని ఈ విషయం బయటపెట్టరు. కూపంలోనుండి దేవయాని ఎంత అరచినా అది అరణ్యరోదనమే కాని, ఆలకించేవాళ్ళుండరు. పాములు, త్రేళ్ళు, క్రిమికీటకాల మధ్య ఆ దేవయాని కృశించి నశించటమే తప్ప అన్యథా శరణం నాస్తి! మన ఆలోచనలకు తెరపడినప్పుడే దైవయోగానికి, దైవలీలకు తెరఎత్తుతాడు ఆ పరమాత్ముడు.

కొన్ని క్షణాల్లో యయాతి మహారాజు వేటకు వచ్చాడు. దాహం తీర్చుకోవటానికి నుయ్యిదగ్గరికి వచ్చాడు. జలంకోసం తొంగిచూసి జలజాక్షిని చూచాడు. పరిపాలకుడు జాలిపడ్డాడు. కట్టుకున్న పైచేలం ముందుగా అందించాడు ఆ సుందరాంగికి. ఉపాయంతో ఆమెను చేయి పట్టుకొని పైకి లాగాడు. ఆమె "నను పాణిగ్రహణం బొనర్చితి కదా! నా భర్తవున్ నీవ!" అన్నది. ఆమె వివరాలు తెలిసికొన్నరాజు, ఆచార్య అనుమతితో ఆమెను పరిణయమాడినాడు. 1. దేవయానిని నూతిలోనికిత్రోసిన కొలది సమయంలోనే రాజు వేటకు వచ్చాడు. 2. ఆ నూయి ప్రాంతానికే వచ్చాడు. 3. అదే సమయంలో రాజుకు దప్పిక ఎందుకు వచ్చింది? 4. పోనీ దప్పికవస్తే మరో నూతికి వెళ్ళవచ్చును కదా! ఆ నూతిదగ్గరకే ఎందుకు వచ్చాడు? ఇదంతా దేవయానిని యయాతి పెండ్లియాడాలి–అనే దైవనిర్ణయానికి లోబడి, దానికి అనుగుణంగా, ఈశ్వర సంకల్పాను సారంగా ఒక పద్ధతిలో సాగిన దైవలీలగా భక్తులు గ్రహిస్తారు.

1. శర్మిష్ఠను దేవయాని క్రోధోద్రిక్తను చేయటం, 2. ఆమెకు దేవయానిని నూతిలోనికి త్రోయించాలనే ఆలోచన కల్గటం, 3. త్రోయించటం – ఇవన్నీ ఆమెకు శుభపరంపరలు– కల్యాణకారకాలు. దైవానుగ్రహం ఉన్నవాళ్ళకు ఇతరులు కల్గించే కష్టనష్టాలు అభివృద్ధికి సోపానాలే అవుతాయి అనడానికి ఉన్న అనేక ఉదాహరణాలలో ఇది ఒకటి.

## (5) భక్తి మాహాత్మ్యం–తాదాత్మ్యం

ఒక గోపిక పాలు, పెరుగు, వెన్నలను అమ్మటానికి, మధురానగర వీథిలో నడుస్తూ ఉంది. ఆమె మనస్సు మధుసూధనునికి అర్పించింది. ఆమె నోటి వెంట "పాలు పెరుగు వెన్నో!" అనటానికి బదులుగా, "గోవింద! దామోదర! మాధవా!!" అని మైమరచి అరుస్తోంది. కొనేవాళ్ళు వచ్చి తట్టపైన కప్పిన వలువ తొలగించి చూస్తే అక్కడ దధి క్షీరాలులేవు. అన్నీ కృష్ణవిగ్రహాలే! భక్తిమాహాత్మ్యానికీ, తాదాత్మ్యానికీ ఇది ఒక నిదర్శనం.

భక్తితాదాత్మ్యంలో చేసే తారుమారు పనులలో అహం(నేను) ఉండదు. నేను భగవంతుణ్ణి సేవిస్తున్నాను. "తాను–దైవం–ధ్యానం" అనే త్రిపుటి అంతరిస్తుంది. పరమాత్మలో భక్తుడు లీనమవుతాడు. దేహభ్రాంతి ఉండదు. భక్తి పారవశ్యంతో మైమరపు వస్తుంది. ఆ మైమరపే భక్తుల్ని పరమాత్మలో ఐక్యం (ఒకటి) చేస్తుంది.

శ్రీకృష్ణుడు రాయబారంకోసం హస్తినకు వెళ్ళాడు. విదురుని ఇంటికి వెళ్ళాడు. ఆ సమయంలో విదురుడు లేడు. విదురుని భార్య ఆహ్వానించి ఆతిథ్యం ఇస్తూ, అరటిపండ్లు పెట్టింది. కృష్ణభక్తితో ఆమె అరటిపండ్లు ఒక్కొక్కటి ఒలిచి కృష్ణునికి అందిస్తూ, దైవదర్శనంతో మైమరచిపోయింది. గుజ్జును బయటకు పారవేస్తూ, తొక్కలు కృష్ణహస్తానికి అందిస్తోంది! కృష్ణుడు భక్తపారవశ్యంతో తొక్కలు భక్షిస్తున్నాడు!

అంతలో విదురుడు ప్రవేశిస్తూ విసరి వేస్తున్న అరటిపండుగుజ్జు – నారాయణుడు నములుతున్న తొక్కల్ని చూచాడు! "అపచారం! అపచారం!!" అంటూ అరుస్తూ "పాపిష్ఠిదానా! ఎంతపనిచేశావే?" అని భార్యను మందలించి లోపలికి పొమ్మన్నాడు. ఆమె కూర్చున్న స్థానంలో తాను ఉండి, అరటిపండ్లు ఒలిచి, తొక్కలు విసిరేస్తూ, గుజ్జును గోవిందునికి అందిస్తూ "స్వామీ! అరటిపండ్లు బాగున్నాయా?" అని ప్రశ్నించాడు. కృష్ణుడు–"ఇందాక నీ భార్య పెట్టిన పండ్లే బాగున్నాయి!" అన్నాడు. ఆమెకు "నేను కృష్ణునికి అరటిపళ్ళు అందిస్తున్నాను" అనే త్రిపుటి అంతరించింది. "నేను" అనే భావం ఆమెకు లేదు – ఒక్క దైవం తప్ప! అక్కడ ఆమె లేదు, పండ్లూ లేవు, ఒక్క పరమాత్మే ఉన్నాడు! భక్తితాదాత్మ్యం "రాజముద్ర" లాంటిది. ఆ ముద్ర ఉండటం వల్లే అరచేయిఅంత కాగితంముక్క, ఐదువందల రూకల విలువతో విశ్వవిహారం చేస్తూ ఉన్నది. భక్తిలేకపోతే లక్షపత్రిపూజను కూడా "భక్తిలేని పూజ పత్రిచేటు" అన్నారు. "భక్తిని" దైవపూజకు గీటురాయిగా పేర్కొన్నారు. పట్టెడన్నానికిచ్చిన విలువ కొండంత అన్నరాసులకు ఇవ్వలేదు.

"భక్తి కలుగుకూడు పట్టెడైనను చాలు!" అంటూ, పాటకు పల్లవిగా, జప తపోహోమ దానాది క్రియలకు భక్తిని ప్రాణంగా పేర్కొన్నారు జ్ఞానులు.

## (6) అంత్యకాలంలో నారాయణస్మరణ

(i) అంత్యకాలంలో ఆ వ్యక్తి దగ్గర కూర్చున్న వ్యక్తులు "నారాయణ! – నారాయణ!" అంటూ చెవిదగ్గర గొట్టం పెట్టి అనేవారు. అంత్యకాలస్మరణం, అంత్యకాల సందేశం చాలా విలువైనవి. ప్రాణం పోయేవేళ మూలుగుతాడు ఎవరు రక్షిస్తారా? అని. కళ్ళు మిటకరించి చూస్తాడు. కాని రమారమణ నామోచ్చారణం మాత్రం చెయ్యడు. చెయ్యమని హెచ్చరించినా చెయ్యడు! వాడికి ఉన్న సంస్కారం అలాంటిది. దృశ్యమానలోకం మీద ఉన్న వ్యామోహం, వాడికి అదృశ్య పరమాత్మ మీద లేదు. ప్రాణాలు పోతున్నాయి! లోకంతో జీవుణ్ణి కలిపే వంతెనవంటి శరీరం పోతున్నా, ఈ జీవుడికి లోకవ్యామోహం సంసారమమకారం కొంచెంకూడా సన్నగిల్లవు. "నారాయణా! అనరా నాయనా!" అని చుట్టూ ఉన్నవాళ్ళు అరుస్తుంటే, ఆ చచ్చువెధవ "రూపాయి –అణా!" అంటున్నాడు. "మతిలో ఉన్నదే గతిలో ఉంటుం"దన్నారు పెద్దలు. వాడు వడ్డీవ్యాపారం రూపాయికి అణా చొప్పున ప్రజల్ని పీడించి సంపాదించాడు – (నూటికి నెలకు రూ.6.25 అన్నమాట). ఆ మతిలో ఉన్నదే గతిలో (పోయేవేళలో) కన్పించిందన్నమాట.

(ii) ఈ సందర్భంలో విద్యాప్రకాశానందగిరిస్వామివారు ఒక కథ చెప్పేవారు. కన్నడ దేశంలో ఒక గృహస్థు చాలా జాగ్రత్తగా, బాధ్యతగా కుటుంబాన్ని నిర్వహించాడు. సిరిసంపదలతో ఉన్నాడు. లోకసహజమైన మరణకాలం ఆసన్నమైంది. బిడ్డలు అందరూ చుట్టూ చేరి "రామరామా అనండి! కృష్ణకృష్ణ అనండి! నారాయణా అనండి!" అంటున్నారు. కాని ఆ వృద్ధుడు "క–క–క–కా" అంటున్నాడు. ఎవ్వరికీ అర్థం కావటంలేదు. అది మంత్రంకాదు. ఏ భాషకీ సంబంధించిందికాదు. వారు వెంటనే ఒక వైద్యుని రప్పించి ఆ వృద్ధునికి తాత్కాలిక శక్తినిచ్చే ఇంజక్షను చేయించారు. కళ్ళు తెరచాడు. అదే అదనుగా కొడుకులు "నాన్నగారూ! మీరు గంటసేపటి నుంచి క–క–క–కా అంటున్నారు. ఇందులో అంతరార్థమేమిటి? ఓపిక తెచ్చుకొని చెప్పండి!" అని బ్రతిమాలినారు. అప్పుడా వృద్ధుడు "కరు కసబరికెయన్ను కడియుత్తిదె" అన్నాడు. "చీపురుకట్టను దూడ తినివేస్తోంది కాబట్టి దాన్ని జాగర్త పెట్టండి" అని దాని అర్థం.

అంత్యకాలంకదా! అందుకని పశువులశాలలోకి చేర్చారు ఆ పరమ వృద్ధుణ్ణి. వాడి దృష్టి దూడ చీపురు కొఱుకుట మీద పడింది. చీపురు జాగర్త చెయ్యమంటున్నాడు.

ఎంత అవివేకమో చూడండి! వాడిని సంపాదించిన మహాధనం వదలివేస్తోంది. భవనములు, పొలములు వదిలివేస్తున్నాయి. పెళ్ళాంపిల్లలు అందరూ వదలి వేస్తున్నారు. చిన్నప్పటినుండి పెంచిన శరీరముకూడా పోతోంది. అన్నీ పోతూన్న వేళ, ఆ అభాగ్యుడు చీపురుకట్ట పట్టుకొన్నాడు. ఇది ఎంత దుస్థితో! ఎంత అజ్ఞానమో! ఎంత హాస్యాస్పదమో! ఆలోచించండి! మరణవేళ స్మరణమాత్రంతో పరిరక్షించే పరమాత్మ నామోచ్చారణం లేకుండా చీపురుకట్టకోసం పరితపిస్తున్నాడు – ఆ దయనీయుడు! ఏమీ విలువలేని ఒక అల్పవస్తువునుగురించి ఆలోచిస్తూ ఆ ధనికుడు జీవితాన్ని వ్యర్థంచేసుకొన్నాడు. దైవనామస్మరణ అనేది చిన్నప్పటినుంచీ అలవాటు చేసుకొన్న వాడికి అంత్యకాలంలో గుండె దైవనామస్మరణంతో కొట్టుకుంటుంది! లేని వాళ్ళ బ్రతుకులింతే!

(iii) "నారాయణ" అంటే నాలుగక్షరాలు. ఈ నాలుగింటికి వందమార్కులు. అంటే ఒక్కొక్క అక్షరానికి 25 మార్కులు. ఈ విధంగా ఆలోచించి ఒక ఉపాధ్యాయుడు చనిపోతున్న ఆ వృద్ధుని ముందు "నారాయణ" అనమన్నాడు. అనటంలేదు! అంత్యకాలం దగ్గరకు వస్తోంది. పోనీ రెండక్షరాలైనా వీడిచేత అనిపించలేకపోతామా? (25+25=50 మార్కులు) అనుకొని ఆ ప్రబుద్ధుడు నార తెమ్మన్నాడు. ఆ నారను మరణసమయంలో వృద్ధునికి చూపిస్తూ "ఇది ఏమిటి? ఇది ఏమిటి?" అని అడుగుతున్నాడు ఆ ఉపాధ్యాయుడు. వృద్ధుడు ప్రయత్నంతో నోరు కదుపుతున్నాడు. అనమంటున్నవాడు ఆనందిస్తున్నాడు. పోన్లే "నార" అనే రెండక్షరాలైనా ఈ నార చూచి అంటాడేమో? సగం ఫలితం 50% వస్తుంది–అని ఆశించాడు ఉపాధ్యాయుడు. ఆ వృద్ధుడు అవసానదశలో అధిక ప్రయత్నం చేసి, ఆ నారను చూచి, "నార" అనకుండా, "పీచు–పీచు" అంటూ ప్రాణం విడిచిపెట్టాడు. "దదామి బుద్ధి యోగంతం, యేన మాముపయాన్తితే!" (నన్ను చేరుకొనే బుద్ధిని కూడా నేనే యిస్తాను)–అన్నాడు ఆ పన్నగశాయి! పుణ్యాత్ములకు, దైవానుగ్రహం ఉన్నవాళ్ళకి, సంస్కారవంతులకు తప్ప అంత్యకాలంలో దైవనామస్మరణ అందరికీ సాధ్యంకాదు.

## (7) జ్ఞాని–సత్కర్మలను, భక్తిని విడిచిపెట్టకూడదు

జ్ఞాని–కర్మయోగి అనేవాళ్ళు ఎంత సిద్ధిని సాధించినా సత్కర్మల్నీ, భక్తినీ విడిచి పెట్టకూడదు. ఒక మార్గంలో ప్రయాణిస్తూ "తక్కిన రెండు మార్గాలు అక్కరలేదు"

---

* నిదిధ్యానము = తదేకధ్యానము, మఱిమఱి తలచుట.

అనటం ఎంత అవివేకమో ఒక స్వామీజీ దృష్టాంత పూర్వకంగా వివరించారు. ఆ అవివేకాన్ని అపహాస్యం చేశారు.

ఒక సాధుపుంగవుని ఆశ్రమంలో శ్రవణ మనన *నిదిధ్యాసములతో ఆయన శిష్యులు కర్మ-భక్తి-జ్ఞాన మార్గాలలో కైవల్యప్రాప్తికి సాధనలు చేస్తున్నారు. కార్తీక మాసంలో శిష్యులు, గురువుగారు బ్రాహ్మీముహూర్తంలో లేచి, నియమంగా కార్తీకస్నానాలు, నక్తం (పగలు ఉపవసించి రాత్రి భుజించుట) నిర్వర్తిస్తున్నారు. ఇలా ఉండగా మరో ఆశ్రమం నిర్వహిస్తున్న గురువుగారు ఈ ఆశ్రమానికి సాయంవేళ వేంచేశారు. కార్తీక నక్తంలో పాల్గొన్నారు. హాయిగా నిద్రిస్తున్నాడు - ఆ పరదేశ స్వామీజీ! తెల్లవారుజామున ఈ ఆశ్రమంలో గురుజీతోపాటు శిష్యులందరూ కార్తీకస్నానానికి సన్నద్ధం అవుతున్నారు. గురూజీ శిష్యులతో "అతిథిగా విచ్చేసిన స్వామీజీని కూడా మేల్కొలపండి!" అన్నాడు. (చలి దట్టంగా ఉంది. అయినా నియమపాలనంతో, చలిని దులిపివేస్తూ అందరూ స్నానసన్నద్ధులౌతున్నారు.) ఆ అతిథిస్వామి ఆ పాదమస్తకం దుప్పటి ముసుగులో ఉన్నాడు. శిష్యులు వారిని సమీపించి "స్వామీ! తాముకూడా కార్తీక స్నానానికి దయచెయ్యండి" అన్నారు. అతిథిస్వామి పలకటం లేదు. రెండుసార్లు అభ్యర్థించారు. మూడవసారి గట్టిగా "అయ్యా! తమర్ని కూడా మా గురువుగారు కార్తీక స్నానానికి రమ్మన్నారు" అని చెవి దగ్గర నిలబడి హెచ్చరించారు. "తప్పదురా భగవంతుడా! వీళ్లు నన్ను విడిచిపెట్టేలా లేరు. గోస్తనీనదిలో నన్ను నిలువునా ముంచేలా ఉన్నారు ఈ చలిలో!" అనుకొని లేచి కూర్చున్నాడు. చుట్టూ ఆశ్రమశిష్యులు ఆసక్తితో వారిని తీసుకొని వెళ్ళాలనీ, ఈ మహాపుణ్యం వారికి కూడా అందాలని ఆశిస్తూ అతిథిస్వామిని చూస్తున్నారు. అతిథిస్వామి కళ్లు తెరచి, "నాయనలారా! గంగా-యమునా-గోదావరి-కృష్ణా-కావేరి-తుంగభద్ర-సర్వనదులూ నాయందే ఉన్నాయి. సర్వనదులయందూ నేనున్నాను... "సర్వభూతత్వమాత్మానం సర్వభూతేషు చాత్మని! ఈక్షతే యోగయుక్తాత్మా"- (సర్వవస్తువులయందును తనను, తనయందు సకలవస్తువులను యోగి సందర్శింపగలుగును-భగవద్గీత 6-29) నాకు వేరే కార్తీకస్నాన మెందుకు?" - అని ముసుగుతన్ని పడుకొన్నాడు. "ఈయన మహాజ్ఞాని కాబోలు" అనుకొని వెళ్ళిపోయారు ఆశ్రమ శిష్యులు. అతిథిస్వామి అనిన వాక్యములు యథాతథంగా కులపతికి పాఠం అప్పగించారు. ఆశ్రమం గురువుగారు చిరునవ్వుతో "నడవండి, పోదాం!" అని కార్తీకస్నానానికి తీసుకొని పోయారు శిష్యుల్ని గోస్తనీదికి ఆ చలిలో...

ఆ పగటి వేళ అందరూ ఉపవాసంలో ఉన్నారు కాబట్టి, అతిథి స్వామికి భోజనం ఏర్పాటు చేశారు. శిష్యులు శాకపాకాలు వడ్డించారు. నెయ్యి ఆశ్రమం గురువుగారు కావాలని స్వయంగా వడ్డించారు– ధారాశుద్ధిగా. "కడుపునిండా తిన్నవాడికి కంటినిండా నిద్ర అన్నట్లు" అతిథిస్వామి ఒక గదిలో ఆ మధ్యాహ్నవేళ నిద్రపోతున్నాడు.

ఆ గదికి ఆశ్రమం గురువుగారు గొళ్ళెం పెట్టించారు. రెండు గంటలు దాటాక మెలకువ వచ్చింది–అతిథిస్వామికి. "దాహం! దాహం!" అని అరుస్తున్నాడు. లేచాడు. బయట గొళ్లెం! తలుపుతట్టుతూ "మంచినీళ్లు కావాలి, మంచినీళ్లు" అంటున్నాడు. ఆ సమయంలో ఆశ్రమం గురువుగారు తలుపు దగ్గరకు వచ్చి, "స్వామీ! గంగా–యమున–గోదావరి–తుంగభద్ర–కావేరి సమస్త నదులు నీలోనే ఉన్నాయి కదా! దాహానికి గుక్కెడు నీళ్లు కరవయ్యాయా తండ్రీ" అన్నారు. శిష్యులు అర్థంచేసుకొన్నారు– ఆ మాటలోని అంతరార్థాన్ని. లోపల లోపల నవ్వుకొన్నారు. తలుపుగొళ్లెం తీయించి, మంచినీళ్ళు ఇప్పించారు ఆశ్రమం గురువుగారు. అతిథిస్వామి వంచిన తల ఎత్తకుండా వెళ్లిపోయాడు.

ఆశ్రమం గురువుగారు చెప్పారు. "నాయనా! కర్మ–భక్తి–మార్గాలలో జ్ఞానశిఖరం ఎక్కినా లోకాన్ని అనుసరించటం మానకూడదు! జ్ఞానిని అందరూ అనుసరిస్తారు. జ్ఞాని అజ్ఞానిగా ప్రవర్తిస్తే అందరూ నష్టపోతారు. పూజలు–భజనలు–కర్మానుష్ఠానం నిర్లక్ష్యం చేయకూడదు. జ్ఞానికి కర్మ–భక్తి అవసరంలేదు. అయినా లోకసంగ్రహంకోసం, సత్కర్మాచరణం చెయ్యకుండా ఉండకూడదు. ఆ స్వామి జ్ఞానశిఖరం ఎక్కటం ద్వారా, సత్కర్మాచరణం మానలేదు; బద్ధకశిఖరం ఎక్కాడు!" అని వివరించారు ఆశ్రమం గురువుగారు.

## (8) అనన్యభక్తి:

అనన్యభక్తి అంటే ఇతరాలోచనలు లేని భక్తి. సామాన్య భక్తులు చాలామంది ఉంటారు. గోపికలభక్తి అనన్యభక్తి! **"అనన్యాశ్చింత యంతోమాం, యేజనాః పర్యుపాసతే"** అనే శ్లోకంలో ఇతరాలోచనలు విడిచి నన్ను సేవించువారి యోగక్షేమాలు నేను వహిస్తాను అని శపథంగా చెప్పాడు భగవానుడు. రుక్మిణీ సత్యభామాది అష్టపట్టమహిషులకంటే గోపికలనే నిరంతరం తలుచుకొనేవాడట ఆ నీరజాక్షుడు! ఇది శ్రీకృష్ణ అంతఃపుర పరివారానికి ఈర్ష్యగా ఉండేదట. ఈ విషయాన్ని అంతఃపుర కాంతలకు పాఠంగా బోధించాలనుకొన్నాడు ఆ పురుషోత్తముడు. నాటకానికి తెర తొలగింది!

ఒకనాడు శ్రీకృష్ణుడు భయంకర శిరోవేదనతో బాధపడుతున్నాడు. అష్టమహిషులు – హరి నరకాసురుణ్ణి జయించి తెచ్చిన మచ్చెకంటులు, అందరూ వివిధోపచారాలు చేస్తున్నారు. అంతకంతకు ఆ శిరోవేదన అధికమౌతోందేకాని, ఏ కొంచెంకూడా తగ్గటంలేదు. ఆ పద్మనాభుని బాధచూచి తొలగించే విధానం తెలియక, తెల్లమొగాలతో చూస్తున్నారు ఆ మొల్లసుగంధులు!

అంతలో ఆకాశంనుండి అవతరించాడు భక్తినాటకసూత్రధారుడు నారదుడు! నారదుడు కనిపించగానే శ్రీకృష్ణశిరోవేదన విజృంభించింది. బిక్కమొగాలతో అందరి కళ్లూ ఒక్కసారి నారదునిమీద పడ్డాయి. నారదుడు గంభీర ముద్రతో శ్రీకృష్ణుణ్ణి వైద్య పరీక్షగా, ఆపాదమస్తకం పరీక్షిస్తున్నాడు. పరీక్షాఫలితం ఏమిచెప్తాడో అని అన్నుల మిన్నలందరూ ఊపిరిబిగబట్టి చూస్తున్నారు. నారదుడు నిరాశగా మొహం పెట్టి "ఇది తగ్గదు! చాలా భయంకర వ్యాధి" అన్నాడు. "అంతేనా స్వామీ! మార్గంలేదా?" అన్నారు కన్నీళ్ళతో ఆ కంబుకంఠులు! నారదుడు ఆలోచనలోనుండి దీర్ఘాలోచన నటిస్తున్నాడు. అక్కడ శ్వాసశబ్దం వినిపించేటంత నిశ్శబ్దం నిండిఉంది. అందరూ నారదుడు చెప్పబోయే మాట వినటానికి నిలువెల్ల చెవులుగా ఎదురుచూస్తున్నారు. ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ నారదుడు "ఏ మందులూ పనికిరావు. ఒక్కటే మందు. కృష్ణభక్తుల పాదధూళి ముఖానికి రాయాలి" అన్నాడు. "మా పాదధూళి మురారి ముఖానికి పూయటమా? ఆ మహాపాపంచేసి ఘోరనరకానికి పోవటమా? అంతటి దుష్పాపం చేసి దుర్గతి పొందలేము" అన్నారు ఆ మందగామినులు. అందరి ముఖాలు చూస్తున్నాడు. ఎవ్వరూ ముందుకు రావటంలేదు. "పాదధూళి దొరకదా" అన్నాడు నారదుడు. అందరి ముఖాలూ కన్నీళ్ళతో నిండి ఉన్నాయి. కాని, ఆ పాదధూళి ఇవ్వటానికి ఎవ్వరూ ముందుకు రాలేదు. కృష్ణా ముకుందా మురారీ! అని పాడుతూ ముందుకు సాగిపోయాడు నారదుడు. మధురానగర వీధులలో పాదధూళికోసం పరిభ్రమిస్తున్నాడు భక్తిగీతాలతో. దొరకలేదు ఆ మందు ఆ పరమ భాగవతోత్తమునికి. విసిగి వ్రేపల్లె చేరాడు. గొల్లకాంతలు గుమిగూడారు నారదుణ్ణి.. శ్రీకృష్ణ యోగక్షేమాలు ప్రశ్నించారు. క్షేమ వార్తలు విందామనే ఆశతో ఆ నీరజాక్షుల ఆశ నిరాశ అయింది. శ్రీకృష్ణుడు శిరోవేదనతో ఉన్నాడన్నవార్త వాళ్ళందరి మీద పిడుగుపడ్డట్లుగా అయింది. శ్రీకృష్ణ శిరోవేదన పోగొట్టే ఉపాయం చెప్పమని ప్రార్థించారు ఆ నారాయణ భక్తుణ్ణి. "భక్తుల పాదధూళియే ఆ భగవత్స్వరూపుని శిరోవేదన తొలగించే పరమౌషధం! తమ పాదధూళి ఆ జగన్నాథుని నుదిటికి పూయటం ద్వారా నరకానికి పోవటానికి భక్తులు భయపడు తున్నారు. ఎవ్వరూ ఇవ్వటంలేదు" అని కూడా వివరించాడు నారదుడు.

వెంటనే ఆ గోపికలందరూ ఏకముఖంగా "ఆలోకేశ్వరుని శిరోవేదన తొలగించుటయే మాకు కావాలి. ఈ పనిలో మాకు సరకమైనా అది స్వర్గమే!" అన్నారు. నారదుడు పైపంచ పరచుకొన్నాడు. గోపికలు ఒక్కొక్కరుగా వస్తూ పాదధూళి దులుపుతున్నారు. ఆ ధూళిమూట, నారదుడు బలంతో మోయవలసి నంతగా అయింది. ఆ మూటతో జగన్నాటక సూత్రధారి వద్దకు వెళ్ళాడు నారదుడు. "మేం నరకానికి వెళ్ళినా మాకు ఇష్టమే! మాధవుని బాధానివృత్తియే మాకు కావలసింది - అన్నారు వ్రేపల్లె గోపికలు" అని అంటూ ఆ మూట అక్కడ పెట్టాడు. అందరూ ఆశ్చర్యపడ్డారు. సర్వేశ్వరునికోసం సర్వంత్యాగం చేసే సంసిద్ధతయే అనన్యభక్తి అనీ, అది తమకు లేదని అర్థంచేసుకొన్నారు. తమ ఆవేదనాత్మక ఈర్ష్యను తొలగించుకొన్నారు. నారదుడు, భక్తపాదధూళిని పద్మనాభుని ముఖానికి పూశాడు. శిరోవేదన తిరోధానమైంది. అష్టమహిషుల ఆవేదనకు తెరపడింది!

## (9) ఏషణత్రయంలో ధనమే ముఖ్యమైనది

"ఏషణత్రయంలో మానవుడు గట్టిగా నమ్మినది ధనం! దీన్ని వివరించడానికి ఆధ్యాత్మిక తత్త్వవేత్తలు ఒక అందమైన కథను మనకు అందించారు.

ఒక బ్రాహ్మణుడు, భార్య - ఇద్దరు బిడ్డలు - ధనంమూట. ఈ మూడింటితో ప్రయాణం సాగిస్తున్నాడు. ఇద్దరు పిల్లలను రెండు భుజములమీద కూర్చుండ బెట్టుకొన్నాడు. తలపై రూపాయలమూట మోస్తున్నాడు. భార్య ఆయన వెనుక నడుస్తోంది. కొంత దూరం వెళ్లిన తరువాత వసిష్ఠవంటి నది దాటవలసి వచ్చింది. ఎదురైన కొందరు ఏటిలో నడచి పోయే దారిగుర్తులు చెప్పారు. భుజాలపై ఇద్దరు పిల్లలు, తలమీద ధనంమూట పెట్టుకొని నదిలోకి దిగుతూ భార్యను భుజంప్రక్క పట్టుకొని తన వెనుకే నడవమన్నాడు. 1. దారైషణ, 2. పుత్రైషణ, 3. ధనైషణలతో విప్రుడున్నాడు. ఏటికి అడ్డపడి, అక్కడివాళ్లు చెప్పిన గుర్తుల ప్రకారం పోతున్నాడు. దారి తప్పినది - లోతుగా ఉన్న ప్రక్కకు పోయాడు ఆ బాపడు. పీకలోతులో కాళ్లు తేలిపోతూ నడుస్తున్నాడు. అంతకు ముందే కాళ్లు తేలిపోయిన భార్య భర్త భుజాలు పట్టుకొంది. లోతులో పడిన ఆ గృహస్థు ఈదటం ప్రారంభించాడు.

తలపై "ధనైషణం" - భుజాలపై "పుత్రైషణం" - వెనుక పట్టుకు వ్రేలాడుతూ ఉన్న "దారైషణం". ఆ మూడింటితో ఆయాసపడుతూ ఈదుతున్నాడు యజమాని. అంతకంతకూ శ్రమ అధికమయింది. "మూడింటితో ఈదలేను! ఏదో ఒక బరువు తగ్గించుకోవాలి" అనుకొన్నాడు. ఏది వదలాలి? అనే ఆలోచన. బిడ్డలు-భార్య-

ధనం అనే వరుస కన్పించింది. "భార్య ఉంటే పిల్లలు మళ్ళీ కలుగుతారు!" అని పిల్లల్ని గంగార్పణం చేశాడు. కొంత తేలిక అనిపించింది. తాత్కాలికంగా భుజాలు పట్టుకొన్న భార్య భారంతో, తల ధనంబరువుతో కొద్దినిమిషాలు ఈదాడు. కష్టం అనిపించింది. ఏదో ఒక్క బరువు తగ్గించుకొంటే కాని గుక్క తిప్పుకొనేలా లేదు. "ధనమా? భార్యా? ఏది వదలాలి?" అని ఆలోచించి ధనం ఉంటే మళ్లీ ఎవరో ఒకళ్లు పిల్లనిస్తారు. భార్యాలోపం రాదనుకొన్నాడు. పడతిని ప్రవాహవేగంలో విడిచిపెట్టాడు. ధనంమూటతో అలాగే ఆయాసపడుతూ "ఆవలి ఒడ్డు దగ్గరపడుతోంది కదా" అనుకొంటూ ఈదుతున్నాడు. ప్రాణశక్తి క్షణక్షణానికి సన్నగిల్లిపోతోంది. ధనం బరువైపోతోంది. ప్రాణభయం పెరిగిపోతోంది. ధనంమూట విడిచిపెట్టక పోతే ప్రాణం పోవటం ఖాయం! అనుకొన్నాడు. డబ్బు మనం సంపాదించాం కాని, మనల్ని డబ్బు సంపాదించ లేదు. బ్రతికి ఉంటే మళ్లీ సంపాదించుకోలేక పోతామా? అని సరిపెట్టుకొని చివరకు ధనాన్నికూడా త్యజించి, బ్రతుకు జీవుడా! అని గట్టెక్కాడు.

ఈ కథవల్ల **"ఆత్మనస్తు కామాయ పుత్రః ప్రియోభవతి, భార్యా ప్రియా భవతి"** అనే బృహదారణ్యక ఉపనిషద్వాక్యం గుర్తుకు వస్తోంది. తన ఆనందంకోసమే కాని **"నవా ఆరే, పుత్రస్య ప్రియాయ"** పుత్రుని ఆనందంకోసం తండ్రి పుత్రుని ప్రేమించుట లేదు. తన ఆనందంకోసం ప్రేమిస్తున్నాడు. అలాగే తన సుఖంకోసం తాను భార్యను ప్రేమిస్తున్నాడు కాని, భార్య కోసం కాదు– అనే సత్యం ధ్రువీకరింపబడుతున్నది. నూటికి కాదు కోటికొక్కడు అన్నట్లుగా జగన్మిథ్యాజ్ఞానంతో ప్రపంచాన్ని కలగా, కల్లగా భావిస్తున్నారు కాని, అందరూ లోకం మాయలో, గారడిలో పడి, స్వాప్నిక సుఖదుఃఖాలు అనుభవిస్తూ ఉన్న వాళ్లే!

ఐహిక సౌఖ్యాలు అన్నీ అందినా ఎందుకో అందుకు ఏడుస్తూనే ఉన్నారు. **"దూరతః పర్వతా రమ్యాః"** – దూరపుకొండలు నునుపు– అన్నట్లుగా, కొంతమందిని దూరంనుండి చూచి, సుఖంగా ఉన్నారని మరికొంతమంది భ్రమిస్తూ ఉంటారు. అది యథార్థంకాదు. We can't see a rose without thorns! A sky without clouds! A mind without troubles! ముల్లు లేని గులాబి, మబ్బులేని ఆకాశం, బాధలు లేని మనస్సు ఈ లోకంలో కన్పించవు అన్నారు తత్త్వజ్ఞులు.

## (10) మమకారం

'మమకారం' అనేది ఎంత ఆశ్చర్యకరంగా బాధిస్తుందో, మనకు అర్థం కావటం కోసం, పెద్దలు అందించిన దృష్టాంతాన్ని చెప్పుకొందాము. జపస్నానతత్పరుడైన

ఒకసాధువు నదిలో స్నానంచేస్తూ, నీళ్లలో నిలిచి, స్తోత్రాలు చదువుకొంటున్నాడు. నదీమధ్యంనుండి ఒక వస్తువు కొట్టుకొనిపోతూ ఉన్నది. సాధువుదృష్టి ఆ వస్తువుపై పడింది. అది ఒక పొడుగైన కఱ్ఱ! అతడు నదిలో ఈదుకొంటూ వెళ్ళి ఆ కఱ్ఱను పట్టుకొని ఒడ్డుకు తెచ్చాడు. అది చేతికఱ్ఱ! దానికి రెండు చోట్ల బంగారుకట్లు కూడా ఉన్నాయి. ధనవంతులు చేతిలో ధరించి దర్పంగా నడిచే చేతికఱ్ఱ! సాధువు దాన్ని గట్టిగా పట్టుకొని పరిశీలించాడు. మూడు కాసుల బంగారం ఉంటుంది. "ఇది నాది! నాది!" అనుకొని మురిసిపోతూ ప్రక్కనే నిలువుగా నీళ్ళలో గ్రుచ్చాడు. ఆనందంతో స్తోత్రాలు చదువుకొంటూ, "మూడు కాసుల కఱ్ఱ నాది!" అనుకొంటూ పారవశ్యంతో కళ్లుమూసికొని స్తోత్రాలు పఠిస్తున్నాడు. ఈలోగా నదీవేగంలో ఆ కఱ్ఱ కొట్టుకుపోయింది.

సాధువు కళ్లుతెరచి, కఱ్ఱకోసం చూశాడు. పొన్నుకఱ్ఱ లేదు. గుండె గుభేలు మంది! దుఃఖం కట్టలు తెంచుకొని వస్తోంది! "ఎంత అందంగా ఉంది? నా పొన్నుకఱ్ఱ! మూడుకాసులే అనుకొన్నాను? ఇంకా ఎక్కువే ఉంటుంది బంగారం! బంగారంలాంటి పొన్నుకఱ్ఱ పోయింది. బాబోయ్!" గట్టిగా ఏడుస్తున్నాడు. ఆ సమయంలో జ్ఞానియైన ఒక పెద్దమనిషి, ఆ దారిని పోతూ, ఈ సాధువు రోదనాన్ని విన్నాడు. దగ్గరకు వచ్చి "ఏమి నాయనా ఏడుస్తున్నావు?" అని ప్రశ్నించాడు. "నా పొన్నుకఱ్ఱ పోయింది బాబోయ్! నా పొన్నుకఱ్ఱ!" అంటూ బొటబొట కన్నీళ్లు కార్చుతూ ఏడుస్తున్నాడు. "పొన్నుకఱ్ఱ ఏమిటి? అదినీకు ఎక్కడిది?" అని వివరంగా అడిగాడు ఆ పెద్దమనిషి.

"అయ్యా! నేను జలమధ్యంలో నిలిచి, జపిస్తూ ఉండగా, అర్ధగంట క్రిందట కొట్టుకొని వచ్చిందండీ! బంగారుకట్లు కూడా ఉన్నాయండీ బాబూ!" అంటూ, మళ్ళీ ఏడుపు ఆరంభిస్తున్నాడు. "నాయనా! నీ ఏడుపు ఆపి నా ప్రశ్నకు సమాధానం చెప్పు. గంటక్రిందట అది నీకు తెలియదు కదా!" అన్నాడు. "తెలియదు!" – "అది నాది అనుకొన్నావు! మమకారం పెంచుకొన్నావు. ఆశలు అల్లుకొన్నావు. అదినీదా?", – "నాది కాదు"! – "నీది కానిదానిని నీది అనుకోవడం ఒక తప్పు! పైగా దాని మీద మమకారం పెంచుకొన్నావు. ఇది రెండవ తప్పు! అర్ధగంట క్రిందట అది నీకు లేదు! ఇప్పుడు కూడా అది నీకు లేదు! అర్ధగంటలో 'మమకారం' నిన్ను దుఃఖంలో ముంచివేస్తోంది. నెలలు, సంవత్సరాలుగా పెంచుకొన్న మమకారాలు, మానవుల్ని ఎంతగా దుఃఖంలో ముంచివేస్తాయో? గ్రహించునాయనా! దాని దారిన అది కొట్టుకొని పోతున్న పొన్నుకఱ్ఱను, పట్టుకొన్నావు. 'నాది' అనుకొన్నావు. మమకారం పెంచుకొన్నావు. దాని దారిన అది వెళ్ళిపోయింది. నీవు ఆ కఱ్ఱమీద ఎంత మమకారం పెంచుకొన్నావో, అంత దుఃఖాన్నీ పొందుతున్నావు. ఆశ–మమకారం–దుఃఖం అన్నీ

నీలోనే పుట్టి నీలోనే పెరిగాయి. మాయ మనలోనే పుట్టి మనలోనే పెరుగుతుంది నాయనా! సాధువులా ఉన్నావు. అజ్ఞానం ఊబిలో కూరుకుపోయావు – లే! నాయనా!" అని జాలిపడ్డాడు.

**శ్లో॥ దుఃఖదాతా న కోప్యత్ర సుఖదాతా న కశ్చన**
**హసతా క్రియతే కర్మ రుదతా పరిభుజ్యతే**

దుఃఖము ఇచ్చువారు, సుఖము కల్గించువారు, లోకములో ఇతరు లెవ్వరును ఉండరు. ఎవరికి వారే అర్థం చేసికొనకుండా, ఆలోచనలు లేకుండా ఆడుతూ–పాడుతూ, కర్మలు చేస్తూ, ఫలితాలు ఏడుస్తూ అనుభవిస్తారు. ఇది లోకధర్మం! దారిన పోయే కఱ్ఱముక్క మీద మమకారం పెంచుకొని ఊరడిల్ల లేనంత దుఃఖాన్ని పొందాడు ఆ సాధువు!

## (11) రజ్జుసర్పభ్రాంతి

ఒక గృహస్థు అర్ధరాత్రి లఘుశంకకు లేచాడు. తలుపుతీసి బయటకు వచ్చాడు. ప్రక్కకు వెళ్లుటకు ఆ ప్రక్కకు చూచాడు. ఆ చీకటిలో ఏదో కనిపించింది. 'సర్పమేమో' అనే ఆలోచన వచ్చింది. అది కదలుతున్నట్లున్నది! కదలుతోంది! తనవైపే వస్తున్నట్లు – వస్తున్నట్లు ఏమిటి? వస్తున్నది – బుసకూడా వినిపిస్తోంది! గృహస్థు కెవ్వన కేక పెట్టాడు; పడిపోయాడు.

ఆ కేకకు భార్యాపిల్లలు బయటకు వచ్చారు. ఆయన అర్ధాంగి అద్దాల లాంతరు తెచ్చింది. అక్కడ పెట్టింది. అందరూ చెమటతో నిలువునా తడిసిన ఆయన్ను లేవదీశారు. "పాం! పాం" అన్నాడు వెర్రిగా, "ఎక్కడండీ" అంది ఆమె. అదిగో అని ఆ ప్రక్కకు చూపించాడు. అద్దాల లాంతరుతో ఆ కాంత, అటు రెండడుగులు వేయబోతే "పాం! పాం! వెళ్ళకు" అన్నాడు. అయినా ఆమె లాంతరుతో నాలుగడుగులు ముందుకు వేసి, నేల పరిశీలనగా చూస్తోంది. ఆమె వెనుక గృహస్థు ఉన్నాడు. ఆ చీకటి వెలుగుల్లో నేలను అంటుకొని వంకరలు తిరిగినది కనిపించింది. "అదిగో– అదే పాం!" అన్నాడు ఆ సర్పభ్రాంతుడు! అద్దాల లాంతరు వెలుగు ఆ వస్తువు మీద పడింది. "తాడండి!" అంది సాధ్వీమణి. సర్పం మాయమయింది. రజ్జువు (త్రాడు) మిగిలింది. (గడిచిన సాయంవేళ చేదకు త్రాడుముక్క అతుకు పెట్టి, మిగిలిన ముక్కను అక్కడ నేలమీద వదిలేసారు) చీకటిలో స్పష్టంగా పాము కనిపించిందే! బుసవినిపించిందే! తన మీదకు రాబోయిందే! ఇది ఆ గృహస్థు పొందిన పచ్చి అనుభవం. ఇప్పుడు దీపం వెలుగులో మెలికలు తిరిగి నేలను అంటివున్న త్రాడు మాత్రం కనిపిస్తోంది. ఆ పాము ఏమైంది?

అది అసలు ఎక్కడినుండి వచ్చింది? ఇది అంతా మాయలోనుండి వచ్చింది. అక్కడ ఉన్నది ఒక త్రాడు మాత్రమే! ఉన్న వస్తువును ఉన్నట్లుగా గ్రహించాలంటే నీలో జ్ఞానముండాలి! "సర్పమేమో?" అని అనుకోగానే మాయకు సందుదొరికింది. ఆ గృహస్థులో ప్రవేశించింది. కంగారు – భయం – చెమటలు – పిచ్చికేకలు – నేలమీద పడిపోవటం – ఈ దుఃఖాలన్నీ మాయకు లోనవటంవల్ల కలిగాయి. మాయ మనలోనే పుట్టి, మనలోనే పెరుగుతుంది. దీపం అనేది జ్ఞానానికి సంకేతం. సూర్యోదయంతో చీకటి మాయమైనట్లు, జ్ఞానకాంతిలో సర్పభ్రాంతి తొలగిపోయింది. త్రాడు మిగిలింది. తన అజ్ఞానానికి నవ్వుకున్నాడు ఆ గృహస్థు! ఇది "రజ్జు – సర్పభ్రాంతి". ఇది మాయా ప్రభావం. మాయను గురించి ప్రస్తావిస్తూ పరమాత్మ! ఓ అర్జునా!

**శ్లో॥ దైవీ హ్యేషా గుణమయీ, మమ మాయా దురత్యయా ।**
**మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరన్తితే ॥** (7–14)

"ఈ మాయ నాకు సంబంధించినదే. దీనిని ఎవ్వరునూ దాటలేరు సుమా! నన్ను శరణాగతి పొందిన నా భక్తులు మాత్రమే ఈ మాయకు లొంగరు. వాళ్ళు మాయను దాటిపోగలరు"–అన్నాడు.

రజ్జు (త్రాడు)ను సర్పమని భ్రమించడంవల్ల కంగారు–భయం–చెమటలు–పడిపోవటం మాత్రం జరిగింది. అలా కాకుండా సర్పాన్ని త్రాడు అనుకోవటం "సర్పరజ్జుభ్రాంతి" జరిగితే మహాప్రమాదంలో పడతాడు. ఇది నాస్తికులు చేసే ప్రమాదాత్మక వాదన. "లేని భగవంతుణ్ణి" ఉన్నాడు అనటం వల్ల ఆస్తికులకు నష్టంలేదు. ఉన్న భగవంతుణ్ణి 'లేడు' అనటం వల్ల నాస్తికులు నరకం పొందవలసి వస్తుంది. 'ఆస్తికులకు' వుంటే మంచిదే. 'లేకపోతే' నష్టంలేదు. ఈ భావాన్ని ఆది గురువులు **"నాస్తిచేత్ నాస్తిమే బాధా! అస్తిచేత్ నాస్తికో హతః"** – "దేవుడు లేడు అని నీవు అంటున్నావు, 'ఉన్నాడు' అని నేను అంటున్నాను. లేకపోతే నాకు బాధలేదు. ప్రమాదము లేదు. ఉన్నట్లయితే నీకు నాశనం తప్పదు" అని వాక్యార్థం. సర్పరజ్జుభ్రాంతి (పాముని త్రాడు అనుకోవటం) నాస్తికవాదనం–ప్రమాదం. అది అలా వుంచుదాం**– తత్తథాస్తామ్.**

జగత్తును **"సత్యమని అనుకోవటం"** బ్రతుకు నిత్యమనుకోవటం **"దృశ్యమంతా – నశ్యం"** అని ఆలోచన లేకపోవుట – ఇవన్నీ అజ్ఞాని లక్షణాలు. ఈ సందర్భాన్ని ఆలోచిస్తూ మానవుల ప్రవర్తను ధూర్జటి మహాకవి –

**శా॥ అంతా మిథ్య తలంచి చూచిన, నరుం డట్లౌటెఱింగిన్, సదా**
**కాంతల్, పుత్రులు, నర్థమున్, దనువు నిక్కంబంచు, మోహార్ణవ**

**భ్రాంతిం జెంది చరించుఁగాని, పరమార్థంబైన నీయందుఁ దాఁ**
**జింతాకంతయుఁ జింత నిల్పఁడు కదా! శ్రీకాళహస్తీశ్వరా!**

భ్రాంతి ఉన్నంతసేపూ, భ్రాంతియే సత్యం. ఆ భ్రాంతినుండి విముక్తి పొందిన తర్వాత రజ్జువు (త్రాడు) నిజం. స్వప్నంలో ఉన్నంతసేపు "స్వప్నమే సత్యం" అనుకొని సుఖదుఃఖాలు అనుభవిస్తాం. మెలకువ (జాగ్రదవస్థ)లోకి రాగానే స్వప్నావస్థ అసత్యమనుకుంటాము. ఈ జాగ్రదవస్థ (మెలకువలో ఉన్నది) నిజం అనుకొంటాము. కాని జ్ఞాని స్వప్న – జాగ్రదవస్థలు రెండూ అసత్యమే అంటాడు. స్వప్నంలో నీవు పొందిన సుఖదుఃఖాలు కల (కల్ల). జీవితం (స్వప్నం)లో పొందిన సుఖదుఃఖాలు కూడా కలయే! (కల్లయే!). కన్ను తెరిస్తే కరిగిపోతుంది స్వప్నం. కన్నుమూస్తే ముగిసిపోతుంది జీవితస్వప్నం. కలలో కన్న వస్తువులుగా, ఇలలోని వస్తువుల్ని చూడగలిగిన శక్తి మహాజ్ఞానులకే సాధ్యం. అలవర్చుకోవటానికి "అభ్యాసయోగం" ఆశ్రయించవలసినవాళ్ళం మనం అందరం.

"శుక్తి–రజతభ్రాంతి" అంటే ముత్యపుచిప్పను చూచి వెండి అనుకొనటం! దాని కాంతి చూడగానే వెండే అనిపిస్తుంది – రజతమే అనిపిస్తుంది. ముత్యపుచిప్ప అనిపించదు. ఇది కూడా భ్రాంతిగా ప్రస్తావిస్తూ ఉంటారు.

## (12) "దశమో నష్టః"

"దశమో నష్టః" (పదవవాడు కొట్టుకొనిపోయినాడు):– పరమానందయ్యగారి శిష్యులు పదిమంది (ఇంకా చాలామందే ఉన్నారు. మన సందర్భంలో పదిమంది) ఒక యేరు దాటవలసి వచ్చింది. నావ, బల్లకట్టు, ఏదీలేదు! ప్రవాహం చాలా వేగంగా ఉంది. ఈదుకొంటూ ఆవలి ఒడ్డు చేరటానికి సంసిద్ధులయ్యారు. పరమానందయ్యగారి శిష్యులకు ప్రపంచజ్ఞానం లేదు. కాని తెలివి ఎక్కువ. "ఇంతటి మహాప్రవాహం ఈదుకొని, అందరం క్షేమంగా చేరామో, లేదో, ఆవలి ఒడ్డు చేరాక సరి చూసుకోవాలి. మనం ఎందరమో చూచుకొందాము" అనుకొన్నారు. "దశ" (పది) అనుకొన్నారు. అతిశ్రమతో ఈదుకొంటూ, ఆయాసంతో ఆవలి ఒడ్డు చేరారు.

అందరం క్షేమంగా చేరుకొన్నామో లేదో? చూచుకోవాలి. వరుసగా నిలబడమన్నారు. అందరూ వరుసగా నిలబడ్డారు. అందులో ఒకడు ముందుకు వచ్చి లెక్క పెట్టాడు. ఒకటి, రెండు, మూడూ.... ఎనిమిది తొమ్మిది అన్నాడు. పదోవాడు ఏడి? అనగానే అందరూ గొల్లుమన్నారు. "పదోవాడు నదిలో కొట్టుకుపోయాడు. బాబోయ్! అయ్యోయ్!" అని ఏడవటం ప్రారంభించారు. ఒకడు ముందుకు వచ్చి

"ఆగండిరా, వాడికి లెక్క పెట్టటం చేతకాదు. నే లెక్కిస్తాను. వరుసగా నిలబడండి" అన్నాడు. నిలబడ్డారు. అందరూ లెక్కపెట్టేవాణ్ణే చూస్తున్నారు-ఊపిరి బిగబట్టి ఆశగా! వాడు కూడా ఎన్మిది, తొమ్మిది! అని ఆగిపోయి, "ఔనురా! పదోవాడు కొట్టుకు పోయాడు" అన్నాడు. మళ్ళీ అందరూ ఒక్కసారి గొల్లుమన్నారు ఆ పదవవాడికోసం - (కనిపించని - ఆ పరమాత్మ స్వరూపుడికోసం!). మరొకడు - ఇంకొకడు లెక్కపెట్టారు. తొమ్మిది మందే లెక్కకు వస్తున్నారు. "దశమో నష్టః" (పదవవాడు నదిలో చచ్చిపోయాడు) అని ఆవేదనతో ఆక్రందనం చేస్తున్నారు. తలలు, గుండెలు బాదుకుంటున్నారు. ఒకళ్లను, మరొకళ్లు పట్టుకొని ముఖాలు చూసుకొంటూ కన్నీళ్లు కారుస్తూ జాలిగా ఏడుస్తున్నారు.

ఆ ఏటిగట్టుమీదుగా పొలానికి వెడుతున్న రైతు పరమానందయ్యగారి శిష్యుల దగ్గరకు వచ్చాడు. "ఎందుకు నాయనా ఏడుస్తున్నారు?" అని ప్రశ్నించాడు. "పదిమంది ఈదుకొని ఈవలి ఒడ్డుకు వచ్చాము. మాలో పదవవాడు నదిలో కొట్టుకు పోయాడు" అని వాళ్లు చెప్పారు. ఆ రైతు వాళ్లనందరను వరుసగా నిలబడమని లెక్కించాడు. "పదిమంది ఉన్నారుగా" అన్నాడు. "ఇంతకూ ఏటిపాలై చచ్చినవాడెవ్వరు?" అని అడిగాడు ఆశ్చర్యంగా. "తత్త్వమసి" - అదే నీవు! ఈ "దశమో నష్టః" అనే భ్రాంతిలో పదిమందీ లెక్కించారు. లెక్కించేవేళలో ఎవరికివారు తమను తాము లెక్కించుకొనుట లేదు. ఇది వారు పొందిన భ్రాంతి. రైతుయొక్క అనుగ్రహంతో, భ్రాంతిని - భ్రాంతివలన వచ్చిన దుఃఖాన్నీ తొలగించుకొన్నారు. ఆ రైతే గురువు. "పెన్నదాటితే పెరుమాళ్ళ సేవ" అన్నట్లు భ్రాంతి తొలగిపోతే (మాయావరణాన్ని తొలగించుకొంటే) ఉన్న వస్తువు గోచరిస్తుంది. సత్-అసత్ వివేక చాతుర్యం అలవడుతుంది! రెప్పలు విప్పుకొంటే ఉన్నవస్తువును ఆ క్షణంలోనే సందర్శించవచ్చు. **"యాదృశీ భావనా యత్ర, సిద్ధిర్భవతి తాదృశీ"** అన్నాడు - గీతలో భగవానుడు. నీవు ఏ దృష్టితో ఆ వస్తువును సందర్శిస్తావో, అది అలాగే కనిపిస్తుంది. సాధనచతుష్టయంద్వారా సత్యసందర్శనం చేసే జ్ఞానశక్తిని సాధించాలి.

## (13) ఐదు గాడిదలు

ఈ భ్రాంతి అనేది మన కళ్లుమూసి మనల్ని ఎలా ఏడిపిస్తుందో మరో దృష్టాంతం చెప్పుకొందాం! ఒక చిన్న వ్యాపారికి తన ఊరునుండి ఇంకొక ఊరికి సరుకులు మోసుకొని వెళ్లటానికి - అక్కడి సరుకులు ఇక్కడకు తెచ్చుకొనటానికి, ఐదు గాడిదలు అవసరం అయ్యాయి. ఏబది రూపాయలు మూటకట్టుకొని పెనుగొండ సంతకు

వెళ్ళాడు. అక్కడ మంచి గాడిదలను ఎంచుకొని, బేరంచేసి, ఒక్కొక్క గాడిదకు పది రూపాయలు చొప్పున ఇచ్చి కొన్నాడు. ఐదు గాడిదల్నీ తోలుకొంటూ సాయంవేళ ఇంటిముఖం పట్టాడు. అంతకంతకు చీకటి ముదిరింది. నడవటం కష్టంగా ఉంది. ఒక గాడిదపైన తాను కూర్చున్నాడు. నాలుగు గాడిదల్ని ముందు పెట్టుకున్నాడు. గాడిద మీద కూర్చుండి వాటిని అదిలిస్తూ ప్రయాణం హాయిగా సాగిస్తున్నాడు. ఆనాడు బహుళ పంచమి! ఆలస్యంగా వచ్చిన వెన్నెల గాడిదల వీపుల మీద పడుతోంది. గాడిదలు స్పష్టంగా కన్పిస్తున్నాయి. ప్రయాణం సాగిస్తున్నాడు గాడిదలతో.

కొంతదూరం వచ్చాక గుండె గుభేలుమంది. ఐదు గాడిదలూ వస్తున్నాయా? లేదా? అని అనుమానం వచ్చింది. ఏదో వెలితి అనిపించింది. గ్రుడ్డి వెన్నెల వెలుగులో కళ్లతో లెక్కపెట్టాడు. ఒకటి, రెండు, మూడు, నాలుగు అంటూ లెక్క పెట్టాడు. నాలుగు దగ్గరే ఆగిపోయింది. రెండూ, రెండూ = నాలుగే అయింది! మూడు ఒకటి, నాలుగే అయింది. ఐదవ గాడిద పోయింది అనే నిర్ణయం చేసుకొన్నాడు. పది రాణీరూపాయల (విక్టోరియారాణి పరిపాలనా కాలం) సొమ్ము చేయిజారి పోయింది. చూస్తూనే పోగొట్టుకొన్నాను, అంటూ ఏడుస్తూ గాడిద మీద ఉన్నాడు. నాలుగు గాడిదలూ ముందు నడుస్తున్నాయి. వాటి వెనుకనే నెమ్మదిగా వ్యాపారి కూర్చున్న గాడిద నడుస్తోంది.

ఇంటి దగ్గర వ్యాపారి భార్య, రాత్రి వంట ముగించుకొని, గుమ్మంలో లాంతర పెట్టుకొని కూర్చుండి భర్తరాకకోసం ఎదురుచూస్తోంది. అంతలో గాడిదల అడుగుల చప్పుడు వినిపించింది. ఆమె చేతిలో అద్దాలలాంతరు పట్టుకొని ఎదురు వచ్చింది. నాలుగు గాడిదలు కన్పించాయి! ఆ వెనుక దీపం పైకి ఎత్తి చూచింది. భర్త గాడిదమీద కూర్చుండి ఉన్నాడు. దిగటంలేదు. దగ్గరకు వెళ్ళింది. గాడిద పోయిన కష్టంలో ఉన్న భర్తకు, భార్యను చూడగానే దుఃఖం పొంగిపోయింది. బావురుమన్నాడు. "ఐదు గాడిదలు కొన్నానే! ఒక గాడిద తప్పిపోయింది. బంగారంలాంటి గాడిద. నాలుగు గాడిదలే కన్పిస్తున్నాయే!" అన్నాడు ఏడుస్తూనే గాడిద దిగకుండా. వెంటనే ఆవిడ "చాలు చాల్లెండి! నాకు ఆరు గాడిదలు కనిపిస్తున్నాయి! దిగి ఇంట్లోకి రండి భోజనానికి" అంది. గాడిదమీదనుండి దిగి చూచాడు. ఐదుగాడిదలు కన్పిస్తున్నాయి. ఆరవ గాడిద యెవరూ? అనుకొంటూ ఇంట్లోకి వెళ్లాక వెలిగింది వాడి ట్యూబులైటు బుఱ్ఱ! (ఆఱవ గాడిదగా తనను భార్య జమకట్టిందని)

ఈ దృష్టాంతంలో వ్యాపారికి భ్రాంతి ఎక్కడ పుట్టిందో పాఠకులు గమనించి ఉంటారు. వాడు ఎదుట నడుస్తున్న నాలుగు గాడిదలనే లెక్కపెడుతున్నాడు కాని,

తాను ఎక్కిన గాడిదను లెక్కపెట్టడం లేదు. ఐదవ గాడిద పోయిందవే దుఃఖంలో పడ్డాడు. ఇదికూడా భ్రాంతినుండి ఏర్పడిన దుఃఖమే! నిజంగా వాడికి ఏడవవలసినది, పోయినది ఏమీ లేదు; గాడిద పోలేదు. భ్రమలో పడి అనవసరపు ఏడుపు ఏడ్చి, తాను గాడిద అయ్యాడు! భ్రాంతిలో అసలువస్తువు కన్పించదు. భ్రాంతి పోయాక మాయ ఉండదు!

## (14) జీవనగంగ

బాల్య-యౌవన - వార్ధక్యాలు ప్రకృతి ధర్మం అయినట్లే, ఆ నాల్గవ పరిణామమైన మరణం (దేహాంతరప్రాప్తి!) అపరిహార్యం-అన్నాడు గీతలో. చావుకాలం వచ్చినా (70, 80 దాటినా) "ఇంకా ఇంకా బ్రతకాలి!" అనుకోవటం సామాన్య మానవ లక్షణం. నాగార్జునుడువంటి సిద్ధపురుషుడు 3,4 వందల సంవత్సరాలు యోగశక్తితో, ఔషధశక్తితో జీవించి, "అనవసరంగా శ్రమపడ్డాను" అని గ్రహించి, లోకంలోనుండి నిష్క్రమించాడు. What can make me afraid? Death is a joke to me! (నన్ను ఏది భయపెట్టగలదు? మృత్యువు నాకు తమాషాలాంటిది) అన్నాడు జ్ఞాని. "మృతియె లేకున్న రుచియేది. బ్రతుకులోన?" అని ప్రశ్నించాడు గాలిబ్. "ఎందుకో తెలియదు. ఎవ్వరికీ చావాలని ఉండదు! శాశ్వతంగా ఉండాలనే ఉంటుంది" అన్నాను-మా గురువర్యులు "పరిమి జగ్గన్న" గారితో. "జీవుడు అలాగే అనుకుంటాడు. జీవుడు చావులేనివాడు కదా?" అన్నారు. నాకు తెలిసిన విషయాన్నే చెప్పి, నన్ను తెల్లమొహం వేయించారు.

ఒక రాజుగారి ఆస్థానంలోకి, ఎవ్వరో ఒక వార్తాహరుడు వచ్చి, "ఎక్కడో వేయిమైళ్లకావల, మహాపర్వత శిఖరంమీద జీవనగంగ ఉన్నది" అని చెప్పాడు. "దానిని త్రాగినవాళ్ళకు మరణం ఉండదట!" అని తనకు తెలిసిన విషయాన్ని వివరించాడు.

రాజుగారికి ఆశకల్గింది. అందరికీ దాన్ని సాధించాలి అనిపించింది. వెయ్యిమంది ఆశ్వికులతో రాజుగారు అమృతగంగ తేవటానికి బయలుదేరారు. చాలామంది ఆశ్వికులు ప్రయాణం చెయ్యలేక అక్కడక్కడ ఆగిపోయారు. పర్వతం ఎక్కేసరికి పదిమంది మిగిలారు రాజుతో కలిపి. "అదే అమృతగంగ!" అన్నారు. సైనికులు తమతో తెచ్చిన బంగారు చెంబుతీసి, గంగపట్టారు. ఆసీనులై ఉన్న రాజుగారికి, ముందుగా అందించారు. రాజుగారు భగవన్నామస్మరణచేసి, త్రాగటానికి చెంబు పైకి ఎత్తారు. "ఆగండి! ఆగండి!" అని పిచ్చికేకలు వినిపించాయి. రాజుగారు చెంబుచేతితో పట్టుకొని కేకలు విన్పించిన వైపు చూశారు.

కొందరు వికృతాకారులు, గోచిపాత రాయుళ్లు కనిపించారు. వాళ్లకు కళ్లు లోపలికి పోయాయి. పళ్ళు లేవు. నడకలో తూలిపోతున్నారు. వాళ్లను చూస్తే జాలి, భయం, జుగుప్స కలుగుతోంది. "ఆగండి" అన్నారు. త్రాగబోతున్న రాజుదగ్గరకు వచ్చారు. "త్రాగకండి బాబూ! త్రాగకండి! ఈ అమృతగంగ త్రాగి, చావటానికి వీలులేక - బ్రతకటానికి శక్తిలేక, చావు బ్రతుకులమధ్య గిజగిజ లాడుతున్నాం! చావు రాదు! బ్రతికేశక్తి లేదు! ఈ పరిస్థితి మాకు తెలియక, మేము చేతులారా తెచ్చుకున్నాం!" అన్నారు. రాజుగారి చేతిలో చెంబు జారింది! రాజుగారు లేచారు. "పదండి పోదాం!" అన్నారు నిరాశగా! ఒక మహనీయుడు "Death is a most important event of life. Man has sufficient time to know how to die''-జీవితంలో అతిముఖ్యసన్నివేశము చావు! ఎలా చావాలో తెలిసికొనటానికి కావలసినంత సమయమున్నది-అన్నాడు.

## (15) మనం ఎప్పుడు చావాలో, ఎక్కడ చావాలో అంతా భగవంతుని నిర్ణయమే!

మోక్షానికి వెళ్లటానికి మొదటిమార్గం **"కాశ్యాంచ మరణాన్ముక్తిః!"** అన్నారు కదా! మహర్షుల ఈ మాటను అనుసరించి, శూద్రకుడనే మహారాజు, రాజ్యభారమును పుత్రులకు అప్పగించి, కాశీలో ఒక భవనము కట్టించుకొని, అక్కడ నివాస ముంటున్నాడు. "ఇప్పుడు ఇక్కడ ఉన్నాము. మళ్లీ మరొక చోటునకు పోవలెను-అని అనిపించునేమో! అట్టి అవకాశము లేకుండా చేసికోవాలి" అని ఆలోచించి, మోకాటి చిప్పలు తీయించివేసుకున్నాడు. "ఇక ఎక్కడికీ వెళ్ళే అవకాశమే లేదు. ఇక మనము కాశిలో మరణించుట నిశ్చయము!" అనుకొని నిశ్చింతగా కాశిలో నివసిస్తూ ఉన్నాడు ఆ మహారాజు!

శూద్రకమహారాజు చిన్నతనమునుండియు, అశ్వశిక్షణలో నలమహారాజు వంటివాడు. కాశీరాజు అశ్వశాలలోనికి ఒక 'ఆజానేయ' అశ్వము వచ్చినది. దానిని ఎవ్వరూ స్వారీ చెయ్యలేక పోతున్నారు. "దీనిని అదుపులో పెట్టి స్వారిచేసినవారికి అర్ధరాజ్యం ఇస్తా"నని గుఱ్ఱాన్ని ఊరేగిస్తూ, చాటింపించినాడు. శూద్రకుడు తన భవనముపైనుండి అశ్వాన్ని చూశాడు. చాటింపు విన్నాడు. ఇక ఆగలేక పోయాడు. అశ్వశిక్షణ ఆయనకు వెన్నతో పెట్టిన విద్య. "ఈ అశ్వాన్ని నేను స్వారీ చేస్తాను'' అని కాశీరాజు భటులకు కబురుపంపాడు. కూర్చుండి లేవలేని స్థితిని కావాలని చేసుకొన్నాడు. రాజభటులు వచ్చి "లేవటానికి మోకాళ్లు లేవు, తమరెట్లు స్వారీ చేస్తారు?"

అని ప్రశ్నించారు. "నన్ను లేవనెత్తి ఆ గుఱ్ఱంమీద కూర్చుండ పెట్టండి! నా సామర్థ్యం చూపిస్తాను" అన్నాడు. భటులు ఆ రాజును ఆ పెంకిగుఱ్ఱం మీద! కూర్చుండ బెట్టారు. శూద్రకుడు అరచేతితో గుఱ్ఱాన్ని తట్టినాడు. నోటితో ఏదో ధ్వని చేశాడు. కళ్లెంలాగి పట్టుకొన్నాడు. ఇంతవరకు ఎక్కిన వాళ్లంతా పడిపోయిన వాళ్లే! కాశీరాజభటులు ఆశ్చర్యంగా చూస్తూ ఉన్నారు. అశ్వాన్ని అదలించాడు రాజు. గుఱ్ఱం రివ్వున దూసుకొని, కరతాళధ్వనుల మధ్య పరుగెత్తింది. తిరిగి వస్తాడని అందరూ ఎదురుచూస్తున్నారు.

ఆ అశ్వం ఆ శూద్రకమహారాజును కాశీప్రభావం లేనంత దూరం, 300 మైళ్ళు తీసికొని పోయింది! అక్కడ చెట్టునకు పెట్టి కొట్టింది! కాశీలో చచ్చిపోవాలని మోకాటి చిప్పలు తీయించుకొని, కాశీలో నివాసంగా ఉన్న ఆ మహారాజు, కాశీకి దూరంగా దిక్కులేని చావును పొందాడు. ఈ విషయాన్ని భాస్కరశతకకర్త ఎక్కడ పుట్టాలో, ఎక్కడ గిట్టాలో కూడా బ్రహ్మలిఖించినట్లే జరుగుతుంది అంటూ...

**ఉ॥ గిట్టుట కేడఁ గట్టడ లిఖించును, నచ్చటఁగాని, యొండుచోఁ**
**బుట్టదు చావు! జానువుల పున్కల నూడిచి, కాశిఁ జావఁ గా**
**ల్గట్టిన శూద్రకున్ భ్రమలఁగప్పుచుఁ దద్విధి గుఱ్ఱమౌచు నా**
**పట్టునఁ గొంచు, మఱ్ఱికడఁ బ్రాణము తీసెఁగదయ్య భాస్కరా!**

మోకాటి చిప్పలు తీయించుకొని, కాళ్లు కట్టుకొని, కాశిలో ఉన్న రాజును ఆ 'విధి' గుఱ్ఱంరూపంలో వచ్చి, దూరంగా మఱ్ఱిచెట్టు దగ్గర ప్రాణంతీసింది! ఎక్కడ మరణం మానవులకు ఏ విధంగా సంప్రాప్తిస్తుందో కూడా మనకు తెలియదు.

ఎప్పుడు మరణిస్తామో తెలియదు కాబట్టి, గృహస్థు తన కర్తవ్యాలను తొందరగా, ముందుగా నెరవేర్చుకొని ఉండాలి. చేయవలసిన పనులు చేయకుండానే దురదృష్ట వంతులు మృత్యువు పాలగుచుందురు. కర్తవ్య నిర్వహణ విధానాన్ని నీతిశాస్త్రజ్ఞుడు-

**శ్లో॥ శ్వఃకార్య మద్య కుర్వీత! పూర్వాహ్నే చాఽపరాహ్ణికమ్**
**నహి మృత్యో ప్రతీక్షాస్తి, కృతేవా హ్యథవాఽకృతే!**

(-గరుడపురాణం, మహాభారతం)

"రేపు చేయవలసిన పనిని ఇప్పుడే పూర్తిచెయ్యి! మధ్యాహ్నము పూర్తిచేయవలసిన పనిని ఉదయమే నిర్వర్తించు. ఒకడు తన పనులు చేసినను, చేయకున్నను మృత్యువు మాత్రము వేచియుండదు సుమా!" కార్య నిర్వహణంలో నీవు కాలమునకు ముందుండవలయును.

మరణం రావటం నిశ్చయం! నీవు ఎప్పటికప్పుడు ముందు జాగ్రతలో ఉండాలి! అన్నాడు నీతిశాస్త్రజ్ఞుడు. భగవంతుణ్ణి జ్ఞానులైన భక్తులు చావులేకుండా చేయమని కోరుటలేదు. ఆ చావుబాధలు, వేదనలు, లేకుండా చెయ్యమని కోరుచున్నారు.

**శ్లో॥ అనాయాసేన మరణం, వినా దైన్యేన జీవనమ్,**
**దేహాన్తే తవ సాయుజ్యం, దేహిమే పార్వతీపతే!**

ఓ పరమేశ్వరా! 1. వ్యాధిబాధలు లేని మరణాన్ని నాకు అనుగ్రహించు; 2.ఆర్థిక దైన్యములేని జీవితాన్ని ప్రసాదించు; 3. ఈ జన్మ పూర్తికాగానే, జననమరణ చక్రమునుండి నన్ను తప్పించి నీలో లీనంచేసికో! – అని మూడు కోరికలు కోరినాడు. మరణాలు అందరకూ వస్తాయి. కాని అనాయాసమరణాలు కొందరికి మాత్రమే, పుణ్యాత్ములకు వస్తాయి.

## (16) "ధనం" అంటే "మృత్యువు"

ధనాన్ని కూడా జ్ఞానులు "మృత్యువు" అన్నారు. మృత్యువు ఏర్పడే కారణాలలో ధనం ప్రధానం అనవచ్చు.

**కథ** (i):– "ఒక అరణ్యమార్గంలో ముగ్గురు దొంగలు వెడుతున్నారు. పర్వతం ప్రక్కన ఉన్నది ఆ దారి! అమాంతంగా ఒక సన్న్యాసి ఆ పర్వతగుహలోనుండి పరుగెత్తుకొనివస్తూ "అమ్మో మృత్యువు! బాబో మృత్యువు! మృత్యువు!" అంటున్నాడు. "ఏమిటి? ఎక్కడ?" అన్నారు దొంగలు. గుహవైపు చూపించి పరిగెత్తాడు ఆ పరివ్రాజకుడు!

దొంగలు ఆ కొండ గుహలోపలికి వెళ్లారు. అక్కడ కాసులు, రత్నాలు పోగులు పోగులుగా ఉన్నాయి. చోరులు ఆశ్చర్యపడ్డారు. ఆ ధనాన్ని ముగ్గురూ పంచుకోవాలి అని ముందుగా ఆలోచన వచ్చింది. కాని దాన్ని కాజేయాలని ఎవడికి వాడే లోలోపల ఆలోచిస్తున్నాడు. "ఆకలిగా ఉంది, భోజనాలు చేసి హాయిగా పంచుకొందాం!" అన్నాడు – అందులో ఒకడు. సరే అన్నారు తక్కిన ఇద్దరు. ఒకడు దగ్గరలో ఉన్న పల్లెకు వెళ్లాడు. పేదరాశి పెద్దమ్మ దగ్గర అన్నం కూరలు కొని, తాటాకు బుట్టలో పెట్టుకొని, తీసుకువస్తున్నాడు. దారిలో తానొక్కడే ఆ ధనానికి అధిపతి కావాలని నిర్ణయించుకొన్నాడు. పాములవాని ఇంటికి వెళ్ళి విషం కావాలన్నాడు. వాడు నత్తగుల్లలో విషం పిండి యిచ్చాడు. దారిలో ఆ విషం అన్నంలో కలిపి తెచ్చాడు. ఇక్కడ ఉన్న ఇద్దరూ "ఆ ఒక్కణ్ణీ చంపివేస్తే చెరిసగం పంచుకోవచ్చు" అని నిర్ణయించుకొన్నారు.

అన్నం తెచ్చిన దొంగ, అన్నంబుట్ట వాళ్ల చేతికిచ్చి, మార్గాయాసం తీర్చు కోవటానికి ఒక చెట్టు మొదటకు తల ఆనించి కళ్లుమూసుకొని ఆలోచిస్తున్నాడు- తన బంగారు భవిష్యత్తు! అదే అదను అనుకొని ఒక దొంగ, అన్నం తెచ్చిన దొంగ యొక్క బుర్రమీద దుడ్డుకర్రతో గట్టిగా కొట్టాడు. వాడు చనిపోయాడు. ఇద్దరూ భోజనంచేసి హాయిగా, రత్నబంగారాలు పంచుకొందాం! అనుకొన్నారు. అన్నంబుట్టపై కప్పిన రెండు ఆకులలో ఆ యిద్దరూ అన్నం తిని మరణించారు! అక్కడి కనకరత్నాలు అక్కడే ఉన్నాయి. మళ్ళీ వచ్చాడు ఆ సన్న్యాసి. మృత్యువులో కలిసిన ముగ్గురునీ చూచాడు. ధనరాశిని మరొక్కసారి చూచి, "మృత్యువు! మృత్యువు!! మృత్యువు!!!" అని మూడుసార్లు అరచుకొంటూ అరణ్యంలోకి చొచ్చుకొని వెళ్లిపోయాడు.

ఈ దృష్టాంతంలో ధనాన్ని చూచి వారు - ఎవరికివారు స్వ+అర్థం (తమ సొమ్ము) అను కొన్నారు. ఆ సర్వస్వానికి తానే అధిపతి కావాలనుకొన్నాడు. ప్రతి ఒక్కడికీ తక్కిన యిద్దరూ ఆటంకంగా కన్పించారు. అడ్డు తొలగించుకొనే ప్రయత్నంలో ముగ్గురూ మృత్యువుపాలయినారు. వస్తువును సత్యదృష్టితో చూచిన సాధువు మృత్యువుగా సంభావించాడు. జీవితంలో డెబ్భై పనులు సాధింపగల్గిన డబ్బుకు "తానొక్కడే స్వామి కావాలి కాని, భాగస్వాములు ఉండకూడదు" అనుకొన్నాడు. ఒక్కొక్కడుగా చేసిన ఆలోచన మృత్యువై ముగ్గురినీ కబళించింది.

**కథ (ii):-** ఇలాంటి ధనం మృత్యువుగా మారి, మాతాపుత్రుల్ని ఆహుతికొన్న ఆఖ్యానాన్ని పెద్దలు ఒక శ్లోకంలో నిక్షిప్తంచేసి మనకు అందించారు-

**శ్లో॥ లాంగతోన హతా మాతా, విషాన్నేన హత స్సుతః**
**మాతాపుత్ర విరోధాయ, హిరణ్యాయ నమోనమః!**

నాగలికాడి దెబ్బతో తల్లి చచ్చింది. విషాన్నం భక్షించి కొడుకు చచ్చాడు. మాతాపుత్రుల మరణకారణమైన మహాధనమునకు పదివేల నమస్కారాలు! అన్నాడు. ధనం మృత్యువై ఎలా కబళిస్తుందో చెప్పినారు.

క్రిందటి కథలో వాళ్లు దొంగలు. వ్యాపారసంబంధం తప్ప వాళ్లు రక్తసంబంధం ఉన్న అన్నదమ్ములుకారు; తండ్రీ కొడుకులుకారు. ఈ కథలో, కడుపులో కండలిచ్చి, కడుపులో పెట్టుకొని నవమాసాలు మోసి ప్రాణాలు పణంగా ప్రసవవేదన పొందినవాడు కన్నతల్లి! అమ్మపాలు త్రాగి పెరిగినవాడు; శిశువుగా తల్లివలన శ్రీరామరక్ష పొందిన కన్నబిడ్డ! పరస్పరం మృత్యువును ప్రోత్సహించటం, ఇద్దరి కోరికలు తీర్చిన మృత్యువు, మాతాపుత్రుల్ని తనలో కలుపుకొన్నది. ఈ గాథకూడా "ధనమే మృత్యువు" అనే మాటకు ప్రత్యక్ష(ర) సాక్ష్యంగా ఉన్నది.

ఒక పదునెన్మిదేండ్ల యువతికి రెండేండ్ల బాలుడున్నాడు. భర్త ఆకస్మికంగా మరణించాడు. రెండెకరాల పొలం ఆధారంగా అనేక శ్రమలు పడుతూ, ఆ బిడ్డను పెంచుకొంటూ పొలాన్ని రెట్టింపు చేసింది. పదునారు వత్సరాల ప్రాయంలో వానికి వివాహంకూడా జరిపించింది. కొడుకు, ఆ నాల్గెకరములను వ్యవసాయం చేస్తూ, తల్లికి అనువర్తనగా ఉన్నాడు. తల్లి, ఇంటి దగ్గర వంటపని చేసుకొంటూ, బిడ్డకు అన్నం తీసుకొని పొలంలో అందిస్తూ, పొలం పనులలోకూడా కొడుక్కి తోడ్పడుతూ ఉంది.

ఒకనాడు ఆ యువకుడు చీకటితో నాగలికట్టి పొలం దున్నుతున్నాడు. దూరములో తల్లి పొలంలో ఎండుపుల్లలు (వంటకొరకు) ఏరుతోంది. అది సరిగా ఉదయం ఏడుగంటలవేళ! కొడుకు నాగలి ఆపి, నేలలోనుండి ఏదో తీసి పట్టుకొని వెడుతూ ఉన్నాడు. దూరాన్నుండి ఆ మాతృమూర్తి పరిశీలనగా చూస్తోంది. కొడుకు ఆ వస్తువుతో గడ్డిమేటి దగ్గరకు వెళ్ళి, అక్కడ దాచి వచ్చి, దుక్కుదున్నటంలో నిమగ్నుడయ్యాడు. జరిగినది ఏమిటి?

ఆ యువకుడు దున్నుతూ ఉండగా నాగలికఱ్ఱుకు ఏదో తగిలింది. చూడగా అది లంకెబిందె! దానినిండా కాసులున్నాయి. ఆ బిందెను రహస్యంగా గడ్డిమేటిలో దాచాడు. తల్లికి కూడా చెప్పకూడదు! ఆ సొమ్ముతో పెద్దభవనం, ఇంకా భోగాలు అనుభవించవచ్చు. అమ్మ "జాగ్రత్త! జాగ్రత్త! పొదుపు!" అంటూ మనల్ని అనుభవించనియ్యదు. ఈ ముసలిదాన్ని చంపేస్తే మనయిష్టం వచ్చినట్లు బ్రతకవచ్చు! అని ఊహల్లో తేలిపోతూ, స్వర్గలోకభూములు దున్నుతున్నాడు.

తల్లికి, వీడు గడ్డిమేటిలో ఏదో దాచాడు - అది ఏమిటి? అనే ప్రశ్న శ్వాస తీసుకోనియ్యకుండా బాధిస్తోంది. ఆమె చాలా తెలివైనది. యజమాని లేని దుస్థితిలో బిడ్డను పెంచి, పెద్దవాణ్ణి చెయ్యటం, సామాన్య స్త్రీలకు సాధ్యంకాదు. జాగ్రత్త, బాధ్యత, ముందుచూపు, సంఘజీవనవిధానం - అన్నీ తెలిసిన ఆమెకు ఈ విషయాన్ని కనిపెట్టడం చాలా సులభం. గడ్డిలో కప్పిన లంకెబిందె చూసింది. అందులో కాసులు కూడా చేతితో స్పృశించి నిశ్చయించుకొన్నది.

ఆ కొడుక్కి ఈమె తల్లి! ఈమె వాడికి పైలోకంలోనికి వెళ్ళి అక్కడ ఊహల్లో తేలిపోతూంది. వీడు, లంకెబిందె దొరికిన విషయం నాకు తెలియకుండా దాచాడు. పెళ్లి అయినప్పటినుండీ నేనంటే వీడికిష్టంలేదు. నన్ను వీడు ఇంక అసలే చూడడు. ఈ సొమ్ముతో వీడికి కళ్లు నెత్తికెక్కుతాయి. నేను నా జీవితంలో మాత్రం ఏమి

సుఖపడ్డాను? ముప్పయి ఆరేళ్ళు వచ్చాయి. నా జీవితం నేను చూచుకోవాలి. భూమి సూర్యుని చుట్టూకాదు; డబ్బున్నవాడి చుట్టూ తిరుగుతోంది. ఈ డబ్బుతో నా జీవితంలో ఏర్పడ్డ చీకటి తొలగించుకోవాలి. నవ్యజీవితానికి నాందీగీతం పాడాలి! – అనుకొంది. నడుం బిగించి, కర్తవ్య ప్రణాళికా క్రమం, బుర్రలో పేర్చుకొంది. ఏరిన ఎండుపుల్లలు తట్టకెత్తుకొంది. ఇంటిముఖం పట్టింది. దారిలో పాములవాడి ఇంటికి వెళ్ళి విషం కొన్నది.

ఇంటికి వచ్చి, కొడుక్కి ఇష్టమైన కూర వండింది. తాను హాయిగా తిన్నది. అన్నంమూట – ముంత సిద్ధంచేసింది. ప్రొద్దుతిరిగే వేళకు పొలం చేరింది. అమ్మను చూచి, నాగలి యెడ్లను మేతకు వదిలాడు. ప్రక్క చెఱువుకు స్నానానికి వెళ్లాడు.

అన్నం ముంతలు తెచ్చిన తట్ట చెట్టుక్రింద పెట్టుకొని చెట్టుకు చేర్లబడి ధనవంతురాలుగా, అందరి గౌరవాలు పొందుతూ, మెడనిండా నగలతో, పాలరాతి మేడలో, కన్నుమూస్తూ కులికిపోతోంది.

కొడుకు తల్లిపీడ వదలించుకోవాలనే నిశ్చయంతో నాగలికాడి భుజాన పెట్టుకొని, చెట్టు దగ్గరకు వచ్చాడు. కళ్లుమూసి చెట్టుకు తల ఆన్చిన తల్లిని నాగలి కాడితో బలంగా కొట్టాడు. కపాలమోక్షం అక్కడే అయిపోయింది. కొడుకు కోరిక తీర్చింది మృత్యుదేవత! చచ్చిన తల్లిమీద గడ్డికప్పి, దున్నిన ఆకలితో అన్నం తిన్నాడు. తల్లి కోరిక నెరవేరింది. కాని తల్లిలేదు. కొన్ని క్షణాలు తేడాగా ఆ తల్లీ ఆ కొడుకులు మృత్యువు ఒడిలోకి చేరుకొన్నారు. ధనాన్ని ధనంగా భావించి కౌగిలించుకొని, అజ్ఞానులు కాటువేయబడ్డారు. మహాధనాన్ని మృత్యువుగా దుఃఖహేతువుగా జ్ఞానులు గ్రహించారు. జాగ్రత్తగా బ్రతుకమని సందేశం అందించారు. మానవులలో ఆశలు రగిలించి, అధర్మమార్గంలో నడిపించి, మృత్యువును చేర్చే ధనంకూడా మృత్యువే!

## (17) దేహప్రీతి – మృత్యుభీతి

**కథ (i):–** ఒకగురువుగారికి అంత్యకాలం సమీపించింది. ఆశ్రమ ఆవరణంలో పరుండబెట్టారు. శిష్యులు చుట్టూచేరి విచారిస్తున్నారు. ఒక శిష్యుడు "స్వామీ! తమరు మోక్షానికి పోతారా? మళ్లీ జన్మ ఉన్నదా?" అని ప్రశ్నించాడు. "నాయనా! మోక్షానికి ఇంకో జన్మ అడ్డంగా ఉంది. నా కర్మవశంగా నేను వరాహజన్మ ఎత్త వలసి వచ్చింది" అంటూ కళ్లనీళ్ళు కారుస్తున్నారు. శిష్యుడు "స్వామీ! మీరు పంది జన్మ ఏమిటి? అలా జరగటానికి వీలులేదు! నాకు కర్తవ్యం ప్రబోధించండి" అన్నాడు. "నాయనా! ఊరికి ఉత్తరంగా ఎఱుకులవాని పంది ఈనటానికి సిద్ధంగా ఉంది. ఇరవై పిల్లలు జన్మిస్తాయి.

అందులో ముఖంమీద తెల్లమచ్చతో నేను ఆవిర్భవిస్తాను. ఈ విషయం ఊహించడానికే బాధగా ఉంది. హేయంగా ఉంది. ఆ జన్మనుండి నన్ను తప్పించాలి" అన్నారు గురువుగారు. ఆ శిష్యుడు "తెల్లమచ్చ ఉన్న పందిపిల్లను చంపివేసి, మీకు ఆ జన్మనుండి విముక్తి కలిగిస్తాను'' అని భరోసా ఇచ్చాడు. గురువుగారు నిశ్చింతగా ప్రాణాలు విడిచిపెట్టారు.

శిష్యుడు గురువుగారు చెప్పిన చిరునామా ప్రకారం ఆ ఎఱుకలవాని ఇంటికి వెళ్ళాడు. పంది ప్రసవవేదనంలో ఉంది. శిష్యుడు అక్కడ కాపలాగా ఉన్నాడు ఒక దుడ్డుకర్రతో. మొఖంమీద తెల్లమచ్చ ఉన్న పిల్లను నా కిమ్మని అడిగాడు. ఇవ్వటానికి ఆ ఎఱుక ఒప్పుకున్నాడు. కొద్దిసేపట్లో తెల్లమచ్చ పిల్లను తెచ్చి ఆ శిష్యుడి ముందట పెట్టాడు. ఆ పందిపిల్ల అప్పుడే తల్లి గర్భంనుండి రావటంవల్ల బాహ్యావాతావరణానికి వణకిపోతోంది. గురువుగారికి కపాలమోక్షం కల్గించవలసివచ్చిందని శిష్యుడు వణకిపోతున్నాడు. అయినా గురువుగారి ఆజ్ఞ పాలించటానికి సన్నద్ధమయ్యాడు! గురువుగారికి సాష్టాంగనమస్కారం చేసాడు. లేచి దుడ్డుకఱ్ఱ పైకెత్తాడు – గురువుగారి బుఱ్ఱ ముక్కలు చెయ్యటానికి. "శిష్యా! ఆగు!" అనే కేక వినబడింది. అది అచ్చంగా చచ్చిపోయిన గురువుగారి గొంతే! ఆగిపోయాడు భక్త శిష్యుడు. చేతులు కట్టుకొని గురువరాహం ఏం చెపుతోందా? అని ఒళ్లంతా చెవులు చేసుకొని వింటున్నాడు. "శిష్యా! నన్ను చంపకు. నాకు ఈ జన్మ ఎంతో అందంగా ఉంది! ఆనందంగా ఉంది! నన్ను చంపకు. ఇది నా ఆజ్ఞ!" అని పాలు త్రాగటానికి తల్లి దగ్గరకు వెళ్లాడు. ఏస్థితిలో ఉన్నా ఎంత నికృష్టజన్మ ధరించినా, మరణానికి ఏ ప్రాణియు ఇష్టపడదు. భయపడుతుంది.

**కథ (ii):–** వ్యాసుడు అరణ్యమార్గంలో వెళుతుండగా, ఖంగారుగా ఆ దారి దాటటానికి ప్రయత్నిస్తున్న ఒక పురుగును చూచాడు. దానికి మాట్లాడేశక్తినిచ్చాడు. "ఈ ఖంగారుకు కారణం ఏమిటి?" అని ప్రశ్నించాడు. "మహర్షీ! ఒక మహారాజుగారి రథం వస్తోంది. ఈ విషయాన్ని నాకు భగవంతుడిచ్చిన శక్తితో గ్రహించాను. ఆ రథం వచ్చేలోపుగా, ఆవలివైపు చేరాలి! లేకపోతే మృత్యువును పొందుతాను" అన్నది. వ్యాసుడు: "చిన్న కీటకానివి! నీవు ఉంటే ఏమిటి? లేకపోతే ఏమిటి?" అన్నాడు. ''అలా అనకండి మునీంద్రా! మానవులందరికీ ఉన్నట్లే మాకు కూడా సుఖదుఃఖాలున్నాయి. సుఖం మీద ఆశ – దుఃఖం మీద భీతి, మాకూ మీలాగే ఉంటాయి!" అనగానే లోకజ్ఞానం లేకుండా ప్రశ్నించినందుకు సిగ్గుపడ్డాడు వ్యాసుడు.

**కథ (iii):**–ఎంతటి నీచజన్మలో ఉన్నా, ఎంతటి నికృష్టస్థితిలో ఉన్నా జీవుడు ఆ జన్మను నిరసింపలేడు. మృత్యువును ఆహ్వానించలేడు. దేవేంద్రుడంతటివాడు కూడా, నీచజన్మను నిరసించలేకపోయాడనీ, మృత్యువును అంగీకరించలేకపోయాడనీ, ఒక దృష్టాంతం చెప్పారు.

దేవేంద్రుడు శాపవశంచేత, వరాహజన్మ ఎత్తాడు. ఆ పురుష వరాహం, స్త్రీ వరాహంతో కలిసి ఒక బురదగుంటలో పరుండి ఉన్నాడు. ఆ వరాహదంపతులు ఒకరి ముట్టెపై మరొకరి ముట్టె పెట్టుకొని, దాంపత్యానందంలో ఉన్నారు. పందిపిల్లలు తల్లిదండ్రుల శరీరాలకి తమతలలు తగిల్చి, ఆనందమైకంలో ఉన్నాయి. దారైషణానందం, పుత్రైషణానందం, పడుగుపేకలుగా అల్లుకొని, ఆ దంపతులు ఆనందవార్ధిలో ఓలలాడుతున్నారు.

నారదుడు ఇంద్రునికోసం లోకాలన్నీ వెదుకుతూ ఆ బురదగుంట దగ్గరకు వచ్చాడు. "మహేంద్రా! రంభా ఊర్వశి మేనకాది అప్సరసలతో హాయిగా ఉండవలసిన వాడవు. ఈ వరాహావతారమేమి? నా తపశ్శక్తితో నీ శాపాన్ని తొలగిస్తాను. "రా! పోదాం స్వర్గానికి!" అన్నాడు. దేవేంద్రుడు "నారదా! నేను ఈ జన్మలో మహానందంలో ఉన్నాను. స్వర్గానికంటే ఈ బురదగుంట సహస్రాధికం! నా యీ వరాహప్రేయసి సౌందర్యం ముందు రంభా ఊర్వశి మేనకాదుల అందము తలపెట్టుటకుకూడా పనికిరాదు. నాయీ బిడ్డలు–రత్నమాణిక్యాలు! భార్యాబిడ్డల స్వర్గానందంలో ఉన్నాను. నాయీ ఆనందాన్ని భంగపరచకు, వెళ్లు! వెంటనే వెళ్లు!!" (Don't disturb me! Get out!) అని గద్దించాడు. "నారాయణ, నారాయణ!!" అంటూ నారదుడు వెళ్లిపోయాడు. దేహమోహము, మృత్యుభీతి, ప్రాణులకు సహజము –అనే విషయాన్ని ఇలాంటి కథలు ఎలుగెత్తి ఘోషిస్తున్నాయి. అంతరార్థం గ్రహించండి!

**కథ (iv):**– ఒక గృహస్థు ఇంటికి ఒక మునీశ్వరుడు అతిథిగా వచ్చాడు. ఆ గృహస్థు వలన, ఆతిథ్యం పొంది, ఆ ముని గృహస్థుతో "నీవు ఐదు రోజులు మాత్రమే జీవిస్తావు!" అని చెప్పి వెళ్లిపోయాడు. ఐదు రోజుల తరువాత ఆ ముని తిరిగి వచ్చాడు. "ఈ ఐదురోజులలో ఎన్నిపాపాలు చేశావు?" అని ప్రశ్నించాడు. "నిరంతర మరణస్మరణతో ఈ 120 గంటలనుండి మరణానికి సంసిద్ధుణ్ణి అవుతున్నాను" అన్నాడు.

మరణభీతితో జీవితాన్ని వ్యర్థంచేసుకోవటం వివేకిలక్షణం కాదు! జీవితలక్ష్యాలు ధర్మ–అర్థ–కామ–మోక్షాలు! ఆ పురుషార్థాలు సాధించకపోతే, జన్మ వ్యర్థమయిపోతుంది.

అహంకార మమకారాలు-జీవనభ్రాంతి-అజ్ఞానము-దేహభ్రాంతి అను అజ్ఞానంలోపడి, జీవితాన్ని పాడుచేసుకొనేవారికి మృత్యువు ఒక హెచ్చరిక! హెచ్చరిస్తున్నా ప్రమాదాలలో (కావాలని) పడే వాళ్లను ఎవ్వరూ రక్షించలేరు! మృత్యువు ఏర్పడిన తరువాత ఏం జరుగుతుందో వివరిస్తూ జ్ఞానబోధకులు -

**శ్లో॥ అర్థాగృహే నివర్తన్తే, శ్మశానే మిత్ర బాంధవాః,**
**సుకృతం దుష్కృతం చైవ, గచ్ఛంత మనుగచ్ఛతి.**

మరణము రాగానే - మానవులు సంపాదించిన ధనములన్నియును ఇంటిలోనే ఆగిపోవును. మిత్రులు బంధువులు శ్మశానంవరకు మాత్రమే సాగనంపుదురు. చచ్చిపోయిన తరువాత, ఆ చచ్చిన వానితో విడిచిపెట్టకుండా వెళ్లేవి రెండే! 1.పుణ్యము, 2.పాపము. అందుచేత పాపము మూటకట్టుకొనకు. ఎవ్వరికీ బాధకల్గింపకు. పరోపకారములుచేస్తూ సత్ప్రవర్తనతో బ్రతుకమని, పెద్దలు మనలను హెచ్చరించినారు. మనం ఈ లోకంలో ఉండే కాలం స్వల్పమని గ్రహించి, ఈ అల్పకాలంలో పుణ్య కార్యాలుచేస్తూ, జీవితాన్ని సార్థకం చేసుకోవలసిందిగా బహుముఖ సందేశాలు అందించారు. నీతులు తెలియక పాడుకారు, ఆచరించక అధోగతి పొందుతారు.

## (18) సత్సాంగత్యం

సద్గ్రంథపఠనంద్వారా ఆ గ్రంథకర్తల(సజ్జనుల)తో సంగం ఏర్పడుతుంది. రామాయణపఠనంద్వారా వాల్మీకితోను, భారతభాగవతాలద్వారా.. వ్యాసునితోను, పోతన్నతోనూ, బోధామృతంద్వారా గురుమహరాజ్‌తోనూ, వివేకానందగ్రంథాలద్వారా వివేకానందతోనూ, సత్సంగం ఏర్పడుతుంది. వాళ్లు అమరులు! గ్రంథాలు పఠించే వారికి ఆ మహనీయుల సాంగత్య ప్రభావం లభిస్తుంది.

**శ్లో॥ హీయతే హి మతిస్తాత! హీనైస్సహ సమాగమాత్!**
**సమైశ్చ సమతా మేతి, విశిష్టైశ్చ విశిష్టతామ్.**

నీచులతో సంగమం పెట్టుకొంటే నీ బుద్ధి నిన్ను అధఃపతనము చేస్తుంది. నీతో సమానమైనవారి స్నేహము నిన్ను ఉన్నచోటునే ఉంచుతుంది. నీ కంటె మహనీయులతో, దైవభక్తులతో, తత్త్వజ్ఞులతో అనుబంధం పెట్టుకుంటే, నీవు ఔన్నత్యాన్ని పొందుతావు! అలాగే గ్రంథపఠనంలో కూడా నిన్ను ఉన్నతమార్గంలో నడిపించే ఉత్తమగ్రంథసాంగత్యమే ఉండాలి! Life is serious. Let me have noble thoughts from all sides. జీవితాన్ని బాధ్యతగా లక్ష్యంవైపు నడిపించాలి. **"సాధూనాం దర్శనం పుణ్యం"** - సాంగత్యందాకా అక్కర లేదు-సత్పురుషుల దర్శనమే పుణ్యము - అన్నారు

పెద్దలు. ఈ విషయాన్ని వివరించమని, నారదుడు విష్ణువును అడిగినాడట. విష్ణువు నారదునితో – 1) ఆ మడుగులోని పురుగును చూచి రమ్మన్నాడు. నారదుణ్ణి చూడగానే ఆ పురుగు చచ్చింది. 2) ఒక చెట్టుపై పిట్టను సమీపించి రమ్మన్నాడు. నారదుణ్ణి దర్శించగానే అదికూడా చచ్చినది. నారదుడికి ఏమీ అర్థంకాలేదు. తొమ్మిది మాసాలు నిండాక రమ్మన్నాడు విష్ణువు. నారదుడు వచ్చాడు. 3. ఒక రాజుగారి ఇంట్లో బిడ్డపుట్టాడు. ఆ బిడ్డను చూచి రమ్మన్నాడు. "పురుగు–పక్షి చచ్చిపోయాయి. అడిగేవాళ్లులేరు. రాజకుమారుడు చచ్చిపోతే, నన్ను అక్కడికక్కడే ముక్కలుగా నరికేస్తారు. నేను వెళ్ళను బాబూ!" అన్నాడు. "నిన్ను ఎవ్వరూ ఏమీ చెయ్యరు. అభయం ఇస్తున్నాను. వెళ్లు!" అన్నాడు విష్ణువు. నారదుడు అప్పుడే పుట్టిన శిశువు దగ్గర నిలబడ్డాడు. ఆ రాచబిడ్డ కళ్లు తెరచి నారదుణ్ణి దర్శించాడు. మాట్లాడుతున్నాడు. "స్వామీ! నీవు కాసారంలో ముందుగా చూచిన కీటకాన్ని నేను! రెండవసారి చూచిన పక్షిని! భక్తాగ్రేసరుడవైన నీదర్శన ప్రభావంతో కీటకాన్ని పక్షిగా, పక్షిని రాజకుమారుడుగా మారాను! సజ్జనదర్శన ప్రభావం ప్రత్యక్షంగా చూచావుకదా!" అని తల్లిని కౌగిలించుకొన్నాడు – తన బుజ్జి చేతులతో. సజ్జనదర్శనం పరంపరగా అభివృద్ధి చేసినట్లు, దుష్టసంబంధం పరంపరగా నాశనం చేస్తుంది. ఒక్క నూనెబొట్టు పుస్తకం మీద పడి, నాల్గు కాగితాలు పాడుచేస్తుంది. దుష్టసంగం పధ్నాలుగు జన్మలవరకూ బ్రాటోవరు అవుతుంది.

## (19) నిశ్చలత

"ధ్యానమునకు కూర్చుండగానే ఆలోచనలన్నీ మనస్సును చుట్టుముట్టివేస్తాయి. కారణం ఏమిటి?" అని పరమహంసవారిని శిష్యులు ప్రశ్నించారు. "నాయనా! గృహాన్ని శుభ్రపరుద్దామని చీపురుకట్ట కదలించగానే దుమ్మురేగుతుంది. అది సహజం! ఎన్నేళ్లనుండో ఇంద్రియార్థములవైపు పరుగులు తీయటానికి అలవాటుపడిన మనస్సును ఒక్కరోజులో పరమాత్మవైపు త్రిప్పగలమా? క్రమక్రమసాధనతో మరలించాలి". "లాలయేత్ చిత్తబాలకమ్" మనస్సు అనే బాలకుణ్ణి లాలించి లోకదుఃఖాలు వివరించాలి! లోకాసక్తిని తగ్గించాలి. లోకభ్రాంతిని తొలగించాలి. నౌకాగ్రకాక న్యాయంగా, మనస్సు, బాహ్యప్రపంచ ఆసక్తినుండి పరమాత్మదగ్గరకు వచ్చి తీరును! – అంటూ గురుమహరాజ్ ఒక కథ చెప్పారు. ఒక ఓడ సముద్రతీరంలో ఆగి ఉన్నది. అప్పుడు ఒక కాకి, ఓడజెండాకట్టమీద వ్రాలి ఉన్నది. అది నిద్రించింది. అది మేల్కొనే సరికి ఆ ఓడ సముద్రం మధ్యకు పోయింది. ఆ కాకి ఆ ఓడను విడిచి కొంతదూరం పోయింది. నేలదొరకలేదు! తిరిగి ఆ ఓడమీదకు వచ్చింది. మరల

మరొక వైపుకు ఎగిరింది. భూమి దొరకలేదు. మళ్ళీ ఓడమీదకే వచ్చింది. అలాగే "యత్ నేతి నేతి విమోహితాస్యుః" అన్నట్లుగా – "ఇది పరమాత్మకాదు, అది పరమాత్మకాదు" అని ప్రపంచంవైపు తిరిగి తిరిగి అలసిపోయిన మనస్సు తప్పనిసరిగా ఆ పరమాత్మనే ఆశ్రయిస్తుంది. "ప్రపంచం లేదు" అనుకొన్నవాడు పరమాత్మనే గట్టిగా పట్టుకొంటాడు కదా! "ప్రపంచం లేదు" అనుకొన్న వాయసము నౌకాగ్రమునే ఆశ్రయించినది కదా!

**"చిత్తే చలతి సంసారో; నిశ్చలే మోక్ష ఉచ్యతే"** (బృహదారణ్యకోపనిషత్). మనస్సు ఇంద్రియార్థములపై – ఏషణత్రయముపై పరుగులు తీయుచున్నంత వరకును జీవుడు సంసారములో కూరుకొనిపోవుచుండును. సంసారభ్రాంతిలో ఉండును. మనస్సు నిశ్చలంగా పరమాత్మయందు నిలిచినప్పుడు మోక్షమును పొందుచున్నాడు.

## (20) ఏకాగ్రత

**(i)** ప్ర + అర్థన = ప్రార్థన. భగవంతుని వేరుగా ఉంచి, తాను వేరుగాఉండి అభ్యర్థించటాన్ని ప్రార్థన అంటారు. ధ్యానంలో "నేను భగవంతుని స్మరిస్తున్నాను" అనే త్రిపుటి అంతరిస్తుంది. తాదాత్మ్యం ఏర్పడుతుంది. "ఏకమేవ అద్వితీయం బ్రహ్మ" – (ఒక్కటే! రెండవది లేదు). "అహం బ్రహ్మాస్మి" నేనే పరమాత్మను ఐనాను – అనే భావన ఈ ధ్యానంలో ఏర్పడుతుంది. ఈ ధ్యానసాధనలో మనస్సు అడుగడుగునా ధ్యానభంగం చేస్తుంది. మనస్సు మర్కటం అనీ, అత్యంత చపలమనీ ఆదిశంకరులు శివానందలహరిలో చెప్పారు కదా!

**శ్లో॥ కపాలిన్ భిక్షో! మే హృదయకపి మత్యంత చపలం**
**దృఢం భక్త్యా బధ్వా శివ! భవదధీనం కురు విభో!**

కపాలమును చేత ధరించి బిచ్చమెత్తు ఆదిభిక్షుకుడా! మహాచపలమైన ఈ మనస్సు అనే మర్కటము నాకు ధ్యానభంగము చేయుచున్నది. మహాత్మా! శివా! ఈ కోతిని బంధించి తీసుకొని పొమ్ము! (బిచ్చగానితో కోతి ఉన్నచో, బిచ్చము అధికముగా లభించును). నాకు మనస్సును తీసివేసినచో అది నాకు అమనస్క యోగము! అప్పుడు మోక్షము కరతలామలకం కాగలదు. మనస్సు నిలకడగా లేకపోవుట పెద్దలోపము.

**(ii)** "మనస్సును ఏకాగ్రము చేసినప్పుడు మహాశక్తి పుట్టును" – అనుటకు అనేక దృష్టాంతములున్నవి. భూతద్దాన్ని కేంద్రీకరించినప్పుడే మహాశక్తి (అగ్ని) పుట్టును. లక్ష్యముపై ఏకాగ్రత నిలిచినప్పుడే లక్ష్యసాధనము జరుగును. "బకాదేకం" – కొంగను చూచి నిశ్చలస్థితి అలవరచుకో! అన్నారు. కొంగ మడుగు నీళ్లలో నిశ్చలంగా తన

కాళ్లుకూడా "తూటికాడలేమో" అనే భ్రాంతి చేపలకు కల్గే అంతటి నిశ్చలస్థితిలో నిలబడుతుంది. ఓ సాధకుడా! కొంగయొక్క నిశ్చలస్థితి ధ్యానంలో నీవు సాధించాలి.

**(iii)** ఒకప్పుడు దత్తాత్రేయమహర్షి అరణ్యమార్గంలో పయనిస్తున్నాడు. ఆ మార్గం కొంతదూరం పోయాక, రెండు దారులుగా విడిపోయింది. ఏదారిని తాను పయనించాలో మునికి తెలియలేదు. ఆ దగ్గరలో చేపలు పట్టేవాడు గాలము నీటిలో విడిచి, బెండువైపు చూస్తున్నాడు. చేప ఎరమ్రింగగానే బెండు మునుగుతుంది. వెంటనే గాలము లాగి చేపను బుట్టలో వేసుకోవాలి! ఆ జాలరి బెండుపై ఏకాగ్రతతో ఉన్నాడు. అన్ని ఇంద్రియాల శక్తులు నేత్రాలలో కేంద్రీకరించి ఉన్నాయి. మనస్సు లక్ష్యంతో తాదాత్మ్యం చెంది ఉన్నది. అతనికి బాహ్యస్పృహ లేదు. మహర్షి, గాలమువేసి తదేక ధ్యానంలో ఉన్న జాలరి దగ్గరకు వెళ్ళి సంబోధిస్తున్నాడు. గట్టిగా అరుస్తున్నాడు. వాడు ఏకాగ్రతనుండి కొంచెంకూడా చలించటం లేదు. వాని చెవులు వినిపించుట లేదు. శిలావిగ్రహంలా ఉన్నాడు. మహర్షి ఆశ్చర్యంగా జాలరిని చూస్తూ విస్తుపోతున్నాడు. అంతలో బెండు మునిగింది. చేపను లాగుకొని బుట్టలో వేసుకొన్నాడు. అప్పుడు దత్తాత్రేయ మహర్షి "నాయనా!" అని నెమ్మదిగా పిలిచాడు. "ఏమి స్వామీ!" అన్నాడు జాలరి! మహర్షి ఆ చేపలవానికి నమస్కరించి, "చేపను పట్టుటలో నీకున్న ఏకాగ్రత మాకు ధ్యానసాధనలో ఉంటే, మేము ఏనాడో మోక్షం పొంది ఉండేవాళ్లం" అని ఆశ్చర్యపడ్డాడు. దారి తెలుసుకొని వెళ్లిపోయాడు.

## 3.2 "జ్ఞానతరంగాలు" - వేదాంత కథలు

### (1) శ్రీరామరక్ష (యథానిక)

"సహస్రాక్షః సహస్ర పాత్" (తన సృష్టిని వేయికళ్లతో చూచుకొంటూ, భక్తరక్షణ కోసం వెయ్యి పాదాలతో పరుగులు తీసే పరమాత్మ అంతటా ఉన్నాడు) "ఇందుకలదు! అందులేదని సందేహము వలదు!!" అన్నాడు మన అన్న పోతన్న! 1995 ప్రాంతంలో రాజమండ్రి కోటిపల్లి బస్సుశ్టాండులో బస్సునిండుగా జనం ఎక్కారు. అందులో ఎక్కినవాళ్లు అందరూ ఆయుఃప్రమాణం అయిపోయినవాళ్లు! బస్సు బయలుదేరే ముందు, ముగ్గురు ఆయువు ఉన్నవాళ్లు పరుగెత్తివచ్చి బస్సు ఎక్కారు. కండక్టరు వాళ్ల గుండెల మీద చెయ్యివేసి, నిర్దాక్షిణ్యంగా క్రిందకుత్రోసి, "రైట్!" అని అరిచాడు. క్రింద పడ్డవాళ్లు కండక్టరును "అమ్మ ఆలి" బూతులు తిడుతున్నారు. ఈలోగా బస్సు వంతెనమీదనుండి గోదాట్లోకి పడిపోయినట్లు పెద్దకేక! క్రిందపడి బూతులు

తిడుతున్నవాళ్లు ఆ కండక్టరులో దైవాన్ని దర్శించి నమస్కరించారు "కండక్టరు దేవుడు మమ్మల్ని రక్షించాడు!" అంటూ గుండెలనిండా గాలి పీల్చుకొన్నారు.

## (2) దైవబలం

### దైవబలం (యథానిక)-1:-

"సాటివారు నిన్ను సాధింపగా లేరు! దైవమొకడు నీకు తప్పకున్న" - దైవబలం ఉన్నవాణ్ణి మానవులు ఏమీ చెయ్యలేరు. "కాలసర్పం వందకాట్లు వేస్తే ముంగిసకు ఒక్క వెంట్రుక ఊడుతుంది" అని సామెత. దైవబలం ఉన్నవాడికి లోకులు చేసే అపకారాలు ఉపకారాలుగా మారుతాయి. దైవబలసంపన్నుడికి ఆ అపకారాలు ప్రగతిపథ సోపానాలు కూడా అవుతాయి! ఇది జగమెఱిగిన సత్యం. అందరూ చూచిన చూస్తున్న సత్యం. ఈ సందర్భంలో ఒక పచ్చినిజాన్ని ప్రస్తావించుకొందాం!

ఒకప్పుడు పెనుతుపాను ఏర్పడింది. ఇంటికప్పు పెంకులు తిరగబడిపోతున్నాయి. పర్ణశాలలు ఇంటికప్పు తాటాకులు చూరుకుట్లు తెగి గాలివానలో చక్రభ్రమణం చేస్తున్నాయి. గ్రామస్థులకు "ఇల్లుకంటె గుడి పదిలం!" అనే పెద్దల మాట జ్ఞాపకం వచ్చింది. అందరు దేవాలయంలోకి చేరారు. దేవాలయ మండపంలో కూర్చోవటానికి చోటులేక తేగలపాతరలా నిలబడ్డారు. గాలివాన అంతకంతకు గయ్యాళిభార్యలా రెచ్చిపోతోంది. ఈ లోపుగా ఒక దీనుడు కూడా దేవాలయాన్ని ఆశ్రయించాడు. మండపంలో నిలబడటంలో స్థిరపడ్డవాళ్ల దగ్గరకు వెళ్లి, తనకు కూడా నిలబడటానికి జేనెడు చోటు ఇమ్మని అర్థించాడు. "లేదుపో! పోపో!!" అంటూన్నా, గుంపులో దూరటానికి ప్రయత్నించే ఆ శరణార్థిని నిర్దాక్షిణ్యంగా గాలివానలోకి త్రోసివేశారు. మండపానికి పదిగజాల దూరంలో, గాలివానలో నిలబడి, "గజగజ" వణికిపోతూ, ములుకుల్లా గ్రుచ్చుకొనే చినుకు పోట్లు సహిస్తూ, "శ్రీరామ! జయరామ! జయజయరామ!" అంటున్నాడు ఆ దీనుడు. మండపంలో నిలబడ్డవాళ్లు "మహబాగా చేశాం!" అనుకొంటున్నారు. ఈ భక్తుడు "తనకు వాళ్లతోపాటుగా మండపంలో నిలచేభాగ్యం భగవంతుడు ఇవ్వలేదు! మనప్రాప్తం ఇంతే!" అనుకొంటూ, చలితో వణుకుతూ అస్పష్టంగా నామస్మరణ చేస్తున్నాడు.

ఈలోగా కళ్లు జిగేలుమనే తెల్లని మెఱపు తళుక్కు మంది. ఆకాశం బ్రద్దలై నేలమీద పడ్డంత భయంకరధ్వని ఏర్పడింది. ఎవరు ఎక్కడున్నారో ఆ క్షణంలో ఎవ్వరికీ ఏమీ తెలియలేదు. తెలిసి చూచేసరికి, "మండపం కూలిపోయింది. మండపంలో

వాళ్లంతా చచ్చిపోయారు" అనుకుంటున్నారు చావగా మిగిలినవాళ్లు!

పిడుగుపడటానికి ముందు ఆశ్రయార్థి అయిన దీనుడు- "ఇంతమందిలో ఒక్కడికి కూడా నామీద జాలి కలగలేదే! నిలువనీడ కూడా ఇవ్వలేదే! ఊరంతా ఏకమై కసిరికొట్టారే! నేను ఎంత దిక్కులేనివాణ్ణి!" అని తనమీద తాను జాలిపడి, నామస్మరణంలో మునిగిపోయాడు.

పిడుగుపడిన తరువాత - అందరూ ఏకకంఠంగా "పోపో!" అని తనను సురక్షిత ప్రాంతానికి నెట్టివేసి రక్షించిన దైవస్వరూపులు అని గ్రహించాడు. తనకు గాలివానలోనే "శ్రీరామరక్ష" కాని; మండపంక్రింద లేదనీ, గ్రామస్థులంతా ఏకమై తనకు "శ్రీరామరక్ష" కల్పించారని మనసారా మరోసారి "శ్రీరామ! జయరామ! జయజయరామ!" అనుకొన్నాడు వణికిపోతూ...

**దైవబలం (యథానిక)-2:-**

చంద్రుడు స్వయంప్రకాశకుడు కాదు; అద్దంలాంటివాడు-అన్నారు. సూర్యకాంతి చంద్రునిపై పడి, ప్రకాశిస్తోంది అంటారు శాస్త్రజ్ఞులు! మానవ జీవితం కూడా, దైవబలం ఉన్నప్పుడు ప్రకాశించటం, దైవబలంలేనప్పుడు కొడిగట్టిన దీపంలా (ఓల్టేజి తగ్గిన బల్బులా) అయిపోవటం జరుగుతుంది. గ్రహస్థితి బాగా లేదనుకొంటారు. కాని, నేను "దైవబలం లేదు!" అంటాను. దైవబలం ఉన్నవాడు చేసిన పిచ్చిపనులు కూడా అత్యద్భుతంగా సత్ఫలితాలు అందిస్తాయి. దైవబలం లేనివాడు చాణక్యబుద్ధితో చేసిన మంచిపనులు కూడా సత్ఫలితాలు ఇవ్వవు సరికదా బెడిసికొడతాయి. నాస్తికులు కూడా ఒప్పుకోవలసిన జగత్సత్యం ఇది! దైవబలం ఉన్నరోజుల్లో చేసిన అవినీతి పనులుకూడా అభివృద్ధికి దారితీస్తాయి. ఉత్తమ కార్యాలుగా ప్రఖ్యాతి తెస్తాయి.

దైవబలం లేనిరోజుల్లో చేసే మంచి పనులుకూడా "హంతకుడు"గా నిరూపిస్తాయి. మనుషులకు కాలాలు మూడు కాదు "రెండే!" అన్నాడు ఒక లోకజ్ఞుడు: 1) కానికాలం, 2) కలిసొచ్చేకాలం! దీనికి. ఒక దృష్టాంతం చెప్పుకొందాం.

రెండు అంగవస్త్రాలు - ఒక రాగి చెంబు - యావదాస్తిగా ఒక బ్రహ్మచారి దేవాలయంలో ఉంటున్నాడు. గ్రామంలో భిక్షాటనంతోను, అర్చకుడిచ్చే తీర్థ ప్రసాదాలతోను, పొట్టపోషించుకొంటూ, దైవధ్యానంతో జీవితం గడుపుతున్నాడు.

ఆ బ్రహ్మచారి దేవాలయ మండపం మీద ఒక రాత్రి నిద్రిస్తున్నాడు. స్వప్నంలో లక్ష్మీదేవి "నేను వస్తా! నేనువస్తా!" అంటోంది. నిద్రలో కూడా జ్ఞానం కోల్పోని ఆ బ్రహ్మచారి, "తల్లీ! నీవు ఎప్పుడు వెళ్లిపోతావో కూడా చెప్పు!" అన్నాడు. అప్పుడు ఆ

మహాలక్ష్మి "ఏఉదయం నీభార్య సర్వాభరణభూషితమై, తలవిరబోసుకొని, 'పనివాళ్లు లేరు - చూసేవాళ్లు లేరు - ఎవ్వరికీ బాధ్యతలేదు - చేసేవాళ్లు లేరు!' అంటూ మేడమెట్లు దిగుతుందో, ఆ రోజు నేను వెళ్లిపోతాను" అంది. కళ్లు తెరిచాడు - కోడికూత విన్నాడు. "తాను ఎలా ధనికుడు కాబోతున్నాడు?" అనేది సాక్షీభూతుడుగా ఉండి చూస్తున్నాడు-అహంకార-ఫలాపేక్షలకు అతీతుడై, ఆ బ్రహ్మచారి!

తెల్లవారింది. ఆ బ్రహ్మచారి కొల్లాయిపంచె భుజాన వేసుకొన్నాడు. చేతితో చెంబు పట్టుకొన్నాడు. దేవాలయ ప్రాకారం దాటి, రాజమార్గం ప్రవేశించాడు. కోటగుమ్మం చేరాడు. ద్వారపాలకలు ఎవ్వరూ నిరోధించలేదు-లోపలకు వెడుతున్నాడు. ఎవ్వరూ ఆటంకపరచలేదు. అంతఃపురంలోనికి ప్రవేశించాడు. హంసతూలికాతల్పంమీద మహారాణి కూర్చొని ఉన్నది. ఆమెను హఠాత్తుగా కౌగిలించుకోబోయాడు. ఆమె తల్పంమీదనుండి క్రిందకు తప్పుకుంది! ప్రక్కనే ఉన్న మహారాజు ఒరలోంచి ఖడ్గంతీసి పైకెత్తాడు. ఆ పాన్పు మీద దబ్బుమని నల్లత్రాచు పడింది. ఎత్తిన ఖడ్గంతో రాజు ఆ సర్పాన్ని నరికివేశాడు. "స్వామీ! మీరు సమయానికి వచ్చి నా భార్యను రక్షించారు. మమ్మల్ని కాపాడిన దైవం మీరే!" అన్నాడు మహారాజు. ఆ విప్రయువకుడు ఆ రాజదంపతులకు సాక్షాత్తు దైవంగా కనిపిస్తున్నాడు. ఈ సన్నివేశం ఒక్కసారి ఆలోచిద్దాం. రాజమహలు ద్వారపాలకులు బ్రహ్మచారి లోపలకు ప్రవేశించటం చూడలేదు! అంతఃపుర రక్షకులు ఎవ్వరూ ఆటంకపరచలేదు. పాన్పుపై కూర్చున్న రాణిని కామంతోనే కౌగిలించాడు. రాజు ఎత్తిన ఖడ్గంతో బ్రహ్మచారిని ఖండించవలసింది. అందుకే రాజఖడ్గం పైకెత్తాడు. ఈ లోగా రాణి లేవగానే, ఆ పాన్పుమీద నల్లత్రాచు పడింది. బ్రహ్మచారిని ఖండించవలసిన ఖడ్గం ఆ సర్పాన్ని ఖండించింది. శిరశ్ఛేదం పొందవలసినవాడు శిరోధార్యుడయ్యాడు. "దుశ్చేష్టలకు కూడా అందమైన రూపకల్పన ఇస్తుంది కలిసివచ్చేకాలం" అనటానికి ఇంతకంటె ఉదాహరణం అవసరంలేదు. (కానికాలంలో మంచిపని కూడా హత్యాప్రయత్నంగా ఎలా పరిణమిస్తుందో తరువాత తెలియజేస్తాను)

బ్రహ్మణబ్రహ్మచారి రాజదంపతులకు రెండుచేతులతో కన్పించుటలేదు; చతుర్భుజుడుగానే గోచరిస్తున్నాడు. మహారాజుకు సతిభిక్షపెట్టిన సర్వేశ్వరుడుగానే సాక్షాత్కరిస్తున్నాడు. రాజాజ్ఞ ప్రకారం బ్రహ్మచారికి, ఆయుష్కర్మ - అభ్యంగనస్నానాలు పూర్తి అయ్యాయి చీనిచీనాంబరాలు ధరింపజేశారు. సింహాసనంమీద కూర్చుండ బెట్టారు. రాజపురోహితులను రప్పించి, చక్కని వధువును అన్వేషింపజేశారు. కల్యాణం

క్షణాలలో త్రోసుకువచ్చింది. రాజాంతఃపురానికి అందుబాటులో అందమైన మేడలో, నూతన దంపతులకు, సకల రాజోపచారాలూ జరిగిపోతున్నాయి. ఆ మేడలో గృహప్రవేశానికి ముందుగా, ఆ బ్రహ్మచారి, అంతవరకు తనకు సర్వసంపదగా ఉన్న "రెండు అంగవస్త్రాలు - ఒక రాగిచెంబు" ఒక మూటగా కట్టి, భద్రపరిపించ వలసిందిగా మహారాజును కోరాడు.

బాపనయ్య క్రొత్తకాపురం రాజభోగాలతో సాగిపోతోంది! రాజుగారికి ఈ విప్రుడు ఆంతరంగిక స్నేహితుడుగా ఉన్నాడు. రాణిగారికి దివినుండి భువికి వచ్చిన దేవుడే! దినములు పరస్పర ప్రతిధ్వనులుగా మంగళప్రదంగా దొర్లిపోతున్నాయి. ఆ భోగాల మధ్య అనాసక్త కర్మయోగంతో సాక్షీభూతుడుగా ఉన్నాడు ఆ విప్రోత్తముడు. తాను పొందుతూ ఉన్న మహాభాగ్యం అంతా లక్ష్మీకటాక్షంగా గ్రహిస్తున్నాడు. **"ముక్తసంగో, అనహంవాదీ, ధృత్యుత్సాహ సమన్వితః"**-ఆసక్తినీ, అహంకారాన్నీ విడిచి - ధైర్యంగా ఉత్సాహంగా ఉన్నాడు. వచ్చినరోజు ఉన్న మహైశ్వర్యానికి, పోయేరోజు కూడా ఉంది - అని ఆ విప్రుడికి తెలుసు. ఆ మహాతల్లి వచ్చిన రోజు తనకు తెలుసు! ఆ క్షణంనుండి తాను పొందుతున్న గౌరవసత్కారాలు చూస్తున్నాడు. రాజద్వారం దగ్గర అడ్డులేదు - అంతఃపురం దగ్గర ఆపేవాళ్లు లేరు! మహారాణిని కౌగిలించిన మహాపరాధానికి రాజానుగ్రహం లభించింది. "ఇదంతా ఆ తల్లి చూపించిన ఎల్లలులేని కరుణాకటాక్షం! నేను నిమిత్తమాత్రుణ్ణి! రెండు అంగవస్త్రాలకు ఒక రాగిచెంబుకు అధిపతిని!" అనుకుంటూ, ఆత్మజ్ఞానంతో ఉన్నాడు.

ఒక ఉదయ సంధ్యాసమయంలో, ఆ విప్రయువకునిభార్య మేడమెట్లు దిగుతోంది. "పనివాళ్లు లేరు! ఉన్నవాళ్లకు బాధ్యతలేదు! చూసేవాళ్లు లేరు! చేసేవాళ్లు లేరు!" అంటూ ఆవేశంతో అంటోంది. ఆ మాటలు విప్రుడు విన్నాడు. "లక్ష్మీకటాక్షం తొలగి పోయేరోజు వచ్చిందనుకొన్నాడు. ఎంత విచిత్రంగా తనకు సంప్రాప్తించిందో, ఆయా సన్నివేశాలు, కళ్లఎదుట తిరుగుతున్నాయి. అనుమతి లేకుండా అంతఃపురప్రవేశం - మహారాణిని, తెలియని శక్తిప్రేరణతో కౌగిలించుకోవటం - మరణశిక్ష పొందవలసిన సన్నివేశంలో రాజదంపతుల కరుణాకటాక్షం పొందటం - ఇదంతా ఆ తల్లి అనుగ్రహమే! మహాసంపదలో - మహారాజ సత్కారాలలో-మహావైభవాన్ని అందించిన ఆ తల్లి, ఈ వైభవాన్ని ఎలా తొలగిస్తుందో? స్థితప్రజ్ఞుడుగా **"దుఃఖేషు అనుద్విగ్నమనాః, సుఖేషు విగతస్పృహః"** (దుఃఖములలో క్రుంగిపోడు - సుఖభోగాలలో ఆసక్తుడుకాడు) అన్నట్లుగా ఉన్నాడు. "ఐశ్వర్యం వచ్చింది. సంపద్గర్వం లేదు. పోయే

సమయం వచ్చింది విచారం లేదు. కేవలం సాక్షిగా చూస్తున్నాడు. ఐశ్వర్యం అంటకుండానే (మమకారం లేకుండా) పొందాడు. అది పోయేరోజును తెలుసు కొన్నాడు. ఇంక బాధ ఏమిటి? చేతులకు ముందుగా నూనె రాసుకొని పనస తొనలు ఒలిచేవాడికి జిగురు అంటదు కదా! ఐశ్వర్యం అంటిన విధానంలో ఆశ్చర్యాలు చూచాడు. పోయే విధానాలలో ఆశ్చర్యాలు కూడా చూడటంకోసం సంసిద్ధంగా ఉ న్నాడు ఆ గుణాతీతుడు!

రాజుగారు సభతీర్చితే, ఈ బాపడు ప్రక్కనున్న ఉన్నతాసనంమీద ఉండవలసిందే! అశ్వారోహణంతో ప్రయాణమైతే, మరో ఉత్తమాశ్వారోహణంతో వెంటరావలసిందే! ఎక్కడకు వెళ్లినా, రాజుగారికి ఛాయలా బ్రాహ్మణుడు ఉండవలసిందే! "అదిలేదు! ఇది లేదు!" అనుకొంటూ విప్రభార్య మేడమెట్లు దిగిన మరుక్షణంలో రాజభటుడు విప్రుని సందర్శించాడు. "రాజుగారు వేటకు వెడుతున్నారు. మీరుకూడా వారితో వెళ్లాలట. సంసిద్ధంగా ఉండమన్నారు. మీకుకూడా ఉత్తమాశ్వాన్ని సిద్ధపరిచినాము" అని చెప్పి సెలవు తీసుకొన్నాడు.

రాజుగారు వేటాడి అలసిపోయారు. భట్టారకుడు కూర్చున్న చెట్టుదగ్గరకు వచ్చాడు. "విశ్రాంతిని పొందుతాను" అన్నాడు రాజుగారు. కూర్చున్న బ్రాహ్మణుని ఊరువును ఉపధానంగా చేసుకొని, మహారాజు చల్లని చెట్టునీడలో గాఢంగా నిద్రపోతున్నాడు. తాను మళ్లీ దరిద్రంలోకి ఎలా పంపించబడతానో? అని ఉత్కంఠగా చూస్తున్నాడు ఆ బ్రాహ్మణుడు. క్రిందటి జీవితసంపద భద్రంగా ఉంచుకొన్నాడు కదా! అతనికి బెంగలేదు – భయంలేదు! **"ధృత్యుత్సాహ సమన్వితః"** (ధైర్యోత్సాహాలంతో ఉన్నాడు.) ఇది జ్ఞాని లక్షణం.

ఈలోపుగా, తన తొడమీద తలపెట్టుకొని, గాఢనిద్రలో ఉన్న రాజుగారి కంఠం మీద కొంగరెట్ట పడింది. (రెట్టలను పదునైన తాటాకుతో గీసి తొలగిస్తారు. రాజుగారి మెడమీద పడి కారుతున్న కొంగరెట్టను చూడలేకపోయాడు. కదిలితే రాజుగారికి నిద్రాభంగం అవుతుంది. కదలకుండా ఆ రెట్ట తొలగించాలి! ఎలా?

ప్రక్కకు ఒత్తిగిలి పరున్న రాజుగారి కత్తి, ఒరలోంచి సగం జారి కన్పిస్తోంది. రాజకంఠంమీద ఉన్న రెట్టను ఆ కత్తి పదనుతో గీసివేద్దామని సత్సంకల్పం చేశాడు. చురకత్తి (క్షైజారులాంటి పొడిచే కత్తి) ఆ బ్రాహ్మడు నెమ్మదిగా తీశాడు. నిద్రాభంగం కాకుండా గీసివెయ్యాలనుకొన్నాడు. చురకత్తి గుప్పిటతో పట్టి, రాజుగారి కంఠంమీద పెట్టి, రెట్ట తొలగించబోయాడు.

ఒక్కసారిగా రాజుగారు, రెండు కళ్లూ తెరిచారు. గుప్పిటిలో బాకుతో ఉన్న బాపనయ్యను-కంఠం పొడువబోతున్న వాణ్ణి రెండుకళ్లతో చూచారు. సర్వసన్నద్ధంగా లేచి, "ఎవరక్కడ?" అని అరిచాడు రాజుగారు. పిలుపు అందే దూరంలో, రాజాజ్ఞ కోసం ఉన్న భటులు వచ్చారు. "వీడిని బంధించండి!" అన్నాడు క్రూరంగా మహారాజు! ఏదో చెప్పబోతున్నాడు విప్రోత్తముడు! ఈ లోగా బంధించారు. "నువ్వు నాకు ఏమీ చెప్పనక్కరలేదు! నా రెండు కళ్లతో చూచిన దానికి - నీవు చెప్పటం, నేను వినటం, అక్కరలేదు!" అన్నాడు. ఆ విప్రుడికి దైవశక్తి ప్రభావం పూర్తిగా అర్థమయింది. "కాని కాలం" అని తెలిసింది.

రాణిగారిపై చేసిన అత్యాచారం దుష్కార్యం! అది మహోపకారం అయింది. రాజుగారికి "సతిభిక్ష"గా గోచరించింది. ఆ సన్నివేశంలో తాను దైవస్వరూపుడుగా నిలబెట్టబడ్డాడు. అప్పుడు దైవబలం తనకు ఉంది!

ఈనాడు రాజుగారి కంఠంమీద ఉన్న మాలిన్యం తొలగించటానికి చేసిన సత్కార్యం హత్యానేరంగా మారింది. తిరుగులేని రాజహత్యానేరం! సాక్ష్యం అక్కరలేని హత్యాప్రయత్నంగా నిశ్చయింపబడింది! దైవబలానికి సాష్టాంగంగా నమస్కరించాడు మానసికంగా!

## (3) అహంకారం

### అహంకారం-1:-

భగవంతుడు తన ప్రపంచం ఎలా ఉండాలో-ఎక్కడి ఏర్పాట్లు ఎలా చెయ్యాలో చాలా ఆలోచించి ఆయా ఏర్పాట్లు చేశాడు. దైవసృష్టినిగురించి, తప్పుపట్టే అజ్ఞానులున్నారు. "రెండు కళ్లూ ముందెందుకండీ! ఒక కన్ను వెనకపెట్టి ఓ కన్ను ముందు పెడితే, ఎంత బాగుంటుంది? పుట్టించాడు! అలా వదిలెయ్యవచ్చు కదా! చావు ఎందుకు పెట్టాడండి? ముసలితనం ఎందుకండి? సుఖాలతో హాయిగా ఉండే ప్రాణులకు, దుఃఖాలు ఎందుకు పెట్టాడండీ?" అంటూ భగవత్సృష్టిని తప్పుపట్టే "అహంభావులు"న్నారు. భగవత్సృష్టిని అర్థంచేసుకోవటానికి ప్రయత్నించినవాళ్లు విజ్ఞానులు - దైవాన్ని తప్పుపట్టేవాళ్లు అజ్ఞానులు! దైవాన్ని తప్పుపట్టి, తమ తప్పు తాము తెలిసికొన్నవాళ్లు, వైరానుబంధ దైవభక్తులు! ఒక బాటసారి ఎండలో ప్రయాణించి అలసిపోయి, ఒక మఱ్ఱిచెట్టు క్రిందకు చేరాడు. పైపంచ పరుచుకొని ఎండుటాకులపై వెల్లకిల పరున్నాడు. వటవృక్షశాఖలు ఎఱ్ఱటి పండ్లతో కనిపిస్తున్నాయి. ఆ పండ్లు గోలీల ప్రమాణంలో కనిపిస్తున్నాయి. చూస్తూ ఆ ప్రక్కకు ఒత్తిగిల్లాడు. అక్కడకు

దగ్గరలో గుమ్మడిపాదు కన్పిస్తోంది. దానికాయలు "మద్దెలలు" అన్నంతగా పెద్దగా ఉన్నాయి. కండ్లు మూశాడు. ఆలోచనలు "ఇంత పెద్దచెట్టుకు అంత చిన్నకాయలా? అంత చిన్న తీగకు ఇంత పెద్దకాయలా? అంత చిన్న తీగకు, ఇంత పెద్దకాయలు అయితే – ఆ తీగకంటె ఈ చెట్టు ఎన్నిరెట్లు పెద్దది? అన్ని రెట్లుగా ఈ మఱ్ఱికాయలు ఉండాలి కదా! దేవుడు తెలివితక్కువవాడు!" అని నిశ్చయం చేశాడు. ఆలోచనలు ఆగిపోయాయి. ప్రయాణబడలికతో నిద్రపోయాడు. గంట దాటాక లేచాడు. తన ఒంటిమీద పది–పదిహేను మఱ్ఱిపండ్లు రాలిపడి ఉన్నాయి. లేచి కూర్చున్నాడు మఱ్ఱిపండ్లు దులుపుకొంటూ. మళ్ళీ గుమ్మడిపాదువంక చూచాడు. గుమ్మడితీగనుబట్టి, మఱ్ఱిచెట్టుపండ్ల ప్రమాణం, భగవంతుడు పెంచి ఉంటే, పైనున్న మఱ్ఱిపండ్లు ఎంతగా ఉంటాయో అర్థమయింది. "ఇన్ని పండ్లు మీద పడ్డా బ్రతికే ఉన్నాను. నా లెక్క ప్రకారం అంత పెద్దవిగా మఱ్ఱిపండ్లు ఉంటే? ఇన్ని కాయలెందుకు? ఒక్కకాయతోనే నాకు కపాలమోక్షం అయ్యేది! బ్రతుకు జీవుడా!" అని లేచి "భగవంతుడు నిజంగా దయామయుడు! చల్లని నీడను ఆశ్రయించి చేరే ప్రాణుల సంక్షేమంకోసమే, ఈ కాయలు చిన్నవిగా సృష్టించాడు. భగవానుడు కరుణామయుడు!" అనుకొంటూ, భగవంతుని సృష్టిని తప్పుపట్టినందుకు తనను తాను నిందించుకొంటూ, "పాపోహం! పాపోహం!!" అనుకొంటూ, తనదారిన తాను వెళ్లిపోయాడు! అహంకారం ఆత్మవిశ్వాసంగా మారనంతవరకు అది తప్పుత్రోవ పట్టిస్తుంది.

ప్రపంచంలో చాలామంది తమను తాము "తెలివైనవాళ్ళం" అనుకొంటారు, అది ప్రమాదం కాదు. ఇతరుల్ని "తెలివి తక్కువవాళ్ళు" అనుకొంటారు; అదీ తప్పులేదు! ఇతరుల తప్పులెన్ని నిరూపిస్తారు. తత్ఫలితంగా చాలామందికి శత్రువులవుతారు; శత్రు సంఖ్య పెంచుకొంటారు. ఈ కథలో బాటసారి భగవంతుని సృష్టిని తప్పుపట్టాడు. "తాను తెలివైనవాడు"అని అనుకొన్నాడు. అంతవరకు అజ్ఞానం అయినా తన తప్పు తాను తెలిసికొని, బ్రహ్మంత విజ్ఞానికూడా అయ్యాడు. అందుకే దైవకథలకెక్కి ప్రసిద్ధుడయ్యాడు.

**అహంకారం–2:–**

బ్రతకాలన్నా, చావాలన్నా, దైవనిర్ణయం ప్రకారమే జరుగుతుంది. Man proposes but God disposes. అహంకార – మమకారాలు అజ్ఞాని లక్షణాలు. అహంకార – మమకారాలు అజ్ఞానం. దారి ప్రక్క చెట్టు. ఆ చెట్టునీడలో ఒక సన్న్యాసి.

తలకు దగ్గరగా కమండలం పెట్టుకొని పరున్నాడు. దారినపోయే దానయ్య ప్రక్కవాడితో "ఈ సన్యాసి కమండలం తలకు దగ్గరగా పెట్టుకొని పరున్నాడు. ఈయనకు మమకారం ఎక్కువే!" అన్నాడు. ఆమాట విని సన్యాసి చేతితో కమండలం తీసి, తన కాళ్ల దగ్గరకి విసిరాడు. ఈయనకు "మమకారమే కాదు, అహంకారంకూడా ఎక్కువే!" అన్నాడు దానయ్య!

**అహంకారం (యథానిక)-3:-**

చావాలని అనుకొన్న ఒక నర్తకి, గుడివాడలో సర్కార్ ఎక్స్‌ప్రెస్ క్రింద పడి, తడబడి ఒక కాలుపోగొట్టుకొంది. ఒంటికాలుతో నాట్యపాఠాలు చెపుతూ 70 ఏళ్లు జీవించింది. "ఇంకా చాలాకాలం బ్రతుకుతాం!" అనుకొంటూ, కొల్లలుగా ఆశలు అల్లుకుంటూ, ముప్ఫైలోపలే బ్రతుకు తెల్లారిపోయిన వాళ్లని ఎందర్నో చూస్తున్నాం. "నేను బ్రతుకుతాను!" అనటం ఎంత అహంకారమో; "నేను ఛస్తాను!" అనుకోవటం కూడా అంతటి అహంకారమే! మన నిర్ణయాలు, దైవనిర్ణయానికి దాసోహం కావలసిందే!

**అహంకారం-(యథానిక)-4:-**

నాకు ఆప్తమిత్రుడు, నాకంటె 7 సం॥లు పెద్దవాడు, మా ప్రక్కవీథిలో ఉండేవాడు. ఆయనకు గుండెవ్యాధి ఏదో ఉండేది. 70 ఏళ్ల వయస్సులో ఒకరోజు మాయింటి దగ్గర కష్టసుఖాలు మాట్లాడుతున్నాడు. "నా ఆరోగ్యపరిస్థితి ఏమీ బాగాలేదు సోమయాజులుగారూ! మా అమ్మాయికి పెళ్లిచెయ్యకుండానే కళ్లుమూస్తాను!" అన్నాడు. నేను "అహంకారమా?" అన్నాను. ఆయన వినయంగా (ఆయన నాలాగే భగవద్గీతా భక్తుడు) "కాదండి! మీతో చెపుతున్నాను" అన్నాడు. "నిర్ణయం మీరు చేస్తున్నారు - అంటే అది అహంకారమే!" అన్నాను కటువుగా. "మా అమ్మాయికి ముప్ఫైఆరు దాటి పోతున్నాయండి! నా ఆరోగ్యం రోజురోజుకీ క్షీణిస్తోంది. నా మీద నాకు నమ్మకం లేదు!"-"భగవంతుడి మీద కూడా నమ్మకం లేదా?"-"అదికాదండి!...."- "ఇంక ఏమీ మాట్లాడకండి! నేను మా అమ్మాయికి పెళ్లి చెయ్యలేను! అనే మాట పూర్తిగా అహంకారమే! మీ అహంకారానికి, (భగవంతుడికి)క్షమాపణ చెప్పుకోవలసి వస్తుంది." - "లెంపలు వాయించుకొంటాను!" అన్నాడు ఆ దైవభక్తుడు. ఆయన మా పట్టాభిరామారావుగారు! బి.ఏ., బి.ఎడ్.

**"యద్యహంకార మాశ్రిత్య - నయోత్స్య ఇతి మన్యసే**

**మిథ్యైష వ్యవసాయస్తే - ప్రకృతి స్త్వాం నియోక్ష్యతి"** (భగవద్గీత, 18-59)

అనే శ్లోకం వివరించాను. మా సంభాషణ జరిగిన మూడవనాటి రాత్రి, అర్ధరాత్రి వేళ, నూజివీడునుండి ఒక మాస్టరుగారు వచ్చి, వారి తలుపుతట్టారు. "హనుమాన్ జంక్షనులో 40 సం॥ల మాస్టరుగారికి భార్యావియోగం జరిగింది; మీ దగ్గర ఆయనకు ఈడైన అమ్మాయి ఉందని విని వచ్చాను" అన్నాడు. మర్నాడు "పెళ్లిచూపులు" - వారం రోజుల్లో వివాహం!! ఆ సమయానికి మా మిత్రుడు లేవలేని స్థితిలో కాళ్లుకడిగి, మంచం మీద పడుకున్నాడు. మళ్లీ లేచి, కన్యాదానం చేసి, మళ్లీ మంచం మీద పరున్నాడు - సంతోషంగా. జరుగదనుకొన్న కన్యాదానం, లేవలేనిస్థితిలో బలవంతంగా తనచేత చేయించిన పరమాత్మకు పదివేల సాష్టాంగ నమస్కారాలు సమర్పించుకొన్నాడు మానసికంగా. "మా అమ్మాయికి పెళ్లి చెయ్యలేను!" అనటం ఎంత దైవాపచారమో పూర్తిగా అర్థమైంది ఆయనకు ఆనందంతో.

## (4) చావు - బ్రతుకులు

"చావటం" - "బ్రతకటం" నిర్ణయించే హక్కు మనకు లేదు. బ్రతకటానికీ - చావటానికీ, దైవనిర్ణయమే తుది తీర్పు! మన శక్తిసామర్థ్యాలు కాని, మనకున్న అవకాశాలు కాని - అవకాశాలు లేకపోవటం కాని, దైవనిర్ణయం ముందు ఎందుకూ పనికిరావు! బ్రతికే అవకాశాలు ఆధారాలు ఎన్నో ఉన్న బలవంతుణ్ణి బలిపెట్టి, ఏ కోణంలోనూ - ఏ ఆధారం లేని నిరాధారుణ్ణి పరిరక్షించిన పరంధాముడి లీల తలచుకొందాం!

ఒక రాత్రివేళ బలమైన మూషికం ఆహారంకోసం ఎగురుతూ పరుగులు తీస్తోంది. పదిరోజుల క్రిందట ఒక యింటివారు "మోరుమేన్ పెట్టె" (ఇత్తడి కట్టులు ఉన్న కఱ్ఱపెట్టె) తెరచి మరచిపోయారు. ఆ పెట్టెలో ఒక పాము ప్రవేశించింది. పెట్టె మూసి, ఇంటివారు ఇల్లు తాళంపెట్టి వెళ్ళిపోయారు. పదిరోజులుగా, ఆ సర్పానికి ఆహారం లేదు. ప్రాణాధారమైన వాయువుకూడా లేదు. క్షణక్షణంగా కృశించి పోయింది. దారిలేదు. బ్రతికే ఆధారంలేదు! మరణమే శరణమని నోరు చెరచి, మరణోన్ముఖంగా ఉంది. చావు నిశ్చయించుకొంది.

ఆహారంకోసం బయలుదేరిన ఎలుక, బ్రతుకుమీద నమ్మకంతో ఉంది, దేహబలంలో ఉంది! ఎంత బలమైన దానికైనా రంధ్రం చేసి, ఆహారం సాధించగలను - అనే ఆత్మవిశ్వాసంతో - ఉత్సాహశక్తితో ఉంది. ఈ ఎలుక ఆ నిర్జనగృహంలో, నిశ్శబ్ద వాతావరణంలో ఆహారాన్వేషణ చేస్తోంది. ఆహారం దొరకలేదు. "మోరు మేన్ పెట్టె" కన్పించింది. ఇందులో తన కడుపునిండే ఆహారం లభిస్తుందని కొండంత

ఆశపెట్టుకొంది. రెట్టించిన ఉత్సాహంతో పెట్టెకు రంధ్రం చేసింది. ఒక్కదూకులో పెట్టెలోపలికి దూకింది.

పదిరోజులుగా ఆహారం లేక – ప్రాణాధారమైన వాయువులేక–పోవటానికి దారిలేక – నోరు తెరచి మరణోన్ముఖంగా ఉంది ఆ మహాసర్పం! సర్వశక్తి సంపన్నమైన మూషికం, సర్పంనోట్లోకి ఆహారకబళంలా పడింది. సర్పానికి శక్తివచ్చింది. ప్రాణ వాయువు అందింది! దారి దొరికింది! బ్రతుదామని పెట్టెకు రంధ్రం చేసిన ఎలుక, సర్పానికి ఆహారంగా మారింది! పైగా, మార్గదర్శి అయింది! "దైవకృతములు ఒక్కప్డు దైవమునకె వశము కావన్న ఇంక ఎవ్వరికి వశము?" అన్నారు తిరుపతి వేంకట కవులు. దైవనిర్ణయం పూర్తి అయ్యాక గ్రహించవలసిందే కాని, ముందు మన ఊహలకు అందదు! ఈ సత్యాన్ని సుభాషితంగా అందించాడు భర్తృహరి కవీంద్రుడు. ఈ సందర్భంలో ఏనుగు లక్ష్మణకవి అనువాదం ఆంధ్రపద్యం చదువుకొందాం!

**ఉ॥ రాతిరి మూషకంబు, వివరణంబొనరించి, కరండబద్ధమై**
**భీతిలి–చిక్కి–ఆసచెడి–పెద్దయు దస్సిన పామువాత సం**
**పాతముఁ జెందె! దానిఁ దిని–పాము దొలంగె బిలంబు త్రోవనే!**
**ఏతతి హానివృద్ధులకు నెక్కటి దైవమ కారణంబగున్!**

## (5) విధివ్రాత

బ్రహ్మవ్రాత–కర్మ అనే విషయాలు ఆలోచిస్తూ జ్యోతిషాన్నిగురించి ప్రస్తావించాము. కర్మ ఎవరికీ తప్పదు అనుకొన్నాం. "బ్రహ్మవ్రాత"ను గురించి ఆలోచిస్తే ఇంక జ్యోతిశ్శాస్త్రం ఎందుకు? అనిపిస్తుంది. ఈ శాస్త్రంవల్ల ఎందరో జీవిత ప్రయోజనాలు పొందుతున్నారు. ధైర్యస్థైర్యాలు కోల్పోయిన వాళ్లను వీపుతట్టి, ధైర్యం చెప్పి, బ్రతుకుబాటలో నడిపిస్తోంది ఈ జ్యోతిశ్శాస్త్రం! దానికంటే బ్రహ్మవ్రాత బలీయమైంది ఏమో – అనిపిస్తుంది.

**శ్లో॥ "ఆయుః, కర్మ చ, విత్తం చ, విద్యా, నిధన, మేవ చ,**
**పంచైతాన్యపి, సృజ్యంతే గర్భస్థస్యైవ దేహినః"** (–హితోపదేశం)

1. ఆయుర్దాయము, 2. వృత్తి, 3. ధనం, 4.విద్య, 5. ఎప్పుడు ఎలా మరణించాలి –అనే ఐదూ, ప్రతివ్యక్తికీ, తల్లిగర్భంలో ఉన్నప్పుడే, నొసలిపై బ్రహ్మ వ్రాసి ఉంచుతాడు. అలాగే జరుగుతుంది. అది విధివ్రాత! దానికి తిరుగులేదు! మానవుడు జీవితంలో చేసే కృషి అంతా ఆ విధివ్రాతకు లోబడి ఉంటుంది. చాలామంది అంటూ ఉంటారు–

"జీవితంలో నన్ను ఎవరో చెయ్యిపట్టుకొని నడిపించుకుపోయినట్లుగా ఉంది" అని. విధి (దైవనిర్ణయం) జరిగితీరుతుంది. "విధి అవశ్యప్రాప్యము! అద్దాని నెవ్వరు తప్పింపలేరు!" అంటాడు "బలిజేపల్లి" సత్యహరిశ్చంద్ర నాటకంలో. తల్లిగర్భంలో ఉండగా బ్రహ్మ వ్రాసిన నొసటి వ్రాతను, హరిహరులేకాదు, బ్రహ్మ కూడా మార్చుకోలేడంటూ-

**శ్లో॥ "హరిణాపి, హరేణాపి, బ్రహ్మణాపి, సురైరపి,**
**లలాటలిఖితా లేఖా, పరిమార్ష్టుం న శక్యతే."**

(ఒకసారి బ్రహ్మదేవుడు నొసటిపై వ్రాసిన వ్రాతను, హరి-హరులు, బ్రహ్మాది దేవతలు కూడా మార్చలేరు) అందుకే "రాతకు ఇన్ని రాతలు లేవు! వాణ్ణి కన్నాం కాని, వాడి రాత (బ్రహ్మవ్రాసిన పంక్తుల)ను కనలేం కదా! వాడికి రాసిపెట్టినట్టు, జరుగుతుంది! సరే! కానివ్వండి!" అంటూ ఉండేది మా అమ్మగారు. బ్రహ్మవ్రాతను ఎవ్వరూ చదవలేరు. ఎవడి వ్రాతలోనైనా అక్షర స్పష్టత లేకపోతే "వాడిది బ్రహ్మరాత!" అంటారు. అది ఆ బ్రహ్మగారికే తెలియాలి! బ్రహ్మ మానసపుత్రుడు కదా నారదుడు! తండ్రివ్రాతను ఆయన చదవగలడు అంటారు. ఒకప్పుడు తండ్రివ్రాతలో తప్పుపట్టి నారదుడు తెల్లబోయిన "తలవ్రాత" కథ ప్రచారంలో ఉంది. దానిని అనుకొందాం-

## (6) "కించిత్ భోగం భవిష్యతి"

త్రిలోకసంచారి అయిన నారదుడు సముద్రతీరంగా ఆకాశమార్గంలో పయనిస్తున్నాడు. ఆ ఒడ్డుమీద ఒక మానవ కపాలం కన్పించింది. దానిమీద తండ్రి గారి దస్తూరీ స్పష్టంగా కన్పిస్తోంది. తండ్రిగారిపై తనకున్న అభిమానం ఉప్పొంగింది. క్రిందకు దిగివచ్చి ఆ కపాలం రెండు చేతులతో పట్టుకొని, నాన్నగారి వ్రాత ఆనందంతో చదువుతున్నాడు:-

**శ్లో॥ "జన్మప్రభృతి దారిద్ర్యం, దశవర్షాణి బంధనమ్,**
**సముద్రతీరే మరణం, కించిద్భోగం భవిష్యతి"**

పుట్టినది మొదలుగా కటికి దరిద్రం అనుభవిస్తాడు. పది సంవత్సరాలు కఠిన కారాగార శిక్ష పొందుతాడు. చివరకు సముద్రతీరంలో దిక్కులేని చావు చస్తాడు. కొంచెము భోగము వీనికి లభిస్తుంది! మొదటి మూడూ అర్థమయ్యాయి. దివ్యదృష్టితో భూతకాలంలోకి చూచాడు - అలాగే జరిగాయి! దరిద్రం అనుభవించాడు! జైలు శిక్ష పొందాడు! సముద్రతీరంలో మరణించాడు! మరణంతో వాడి జాతకం అయిపోయింది.

– ఇంకా “కొంచెం భోగం అనుభవిస్తాడు” అని వ్రాశాడేమిటి? వార్ధక్యంలో మా తండ్రికి మతిపోయింది. ఏమిటి ఈ పిచ్చిరాత? “గట్టిగా నాన్నను మందలిస్తాను!” – అనుకొన్నాడు. ఆ దిక్కులేని దరిద్రుడి పుఱ్ఱెను, సముద్రస్నానం చేయించాడు. నడుముకు కట్టిన పంచెతో తుడిచాడు. నిరంతరంగా నారాయణనాదం చేసే మహతికి దాన్ని తగిలించాడు. భువర్లోక – సువర్లోక – వైకుంఠాది లోకాలు దాటి బ్రహ్మలోకం చేరాడు. అడుగుపెడుతూనే “ఏమిటయ్యా ఈ రాతలు? నీ మతి సరిగ్గా పనిచెయ్యక పోతే, ఓ లేఖకుణ్ణి పెట్టుకో! లేకపోతే సమర్థుడ్ని చూచి, రాత అప్పగించు! అంతేగాని పిచ్చి పిచ్చి రాతలు రాయకు! తలెత్తుకు తిరగలేక పోతున్నాను” అన్నాడు – తండ్రి దగ్గర చనవుతో మందలిస్తూ. బ్రహ్మదేవుడు, ఏదో కొండంత తప్పుదొర్లి పోయిందని, ఖంగారు పడ్డాడు. వయస్సులో ఉన్న కొడుకు కేకలకు, ముసలి శరీరం ముడుచుకు పోయింది! “ఏం రాశాను రా నాయనా? చదువు!” అన్నాడు హీనస్వరంతో. నారదుడు గొంతెత్తి చదువుతున్నాడు. బ్రహ్మగారు ఎనిమిది చెవులతో వింటున్నాడు. “1. దరిద్రం అనుభవించాడు కదా!, 2. జైలులో ఉన్నాడు కదా! 3. సముద్ర తీరంలో దిక్కులేకుండా మరణించాడు కదా! ఇంక నీసందేహం ఏమిటి నాయనా!” అని ప్రశ్నించాడు. “చచ్చిపోయిన తరువాత వీడికి ఈ శరీరంతో – ‘కొంచెంభోగం లభిస్తుంది!’ అని వ్రాశావయ్యా! చచ్చిపోయాక భోగం ఏమిటయ్యా పిచ్చినాన్నా!” అన్నాడు వెక్కిరింతగా. “1–2–3 పంక్తులు రాతప్రకారం జరిగాయి కదా! చచ్చాక భోగం ఏమిటి? అని కదా నీ సందేహం? నా వ్రాతను, నన్ను సందేహించకు నాయనా! నీకు ఆయుక్షీణం! నా రాతను ‘బ్రహ్మవ్రాత’ అన్నారు. చచ్చినా విడిచిపెట్టదు! విను! చచ్చిపోయాడు. శరీరం జలజంతువులు భక్షించాయి. శిరస్సు సముద్రం ఒడ్డున పడి ఉంది – ‘సుఖప్రారబ్ధ భోగంకోసం!’ నిరంతరం తాతగారి స్మరణలో ఉండే నీవు, ఆ అనాథ కపాలం రెండు చేతులతో పైకెత్తావు. సముద్రజలాల్లో శుభ్రంగా కడిగావు. అప్రయత్నంగా అష్టాక్షరీ మంత్రం ఆలపించే నీ వీణకు తగిలించావు – ఇదే భోగం అనుకొంటాము! ఇంకా నా వ్రాత ఫలితం పూర్తికాలేదు! ఆ పుఱ్ఱెను పుణ్యంలోకాలన్నీ త్రిప్పావు! నా దాకా తీసుకొచ్చావు. నేను ‘కించిద్భోగం’ అన్నాను కాని ఆ అనాథుడికి ‘మహాభోగం’ లభించింది నాయనా!” అన్నాడు బ్రహ్మగారు. కొడుకు నోరు మూసుకున్నాడు!

## (7) భక్తవత్సలుడు

దైవంవల్ల సృష్టిని పొంది – దైవరక్షణలో జీవిస్తూ “దైవం లేదు” అనటం మహాపచారం. తండ్రి పోషణలో – రక్షణలో ఉండి, తండ్రిని దూషించే వాళ్లని మనం

చూస్తున్నాం! అలాంటి కొడుకుల్ని పూర్తిగా విసర్జించిన తండ్రుల్నీ చూస్తున్నాం. దైవం అలా విడచిపెట్టడు! రక్షిస్తూనే ఉంటాడు. దైవం మనకు కల్పించే సన్నివేశాలు, జ్ఞాననేత్రంతో దర్శిస్తే, దైవసాక్షాత్కార భాగ్యం పొందుతాము!

ఒకప్పుడు కొందరు భక్తులు భగవంతుని లీలలు చెప్పుకొంటూ ఆనందిస్తూ ఉన్నారు. ఆ భక్తసంఘం దగ్గరకు ఒక నాస్తికుడు (జాబాలి మతస్థుడు) వచ్చి "దైవము లేదు" అంటూ "వితండవాదం" ఆరంభించాడు. "దేవుణ్ణి మానవులు సృష్టించుకొన్నారు. సృష్టికర్త దేవుడు కాడు-స్త్రీ పురుష సమ్మేళనతో కామహేతుకంగా ఏర్పడుతోంది సృష్టి. ఈ సృష్టిఅంతా పాంచభౌతికం. పంచభూతాలు ప్రకృతిలో సహజంగా ఉన్నశక్తులు! ఈ శక్తుల సమ్మేళనంతో ప్రపంచం ఏర్పడుతోంది. అనుకూల పరిస్థితుల్లో అభివృద్ధి పొందుతోంది. వ్యతిరేక పరిస్థితుల్లో మళ్లీ పంచభూతాలలలో కలిసిపోతోంది. దీనికి కర్త ఎవ్వడూ లేడు! పోషణచేసేవాడు అంతకన్నాలేడు! పుట్టుట - పెరుగుట - సంతానమును కనుట - నశించుట చరాచరప్రాణుల లక్షణం. ప్రకృతి లక్షణాలతో పుట్టి, ప్రకృతి శక్తులతో పెరిగే ప్రపంచాన్ని 'ఎవరో పోషిస్తున్నాడు' అనుకొనటం అవివేకం. 'నేను అన్నం తినను!' అని కూర్చుంటాను. 'ఏ పనీ చెయ్యకుండా నాకు అన్నం పెడతాడా మీ దేవుడు? చెప్పండి!" అని సూటిగా దైవభక్తుల్ని ప్రశ్నించాడు. భక్తులు ఏ కొంచెమూ జంకలేదు. దైవవిశ్వాసంనుండి వీసమంత కూడా చలించలేదు "అన్నం తెచ్చి పెడతాడు ఆ పరమాత్మ. దైవాన్ని జ్ఞాననేత్రంతో సందర్శించాలి! చర్మచక్షువులకు గోచరం కాదు! జరుగుతూ ఉన్న పనులు - ఆయా సన్నివేశాల కల్పనలు - జ్ఞానదృష్టితో పరిశీలిస్తే, జ్ఞాననేత్రానికి గోచరిస్తాడు! నీవు ఏ పనీ చెయ్యకుండా, ఎవరికీ కనిపించకుండా దాక్కొన్నా, నీకు అన్నం పెడతాడు! తల్లి బుగ్గగిల్లి ఉగ్గుత్రాగించినట్లు ఆ పరమాత్మ ఏదో ఒక రూపంలో వచ్చి, నీచేత అన్నం తినిపిస్తాడు!" అని శపథంగా చెప్పారు.

"ఇదిగో! వెళ్ళిపోతున్నా! ఎవ్వరికీ కనిపించకుండా దాక్కుంటూ! మీకు కూడా తెలియకుండా దాక్కుంటా! నా చేత దేవుడు అన్నం ఎలా తినిపిస్తాడో చూస్తా!" అన్నాడు. "మీరూ - మీ దేవుడూ నన్ను ఏమీ చెయ్యలేరు. మీకు నేను కనిపించను కదా! మీ దేవుడు లేనేలేడు!" అంటూ వెళ్లిపోయాడు ఆ పరమనాస్తిక చక్రవర్తి! రాత్రి చీకటిలో అడవిదారిలో వెళ్లి వెళ్లి ఒక మఱ్ఱిచెట్టు ఎక్కాడు. పైన ఉన్న గుబురులో నక్కి కూర్చున్నాడు. "నన్ను ఎవ్వరూ కనుక్కోలేరు!" అని బంకపట్టుగా కూర్చున్నాడు. నిజంగా చూడలేరు. ఎవ్వరూ చూడలేరు!

ఒకరోజు గడిచింది. రెండవ రోజు తెల్లవారింది. దైవం చక్రం త్రిప్పుతున్నాడు. జాము ప్రొద్దెక్కింది. ఒక బాటసారి ప్రయాణశ్రమతో అలసిపోయి ఆ మఱ్ఱికిందకు చేరాడు. తెచ్చుకొన్న అన్నం మూటను మఱ్ఱి కొమ్మకు తగిలించి, పైపంచ పరచుకొని, శయనించాడు. ఈలోగా దూరంలో పెద్దపులి గాండ్రింపు వినిపించింది. ఉలిక్కిపడి లేచిన బాటసారి భయంతో ఖంగారుగా పారిపోయాడు. ఈ లోగా, నలుగురు దొంగలు గడచిన రాత్రి దొంగతనం చేసిన సొమ్ముతో, నిర్జనారణ్యంలో ఉన్న అదే మఱ్ఱిక్రిందకు చేరారు. నిర్భయంగా మూటలు విప్పి లెక్కచూచు కొంటున్నారు – 'అక్కడ ఎవ్వరూ లేరు కదా!' అని. ఈ లోపుగా ఒకడు చెట్టుకు వ్రేలాడుతున్న మూట చూచాడు. మరొకడు విప్పి క్రింద పెట్టి చూచాడు. అన్నం మూట! "మనల్ని చంపటంకోసం విషం కలిపిన మూట ఎవడో ఈ చెట్టుకు కట్టాడు. ఈ కట్టినవాడు ఇక్కడే నక్కి ఉంటాడు – మనం చచ్చాక ఈ సొమ్ము పట్టుకుపోవచ్చును – అని. వెదకండిరా!" అన్నారు. ముగ్గురూ మూడు ప్రక్కలకీ పరుగెత్తారు ఒకడు చెట్టు ఎక్కాడు. చెట్టు ఎక్కినవాడికి దాక్కొన్న నాస్తికుడు కన్పించాడు. వాడు దాక్కున్న భంగిమనుబట్టి వాడే మూటకట్టి దాక్కున్నాడని నిశ్చయించాడు. చెట్టుమీద ఉండగా రెండు కొట్టి, "దిగరా నా కొడకా!" అంటూ వాణ్ణి క్రిందకు తెచ్చాడు.

"విషం కలిపిన అన్నం మూట నువ్వేనా కట్టావ్? చెప్పు చెప్పు?" అని నలుగురూ బాదారు. "నాకు తెలియదు బాబోయ్! నేను కట్టలేదు" అని ఏడుస్తున్నాడు. "నువ్వు కట్టకపోతే ఈ అన్నం నువ్వు తిను!". "నేను తినను!" అన్నాడు. మళ్లీ కొట్టారు. "నేను తినను!" (భక్తుల దగ్గర శపథంచేశాడు కదా! అందుకు తిననంటున్నాడు). నాస్తికుడు "తినను" అన్న కొద్దీ, వాడే ఆ విషాన్నం పెట్టాడనే నమ్మకం పెరిగిపోయింది దొంగలకు! వాడిని చితగ్గొడుతున్నారు. వాళ్ల దెబ్బలు భరించలేక ఆ అన్నం తింటున్నాడు. 2, 3, 4 ముద్దలు తిన్నాడు. దొంగలు ఎన్మిది కళ్లతో వాణ్ణి చూస్తున్నారు ఛస్తాడని! సగం తిన్నాడు, చావలేదు! పూర్తిగా తిన్నాడు. "ఇదేమిత్రా! వీడు చావటం లేదు?'' అని పరస్పరంగా ఒకళ్ల ముఖాలు మరొకళ్లుగా చూసుకొంటూ ప్రశ్నించుకొంటున్నారు. దొంగల నాయకుడు లేచి "వాడే ఛస్తాడులేరా రండి పోదాం!" అంటూ ముగ్గుర్నీ తీసుకొని వెళ్ళిపోయాడు.

ఈ దృష్టాంతాన్ని ఒక్కసారి జ్ఞానదృష్టితో సింహావలోకనం చేద్దాం! మానవ దృష్టిగోచరం కాకుండా నాస్తికుడు దాక్కున్నాడు. "వాడి ఉనికి మానవ మాత్రులకు తెలియదు" అన్నమాట అక్షరాలా నిజం! ఆ పరిస్థితిలో వాడి దగ్గరకు అన్నం ఎవరు తీసికెడతారు? తినిపించవలసిన అవసరం, (నాస్తికుడితో వాదించిన భక్తులకు తప్ప),

ఇతరులకు లేదు. "అన్న తినను" అంటూ తన మాట నిలబెట్టుకోవాలని మొండి పట్టుదలగా ఉన్నవాడిచేత, అన్నం తినిపించాలంటే, కొట్టటానికి మామూలు మానవులు పనికిరారు. కిరాతకృత్యాలు చేసే దొంగలే రావాలి! వెదకటానికీ - వాడిని దయారహితంగా కొట్టడానికి తగినంత అవసరం దొంగలకు ఉంది. ఈ అవసరం దొంగలకు ఎవరు కల్పించారు?

నాస్తికుడు నిర్జనారణ్యంలో ఎవ్వరికీ తెలియకుండా దాక్కోవటం పురుషకారానికి పరాకాష్ఠ! ఇక్కడనుండి దైవలీల ఎలా నడిచిందో పరిశీలిద్దాం! తెల్లవారు జామున ప్రయాణానికి బయలుదేరిన బాటసారి తన మధ్యాహ్న భోజనంకోసం అన్నంమూట తనతో తెచ్చాడు. 1) ఆ బాటసారిని మఱ్ఱిచెట్టున్న మార్గంద్వారా ఎవరు నడిపించారు? 2) మఱ్ఱిదగ్గరకు రాగానే బాటసారికి, అదే చెట్టు క్రింద నిద్రించాలనే ఆలోచన ఎవరు కల్గించారు? 3) అదే చెట్టుకు అన్నంమూట కట్టించాలనే ఊహ ఎవరు కల్గించారు? 4) బాటసారి మాగన్నుగా నిద్రలోకి వెళ్లబోతూ ఉండగా, పెద్దపులిని గాండ్రింపజేసిన వాడెవ్వరు? 5) అదే చెట్టు క్రిందకు దొంగలను రప్పించిన వాడెవ్వరు? - ఇన్ని ఆలోచనలకూ ఒక్కటే సమాధానం: "సర్వేశ్వరుడే!"

దైవగుణాలు చెప్పటం అనేది సముద్రానికి ఏతం వెయ్యటం లాంటిది. నక్షత్రాలను లెక్కించటం వంటిది. భగవంతుని చెప్పే శక్తి మాటలకు లేదు. మనస్సుతో పరమాత్మను ఊహించలేము. ఎంత చెప్పినా కొంతమాత్రమే అవుతుంది.

ఒకప్పుడు సరస్వతికి పరమాత్మయొక్క గుణాలు వ్రాయాలని ఆలోచన వచ్చిందట. సిరా సిద్ధం చేసుకొంది. సముద్రాన్ని పాత్రగా ప్రక్కన పెట్టుకొన్నది. దానిలో కాటుకపర్వతాన్ని వేసింది. సిరాతొట్టి ఏర్పడింది. కల్పవృక్షంయొక్క కొమ్మను కలంగా చేసికొన్నది. పత్రం (కాగితం) కావాలి గదా! కాగితంగా భూమిని చేసికొన్నది. శారద రాత్రింబవళ్ళు వ్రాస్తూఉన్నదట. అయినా ఆ పరమాత్మయొక్క (లక్షణాలు) గుణాలు వ్రాయటం పూర్తికాలేదట.

**శ్లో॥ అసితగిరి సమంస్యాత్ కజ్జలం సింధుపాత్రే,**
**సురవర తరుశాఖా లేఖినీ, పత్రముర్వీ,**
**లిఖతి యది గృహీత్వా శారదా సర్వకాలం,**
**తదపి తవగుణానాం ఈశ పారం నయాతి!**

## (8) పూర్వజన్మ సంస్కారం

జీవుడు ఈ శరీరంతో ఈ జన్మలో కొన్ని విద్యలు-భక్తి-జ్ఞానాలు-కొన్ని ఉత్తమ

లక్షణాలు కలిగిఉన్నాడనుకోండి! ఆ లక్షణాలు మరుజన్మలో (ఆ వ్యక్తిలో) పుట్టుకతో పరిమళిస్తాయి. చెడ్డ లక్షణాలూ అంతే!

**శ్లో॥ "శరీరం యదవాప్నోతి యాచ్చాపి ఉత్క్రామతీశ్వరః**
**గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్"** - (భగవద్గీత: 15-8)

జీవుడు శరీరమును విడుచునప్పుడు (నూతన శరీరమును పొందు నప్పుడును), పూర్వజన్మ అనుభవములను, సంగీత-గణిత విజ్ఞాన శాస్త్రాది పాండిత్యములను, గాలి వాసనలను కొనిపోవునట్లు, తనతో తీసికొనిపోవును.

మానవుడు శరీరముతో ఈ లోకములోనికి వచ్చినప్పుడు వట్టిచేతులతో వస్తాడు. శరీరాన్ని విడిచిపోయేటప్పుడు కూడా వట్టిచేతులతోనే వెళ్లిపోతాడు- అనేది జగత్సత్యం! పంచేంద్రియాలు మనస్సు అనే ఆరింటితో తన అనుభవాలు వాసనగా తీసుకుపోతాడు - అని స్పష్టంగా చెప్పాడు. దీనినే 'జన్మాంతర వాసన' అని కూడా అంటారు. శైశవదశలో మహాశక్తులు చూపిన పూర్వజన్మ సంస్కారులను ఎందరినో ప్రపంచం చూచింది; ఈనాడు చూస్తోంది. పై గీతాశ్లోకానికి ఉదాహరణంగా పూర్వజన్మవాసనతో పుట్టి ప్రపంచానికి అత్యాశ్చర్యం అందించే ఎందరినో ఈనాడు కూడా రెండు కళ్లతో చూస్తున్నాం. "ఏ విద్య అయినా నూటికి నూరు పాళ్లు పట్టుబడాలంటే, జన్మాంతర సంస్కారం ఉండాలి! కేవలం అభ్యాసంతో సాధించలేము'' అన్నారు ఆదిభట్ల నారాయణదాసుగారు!

**(i)** నారాయణదాసుగారు 6 ఏండ్ల వయస్సులో తల్లిచెయ్యి పట్టుకొని రాజమండ్రిలో గోదావరి పుష్కరాల స్నానానికి నడుస్తున్నాడు. అప్పటికి ఆ పిల్లవాడు అక్షరాభ్యాసం పూర్తిచేసుకొని పుస్తకం పట్టి ఉన్నాడు. ఒకచోట దైవగ్రంథాలు బల్లపై పెట్టి అమ్ముతున్నాడు పుస్తక విక్రేత. ఈ పిల్లవాడు ఆవుదూడలా ఉన్నాడు. తల్లి ధరింపజేసిన కౌపీనంతో అందంగా, గిత్తదూడలాగే ఉన్నాడు. ఆ పుస్తకాల షాపు రాగానే తల్లిని నడవకుండా పట్టుకొన్నాడు. పోతన్నగారి ఆంధ్రమహాభాగవతం చూపిస్తూ "అమ్మా! ఆ పుస్తకం కావాలి!" అని మారాంచేస్తున్నాడు. దాని ఖరీదు అర్ధరూపాయి! అన్ని డబ్బులు ఆమె దగ్గర లేవు. పిల్లవాడు కావాలని ఏడుస్తున్నాడు. "బాబూ! ఆ పుస్తకం పెద్దవాళ్లు చదివేది! ఆ పద్యాలు నువ్వు చదవలేవు!" అన్నాడు షాపువాడు. "కాదు కావాలి! నేను చదువుతా!" అంటున్నాడు బాలుడు! "చదవలేవంటున్నానుగా బాబూ! చదివితే, నీకు ఆ పుస్తకం ఊరికే ఇచ్చేస్తా" అన్నాడు షాపువాడు. అనడమే కాదు, సప్తమస్కంధంలోని ప్రహ్లాదచరిత్ర తీసి, ఆ బాలుని రెండు చేతులకీ ఇచ్చాడు.

అప్పటికి అక్షరజ్ఞానంమాత్రం పొందిఉన్న ఆరేళ్ల బాలుడు ప్రహ్లాదచరిత్ర పద్యాలు గొంతెత్తి సంగీతంతో ఆలపిస్తున్నాడు. పుష్కరజనం శిలావిగ్రహాలుగా నిలబడి వింటున్నారు. అది పూర్వజన్మ సంస్కారం కాక ఈ జన్మలో సాధ్యమా?*

*[ఆదిభట్ల నారాయణదాసుగారిని గురించి మా అన్నయ్య వ్రాసిన పై సంఘటనకు నా వివరణ-చిన్న సవరణ:- పై సంఘటన జరిగినప్పుడు తన వయస్సు 6 ఏండ్లుకాదు- నాలుగైదేండ్లు మాత్రమే అని నారాయణదాసుగారు తన స్వీయ చరిత్ర "నా యెఱుక"లో వ్రాసుకున్నారు. ఇది జరిగింది రాజమండ్రి పుష్కరాల సమయంలో కాదు; విజయనగరంజిల్లా పార్వతీపురంలో మహాశివరాత్రి సమయంలో జరిగింది. పార్వతీపురానికి 16 కి.మీ. దూరంలో కొమరాడ మండలంలో, నాగావళి – ఝంఝావతి నదుల మధ్యనున్న ద్వీపంలో ప్రసిద్ధమైన సోమేశ్వరాలయం ఉంది. ఆ ఆలయ సమీప గ్రామానికి "గుంప" లేక "దేవుని గుంప" అని పేరు. బాలుడైన దాసుగారు తన తల్లితో కలిసి మహాశివరాత్రి పర్వదినానికి ఆ గుంపలోని సోమేశ్వరాలయంలో జాగరణం చేసి, మరునాడు పోతన భాగవతం కొనుక్కునేందుకు పార్వతీపురం వచ్చారు. అక్కడ జరిగింది పై సంఘటన. పైగా దాసుగారు చదివింది "ప్రహ్లాద చరిత్ర" కాదు; దశమస్కంధంలోని "వర్షఋతువర్ణన" ఆ పుస్తకాల షాపు యజమాని పేరు! – "రామానుజుల రంగయ్యసాతాని". ఆయన బాలదాసుగారి పద్యపఠనానికి ముగ్ధుడైపోయి, ఆ భాగవతానికి తోలుబైండింగ్ చేయించి బహూకరించాడు. తాను పెద్దయిన తర్వాత దాసుగారు ఆ పుస్తకం మొదటి పుటలో స్వహస్తాలతో ఈ క్రింది విధంగా వ్రాసుకున్నారు.

"ఈ భాగవత పుస్తకము నా యైదేండ్ల వయసులోపున శివరాత్రికి గుంప యాత్రచేసికొని, నా తల్లితో నేను పార్వతీపురములో పుస్తకముల షాపు పెట్టుకొన్న రామానుజుల రంగయ్య యొద్దకు భాగవతము కొనుటకై వెళ్ళగా, నతడు నేనీ భాగవతమును శరవేగమున చదువుఁగా, నా తల్లి ప్రతిపదార్థము చెప్పఁగా, మిక్కిలి సంతోషించి, నాకు తోలుబైండు కట్టించి బహుమతి చేసెను. – ఆ॥ నారాయణదాసు, 10-09-37, విజయనగరము"

దాసుగారు బహుమతి పొందిన పై పుస్తకం ఇప్పుడు గుంటూరులో వారి ఏక పుత్రిక మనుమడైన కీ.శే. కఱ్ఱా వెంకట్రావుగారి యింట్లో భద్రంగా ఉంది. (–మరిన్ని వివరాలకు చూడుడు: శ్రీ మోదుగుల రవికృష్ణగారి సంపాదకత్వంలో వెలువడిన "నా యెఱుక", రెండవ అధ్యాయం, VVIT, October 2021.)]

**(ii)** ఒకప్పుడు మా ఊరు తణుకులో, ఉన్నత పాఠశాలకు 12 ఏండ్ల బాలుణ్ణి తండ్రి తీసుకొచ్చాడు. వందలమీద – వేలమీద ఉండే అంకెల హెచ్చవేతలు – కూడికలు – కలం – కాగితం పట్టుకోకుండా, చెప్పేస్తున్నాడు. దీన్ని ఏమంటారు? ఇది ఏమిటి? 12 ఏండ్లకే పి.జీ. పరీక్షకు, బి.ఇ. పరీక్షకు కూర్చుని ఉత్తీర్ణులైన బాలమేధావుల్నిగురించి వార్తాపత్రికలలో మనం చదవడంలేదా? మూడేళ్ళ వయస్సులోనే, సంగీతంలోని అన్ని రాగాలను గుర్తిస్తున్న బాలికను గురించి చదవలేదా? ఇలా ఎన్నోవింతలు!

**(iii)** ఐదేళ్ల బాలుడు పెన్సిలుతో, కాగితంమీద గీతలు గీస్తూ, రేఖాచిత్రాలు జీవం ఉట్టిపడేలా వేస్తున్నాడు. ఈ శక్తి ఎక్కడినుంచి ఎప్పుడు వచ్చింది? ఎప్పుడు నేర్చుకొన్నాడు? అనే ప్రశ్నలకు సమాధానం అందుతుందా? ఇది ఏమిటి?

**(iv)** మంగళంపల్లి బాలమురళీకృష్ణగారు తన తొమ్మిదవ యేట, త్యాగరాజ ఉత్సవాలలో, సంగీత విద్వాంసులు మెచ్చే శాస్త్రీయ సంగీతంతో త్యాగరాజ కృతులు మద్రాసులో ఆలపించారు. ఐదు సంవత్సరాలవరకు తనమూతి తాను కడుక్కోవటం చేతకాదే! నాలుగేళ్లలో ఇంత రాగ శ్రుతిలయలతో శాస్త్రబద్ధగాత్రం ఎలా వచ్చింది? ఈ జన్మలో సాధ్యమా? ఇంత శాస్త్రజ్ఞానం రెండుమూడేళ్లలో సాధించింది కాదు! క్రిందటి జన్మలోని మహాపాండిత్యం ఈ జన్మరాగానే ప్రాక్తనజన్మవిద్యగా బాలమురళీకృష్ణకు సంప్రాప్తించింది. జన్మమారటంలో మరుగునపడిన మహావిద్య పుట్టుకతో తెరతీసినట్లయింది!

**(v)** ఇలాంటి మహనీయులు గురువుల దగ్గర కేవలం విన్నంత మాత్రాన మహాపండితులుగా ఆత్మజ్ఞానం పొందుతారు. శంకరాచార్యులవారి చరిత్రలో బాలశంకరులకు ఒక్క సంతలో (వేదవాక్యాన్ని గురువు ఒక్కసారి బోధిస్తే, శిష్యుడు రెండుసార్లు అనటం "సంత" అని వైదికపరిభాష) చతుర్వేదాలూ పట్టుబడ్డాయి. శ్రవణమాత్రంతో షట్ఛాస్త్రాలూ అవగతం అయ్యాయి. కైలాసశంకరుడే కాలడిశంకరుడుగా జన్మించాడు కదా! అది దైవశక్తులతో హిందూమతోద్ధరణకోసం పుట్టిన శంకరావతారం అన్నారు. అది అలావుంచండి.

**(vi)** పశువుల్ని కాసుకొంటూ పల్లెల్లో కొందరు ఆలకాపరి పిల్లలు కన్పిస్తారు. వాళ్లకి అక్షరజ్ఞానం ఉండదు. పౌరాణిక నాటకాలలోని పద్యాలు విన్నంత మాత్రంతో, రాగంతోసహా పట్టుకొంటారు. రాగం తప్పకుండా ఆలపిస్తారు. భజనసంఘంలో కలిసి చిందులు త్రొక్కుతూ, భజన సంఘంతో కలిసిపోతారు. వీళ్లు భజనగురువు దగ్గర శిక్షణపొందినవాళ్లను మించిపోతారు. వీళ్లకి ఇంతటి శ్రుతిలయలు తప్పని జ్ఞానం, "చూస్తే పట్టుకొనే మహాశక్తి" ఎలా వచ్చాయో మనకు అంతుపట్టదు. పూర్వజన్మలోనిది

అనక తప్పదు.

ఏ జన్మలోని దేహం, ఆ జన్మతో అంతరిస్తుంది. జీవుడు గతజన్మల అనుభవాలను "బ్రాటోవరు"గా ఈ జన్మకు తెచ్చుకొంటాడు. దీని ఫలితంగా ఉత్తమ విద్యానుభవాలు – ఉత్తమ లక్షణాలు– ఉత్తమమైన అలవాట్లూ చిన్నప్పటినుండీ కన్పిస్తాయి. అలాగే చెడ్డ అలవాట్లూ – దుర్మార్గదేహియొక్క వాసనలు – సంస్కారాలు, పుట్టుకతో వస్తాయి. మంచిపనులలో–ఉత్తమ కళలో – సత్ప్రవర్తనలో – సంగీత సాహిత్యాలలో – జన్మాంతర శక్తులు చూచి మురిసిపోతాం. మంచి పనులలో (దానధర్మాదులలో) మైమరచి ప్రవర్తించే దైవస్వరూపుల్ని చూస్తూ ఉంటాం! కొన్ని లక్షణాలు పూర్వజన్మనుండి ఈ జన్మకు పుట్టుకతో రావాలి!

**శ్లో॥ "దాతృత్వం, ప్రియవక్తృత్వం, ధీరత్వం, ఉచితజ్ఞతా,**
**అభ్యాసేన న లభ్యంతే, చత్వారః సహజా గుణాః"**

–అని నీతిశాస్త్రజ్ఞుడు స్పష్టంగా చెప్పాడు. జీవితంలో మానవులు ఎక్కువకాలం పరుగులు తీసేది ధనంకోసం! ఇహలోకభోగాలకు ముఖ్యాధారం ధనం! భూమి సూర్యుడిచుట్టూ కాదు, ధనికుడిచుట్టూ తిరుగుతోంది. "ధనమూల మిదం జగత్!" అని అనుభవంతో అరిచారు. అలాంటి ధనం దానంచెయ్యాలంటే చేతులొస్తాయా? కాని, ఈ చేతితో చేసే దానం, ఆ చేతికి తెలియకుండా, దానంచేసే పుణ్యాత్ములున్నారు. 1) దానస్వభావము – 2) ప్రియవక్తృత్వము (అంటే శ్రోతలకు ఆనందం కలిగేలా మాట్లాడే చాతుర్యము)–3) ఆపదలు వచ్చినప్పుడు ధైర్యంగా ఉండటం–4) సన్నివేశానికి తగిన విధంగా ప్రవర్తించటం – ఈ నాలుగూ మంచి లక్షణాలే అని చెప్పాడు. పైగా అలవాటు చేసుకొంటే రావు! అని ఖచ్చితంగా చెప్పాడు నీతిశాస్త్రవేత్త! ఈ నాల్గు లక్షణాలూ పుట్టుకతోనే వస్తాయి.

జన్మాంతర లక్షణాలు మంచివి వచ్చినట్లే చెడ్డవి కూడా వస్తాయి. ఆ దుష్టలక్షణాలను నీ సాధనద్వారా ప్రయత్నపూర్వకంగా తొలగించుకోవాలి! లేకపోతే అవి నిన్ను వెంటాడి నీచేత పాపాలుచేయిస్తాయి. జన్మజన్మలకు నీవు మోక్షం పొందలేవు!

## (9) మాత్సర్యం

తపస్సు చేసి, కళ్లుపోగొట్టుకొన్న ఈర్ష్యాళువుల కథలో, ఈర్ష్యాళు మనస్తత్వం వర్ణచిత్రంలా చిత్రీకరింపబడింది. ఇద్దరు వ్యక్తులు కలిసిమెలసి తిరుగుతూ ఉంటారు. వాళ్లు ఇద్దరికీ ఒకటే అనుమానం! వాడు మించిపోతాడేమో అని వీడికి;

వీడు మించిపోతాడేమో అని వాడికి భయం! “ఎవడో ఎక్కడో బాగుపడిపోయాడు – అంటే విని సహించొచ్చు! కాని మన ఎదురుగా ఉన్నవాడు – అందులో మన కుటుంబం వాడు – మనల్ని మించిపోయాడంటే చూస్తూఉండటం అంత తేలికకాదు!” అంటుంది ఒక పాత్ర – భమిడిపాటి కామేశ్వరరావుగారి నాటకంలో. ఆ మిత్రులిద్దరూ – ఒక వాగు ఆవలి ఒడ్డున వాడు, ఈవలి ఒడ్డున వీడు – పోటాపోటీగా తపస్సు చేస్తున్నారు. ఉత్తమకార్యాలలో స్పర్ధ (ఈర్ష్య) ఉంటే అది అభివృద్ధికి తోడ్పడుతుందన్నారు. “స్పర్ధయావర్ధతే విద్యా!” – ఈర్ష్యవల్ల విద్య అభివృద్ధి అవుతుంది. అలాగే మంచిపనిలో ఈర్ష్య మంచిదే. వాళ్ల తపస్సులు సాధారణస్థాయి దాటి, తారాస్థాయిని మించి, ఘోర తపస్సులుగా మారాయి!

భగవంతుడు ప్రత్యక్షం అయ్యాడు. ముందుగా ఈవలి ఒడ్డు మీద ఉన్న మొదటివాడి దగ్గరకు వచ్చి “ఏమి నీ కోరిక?” అన్నాడు. “అయ్యా దేవుడుగారూ! మీరు ఆవలి ఒడ్డున ఉన్న మావాడి దగ్గరకు వెడతారా?” అని అడిగాడు. “నీకోరిక ఇచ్చి వెడతాను! నీ కోరిక చెప్పు!” అన్నాడు దేవుడు. “నా కోరిక ఏమీలేదండి! ఆవలి ఒడ్డువాడు ఏమి అడిగితే, ‘దానికి రెట్టింపు’ నాకు ఇవ్వండి! చాలు” అన్నాడు. “తథాస్తు” అని, ఆవలి ఒడ్డుకు ఆకాశమార్గంలో వెళ్లిపోయాడు భగవంతుడు.

అక్కడ ఉన్న రెండవవాణ్ణి “నీ కోరిక ఏమిటి?” అన్నాడు స్వామి! “ఆవలివాణ్ణి అడిగారా? వాడు ఏం కావాలన్నాడు? నాకు స్వచింతలేదు పరచింతే! వాడేం అడిగాడు?” అన్నాడు ఆ రెండోవాడు. “వాడికి ఏ కోరికాలేదన్నాడు. నీకు ఏమి ఇస్తే దానికి రెట్టింపు తనకు ఏర్పాటు చెయ్యమన్నాడు! నీ కోరిక చెప్పు!” అన్నాడు దేవుడు. “అమ్మదొంగ వెధవా! ఇప్పుడు నేను ఏమి అడిగినా, రెట్టింపు కొట్టేద్దామను కొంటున్నావా? నీ రోగం కుదురుస్తాను ఉండు!” అని దీర్ఘంగా ఆలోచించి “స్వామీ! నాకు మీరు ఏమీ ఇవ్వక్కర్లేదు. నా కన్ను ఒకటి పోగొట్టండి! చాలు! అదే మహద్భాగ్యం!” అన్నాడు. దేవుడు “తథాస్తు” అన్నాడు! “వాడికి రెండు కళ్లూ పోతాయి! మహబాగా చేశాను” అనే ఆనందంలో ఈ రెండవవాడికి తనకు ఒక కన్నుపోతోంది అనే ఆలోచనే రాలేదు. ఆ ఆలోచనను ఈర్ష్యాపిశాచం మ్రింగివేసింది.

## (10) ఋణానుబంధం

చెప్పులు కుట్టుకొంటూ, గ్రామంలో ప్రకటనలు దండోరా వేస్తూ, జీవితం గడిపే ఒక మాదిగవాడున్నాడు. అతనికి సంతానం లేదు. సంతాన హీనస్థితి వానికి నిరంతరబాధ అయింది. ఒక జ్యోతిశ్శాస్త్రవేత్త దగ్గరకు వెళ్లి, తనకు సంతానభాగ్యం

లేకపోవటానికి కారణం అడిగాడు. అప్పుడాపండితుడు. "ఋణం కారణంగానే పుత్రులు ఏర్పడతారు. మన కడుపున పుట్టి, వాళ్లు మనకు ఋణపడినది తీర్చుకొని, వెళ్ళిపోతారు. ఈ బిడ్డలు మాతాపితృఋణం అనేది ధనంతోనే కాదు, సేవల ద్వారా కూడా తీర్చుకొంటారు. ఇలా, మనకు బాకీ ఉన్న వాళ్లు, మన కడుపున పుడతారు. మనం ఎవరెవరికో ఋణాలు తీర్చకుండా మరణిస్తే, వాళ్లు మన దగ్గర బాకీలు వసూలు చేసుకోవటంకోసం పుడతారు. మనకుపుట్టి, మనల్ని బాధించి, బాకీ వసూలు చేసుకొని, దూరమైపోతారు. ఋణం వసూలు అయిపోయింది కదా! వాళ్లు మనతో ఇంక మాట్లాడరు. అందుచేత మహాత్ములు నీకు ఋణపడేటట్లు చేసుకో!" అన్నాడు. "మహాత్ములు ఇతరుల దగ్గర ఏమీ తీసుకోరుకదా! నేను ఏం చెయ్యాలో చెప్పండి!" అని చర్మకారుడు అన్నాడు.

"ఈ గ్రామం చివర, నదీతీరంలో, కొండగుహలో, ఒక మహాజ్ఞాని ఉన్నాడు. ఆయన ఇతరులనుండి ఏమీ గ్రహింపడు. ఆయనకు నీవు మహోపకారం చెయ్యి. తత్ఫలితంగా నీకు సంతానం కల్గుతుంది." అన్నాడు జ్యోతిషుడు.

ఈ మాదిగ, ప్రతిరోజు, గుహలో ఉన్న స్వామిని సందర్శిస్తున్నాడు. "ఆయనకు మహోపకారం ఏం చెయ్యాలి?" అని ఆలోచిస్తున్నాడు. ఋతువులు మారుతున్నాయి. గ్రీష్మఋతుతువు నిప్పులు చెరుగుతోంది. రోహిణికార్తెలో ఆ సాధువు సన్నపాయగా ఉన్న నదిలో స్నానంచేసి, మధ్యాహ్నం ఒంటిగంట ప్రాంతంలో వస్తున్నాడు. ఆ ఇసుకదారిలో చెప్పులజత, పాదానుకూలంగా పెట్టి, దూరంగా తప్పుకొన్నాడు మాదిగవాడు. కాలిపోతున్న ఇసుకలో, నిప్పులపైన నడకలా ఉంది. అలాగే వస్తున్న ఆ సాధువు పాదాలు, అప్రయత్నంగా చెప్పులజతలో దూరి శాంతించాయి. దేశ – కాల – పాత్రలనుబట్టి ఆ చర్మకారుని దానం 'మహాదానం' అయింది. ఇసుక ప్రదేశం; రోహిణికార్తె నిప్పులు చెరిగే కాలం; నిరంతరదైవధ్యానంలో ఉండే మహర్షి, పాదరక్షాదాన పాత్రుడయ్యాడు.

చర్మకారుడు, సాధుదర్శనం చేసుకొంటూనే ఉన్నాడు. కొద్దిరోజుల తరువాత సాధువు కన్పించటం లేదు. ఆ ప్రాంతంలో నడయాడే భక్తులలో ఒకరు స్వామి "సిద్ధిపొందా"రన్నాడు. కొద్ది రోజులలోనే ఆ మాదిగవాని భార్య గర్భం ధరించింది. పుత్రుణ్ణి కన్నది. ఆ దంపతులు, పెన్నిధి పొందిన పేదలా, మహానందంతో బిడ్డను పెంచుకొంటున్నారు.

ఆ బాలుడు అందరు బాలకుల్లా కాకుండా, వింతగా మాట్లాడుతున్నాడు. చాలా జ్ఞానంగా ఉన్నాడు. తల్లిదండ్రుల ఆలోచనలకు చక్కని పరిష్కారవాక్యాలు చెపుతున్నాడు.

నిరంతరంగా ధ్యానంలో ఉంటున్నాడు. పిల్లవాని పద్ధతినిగూర్చి, ఆ తండ్రి, జ్యోతిషునితో చెప్పాడు. "మహాజ్ఞానియైన సాధువు, ఋణానుబంధంగా, నీకు జన్మించాడు. ఆ పిల్లవాడు, చేతితో యిచ్చిన ద్రవ్యాదులు మీ భార్యాభర్తలు చేతిలో గ్రహించకండి! అలా చేతితో గ్రహిస్తే, ఋణం తొలగిపోతుంది! ఋణం ఉంటేనే భార్యాపుత్రులతో అనుబంధం" అని చెప్పాడు. ఆ దంపతులు తమ బిడ్డను దైవంగా చూచుకొంటున్నారు. ఐదేళ్ల వయస్సు వచ్చింది. అతడు చెప్పే మాటలు మహాత్ముల ప్రవచనాలలా ఉన్నాయి.

ఒకనాడు ఆ చర్మకారుడు ఏటికావలి గ్రామం వెళ్లాడు. అక్కడ పనిపూర్తిచేసుకొని వద్దామనుకొన్నాడు. ఏరు మహాభయంకరంగా పొంగిపోతోంది. ఆ మాదిగ అద్దరి ఒడ్డున ఆగిపోయాడు.''రాత్రి మేల్కొలుపుగా వేయవలసిన దండోరా రాజాజ్ఞ! అది ఎలా?'' అని అతని భార్య కొడుకుతో అన్నది. ''అమ్మా! నన్ను తీసుకొని వెళ్లు; నేను వేస్తాను" అన్నాడు. ఆ ఇల్లాలు, బిడ్డను చంకను ఎత్తుకొంది. వేరొక చంకలో డప్పు పట్టుకొంది. జాముకొక చతుష్పదం (చౌరాస్తా)కు తీసుకొని వెళ్లింది. ప్రతి మొగలోను వరుసలు తప్పకుండా డప్పువాయిస్తూ, ఒక్కొక్క శ్లోకం గొంతెత్తి చదువుతున్నాడు సుస్పష్టంగా -

ప్రథమమైన జాములో - తూర్పు చౌరస్తాలో -

**శ్లో॥ "ఋణానుబంధ రూపేణ, పశుపత్నీ సుతాలయాః**
**ఋణక్షయే క్షయం యాన్తి, కాతత్ర పరివేదనా?"** (-హితోపదేశం)

ఋణసంబంధము ఉండుటచేతనే, పశువులు - భార్య - బిడ్డలు - గృహములు లభించుచుండును. ఋణము తీరిపోగానే అవి నశించిపోవును. వీటి విషయములో ఎందుకు బాధపడటం?

రెండవ జాములో - దక్షిణ చతుష్పథంలో -

**శ్లో॥ "మాతా నాస్తి, పితా నాస్తి, నాస్తి బంధు సహోదరాః**
**అర్థం నాస్తి, గృహం నాస్తి, తస్మాత్ జాగ్రత! జాగ్రత!!"**

"తల్లి-తండ్రి-బంధువులు-సోదరులు జన్మజన్మకీ మారిపోయే అనుబంధాలు! ఇవి నిశ్చయాలు కావు! పైగా నామరూపాత్మకాలు! అంటే నశించేవి! ధనములేదు! గృహము లేదు. నీవు కన్నుమూస్తే అవి ఎవరివో? (సమ్మీలనే నయనయోః నహి కించిదస్తి!) భవిష్యత్తులో మాయమయ్యేవాటిపై మమకారం పెట్టుకోవద్దు, జాగ్రత!

మూడవ జాములో - పడమర చౌరస్తాలో-

**శ్లో॥ "కామః క్రోధశ్చ లోభశ్చ దేహే తిష్ఠన్తి తస్కరాః**
**జ్ఞానరత్నాపహారాయ, తస్మాత్ జాగ్రత! జాగ్రత!!"**

కామము-క్రోధము-లోభము అనే ముగ్గురు దొంగలు మీయొక్క జ్ఞానము అనే రత్నాన్ని అపహరించటం కోసం పొంచియున్నారు. కాబట్టి జ్ఞానంతో మెలకువగా ఉండండి!

నాల్గవ జాములో - ఉత్తర చతుష్పథంలో -

**శ్లో॥ "జన్మదుఃఖం, జరాదుఃఖం, జాయాదుఃఖం పునఃపునః**
**సంసార సాగరం దుఃఖం, తస్మాత్ జాగ్రత! జాగ్రత!"**

మానవ జన్మలో సుఖం అల్పం. ఆధివ్యాధులు - జరామరణాలు - భార్యాపుత్రులు - మాతృగర్భ నరకం- అన్నీ (సుఖాశ కల్గించే) దుఃఖాలు! నవమాసాలు గర్భనరకంతో ఆరంభం అయ్యే జన్మయే దుఃఖం. వార్ధక్యం మహాదుఃఖం. భార్యాభర్తలు పరస్పరం బాధ్యతలలో పడి, బాధలలో మునిగి, ఉక్కిరి బిక్కిరి అవుతూ ఉంటారు. జనన-మరణ దుఃఖ పరంపరలో పడకుండా, మేల్కొనండి! మోక్షం సాధించండి!

బాలునిచే నాల్గవ జాములోని "మేల్కొలుపు" దండోరా పూర్తిచేయించి, చర్మకారుని భార్య, బిడ్డనెత్తుకొని, యింటికి వెళ్లింది. ఆమె వెనుకనే రాజభటులు ఇంటికి వచ్చినారు. ఏదో రాజాపరాధం తన బిడ్డవల్ల జరిగిందని, ఆ యిల్లాలు భయపడింది. "చిన్నపిల్లవానివల్ల తప్పు జరిగిఉంటే క్షమించండి" అని ప్రాధేయపడుతోంది! "అమ్మా! నీ బిడ్డ చేసిన 'మేల్కొలుపు దండోరా' మహారాజుగారు విన్నారు. మహానందభరితులై, నీ బిడ్డను తీసుకొని రమ్మని, రథంతో మమ్ము పంపినారు. వెంటనే రావలసినది" అన్నారు రాజభటులు!

రాజుగారు ఆ బాలుని చూచి, ఆశ్చర్యపడినారు. ఒక మహాజ్ఞానిని ఆ పిల్లవానిలో సందర్శించి, బంగారు పళ్లెంలో కాసులనిచ్చి సత్కరించినారు. బాలుడు ఆ పళ్లెమును తల్లిచేతిలో పెట్టి కన్నుమూసినాడు. ఇసుక ప్రదేశంలో, రోహిణికార్తె కాలంలో, జ్ఞానియైన మహోత్తమపాత్రకిచ్చిన (పాదరక్షల) దానఫలితంగా, మహత్తర పుత్రోత్సాహం లభించింది. మహత్తర జ్ఞానసన్మానము "జ్ఞానికి తల్లిదండ్రులు" అనబడిన వారికి మహాభాగ్యము దక్కింది. ఈ కథ, ఎన్ని శతాబ్దాల క్రిందట, ఎప్పుడు జరిగిందో ఏమో కాని, ఇప్పటికీ మన దేశంలో, బిడ్డ చేతితో ఇచ్చిన సొమ్ము, తల్లిదండ్రులు తమ చేతితో అందుకోరు! "క్రింద పెట్టు!" అంటారు! కథ - ఆచారం: రెండూ దేశప్రసిద్ధాలే!

## (11) తేనెబొట్లు

ప్రతివిషయంలోనూ బాహ్యార్థంతోపాటుగా అంతరార్థం గ్రహించటం అవసరం. అది లోకజ్ఞాని లక్షణం! ఒక వేదాంత శ్లోకం:-

**శ్లో॥ "సంకల్పితానందలవః తిష్ఠత్యుద్ధర కంధరః**
**అకస్మాత్ ప్రచ్యుత మధుబిందుభుక్ కరభో యథా"**

ఒక గాడిద అడవిలో ఒక గోతిలో పడింది. ఆ గోతిలో చీమలు తేళ్లు ఇతర కీటకాలు బాధిస్తున్నాయి. బాధలు అనుభవిస్తోంది. ఈ లోగా పులి "గాండ్రింపు" వినిపిస్తోంది. గాడిద పెనగులాటలో పైనున్న తేనెపట్టు రేగింది. తేనెటీగలు కుడుతున్నాయి. మహాబాధల్లోఉంది. బయటపడే దారి తెలియదు! రేగిన తేనెపట్టునుండి చుక్కలు పడుతున్నాయి. ఆ తేనెబొట్టుల ఆనందంకోసం మెడచాచుతోంది-ఇదీ కథ!

అంతరార్థం ఆలోచిద్దాం! "గాడిద" అంటే క్రిందటి జన్మలో మోక్షం కోసం ప్రయత్నించని అజ్ఞాని! "గొయ్యి" సంసారానికి సంకేతం. ప్రపంచంలోకి వచ్చాడు. అన్నీ బాధలే! "సుఖం అల్పం - బహుక్లేశః" (సుఖం తక్కువ - బాధలు ఎక్కువ). గోతిలో బహుబాధలు పొందుతున్నాడు. దూరంలో పెద్దపులి (మృత్యువు) గాండ్రింపు భయపెడుతోంది. భయబాధల్లో ఉండి, తేనెబొట్లు చప్పరించటంలో వచ్చే క్షణిక ఇంద్రియానందంకోసం మానవుడు ఆశిస్తున్నాడు. "ప్రపంచ వ్యామోహంలో పడి ఉండి, మోక్షం (విముక్తి) కోసం ఆలోచించకుండా, ప్రపంచ సుఖాలు పొందుదాం అనుకొనేవాడు గాడిద!" అని ఈ శ్లోకం అంతరార్థం!

## (12) నమస్కారం

"గురువుగారు కన్పించగానే రెండు చేతులు చేర్చి తలవంచి నమస్కరించాలి" అని చెప్పారు ఒక మంచి అలవాటు. అలాగే చేస్తున్నారు శిష్యులు అక్షరాలా. (ఆ కాలంలో పెరట్లో పెద్ద బావులుండేవి). ఒక రోజున గురువుగారు నీళ్లు తోడుకొంటూ బావిలో పడ్డారు. నీళ్లు తక్కువగా ఉన్నాయి. గురువుగారు నూతిలోనుండి అరుస్తున్నారు. నూతి చుట్టూ శిష్యులు చేరారు. "గురువుగారూ! ఖంగారు పడకండి! మీరు పైకి రావటానికి ఏర్పాటు చేస్తున్నాం" అని ధైర్యం చెప్పారు.

ఒక తట్టకు నాలుగు త్రాళ్లు కట్టారు. ఆ తట్టను నూతిలోకి దింపారు. గురువుగారిని అందులో కూర్చోమన్నారు. ఒక్కోత్రాడు ఇద్దరు చొప్పున పట్టుకొన్నారు. ఎనమండుగురు శిష్యులు గురువుగారిని పైకిలాగుతున్నారు. నూతిపైదాకా లాగారు. గురువుగారు కన్పించారు. గురువుగారు కన్పించగానే, నాల్గుత్రాళ్లూ పట్టిలాగే

4 x 2 ఎనమండుగురూ ఒక్కసారి చేతులు జోడిస్తూ "నమస్కారమండి!" అన్నారు భక్తితో. ఇంకేం వుంది? గురువుగారు "దభీ"మని మళ్ళీ నూతిలో పడ్డారు. నీళ్లలో పడ్డారు కాబట్టి దెబ్బలు తగల్లేదు. "అయ్యయ్యో!" అనుకొన్నారు.

నాలుగు త్రాళ్లు కట్టిన తట్ట మళ్లీ నూతిలోకి జార్చారు అందరూ. గురువుగారు తట్టలో కూర్చున్నారు. పైకి లాగారు. గురువుగారి "శిర్షోదయం" కాగానే ఎనమండుగురూ భక్తితో "గురువుగారూ! నమస్కారమండి!" అన్నారు చేతులు జోడిస్తూ. మళ్ళీ గురువుగారు "దభీ"మని నూతిలో పడ్డారు.

గురువుగారి అరుపులు "పిచ్చి వెధవల్లారా! మీ నమస్కారాలు తగలెయ్యా! నన్ను నిలువునా చంపేస్తున్నార్రా! నాకు దండాలు పెట్టకండిరా! మీ మొహం మండా! నన్ను పైకి రానీయండిరా! మీకు పుణ్యం ఉంటుంది! మీరు "నమస్కారం చెయ్యం" అంటేనే ఈ తట్టలో కూర్చుంటా! లేకపోతే ఈ నూతిలోనే ఛస్తా!" అన్నారు. "ఈ సారి నమస్కారం చెయ్యం గురువుగారూ!" అనిపించారు. "శిష్యదోషం గురోః శిరసి" (శిష్యుల తప్పులు గురువులు శిరసావహించాలి!). "నమస్కరించు" అంటే "ప్రమాదంలో పడవెయ్యి" అని అర్థంకాదు. ఇదీ అంతరార్థం!

## (13) ప్రసాదం చీమలు పట్టనిచోటు

వేంకటేశ్వరస్వామివారి ప్రసాదం - రెండు లడ్డూలు - ఎవరో తెచ్చి ఇచ్చారు గురువుగారికి. ఒక లడ్డూ భాగాలు చేసి, ఆరుగురు శిష్యులకు పెట్టారు. మిగిలిన ఒకలడ్డూ ప్రధాన శిష్యుడికి ఇచ్చి "ఇది చీమలు పట్టకుండా దాచు! రేపు తక్కిన వాళ్లకు పెడదాం! జాగ్రత్తగా దాచు!" అన్నారు.

మర్నాడు ఆ ప్రధానశిష్యుణ్ణి పిలిచారు. "నిన్న చీమలు పట్టకుండా దాచమని ఇచ్చానే... ఆ లడ్డూ తీసుకురా! వీళ్లకి పెడదాం" అని గద్దించారు గురువుగారు. "అలా చూస్తావేంరా?"-"మరేమోనండీ! మీరండీ! చీమలు పట్టకుండా దాచమన్నారు కదండీ! ఎక్కడ పెట్టినా చీమలు కనిపెట్టేస్తాయండి! అందుకనండీ జాగ్రత్తగా పొట్టలో.. పెట్టానండి!" అన్నాడు. గురువు "ఆరి దొంగవెధవా!" అన్నారు. (ఇక్కడ శిష్యుడు బాహ్యార్థం అక్షరాలా పాటించాడు).

# 3.3 "భగవద్గీతాప్రబోధం" - వేదాంతకథలు

## (0) నా ముందుమాట

మా అన్నయ్య రచించిన ఈ "భగవద్గీతాప్రబోధం" లో రెండు ముఖ్య విషయాలు

పాఠకుల దృష్టికి తీసుకురావాలనుకుంటున్నాను. ఈ రెండూ చాలా గొప్ప విషయాలు. మహాభారతం చదివిన ప్రతివ్యక్తికి రెండు అనుమానాలు వస్తాయి. (1) శాంతి అనుశాసనిక పర్వాలలో భీష్ముడు ధర్మరాజుకు ఎన్నో నీతులు బోధిస్తాడు. వీటిలో రాజనీతులు, ఇతర నీతులు - అన్నీ ఉన్నాయి. ఇన్ని నీతులు బోధించిన భీష్ముడు, సభాపర్వంలో దుష్టచతుష్టయం ద్రౌపదిని దారుణంగా అవమానిస్తుంటే, వస్త్రాపహరణం చేయబోతుంటే ఎందుకు నోరుమూసుకొని చూస్తూ ఉండిపోయాడు? దీనికి భారతంలో సమాధానం లేదు. (2) ధర్మరాజు మహామహితాత్ముడు. ధర్మువుయొక్క అంశతో పుట్టిన మహానుభావుడు. ఇటువంటి మహాత్మునికి, సప్తవ్యసనాలలో ఒకటియైన జూదం ఆడకూడదని తెలియదా? మరి ఎందుకు ఆడాడు? పరమమూర్ఖుడైన వ్యక్తికూడా, ఒకసారి తప్పుచేసి, దానివల్ల దెబ్బతింటే, మళ్ళీ ఆపని జన్మలో చేయడు. కాని మహాత్ముడైన ధర్మరాజు, మొదటిసారి జూదం ఆడాడు. అన్నదమ్ములను, భార్యను పణంగా పెట్టి ఓడిపోయాడు. శత్రువులు ద్రౌపదిని చెప్పరాని మాటలతో దూషించి అవమానించారు. దుశ్శాసనుడు ద్రౌపదికి వస్త్రాపహరణం చేయబోయాడు. శ్రీకృష్ణపరమాత్మ అక్షయవస్త్రాలిచ్చి ఆ పతివ్రత మానాన్ని కాపాడాడు. ధృతరాష్ట్రుడు ద్రౌపదికి వరాలరూపంలో పాండవుల దాస్యాన్ని తొలగించి, వారి రాజ్యం వారికిచ్చి సాగనంపాడు. పాండవులు ద్రౌపదీ సహితులై ఇంద్రప్రస్థానికి వెడుతున్నారు. ఇంకా గమ్యస్థానం చేరలేదు. మార్గమధ్యంలో ఉన్నారు. దుర్యోధనుని బలవంతంతో ధృతరాష్ట్రుడు విదురునిద్వారా ప్రయాణంలో ఉన్న పాండవుల్ని పునర్ద్యూతానికి (తిరిగి జూదం ఆడటానికి) పిలిపించాడు. ధర్మరాజు సిగ్గులేకుండా వెంటనే వెనక్కి తిరిగి వచ్చి, రెండోసారి జూదం ఆడి, రాజ్యాన్ని, రాజసూయయాగంలో సంపాదించిన సర్వసంపదలనూ కోల్పోయాడు. ఇంతకన్నా బుద్ధితక్కువపని ఇంకెవరయినా చేస్తారా? (ఇది నాకు కూడా అనేక పర్యాయాలు వచ్చిన అనుమానం) ఈ రెండు ప్రశ్నలకూ సమాధానాలు జానపద కథలలో ఉన్నాయి. జానపదులకు కార్యకారణ సంబంధాలు కావాలి. ఒక కార్యం జరిగితే, దానికి కారణం చెప్పాలి. చెప్పకపోతే, వాళ్ళు (జానపదులు) సొంతంగా అందమైన కల్పనలు చేస్తారు. అటువంటి సుందర జానపద కల్పనలు మా అన్నయ్య తన రచనలో పొందుపరిచాడు. (మొదటి ప్రశ్నకు 17వ అధ్యాయంలోను, రెండు ప్రశ్నకు 18వ అధ్యాయంలోను సమాధానాలుగా చెప్పిన జానపద కథలు చదివితే ఆశ్చర్యపోతారు పాఠకులు!) మానవునకు సంసారం మీద ఉండే గాఢమైన మమకారాన్ని తెలియజేసే (15వ అధ్యాయంలో) "రాగబంధం"

అనే కథకూడా చిత్రమైన కథ. (ఈ "రాగబంధం" అనే కథ "మమకారం" అనే పేరుతో "సత్యసందర్శనం-వేదాంతకథలు" అనే భాగంలో ఇచ్చాను-తంగిరాల)

భగవద్గీతను సామాన్యజనులకు అర్థమయ్యే రీతిలో అనేక సంవత్సరాలు బోధించి, ఆ బోధనానుభవాన్ని సరళమైన భాషలో వ్రాసి, ఆధ్యాత్మికకథల ఉదాహరణాలతో సుస్పష్టంగా అన్వయించి, వివరించిన మా అన్నయ్యగారికృషి బహుధా ప్రశంసనీయం. ఆయన పాదపద్మములకు నా వినమ్ర ప్రణామాంజలి ఘటిస్తున్నాను.

బెంగుళూరు **- తంగిరాల వెంకట సుబ్బారావు**

24-11-2017

(సుబ్రహ్మణ్య షష్ఠి)

## (1) స్థలమాహాత్మ్యం

**(i)** రామలక్ష్మణులు సీతాన్వేషణంకోసం తిరుగుతున్నారు. రాముడి ధనుర్బాణాలు లక్ష్మణుడి ధనుర్బాణాలు కూడా (అన్నయందు భక్తితో) తమ్ముడే మోస్తూ ఉంటాడు. ఒక ప్రదేశానికి రాగానే లక్ష్మణుడు ఆవేశంతో "అన్నయ్యా!" అని పిలిచాడు. రాముడు ఆగాడు. "ఏమిటి?" అన్నాడు. "అన్నయ్యా! నీ ధనుర్బాణాలు నేనెందుకు మొయ్యాలి? తీసుకో! నువ్వే మోసుకో!" అన్నాడు. "సరే! ఇలా ఇయ్యి!" అని పుచ్చుకొన్నాడు. "తమ్ముడూ! నీ కాళ్ల క్రింద మట్టి గుప్పెడు తీసి నాకు ఇవ్వరా!" అన్నాడు. లక్ష్మణుడు ఆ ప్రదేశంలోని గుప్పెడు మట్టిని అన్నయ్యకిచ్చాడు. రామన్న పై పంచకు ఆ మట్టి మూట కట్టుకొన్నాడు. ఎవరి ధనుర్బాణాలు వాళ్లు మోసుకొంటూ సాగిపోతున్నారు.

కొంతదూరం వెళ్లారు. లక్ష్మణుడు "అన్నయ్యా?" అని గట్టిగా అరిచాడు. ఆగాడు రామన్న. "నీ తమ్ముడు చచ్చాడనుకొన్నావా? ధనుర్బాణాలు నువ్వు మొయ్యటం ఏమిటి?" అన్నాడు. రాముడు తన ధనుర్బాణాలు తమ్మునికిచ్చాడు. పది ధనుష్కాండాలు నడిచారు. రాముడు, లక్ష్మణుణ్ణి ఆగమన్నాడు. తన పై పంచెకు కట్టుకొన్న మట్టిముడి విప్పాడు. అది నేలమీద చల్లాడు. "లక్ష్మణా! ఆ మట్టిమీద నిలబడరా!" అన్నాడు. నిలబడ్డాడు తమ్ముడు. వెంటనే "అన్నయ్యా! నీ ధనుర్బాణాలు నేను మొయ్యటం ఏమిటి?" అన్నాడు. "తమ్ముడూ! ఇది నీ 'స్వభావం'లో వచ్చిన మార్పుకాదు! 'ప్రదేశం'లో వచ్చినమార్పు! నడు! వెళ్ళిపోదాం!" అన్నాడు.

**(ii)** భోజమహారాజు పరిపాలనచేస్తున్న కాలం అది. ఒక మొక్కజొన్నతోట ఉన్నది. ఆ తోటమధ్యలో ఒక పెద్దదిబ్బ (ఎత్తైన భాగం)ఉన్నది. ఆ దిబ్బపైన ఒక మంచె కట్టుకున్నాడు ఆ మొక్కజొన్నతోట యజమాని (పిట్టల్ని కొట్టటంకోసం).

మంచెపై ఉండి, వడిసెలతో పిట్టల్ని కొడుతున్నాడు. ఆ మొక్కజొన్నతోట దారిలో వెళ్లే బాటసారుల్ని ఆ రైతు అభిమానంగా ఎలుగెత్తి పిలుస్తున్నాడు. "పిల్లలకు నాలుగు మొక్కజొన్న పొత్తులు తీసికెళ్ళండి!" అన్నాడు. వాళ్లు వచ్చి పొత్తులు విరుచుకొంటూ ఉండగా, "అవి చిన్నవి! ముదిరిపోయాయి; మంచివి నేను కోసి ఇస్తాను" అంటూ మంచెదిగి వచ్చి, కోపంతో "మీకు బుద్ధిలేదా? ఆరుగాలం కష్టపడి పండించిన పొత్తులు విరిచేస్తున్నారు! మీ బాబు సొమ్మనుకున్నారా? పోండి! పోండి! చెయ్యి వేస్తే నరికేస్తాను?" అని వెళ్ళగొడుతున్నాడు. బాటసారులు భయంతో పారిపోతున్నారు – అతని ఆహ్వానమూ అదలింపూ అర్థంకాక!

మళ్లీ దిబ్బమీద కట్టుకొన్న 'మంచె" ఎక్కి, మళ్ళీ బాటసారుల్ని ఆహ్వానిస్తున్నాడు. మొక్కజొన్నపొత్తులు కోసికొని తీసుకువెళ్ళమంటున్నాడు. మంచె దిగగానే పోట్లాడుతున్నాడు. ఈ ఆశ్చర్యకర విషయాన్ని గూఢచారులు భోజమహారాజుతో (వింత విషయంగా) తెలియజేశారు. మంచెపై నున్నప్పుడు ఉదారంగా ఉంటున్నాడు. మంచె దిగగానే సామాన్యుడుగా ఉంటున్నాడు. ఆ దిబ్బలో ఏదో మహత్వం ఉందని, పరిశోధించుడని రాజభటులకు ఆజ్ఞాపించాడు భోజరాజు.

ఆ దిబ్బను త్రవ్వించారు. ఆ దిబ్బలో 32 బంగారు బొమ్మలతో విక్రమార్క సింహాసనం (సింహాసన ద్వాత్రింశిక) ఉంది. ఆ దిబ్బపై ఎక్కిఉన్నవాడు ఉదార మహత్వాలతో ఎందుకున్నాడో అర్థం అయింది.

## (2) మెఱపు వైరాగ్యమా? స్థిర వైరాగ్యమా?

ఒకప్పుడు శ్రీకాళహస్తిలోని శుకబ్రహ్మాశ్రమానికి ఒకాయన వచ్చి, స్వామీజీ పాదాలపై పడ్డాడు. రెండుకాళ్లూ గట్టిగా పట్టుకొన్నాడు. "లేబాబూ!" అంటే లేవడు. "ఏమిటి చెప్పు!" అంటే "ఏమీ లేదు! అంతా తెగిపోయింది స్వామీ! నాకు సన్న్యాసం ఇవ్వండి! ఇంక మాట్లాడకండి! ఏమీ అడగకండి! సతులు మాయ! సుతులు మాయ! మహాప్రభో! నన్ను ఈ మాయలోకి లాగకండి. వెంటనే సన్న్యాసం ఇవ్వండి! సన్న్యాసం తీసుకోవటం – లేదా మీ యెదుటే ప్రాణాలు తీసుకోవటం! ఇంక మాట్లాడకండి!" అన్నాడు.

ఈ మాటలు విన్న స్వామీజీ "సరే! సదానందా! కాషాయ వస్త్రాలు తేరా! దండ కమండలాలు కూడా పట్టుకురా! వెంటనే మంగలిని రమ్మను!'' అన్నారు. దండ-కమండలాలు, కాషాయ వస్త్రాలు సిద్ధంగా పెట్టారు. మంగలి, కత్తి నూరుతున్నాడు – ముండనంకోసం.

"నాయనా! ముండనం అయినవెంటనే, స్నానంచేసి వస్తే, సన్న్యాసం ఇచ్చెయ్యటం తథ్యం. తరువాత భగవద్గీత 'విశ్వరూప సందర్శన యోగం' పారాయణం చెయ్యాలి! ఈ పూట భిక్ష ఇక్కడే! రేపటినుండి నీ యిష్టం వచ్చిన చోటికి వెళ్లవచ్చు! చివరగా ఒక్క ప్రశ్న:- నీవు ఏ మయ్యావో? అని నీ పెళ్ళాంపిల్లలు వెదుకుతారు! నీకు ఆశ్రమాలు జ్ఞానవాక్యాలు అలవాటుకదా! ఎవరో అంటారు 'శ్రీకాళహస్తి ఆశ్రమానికి వెళ్లి చూడండి!' అని. నీ భార్యాపిల్లలు ఏడుస్తూ వస్తారు! అప్పుడు ఏంచేస్తావ్?" అన్నారు స్వామిజీ. "ఆ సంగతి అప్పుడు ఆలోచిద్దాం లెండి! ఇప్పుడు సన్న్యాసం ఇవ్వండి!" అన్నాడు. వెంటనే స్వామీజీ "కషాయం దిగకుండా కాషాయం ఎందుకునాయనా! ఇంటికి వెళ్లి సర్దుకొని పెళ్ళాం పిల్లలతో బ్రతుకు!" అని ఆశీర్వదించారు.

ఎన్నో జన్మలనుండి బలపడిన సంసారాసక్తి తొలగటానికి దైవానుగ్రహం కూడా ఉండాలి! అంత తేలికగా తెగిపోయేదీ కాదు, త్రెంచుకోగల్గిందీ కాదు, ఈ సంసారబంధం!

## (3) మోక్షం కావాలంటే కోరికలన్నీ పూర్తిగా విడిచిపెట్టాలి

**శ్లో॥ ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ! మనోగతాన్।**
**ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞ స్తదోచ్యతే॥** (భగవద్గీత, 2-55)

**టీక:-** పార్థ! = ఓ అర్జునా, యథా = ఎప్పుడు, మనోగతాన్ = మనస్సునందుండెడు, సర్వాన్ = సమస్తములైన, కామాన్ = కోరికలను, ప్రజహాతి = బొత్తిగ వదలివేయు చున్నాడో, ఆత్మన్యేవ = ఆత్మయందే, ఆత్మనా = ఆత్మచే (ఆత్మనవలంబించిన మనస్సుచే), తుష్టః = సంతుష్టిని పొందినవాడై (భవతి=అగుచున్నాడో), తథా=అప్పుడు, స్థితప్రజ్ఞః (ఇతి) = స్థితప్రజ్ఞుడని (నిశ్చలమైన బుద్ధికలవాడని), ఉచ్యతే = చెప్పబడు చున్నాడు.

తా॥ ఓ అర్జునా! ఎప్పుడు మనుజుడు తన మనస్సునందున్నట్టి కోరికలన్నింటిని సంపూర్ణముగ వదలివేయునో, మఱియు ఆత్మయందే ఆత్మచే (నిర్మల చిత్తముతో) నిరంతరము సంతుష్టిని పొందుచుండునో, అప్పుడాతడు "స్థితప్రజ్ఞుడు" అని చెప్పబడును.

(కోరికలన్నీ పూర్తిగా తుడిచివెయ్యాలి! ఏచిన్నకోరిక ఉన్నా, అది మోక్షానికి ఆటంకమే!)"

ఒక ఆశ్రమంలో ఒక జ్ఞానగురువు ఉన్నాడు. వేదాంతం బోధించటంలోనే కాకుండా, ఆచరణలో కూడా ఆయన మహాత్ముడు. ధ్యాననిష్ఠలో - ఆత్మనిష్ఠలో -

మహాశక్తులు ఆయనకు సంప్రాప్తించాయి. ఎంత మహాత్ములైనా "దేహత్యాగం చేసే రోజు" ఉంటుంది కదా! ఆరోజు వచ్చింది. మహాజ్ఞానాన్ని బోధించిన మహనీయుడు గురువర్యుడు శివసాయుజ్యం పొందబోతున్నాడు. ఆశ్రమం ముంగిట్లో దర్భాసనాలు పరిచారు. ఆపై పూవులు చల్లి గురువర్యుల్ని పరుండబెట్టారు. శిష్యులు విసనకఱ్ఱలతో వీస్తున్నారు. గంగచెంబుల సీళ్ళు ఛేదించి, గంగోదకం తులసిదళాలతో మేళవించి తెచ్చారు. చిన్న చెమ్చాతో ఆ తులసితీర్థం, గురువర్యుల గొంతులో "నారాయణ! నారాయణ!" అంటూ భక్తితో పోస్తున్నారు. గురువుగారు కూడా విష్ణుసహస్రనామ శ్లోకాలు అంటున్నారు. శిష్యులందరూ నిశ్శబ్దంగా, బెంగ బెంగగా, "కడచూపు"గా గురువర్యుల్నే చూస్తున్నారు. ఒక విద్యార్థికి ఒక ఆలోచన వచ్చింది "మన గురువర్యులు వేదాంతజ్ఞాని కదా! ఆచరణలో (నిష్ఠ) గరిష్ఠులు కదా! ఇప్పుడు వీరు దేహత్యాగం చేస్తున్నారు. వీరికి మోక్షం వస్తుందా? లేక పోతే పునరపి జనన (మళ్లీ జన్మించట) మేనా?" – "మన గురువుగారు మోక్షానికే వెడతారు" అన్నారు కొందరు! – "ఏమో? ఏం చెప్పగలం?" – అన్నారు మరికొందరు! "అయినా, గురువుగారు మోక్షం పొందారో లేదో? మనకి ఎలా తెలుస్తుంది?" అని ప్రశ్నించారు ఇంకొందరు! "ఇంత తర్జన భర్జన లెందుకు? గురువుగారు స్పృహలోనే ఉన్నారు, వారినే అడుగుదాం!" అన్నారు పరిష్కారమార్గంగా.

"గురువుగారూ! మీరు శరీరాన్ని విడిచిపెడుతున్నారు కదా! మీకు తప్పకుండా, మోక్షం వస్తుంది. కాని మీరు మోక్షం పొందినట్లు మాకు ఎలా తెలుస్తుంది?" అని ప్రశ్నించారు. "నాయనా! నాకు మోక్షం రాగానే మన మఠంలో గంటలు ఒక్కసారి గణగణా మ్రోగుతాయి! అదే గుర్తు!" అన్నారు. కన్నుమూశారు! అంతవరకు గురువుగారిమీద ఉన్న శిష్యుల చూపులు, మఠంగంటలవైపు చూస్తున్నాయి.

అరగంట గడిచింది! గంట గడిచింది! గంటలు గడుస్తున్నాయి కాని గంటలు మ్రోగటం లేదు. "గురువుగారు మోక్షం పొందలేదు" అనుకోవటానికి మనస్సులు అంగీకరించటంలేదు! "మోక్షం పొందారు!" అనుకోవటానికి గంటలు మ్రోగటం లేదు! ఒక పూట గడిచింది. శిష్యులు, పిచ్చివాళ్లుగా వెలవెలపోతూ చూస్తున్నారు.

ఆ శిష్యసంఘంలోంచి ఒక శిష్యుడు అమాంతంగా లేచాడు. గంటలవైపు చూడటం మానేసి, అందరూ ఆ శిష్యచూడామణిని రెప్పార్పకుండా చూస్తున్నారు. ఆ శిష్యుడు గబగబా ఆ ప్రక్కనున్న కలెక్టరుమామిడిచెట్టు ఎక్కాడు. (కలెక్టరుమామిడి = ఇది మామిడిజాతి భేదం. ఇది చక్కని రంగుతో కన్పిస్తుంది. పేరు గొప్ప! ఊరు దిబ్బ! –

అన్నట్లుగా పైమెరుగులు ఎక్కువ - ప్రమాణం అధికం! అంతస్సారం శూన్యం! పండులోపల పురుగు పుట్టే లక్షణం ఉంది. పొడుగ్గా కోలగా ముచిక దగ్గర ఎరుపు పసుపు కలిగిన రంగులో ఉండే ఈ మామిడి పండ్లను చిత్తూరుజిల్లాలో ఎక్కువగా పండిస్తారు.) పైకి బాగా రంగు కన్పిస్తున్న కాయ కోసి తీసుకువచ్చాడు! "ఈ పండు మనగురువుగారి చివరిదృష్టిపథంలో ఉంది! చివరిక్షణాలలో-మన గురువు గారికి ఈ మామిడిపండుపై మనసుపడింది! చూడండి!" అంటూ ఆ పండు కోశాడు. ఆ కోతలో ఒక పురుగు కూడా తెగి, క్రిందపడి, విలవిల తన్నుకొని చచ్చింది! మఠంలో గంటలన్నీ ఒక్కసారి గాలిగంటల్లా మ్రోగాయి. ఈ దృష్టాంతంలో మనం గమనించాల్సింది ఒకటి ఉంది. ఆ గురువుగారు ఆధ్యాత్మికపథంలో ఎంతో నైష్ఠికజీవనం గడిపారు. "స్వయం తీర్ణః పరాన్ తారయతి" అన్నట్లుగా ఎందర్నో తరింపజేశాడు. చివరకు చిన్న కోరికకు లోనయ్యాడు. పునర్జన్మ ఎత్తాడు. అందుచేత పరమాత్మ "ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్" (2-55) అన్నాడు. "మనస్సులో ఏ చిన్న కోరికా మిగలనియ్యకూడదు! ప్రజహాతి - పూర్తిగా విడిచి పెట్టాలి!" అని ప్రబోధించాడు.

## (4) "బలవాన్ ఇంద్రియగ్రామో..."

**శ్లో. "యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః**
**ఇంద్రియాణి ప్రమాథీని హరన్తి ప్రసభం మనః"** (2-60)

"ఓ అర్జునా! ఇంద్రియాలు మహాబలమైనవి. ఆత్మసాక్షాత్కారంకోసం ప్రయత్నించే పండితుడైన జ్ఞానిని కూడా ఇంద్రియాలు బలాత్కారంగా ఇంద్రియాల వైపు లాగివేస్తాయి"

వ్యాసమహర్షి భారతం చెపుతున్నాడు. ఆనాడు శిష్యుడు జైమిని లేఖకుడు. ఒక సందర్భంలో "బలవాన్ ఇంద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి" (ఇంద్రియాలు మహాబలమైనవి! ఎంతటి పండితుణ్ణైనా - జ్ఞానినైనా తమ వైపు ఈడ్చివేస్తాయి) అని చెప్పాడు. అంతవరకు, చెప్పినట్లు వ్రాస్తున్న జైమిని (శిష్యుడు) ఆగిపోయాడు. వ్యాసుడు జైమినివైపు ప్రశ్నార్థకంగా చూచాడు. "ఇంద్రియాలు పండితుణ్ణి కూడా లాగివేస్తాయి" అనటం బాగాలేదు! "శ్లోకం మార్చండి!" - అన్నాడు. "ఎలా మార్చమంటావ్! నువ్వే చెప్పు!" - అన్నాడు వ్యాసుడు. "విద్వాంసం నాపకర్షతి" (విద్వాంసుణ్ణి ఇంద్రియాలు ఆకర్షింపలేవు) అని చెప్పండి! - అని మొరాయించాడు. "సరే! సంధ్యానుష్ఠానానికి వేళ అయింది. గ్రంథం కట్టిపెట్టు! రేపు వ్రాద్దువుగాని" అన్నాడు వ్యాసమహర్షి! ఎవరి కుటీరాలకు వాళ్లు వెళ్లారు. అనుష్ఠానాలు పూర్చిచేసుకొని పరున్నారు.

ఆ రాత్రి ఉరుములు మెరుపులతో మహావర్షం ఆరంభం అయింది. జైమిని భయభ్రాంతుడై మేల్కొన్నాడు. వర్షతీవ్రత పెరుగుతోంది. అంతలో, కుటీరానికి కట్టిన ద్వారం తడక ఎవరో తట్టారు. జైమిని తడక విప్పాడు. మెరపులో, గుమ్మం దగ్గర సౌందర్యరాశి అయిన యువతి కన్పించింది. వర్షంలో పూర్తిగా తడిసిన చీర, ఒంటికి అంటుకొని, అంతస్సౌందర్యానికి అద్దంపడుతోంది. ఆమె మీద పడ్డ మెరపులు కూడా క్రొత్త అందాలు దిద్దుకొంటున్నాయి.

"రా అమ్మా!'' అన్నాడు జైమిని ఆహ్వాన పూర్వకంగా. "అయ్యో! నిండా తడిసిపోయావు! ఈ పొడిబట్ట కట్టుకో!" అని నారవస్త్రం ఆమెకు మెరపుల వెలుగులో చేతికి ఇచ్చాడు. తానుగది ముందున్న అరుగు మీద కూర్చున్నాడు.

ఆ సుందరి తడిచీరను విడిచి, నారవస్త్రం ధరించింది. "అమ్మా! తడక కట్టి పండుకో!", అని తాను గదికి ఈవలి అరుగు మీద పరున్నాడు. ఆమె, తడక తలుపుత్రాడు గట్టిగా కట్టి, లోపల పరున్నది. జైమిని కుటీరం అరుగుమీద పరున్నాడు. మెరపులు – ఉరుములు – వర్షం – ఒకేస్థాయిలో తమ ఔద్ధత్యం చూపుతున్నాయి.

బయట అరుగుమీద పరున్న జైమిని మనస్సులో ఏదో "గుబులు" ఆరంభం అయింది. ఒక ప్రక్కకు ఒత్తిగిల్లి పరున్నవాడు, మరో ప్రక్కకు అంతలోనే ఒత్తిగిల్లాడు. మరుక్షణంలో వెల్లకిల పరున్నాడు. అది కాదని కుడిప్రక్కకు తిరిగి పరున్నాడు. అంతలోనే ఎడమచేతిమీద తలపెట్టుకున్నాడు. పడక విధానాలు మారుస్తున్నాడు. కాని "గుండె గుబులు" స్థిరంగా ఉండనియ్యటం లేదు. కన్నుమూసినా, కన్ను తెరచినా ఆ అన్నులమిన్న, ఆ నవమోహనాంగే కన్పిస్తోంది. తన మనస్సును ఆమె పూర్తిగా లూటీ చేసింది. మనిషి బయట! మనసు లోపల! ఇటునుండి అటు – అటునుండి ఇటు దొర్లుతున్న జైమిని అమాంతంగా లేచి కూర్చున్నాడు. తడక దగ్గరకు వెళ్లి, తడకను చేతితో తట్టాడు. మళ్లీ వచ్చి అరుగుమీద కూర్చున్నాడు. ఏదో ఆవేశం ఆవహిస్తోంది. ఆవేదన నిలవనియ్యటం లేదు. ఆగలేకపోయాడు. అరుగుమీద నిలిచి, "ఎలిసి" మీదుగా కుటీరంలోకి దూకాడు. మెరపులో సుందరి కన్పించింది. ఆమెను అమాంతం కౌగిలించుకొన్నాడు. పారవశ్యంలో కౌగిలి బిగిస్తున్నాడు.

గుండెలకు గడ్డంజుట్టు తగులుతోంది. ఇదేమిటి? అంతలో మెరపుతరుణి స్పష్టంగా చెప్పింది. "తనకౌగిటిలో ఉన్నవాడు గురువర్యుడు వ్యాసభగవానుడని!" జైమినికి ఆవేశ కావేషాలు పూర్తిగా అంతరించాయి. "బలమైన ఇంద్రియాలు ఎంతటి వాడినైనా లాగివేస్తాయి'' అనే గురువాక్యానికి ఇదంతా ప్రత్యక్ష వ్యాఖ్యానం–అని గ్రహించాడు.

సౌందర్యరాశిలో వ్యాసభగవానుణ్ణి చూచాడు. జైమిని గురుపాదాలు గట్టిగా పట్టుకొని **"బలవానింద్రియగ్రామో విద్వాంసమ్ అపి కర్షతి! కర్షతి!! కర్షతి కర్షత్యేవ!"** ("బలమైన ఇంద్రియాలు విద్వాంసుని కూడా లాగివేస్తాయి - లాగి తీరుతాయి!") అంటూ క్షమించమన్నాడు. వ్యాసుడు నవ్వుకొన్నాడు శిష్యవాత్సల్యంతో.

కాబట్టి బలవత్తరమైన ఇంద్రియాలను వశపరచుకొని, మనస్సును స్థిరంగా ఉంచుకోవాలి! ఇంద్రియాలు స్వాధీనంలో ఉన్నవానికి జ్ఞానం సుస్థిరంగా ఉంటుంది.

## (5) "అహంకార - మమకారాలు"

ఒక ఆధ్యాత్మిక సమావేశానికి చాలమంది సన్యాసులు హాజరు అయ్యారు. ఆశ్రమ వృక్షచ్ఛాయలో ఒక సన్యాసి తలకు దగ్గరగా కమండలం పెట్టుకొని కన్నుమూసికొని పరున్నాడు. అటుగా వెళ్లుచున్న వ్యక్తి "ఈ స్వామిజీకి 'మమకారం' ఎక్కువే! చూడు! కమండలం కౌగిలించుకొని పరున్నాడు!" అన్నాడు తన మిత్రునితో. వెంటనే స్వామిజీ, తలదగ్గరున్న కమండలం తన కాళ్లదగ్గరకు విసిరాడు! "మమకారమే కాదు రోయ్! ఈ సాధువుగారికి 'అహంకారం' కూడా ఎక్కువే! రెండూ ఈయనలో పోటీపడుతున్నాయి - నేను ఎక్కువంటే, నేనెక్కువని" - అన్నాడు మిత్రుడు.

### "అహంకారం"

తపస్సులో ఎంత అభివృద్ధిని సాధించినా అహంకార - మమకారాలూ, అరిషడ్వర్గం వెంటాడుతూనే ఉంటాయి. జడభరతుణ్ణి "మమకారం" - విశ్వామిత్రుణ్ణి "అహంకారం", ఎంత వెంటాడాయో పురాణాల్లో చూచాము. ఒక అరణ్యంలో ఇద్దరు తపస్సు చేస్తున్నారు. వాళ్లదగ్గరకు నారదుడు వచ్చాడు. "మహర్షీ! తమరు ఎక్కడనుండి వస్తున్నారు?" అని అడిగారు ఏకకంఠంగా. "వైకుంఠంనుండి వస్తున్నాను" అన్నాడు నారదుడు. "అయితే అక్కడ మోక్షం పొందబోయేవాళ్ల జాబితా - చూచారా?" అని అడిగారు.

నారదుడు : "చూచాను!"

తాపసులు : "అందులో మా పేర్లున్నాయా?"

నారదుడు : "లేవు! ఇంకా ఎక్కలేదు!"

తాపసులు : "ఎప్పుడెక్కుతాయి?"

నారదుడు : "మేం తపస్సు చేస్తున్నాం అనే అహంకారం మీకు తొలగిపోగానే ఎక్కుతాయి"

తాపసులిద్దరూ కుక్కినపేనుల్లా అయిపోయారు. ఒకరి ముఖం ఒకరు చూచుకొన్నారు!

"నారాయణ! నారాయణ!" అంటూ నారదుడు ఆకాశంలోకి అదృశ్యుడయ్యాడు.

## (6) మిథ్యాచారుడు

ఇద్దరు యువకులైన సన్న్యాసులు ఒక నదిని దాటుటకు సన్నద్ధులౌతున్నారు. ఆ సమయంలో ఒక యువతి వారి దగ్గరకు వచ్చి, "స్వామీ! నన్ను కూడా నదిని దాటించండి!" అని కోరింది. "మేం సన్న్యాసులం! ఆడవాళ్లని ముట్టుకోం!" అన్నాడు మొదటి యువకుడు! ఆమె నిరాశ పడింది. రెండవ సన్న్యాసి "రా అమ్మా! నేను దాటిస్తాను" అన్నాడు.

ఆ యువతి, ఆ రెండవ యువకుని చెయ్యి గట్టిగా పట్టుకొని మొలబంటి నదిలో నడుస్తోంది. ఆ సన్న్యాసి "నారాయణ!" "నారాయణ" అంటూ, అందాల యువతిని పట్టుకొన్నాను అనే ఆలోచన లేకుండా, ఆమెను దాటిస్తున్నాడు. ఈ దృశ్యాన్ని కోపంగా, ఈర్ష్యగా మొదటి యువకస్వామి చూస్తున్నాడు.

నదిమధ్యలో ప్రవాహవేగం అధికంగా ఉంది. పైగా లోతు పెరిగింది. ఆ తరుణి భయపడింది. యోగికంఠాన్ని భయంతో రెండు చేతులతోనూ కౌగిలించుకొంది. ఆమె కరస్పర్శ, కంఠస్పర్శ ఆ యువకస్వామియొక్క ఆయాభాగాలు దాటటం లేదు. మనస్సుకు అంటటం లేదు. మొదటి యువకస్వామి శరీరానికి ఆమె స్పర్శ అణుమాత్రం లేదు! అయినా మనస్సు "ఏదో ఏదో" అయిపోతోంది. తనకు అందని ఆనందం అన్యాక్రాంతం అయిపోతున్నట్లు, ఈర్ష్యా ద్వేషాలు పొందుతున్నాడు. ఒడ్డుకు రాగానే ఆమె ఆ యువకస్వామిజీ కంఠం విడిచిపెట్టి, చేతులు జోడించి నమస్కరించి, తన దారిన తాను వెళ్లిపోయింది. ఆ రెండవ యువకుడు భగవన్నామస్మరణం చేశాడు. మొదటిస్వామి రెండవస్వామిని అపచారం చేసినవాడినిలా చూస్తున్నాడు. ఇద్దరు స్వాములూ ఆశ్రమం చేరుకొన్నారు. రాత్రి అనుష్ఠానం ముగించుకొని పరున్నారు.

యువతిని దాటించిన స్వామి, గాఢ సుషుప్తిలోకి వెళ్లిపోయాడు. మొదటిస్వామి కళ్లు మూశాడు "నది-తడిసి, ఒంటికి అంటుకొన్న చీరతో, సారసాంగి వివిధ భంగిమల్లో కన్పిస్తోంది. తన మిత్రుడి కంఠంచుట్టూ, అందమైన చేతులు చుట్టివేస్తోంది! నడి ఏట్లో గట్టిగా కౌగిలిస్తోంది. తనను ఈర్ష్య పెనవేస్తోంది. ఇది ఏదో తేల్చుకోవాలని "కసి" ఏర్పడింది. కళ్లు తెరిచాడు.

రెండవస్వామిని ఖంగారుగా మేల్కొల్పాడు. ఆ స్వామి లేచి "ఏమిటి?" అన్నాడు. "నువ్వు చేసింది తప్పుకాదా?"-"ఏమిటి?"-"ఏమిటి-అంటావా? సాధువైయుండి

సన్న్యాసంలో ఉండి, ఆడుదాన్ని కౌగిలించుకొన్నావు. మహాపచారం చేశావు." – "ఏదో నదిని దాటించమంది! దాటించాను! అది అప్పుడే మరచిపోయాను!" అంటూ నిద్రలోకి వెళ్లిపోయాడు.

**శ్లో॥ "మనసైవ కృతం పాపం, న శరీరకృతం కృతమ్**
**యేనై వాలింగితా కాంతా, తేనై వాలింగితా సుతా॥"** (–జ్ఞానవాసిష్ఠం)

మనస్సుతో చేసినదే కాని, శరీరావయవాల కలయిక (శరీర స్పర్శ) వల్ల పాపం కాదు! ఏ శరీరంతో భార్యను కౌగిలిస్తాడో, ఆ శరీరంతోనే కన్నకూతుర్ని దగ్గరకు తీసికొంటాడు. మనస్సులో ఎంత వ్యత్యాసమో గమనించండి!

మొదటి యువకస్వామి చేతులతో ఆమెను అంటలేదు! నడిఏటిలో కౌగిలించలేదు! ఆమెను పట్టుకొనలేదు! కాని మానసికంగా, ఆమె శరీరంతో (ఏకమయ్యాడు) – అద్వైతం చెందాడు. ఆమె అందాన్ని మననంచేస్తున్నాడు. ఈ మొదటిస్వామియే "మిథ్యాచారుడు!"

## (7) నిష్కామ కర్మయోగి జనకుడు

**శ్లో॥ "యస్త్వాత్మరతిరేవస్యాత్। ఆత్మతృప్తశ్చ మానవః**
**ఆత్మన్యేవ చ సంతుష్టః। తస్య కార్యం న విద్యతే"** (3–17)

"ఎవడు కేవలము అత్మయందే క్రీడిస్తూ, ఆత్మయందే తృప్తిని పొందుచు, సంతోషించుచుండునో, అట్టి ఆత్మజ్ఞానికి చేయవలసినది లేదు! కావున ఆసక్తి పెట్టుకొనక, చేయవలసిన పనులు చేయుము." "అనాసక్త కర్మయోగి" మోక్షాన్ని పొందును. జనకాది కర్మయోగులు నిష్కామ కర్మమార్గంలో మోక్షాన్ని సాధించారు.

జనకమహారాజు కర్మయోగిగా ఉండి, మహాసామ్రాజ్యం ఏలాడు. అతడు మహామునులను రప్పించి, ఆధ్యాత్మిక గోష్ఠులు నిర్వహించేవాడు. జ్ఞాననిష్ఠాగరిష్ఠులు జనకునిపై దృష్టినిల్పి, ఆధ్యాత్మిక ప్రవచనాలు చేసేవాళ్లు! అతని అభిప్రాయాన్ని అడుగడుగునా అడుగుతూ ఉండేవాళ్లు! ఇది తక్కిన మునులకు నచ్చలేదు. రాజాభిమానం సంపాదించటంకోసం, అలా రాజుకు తగని విలువ ఇస్తున్నారని "గుసగుసలు" పోతున్నారు.

ఒకనాడు, ఆధ్యాత్మికసభకు విచ్చేసిన మహర్షులు ధనాగారం వసారాలో తమ కౌపీనాలు ఆరవేసుకొని సభకు వచ్చారు. సభలో "అష్టావక్రా"ది మహర్షులు ఆధ్యాత్మిక ప్రసంగాలు చేస్తున్నారు. అందరూ పారవశ్యంతో వింటున్నారు. "అపటీక్షేపంగా" రాజభటుడు ప్రవేశించాడు. (నాటకాలలో, క్రొత్తపాత్రయొక్క ప్రవేశం సూచించి, ఆ

పాత్రను ప్రవేశపెట్టటం నాటక సంప్రదాయం! ప్రమాదాలలో, ఆకస్మిక పరిస్థితుల్లో, పాత్రసూచన లేకుండా, తెర తోసుకొని హఠాత్తుగా ప్రవేశించే పాత్రప్రవేశాన్ని "అపటీక్షేప ప్రవేశం" అంటారు.) ఈ విధంగా ప్రవేశించిన రాజభటుడు "మన ధనాగారం తగులబడిపోతోంది మహారాజా!" అన్నాడు. మహర్షులందరూ ఒక్కసారి లేచి ధనాగారంవైపు పరుగెత్తారు (అక్కడ వరండాలో ఆరేసిన తమ కౌపీనాలు కాలిపోతాయని!). జనకుడు కదలలేదు, ఖంగారు పడలేదు!

అప్పుడు అష్టావక్రుడు అన్నాడు "ఆధ్యాత్మిక జ్ఞానంలో మహారాజుకు మీకూ ఎంత భేదం ఉందో గ్రహించండి! ఆ మహారాజు 'ధనాగారం దగ్ధం అవుతోంది' అని విని కూడా, జ్ఞాననిష్ఠతో సుస్థిరంగా ఉన్నాడు! కౌపీనాలు కాలిపోతాయని ఖంగారుగా పరుగులు తీశారు మీరు! మహారాజును కేంద్రీకరించి మేము ఆధ్యాత్మిక విషయాలు ఎందుకు చెప్తున్నామో గ్రహించండి!" అన్నాడు. గోచీలకోసం పరుగెత్తి తిరిగి వచ్చిన ఆ పరమఋషులు తలలు వంచారు!

## (8) శ్రేష్ఠుడు ఏ కర్మను చేస్తాడో అదే కర్మను అందరూ చేస్తారు

**శ్లో॥ "యద్యదాచరతి శ్రేష్ఠః। తత్తదేవేతరో జనః**
**సః యత్ప్రమాణం కురుతే। లోకః తదనువర్తతే"** (3-21)

శ్రేష్ఠుడు (గొప్పవాడు - పండితుడు) ఏ కర్మను చేస్తాడో, అదే కర్మను అందరూ అనుసరిస్తారు. అతడు దేనిని ప్రమాణంగా తీసుకొంటాడో తక్కినవాళ్లు కూడా దానినే ప్రమాణంగా తీసుకొంటారు.

దీనికి ఒక దృష్టాంతం చెప్పుకొందాం!

**శ్లో॥ "గతానుగతికో లోకో। న లోకః పారమార్థికః**
**ఏలా వాలుక లింగేన। నష్టం మే తామ్రభాజనమ్!"**

"పెద్దలను - (ముందున్న వాళ్లను) వెనుక వాళ్లు, అనుసరిస్తారు. అంతేకాని, అందులోని అంతరార్థం ఆలోచించరు! ఇది లోకస్వభావం! ఏలానది ఒడ్డున ఇసుక లింగాన్ని తయారుచేసి నా రాగిపాత్రను నేను పోగొట్టుకొన్నాను."

ఏలానదీతీరంలో ఒక అగ్రహారం ఉంది. అందులో "రామశాస్త్రి" అనే పండితుడున్నాడు. ఒకప్పుడు సూర్యగ్రహణం వచ్చింది. గ్రహణానికి రెండు స్నానాలు చెయ్యాలి! ఒకటి "పట్టుసాన్నం"- ఇది గ్రహణం పట్టగానే చెయ్యాలి! రెండు "విడుపుస్నానం" - ఇది గ్రహణం విడవగానే చేస్తారు. గ్రహణం పట్టిందిమొదలు

విడుపువఱకు ఉండే గ్రహణకాలంలో మంత్రజపం చేస్తే, ఆ మంత్రశక్తి పెరుగుతుంది. పూర్వకాలంలో "తేలుమంత్రం", "పాముమంత్రం", "బెణుకుమంత్రం", "కామెర్ల మంత్రం" ఆదిగా మంత్రాలు వేసేవాళ్లు ఉండేవారు. ఈ గ్రహణసమయంలో వాళ్ళు నీళ్లలో నిలిచి, విడుపుకాలం దాకా తదేకదీక్షగా మంత్రజపం చేసేవాళ్లు.

రామశాస్త్రిగారు శాస్త్రపండితుడు, జ్యోతిషవేత్త, పెద్దవాడు. అగ్రహారంలోని వాళ్లందరూ ఆయన్ను గౌరవించేవాళ్లు. ఆయన మంత్రవేత్తకూడా అవటంవల్ల ఆ గ్రహణసమయంలో పునశ్చరణ చెయ్యాల్సిన మంత్రాలు చాలా ఉన్నాయి. అందుచేత గ్రహణానికి కొన్ని ఘడియలకు ముందే, రాగిచెంబుతో ఏలానదీతీరం చేరుకొన్నాడు. (చెంబు లేకుండా స్నానానికి వెళ్లకూడదు. నిండా నీళ్లున్న చెంబు చేతితో ధరింపక పోతే, చేసిన స్నానానికి పవిత్రత లేదు.) గ్రహణంకోసం ఆ ఏలానదీతీరంలో ఇసుక మీద ఆసీనుడై ఉన్నాడు. అప్పటికి రామశాస్త్రి ఒక్కడే అక్కడున్నాడు.

అంతలో గ్రహణం ఆరంభం అయింది. రామశాస్త్రి "గోవిందా!" – "గోవిందా!" అంటూ లేచాడు. పై పంచ నడుముకు చుట్టుకొన్నాడు. రాగిచెంబు అక్కడ పెట్టాడు. దాని రక్షణకోసం దానిని ఇసుకతో కప్పాడు. చెంబున్నచోటు తనకు స్పష్టంగా తెలియటం కోసం, దానిపై లింగాకారంగా ఇసుక ప్రోగుచేశాడు. అది సైకత (ఇసుక) లింగంగా కన్పించింది. ఆ లింగంక్రింద తన రాగిచెంబు సురక్షితంగా ఉంటుంది. మంత్రజపం ముగించుకొని రాగానే, తన చెంబున్న చోటు తాను స్పష్టంగా గుర్తించవచ్చు –అనుకొన్నాడు పాపం ఆ బాపనయ్య! నిశ్చింతగా "హరహర మహాదేవ!" అంటూ స్నానం పూర్తిచేసికొని, నిష్ఠగా మంత్రజపంలో నిమగ్నుడైపోయాడు.

అగ్రహారంలో ఉన్న అశేషప్రజానీకం ఆబాలగోపాలం గ్రహణస్నానానికి వచ్చారు. రామశాస్త్రిగారు "ఇసుక లింగంచేసి నదిలోకి దిగటం"– వారి వెనుక వచ్చిన వాళ్లు చూచారు. వాళ్లు కూడా అదే ప్రమాణంలో, అదే ఆకారంలో రామశాస్త్రిగారు చేసిన ఇసుకలింగానికి ప్రతిరూపాలుగా ఇసుకలింగాలు చేస్తూ స్నానాలు చెయ్యటం ఆరంభించారు. కొలది కాలంలో ఏలానదీతీరం అంతా ఇసుకలింగాలతో నిండిపోయింది. ఎటు చూచినా శివలింగాలే! ఒకే ఆకృతిలో ఎన్నో! ఎన్నెన్నో! సైకత లింగాలు!

మన రామశాస్త్రిగారు మంత్రజపం ముగించారు. విడుపుస్నానం కూడా చేశారు. రాగిచెంబుపై తాను చేసిన సైకతలింగం కళ్లలో మెదిలింది. ఆ శివలింగం తొలగించి, తామ్రభాజనం తీసుకుందాం అనుకొంటూ ఒడ్డెక్కాడు. తన శివలింగంకోసం చూచాడు. "వేల శివలింగాలు!" కన్పిస్తున్నాయి. అందులో తాను చేసిన శివలింగం ఏదో

తేల్చుకోలేక పోయాడు. ఎన్నో ఇసుకలింగాలు తొలగించి, చెంబుకోసం చూశాడు. ఎక్కడా తన తామ్రపాత్ర కన్పించలేదు. వెదకి వెదకి అలసిపోయాడు. "నేను చెంబుకు గుర్తుగా ఒక్క శివలింగం చేస్తే, ఇన్ని వీళ్లు ఎందుకు చేశారు? ఈ ప్రపంచానికి బుద్ధిలేదు. ముందువాడు చేసిన పనిని వెనుకవాడు చెయ్యటమే కాని 'ఆ పని వాడు ఎందుకు చేశాడు?' అనే అంతరార్ధ చింతనం ఈ ప్రపంచానికి లేదు. "ఏలా వాలుక లింగేన, నష్టం మే తామ్రభాజనమ్!" (ఏలానది ఒడ్డున, ఇసుక లింగం చేసి, బంగారంలాంటి నా రాగిపాత్రను చేతులారా పోగొట్టుకొన్నాను) – అనుకొన్నాడు.

## (9) ధర్మసందేహం

"ధర్మసందేహం" – ఇద్దరు మిత్రులు చీకటి పడుతూ ఉండగా శివాలయం వైపు వెళ్లారు. మొదటివాడు దైవదర్శనానికి ఆలయంలోపలకు వెళ్లాడు. రెండోవాడికి దైవభక్తి లేదు. వాడు, ఆలయ ప్రాకారంలోకి వెళ్లలేదు. వీథిలోనే తిరుగుతున్నాడు. ఆలయ ప్రాకారంలోపలకు ప్రవేశించిన మొదటివాడు, ఆ మసక చీకటిలో "నందీ శృంగ ద్వయోః మధ్యే శివదర్శనమ్" అనుకొంటూ, అంగుష్ఠం ఒక కొమ్ము మీదా, మధ్యమం మరోకొమ్ము మీదా ఆనించాడు. ఆ రెండు వ్రేళ్లక్రిందినుండి ఈశ్వరదర్శనం చేస్తూ "హరహర శంభో మహాదేవ!" అన్నాడు. ఈలోగా పుటుక్కున తేలు కుట్టింది. కుయ్యో! మొర్రో! అంటూ ఆలయం బయటకు వచ్చాడు. ఆ బయటఉన్న ఆ రెండవవాడు వీడిదగ్గరకు వచ్చాడు. "దేవాలయంలోకి వెళ్లావు! దర్శనం చేసుకొన్నావు! నిన్ను తేలుకుట్టింది! బయట తిరుగుతూ ఉన్న నాకు 'రూపాయి' (వెండినాణెం ఆకాలంలో విలువైంది) దొరికింది" అన్నాడు. ఇద్దరూ వెళ్ళి ఒక మహాజ్ఞానిని ప్రశ్నించారు. "దైవదర్శనం పొందనివానికి రూపాయి లభించటం ఏమిటి? దైవదర్శనం చేసుకొన్న పుణ్యాత్ముడిని తేలుకుట్టటం ఏమిటి?" అన్నారు. ఇది ధర్మసందేహం! పెద్దలద్వారా తెలుసుకోవాల్సింది! ఆ మహాజ్ఞాని అంతర్ముఖుడై ధ్యానించాడు. కళ్లు తెరిచాడు. రూపాయి దొరికినవాడితో అంటున్నాడు. "నాయనా! ఈరోజు నీకు ఒక మహానిధి (పాతిపెట్టబడిన కాసులబిందె) లభించాలి! ఆలయప్రాంగణందాకా వచ్చి, దైవదర్శన భాగ్యం పొందలేదు! తత్ఫలితంగా కాసుల మహానిధికి బదులుగా, అరవైనాలుగు కానుల రూపాయిమాత్రం దొరికింది. దైవాపచారంవల్ల చాలా నష్టపోయావు నాయనా!" అని జాలిపడ్డాడు సానుభూతిగా.

రెండవవాడిని చూస్తూ, "నాయనా! ఈ రోజు నీవు సర్పదష్టుడవై మరణించవలసిన రోజు! 'నందీశ్వర నమస్తుభ్యం! సాంబానంద ప్రదాయక!' అంటూ, నందీశృంగాల

మధ్యనుండి 'హరహరా!' అంటూ ఈశ్వరదర్శనం చేశావు! నీ పాపాన్ని ఈశ్వరుడు హరించాడు. పాముకాటు పొందవలసిన నీ పాపం, తేలుపోటుతో సరిపోయింది. దైవదర్శనం ఎన్నడూ వ్యర్థంకాదు నాయనా!" అన్నాడు. ఇది జ్ఞానబోధ! అడిగినది పరిప్రశ్న!

జ్ఞానాశ్రమాలలో, పెద్దలు, వేదాంతగోష్ఠులు నిర్వహిస్తూ ఉంటారు. చివరలో శ్రోతలకు ప్రశ్నించే అవకాశం ఇస్తారు. దానినే "పరిప్రశ్న" అంటారు. సంఘానికి ఉపయోగపడే ఉత్తమప్రశ్నకు ఈ పేరు (జ్ఞానయోగంలో) పరమాత్మ పెట్టాడు. భగవద్గీతలో అర్జునుడు భగవానుని ప్రశ్నిస్తూ ఉంటాడు. భాగవతంలో పరీక్షిత్తు శుకమహర్షిని పరిప్రశ్నిస్తూ ఉంటాడు. పాఠకులకు ఆకలిపెంచి, విందులు అందించినట్లుంటాయి ఈ పరిప్రశ్నలు! ఇవి జ్ఞానోపదేశాలు!

## (10) ఆత్మవిశ్వాసం-ప్రయత్నం

ఆత్మవిశ్వాసం ఉండాలి! ప్రయత్నం ఆరంభించాలి! కృషి చేస్తూ ఉంటే, ఆ కృషిలోనే మనం నైపుణ్యం పొందుతాం! పనిలోకి దిగు! ఆ పనే నీకు పని నేర్పుతుంది! నీళ్లలో దిగి కాళ్లు చేతులూ ఆడిస్తూ ఉంటే, నీ అభ్యాసమే నీకు గురువై దారిచూపుతుంది. ఈత నేర్పుతుంది! ఇది లోకసత్యం! ఈ పని నేను చెయ్యగలనా? అని కుప్పకూలిపోయినవాడు ఏమీ సాధించలేడు!

పూర్వం ఒక అమాయకుడైన పల్లెటూరివాడు, రాత్రివేళ, మూడు మైళ్లలో ఉన్న తన గ్రామానికి బయలుదేరాడు. చీకటి దట్టంగా ఉంది. తన దగ్గర ఉన్న లాంతరు వెలిగించాడు. చేతితో పట్టుకొని బయలుదేరాడు. ఆ దీపకాంతులు మూడు గజముల దూరంకంటె ప్రసరించటంలేదు! తాను పోవలసిన గ్రామదూరం మూడు మైళ్ళు! అంతదూరం, మూడు గజాల దూరం వెలుగిచ్చే లాంతరుతో సాధ్యమా? అనుకొన్నాడు. అధైర్య పడ్డాడు. తన లాంతరు మూడు మైళ్ళదూరం కాంతిని ఇవ్వలేదు - అనుకొని, కుప్పకూలిపోయి ఉన్నాడు.

ఆ దారిలో పయనిస్తున్న ఒక పాంథుడు, లాంతరు పట్టుకొని కూలబడి ఉన్న పల్లెటూరి వానిని "ఏమి నాయనా! లాంతరు పట్టుకొని కూర్చుండి ఉన్నావేమిటి?" అని ప్రశ్నించాడు. "అయ్యా! నేను మూడు మైళ్లదూరం చీకటిలో పయనించాలి! ఈ లాంతరు వెలుగు మూడు గజములు మించి పోవుటలేదు! నా ప్రయాణానికి భయపడి కూలబడి ఉన్నాను" అన్నాడు. వెంటనే ఆ పాంథుడు "నాయనా! అధైర్యపడకు, లే, ప్రయాణం సాగించు! ఎప్పటికప్పుడు నీ లాంతరు నీకు మూడు గజాలుగా, మూడు

మైళ్ళూ కాంతి నిస్తుంది. నీ గమ్యం చేరేవరకు, నీకు వెలుగులోటు రాదు! లే! గమ్యంవైపు పయనించు. కృషి దైవస్వరూపం! నీకృషే నిన్ను నడిపిస్తుంది." పల్లెటూరివాడు లాంతరుతో లేచాడు. మూడుగజాలవరకూ దారి కన్పిస్తోంది. ఆ మూడుగజాలు అధిగమించే సరికి, మరో మూడుగజాల వెలుతురు అహ్వానిస్తోంది. జ్ఞానసాధకులు, అధైర్యపడకుండా, అభ్యాసయోగాన్ని ఆశ్రయించి, ఆధ్యాత్మిక సాధనలు చెయ్యాలి!

## (11) నాస్తిదుఃఖం

**శ్లో॥ నాస్తీతి వచనం దుఃఖమ్! అస్తీతి వచనం తతః**
**"అస్తి" "నాస్తి" సమం దుఃఖం । మాభూత్ జన్మని జన్మని!**

ధనం లేకపోవటంవల్ల దుఃఖాన్ని, అశాంతిని అనుభవిస్తాడు. ధనం ఉండటం వల్ల, లేనప్పటికంటె ఎక్కువ దుఃఖం పొందుతాడని నీతిశాస్త్రజ్ఞుల నిర్ణయం! ఇది లోకసత్యం. ఆసురప్రవృత్తివాళ్లు, ఏదోవిధంగా అన్యాయమార్గాలలో ధనం సంపాదించి, ఆ ధనంతో శాంతిసౌఖ్యాలు పొందవచ్చును - అని ఊహిస్తారు. ధనం చేరటంవల్ల, మరింత అశాంతికి లోనవుతారు అని, ఒక బౌద్ధగాథ ప్రబోధిస్తోంది. దానిని గుర్తుచేసుకొందాం:-

బుద్ధుని తరువాత, బుద్ధునంత ప్రఖ్యాతిగన్న మహనీయుడు నాగార్జునుడు! "నాగార్జునుడు" మట్టిమూకుడు చేతపట్టి, భిక్షాటనంచేస్తూ ఉండేవాడు. అంతటి మహాత్ముడు, మట్టిపాత్రతో భిక్షాటనం చెయ్యటం, ఒక ధనికశిష్యుడు చూడలేక పోయాడు. బంగారుపాత్రను గురువర్యులకు సమర్పించి ధన్యుడయ్యాడు. ఆరోజు మొదలుగా నాగార్జునుడు, తన శిష్యుడిచ్చిన బంగారుపళ్లెంతో భిక్షాటనం చేస్తున్నాడు. "సమ లోష్ఠ అశ్మ కాంచనుడు" కదా నాగార్జునుడు! మట్టిగడ్డ - రాయి - బంగారం - ఆయనకు ఒక్కటే!

నాగార్జునుని చేతిలోని బంగారుమూకుడు మీద ఒక దొంగవాడికళ్లు పడ్డాయి. ఆ రాత్రి నాగార్జునుడు నివసించే గుహదగ్గరకు వచ్చి, సువర్ణభిక్షాపాత్రాపహరణం కోసం తిరుగాడుతున్నాడు. అలికిడికి నాగార్జునుడికి మెలకువ వచ్చింది. "ఎవరు నాయనా? ఏంకావాలి నీకు?" అన్నాడు. "బంగారు భిక్షాపాత్ర!" అన్నాడు దొంగ. "ఇదిగో తీసుకో!" అని చీకటిలో దొంగకు అందించాడు. చీకటి మెరుపులో పట్టుకొన్నాడు పాత్రను దొంగ!

నాగార్జునుడు యథాపూర్వంగా, మట్టిమూకుడుతో భిక్షాటనం చేస్తున్నాడు. మూడురాత్రులు గడిచాయి. నాల్గవరాత్రి గుహలో అలికిడి అయింది. "ఎవరు

నాయనా?" – "నిన్న బంగారు పాత్ర తీసుకువెళ్లిన దొంగను!" – "మళ్ళీ ఏంకావాలి? ఈ మట్టి మూకుడు కూడా ఇవ్వనా? పట్టుకు వెళ్ళు!"–"పట్టుకువెళ్లటానికి రాలేదు!" – "మరెందుకు వచ్చావ్?" – "ఇచ్చి వెళ్లటానికి వచ్చాను బంగారు పాత్రను!" – "అదేమిటి?" – "స్వామీ! నేను కంటినిండా నిద్రపోయి మూడురోజులయింది! దీనిని ఎవడు ఎత్తుకుపోతాడో అని అనుక్షణం ఒకటే ఆవేదనతో ఉన్నాను. ఈ ఆవేదన నేను భరించలేను! ఈ భిక్షాపాత్ర తీసికొని, నాకు ప్రశాంతిని అనుగ్రహించండి!" అని ఆ భిక్షాపాత్ర నాగార్జునుని పాదాలదగ్గర పెట్టి, ప్రశాంతిగా ఆ చీకటిలో లీనమయ్యాడు.

## (12) అస్తిదుఃఖం

"అస్తీతి వచనం తతః" – లేని వేళ, లేదు అని ఒకటే ఏడుపు! ఉండటంలో చాలా ఏడుపులు! ధనం ఎంత సంపాదించినా తృప్తిలేదు! ఎంత అనుభవించినా శాంతిలేదు. ధనలోభం ప్రాణాల తీపిని మించినది. ఒకనికి వందయకరాల పొలం ఉంది. తృప్తిలేదు. ఒక కోయరాజును ఆశ్రయించి, ఆ రాజును ఆనంద పరవశుణ్ణి చేశాడు. పొలం కావాలన్నాడు. ఎంత కావాలో నిర్ణయంగా చెప్పలేక పోయాడు. అప్పుడు కోయరాజు ఒక నిర్ణయం చెప్పాడు.

"సూర్యోదయం మొదలు – సూర్యాస్తమయం వఱకు, నీవు ఎంత భూమి చుట్టివస్తావో, ఆ భూమిని నీకు ఇస్తాను" అన్నాడు. చుట్టివచ్చిన భూమిని చూడటం కోసం, కోయరాజు తన సేవకుల్ని ఆజ్ఞాపించాడు. సూర్యోదయం అయింది. భూమి చుట్టిరావటానికి ప్రారంభించేశాడు. నెమ్మదిగా నడిస్తే, చుట్టిరాబోయే భూమి తగ్గిపోతుందనుకొన్నాడు. పరుగుపెట్టటం ఆరంభించాడు. నెమ్మదిగా పరుగెత్తితే భూమి తగ్గుతుందని, గట్టిగా పరుగెత్తటం ఆరంభించాడు. కోయరాజు సేవకులు వసుంధరా కాంక్షిని అనుసరిస్తూ చుట్టివస్తున్న భూమిని పరీక్షిస్తున్నారు.

మంచినీళ్లు త్రాగితే, ఆ సమయంలో వందగజాలు చుట్టవచ్చుగదా – అని మంచినీళ్లు త్రాగటం మానివేశాడు. ఆహారం తింటే, ఆసమయం, "రాబోయే భూమికి నష్టం!" అనుకొన్నాడు. ఆహారం మానివేశాడు. ఆయాసం తట్టుకోలేక విశ్రాంతి తీసుకొంటే! అమ్మో! ఎంత భూమి నష్టంవస్తుందో! అనుకొన్నాడు. నిలబడకుండా – నీళ్లు త్రాగకుండా – ఆహారం తీసుకోకుండా – విశ్రాంతి లేకుండా – శరీరం పడిపోతోందనే ఆలోచన లేకుండా – పరుగే పరుగు! ఒకటే పరుగు! ఆపులేని పరుగు పెడుతున్నాడు. శరీరం స్వాధీనం తప్పింది. గుండె ఆగిపోయింది. దానితో, అక్కడే

పరుగు ఆగిపోయింది! యాచకుడు బ్రతికిఉంటే – చుట్టివచ్చిన భూమి లెక్కకట్టి కోయరాజుచేత ఇప్పిద్దామనుకొన్నారు. ఈ “పీనుగు”ను దొరగారి దగ్గరకు తీసుకొని వెళ్లవలసిన అవసరంలేదనుకొన్నారు. వాడిని ఖననం చెయ్యటానికి ఏడు జేనలు పొడవున్న గొయ్యి త్రవ్వారు! అందులో వాణ్ణి పరుండబెట్టారు. “ఎంత భూమో కావాలనుకొన్నావు, పిచ్చినాయనా! ఎంత పరుగెత్తావురా! ఇంత పరుగూ, ఈ ఏడు జేనల నేలకోసమా? నిన్ను చూచిన కొలదీ జాలివేస్తోంది!” అంటూ, ఆ పిచ్చివెధవను చూడలేక చుట్టూఉన్న మట్టితో వాడిని కప్పివేశారు. “ఎంత దూరం పరిగెత్తాడు? ఎంతనేల ఇచ్చారు?” అని కోయరాజు ప్రశ్నించాడు. “ఇచ్చాం దొరా? వాడికి కావాలసినంతా ఇచ్చాం దొరా!” అన్నారు. “ఎంత ఇచ్చారు?” – “ఏడు జేనల నేల, దొరా!” అన్నారు వేదాంతం ప్రతిబింబించే ముఖాలతో. (ప్రఖ్యాత రష్యన్ కథారచయిత “లియో టాల్‌స్టాయ్” సరిగ్గా ఇటువంటి కథనే వ్రాశాడు.)

## (13) దరిద్రుడు – ధనవంతుడు

“కోవా దరిద్రోహి? – విశాల తృష్ణః!”. “శ్రీమాంశ్చ కో? – యస్యహి పూర్ణతుష్టిః” –“కోవా దరిద్రః” = ఎవడు దరిద్రుడు?–“విశాలతృష్ణః” = అంతులేని ఆశ ఉన్నవాడు! –“శ్రీమాన్ కః?” = ధనవంతుడెవ్వరు? – “యస్యహి పూర్ణతుష్టిః” = పరిపూర్ణ తృప్తితో ఉన్నవాడు! పాండిత్యానికీ జ్ఞానానికీ సంబంధంలేదు పాండిత్యం–కవిత్వప్రతిభా విశేషాలుగల ఒక పండితుడు, ప్రభువును తన ప్రజ్ఞాపాటవాలతో మెప్పించాడు. ప్రభువు ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అయ్యాడు! “నీకు ఏంకావాలో కోరుకో!” అన్నాడు. అప్పుడు పండితుడు “ఈ భూమి అంతా నాకు ఇవ్వండి మహాప్రభూ!” అన్నాడు. చతురంభోధిపరీత భూభాగంఅంతా ధరాపాలుడు ధారాపూర్వకంగా ఇచ్చి, తన సింహాసనం మీద ఆ పండితుని కూర్చుండబెట్టినాడు. అన్నీ అప్పగించి, పట్టపు ఏనుగుపై కూర్చుండబెట్టి, రాజలాంఛనాలతో ఇంటికి పంపించాడు.

ఆ పండితుని భార్య, తన భర్తకు భూభాగమంతా మహారాజుగారు బహుమానంగా ఇచ్చినట్లు విన్నది. భర్త రాజసత్కారాలతో రాబోతున్నాడని ఎదురుచూస్తోంది. ఈలోగా గుమ్మం దగ్గర పట్టపు ఏనుగు ఆగింది. పండితుడు ఏనుగుదిగి సరాసరి తన పడకగదిలోకి వెళ్లాడు. మంచంమీద “దభీలు”మని పడ్డాడు! వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు. వెనకాలే, ఆగదిలోకి భార్య వెళ్లింది : “ఏమండీ! సర్వపర్వత నదీనదాలతో కూడిన ఈ భూభాగం అంతా మీకు బహుమానంగా ప్రభువులు ఇచ్చారట కదండీ! ఇంకా ఏడుస్తున్నారేమండీ?” అంది అనునయిస్తూ. “అవును! నేను అడిగాను! నాకు భూభాగం

అంతా ఇచ్చారు! కాని అయ్యయ్యో! ఆకాశం అడగటం మరచిపోయాను! అందుకే, ఏడుస్తున్నాను" అని పరామర్శతో తిరిగి ఏడుపు ఆరంభించాడు ఆ పండితుడు!

## (14) అపవిత్ర ఆహారఫలం-1

ఆహారములు మూడు విధాలు:

**శ్లో॥ "ఆయుస్సత్త్వ బలారోగ్య, సుఖప్రీతి వివర్ధనాః"** (17-8)

సాత్త్విక ఆహారాలు ఆయువును, మనోబలాన్నీ, శరీరబలాన్నీ, ఆరోగ్యమును, సుఖమును, ప్రీతిని వృద్ధిచేస్తాయి. ఆహారం శారీరకపోషణకే పరిమితం కాదు! ఆహారప్రభావం మనస్సుమీద కూడా పనిచేస్తుంది. ఇది జగమెఱిగిన సత్యం!

భీష్ముడు అంపశయ్యమీదనుండి, ఎన్నో ధర్మాలు, నీతులు బోధిస్తున్నాడు. ఎందరో మహాజ్ఞానులు పరివేష్టించి వింటున్నారు. ఆ సమయంలో ద్రౌపది "ఫక్కున" నవ్వింది. భీష్ముడు ప్రసంగం ఆపి పరిహాసకారణం ద్రౌపదిని ప్రశ్నించినాడు. "తాతగారూ! ఇన్ని నీతులు బోధిస్తున్న మహాత్ములు మీరు! మహాజ్ఞాన సంపన్నులు! అలనాడు కౌరవసభలో కౌరవులు వస్త్రాపహరణ ప్రయత్నంచేసే సమయంలో నేను ఆపదలో ఉండగా, నిశ్చలంగా ఉండిపోయారే! అప్పుడు ఈ జ్ఞానం అంతా ఏమయింది?" అని ప్రశ్నించింది. "అమ్మా! అప్పుడు నా శరీరంలోని రక్తం, దుర్యోధనుడియొక్క దుష్టాహారంతో తయారైంది. ఆ కలుషితరక్తంతో ధర్మం మాటలాడలేకపోయాను. ఆ రక్తం అంతా అర్జునుని బాణాలతో కారిపోయింది. అందుచేత ఇప్పుడు ఇలా మాట్లాడగల్గుతున్నాను" అన్నాడు.

## (15) అపవిత్ర ఆహార ప్రభావం-2

"ఆహారంయొక్క అపవిత్రత మనస్సును అపవిత్రంచేస్తుంది!" అంటూ పెద్దలు చెప్పిన మరొక దృష్టాంతం వివరిస్తున్నాను. ఒక గృహస్థు, సన్న్యాసిని భిక్షకు ఆహ్వానించాడు. ఆ దంపతులు భక్తితో స్వామిజీకి భిక్ష అందిస్తున్నారు. సన్న్యాసి ముసుగులో ఉన్నారు. (తల మీదనుండి తగు మాత్రం చూపు కన్పించే విధంగా వస్త్రాన్ని ముసుగుగా కప్పుకొనుట సన్న్యాసివేష సంప్రదాయం.) అందులోనుండి వారి మనస్సు, గృహిణి ధరించిన కాసులపేరు కంటెల మీదికి దూకుతోంది. అక్కడ చిక్కుకొంటోంది. ఆ అన్నపూర్ణ ధరించిన ఒడ్డాణాన్ని స్వామి మనస్సు చుట్టుకొంటోంది. సాధువు మహాసాధకుడు కాబట్టి నిగ్రహించుకొని, భిక్ష ముగించుకొని, మకాం ఉన్న దేవాలయానికి వెళ్లిపోయాడు.

అయినా, ఆ సన్న్యాసిగారి కళ్లకి – కంటె, కాసులపేర్లు అంటుకొని ఉన్నాయి. ఒడ్డాణం మనస్సును చుట్టేస్తోంది. తట్టుకోలేకపోతున్నాడు. భిక్ష ఇచ్చిన గృహస్థుకు కబురు చేశాడు. వెంటనే ఆ గృహస్థు స్వామిజీ దగ్గరకు వచ్చాడు. “నీవు నాకు భిక్ష ఇచ్చిన అన్నానికి ఉపయోగించిన బియ్యం ఎక్కడివి? ఈ ప్రశ్నకు యథార్థ సమాధానం కావాలి!” అన్నాడు. ఆ గృహస్థు బియ్యం ఇచ్చిన కోమటిని “నిన్న నాకిచ్చిన బియ్యం ఎక్కడివి?” అని అడిగాడు. “ఎవ్వరికీ చెప్పను!” అని సెట్టి ఒట్టు వేయించుకొన్నాడు.

సెట్టి – “అయ్యా! వారంరోజుల క్రిందట, ఒక దొంగ, ఆత్మరక్షణకోసం ఒక బియ్యంమూటను మా ప్రహరీగోడలోపల పడవేసి పారిపోయినాడు! సొమ్ము సొమ్మేకదా! ఎవ్వరూ రాలేదు. బియ్యంకోసం వచ్చినవాళ్లకు, ఆ బస్తాలో బియ్యం అవసరాన్ని బట్టి అమ్మాను. ఆరోజు మీరూ వచ్చారు. బియ్యం జీలకఱ్ఱసన్నాలు! భిక్షకు అంటున్నారుకదా! అని అందులో కుంచెడు మీకు ఇచ్చాను!” అన్నాడు. ఇదే విషయం సాధువుగారికి అందించాడు ఆ సంసారి! ఆహారం భక్షించటానికి కూర్చున్నది లగాయితు, నగల మీదికి మనస్సు ఎందుకు పరుగులు తీసిందో తెలిసింది స్వామికి! ఆహారంయొక్క ప్రభావం మనస్సుమీద ఉంటుంది. ఇది నిశ్చయం! సాత్త్వికాహారం సత్త్వగుణాన్ని, రాజసాహారం రజోగుణాన్నీ, తామసాహారం తమోగుణాన్ని పెంపొందిస్తాయి – అనేది జగమెరిగిన సత్యం!

## (16) శ్రద్ధ

**శ్లో॥ “ఓం తత్సత్ ఇతి నిర్దేశో, బ్రహ్మణః త్రివిధః స్మృతః”** (17–23)

పరబ్రహ్మమునకు “ఓం” అనియు – “తత్” అనియు – “సత్” అనియు – మూడు పేర్లున్నవి. ఈ మూడు మాటలతోనే బ్రాహ్మణులు “వేదములు”, “యజ్ఞములు” నిర్మించియున్నారు. “ఓమ్”–ఓంకారము దైవస్వరూపము లేక పరబ్రహ్మము. తత్ – ఆ పరబ్రహ్మము, “సత్”–సత్‌రూపముగా నున్నది. దైవకార్యముకాని, లౌకికకార్యము కాని, లోటులేకుండా నెరవేరాలంటే, కర్తకు శ్రద్ధ ఉండాలి! అశ్రద్ధతో చేసే పనులు నిష్ప్రయోజనములు – అంటూ చివరలో–

**శ్లో. “అశ్రద్ధయా హుతం దత్తం। తపస్తప్తం కృతం చ యత్**
**అసత్ ఇతి ఉచ్యతే పార్థ। న చ తత్ప్రేత్య నో ఇహ!”** (17–28)

అశ్రద్ధతో చేసిన హోమము – దానము – తపస్సు – ఇతర కర్మలు “అసత్తు” లే అనబడును. అవి ఇహలోక పరలోకములందు సుఖముల నీయజాలవు. కాబట్టి “శ్రద్ధ” ముఖ్యము! ఆసక్తికి, భక్తికి, ప్రతిరూపమే శ్రద్ధ! “భక్తిలేని పూజ పత్రిచేటు!”

– "భక్తి గల్గు కూడు పట్టెడైనను చాలు!" కొందరు జపంచేస్తారు. వారి మనస్సు ఎక్కడో ఉంటుంది. జపమాల వ్రేళ్లలో తిరుగుతూ ఉంటుంది! "జపంలో ఉన్నప్పుడు మీ మనస్సు దేని మీద ఉంటుంది?" అని జపించే ఆయన్ని ఎవరో అడిగారట! "కొలికిపూస లేక మేరువు (108వ పూస తరువాత ఉండే పెద్దపూస) ఎప్పుడు తగులుతుందా?" అనుకొంటాను. ఆ కొలికిపూస ముగింపు చెప్పేది! "నా మనస్సు కొలికిపూస మీద ఉంటుంది" అని నిజం చెప్పాడు!

దైవకార్యాలు చేస్తారు. మానరు! వారికి భక్తిశ్రద్ధలుండవు! అది ఏమిటి? అనకండి. అది వాళ్ల లక్షణం! అదీ చెయ్యనివాళ్లున్నారు.

ఒక భక్తుడు భార్యతో కలసి సత్యనారాయణవ్రతం చేస్తున్నాడు. "ఆఘ్రేయస్సర్వ దేవానాం, ధూపోయం ప్రతిగృహ్యతామ్" – "అయ్యా! ధూపం వెయ్యండి!" – "అగరు ధూపంలేదు" – "ధూపార్థం అక్షతాన్ సమర్పయామి–అనండి! కానివ్వండి!" – ఇంకా కొంత వ్రతం గడిచింది! "గుడోపహార నైవేద్యం సమర్పయామి!" – "అయ్యా! ఒక బెల్లంముక్క నివేదన చెయ్యండి!" – "అనకాపల్లి వైపు చూపించి నైవేద్యం పెట్టండి!" – "అనకాపల్లి ఇక్కడికి ఐదువందల మైళ్లుంది! అనకాపల్లి బెల్లంబడ్డీలు చూపించటం ఏమిటండీ?" అన్నాడు పురోహితుడు! "ఆమాత్రం లాక్కోకపోతే దేవుడేమిటండీ?" అని ఎదురు ప్రశ్నవేశాడు.

ఈ సందర్భాన్ని తమ ఉపన్యాసాలలో ప్రస్తావిస్తూ, మహాసహస్రావధాని, హాస్యరస చక్రవర్తి అయిన డా॥ గరికిపాటి నరసింహారావుగారు ఇలా చమత్కరించారు. "ఆ గృహస్థు భగవంతుని ఏమీ ఇవ్వకుండా, అన్నింటికీ ప్రత్యామ్నాయంగా అక్షతలు వేసేస్తున్నాడు. భగవంతుడు తక్కువవాడా? ఇవన్నీ గమనిస్తున్నాడు. చివర్లో ఆ గృహస్థుని 'సిరిసంపదల ప్రత్యామ్నాయం – దారిద్ర్య సిద్ధిరస్తు' అని దీవించాడట భగవంతుడు కూడా తెలివిగా!"

మనయింట్లో దైవపూజ తలపెట్టినప్పుడు, ముందుగా, పురోహితుని ద్వారా వస్తువుల జాబితా తెలిసికొని, అవన్నీ వరుసగా సమకూర్చుకొని, పూజదగ్గర శ్రద్ధగా ఉంచుకొని, భక్తిప్రపత్తులతో ఉండటం ఉత్తమ శ్రద్ధావంతుల లక్షణం! భక్తుల స్వభావం! శ్రద్ధలేకుండా చేసే మహాకార్యాలన్నీ అసత్తులే! "అసతో మా సద్గమయ!" (నన్ను అసత్తునుండి సత్తువైపు నడిపించుము!)

## (17) ప్రతిజీవి కర్మబద్ధుడు

కృష్ణుడు అర్జునునితో, "యుద్ధము చేయుట అనునది క్షత్రియ ధర్మము. నీ కులధర్మమును అనుసరించి యుద్ధము చేయుము" అన్నాడు. "నీకు పుట్టుకతో ఈ

ప్రకృతిధర్మం ఉంటుంది. ఆ ధర్మం నిన్ను విడిచిపెట్టదు. నీ ఇష్టానిష్టములతో పనిలేదు! ఆ ప్రకృతికి అధీనుడవై, నీవు ఏదో శక్తికి లొంగిపోయి, నీకే తెలియకుండా, నీవు ఆ పనిచేస్తావు!"

**శ్లో॥ "యద్యహంకార మాశ్రిత్య । న యోత్స్య ఇతి మన్యసే**
**మిథ్యైష వ్యవసాయ స్తే! । ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి"** (18-59)

"నీవు అహంకారంతో 'యుద్ధం చెయ్యను!' అంటావేమో! అది కూడా నీ అధీనంకాదు! ఒక పనిచేయుట కాని - 'చేయను!' అని నిరాకరించుట కాని, మన అధీనములో నుండదు! ప్రకృతిప్రేరణకు లొంగి, మానవులు పనులు చేస్తారు." దీనికి ఒక దృష్టాంతము అనుకొందాము.

ఒకప్పుడు వ్యాసుడు జనమేజయునికి దర్శనం ఇచ్చాడు. జనమేజయుడు - "మా ముత్తాతలు పాండవులు మహాత్ములు కదా! వారిలో ధర్మరాజు - 'ధర్మమూర్తి' అయిన యమధర్మరాజుయొక్క అంశతో జన్మించిన మహనీయుడు కదా! ఆయనకు, జూదం దుర్వ్యసనమని తెలియదా? సామాన్య మానవులకుకూడ తెలిసిన ఈ దుర్వ్యసనమునకు ధర్మరాజు ఎందుకు లొంగిపోయినాడు? ఏమైనా, మాముత్తాత, ధర్మరాజు నిగ్రహంలేని వాడు! చాలా పెద్ద తప్పుచేశాడు. తమ్ముళ్లతోపాటు పడరాని పాట్లు పడ్డాడు. ధర్మరాజు 'జూదం ఆడటం' అనే పెద్ద తప్పు చేశాడు; కాదనలేము!" అన్నాడు. దీనికి వ్యాసుడు "ప్రకృతి చేయిస్తుంది నాయనా! దాని ముందు మన నిగ్రహం పనిచెయ్యదు!" అన్నాడు. **"కర్తుం నేచ్ఛసి యన్మోహాత్ కరిష్యసి అవశోఽపితత్"** (18-60). - "నీకు ఇష్టం లేకపోయినా, - నీ స్వభావము - నీ కర్మము - నీచేత ఆపని చేయిస్తాయి."

అప్పుడు వ్యాసుడు "నాయనా! జనమేజయా! నీకు ఒకపని చెపుతాను. ఆచరించు!

1) కొద్దిరోజుల్లో వర్తకులు గుఱ్ఱాలగుంపు తెస్తారు. అందులో నల్లగుఱ్ఱాన్ని కొనవద్దు! 2) కొన్నా, దానిని ఎక్కవద్దు! 3) ఎక్కినా, ఉత్తరదిక్కుకు వెళ్లకు! 4) వెళ్లినా, అక్కడ ఉన్న స్త్రీతో మాటలాడకు! 5) మాటలాడినా, ఆమెను వివాహం ఆడకు! 6) ఆడినా, ఆమె మాటవినకు!" అంటూ ముక్తపదగ్రస్తంగా చెప్పాడు!

కొద్దిరోజుల్లో వర్తకులు గుఱ్ఱాలగుంపు తెచ్చారు. అందులో నల్లగుఱ్ఱం ఉంది. "ఆ గుఱ్ఱం మన అశ్వశాలకే అందం!" అనిపించింది జనమేజయునకు. ఎక్కవద్దన్నాడు కాని, కొనటం దోషం కాదు కదా - అనుకొని, ఆ గుఱ్ఱాన్ని కొని జనమేజయుడు

అశ్వశాలలో పోషిస్తున్నాడు. ప్రతిరోజూ దాన్ని ఉభయవేళల్లో చూస్తున్నాడు. చూచిన కొలది దానిని ఆరోహించాలనే అభిలాష పెరిగిపోతోంది.

"ఉత్తరదిక్కుకు వెళ్లవద్దన్నాడు కాని, గుఱ్ఱాన్ని ఎక్కవద్దు అనలేదు కదా!" అనుకొని, అశ్వారోహణం చేశాడు. ఉత్తరదిక్కుకు వెళ్లుటలేదు. తక్కిన మూడు దిక్కులలోను స్వారీచేస్తూ ఆనందిస్తున్నాడు.

"ఉత్తరదిక్కున ఉన్న సుందరితో మాటలాడవద్దు అన్నాడు కాని, వెళ్లటం దోషంకాదు!" అనుకొన్నాడు. ఉత్తరదిక్కుకు వెళ్లాడు. అక్కడ ఒక దివ్యసుందరి కన్పించింది.

"పెళ్లాడవద్దు! అన్నాడు కాని మాటలాడటం దోషం కాదు!" అనుకొన్నాడు! ఆమెతో మాటలాడాడు. "అంత అందమైన దాన్ని పెండ్లాడక పోతే బ్రతుకెందుకు?" అనుకొన్నాడు. "ఆమెమాట వినటం వద్దన్నాడు కాని పెండ్లాటం దోషంకాదు" అనుకొన్నాడు. గాంధర్వ వివాహం ఆడాడు! పట్టణానికి తీసుకువెళ్లాడు ఆ సుందరిని! పట్నంలోకి వెళ్లాక "రాజా! సాధుసంతర్పణ చేయటం నాకు చాలా ఇష్టం! మహర్షులు – సాధువులు – మునులు – వంటి మహాత్ములకు సంతర్పణం చెయ్యాలి" అంది. "ఇది మంచికోరికే కదా! కాదనటం ఎందుకు?" అని అంగీకరించాడు జనమేజయుడు!

సాధువులు బారులు తీర్చి కూర్చున్నారు. వడ్డనలు జరుగుతున్నాయి. ఆ సుందరి నేతిజారీతో పంక్తులకు వంగి వడ్డిస్తోంది. ఆ వంగటంలో ఆమె పైట జారిపోతోంది. ఆమె మాటిమాటికీ పైట సద్దుకొంటోంది. పంక్తిలోని వారు తనవైపు చూస్తున్నారని అనుమానించింది. ఆ సుందరికి కోపం వచ్చింది. వెంటనే భర్తతో "రాజా! ఈ కపట సాధువులు, మీ ఇల్లాలినైన నన్ను 'కామదృష్టి'తో చూస్తున్నారు. మీరు సహించి ఊరుకొంటున్నారా?" అంది. జనమేజయుడు "అగ్గిమీద గుగ్గిలం" అయ్యాడు. ఎత్తిన కత్తికి ఇరవై మందిని బలిచేశాడు. క్రోధం చల్లారింది. "బ్రహ్మహత్యకు పాల్పడ్డానే!" అనుకొంటుండగా ....వ్యాసుడు ప్రత్యక్షమయ్యాడు! ఈ సంఘటనమంతా తనకు జ్ఞానభిక్ష పెట్టటానికి వ్యాసుడు కల్పించిన మహామాయగా జనమేజయుడు గ్రహించాడు. ధర్మరాజును అర్థంచేసికొనలేని తన అజ్ఞానాన్ని మన్నించుమనీ, తన అహంకారాన్ని క్షమించుమనీ వ్యాసుని పాదాలమీద పడ్డాడు జనమేజయుడు!



# భరతవాక్యం

**శ్లో॥ సత్యమేవ జయతే, నా నృతమ్**
**సత్యేన పంథాః వితతో దేవయానః।**
**యేన ఆక్రమంతి ఋషయోహి ఆప్తకామాః**
**యత్ర తత్ సత్యస్య పరమం నిధానం॥" 1**

**తా॥** సత్యమే జయించును; అసత్యముకాదు (అసత్యము జయింపదు). దేవయానము (మోక్షము) సత్యమార్గములోనే అల్లుకొని పోయినది. అన్ని కామములను జయించిన ఋషులు ఈ సత్యముయొక్క పరమపదమును చేరుకొందురు. (మంత్రము-ముండపోపనిషత్తు)

**శ్లో॥ స్వస్తి ప్రజాభ్యః, పరిపాలయంతాం**
**న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః ।**
**గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం,**
**లోకా స్సమస్తా స్సుఖినో భవంతు ॥ 2**

**తా॥** ప్రజలకు స్వస్తి అగుగాక! రాజులు న్యాయము తప్పని మార్గముతో భూమిని పరిపాలింతురు గాక! గోవులకు, బ్రాహ్మణుకు, (బ్రహ్మజ్ఞానులకు, వేదజ్ఞులకు) నిత్యము శుభము కలుగు గాక! లోకములన్నియు సుఖవంతము లగుగాక!

**శ్లో॥ కాలే వర్షతు పర్జన్యః, పృథివీ సస్యశాలినీ ।**
**దేశోఽ యం క్షోభరహితో, బ్రాహ్మణాస్సంతు నిర్భయాః ॥ 3**

**తా॥** వానదేవుడు యోగ్యమగు కాలమున వర్షించుగాక! భూదేవి సస్యములతో విరాజిల్లునది అగుగాక! ఈ దేశము క్షోభలేనిది అగుగాక! బ్రాహ్మణులు భయములేనివారు అగుదురుగాక!

**శ్లో॥ అపుత్రాః పుత్రిణ స్సంతు, పుత్రిణ స్సంతు పౌత్రిణః ।**
**అధనా స్సధనా స్సంతు, జీవంతు శరదాం శతమ్ ॥ 4**

**తా॥** పుత్రులు లేనివారు పుత్రులు కలవారగుదురు గాక! పుత్రవంతులు మనుమలు కలవారు అగుదురుగాక! ధనహీనులు ధనవంతులగుదురు గాక! అందరును నూరేండ్ల ఆయువు కలవారు అగుదురుగాక!!

**ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః**





**భీమవరం U.L.C.M. High School లో తెలుగు పండితుడుగా**

**శ్రీ టి.వి.కె. సోమయాజులుగారు (1951–1953)**

## శిశువు

సీ॥ బొటవ్రేల ముల్లోకములు జూచి లోలోన
నానందపడు నోరులేని యోగి!
తల్లిదండ్రుల తనూవల్లరీద్వయికి వ
న్నియc బెట్టు తొమ్మిది నెలలపంట!
అమృతంబు విషమను వ్యత్యాస మెఱుంగ కా
స్వాదింపcజను వెఱ్ఱిబాగుcలాcడు!
అనుభవించుకొలంది నినుమడించుచు మరం
దము జాలువాఱు చైతన్యఫలము!

ఆ॥వె॥ భాషరాదు, వట్టిపాలు మాత్రమె త్రాగు,
నిద్రవోవు, లేచి నిలువలేcడు,
యెవరెఱుంగ రితని దేదేశమోకాని,
మొన్న మొన్న నిలకు మొలచినాcడు!

– "కవికోకిల" గుఱ్ఱం జాషువాగారు

* కవిత్వం జీవితానికి రూపాంతరం.
* రసమంటే కవి కరిగిపోయి ప్రవహించేది.
* భావాలన్నీ ఆత్మాశ్రయాలే. కనుక కవిత్వమంతా ఆత్మాశ్రయమే. ఆత్మాశ్రయం కాకపోతే కవిత్వం కవిత్వమే కాదు.
* కవిత్వం పుట్టడానికి, కవికి ముందు అనుభవాలు కావాలి. అనుభవాలు అనుభూతులు కావాలి అనుభూతులు భావాలు కావాలి.
* వస్తువు కళాత్మకత పొందకపోతే అది కవిత్వం కాదు, కానేరదు.
* కవిత్వం – ఏమి చెప్పడమనే దానికన్నా ఎక్కువగా ఎలా చెప్పడమనే దానిపై ఆధారపడి ఉంటుంది.

– శేషేంద్ర

## అనుబంధం-1:

# మా అమ్మ నుడికారంలో "గోదావరి" శబ్దం

**- ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు**

మా అమ్మగారి పేరు "సీతామహాలక్ష్మి". పుట్టినింటివారు "భళ్ళమూడివారు". మెట్టినింటివారు "తంగిరాలవారు". మా అమ్మగారు క్రీ.శ. 1907లో చైత్రశుద్ధ అష్టమినాడు (అంటే శ్రీరామ నవమికి ఒకరోజు ముందు) పశ్చిమగోదావరిజిల్లా, కొవ్వూరు తాలూకా, పెద్దవాడపల్లి గ్రామంలో జన్మించింది. తల్లిదండ్రులు: భళ్ళమూడి లక్ష్మీనరసమ్మ - భళ్ళమూడి కృష్ణమూర్తిగారు. వీరి ప్రథమ సంతానం మా అమ్మ. అందువల్ల అల్లారు ముద్దుగా పెరిగింది. శ్రీరామ నవమికి ఒకరోజు ముందు పుట్టింది. కాబట్టి సీతాదేవి పేరు పెట్టారు. (సీతాదేవిలాగే చాలా కష్టాలు పడింది. మమ్మల్ని పెంచి పెద్ద చెయ్యడానికి ఎన్నో అవస్థలు పడింది.) మా అమ్మకి ముగ్గురు తమ్ముళ్ళు; ఇద్దరు చెల్లెళ్ళు. తొమ్మిదేళ్ళ వయసులో మా అమ్మకు పెండ్లి అయింది. పశ్చిమగోదావరిజిల్లా, తణుకుతాలూకా, "కాకుల ఇల్లిందల పట్టు" గ్రామంలోని తంగిరాల సోమిదేవమ్మ - తంగిరాల జగన్నాథ (జగ్గన్న) శాస్త్రిగారల ప్రథమ సంతానమైన వేంకట సుబ్బావధానులుగారితో వివాహం జరిగింది. జగన్నాథశాస్త్రిగారికి 30 ఎకరాల మాగాణి భూమి ఉండేది. అందువల్ల తన కూతురికి మూడు ఎకరాలు కట్నంగా ఇచ్చారు కృష్ణమూర్తిగారు. (వీరికి 15 ఎకరాల మెట్టపొలం, మామిడితోటలు ఉండేవి.) మా నాన్నగారు వేదం బాగా చదువుకున్నారు. బలమైన శరీరం. అయితే లోకజ్ఞానం బొత్తిగాలేని అమాయకుడు. తండ్రికి ఒక్కడే కొడుకు, నలుగురు చెల్లెళ్ళు. కాలక్రమంలో అత్తాకోడళ్ళకు (మా నాయనమ్మకు - మా అమ్మగారికి) మనఃస్పర్థలు వచ్చాయి. మా జగ్గన్న తాతగారు గొప్ప వేదపండితుడైనా, యజ్ఞయాగాదులు చేసిన కర్మిష్ఠి అయినా మిక్కిలి కోపిష్ఠి మనిషి. మా విషయంలో పరమ దుర్మార్గుడు. మా నాన్నగారు అమాయకుడు కావడంతో మా అమ్మగారిని కోరంటికం (<కోడంత్రికము) పెట్టడం మొదలు పెట్టారు. మా అమ్మ తిరుగబడింది. ఫలితంగా ఇంట్లోంచి గెంటి వేశారు. ఆస్తిని, ఇల్లును కూతుళ్ళకు వ్రాసి వేశాడు మా జగ్గన్న తాత. ఒక చిన్నతాటాకు ఇంట్లో, చంటీ వెంటా సంతానంతో, అష్టకష్టాలు పడింది మా అమ్మ. మా మాతామహుడు కృష్ణమూర్తిగారు కోర్టులో కేసు వేశాడు. మా పితామహుడు తన ఆస్తినంతా దాచివేసి, తనకు 12 ఎకరాలు మాత్రమే ఉన్నదని అబద్ధమాడి, దానిని

మూడు వాటాలు వేసి, మాకు 4 ఎకరాల భూమి ఇచ్చాడు. దానితో మా అమ్మ సంసారాన్ని నెట్టుకుంటూ వచ్చింది. అందులోనుండి ఒక ఎకరం పొలం అమ్మివేసి, మా చిన్నక్కయ్య పెండ్లి చేసింది. (మా పెద్దక్కయ్య పెండ్లి మా జగ్గన్నతాతే చేశాడు.) తండ్రి తనకు కట్నంగా ఇచ్చిన 3 ఎకరాలు అమ్మివేసి మా అమ్మ మాకు చదువులు చెప్పించింది. తన బంగారు ఒడ్డాణం అమ్మివేసి తణుకులో 618 గజాల స్థలం కొన్నది. (ఇప్పుడు దాని ఖరీదు రెండు కోట్ల రూపాయలు) మా అమ్మ కృషివల్ల, దైవకృపవల్ల, మేం నలుగురు అన్నదమ్ములమూ చదువుకొని అభివృద్ధిలోకి వచ్చాము. ఇప్పుడు కొడుకులు కూతుళ్ళతో, మనుషులు మనుమరాండ్రతో సుఖంగా ఉన్నాము. మా అమ్మగారి ఆశీస్సులవల్లనే మేము ఇంతవాళ్ళమయ్యాము.

1990 నవంబరు 26వ తేదీనాడు మా అమ్మగారు 83ఏళ్ళ వయసులో సికింద్రాబాద్లో మా బుల్లితమ్ముడి యింట్లో కన్నుమూసింది. మా అమ్మగారి కష్టజీవితమంతా (సంక్షిప్తంగా నైనా) ఎందుకు చెప్పానంటే, ఆమె ఎన్ని కష్టాలలో ఉన్నా నిరుత్సాహపడలేదు. దైవం మీద భారంవేసి ధైర్యంగా ముందుకువెళ్ళింది. "నలుగురు మగపిల్లలు. వీళ్ళందరూ చదువుకొని అభివృద్ధిలోకి వస్తారు!" అనే ఆశాభావంతో పయనించింది. మేం చక్కగా చదువుకుంటూ పెద్దవాళ్ళమవుతూ ఉంటే, "వీళ్ళు తప్పకుండా పైకి వస్తారు" అనే ధైర్యంతో "తాళ్ళు కనబడుతున్నాయి; ఇక ఊళ్ళు కనపడవా?" అనే నుడికారాన్ని (సామెతను) ప్రయోగించి మాటలాడేది. గోదావరిలో (లేదా సముద్రంలో) పడవలో (లేదా ఓడలో) ప్రయాణం చేస్తూ ఉంటే చుట్టూ అంతా నీరే కనబడుతుంది. అంత మాత్రంచేత నిరుత్సాహపడకూడదు. ఇంకా ముందుకు ప్రయాణం చేయాలి. కొంతసేపటికి తాడిచెట్లు కనబడతాయి. అప్పుడు ఆశాభావంతో ధైర్యం తెచ్చుకోవాలి. తాడిచెట్లు కనబడితే ఒక తీరం తప్పక వస్తుందనీ, అక్కడ ఒక ఊరు తప్పక ఉంటుందని నిర్ధారించుకోవచ్చును. అలాగే పిల్లలకు బోలెడు డబ్బు ఖర్చుచేసి చదువులు చెప్పించడాన్ని వివరిస్తూ "చదువులంటే ఒలకబోసి ఎత్తుకోవడమే!" అనేది. "ఇప్పుడు డబ్బు ఖర్చుచేస్తే, తరువాత వాళ్ళు ఉద్యోగాలు చేసి సంపాదిస్తారు" అని ఈ నుడికారానికి అర్థం. ఈ విధంగా మా అమ్మగారి తెలుగు పలుకుల నుడికారం రూపుదిద్దుకొంది.

మా అమ్మగారి పుట్టిల్లు 'పెదవాడపల్లి' గోదావరి గట్టున ఉంది. మెట్టినిల్లు కూడా గోదావరికి దగ్గరలోనే ఉంది. మా అమ్మగారి జీవితమంతా (83 సంవత్సరాలు) గోదావరి తీరంలోనే గడిచింది. అందువల్ల మా అమ్మగారి నుడికారంలో 'గోదావరి'

శబ్దం ప్రధాన పాత్ర వహించింది. మా అమ్మగారు ఆ రోజుల్లో ఐదవ తరగతి వరకు చదువుకున్నారు. ఎన్నో పాటలు పాడేవారు. మేలుకొలుపులు, మంగళ హారతులు, పెండ్లిపాటలు, కుశలవకుచ్చల చరిత్ర, సీతసమర్త, సీతాదేవి ఆనవాళ్ళు, పారుజాత పల్లవి, గంగా-గౌరీ సంవాదము, ధర్మరాజు జూదము, ఊర్మిళాదేవి నిద్ర, లక్ష్మణ దేవర నవ్వు, సుభద్రసారె మొదలైన ఎన్నో పాటలు అనర్గళంగా పాడేవారు. (నేను జానపద సాహిత్యంలో పరిశోధన చేయడానికి మా అమ్మగారి ప్రభావమే కారణం.) ఆమెభాషలో ఎన్నో పలుకుబళ్ళు లేక నుడికారాలు (idioms), సామెతలు (proverbs) దొర్లేవి. ఇవన్నీ మా మనుసుల్లో ఇంకిపోయాయి. మేమే కాదు; మా పిల్లలు కూడా మా అమ్మగారి తెలుగు పలుకుబళ్ళను విని ఎంతో ఆనందించేవారు. వారి లేతమనసుల మీద మా అమ్మ నుడికారాలు మిక్కిలి ప్రభావం చూపాయి. వీటిని సేకరించడంలో నాకు మా ఆవిడ శకుంతలాదేవి (ఈమె మా అమ్మకు మేనకోడలు - తమ్ముడి కూతురు), మా పిల్లలు - ముఖ్యంగా మా రెండో అబ్బాయి చి॥ శ్రీరామమూర్తి (ఉరఫ్ సీతారామరాజు) మిక్కిలిగా తోడ్పడ్డారు. వీరికి నా ఆశీస్సులు... మా అన్నయ్యగారు కూడా తాను రచించిన గ్రంథాలలో మా అమ్మగారిని గురించి వ్రాసిన పీఠికలోను, ఆయన సేకరించిన 'సూక్తులు' లోను మా అమ్మగారి నుడికారాలు, సామెతలు కొన్ని ఉదాహరించారు.

ఆంగ్లంలో ఉన్న "Idiom" అనే పదానికి తెలుగులో "జాతీయం-నుడికారం-పలుకుబడి" అనేవి సమానార్థకాలు "Proverb" అనే పదానికి "సామెత-లోకోక్తి - నానుడి" అనే పదాలు సరిపోతాయి.

## I. మా అమ్మ నుడికారంలో 'గోదావరి' శబ్దం:-

('గోదావరి' శబ్దం వ్యవహారంలో 'గోదారి' అవుతుంది. 1977లో నేను వ్రాసిన నా పరిశోధనపత్రంనుండి కొన్ని విషయాలు తెలియజేస్తున్నాను.) గోదావరి గొప్ప జీవనది. దీని తీరంలో నివసించే మనుషుల భాషని, నుడికారాన్ని ఈ జీవనది ఎంతగా ప్రభావితం చేస్తుందో మా అమ్మగారి మాటల్లో నేను బాగా గుర్తించాను. మొట్టమొదట మా అమ్మగారి భాషలోనుండి రెండు మూడు ఉదాహరణాలు చెపుతాను:

1.1 "అమ్మా! ఫలానావాళ్ళ అబ్బాయి ఇప్పుడు ఏం చేస్తున్నాడు?" అని నేను మా అమ్మగారిని అడిగితే ఆమె "ఆc... ఏం చేస్తున్నాడు! వాడి గోదారి - నా గోదారి!" అని సమాధానం చెప్పేది. అంటే - "ఏమీ చెయ్యటం లేదు; ఖాళీగా తిరుగుతున్నాడు." (He is doing nothing) అని ఈ వాక్యానికి అర్థం. మిగిలిన ప్రాంతాల్లో ఈ ప్రశ్నకు

సమాధానంగా "ఏం చేస్తున్నాడు! వాడి తలకాయ్! నా తలకాయ్" అంటారు. లేదా "వాడి బొంద! నా బొంద!" అంటారు. ఇక్కడి "తలకాయ్" – "బొంద" అనే పదాలకు బదులుగా "గోదారి" ప్రవేశించింది.

1.2 చిన్నప్పుడు నేను ఏదో పనిచేస్తూ, చేతిలోనుండి ఏదైనా వస్తువును పొరపాటున జారవిడిచినప్పుడు, మా అమ్మగారు కోపంగా "చేతుల్లో పట్లు లేవా? తిన్న తిండంతా ఏ గోదాట్లో పడుతోంది?" అని తిట్టేవారు. తిన్న తిండి పొట్టలో పడితే బలం వస్తుంది. గోదాట్లో పడితే వ్యర్థమవుతుంది. "నీకు పెట్టిన ఆహారం ఎలా వ్యర్థమవుతోంది?" అని ఈ వాక్యానికి అర్థం.

1.3. "లంక మేత–గోదారీత" అనే సామెత తరచుగా వాడేవారు మా అమ్మ. "ఎంత కష్టపడి సంపాదించినా ఏమీ మిగలటం లేదు. రాబడికి ఖర్చుకి సరిపోతోంది". అని ఈ సామెతకు అర్థం. పశువుల్ని ఉదయం గోదావరి లంకలో వదలిపెడతారు. సాయంకాలం వరకూ అవి అక్కడ దుబ్బుగడ్డిని కడుపునిండుగా మేస్తాయి. కాని తిరిగి ఊళ్ళోకి రావాలంటే మళ్ళీ గోదావరిని ఈదుకొని రావాలి. అలా ఈదేసరికి తిన్న మేతంతా అరిగిపోతుంది. ఇంటికి వచ్చేసరికి తిరిగి ఆకలితోనే, డొక్కలు లోపలికి పోయి ఉంటాయి.

1.4. "అంతా నాశనమై పోయింది!" అనే అర్థంలో 'మా అమ్మగారు "అంతా గోదారీ కొల్లేరూ అయిపోయింది!" అనేవారు. ('కొల్లేరు పశ్చిమ గోదావరిజిల్లాలో భీమవరంనుండి కృష్ణాజిల్లాలోని వరకూ వ్యాపించిన పెద్ద సరస్సు.) గోదావరిలో కాని, కొల్లేరులో కాని అంతా నీరే ఉంటుంది. భూమి కనపడదు. భూమి ఉంటే కదా పంట పండేది! పంట పండితే కదా మనుషులు బ్రతికేది!

ఈ విధంగా తన తీరంలో నివసించే మనుషుల భాషని గోదావరి అమితంగా ప్రభావితం చేస్తుంది. మా అమ్మగారిభాషలోని "గోదావరి" నుడికారాన్ని గురించి నేను ఆంగ్లంలో ఒక పరిశోధన పత్రాన్ని రచించి, Dravidian Linguistic Association, Trivandrum వారు 1977లో (జూన్ 2వ తేది నుండి 4వ తేది వరకు) బెంగుళూరు విశ్వవిద్యాలయంలో నిర్వహించిన "Seventh All India Conference of Dravidian Linguists" లో చదివాను. ఆ పరిశోధన పత్రంలోని విశేషాలను తెలియజేస్తాను:–

## II. మా అమ్మ నుడికారంలో అర్థపరిణామం:–

భాషలో శబ్దాలుంటాయి. ఆ శబ్దాలకు నిర్దిష్టమైన అర్థాలుంటాయి. కాలక్రమంలో ఒక్కొక్కప్పుడు ఈ అర్థాలు మారిపోతూ ఉంటాయి. ఈ మార్పును "అర్థపరిణామం"

(Symantic Change) అంటారు. 'మీల్లెట్' (Meillet) అనే భాషాశాస్త్రజ్ఞుడు అర్థపరిణామానికి మూడు కారణాలు చెప్పాడు:-

(1) సందర్భాలను (contexts ను) మార్చడానికి శబ్దాలను ప్రయోగించినప్పుడు; (2) ఉద్దేశంలో (reference లో) మార్పు ఉన్నప్పుడు; (3) అనేక సాంఘికవర్గాల అంతర్గత సంబంధాలవల్ల. మొదటి రెండు కారణాలవల్ల మా అమ్మగారి 'గోదావరి' శబ్దప్రయోగంలో అర్థపరిణామం జరిగింది. "గోదావరి" అంటే "ఒక నది" అని అర్థం. కాని మా అమ్మగారు ఈ శబ్దాన్ని రకరకాల అర్థాలలో ప్రయోగించేవారు.

ఈ అర్థపరిణామంలో మూడు రకాలు ఉన్నాయి: (1) అర్థసంకోచం; (2) అర్థ వ్యాకోచం; (3) భిన్నార్థం. మా అమ్మగారి గోదావరి సుడికారంలో "అర్థవ్యాకోచం" (expansion in contexts) కనబడుతుంది.

మా అమ్మగారి గోదావరి నుడికారంలో కొన్ని నుడికారాలు లేక జాతీయాలు (idioms) గాను; మరికొన్ని సామెతలు లేక లోకోక్తులు (proverbs) గాను కనబడుతున్నాయి. భాషాశాస్త్రం ప్రకారం వీటినన్నింటినీ నాలుగు వర్గాలుగా చేసి పరిశీలించవచ్చును:

1. "Container" ("పాత్ర") = 'గోదావరి' తో ప్రత్యక్ష సంబంధం ఉన్న పదాలు.
2. "Contained" ("పాత్రలోని వస్తువులు") = గోదావరికి సంబంధించిన ఇతర వస్తువులను తెలియజేసే పదాలు (గోదావరితో పరోక్ష సంబంధం).
3. "Symbolic Usage" = 'గోదావరి'ని ప్రతీకగా ప్రయోగించడం.
4. "Modern Thought, Processed by Godavari" = గోదావరి ద్వారా నియంత్రితమైన ఆధునిక ఆలోచన.

మా అమ్మగారి గోదావరి నుడికారంలో మొదటి రెండు వర్గాలు నాకు ఎక్కువగా కనపడ్డాయి. మూడవ వర్గం కూడా కొంత ఉంది.

**2.1 గోదావరితో ప్రత్యక్ష సంబంధం ఉన్న నుడికారాలు: (మొదట్లో నేను వివరించిన నాలుగు ఉదాహరణలూ కాకుండా మిగిలినవి.):-**

(1) "నీ మాట నమ్ముకుంటే కుక్కతోక పట్టుకొని గోదావరి ఈదినట్టే!" (సామెత) = నీవు నమ్మదగినవాడివి కావు. నీ మీద ఆధారపడి ఈ కష్టమైన పనిని నేను చేయలేను.

(2) "ఇంక ఏ దారీ లేదు, గోదారే!" (జాతీయం)=ఈ కష్టంనుండి గట్టెక్కే మార్గం కనబడటం లేదు. గోదాట్లో పడి ఆత్మహత్య చేసుకోవాల్సిందే!

(3) "గోదాట్లో దిగు!" (జాతీయం) = "నాశనమై పో!" (Go to hell! Go to dogs!)

(4) "ఏ గోదాట్లో దిగుతావో నాకు తెలియదు!" (జాతీయం) = "నీ సమస్యను నీవే పరిష్కరించుకో! నా సహాయం అడగవద్దు" (Hang yourself!).

(5) "గోదారికీ గొద్దిలేరుకీ ఉన్నంత తేడా ఉంది!" = చాలా తేడా ఉంది. 'గోదావరి' పెద్ద నది. 'గొద్దిలేరు' చిన్నయేరు.

(6) "ఎప్పుడో పుష్కరాల నాటి మాట!" (జాతీయం) = "చాలా ఏండ్ల క్రిందటి మాట!" గోదావరి నదికి 12 సంవత్సరాల కొకసారి 'పుష్కరాలు' అనే . మహోత్సవం వస్తుంది. ఆ సమయంలో గోదావరిలో స్నానం చేస్తే పుణ్యం వస్తుందని నమ్ముతారు. తండోపతండాలుగా ప్రజలు వస్తారు. "ఎప్పుడో పుష్కరానికోసారి వస్తాడు" – "పుష్కరానికోసారి పుస్తకం పుచ్చుకుంటే చదువు వస్తుందా?" మొదలైనవి కూడా ఇటువంటివే.

(7) "శ్రావణ భాద్రపదాల్లా కొట్టేస్తోంది!" (నుడికారం) = "నీళ్ళ విరేచనాలతో బాధపడుతున్నాను". శ్రావణ భాద్రపదమాసాల్లో గోదావరికి వరదలు వస్తాయి. బురదనీరు అతివేగంగా ప్రవహిస్తుంది.

(8) "వాడేమైనా కొత్తగోదాట్లోంచి కొట్టుకొచ్చాడా?" (నుడికారం) = "వాడేమైనా పరాయివాడా? నీ తోడబుట్టిన సోదరుడే!" (చిన్నతనంలో ఏదైనా మిఠాయి మా తమ్ముళ్ళకు పెట్టకుండా నేను ఒక్కణ్ణే తింటూంటే మా అమ్మగారు నన్ను ఈ విధంగా తిట్టేది!). దీనినే సంక్షిప్తంగా "పైనించి కొట్టుకొచ్చాడా?" అని కూడా అనేది. ("పైనుంచి" = గోదావరి వరదలోనుండి)

(9) "ఆఁ... నా గోదారి!" (నుడికారం) = నీవు చెప్పేది సరికాదు. 'ఆఁ... నా మొహం!" – "ఆఁ... నా బొంద" అన్నట్టుగా.

**2.2 గోదావరితో పరోక్ష సంబంధంఉన్న నుడికారాలు: (గోదావరికి సంబంధించిన వస్తువులు = పడవలు):–**

గోదావరిలోను, దానినుండి ప్రవహించే కాలువల్లోను, రకరకాల పడవలు ఉండేవి: "తొట్టిపడవ" "రాధారీ (రహదారి) పడవ"–"నావ" – "దోనె" – "బల్లకట్టు" మొదలైనవి. తొట్టిపడవ ఊగుతూ వెడుతుంది. రాధారీ పడవ వేగంగా వెడుతుంది. మనుషుల్ని తీసికెడుతుంది. తొట్టిపడవ కేవలం సరుకుల రవాణా కోసమే ఉద్దేశించింది.

నావ, దోనె చిన్నచిన్న పడవలు. బల్లకట్టు వెడల్పుగా ఉంటుంది. వంతెనలులేని పూర్వకాలంలో కాలువలు దాటడానికి దీనిని ఉపయోగించేవారు. పడవలకు దిశానిర్దేశం చేయడానికి చుక్కాని ఉంటుంది. గాలివైపుగా వెళ్ళడానికి తెరచాపలుంటాయి. గోదావరిలో పెద్దపెద్ద లంకలుంటాయి. అక్కడ పుచ్చకాయలు, దోసకాయలు విరివిగా పండుతాయి. పొగాకు పండిస్తారు. దీనిని "లంక పొగాకు" అంటారు. ఇది చాలా ఘాటుగా ఉంటుంది. పడవల్ని నీటిఒడ్డున నిలుపడానికి 'లంగరు' (పెద్ద యినుపకడ్డీ) వేస్తారు. లోతు తక్కువగా ఉన్న కాలువల్లో గడకర్రలతో పడవను తోస్తారు. గోదావరిలో లోతు ఎక్కువ కాబట్టి అక్కడ తెరచాపలు ఎత్తివేస్తారు. నావలను, దోనెలను తెడ్లతో నడుపుతారు. ఈ విషయాలు తెలుసుకుంటే - క్రింది నుడికారాలు తెలుస్తాయి.

ఇంకొక్క విషయం తెలుసుకోవాలి. తొట్టిపడవలకు, రాధారి పడవలకు రెండు ప్రక్కలా ఒక చెక్క ఉబ్బెత్తుగా అతుకబడి ఉంటుంది. పడవలో బరువు వేస్తే ఈ చెక్క వరకూ మునుగవచ్చును. దీనిని దాటి నీరు మునిగితే పడవకు ప్రమాదం. ఈ చుట్టూ ఉన్న చెక్క, పడవ ఎంత బరువు తట్టుకుంటుందో సూచిస్తుంది. పడవ బరువుతో నిండుగా ఉంటే, నదిలోని నీరు ఈ చెక్క వరకూ వస్తుంది. అప్పుడు పడవ "చెక్కపూటుగా ఉంది" అంటారు. దానిని "చెక్కపూటు పడవ" అంటారు. పీకలదాకా తిన్న వ్యక్తిని "చెక్కపూటుగా తిన్నాడు" అనేది మా అమ్మగారు.

(1) "చెక్కపూటుగా తిన్నాడు!" = పీకలదాకా తిన్నాడు.
(2) "వాడు రాధారీ పడవలా పోతున్నాడు!" = వాడు ఠీవిగా దర్జాగా వెడుతున్నాడు.
(3) "వాడు తొట్టిపడవలా వంగిపోయాడు!/ ఊగిపోతున్నాడు!" = వృద్ధుడైపోయి, ప్రక్కకు వంగి, ఊగిపోతూ, తొట్టి పడవలా నడుస్తున్నాడు వాడు.
(4) "ఆమె బల్లకట్టులా ఉంది!" = ఆమె లావుగా ఉంది.
(5) "ఆమె వీపు బల్లకట్టులా ఉంది!" = ఆమె వీపు వెడల్పుగా ఉంది.
(6) "చుక్కాని పట్టు" = చక్కగా దారి చూపించు; గొప్పగా నాయకత్వం వహించు.
(7) "నావ దరిజేర్చు" = కష్టాలనుండి గట్టెక్కించు.
(8) "పుచ్చపువ్వులా ఉంది వెన్నెల" - (పుచ్చపువ్వులు చాలా తెల్లగా ఉంటాయి).
(9) "అరికాళ్ళు దోసకాయల్లా పగిలాయి" - (వేసవిలో లంక దోసకాయలు చక్కగా ముగ్గి బాగా పగులుతాయి).
(10) "తల - పుచ్చకాయలా పగలగొడతాను, జాగ్రత్త!"

(11) "ఎక్కడా గడ అందటం లేదు!" లేదా "ఎక్కడా లంగరు అందటం లేదు!" = సంసారంలో ఖర్చు చాలా పెరిగిపోతోంది; తట్టుకోలేకపోతున్నాను.

(12) "ఎదురీత కొడుతున్నాడు" = కష్టాలను ఎదిరిస్తున్నాడు.

(13) "లంకలోకి పోతాడు" = "చనిపోతాడు" అని అర్థం. గోదావరీ తీర గ్రామాల్లో శ్మశానం ప్రత్యేకంగా ఉండదు. ఏటిగట్టుక్రింద ఉన్న లంకయే శ్మశానం.

(14) "నీకూ నాకూ లంగరు కుదరదు!" = నీకు నాకూ సమన్వయం కుదరదు.

(15) "దుఃఖం వరదలా పొర్లుకొస్తోంది."

(16) "లంకంత యిల్లు" /"లంకంత సంసారం" = పెద్దయిల్లు/ పెద్ద సంసారం.

(17) "ఏరుదాటి తెప్ప తగలేసే రకం!" = ఉపకారం తీరాక అపకారం చేసే మనిషి.

(18) "వాడికి అటూ పోటూ" = వాడికి కోపమూ సంతోషమూ తరచుగా వస్తాయి.

(19) ఓడ దాటేవరకూ "ఓడమల్లయ్య", ఓడ దాటాక "బోడి మల్లయ్య" = అవసరం ఉన్నంత వరకూ మంచిగా ఉండి, తరువాత అపహాస్యం చేయడం.

(20) "గాలివాటు మనిషి" = ఎవరు ఎలా చెపితే అలా చేసేవాడు. (గాలివాటును చూచి పడవకు తెరచాప ఎత్తుతారు. గాలి వీచే దిశలో పడవ పెడుతుంది.)

(21) "ఎక్కేవాళ్ళు ఎక్కాలి; దిగేవాళ్ళు దిగాలి. లేకపోతే పడవ మునిగిపోతుంది." ("అందరూ ఎక్కేవాళ్ళే అయితే పడవ మునిగి పోతుంది.") ధ్వని = ఆహారం తింటూనే ఉండి, మలవిసర్జనం చేయకపోతే ఆరోగ్యం దెబ్బతింటుంది.)

(22) "రెండు గడలలోతు" = చాలా లోతు.

(23) "కొల్లేటి వ్యవసాయం" = అనిశ్చితమైన ఆదాయం. (ఎప్పుడు కొల్లేరు పొంగి పంట నాశనమవుతుందో తెలియదు.)

(24) "ఆనకట్ట కట్టు" = అడ్డగించు. (విస్తరిలో చారు లేదా మజ్జిగ జారిపోతూ ఉంటే అన్నంతో అడ్డగించు.)

(25) "గట్టెక్కు" – "గట్టెక్కించు" = కష్టాలనుండి బయటపడు; కష్టాలనుండి రక్షించు.

(26) "రేవులో తాడిలా" ఉన్నావు = చాలా పొడవుగా ఉన్నావు.

(27) "కొల్లేటి కొంగలా" ఉన్నాడు = సన్నగా పొడవుగా ఉన్నాడు.

(28) కొత్త గోదారి నీళ్ళలా ఉంది" = పలుచగా ఉన్న కాఫీని గురించి కాని, పెరుగును గురించి కాని అనేమాట.

(29) "మజ్జిగ తుర్రునీళ్ళలాఉంది" లేదా "టుర్రుహెూయ్‌లా ఉంది" = మజ్జిగ చాలా పలుచగాఉంది. పశువులను నీళ్ళుత్రాగించేటప్పుడు "టుర్రుహెూయ్" అంటారు.

నేను భీమవరం కళాశాలలో చదువుతున్నప్పుడు (1952–1954) మోచర్ల జానకిరామయ్యగారనే ఇంగ్లీషు లెక్చరరు పరీక్షల ముందు విద్యార్థులతో చమత్కారంగా "లాకు తలుపులు తెరుస్తారు. కొత్తనీరు పాతనీరూ ఏకమైపోతుంది. జాగ్రత్త!" అనేవారు. "పరీక్షలు వస్తున్నాయి. జాగ్రత్తగా చదవండి. ఫెయిలయితే కొత్తవాళ్ళతో కలిసి మళ్ళీ చదువవలసి వస్తుంది" అని ఆయన భావం. దీనిని గోదావరి వరద – కాలువలు – లాకులు దృష్టిలో పెట్టుకొని ధ్వనిగర్భితంగా అనేవారు.

**2.3 ఉదాహరణాల్లో కొన్ని చోట్ల 'గోదారి' శబ్దాన్ని ప్రతీకగా ఉపయోగించడం కనబడుతుంది:–**

(1) నిర్వ్యాపారానికి ప్రతీకగా 'గోదారి' – "ఆఁ... ఏం చేస్తున్నాడు? వాడి గోదారి, నా గోదారి." = ఏమీ చెయ్యడంలేదు. గాలికి తిరుగుతున్నాడు.

(2) సర్వనాశనానికి ప్రతీకగా 'గోదారి' – "అంతా గోదారీ కొల్లేరూ అయిపోయింది!"

(3) ఆత్మహత్యకు ప్రతీకగా 'గోదారి' – "ఇంక ఏ దారీ లేదు, గోదారే!".

(4) నీళ్ళ విరేచనాలకు ప్రతీకగా శ్రావణ భాద్రపదమాసాలలో వచ్చే వరద గోదావరి = "శ్రావణ భాద్రపదాల్లా కొట్టిపారేస్తోంది!".

(5) శూన్య ప్రయోజనానికి ప్రతీకగా 'గోదారి' = "ఏమయింది? గోదారి మెరకయింది!" – ఏమీ ప్రయోజనం లేకపోవడంతో ఆ వస్తువుని గోదాట్లో పడేశారు. మనకు ప్రయోజనం లేకపోయినా గోదావరిలో పడవేయటంవల్ల అది కొంత మెరక అయింది అని అపహాస్యం! "ఫలానా దానివల్ల ఏమయింది?" అని ప్రశ్నించినప్పుడు, "ఏమీ ప్రయోజనం కాలేదు' అనే అర్థంలో ఇలా అనేవారు మా అమ్మగారు.

**2.4 గోదావరి ద్వారా నియంత్రితమైన ఆధునిక ఆలోచన :–**

(1) ఇది కొందరు ఆధునిక కవులలో కనబడుతుంది. "రాజమండ్రి పాటలు" వ్రాస్తూ దేవరకొండ బాలగంగాధర తిలక్‌గారు (గోదావరి వరదలను దృష్టిలో పెట్టుకొని) ఇలా వ్రాశారు:

**"కన్నీరుకీ పన్నీరుకీ మున్నీరుకీ నీరు సమానం**
**అయితే గోదావరి ఏ నీరు?**
**ఏడ్పునీరు! చావనీరు!"**

(2) ఆరుద్రగారు ఒక సినిమా పాటలో ఇలా వ్రాశారు:–

**"కొండగాలి తిరిగింది – గుండె ఊసులాడింది,**

**గోదావరి వరదలా కోరిక చెలరేగింది!"**

(3) 'వసీరా' అనే కవి–

**(1) గోదావరి కొత్త వంతెన**

**అద్దంమీద బొద్దింక!**

(2) "వెన్నెట్లో గోదారి" అనే కవిత:

**ఇవాళ పొద్దున్న**
**చందమామను పట్టుకొని**
**ఏ పేపరు మిల్లులో పడేశారో ఏమిటో**
**ఇక్కడి కొచ్చి చూస్తే**
**గోదావరే పెద్ద తెల్లకాగితం!**
**దానిమీద కవిత్వం రాయడానికి**
**ఆ సూర్యుడే దిగి రానక్కరలేదు,**
**నేనిక్కడ నిలబడి**
**చిన్నరాయి పడేస్తే చాలు!**



**ఈ గ్రంథముద్రణకు నేను రూ.1,50,000–00 ఖర్చుచేశాను. దీనిలో సింహభాగం (సగభాగం) మా "బుల్లితమ్ముడు" చిరంజీవి కర్నల్ తంగిరాల కృష్ణమూర్తి – వాడి ధర్మపత్ని చి॥సౌ॥ తంగిరాల (మల్లాది) శంకరి భరించారు. ఈ దంపతులకు నా అనంతమైన శుభాశీస్సులు... నేను అడగకుండానే మా అన్నయ్యగారి అమ్మాయి చి॥ సౌ॥ జయదుర్గాభవాని – మా మేనల్లుడు చి॥ చల్లా వెంకట భాస్కర కృష్ణమూర్తి ఉడుతాభక్తిగా చెరొక పదివేలూ పంపించారు. మా చిరంజీవుల (కాళి–సీత–శీను–శశి ల) పుష్కలమైన ఆర్థిక ప్రోత్సాహం నా అన్ని పుస్తకాలకూ ఎల్లప్పుడూ ఉంటుంది. వీరందరికీ నా అనేక మంగళాశీస్సులు...**

**– తంగిరాల వెంకట సుబ్బారావు**

## అనుబంధం-2:

# మా అక్కయ్యలు

మా నలుగురు అన్నదమ్ములకు పైన - మా అన్నయ్యకన్న ఆరేళ్ళు పెద్దగా మా పెద్దక్కయ్య, నాలుగేళ్ళు పెద్దగా మా చిన్నక్కయ్య లేక "చెల్లక్క" ఉండేవారు. (మా అన్నయ్య కన్న రెండేళ్లు పెద్దగా "సోదులు" అనే మా మూడవ అక్కయ్య ఉండేది; కాని ఆమె బాల్యంలోనే చనిపోయింది.) మా అక్కయ్యల జీవితాలు అధిక సంతానం వల్ల, ఇతర కారణాలవల్ల సుఖదుఃఖాలతో దోబూచులాడాయి. మేం నలుగురు తమ్ముళ్ళం వారికి మా చేతనైనంతగా సహాయ పడ్డాము. మా పెద్దక్కయ్యకు మా పురుష ప్రయత్నంతోపాటు దైవకృపకూడా కలిసివచ్చింది; అందువల్ల కష్టాలనుండి ఆమె గట్టెక్కింది! మా చిన్నక్కయ్యకు కలిసిరాలేదు; దానితో కష్టాలకడలిలో మునిగిపోయింది! అందువల్ల మా పెద్దక్కయ్య జీవితం: "సిరిసంపదలు > దారిద్ర్యం > సిరిసంపదలు"గా సాగింది. కాని మా చిన్నక్కయ్య (చెల్లక్క) జీవితం: "సిరిసంపదలు > దారిద్ర్యం > కటిక దారిద్ర్యం"గా ముగిసింది!

### 1. మా పెద్దక్కయ్య - పెద్దబావ:-

మా పెద్దక్కయ్యపేరు "పెద్ద వెంకట రామలక్ష్మి". 1924లో పుట్టింది. అంటే అప్పుడు మా అమ్మకు 17 సం.లు; మా నాన్నకు 20 సం.లు. మా తల్లిదండ్రులకు మొట్టమొదటి సంతానం కావడంవల్ల బలంగా, ఆరోగ్యంగా, తెల్లగా అందంగా ఉండేది. ఈమెయే మగపిల్లాడు అయివుంటే మా అమ్మకు అన్ని కష్టాలు వచ్చివుండేవి కావు. మా అక్కయ్య స్వగ్రామంలో ఐదవ తరగతి వరకు చదువుకుంది. ఆమెకు చదువంటే ఎంత యిష్టమో నేను మాటల్లో చెప్పలేను. కాని ఆ రోజుల్లో శ్రోత్రియ బ్రాహ్మణ కుటుంబాలలో బాలికలను ప్రాథమిక పాఠశాలదాటి చదవనిచ్చేవారు కాదు. హైస్కూలు చదువులు, కాలేజీ చదువులు ఆనాడు యువతులకు నిషేధం. మా పెద్దక్కయ్య చదువులో ఎంతో చురుకుగా ఉండేది. శతక పద్యాలన్నీ ఆమెకు కంఠస్థం! 5వ తరగతిలో ఉన్నతశ్రేణిలో ఉత్తీర్ణురాలయింది. హైస్కూలులో చేరే అవకాశం లేదు. ఆమెకు చదువుమీద ఉండే వల్లమాలిన ఇష్టం వలన, ఉత్తీర్ణురాలైన ఐదవతరగతినే మళ్ళీ రెండోసారి చదివింది పాపం! తమ్ముళ్ళందరికీ శతకపద్యాలు, ఎక్కాలు, లెక్కలు, వారాలపేర్లు, తెలుగునెలల పేర్లు, తెలుగు సంవత్సరాల పేర్లు శ్రద్ధగా బోధించేది.

మా అక్కయ్యది బాల్యవివాహం. ఏడేళ్ళ వయస్సులోనే మా జగ్గన్న తాత ఒక ఎకరం పొలం కట్నంగా ఇచ్చి ఈమెకు పెండ్లి చేశాడు. వరుడు చల్లా పాపయ్యశాస్త్రి. నల్లగా సన్నగా రూపహీనంగా ఉండేవాడు. దీనికితోడు చిన్నతనంలో వాతం క్రమ్మి మూతి వంకరపోయింది. అసలు చూడటానికి మా బావగారు బ్రాహ్మణుడులా ఉండేవాడు కాదు; కోమటిలా ఉండేవాడు. ఆయన తల్లిగారు నల్లగా ఉండేవారు – తల్లిపోలిక వచ్చింది. మా అక్కయ్య అందంగా పచ్చదబ్బపండు చాయలో ఉండేది. ఇద్దరూ "కాకిముక్కుకు దొండపండు" సామెతలా ఉండేవారు! (ఆరోజుల్లో పెళ్ళిళ్ళు అలాగే ఉండేవి. ఆడపిల్లల ఇష్టాయిష్టాలతో సంబంధంలేకుండా చిన్నతనంలో పెళ్ళిళ్ళు చేసేవాళ్ళు.) కాని, మా బావగారు గొప్ప పండిత కుటుంబంలో పుట్టినవాడు. ఆస్తిపరుడు. ఆయన వాటాకు 10 ఎకరాల మాగాణి భూమి ఉండేది. మా బావగారి తండ్రిగారు చల్లా సోమనాథశాస్త్రిగారు. వీరు తణుకు ప్రక్కనే ఉన్న కాకరపఱ్ఱులో ఉండేవారు. చాలా గొప్ప పండితుడు – కవి – తార్కికుడు – వ్యాకరణ వేత్త – భరతుని నాట్యశాస్త్రంలో దిట్ట. తిరుపతి వేంకటకవుల సమకాలికుడు. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు ఈ సోమనాథశాస్త్రిగారిని ఎంతో అభిమానించేవారు. తిరుపతివేంకటకవుల "గీరతం"లో సోమనాథశాస్త్రిగారిని గురించి వెంకటశాస్త్రిగారు రెండు పద్యాలు వ్రాశారు.

ఒకసారి దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు లేకుండా, చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు ఒక్కరూ కాకరపఱ్ఱు వెళ్ళారు. అక్కడి పండిత యువకులు చెళ్ళపిళ్ళవారిని ఎదిరించి, అవహేళన చేస్తూ చప్పట్లు చరిచి, నిందించారు. ఈ సంఘటన అంతా "గీరతం"లో "చప్పట్ల పర్వం" పేరుతో వర్ణింపబడింది. ఇది వెంకటశాస్త్రిగారు – తిరుపతి శాస్త్రిగారికి వ్రాసిన పద్యలేఖారూపంలో ఉంది. అందులో చల్లా సోమనాథశాస్త్రిగారిని గురించి రెండు చక్కటి పద్యాలున్నాయి. మొదటిదానిలో సోమనాథశాస్త్రిగారి పాండిత్య ప్రశంస ఉంది. రెండవ పద్యంలో "అయ్యో! ఈ చప్పట్ల పర్వంలో నన్ను ఎంతో అభిమానించే సోమనాథశాస్త్రిగారు లేకపోయారే!" అని బాధపడడమూ, "ఒక వేళ ఆయన ఉన్నా, కూడా ఈ అల్లరిమూక చప్పట్లను ఆపగలిగేవారు కారేమో!" అనే సందేహం వెలిబుచ్చారు – చెళ్ళపిళ్ళవారు:–

**శా॥ తర్కవ్యాకరణజ్ఞుఁడున్, గవనబంధజ్ఞుండు, గీర్వాణవా**
**క్కర్కశ్యప్రవిభేది, బంధకవితాఘట్టమ్మునం దట్టుఁ, ద**
**య్యర్కున్ బోలెడు వాఁడు తేజమున, నార్యాచారి, యొద్దానం సం**
**పర్కం బీతఁడు వెట్టికోఁడఁట, కలావ్యాసంగి వాలాయమున్**

(తట్టుఁడు = పారంగతుఁడు; ఆర్యాచారి = మంచి ప్రవర్తన కలవాడు; వాలాయమున్ = ఎల్లప్పుడును.)

**మ॥ వెలనాటన్వయుఁ డొక్కఁడే వెలయు నవ్వీటన్, మహాపండితుం,**
**దలఘుండాతఁడు, సోమనాథబుధుఁ, డయ్యార్యుండు, చల్లాకులుం,**
**దెలమిన్ నా సభ లొక్కరెండు గనినాఁ, డీసూరి చప్పట్లసేఁ**
**తలవేళన్ దరిలేఁడ, యుండినను నీతండాపలేఁ డల్లరిన్!**

మా పెద్దబావగారు చల్లా పాపయ్యశాస్త్రిగారు అక్షరాలా "పండితపుత్రుడు"! ప్రాథమిక విద్యదాటి చదువుకోలేదు. సంస్కృతాంధ్ర భాషా సాహిత్యజ్ఞానం అసలేలేదు. పైగా సిగరెట్లు, పేకాట మొదలైన దుర్వ్యసనాలు ఉండేవి. ("షాహిడెక్కన్" సిగరెట్లు కాల్చేవాడు.) విలాసపురుషుడు; మంచి రసికుడు. సెంట్లు, స్నోలు, పౌడర్లు వాడేవాడు. తెల్లటి గ్లాస్కో పంచె, కఫ్‌లింగ్స్‌తో కూడిన తెల్లటి ఫుల్‌హాండ్స్ షర్టు ధరించేవాడు. మా బావగారు మంచి రంగస్థల నటుడు (హాస్యపాత్రలు ధరించేవాడు) సంగీత ప్రియుడు. ఆయనలో గొప్ప హాస్యం, చమత్కారం ఉండేవి. మాటల్లో ఎన్నో ఛలోక్తులు విసిరేవాడు. చిన్నవాళ్ళమైనా మాతోకూడా ఎంతో సరదాగా నవ్వుతూ నవ్విస్తూ ఉండేవాడు. రంగస్థలం మీద "చింతామణి" నాటకంలో సుబ్బిశెట్టి పాత్రలో గండికోట జోగినాథంగారినుండి – కాళిదాసు కోటేశ్వరరావు, అరవపల్లి సుబ్బారావు (నరసరావుపేట) వరకు ఎందరో హాస్యనటుల్ని చూసినవాడు మా బావగారు. అందరిలోకి, అరవపల్లి సుబ్బారావును మించినవాడు లేడని నాతో చెప్పాడు.

మా పెద్ద బావగారిలో ఎంత గొప్పహాస్యం ఉండేదో తెలియజేయడానికి ఒక చిన్న ఉదాహరణ చెపుతాను. ఆయన వృద్ధాప్యంలో చివరిదశలో ఉన్నాడు. ఏవేవో రోగాలు చుట్టుముట్టాయి. మంచం మీద కూర్చున్నాడు. ఎదురుగా రెండో కూతురు పద్మావతి ఉంది. ఉన్నట్టుండి స్పృహ తప్పి ఠక్కున ప్రక్కకి పడిపోయాడు – మాటలేదు! – పద్మావతి పెద్దగా ఏడవటం మొదలు పెట్టింది. మా బావగారు రెండు మూడు క్షణాల్లో తేరుకుని, మళ్ళీ లేచి కూర్చున్నాడు. ఎదురుగా ఏడుస్తున్న కూతుర్ని చూసి: "దొంగముండా! అప్పుడే గారిముక్క తినేద్దామనే!" అన్నాడు. ఏ మనిషిలో అయినా చనిపోయేముందు కూడా ఇంత గొప్ప హాస్యధోరణిని మనం చూడగలమా?

మా బావగారికి "పేకేరు"అనే గ్రామంలో 10ఎకరాల మాగాణిభూమి ఉండేది. అక్కడ పెద్ద పెంకుటిల్లు కట్టుకున్నాడు. కాని ఆ ఆస్తిని నిలబెట్టుకోలేకపోయాడు. రంగస్థల నాటకాలు ఆడించి, బెల్లం వ్యాపారం – చింతపండు వ్యాపారం చేసి, ఆస్తినంతా నాశనం చేసుకున్నాడు. కుటుంబ నియంత్రణ పాటించకపోవడంవల్ల

గంపెడు పిలల్ని కన్నాడు (ఐదుగురు మగపిల్లలు–నలుగురు ఆడపిల్లలు). మగపిల్లలందరికీ మా బావగారి పోలిక వచ్చింది. ఎవ్వరూ సరిగ్గా చదువుకోలేదు; మంచి ఉద్యోగాలు చేయలేదు. ఆడపిల్లలకి మాత్రం చదువులో మా అక్కయ్య పోలిక వచ్చింది. బాగా చదువుకున్నారు; ఉద్యోగాలు చేశారు; కుటుంబాన్ని ఆదుకున్నారు; ముఖ్యంగా పెద్దమ్మాయి చి॥ సౌ॥ శేషారత్నం. ఈమె చిన్నతనంలో Third Form (8వ తరగతి) మంచి మార్కులతో పాసయ్యింది. పేకేరులో అంతకన్నా పై చదువులేదు. అప్పుడు నేను వెళ్ళి, ఆమెను తణుకు తీసికొనివచ్చి, గరల్స్ హైస్కూల్లో చేర్పించి, S.S.L.C వరకు చదివించాను. బాగా చదివింది. అందువల్ల మా బుల్లి తమ్ముడు చి॥ కృష్ణమూర్తి ఈ శేషారత్నాన్ని కాకినాడలో Girls Polytechnic College లో చేర్పించి L.C.E. చదివించాడు. బాగా చదివి పాసయ్యింది. గుంటూరు లో PWD Officeలో Overseer గా చేరి పేదరికంలో ఉన్న కుటుంబాన్ని ఆదుకుంది. తన చెల్లెళ్ళు ముగ్గుర్నీ చదివించింది; వాళ్ళకి ఉద్యోగాలు వేయించింది; పెళ్ళిళ్ళు చేసింది.

మా పెద్దక్కయ్య పెద్దకొడుకు సోమనాథశాస్త్రికి తాతగారి పేరుపెట్టినా చదువు సంధ్యలు అబ్బలేదు. S.S.L.C. ఫెయిల్ అయ్యాడు. గుంటూరులో పప్పుల వ్యాపారం చేసేవాడు. తుఫాను వచ్చి ఆ పప్పుల మిల్లు కూలిపోయింది. నష్టాల్లో కూరుకుపోయాడు. రెండవ కొడుకు చి॥ వెంకటేశ్వర్లును మా అన్నయ్య తీసికొని వెళ్ళి, హైస్కూలు చదువు గట్టెక్కించాడు. వీడిని మా బుల్లితమ్ముడు తీసికొనివెళ్ళి, బాగా శిక్షణ ఇప్పించి, Air Force లో చేర్పించాడు. వాడు అక్కడ 15 ఏళ్ళు పనిచేసి, హైదరాబాద్‌వచ్చి, ఒక సెక్యూరిటీ సంస్థ ("కౌండిన్య సెక్యూరిటీస్")ను స్థాపించి బాగా శ్రీమంతుడయ్యాడు. కుటుంబానికి ఎంతో ఆసరా అయ్యాడు. వీడి కొడుకులిద్దరు ఇంజనీర్లుగా అమెరికాలో పనిచేస్తున్నారు. మా అక్కయ్య తక్కిన కొడుకుల్ని గురించి పెద్దగా చెప్పవలసింది ఏమీలేదు. కానీ వాళ్ళ పిల్లలు మాత్రం (ముఖ్యంగా ఆడపిల్లలు) బాగా చదువుకొని అభివృద్ధిలోకి వచ్చారు. ఈ విధంగా మా పెద్దక్కయ్య కుటుంబం కష్టాలనుంచి, దారిద్ర్యాన్నుంచి గట్టెక్కింది. మా అక్కయ్యలో ఉన్న విద్యాతృష్ణ ఆమె మనుమలు, మనుమరాండ్రతో (ముఖ్యంగా మనుమరాండ్రతో) తీరింది. వాళ్ళంతా ఎంతో బాగా చదువుకొని పెద్ద పెద్ద ఉద్యోగాలు చేస్తున్నారు. శ్రీమతి బి. శ్రీకృష్ణవేణి Deputy Transport Commissioner గా ఉంది. ఆమె చెల్లెలు శ్రీమతి రాధామాధవి డాక్టరుగా ఉన్నది. మరో ఇద్దరు మనుమరాండ్రు నలుగురు మనుమలు అమెరికాలో ఉన్నారు. ఒక మనుమడు ఆస్ట్రేలియాలో ఉన్నాడు. ఒక్క శ్రీమతి పద్మావతి కుటుంబం తప్ప తక్కిన అందరి కుటుంబాలు సుఖంగా ఉన్నాయి.

మా పెద్దబావగారికి ఒక అన్నగారు ఉండేవారు. ఆయన పేరు చల్లా నరసింహశాస్త్రిగారు. ఆయన కూడా "పండిత పుత్రుడే!" కాని సంగీతంలో మంచి దిట్ట. హార్మోనియం మహాద్భుతంగా వాయించేవాడు. పేకేరులో కొందరు అమ్మాయిలకు సంగీతం పాఠాలు చెప్పేవాడు. ఈయన మా బావగారిలాగ కాకుండా, తెల్లగా, నాజూకుగా, అందంగా ఉండేవాడు. ఈ నరసింహశాస్త్రిగారు వారి పెదతండ్రి వెంకట్రామశాస్త్రిగారికి దత్తు వెళ్ళాడు. ఈయనది మా బావగరి కన్నా ఎక్కువ ఆస్తి. 13 ఎకరాల మాగాణి భూమి, ఒక పెద్ద పెంకుటిల్లు, దానికి ఎదురుగా పశువుల కొరకు పెద్దస్థలం ("పాలదొడ్డి") ఉండేవి. ఈయనకు ఒక కొడుకు, ముగ్గురు కూతుళ్ళు. మధ్యవయస్సులో భార్య చనిపోయింది. దీనితో పిల్లల్ని చూచేవాళ్లెవరూ లేక జీవితం అస్తవ్యస్తం అయిపోయింది. ఈయన కూడా నాటకాలలోను, సినిమాలలోను తిరిగి ఆస్తినంతా ధ్వంసంచేశాడు. రెండవ కూతురికి తప్ప, పెద్దకూతురికి, మూడవ కూతురికి సరియైన పెండ్లిండ్లు చేయలేకపోయాడు. చివరికి మద్యానికి బానిస అయిపోయి అతిదీనమైన మరణాన్ని పొందాడు.

మా పెద్దక్కయ్య 75 సం॥లు బ్రతికి, 1998లో గుంటూరులో పరమపదించింది. మా అన్నయ్య, మా తమ్ముడు చి॥ భాస్కరరావు పెళ్ళి ఆమె అంత్యక్రియలు పూర్తిచేసి వచ్చారు. దూరంగా ఉండటం వల్ల నేను, మా బుల్లితమ్ముడు వెళ్ళలేకపోయాం; 10 నాటికి అందుకున్నాం.

**2. మా చిన్నక్కయ్య లేక "చెల్లక్క" – చిన్న బావగారు:–**

మేము "చెల్లక్క" అని ముద్దుగా పిలుచుకొనే మా చిన్నక్కయ్య పేరు: "చిన్న వెంకట రామలక్ష్మి" [మా తాతగారి అన్నగారు తంగిరాల ఎగ్గెన్నశాస్త్రిగారు (రేలంగి). ఈయన మొదటి భార్య పేరు "రామలక్ష్మి". ఆమె వయస్సులో ఉండగానే చనిపోయి, మా పెద్దక్కయ్య పుట్టినప్పుడు బాలెంతరాలైన మా అమ్మను భూతరూపంలో ఆవహించి, పిల్లలకు తన "జంటపేర్లు" (రెండుపేర్లు) పెట్టమన్నదట. అందువల్ల మా అక్కయ్య లిద్దరికీ "రామలక్ష్మి" పేర్లు పెట్టారు. పెద్దామె "పెద్ద రామలక్ష్మి" – చిన్నామె "చిన్న రామలక్ష్మి". శ్రీ వేంకటేశ్వరస్వామి మా ఇలవేల్పు. అందువల్ల. పిల్లలకు మొదట "వెంకట" చేర్చాలి.]

మా "చెల్లక్క" 1926లో జన్మించింది. సన్నగా, నాజూకుగా, అందంగా ఉండేది. మా పెద్దక్కయ్యలాగ తెల్లటి తెలుపుకాదుకాని, చామనచాయ. ఎందువల్లనో ఈమెకు చదువు అంతగా అబ్బలేదు. చిన్నప్పటినుండి బాగా అలంకరించుకోవడం

ఈమెకు ఇష్టం (మా అన్నదమ్ములలో నాకు కూడా ఈ అలంకార ప్రియత్వ లక్షణం అబ్బింది.) మా చిన్నక్కయ్యకు 14వ ఏట మా అమ్మ ఎంతో కష్టపడి పెండ్లి చేసింది. దీనికోసం ఒక ఎకరం మాగాణిపొలం అమ్మివేసింది. వరుడు రాజమండ్రిలో ఉండే ఆయుర్వేద వైద్యుడు డా॥ బులుసు సోమన్నగారు. ఆ రోజుల్లో F.A. (నేటి Intermediate) పాసయ్యి, “ఆయుర్వేద భిషక్” అనే పరీక్షలో ఉత్తీర్ణుడయ్యాడు. వీరి తండ్రిగారు బులుసు రామయ్యగారు కూడా ఆయుర్వేద డాక్టరే! తండ్రివృత్తినే మా బావగారు కొనసాగించారు. ఈయనకు చిన్నతనంలోనే పెండ్లి అయింది. కాని ఒక కొడుకు పుట్టగానే తల్లీ పిల్లాడు చనిపోయారు. అప్పటికి సోమన్నగారి వయస్సు 27 సం.లు. తిరిగి మా చిన్నక్కయ్యను ద్వితీయ వివాహం చేసుకున్నాడు.

మా చిన్నబావగారు బులుసు సోమన్నగారు, మా పెద్దబావగారిలాంటివాడు కాడు. సత్పురుషుడు, సద్బ్రాహ్మణుడు. దురభ్యాసాలు ఏవీ లేనివాడు. రెండు పూటలా సంధ్యావందనం చేసేవాడు. ఆంజనేయోపాసకుడు. పట్టుబట్ట కట్టుకొనికాని భోజనం చేసేవాడు కాడు. దృఢంగా, ఆరోగ్యంగా, బలంగా ఉండేవాడు. కను ముక్కుతీరు బాగుండేది. చిన్న చిన్న రింగుల గిరజాల జుట్టు. కాని ఆ అందమైన జుట్టును పెరగనిచ్చేవాడు కాదు; అంటకత్తెర వేయించుకొనేవాడు. తలమీద వెనుక భాగంలో చిన్న శిఖ (పిలక) ఉండేది. గాస్కో పంచె, తెల్లటి లాల్చీ, భుజం మీద జరీకండువా ధరించి, గొడుగు వేసుకొని, రాజమండ్రిలో ఇన్నీసుపేటనుండి, మెయిన్ బజారులో గుండువారి వీధిలో ఉన్న తన ఆయుర్వేద క్లినిక్‌కి వడివడిగా అడుగులు వేసుకుంటూ వెళ్ళేవాడు. మా చిన్నబావగారు మాకు ఎక్కువగా చనువిచ్చి మాట్లాడేవాడు కాదు; ఎప్పుడూ గంభీరంగా ఉండేవాడు. కొంచెం కోపిష్ఠి; దురహంకారి; మాట చాలా పెళుసుగా ఉండేది; కట్టెవిరిచి పొయ్యిలో పెట్టినట్లు మాట్లాడేవాడు. కాని విద్యావిషయంలో నాకు ఎంతో ఉపకారం చేశాడు. కుంటుతున్న నా చదువును సరియైన బాటలో పెట్టిన మహానుభావుడు!

నేను 1944లో స్వగ్రామంలో 4వ తరగతి చదువుతున్నాను. అప్పుడు మా అన్నయ్య మా జగన్నతాత దగ్గర పంచకావ్యాలు చదువుతున్నాడు. రోజూ మా తాత మా అన్నయ్య దగ్గర పోరు పెడుతూ ఉండేవాడు: “ఆ సుబ్బారావును ఇంగ్లీషు చదువులు చదవనియ్యకు. నా దగ్గరకు తీసుకురా. ఉపనయనం చేసి వేదం నేర్పుతాను!” అనేవాడు. ఆయన పోరు భరించలేక, మా అన్నయ్య నన్ను 4వ తరగతి మాన్పించివేసి, మా తాతదగ్గర వేదాధ్యయనానికి చేర్పించాడు. ఒక సంవత్సరం (1944-45)

గడిచింది. వేదం చదివితే నేను జీవితంలో బ్రతకలేనని మా అమ్మకి అనిపించింది. వెంటనే వేదం మాన్పించి, మా ఊళ్ళో ఉన్న "పేర్వేల సుబ్బారావు" అనే ప్రైవేట్ మాస్టారి దగ్గర 5వ తరగతికి శిక్షణ ఇప్పించింది (1945-46). ఆయన రెండవ ప్రపంచ యుద్ధంలో సైనికుడుగా పనిచేసి వచ్చాడు. సిగరెట్లు కాలుస్తూ, స్నేహితులతో యుద్ధవిశేషాలు చెపుతూ, తన గొప్పలు చెప్పుకుంటూ ఊళ్ళో బలాదూరుగా తిరగేవాడు. నాకు చదువు – ముఖ్యంగా ఇంగ్లీషు ఏమీ చెప్పలేదు. ఆ ఏడాది గడిచాక, 1946లో, నేనేదో బాగా చదువుకున్నాననే భ్రమతో మా చిన్నబావగారు నన్ను రాజమండ్రి తీసికొనివెళ్ళి, వీరేశలింగం హైస్కూల్లో First Form (6వ తరగతి) Entrance పరీక్షకు కూర్చోబెట్టాడు. ఫెయిల్ అయ్యాను. మా బావ నన్ను తనతో రెండుమూడు హైస్కూళ్ళకు తీసికొని వెళ్ళి అక్కడ చేర్పించాలని ప్రయత్నం చేశాడు పాపం! ఎక్కడా select కాలేదు. ఇంగ్లీషు సరిగా రాక పోవడంతో "ఈ కుర్రాడు 4వ తరగతిలో చేరడానికి కూడా పనికిరాడు!" అనేశారు. అప్పుడు మా బావగారు నిరుత్సాహపడకుండా నా భవిష్యత్తును గురించి బాగా ఆలోచించి, వారి యింటి ప్రక్కనే ఉన్న ఒక Turorial School లో చేర్పించి, First Form (6వ తరగతి)కి కోచింగ్ ఇప్పించాడు (1946-47). అక్కడ చాలా బాగా చదువు చెప్పారు. తరువాత రాజమండ్రిలోని "Town Middle School లో (తరువాత అది Municipal High School అయింది) Second Form (7వ తరగతి)లో చేర్పించాడు. అక్కడ 1947-48 సంవత్సరంలో చదివి, 1948లో తణుకు వచ్చి Board High School లో Third Form (8వ తరగతి)లో చేరాను. అప్పటినుండి S.S.L.C. వరకు తారాజువ్వలా పైకి లేచాను. ప్రతిఫారంలోను A-B-C-D-E అని ఐదు sections ఉంటే, అన్నింటిలోకీ నేనే First గా వచ్చేవాడిని. చివరికి 1952లో S.S.L.C. లో School First (372/500 మార్కులు) వచ్చాను. ఈ విధంగా అధ్వాన్నంగా ఉన్న నా చదువును బంగారుబాటలో నడిపించిన పుణ్యాత్ముడు మా చిన్నబావగారు డా॥ బులుసు సోమన్నగారు! వారికి నేను జీవితాంతమూ ఋణపడి ఉంటాను.

కొంతకాలంపాటు (ఇంచుమించు 1965 వరకు) మా చిన్నక్కయ్య సంసారం హాయిగా నడిచింది. మా బావగారి వైద్యవృత్తి విజయవంతంగా సాగింది. రాజమండ్రిలోని వైశ్యులు ఆయన్ని బాగా అభిమానించారు. ధనం సంపాదించాడు; ఇల్లు కొనుక్కున్నాడు. సొంతంగా ఎన్నో ఆయుర్వేదం మందులు తయారుచేసేవాడు; అరిష్టాలు, ఆసనాలు సిద్ధంచేసేవాడు; వాటిని పేషెంట్లకు అమ్మేవాడు. తన తండ్రిగారి

పేరుతో పెట్టిన "శ్రీరామా ఆయుర్వేద ఫార్మసీ" లాభాల బాటలో పయనించింది. ఇది సుఖసంతోషాలతో కూడిన మొదటి దశ. ఈ దశలోనే మా బావగారు ముగ్గురు కూతుళ్ళకు పెళ్ళిళ్ళు చేశాడు.

తరువాత మా చిన్నక్కయ్య జీవితంలో కష్టాలతో కూడిన రెండవ దశ ప్రారంభమయింది. ఆ రోజుల్లో కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు ప్రచారంలోకి వచ్చాయి. కాని తాను స్వయంగా ఒక వైద్యుడు అయివుండి కూడా మా చినబావగారు దానిని పాటించలేదు. ఫలితంగా ఏడుమంది కూతుళ్ళు, ముగ్గురు కొడుకులు – మొత్తం 10 మంది సంతానం. (మా పెద్దబావగారు కూడా ఇలాగే చేశాడు. ఆయనకు ఐదుగురు కొడుకులు, నలుగురు కూతుళ్ళు – మొత్తం 9 మంది సంతానం. మా అన్నదమ్ములలో మా తమ్ముళ్ళు చి॥ భాస్కరరావు, చి॥ కృష్ణమూర్తి కుటుంబ నియంత్రణ చక్కగా పాటించి, ఒక కూతురు – ఒక కొడుకుగా – ఇద్దరు పిల్లలతో సరిపెట్టుకున్నారు. నేనూ మా అన్నయ్యా కుటుంబ నియంత్రణ కొంచెం ఆలస్యంగా పాటించాం. మా అన్నయ్యకు ఒక కొడుకు – ముగ్గురు కూతుళ్ళు – మొత్తం నలుగురు సంతానం. నాకు ముగ్గురు కొడుకులు – ఇద్దరు కూతుళ్ళు – మొత్తం ఐదుమంది సంతానం. అధిక సంతానంవల్ల నేను కూడా కొన్ని బాధలు పడ్డాను. 35 ఏళ్ళ వయస్సులో నాకు బెంగుళూరు యూనివర్శిటీలో ఉద్యోగం దొరికింది కాబట్టి బ్రతికి బట్టకట్టాను. లేకపోతే – నా గతి అధోగతే!

అధిక సంతానంవల్ల మా చిన్నక్కయ్య సంసారం కష్టాల్లో పడింది. మా బావగారి ప్రాక్టీసుకూడా క్రమక్రమంగా తగ్గుతూ వచ్చింది. (అప్పటికి రాజమండ్రిలో పెద్ద పెద్ద ఇంగ్లీషు వైద్యులు, వారి ఆడంబరమైన ఆసుపత్రులు ప్రసిద్ధిలోకి వచ్చేశాయి. ఆయుర్వేదం వెనుకబడింది.) ఈ లోగా "మూలిగే నక్కమీద తాటిపండు పడ్డట్టు" మా చిన్నక్కయ్యకు టి.బి. (క్షయవ్యాధి) సోకింది. అది ఇద్దరు ముగ్గురు పిల్లలకు కూడా వ్యాపించింది. (మొదటి కొడుకు, రెండవ కొడుకు ఆ వ్యాధితోనే చనిపోయారు.) మా చిన్నక్కయ్యకు నేను మొదట కొంతకాలం తణుకులో డా॥ సోమరాజుగారి దగ్గర వైద్యం చేయించాను. తిరిగి నాకు బెంగుళూరులో ఉద్యోగం వచ్చాక, 1971–72 సంవత్సరాలలో మా చిన్నక్కయ్యను మా యింట్లో వుంచుకొని, ప్రభుత్వ క్షయరోగ వైద్యశాలలో చికిత్స చేయించాను.

మా చిన్నక్కయ్య పెద్దకొడుకు చి॥ రామయ్య రాజమండ్రిలో B.Sc. pass కాగానే, మా బుల్లితమ్ముడు చి॥ కృష్ణమూర్తి వాడిని ఆంధ్ర విశ్వవిద్యాలయంలో M.Sc.

(Geology) లో చేర్పించాడు. వాడికి నెలనెలా కొంత డబ్బు పంపుతూ ఉండేవాడు. వాడు చక్కగా చదువుకొని, మంచి ఉద్యోగంలో చేరి, మా చిన్నక్కయ్య కుటుంబాన్ని గట్టెక్కిస్తాడని ఆశించాం. కాని "తానొకటి తలిస్తే, దైవమొకటి తలిచింది" అన్నట్టుగా వాడికి కూడా టి.బి. సోకి, M.Sc. First Year లోనే చనిపోయాడు. ఈ సంఘటనతో మా చిన్నక్కయ్య – చిన్నబావ హతాశులైపోయారు. వారు కట్టుకున్న ఆశాసౌధాలన్నీ పేకమేడల్లా కూలిపోయాయి! సంసారం పూర్తిగా అల్లకల్లోలం అయిపోయింది. పూట గడవటం కూడా కష్టమైపోయింది. మా తమ్ముళ్ళు చి॥ భాస్కరరావు, చి॥ కృష్ణమూర్తి మా చిన్నక్కయ్య కుటుంబానికి ఎంతగానో సహాయం చేశారు. చి॥ భాస్కరరావు నెల నెలా ఒక బియ్యం బస్తా పంపించేవాడు. చి॥ కృష్ణమూర్తి నెలనెలా కొంత డబ్బు పంపించేవాడు. ఈ సహాయమంతా, మా అన్నయ్య చెప్పినట్టుగా, మండుతున్న మహాజ్వాలల్లో చెంబెడు నీళ్ళుపోసినట్టుగా అయింది!

చివరికి ఒక పరిస్థితిలో మా అన్నయ్య ఒక ప్రణాళిక వేశాడు. మా చిన్నక్కయ్య గారి కుటుంబాన్నంతా తణుకు తీసికొనివచ్చి, మా యింట్లో ఉంచాలని నిర్ణయించాడు. మాకు పొలంమీదనుండి ఏటేటా ధాన్యం వస్తుంది కాబట్టి బియ్యానికి లోటు ఉండదు. కేవలం పప్పులు, ఉప్పులు, కూరలు కొనుక్కుంటే చాలు. మా బావగారిని తణుకులోనే ప్రాక్టీసు పెట్టమందాం – అనుకున్నాడు మా అన్నయ్య. మేమంతా అంగీకరించాం. కాని మా అమ్మ మాత్రం తీవ్రంగా వ్యతిరేకించింది: "ఒక సంసారాన్ని పూర్తిగా నెత్తిమీద పెట్టుకొని పోషించడం కష్టమవుతుంది. పైగా మీ చిన్నబావ సరైనవాడు కాడు. రాజమండ్రీలో ఉన్న తన "గొప్ప ప్రాక్టీసు"ను ఇక్కడికి తీసికొని వచ్చి పోగొట్టారు – అంటాడు." ఈ విధంగా ఊహించింది మా అమ్మ. మేం నలుగురం సందేహంలో పడ్డాం. మా బావగారి మనస్తత్వం తెలిసి భయపడ్డాం. పైగా, దురభిమానియైన మా బావగారు కూడా మా Proposal కి సుముఖంగా లేడు. అందువల్ల ఆ ప్రయత్నం ఫలించలేదు. మా చెల్లక్క ఆకలి సమస్య అలాగే ఉండిపోయింది. కటిక దరిద్రంలో కొట్టుమిట్టాడుతూ, చివరికి 1985లో మా చిన్నక్కయ్య స్వర్గస్థురాలయింది. మా అమ్మ, మా అన్నయ్య, మా తమ్ముడు చి॥ భాస్కరరావు పెళ్ళి దహనసంస్కారం ముగించుకొని వచ్చారు. దానితో మా అమ్మ అన్నట్టుగా – రాజమండ్రికి మాకు ఋణం తీరిపోయింది!

మా చిన్నక్కయ్య చనిపోయే ముందు, పిల్లలందరూ ఆమె చుట్టూ చేరి, భయంతో భోరున ఏడుస్తున్నారట. అప్పుడు ఆమె: "భయపడకండి! మా తమ్ముళ్ళు వస్తారు. అన్నీ సక్రమంగా నెరవేరుస్తారు" అన్నదట! తన తమ్ముళ్ళ మీద మా చిన్నక్కయ్యకు

అంత గట్టినమ్మకం ఉండేది. మేము కూడా ఆమె నమ్మకాన్ని వమ్ముచేయలేదు!

1985మే 10వ తేదీని నేను బెంగుళూరులో మా చిన్నమ్మాయి చి॥ రేవతీ శశిప్రియ పెండ్లి చేశాను. దానికి మా అమ్మ వచ్చింది; మా అమ్మతోపాటు మా చిన్నక్కయ్య – మా చిన్నబావకూడా వచ్చారు. నా దగ్గర వారం పదిరోజులు ఉండి వెళ్ళారు. అది నా జీవితంలో ఒక మధురస్మృతిగా మిగిలిపోయింది. తరువాత కొన్ని నెలలలోనే ఆమె చనిపోయింది.

మా పెద్దక్కయ్య విషయంలో ఆమె నలుగురు తమ్ముళ్ళమూ చేసిన పురుష ప్రయత్నానికి దైవకృపకూడా కలిసివచ్చింది. మేము చదివించిన ఆమె పెద్దకూతురు చి॥ సౌ॥ శేషారత్నం P.W.D. ఆఫీసులో ఓవర్‌సీర్‌గా చేరి, సంసారనావ చుక్కాని చేతపట్టింది! మా చిన్నక్కయ్య విషయంలో మేం M.Sc. చదివిస్తున్న ఆమె పెద్దకొడుకు టి.బి.తో చనిపోవడం దేవుని శాపంలాగ ఆమెను కాటువేసింది! ప్రారబ్ధకర్మలాగ ఆమెను వెంటాడింది! దైవలీలలు మనకు అర్థంకావు కదా!

మా చిన్నక్కయ్యకు పుట్టిన ఏడుగురు ఆడపిల్లల్లో నలుగురికి మా బావగారే పెళ్ళిళ్ళు చేసి అత్తవారింటికి పంపించాడు. చి॥ గంగ అనే ఆరవ అమ్మాయి బాల్యంలో చనిపోయింది. చి॥ జయలక్ష్మి అనే ఐదవ అమ్మాయికి మా పెద్దక్కయ్యగారి అమ్మాయి చి॥ సౌ॥ శేషాకరత్నం పెండ్లి చేసింది. చి॥ అలివేలు అనే ఆఖరి అమ్మాయికి మేం నలుగురు మేనమామలం కలిసి పెండ్లి చేశాం. ఈమె డిగ్రీ చదివింది. హైదరాబాద్‌లో ఒక బ్యాంకులో ఉద్యోగిగా ఉంది. అక్కడ ఇల్లు కట్టుకుంది. ఆమెకు ఇద్దరు ఆడపిల్లలు. పెద్దమ్మాయి బి.ఇ. చదివి ఉద్యోగం చేస్తోంది. చిన్నమ్మాయి ఇంజనీరింగ్ చదువుతోంది. చి॥ సౌ॥ జయలక్ష్మికి ఇద్దరు కూతుళ్ళు – ఇద్దరూ ఇంజనీరింగ్ చదివి, హైదరాబాద్‌లో ఉద్యోగాలు చేస్తున్నారు. మా చెల్లక్క పెద్దకొడుకు, రెండవ కొడుకు టి.బి.తో చనిపోయారు. మూడవ కొడుకు చి॥ కృష్ణమూర్తిని మా అన్నయ్యగారు తణుకు తీసికొనివచ్చి వాడికి చిట్టూరి బాపినీడుగారి ఫ్యాక్టరీలో ఉద్యోగం వేయించాడు.

మేం నలుగురు అన్నదమ్ములం ఉన్నతస్థితిలో ఉన్నాం. మా ఇళ్ళల్లో షడ్రసోపేతమైన వంటలు వండి పెద్ద Dining Table మీద నిండుగా అందంగా అమర్చి మమ్మల్ని భోజనానికి రమ్మని పిలుస్తారు. మేం ఆత్రుతగా వెళ్ళి భోజనం ముందు కూర్చుంటాం. అప్పుడు ఎప్పుడైనా ఆకలితో చనిపోయిన మా "చెల్లక్క" (చిన్నక్కయ్య) జ్ఞాపకం వస్తే – ఇక మాకు అన్న సయించదు!! ఆమె విషాదగాథ మా గుండెల్లో గాలం ముల్లులా గ్రుచ్చుకొని ఎల్లప్పుడూ బాధిస్తూ ఉంటుంది!!





మా పెద్దబావ-పెద్దక్కయ్య

కీ.శే. చల్లా పాపయ్యశాస్త్రిగారు-కీ.శే.చల్లా పెదవెంకట రామలక్ష్మిగారు



మా చిన్నబావ

కీ.శే. డా॥ బులుసు సోమన్నగారు

## అనుబంధం-3:

# లభించిన తిలక్ నూతన పద్యకవిత "కవితాసుమాంజలి"

**-ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు**

ప్రముఖకవి దేవరకొండ బాలగంగాధర తిలక్ (1921-1966) శతజయంతి సందర్భంగా నేను "రసగంగాధర తిలకం" అనే పేరుతో ఒక వ్యాససంపుటిని రచించాను. సుమారు లక్షరూపాయలు ఖర్చుచేసి దీనిని ముద్రించి, శతజయంతి సమాపనోత్సవ దినమైన 1921 ఆగస్టు 1వ తేదీని విడుదల చేశాను. దీనిలో 6వ వ్యాసం పేరు: "తిలక్ పద్యకవితా వైభవం" దీని చివర (చూ.222వ పుటలో) ఈ క్రింది విధంగా వ్రాశాను:-

"మా తణుకులో తిలక్‌గారికన్నా సీనియర్ కవి, హాస్య రచయిత ఒకరుండేవారు. ఆయన పేరు 'కవిశేఖర' శ్రీ తెన్నేటి కోదండరామయ్యగారు. వీరు వృత్తిరీత్యా లాయరు; ప్రవృత్తిరీత్యా గొప్ప కవి, రచయిత, మంచి వక్త. ఆయన సభలో ప్రసంగిస్తూ ఉంటే శ్రోతలు పొట్టచెక్కలయ్యేలా నవ్వేవారు. ఈయనంటే తిలక్‌గారికి గురుభావం. ఒకసారి తణుకులో ఈ కోదండరామయ్యగారికి పెద్దసన్మానం జరిగింది. ఆ సభకు తిలక్‌గారితోపాటు నేను కూడా వెళ్ళాను. ఆ సభలో తిలక్‌గారు కోదండరామయ్యగారిని అభినందిస్తూ "కవితాసుమాంజలి" పేరుతో ఐదు పద్యాలు (పంచరత్నాలు) వ్రాసి చదివారు. ఊరికే చదవడం కాదు, వాటిని ముద్రించి, ఆ ముద్రిత కరపత్రాలను ఆ సభలో అందరికీ నా చేత పంచిపెట్టించారు. ఆ పద్యాలతో కూడిన కరపత్రం నా దగ్గర నిన్నమొన్నటి వరకూ భద్రంగా ఉండేది. ఇప్పుడు ఎంత వెదికినా కనబడలేదు!"

2021 జూలై 28వ తేదీ నాడు మా అన్నయ్యగారు శ్రీ టి.వి.కె. సోమయాజులు గారు (శ్రీ తంగిరాల వేంకట కృష్ణ సోమయాజులుగారు) స్వర్గస్థులయ్యారు. ఆయన సంస్కృతాంధ్రాల్లో గొప్ప పండితుడు, కవి, వక్త. ఆయన్నిగురించి ఒక పుస్తకం వ్రాస్తూ, నేను 1986-2009 మధ్య ప్రచురించిన "చైతన్యకవిత" అనే కవిత్వపత్రిక పాతసంచికలన్నీ తిరగవేశాను. (ఆ పత్రికలో మా అన్నయ్య కవితలు, వ్యాసాలు వ్రాశాడు.) అప్పుడు (09-10-2021 నాడు) చైతన్య కవిత-17వ సంచికలో (భావ వసంత సంచిక - Spring 1994లో) ముద్రింపబడిన తిలక్‌గారి "కవితాసుమాంజలి"

పద్యాలు లభించాయి. నేను బ్రహ్మానందభరితుడనయ్యాను. కాని అప్పటికే "రసగంగాధర తిలకం" ప్రకటింపబడి ఉండడంవల్ల దానిలో చేర్చలేకపోయాను. అలాగే 2013లోను, 2021లోను ఎమెస్కో బుక్స్‌వారు నా ప్రధాన సంపాదకత్వంలో వెలువరించిన "దేవరకొండ బాలగంగాధర తిలక్–లభ్యరచనల సంకలనం"లో కూడా ఈ పద్యాలు చేరలేదు. దానికి చాలా చింతిస్తూ, తిలక్‌గారి "కవితాసుమాంజలి" పద్యాలను యథాతథంగా దిగువ యిస్తున్నాను:–

**"కవిశేఖర" – శ్రీ తెన్నేటి కోదండరామయ్యగారి సన్మాన సందర్భమున**

**దేవరకొండ బాలగంగాధరతిలక్ సమర్పించు**

## కవితాసుమాంజలి

**తణుకు సంస్కృతి జీవన వనధిలోన**
**మొదలు నుదితమైన శశాంకమూర్తి వీవు!**
**త్వన్మనోహర చంద్రికా ధౌత వియ ద**
**నంత విస్ఫుర దుడుగణమ్మగుదు మేము. 1**

**కిలకిలమంచు నవ్వులొలికించెడి నీదగు పల్కు మీగడల్**
**వలనుగ రెండు చేతులను పట్టి భుజింపనివాడు, తద్గతో**
**జ్వలిత చమక్ చమత్కృతికి సైయని పల్కనివాడు, గోస్తనీ**
**జలముల త్రాగనట్టి నరజన్ముడు లేడిట చుట్టుప్రక్కలన్. 2**

**నీనాపూర్వుల రక్తబాంధవ దృఢోన్నిద్రైక కౌటుంబికా**
**జ్ఞానస్నేహము నేడు నవ్యకలనా సారస్వతోపాసనా**
**ప్రాణమ్మై మరియింత చిక్కవడె, భాస్వద్భావ బంధూ! చల**
**ద్వాణీ నూపుర నాదరమ్య పదవీ ప్రాగల్భ్య వాఙ్మాంత్రికా! 3**

**సరస హాస్యరీతి, సత్కళాభి నిరతి,**
**మేలి గ్రంథరచన – మీదు సొమ్ము!**
**వయసు చూడ ముసలివగ్గువౌదువు గాని,**
**పడుచుదనవు పొగరు భావమందు. 4**

**అందమ్ముల్, మనజాతి చందములు, సంఘాభ్యున్నతుల్, మూఢ లో**
**కాందోళాస్పద హేతువాదములు, సమ్యగ్జీవనానందముల్,**
**చిందు న్నీ కలమైన పల్కయినగానీ, సత్కవిశ్రేష్ఠ! యీ**
**వందారుం గవి భక్తిమాల్య గొనుమా! వాత్సల్యసంపూర్ణతన్! 5**

**తణుకు – బాలగంగాధర తిలక్**
**శార్వరి చైత్రం 24-04-1960**
**(-చైతన్యకవిత-17, భావ వసంతం, Spring 1994)**

"కవిశేఖర" బిరుదాంకితులైన శ్రీ తెన్నేటి కోదండరామయ్యగారు "తణుకు సాంస్కృతిక జీవనము" అనే సముద్రంలో మొట్టమొదట ఉదయించిన పూర్ణచంద్రుడు! ఆ పూర్ణచంద్రుని అందమైన వెన్నెలతో నిండిపోయిన ఆకాశంలో నాలాంటి యువకవులందరూ నక్షత్రం సమూహం – అంటారు మొదటి తేటగీతి పద్యంలో తిలక్.

రెండవ చంపకమాల పద్యంలో కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి "వానలో తడియనివారు, మద్గురు వధాన మృదూక్తి మరందధారలో కదుగనివారు, మాకెచట కానగరారిల తెల్గునాడునన్" అనే పద్యపాదాలను అనుకరించారు తిలక్. అయినా ఇది ఎంతో అందమైన పద్యంగా అల్లబడింది. సభలో "కిలకిలమంచు నవ్వులొలికించెడి నీదగు పల్కుమీగడల్, వలనుగ రెండు చేతులను పట్టి భుజింపనివాడు" – నీ చమత్కార సంభాషణలకు సైయనని మెచ్చుకొనని వాడు – గోష్ఠనీ జలములు త్రాగని వాడు అయిన "నరజన్ముడు లేడిట చుట్టుప్రక్కలన్!" అంటారు తిలక్.

మూడవ శార్దూల పద్యంలో, తిలక్‌గారి పూర్వులకు, కోదండరామయ్యగారి పూర్వులకు "రక్తబాంధవ్య"మున్నదని, అది యిప్పుడు వారు చేస్తున్న "సారస్వతోపాసన"తో మరింత చిక్కబడిందని, చెపుతూ పద్యం చివర కోదండరామయ్యగారిని ఒక చక్కటి దీర్ఘసమాసంతో సంబోధించారు:-

"భాస్వత్ భావబంధూ! చలద్వాణీ నూపుర నాదరమ్య పదవీ ప్రాగల్భ్య వాఙ్మాంత్రికా!" – భాస్వత్ = ప్రకాశించుచున్న, భావ = భావములతో, బంధూ! = నాకు బంధువైనవాడా!; చలత్ = కదలుచున్న, వాణీ = సరస్వతీదేవియొక్క; నూపుర = కాలి అందెల, నాద = నాదముతో (ధ్వనులతో), రమ్య = అందమైనటువంటి, పదవీ = స్థానము కలిగిన, ప్రాగల్భ్య = ప్రౌఢిమతో కూడిన (సమయోచిత చతురోక్తులతో

కూడిన), వాక్ + మాంత్రికా – వాక్ = మాటలతో, మాంత్రికా = ఇంద్రజాలం చేసేవాడా! ప్రకాశించుచున్న భావములతో నాకు బంధువైనవాడా! సరస్వతిదేవియొక్క చలించుచున్న కాలి అందెల నాదముతో రమ్యమైన పదవి (స్థానం) కలిగిన, సమయోచిత చతురోక్తులతో కూడిన మాటలతో ఇంద్రజాలం చేసేవాడా!

నాల్గవ పద్యం... చిన్న ఆటవెలది. ఈ చందస్సు తిలక్‌గారికి మిక్కిలి యిష్టమైన ఛందస్సు. ("ఆటవెలది" అనే శీర్షికతోనే "భారతి"లో ఎన్నో పద్యాలు వ్రాశారు.) ఇది చిన్న చిన్న పదాలతో కూర్చిన అందమైన పద్యం. సరసమైన హాస్యరీతి, సత్కళయందలి మిక్కిలి ఆసక్తి, మేలిగ్రంథ రచన – ఇవి మీ సొమ్ము. "వయసు చూడ ముసలివగ్గువౌవుదు గాని, పడుచుదనపుపొగరు భావమందు!" అని మేలమాడుతున్నారు తిలక్.

ఐదవ పద్యం మళ్ళీ శార్దూలం. అందము – మనజాతి చందము–సంఘాభ్యున్నతి, మూఢలోకాన్ని ఆందోళనకు గురిచేసే హేతువాదము, సంపూర్ణమైన చక్కని జీవితానందము – ఇవి నీ రచనలోను, నీ పలుకులోను తొణికిసలాడుతూ ఉంటాయి. ఓ సత్కవిశ్రేష్ఠా! నీకు నమస్కరిస్తున్న ఈ కవియొక్క భక్తిపుష్పమాలను సంపూర్ణ వాత్సల్యంతో స్వీకరించుము – అంటారు తిలక్.





**కీ.శే. దేవరకొండ బాలగంగాధర తిలక్ (1921–1966)**

# అనుబంధం-4:

# తిలక్ - మరికొన్ని సంగతులు

**0. ప్రస్తావన:-**

తిలక్ 2021 ఆగస్టు 1వ తేదీ ఆదివారంనాడు కీ.శే. దేవరకొండ బాలగంగాధర తిలక్‌గారి శతజయంతి సమాపనోత్సవ సందర్భంగా నేను సుమారు లక్షరూపాయలు ఖర్చుచేసి "రసగంగాధర తిలకం" అనే పేరుతో, 40 పుటల రంగుల ఫోటోలతో సహా 328 పుటల గ్రంథాన్ని సర్వాంగ సుందరంగా ముద్రించాను. సుమారు 300 మంది ప్రసిద్ధ కవులకు, రచయితలకు, విమర్శకులకు, మిత్రులకు Registered Book Postలో పంపించాను. (పోస్టేజీకే నాకు రూ.9,000/-లు ఖర్చు అయింది.) అందరూ సంతోషించి తమ ఆనందాన్ని నాకు తెలియజేశారు. ప్రముఖ సాహిత్య రసికులు శ్రీ మల్లాది హనుమంతరావుగారు ఒక చక్కటి సమీక్ష వ్రాసి పంపించారు. కవి మిత్రులు శ్రీ మాకినీడి సూర్యభాస్కర్‌గారు ఆంగ్లంలో ఎంతో వివరంగా సమీక్ష వ్రాసి పంపించారు. ప్రియశిష్యుడు డా॥ తోట వెంకటస్వామి "తిలక్ వ్యక్తిత్వం-కవిత్వం" అనే పేరుతో ఒక మంచి సమీక్ష వ్రాసి "సాహిత్య ప్రస్థానం" మాసపత్రికలో ముద్రించాడు.

**1. అంతఆస్తి ఎలాపోయింది?:-**

అయితే, కొందరు సన్నిహిత మిత్రులు కొన్ని సందేహాలు వెలిబుచ్చారు. మరికొందరు కొన్ని సూచనలు చేశారు. డా॥ కడియాల రామమోహన్‌రాయ్‌గారు: "తిలక్‌గారు గొప్ప ఆస్తిపరులుకదా! ఆ ఆస్తి అంతా ఎలా పోయింది? ఆ రోజుల్లో (1950 ప్రాంతాల్లో) 50 ఎకరాల మాగాణి పొలం, 50 వేల రొక్కం ఎలా హరించుకు పోయాయి?" అని అడిగారు నన్ను. "బహుశః గుండెజబ్బుకు వైద్యం ఖర్చులు, పేకాట, బ్రాకెట్టు, స్టెయిన్‌లెస్ స్టీలు సామాన్ల వ్యాపారంలో నష్టం- వీటివల్ల పోయిందేమో!" అన్నాను. "50 ఎకరాల మాగాణి పొలం మీరు చెప్పిన కారణాలవల్ల పోవడానికి ఆస్కారం లేదు! ఇంకా ఏవో బలమైన కారణాలు ఉండి ఉండాలి!" అన్నారు రాయ్‌గారు. "నాకు తెలియదు!" అన్నాను.

ఆ తర్వాత నేను తిలక్‌గారి బావమరిది (ఇందిరాదేవిగారి తమ్ముడు) శ్రీ బులుసు వెంకట రమణరావుగారి అడ్రసు తెలుసుకొని వారికి "రసగంగాధర తిలకం" ఐదు కాపీలు పంపించాను. (వీరు చిన్నతనంనుండీ నాకు తెలుసు. మా తమ్ముడు

భాస్కరరావుకి హైస్కూల్లో సహాధ్యాయి.) ఆయన ఎంతో సంతోషించి, ఆ పుస్తకాన్ని చదివి, నాకు వాట్సప్‌లో (ఆంగ్లంలో) రెండు లేఖలు వ్రాశారు. వాటిలో తిలక్ ఆస్తి అంతా పోవడానికి కొన్ని బలమైన కారణాలు చెప్పారు. తిలక్‌గారి తండ్రి దేవరకొండ సత్యనారాయణమూర్తిగారికి మండపాకలోను, ఆ చుట్టుప్రక్కల గ్రామాలలోను, 300 ఎకరాల మాగాణి భూమి ఉండేది. ఆయన వడ్డీవ్యాపారం చేస్తూ ఉండేవారు. తండ్రి మరణానంతరం, తిలక్‌గారి అన్నగారు "పెద్దఅన్నప్పగారు", ఆస్తివ్యవహారాలు చూడటం, వడ్డీవ్యాపారం చేయడం ప్రారంభించారు. ఆయన mismanagement వల్ల తిలక్‌గారి ఆస్తిఅంతా పోయిందని శ్రీ బులుసు వెంకట రమణరావుగారి లేఖలవల్ల తెలుస్తోంది. (ఆ లేఖలు దిగువ యిస్తున్నాను...)

**Letter No.1**

Hyderabad
02-11-2021

Dear Prof.Subbarao garu,

I received 5 copies of the book on my brother-in-law Late Balagangadhara Tilak. As 1 guess he was suffering from hyperacidity causing chest pain and doctors of those days were not aware of gastritis problem. Whenever he was getting chest pain he used to become nervous. As you know he used to spend lazy life and used to spend time on cot and I never saw him relaxing in chair any time.

I never copied "Suchitra - Pranayam" drama as mentioned by you.

The doctors told him to play card games to get rid of nervousness so that he will have diversion of mind.

He got addicted to playing rummy with high stakes and lost his wealth. Unfortunately he never knew what his share of property was anytime which used to be managed by his elder brother. He never sold any of the inherited property to any outsider. He never mortgaged his properties to an outsider. He was declared to have lost everything by his own family members. It is unfortunate that he was let down by his own people which lead to hypertension and increased blood sugar which proved to be fatal at a very young age.

He may not have long life but he is ever living for those who are inspired by his writings. Thanking you.

**BV Ramana Rao**

## Letter No.2

Hyderabad

04-11-2021

Wish you and all the members of your family a very happy Diwali. We all of us owe you a lot for your valuable efforts in spreading the message of Late Balagangadhara Tilak to the present and future generations of Telugu people.

My brother-in-law Late Balagangadhara Tilak never had a bank account. He never visited Sub-Registrar's office anywhere in the country. It is still a mystery for me on how his properties have gone to others. Perhaps I believe that he never knew what belongs to him any time in his life. I never saw him any time going out and seeing his lands.

**B.V. Ramana Rao**

మరో ముఖ్యవిషయాన్ని కూడా శ్రీ రమణరావుగారు నాతో (ఫోన్‌లో) చెప్పారు: "తిలక్‌గారి కొడుకులిద్దరికీ గుంటూరు మెడికల్ కాలేజీలో సీట్లు వచ్చాయి. వారిని చదివించడానికి మా బావగారి దగ్గర ధనంలేదు. అందువల్ల ఆయన అన్నదమ్ములు ముందుకు వచ్చి మా మేనల్లుళ్ళు ఇద్దరికీ మెడిసిన్ చదువులు చెప్పించారు. అయితే ఊరికే చెప్పించలేదు; తిలక్ ఆస్తివాటాను తమపేర వ్రాయించుకొని చెప్పించారు. తిలక్‌గారి చేత, ఆయన కొడుకులిద్దరిచేత దస్తావేజుల్లో సంతకాలు పెట్టించుకున్నారు!"

**2. తిలక్‌గారి పెండ్లిముచ్చట:-**

తిలక్ శతజయంతి సందర్భంగా, కేంద్రసాహిత్య అకాడెమీవారు మా తణుకులో 24-10-2021 ఆదివారంనాడు పెద్ద సెమినార్ ఏర్పాటు చేశారు. (దీనిని ఏర్పాటు చేయడంలో విశేషమైన కృషిచేసినవారు తణుకులోని నా కవిమిత్రులు శ్రీకొప్పర్తి వెంకట రమణమూర్తిగారు.) దీంట్లో కేంద్రసాహిత్య అకాడెమీ ప్రధానకార్యదర్శి. శ్రీ కె. శ్రీనివాసరావుగారు, ప్రముఖ కవులు, విమర్శకులు, ఆచార్యులు పాల్గొన్నారు.

(శ్రీ వాడ్రేవు చినవీరభద్రుడుగారు, శ్రీ కె.శివారెడ్డిగారు, డా॥ నందిని సిద్ధారెడ్డిగారు, డా॥ వత్సవాయి వెంకటరాజుగారు, శ్రీ రసరాజుగారు, శ్రీ వాసిరెడ్డి నవీన్‌గారు, ఆచార్య సి. మృణాళినిగారు, డా॥ రెంటాల శ్రీ వెంకటేశ్వరరావుగారు, శ్రీ కొప్పర్తి వెంకట రమణమూర్తిగారు, ప్రొ॥ శిఖామణిగారు, శ్రీ కందిమళ్ళ సాంబశివరావుగారు పాల్గొని పరిశోధన పత్రాలు సమర్పించారు.) ఈ సెమినార్‌లో తిలక్ పద్యకవిత్వం మీద పత్రాన్ని సమర్పించిన మిత్రులు డా॥ రెంటాల శ్రీ వెంకటేశ్వరరావుగారు నాకు ఫోన్ చేసి "తిలక్‌గారి వివాహం ఏ సంవత్సరంలో జరిగిందో చెప్పగలరా?" అని ప్రశ్నించారు. దీనికి సంబంధించిన సమాచారం నా దగ్గరలేదు. అందువల్ల వెంటనే లండన్‌లో డాక్టరుగా ఉన్న తిలక్‌గారి పెద్దబ్బాయి డా॥ దేవరకొండ సత్యనారాయణ మూర్తికి ఫోన్‌చేసి వివరాలు కనుక్కున్నాను. (తిలక్‌గారి పెండ్లి 1941లో కాకినాడలో జరిగిందని రెంటాలవారికి తెలియజేశాను.) తిలక్‌గారి బావమరది శ్రీ బులుసు వెంకట రమణరావుగారు కూడా, వారి అక్క ఇందిరాదేవిగారితో తిలక్‌గారి వివాహం ఎలా జరిగిందో వివరంగా చెప్పారు. వారిచ్చిన తిలక్‌గారి కుటుంబ వివరాలు దిగువ ఇస్తున్నాను:-

1941లో తిలక్‌గారికి 20 సం.ల వయస్సు. వారి తండ్రి సత్యనారాయణమూర్తి గారు వడ్డీవ్యాపారం చేసేవారని చెప్పాను కదా! తూర్పుగోదావరిజిల్లా, రాజోలు పట్టణంలో ఎవరో ఒకాయన వీరి దగ్గర అప్పు తీసికొని ఎగ్గొట్టాడు. ఆ వ్యక్తి మీద రాజోలు కోర్టులో దావావేశారు సత్యంగారు. ఆ పనిమీద రాజోలు వెళ్ళారు. రాజోలులో కోర్టు ప్రక్కనే తాసిల్దారుగారి ఆఫీసు ఉంది. దానిముందు "శ్రీ బులుసు సర్వేశ్వర దీక్షితులు, తహశీల్దారు" అనే బోర్డు వ్రేలాడుతోంది. ఆ బోర్డు చూశారు సత్యంగారు. కోర్టులో తన పని అయ్యేసరికి మధ్యాహ్నం అయిపోయింది. "ఈ తాసిల్దారెవరో మన బ్రాహ్మణుడులా ఉన్నాడు; ఒకసారి పలకరిద్దాం!" అని మనసులో అనుకొని, ఆ ఆఫీసులోకి వెళ్ళారు. ఆ మాటా ఈ మాటా మాట్లాడుతూ ఉంటే, తాసిల్దారుగారు "ఇంత మధ్యాహ్నం ఎక్కడ భోజనం చేస్తారు? మా యింటికి రండి, నాతోపాటు భోజనం చేద్దురుగాని" అని ఆహ్వానించి తనతోపాటు ఇంటికి తీసికొని వెళ్ళారు. సత్యంగారు చక్కగా భోజనం చేసి, తాసిల్దారుగారి కుటుంబాన్నంతా బాగా పరిశీలించారు. దీక్షితులుగారి భార్య శ్రీమతి వెంకటరత్నమ్మగారు. ఆ దంపతులకు అప్పటికి ఇద్దరు కూతుళ్ళు, ఒక కొడుకు (చంటిపిల్లాడు). పెద్దమ్మాయి చి॥ ఇందిరాదేవి పెళ్ళికి ఎదిగింది. చూడముచ్చటగా ఉంది. వినయవిధేయతలతో ఉంది. ఆమెను చూసి సత్యంగారు: "మా రెండవ అబ్బాయి తిలక్ పెళ్ళీడుకు వచ్చాడు, 20 సం॥లు.

మీ అమ్మాయిని మా వాడికి చేసుకోవాలనుకుంటున్నాను!" అన్నారు. దీక్షితులుగారు, ఆయన భార్య వెంకట రత్నమ్మగారు బ్రహ్మానందభరితులై ఆ వివాహానికి అంగీకరించారు. అలాగ 1941లో కాకినాడలో తిలక్‌గారికి ఇందిరాదేవిగారితో అంగరంగవైభవంగా పెండ్లి జరిగింది. ఈ దంపతులకు 1944 జూలై 27వ తేదీన "చి॥ సత్యనారాయణమూర్తి" అనే పుత్రుడు జన్మించాడు. తరువాత 1946 అక్టోబరు 6వ తేదీని "చి॥ సుబ్రహ్మణ్యం" అనే రెండవ కొడుకు పుట్టాడు. 1948 మార్చి 10వ తేదీని "చి॥ చంద్రలేఖ" అనే కూతురు కలిగింది.

తిలక్‌గారి అత్తమామలకు మొత్తం ఐదుగురు సంతానం; నలుగురు కూతుళ్ళు, ఒక కొడుకు, వీరు జ్యేష్ఠానుక్రమంగా – 1. ఇందిరాదేవి, 2. సుబ్బలక్ష్మి, 3. వెంకట రమణరావు, 4. భవాని, 5. రాజేశ్వరి. నేటికి వీరిలో మొదటి యిద్దరూ స్వర్గస్థులయ్యారు. మిగిలిన ముగ్గురూ హైదరాబాదులో నివసిస్తున్నారు. తిలక్‌గారి బావమరిది శ్రీ బులుసు వెంకట రమణరావుగారు చిన్నతనంలో కథలు వ్రాస్తూ ఉండేవారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఎం.ఎస్సీ. వాతావరణశాస్త్రం చదివి, కొన్నేళ్ళు బెంగుళూరులోని అగ్రికల్చర్ విశ్వవిద్యాలయంలోను, తరువాత హైదరాబాదులోను ఉద్యోగాలు చేసి రిటైరయ్యారు.

తిలక్‌గారి ధర్మపత్ని శ్రీమతి ఇందిరాదేవిగారు 2000 సంవత్సరంలో అక్టోబరు 19వ తేదీనాడు హైదరాబాదులో స్వర్గస్థులయ్యారు.

**3. తిలక్ ధర్మపత్ని కీ.శే. ఇందిరాదేవిగారు:–**

ప్రియమిత్రులు, ప్రముఖ రచయిత శ్రీ అంపశయ్య నవీన్‌గారు నా "రసగంగాధర తిలకం" పుస్తకాన్ని ప్రశంసిస్తూ "తిలక్‌గారి భార్యనుగురించి ఏమీ వ్రాయలేదే! ఆయన ఏవూరు వచ్చినా ప్రక్కన భార్యలేకుండా వచ్చేవారు కారు. మా వరంగల్‌కూడా శ్రీమతి ఇందిరాదేవిగారితో కలిసే వచ్చారు; నేను చూశాను" అన్నారు. శ్రీ నవీన్‌గారికి సమాధానంగా ఈ క్రింది విషయాలు వ్రాస్తున్నాను...

తిలక్‌గారి ధర్మపత్ని శ్రీమతి ఇందిరాదేవిగారు సామాన్యగృహిణి. భర్తమాట జవదాటని సంప్రదాయకాలపు భార్య. చాలా అమాయకురాలుగా కనపడేవారు నాకు.

నేటి స్త్రీవాదులు మన సమాజంలో స్త్రీలకు ఎన్నో అన్యాయాలు జరిగిపోతున్నాయని కథలు కవితలు తెగ వ్రాస్తున్నారు. నేను రెండు మూడేండ్ల క్రిందట శ్రీమతి పి.సత్యవతిగారి కథలు చదివి, ఎంతో మెచ్చుకొని, మా పిల్లల చేత, మిత్రులచేత చదివించాను. మా పెద్దబ్బాయి చదివి, "నాన్నా, ఈమె నాణానికి ఒక వైపే మనకు

చూపెడుతున్నారు; రెండవ వైపు చెప్పడంలేదు. గంపగయ్యాళులైన భార్యలచేత నరకయాతనలు అనుభవిస్తూ, ఆత్మహత్యలు చేసుకున్న భర్తలుకూడా ఉన్నారు. మన దగ్గరి బంధువుల్లోనే ఎందరో పరమగయ్యాళి భార్యలను మనం చూస్తున్నాము కదా!" అన్నాడు. నేను వెంటనే సత్యవతిగారికి ఫోను చేసి మా అబ్బాయి అభిప్రాయం చెప్పాను. ఆమె "భార్యలచేత బాధలు పడే భర్తలకన్నా, భర్తలచేత బాధలుపడే భార్యలు ఎక్కువగా ఉన్నారు. అందువల్ల వారినిగురించి వ్రాస్తున్నాను" అన్నారు. నా ఉద్దేశంలో అది కూడా నేటి సమాజంలో నిజంకాదు. నేను మా కుటుంబాలలోను, మిత్రుల కుటుంబాలలోను ఎందరినో చూశాను. ఈ కాలంలో నూటికి 90 మంది భార్యలు తమ భర్తల్ని గుప్పిట్లో పెట్టుకొని కీలుబొమ్మల్లా ఆడిస్తున్నారు. ఈ మధ్య WhatsApp లో ఒక మిత్రుడు నటించి చూపించినట్లుగా, భర్త ఇంటికి యజమాని లేక తలకాయ (Head) కావచ్చును; కాని ఆ తలకాయను ఆడించే మెడ (neck) మాత్రం భార్యే!

ఈ కథ (ఉపాఖ్యానం) అంతా ఎందుకు చెపుతున్నానంటే – తిలక్‌గారి ధర్మపత్ని నేను పైన చెప్పిన తలను ఆడించే మెడవంటి భార్యామణి కాదు; నూటికి 90 మందిలో ఒకామె కాదు; మిగిలిన 10 మందిలో ఒకామె. భర్త అడుగులకు మడుగులొత్తే పాతకాలపు అర్ధాంగి! అందువల్లనే తిలక్‌గారి "ఆటలు" సాగాయి (ఆటలు = పేకాటలు, బ్రాకెట్టు ఆటలు). ఆమె కూడా తలను త్రిప్పే మెడవంటి భార్య అయితే తిలగ్‌గారు ఆర్థికంగా జాగ్రత్తలు తీసికొని బాగుపడి ఉండేవారు. ఈమె అమాయకత్వం పిల్లలు ముగ్గురికీ వచ్చింది. అందులో కూతురు చంద్రలేఖకు మరీ ఎక్కువగా వచ్చింది.

**4. స్త్రీవిద్యకు ప్రోత్సాహం:–**

ఆ రోజుల్లో (1955–61 మధ్య) మా తణుకులో బాలికలకు ప్రత్యేకంగా ఒక ఉన్నత పాఠశాలను స్థాపించారు. రోజూ ఉదయమూ సాయంకాలమూ తిలక్‌గారి ఇంటిముందునుండి ఎందరో బాలికలు పుస్తకాలు చేతపట్టుకొని, నవ్వుతూ కబుర్లు చెప్పుకుంటూ వెళ్ళేవారు. తిలక్‌గారు ఎంతో సంతోషంగా వాళ్ళను చూస్తూ, ఒకసారి నాతో ఇలా అన్నారు: 'ఆహా! నా దేశంలో ఎన్నాళ్ళకు స్త్రీలు స్వేచ్ఛగా చదువుకుంటున్నారు!"

**5. పచ్చి వ్యావహారిక భాష కవిత్వానికి పనికిరాదు!:–**

ఒకసారి నేను ఒక కవిత వ్రాసి తిలక్‌గారికి చూపించాను. దాంట్లో ఒక చోట "జళ్ళోపువ్వు" అని వ్రాశాను. దానిని చూచి తిలక్‌గారు "మనం ఎలా మాట్లాడితే

అలా వ్రాయకూడదు. కవిత్వ భాషకు ఒక గాంభీర్యం, ఉదాత్తత ఉండాలి. మనం మాట్లాడేటప్పుడు ఇష్టం వచ్చినట్టు మాట్లాడవచ్చు. కాని కవిత్వం వ్రాసేటప్పుడు "జడలో పూవు" అనే వ్రాయాలి. లేకపోతే చక్షురక్షరసంయోగంతో చదువుకొనే పాఠకులు తికమకపడే అవకాశం ఉంటుంది!" ఈ విషయం ఒకసారి నా మిత్రులు, ప్రముఖ భాషాశాస్త్రవేత్త అయిన ఆచార్య చేకూరి రామారావుగారు కూడా వెలిబుచ్చారు. "మనం ఎలా మాట్లాడితే అలా వ్రాయడం సరికాదు– సాధ్యమూ కాదు" అన్నారు. తిలక్‌గారు తన వచనకవిత్వంలో సుదీర్ఘతత్సమసమాసాలతో ప్రబంధశైలిని ప్రవేశపెట్టడానికి ఈ అభిప్రాయమే కారణమని నేను ఊహిస్తున్నాను.

**6. తిలక్‌గారి మిత్రుడు పెమ్మరాజు రాజగోపాలంగారు:–**

నా చిన్నతనంలో మా తణుకులో "పెమ్మరాజు రాజగోపాలం" అనే కవి ఉండేవారు. ఆయన సంస్కృతాంధ్రాలు, ఆంగ్లసాహిత్యం బాగా చదువుకున్నారు. హోమియోపతివైద్యం చేస్తూ ఉండేవారు. ఖద్దరు పంచె, ఖద్దరు లాల్చి, పైన ఖద్దరు నెహ్రూకోటు ధరించేవారు. ఆయన నిరుపేద. సాధాసీదాగా ఉండేవారు. (కొంచెం shabby గా కనపడేవారు.) ఈ రాజగోపాలంగారు తరచుగా తిలక్‌గారి దగ్గరకు వచ్చి, సాహిత్య విషయాలు చర్చిస్తూ ఉండేవారు. నేను అక్కడ ఉండేవాడిని. అప్పుడప్పుడు తిలక్ ఆయనకు తృణమో పణమో ఇచ్చేవారు. ("ఈయనకు డబ్బులు కావలసివస్తే నా దగ్గరకు వచ్చి, నన్నూ నా కవిత్వాన్నీ పొగుడుతూ ఉంటాడు!" అని నాతో జోక్‌గా నవ్వుతూ చెప్పేవారు.)

ఈ రాజగోపాలంగారు తరచుగా తిలక్‌గారి దగ్గరకు రావడం తిలక్‌గారి అన్నదమ్ములకు రుచించేది కాదు. ఒకసారి తిలక్‌గారి అన్నయ్య "పెద్ద అన్నప్పగారు" తమ్మునితో – "ఒరేయ్! తిలక్! ఇలా అడ్డమైన వాళ్ళనీ మన యింటికి రానివ్వకూడదు! మన స్థాయికి తగిన ధనవంతులను మాత్రమే రానివ్వాలి!" అని హెచ్చరించారు. తిలక్‌గారికి మనసులో చాలా బాధ అనిపించింది. వెంటనే: "అన్నయ్యా! నువ్వు చెప్పింది నిజమే! కాని నువ్వు చెప్పే ధనవంతులకు వాల్మీకి, కాళిదాసులు తెలియరు; నన్నయ్య తిక్కనలు తెలియరు; షేక్స్‌పియర్, మిల్టన్‌లు తెలియరు. విశ్వనాథ, కృష్ణశాస్త్రి, శ్రీశ్రీలు తెలియరు. వాళ్ళతో నాకు పనేమిటి? పేదవాడైనా, సాహిత్యం బాగా తెలిసిన పెమ్మరాజు రాజగోపాలంతోనే నాకు స్నేహం!" అని కుండబ్రద్దలు కొట్టినట్లు చెప్పేశారు.

(నేను మరచిపోయిన ఈ వియాన్ని నాకు జ్ఞాపకం చేసినవారు, మా "యిరగవరం" లోని సాహిత్య మిత్రులు శ్రీ మంగెన గంగాధరరావుగారు. వారికి నా కృతజ్ఞతలు.)

**7. "అమృతం కురిసిన రాత్రి"–ఆంగ్లానువాదాలు:–**

**7.1** The Song of the Cosmos (Selected Poems) – Prof. S.S. Prabhakar, Calcutta 1975. తిలక్‌గారి ప్రసిద్ధ కవితా సంపుటి "అమృతం కురిసిన రాత్రి"ని మొట్టమొదట ఆంగ్లంలోనికి అనువదించిన ఆంగ్లాచార్యులు ప్రొ॥ ఎస్.ఎస్. ప్రభాకర్‌గారు. వీరు హైదరాబాద్‌లోని English and Foreign Languages University లో ఇంగ్లీషు ప్రొఫెసర్‌గా పనిచేశారు. వీరు "అమృతం కురిసిన రాత్రి"లోని తనకు నచ్చిన కొన్ని కవితలను ఎన్నుకొని "The Song of the Cosmos" అనే పేరుతో అనువాదం చేశారు. దీనిని 1975లో కలకత్తాలోని "Writers Work Shop" వారు ముద్రించారు. వెల US $20.00

7.2 The Night, the Nectar Rained - Dr. Velchala Kondal Rao, Hyderabad, 2005. తెలుగులో ప్రసిద్ధ అనువాదకులు, కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి శిష్యులు, "విశ్వనాథ సాహిత్యపీఠం" స్థాపకులు, "జయంతి" పత్రిక సంపాదకులు డా॥ వెల్చాల కొండలరావుగారు "The Night, the Nectar Rained" అనే పేరుతో తిలక్‌గారి "అమృతం కురిసినరాత్రి" కవితా సంపుటి మొత్తాన్ని ఆంగ్లంలోకి అనువదించారు. దీనిని "విశ్వనాథ సాహిత్యపీఠం" వారు 2005లో ముద్రించారు. వెల.రూ. 250/–

7.3 The Night of Nector - Prof. B. Indira, Sahitya Akademi, 2012. ప్రొ॥ బి. ఇందిరగారు కూడా తిలక్ "అమృతం కురిసినరాత్రి" కవితా సంపుటిని ఆంగ్లంలోకి అనువదించారు. దీనిని సాహిత్య అకాడెమీవారు 2012లో ముద్రించారు.

7.4 The Night That Showered Ambrosia (Selected Poems) - Sri Akula Krishna, Kurnool, 2013, Price: Rs.100/-

శ్రీ ఆకుల కృష్ణగారు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ డిగ్రీకళాశాలలో ఆంగ్లోపన్యాసకులుగా పనిచేసి, రిటైరయ్యారు. కర్నూలులో నివసిస్తున్నారు.

7.5 ప్రముఖ దిగంబర కవి శ్రీ నిఖిలేశ్వర్‌గారు తిలక్ "అమృతం కురిసిన రాత్రి"లోని "కాస్మోపాలిటిన్" అనే కవితను "ఆశాకిరణం" అనే తిలక్ ప్రసిద్ధ కథను హిందీలోకి అనువదించి "ధర్మయుగ్" పత్రికలో ప్రకటించారు.

(నా పుస్తకం "రసగంగాధర తిలకం" చదివి, "తిలక్‌గారి అంత ఆస్తి ఎలా పోయింది?" అనే ప్రశ్నతోపాటు, "ప్రొ॥ S.S. ప్రభాకర్‌గారి ఆంగ్లానువాదం, ఇతర అనువాదాలగురించి కూడా మీరు చెప్పివుంటే బాగుండేది!" అని సూచించిన సాహిత్య మిత్రులు డా॥ కడియాల రామమోహనరాయ్‌గారికి నా కృతజ్ఞతలు...)

**ముఖ్యగమనిక**

నేను తిలక్‌గారినిగురించి "రసగంగాధర తిలకం" అనే పుస్తకం వ్రాస్తూండగానే 28-07-2021 నాడు మా అన్నయ్యగారు శ్రీ టి.వి.కె. సోమయాజులుగారు స్వర్గస్థులయ్యారు. అందువల్ల ఆ గ్రంథంలో అనుబంధం-VI గా మా అన్నయ్యగారి "ఏటినముత్యాలు-జ్ఞానరత్నాలు" ఇచ్చాను. ఇప్పుడు మా అన్నయ్యగారినిగురించి "అశ్రుతర్పణం" అనే గ్రంథం వ్రాస్తూ ఉంటే, తిలక్‌గారినిగురించిన మరికొన్ని క్రొత్తవిషయాలు తెలిశాయి. అందువల్ల వాటిని ఈ పుస్తకంలో రెండు అనుబంధాలుగా ఇస్తున్నాను. పాఠకులు గమనింపగలరు. **- తంగిరాల వెంకట సుబ్బారావు**

## ఒక చిన్న వివరణ

నేను కీ.శే. దేవరకొండ బాలగంగాధర తిలక్‌గారి శతజయంతి సందర్భంగా "రసగంగాధర తిలకం" అనే గ్రంథాన్ని ముద్రించాను. దీని ముద్రణకు ముందు తిలక్‌గారి పిల్లలను సంప్రదించి కొంత ఆర్థిక సహాయం కోరాను. వారు సకాలంలో స్పందించలేదు. అందువల్ల బంధుమిత్రుల సహాయంతో పుస్తకాన్ని ముద్రించాను. ఆ తరువాత తిలక్‌గారి సంతానంనుండి, మరికొందరు మిత్రులనుండి ఆర్థిక సహాయం అందింది. కృతజ్ఞతా పూర్వకంగా వారి పేర్లు దిగువ ఇస్తున్నాను:-

| | రూ. పై |
|---|---|
| 1. డా॥ దేవరకొండ సత్యనారాయణమూర్తి (లండన్)<br>డా॥ దేవరకొండ సుబ్రహ్మణ్యం (అమెరికా)<br>శ్రీమతి యనమండ్ర చంద్రలేఖ (అమెరికా) | 40,293-52 |
| 2. డా॥ నిర్మలా పళనివేలుగారు చెన్నై... | 10,000-00 |
| 3. డా॥సనపల ఢిల్లీశ్వరరావుగారు, సీతంపేట, శ్రీకాకుళంజిల్లా | 6,000-00 |
| 4. ఆచార్య పగడాల చంద్రశేఖర్‌గారు, హైదరాబాద్ | 3,000-00 |
| 5. శ్రీ ఎం.ఎస్.రామస్వామిరెడ్డిగారు, హొసూరు, తమిళనాడు | 2,000-00 |
| 6. ఆచార్య బిట్టు వెంకటేశ్వర్లుగారు, హైదరాబాద్ | 2,000-00 |
| 7. డా॥ కమలాకర రాజేశ్వరిగారు, చెన్నై. | 2,000-00 |

**- తంగిరాల వెంకట సుబ్బారావు**

## అనుబంధం-5:

## ఆదిభట్ల నారాయణదాసుగారు-శ్రీశ్రీ

ఇటీవల నేను "నా యెఱుక" అనే పుస్తకం చదివాను. ఇది "హరికథాపితామహ" బిరుదాంకితులైన అజ్జాడ ఆదిభట్ల నారాయణదాసుగారి (1864-1945) స్వీయచరిత్ర. దీనిని ఎంతో విమర్శనాత్మకంగా 'ఎడిట్' చేసినవారు మిత్రులు శ్రీ మోదుగుల రవికృష్ణగారు. దీనిని చదువుతున్నప్పుడు దాసుగారినిగురించి శ్రీశ్రీగారు చెప్పిన ఒక హాస్యసంఘటన జ్ఞాపకం వచ్చింది. దానిని దిగువ యిస్తున్నాను....

1979లో సోదరతుల్యుడు ఆచార్య ఆర్వీయస్. సుందరం శ్రీశ్రీగారిని కర్ణాటక రాష్ట్రానికి పిలిచి అనేక నగరాలలోను, పట్టణాలలోను ఆయన ఉపన్యాసాలు ఏర్పాటు చేశాడు. అప్పుడు నేను బెంగుళూరు విశ్వవిద్యాలయంలో సెంట్రల్‌కాలేజీలో ఉన్న సెనేట్‌హాలులో శ్రీశ్రీగారి ఉపన్యాసం ఏర్పాటు చేశాను. శ్రీశ్రీగారికి మహాకవిగా పెద్ద పేరుండడంవల్ల, వందమందికి పైగా జనం వచ్చారు. కాని శ్రీశ్రీగారు ఉపన్యాసం ప్రారంభించిన 10-15 నిమిషాల్లో సగంమంది చల్లగా జారుకున్నారు. శ్రీశ్రీగారు కవిత్వరచనలో ఎంతగొప్పవాడో, ఉపన్యాసం ఇవ్వడంలో అంత ఘోరమైనవాడు. మాటలకోసం తడుముకుంటూ నంగినంగిగా నత్తినత్తిగా మాట్లాడుతాడు. (పెద్ద బోర్ మాస్టర్! పైగా చిత్తుగా తాగి వస్తాడు సభకి!). కాని నలుగురం కూర్చున్నప్పుడు, ఎంతో సరదాగా, ఎన్నో సాహిత్య విషయాలు చక్కగా చర్చిస్తాడు.

నేను సెంట్రల్ కాలేజీకి దగ్గరలో "హొటల్ రాజ్"లో శ్రీశ్రీగారికి బస ఏర్పాటు చేశాను. ఆ హొటల్‌గదిలో నాతోను, సోదరుడు సుందరంతోను ఎన్నో ఆసక్తికరమైన సాహిత్య విషయాలు వివరించారు శ్రీశ్రీగారు. వాటిలో నారాయణదాసుగారిని గురించిన హాస్యసంఘటన ఒకటి. ఆ సమయంలోనే కృష్ణశాస్త్రిగారు రచించిన కొన్ని ఏకాంత శృంగార పద్యాలు కూడా శ్రీశ్రీగారు మాకు చదివి వినిపించారు. కృష్ణశాస్త్రిగారు విజయవాడ ఆకాశవాణి కేంద్రంలో పనిచేస్తున్నప్పుడు అక్కడ అధికారిగా ఉన్న ప్రముఖ రంగస్థల నటుడు బందా కనకలింగేశ్వరరావుగారు శాస్త్రిగారిని చులకన చేసి అవమానకరంగా మాటలాడారట. దానికి కృష్ణశాస్త్రిగారికి చాలా కోపం వచ్చి "హేమమేఢ్రప్రభూ!" ("కనకలింగేశ్వరా!") అనే మకుటంతో కొన్ని బూతుపద్యాలు వ్రాసి శ్రీశ్రీవంటి కవిమిత్రులకు చదివి వినిపించారట!

నారాయణదాసుగారి స్వీయచరిత్ర చదువుతూ ఉంటే మనకు ఓన్నో కొత్తవిషయాలు తెలుస్తాయి. వారికి సంగీత సాహిత్యాలు సహజంగానే అబ్బాయి. హరికథ చెప్పడంలోను, సంగీతం పాడటంలోను, సంస్కృతాంధ్రాలలో అష్టావధానం చేయడంలోను వారికి వారే సాటి! ఆ రోజుల్లో వారి కీర్తి ప్రతిష్ఠలు ఉత్తరాన బరంపురం, దక్షిణాన మద్రాసు, తూర్పున బందరు, పశ్చిమాన బళ్ళారి, బెంగుళూరు, మైసూరు – ఈ మధ్యగల అన్ని పట్టణాల్లోను నగరాల్లోను మారుమ్రోగిపోతున్నాయి. అయినా సరే, వీరు నివసిస్తున్న విజయనగరంలో మహారాజా ఆనందగజపతిరాజుగారికి (పాలనాకాలం: 1879–1897) వీరి పేరు తెలియలేదు. ఆ రాజావారి ఆస్థానంలోని కవులు, పండితులు, సంగీత విద్వాంసులు ఒక కోటరీగా ఏర్పడి, ఈర్ష్యాసూయలతో దాసుగారిపేరు రాజుగారి చెవిని పడకుండా చాలా జాగ్రత్తపడ్డారు. కాని దాసుగారికి మద్రాసులో ఎందరో ప్రముఖులు సన్మానాలు చేశారు. బెంగుళూరు–మైసూరులలో ఆనాటి మైసూరు ప్రభువు "శ్రీ చామరాజేంద్రఒడయరు–10"గారు (1863–1894) దాసుగారి ప్రతిభను ఎంతో శ్లాఘించి మిక్కిలి ఘనంగా సన్మానించారు. ఆ వార్తలు హిందూపత్రికలో ప్రముఖంగా ప్రచురించబడ్డాయి. దాసుగారిని గురించి కొన్ని ప్రత్యేక వ్యాసాలు కూడా హిందూలో వచ్చాయి. విజయనగరం ఆనందగజపతి మహారాజు 'హిందూ'లో ఆ వార్తలు, వ్యాసాలు చదివి, అంత గొప్ప కళాకారుడు తన ఊళ్ళోనే ఉన్నా గమనించకపోవడానికి మిక్కిలిగా చింతించి, నారాయణదాసుగారికి వర్తమానం పంపి, ఆయనను తన ఆస్థాన విద్వాంసునిగా చేర్చుకొని, నెలకి 15 రూ.లు జీతం ఇస్తూ ఎంతో గౌరవించారు.

ఆనందగజపతి మహారాజుగారు ప్రతిశుక్రవారమూ తన మహల్‌లో కవులకు, పండితులకు, సంగీతవిద్వాంసులకు, ఇతర పురప్రముఖులకు గొప్ప విందు ఏర్పాటు చేస్తూ ఉండేవారని దాసుగారే తమ స్వీయచరిత్రలో వ్రాశారు. అటువంటి ఒక విందులో జరిగిన హాస్యసంఘటనగురించి శ్రీశ్రీగారు నాతోను, ప్రొ॥ సుందరంతోను విపులంగా వర్ణించి చెప్పారు.

దాసుగారు తమ స్వీయ చరిత్ర ("నాయెఱుక")లో రెండు సంకేతపదాలు వాడారు: (1) "చిన్నగురుడు" – (2) "పెద్దగురుడు". "చిన్నగురుడు" అంటే "నల్లమందు" – లేక "గంజాయి"; "పెద్దగురుడు" అంటే "బ్రాందీ–విస్కీ". ఈ రెండూ దాసుగారికి చాలా ఇష్టమైన అలవాట్లు! ఇందులో "పెద్దగురుడు" ప్రభావాన్నిగురించే శ్రీశ్రీగారు మాకు వివరించినది.

ఒకసారి ఆనందగజపతిమహారాజుగారు లండన్‌నుండి ప్రత్యేకంగా ఒక "పెద్దగురుణ్ణి" (స్కాచ్ విస్కీని) ఆవకాయ జాడీ అంత పెద్దసీసాతో తెప్పించారు. కోటలో ఒక శుక్రవారం కవిపండితులకు, సంగీతవిద్వాంసులకు, పురప్రముఖులకు బ్రహ్మాండమైన పార్టీ ఏర్పాటు చేశారు. దాసుగారు సంతోషంగా విచ్చేశారు ఆ పార్టీకి. ఆరోజు పానగోష్ఠి అనంతరం భోజనాలు కూడా సిద్ధంచేశామని మిత్రులందరికీ ముందుగానే చెప్పారు రాజావారు. పార్టీ మొదలయింది. అందరూ కొద్దికొద్దిగా స్కాచ్ సేవిస్తున్నారు. కబుర్లు చెప్పుకుంటున్నారు. నవ్వుకుంటున్నారు. 40-50 మంది అతిథులు ఒక్కొక్కరు తమకు కావలసినంత "తీర్థం" పుచ్చుకున్నా ఇంకా కొంచెం మిగిలిపోయింది అట్టడుగున సీసాలో (అంత పెద్ద సీసా అది!). దాసుగారు మద్యపాన ప్రియులు. "ఈ కాస్తా ఉంచడం ఎందుకూ! నేను సేవిస్తాను!" అని ఆ మిగిలిన కాస్త పెద్దగురుణ్ణి కూడా తీసేసుకున్నారు! ఆనందలోకాల్లో విహరిస్తున్నారు...

తరవాత అందరూ భోజనాలకు కూర్చున్నారు. మహారాజావారు అతిథులందర్నీ స్వయంగా పర్యవేక్షిస్తున్నారు. నారాయణదాసుగారు కనిపించలేదు. "దాసుగారేరీ?" అని అడిగారు మహారాజావారు "ఆయన ఇల్లు తమకోటకు సమీపంలోనే ఉంది కదండీ! ఇంటికి వెళ్ళిపోయి ఉంటారు!" అన్నారు కొందరు కవిపండితులు. "ఓహో! అలాగా!" అన్నారు మహారాజావారు. షడ్రసోపేతమైన రాజావారి విందును అందరూ మిక్కిలి ఆప్యాయంగా ఆరగించారు. మరికొంతసేపు పిచ్చాపాటీ మాట్లాడుకొని ఎవరి ఇళ్ళకు వాళ్లు వెళ్ళిపోయారు.

మహారాజావారు ప్రతిదినమూ తెల్లవారుజామున ఐదుగంటలకు లేస్తారు. వారి పడకగదికి దగ్గరలోనే శౌచాలయం. దాని ప్రక్కన నాలుగు పలకల పెద్ద సిమెంటు తొట్టి. ప్రతి దినమూ సాయంకాలం ఆరుగంటలకల్లా ఆ సిమెంటు తొట్టెను నీళ్ళతో నింపివేయాలి. అది రాజావారి స్టాండింగ్ ఆర్డర్స్! విందు జరిగిననాడు సాయంకాలం కూడా సేవకులు. ఆ తొట్టెను యథాప్రకారం నీటితో నింపివేసి ఉంచారు. తెల్లవారు జామున లేచిన రాజావారు ఒక పెద్ద చెంబు తీసికొని, నీళ్ళకోసం తొట్టెలో ముంచబోయారు. ఇంతలో ఆ తొట్టెలోనుండి: "మహాప్రభో! వడ్డించమనండి! వచ్చేస్తున్నాను!!" అని నారాయణదాసుగారి మాటలు వినబడ్డాయి! రాజావారు ఆశ్చర్యంతో తొట్టిలోకి తొంగిచూశారు. దాసుగారు ఆ చల్లని నీటితొట్టెలో హాయిగా పడుకొని ఉన్నారు!

రాత్రి పెద్దగురుణ్ణి ఫుల్‌గా సేవించిన దాసుగారు, లఘుశంక తీర్చుకొనేందుకు వెడుతూ ఆ నీటితొట్టెలో పడిపోయారు. తెల్లవారుజామున ఐదుగంటలకు నిషాకొంత తగ్గి మహారాజుగారిని గుర్తించారు! పానగోష్ఠి అయిపోయిన తరువాత భోజనాలు ఉన్నాయని రాజావారు చెప్పిన సంగతికూడా జ్ఞప్తికి వచ్చింది! అందువల్ల! "మహాప్రభో! వడ్డించమనండి! వచ్చేస్తున్నాను!" అన్నారు.

రాజావారు పకపక నవ్వుకొని దాసుగారిని తొట్టెలోనుండి బయటకు తీయించి, పొడిబట్టలు కట్టించి, భద్రంగా వారి ఇంటికి పంపించారు – ఆనందగజపతి మహారాజావారు!

**గమనిక:** ఈ హాస్యసంఘటనకీ, మా అన్నయ్యగారినిగురించి వ్రాసిన "అశ్రుతర్పణం" అనే ఈ గ్రంథానికి సంబంధం ఏమిటి? – అని కొందరు ఔచిత్య విచారచర్చ చేయవచ్చు. ఈ సంఘటన "నాయెఱుక"లో లేదుకాబట్టి, ఇక్కడ రికార్డు చేసి ఉంచితే, ఒకచోట భద్రంగా ఉంటుందని చేర్చాను. ఇటువంటి ప్రాక్టికల్ జోక్స్ (నిజంగా జరిగిన సంఘటనలు) రికార్డు చేయకపోతే నశించిపోతాయి. ఎంతటి గొప్ప పండితుణ్ణయినా మద్యపానం ఎలా అభాసుపాలు చేస్తుందో తెలుపడానికైనా ఈ సంఘటనను లిఖితం చేయవలసిన అవసరం ఉంది – అని అనిపించింది నాకు. ఇది నేను సొంతంగా వ్రాస్తున్న, సొంత ఖర్చుతో ముద్రిస్తున్న పుస్తకం. దీనిలో తప్ప ఇంకెక్కడా చేర్చలేను. ఇది నిజంగా జరిగిన సంఘటన; కల్పన కాదు. చెప్పిన వ్యక్తి సామాన్యుడు కాదు; మహాకవి శ్రీశ్రీ. విన్నవాళ్ళు – ఇద్దరు యూనివర్సిటీ ప్రొఫెసర్లు (నేను–ప్రొ॥ ఆర్వీయస్. సుందరం.) దీనిని తప్పక రికార్డు చేయాలి. కాబట్టి చేశాను. పైగా, మా అన్నయ్యగారు ఈ గ్రంథంలో "జ్ఞానతరంగాలు–వేదాంతకథలు" అనే విభాగంలో "పూర్వజన్మసంస్కారం" అనే కథలో ఆదిభట్ల నారాయణదాసుగారి పూర్వజన్మ సంస్కారాన్ని తెలిపే సంఘటనను వివరించారు. "ఏఱిన ముత్యాలు" అనే విభాగంలో దాసుగారి "హెడ్డున మూను..." అనే హాస్యపద్యం ఉదాహరించాడు మా అన్నయ్య.





మా తల్లిదండ్రులు:

కీ.శే. తంగిరాల (భళ్ళమూడి) సీతామహాలక్ష్మిగారు (1907–1990)

కీ.శే. తంగిరాల వెంకట సుబ్బావధానులుగారు (1904–1968)



మా పెద్దక్కయ్య
కీ.శే. చల్లా (తంగిరాల) పెద వెంకట రామలక్ష్మిగారు
(1924–1998)



మా చిన్నక్కయ్య ("చెల్లక్క")
కీ.శే. బులుసు (తంగిరాల) చిన వెంకట రామలక్ష్మిగారు
(1926–1985)



తంగిరాల సోదరులు: కృష్ణమూర్తి–సుబ్బారావు–సోమయాజులు–భాస్కరరావు



**శ్రీగురుభ్యో నమః-1**

**బ్రహ్మశ్రీ జటావల్లభుల పురుషోత్తంగారు**



శ్రీగురుభ్యో నమః-2
బ్రహ్మశ్రీ కేశిరాజు వేంకట నృసింహ అప్పారావుగారు



**శ్రీగురుభ్యో నమః-3**
**బ్రహ్మశ్రీ వేదుల రామశాస్త్రిగారు**



శ్రీగురుభ్యో నమః-4

బ్రహ్మశ్రీ చిలుకూరి రామమూర్తిశాస్త్రిగారు



కృష్ణాజిల్లా బోర్డుహైస్కూళ్ళలో తెలుగు పండితుడుగా పనిచేస్తున్నప్పుడు
మా అన్నయ్య శ్రీ టి.వి.కె. సోమయాజులుగారు



కీ.శే.తంగిరాల సీతామహాలక్ష్మిగారు-కీ.శే.తంగిరాల శకుంతలాదేవిగారు(వెనుక-మా అమ్మ నివసించిన పెంకుటిల్లు)



కీ.శే. తంగిరాల (భళ్ళమూడి) శకుంతలాదేవిగారు (1969)



శ్రీ తంగిరాల భాస్కరరావుగారు –
ధర్మపత్ని శ్రీమతి బాలాత్రిపురసుందరిగారు

(10)

కౌరవ - పాండవ యుద్ధ కారణం

పాండవులు వనవాస అజ్ఞాతవాసములు పూర్తి చేసికొన్నారు. తమ రాజ్యము తమకిమ్మని శ్రీకృష్ణుని రాయబారిగా, కౌరవ సభకు, పంపించినారు. దుర్యోధనుడు, అధర్మముగా, నిర్లజ్జముగా, సూదిమొన మోపిన నేలకూడ, ఇవ్వననీ, సభాముఖంగా, చెప్పాడు. యుద్ధమునకు సిద్ధమైనాడు 11 అక్షౌహిణులు సైన్యం సమకూర్చుకొన్నాడు.

పాండవులు కృష్ణుని ఆశ్రయించినారు 7 అక్షౌహిణులు సైన్యం మాత్రం సమకూర్చుకొన్నారు. (21,890 ఏనుగులు; 21890 రథములు 65,610 గుర్రాలు; 109350 కాల్బలము) లో కూడిన సైన్య విభాగమునకు, ఒక "అక్షౌహిణి" అని పేరు.

ఇరుపక్షములు 18 అక్షౌహిణులు సైన్యం, "కురుక్షేత్రం"లో, యుద్ధ సన్నద్ధులై ఉన్నారు. యుద్ధవార్తలు ధృతరాష్ట్రునకు, అందించుటకై "సంజయుడు" నియమితుడైనాడు.

భగవానుడు, గీతాప్రబోధం ఎందుకు చేశాడు!

"అగ్నిదో గరదశ్చైవ। శస్త్రపాణిః ధనాపహః
క్షేత్ర దారాపహర్తా చ। షడేతే ఆతతాయినః

1) కొంపకు నిప్పుపెట్టినవాడు 2) విషము పెట్టినవాడు 3) ఆయుధము పట్టి, చెలరేగిన, దయారహితుడు 4) ధనాపహర్త 5) భుక్తికి ఆధారమైన పంట పొలమును, ఆక్రమించినవాడు, 6) భార్యను అపహరించినవాడు. కౌరవులు, పాండవుల పట్ల ఆతతాయులుగా, ప్రవర్తించినారు. చెయ్యని అపకారం లేదు. "క్షత్రియో [illegible]" శత్రుసంహారం క్షత్రియ ధర్మం! స్వధర్మ నిర్వహణం కోసం, ఆతతాయుల్ని హతమార్చటం కోసం, గాండీవధారి అయి, యుద్ధ సన్నద్ధుడై కృష్ణ సారథ్యంలో యుద్ధభూమిలో నిలబడ్డాడు. అర్జునుడు! ప్రతిపక్షాన్ని, మమకారంతో, చూశాడు. "అస్థాన కరుణ"కు లోనయ్యాడు. "స్వజనం" "స్వజనం" అంటూ [illegible] ఉన్నాడు. కన్నీళ్లు పెట్టుకొంటున్నాడు! నాకు విజయం అక్కరలేదు, రాజ్యం అక్కరలేదు". అంటూ, క్షత్రియ ధర్మవిరుద్ధమై

మా అన్నయ్య దస్తూరీ




తిరుమల గుడిలో శ్రీకృష్ణదేవరాయలు
(పంచలోహ విగ్రహాలు)

# I. మా అన్నయ్య కుటుంబం



మా తల్లిదండ్రులు

కీ.శే. తంగిరాల (భళ్ళమూడి) సీతామహాలక్ష్మిగారు (1907-1990)

కీ.శే. తంగిరాల వెంకట సుబ్బావధానులుగారు (1904-1968)



**మాతృదేవో భవ!**

**కీ.శే. తంగిరాల (భళ్ళమూడి) సీతామహాలక్ష్మిగారు (1907-1990)**



మా అన్నయ్య

కీ.శే. టి.వి.కె. సోమయాజులుగారు (1930-2021)

(తంగిరాల వెంకట కృష్ణ సోమయాజులుగారు)



మా అన్నయ్య - మా వదినె

శ్రీ టి.వి.కె. సోమయాజులుగారు - శ్రీమతి భాస్కరలక్ష్మిగారు



మా వదినె

శ్రీమతి తంగిరాల (కోట) భాస్కరలక్ష్మిగారు

(వయస్సు - 89 సం॥లు)



మా అన్నయ్య పెద్దమనుమడు చి॥ కౌస్తుభ్ పెండ్లిలో నేను - మా అన్నయ్య (గుల్బర్గా, కర్ణాటక)



తణుకు - బొమ్మలవీథిలోని చర్చివీథిలో
మా అన్నయ్య 40 ఏండ్లు నివసించిన మేడ



మా అన్నయ్య మూడవ కూతురు - అల్లుడు
శ్రీమతి జయదుర్గాభవాని - శ్రీ కె.వి.యస్. జోగిరాజు



మా అన్నయ్య దౌహిత్రి (1) చి॥ సౌ॥ భార్గవి కుటుంబం (కెనడా)
భర్త: శ్రీ నల్లగొండ ఆదిత్య
కొడుకు: చి॥ ఆర్ణవ్ - కూతురు: చి॥ ఇందిర



మా అన్నయ్య దౌహిత్రి (2) చి॥ సౌ॥ గాయత్రి కుటుంబం (కెనడా)
భర్త: శ్రీ మడిపల్లి శశాంక్, కొడుకు: చి॥ రోహణ్



ఎడమవైపు: తణుకులో మా అమ్మ నివసించిన పెంకుటిల్లు అవశేషాలు
కుడివైపు: మా అన్నయ్య నివసించిన మేడ

# II. సోమయాజులుగారి తమ్ముళ్ళు-వారి సంతానం



ప్రొ॥ తంగిరాల సుబ్బారావు - శ్రీమతి శకుంతలాదేవి (1995)



శ్రీ తంగిరాల భాస్కరరావు - శ్రీమతి శకుంతల




కర్నల్ తంగిరాల కృష్ణమూర్తి – శ్రీమతి శంకరి



చి|| "కాళిదాసు" కుటుంబం (న్యూజిలాండ్)



నూతన వధూవరులైన కొడుకు - కోడలుతో శ్రీమతి పద్మజ

(కొడుకు: చి|| అచ్యుత రామారావు - కోడలు: చి|| సౌ|| వెంకటలక్ష్మి

(09-03-2019)



చి॥ శ్రీనాథుని కుటుంబం

(కూతురు: చి॥ వైజయంతి –

భార్య: చి॥ సౌ॥ జయశ్రీ – కొడుకు: చి॥ స్కంద)



"భళ్ళమూడి చిట్టి"
కీ.శే. తంగిరాల శకుంతలాదేవి
(జననం: 30-04-1940 - మరణం: 31-08-2006)



కీ.శే. భాగవతుల (తంగిరాల) వెంకట సత్య పద్మజ

(మా తమ్ముడు చి॥ తంగిరాల భాస్కరరావు కూతురు)

జననం:25-09-1961 - మరణం: 29-05-2021



కీ.శే. భాగవతుల సుబ్బారాయుడుగారు

(మా తమ్ముడు చి॥ తంగిరాల భాస్కరరావు అల్లుడు)

జననం: 21-12-1951 - మరణం: 11-11-2013



కీ.శే. తంగిరాల వెంకట సత్యరామలింగేశ్వరరావుగారు
(జననం: 03-06-1963 - మరణం: 31-05-2021)



శ్రీమతి ఉమ-శ్రీ టి.వి.రామలింగేశ్వరావు - చి॥ భాస్కర సిద్ధిగణేశ్



శ్రీమతి తంగిరాల (ఎన్.ఆర్.) విమలకుమారి
(మా రెండవ కోడలు)



మా పౌత్రి(1) చి॥ సౌ॥ శిల్ప కుటుంబం
(అమెరికా)



మా పౌత్రి (2) శ్రీమతి భావన కుటుంబం (అమెరికా)



మా పెద్దమ్మాయి
శ్రీమతి తంగిరాల సీతామహాలక్ష్మి



డా॥ తంగిరాల రేవతీ శశిప్రియ (మా చిన్నమ్మాయి)



చి॥ తంగిరాల స్కంద (మా పౌత్రుడు)



శ్రీ శిష్ట్లా హరీష్ - శ్రీమతి అనిలశ్రీబాల
- చి॥ శ్రీచరిత (చి॥ భాస్కరరావు దౌహిత్రి కుటుంబం)



చి॥ తంగిరాల శివాంశ శౌరి
(మా మునిమనుమడు - న్యూజిలాండ్)



బ్రిగేడియర్ (డా॥) గిడుగు (తంగిరాల) హిమశ్రీ



కర్నల్ (డా॥) గిడుగు వెంకట రామదాసు
(గిడుగు రామమూర్తి పంతులుగారి మునిమనుమడు)



కర్నల్ తంగిరాల శ్రీనివాస మల్లిక్ కుటుంబం
(భార్య: శ్రీమతి రాధారమణి, పిల్లలు: చి॥ శ్రుతి, చి॥ శ్రేయ)




కర్నల్ తంగిరాల శ్రీనివాస మల్లిక్ (పైలెట్)

# III. తణుకులోని మా అన్నయ్య ప్రాణమిత్రులు



కీ.శే. చిట్టూరి బాపినీడు – కీ.శే. చిట్టూరి విజయలక్ష్మి దంపతులు



ముఖ్యమంత్రి డా॥ వై.యస్. రాజశేఖరరెడ్డిగారితో తణుకు ఎం.ఎల్.ఏ. శ్రీ చిట్టూరి బాపినీడుగారు



ముఖ్యమంత్రి శ్రీ కె. కిరణ్‌కుమార్ రెడ్డిగారితో,
తణుకు ఎం.ఎల్.ఏ. శ్రీ చిట్టూరి బాపినీడుగారు



డా॥ వత్సవాయి వెంకటరాజుగారు (శిశువైద్యులు)
(శ్రీ నన్నయ భట్టారక పీఠం పూర్వాధ్యక్షులు)



డా॥ తాతిని రామబ్రహ్మంగారు (సర్జన్)
(శ్రీ నన్నయ భట్టారక పీఠం పూర్వాధ్యక్షులు)



డా॥ జి.యస్.వి. ప్రసాద్‌గారు (E.N.T.)
శ్రీ నన్నయ భట్టారక పీఠం పూర్వాధ్యక్షులు (22 సం.లు)



శ్రీ మల్లిన రామచంద్రరావుగారు – శ్రీమతి భద్రమ్మగారు
(శ్రీ నన్నయ భట్టారక పీఠం పూర్వాధ్యక్షులు)–పారిశ్రామికవేత్త



శ్రీ చిలుకూరి కాశీవిశ్వేశ్వరరావుగారు
(పారిశ్రామికవేత్త)



శ్రీ జొన్నలగడ్డ సూర్యసుబ్రహ్మణ్యంగారు
(శ్రీ నన్నయ భట్టారక పీఠం అధ్యక్షులు)



శ్రీమతి జొన్నలగడ్డ మాధవీలతగారు



శ్రీ యామిజాల సుబ్రహ్మణ్యశర్మగారు ("సుశర్మ")

శ్రీ నన్నయ భట్టారక పీఠం ప్రధానకార్యదర్శి (30 సం॥ల నుండి)



శ్రీ తంగిరాల పాలగోపాలకృష్ణగారు

(శ్రీ నన్నయ భట్టారక పీఠం, సంయుక్త సహకార్యదర్శి)



శ్రీ గమిని వెంకట సుబ్బారావుగారు ("గమినిరాజా")
(పారిశ్రామికవేత్త)



ప్రముఖకవి శ్రీ "రసరాజు"గారు
(శ్రీ రంగినీని సత్యనారాయణరాజుగారు)



కీ.శే. నడింపల్లి వెంకట సూర్యనారాయణరాజుగారు
(మా అన్నయ్య భవద్గీతా శిష్యులు)



శ్రీమతి నడింపల్లి వెంకట సూర్యకుమారిగారు
(మా అన్నయ్య భగవద్గీతా శిష్యులు)




శ్రీ నన్నయ భట్టారక పీఠంలో నాకు సత్కారం (09-08-2014)
(కార్యదర్శి శ్రీ సుశర్మగారు-అధ్యక్షులు డా॥ జి.ఎస్.వి.ప్రసాద్‌గారు)



నన్నయ పీఠంలో డా॥ జి.యస్.వి. ప్రసాద్‌గారి ఉగాది పురస్కారం స్వీకరిస్తున్న నన్ను ఆనందంగా చూస్తున్న మా అన్నయ్య (కుడివైపు)- ప్రక్కన డా॥ వి.వెంకటరాజుగారు-(06-04-2011)